# శారదా తిలక తంత్రం

"సంపత్కరీ" తెలుగు వ్యాఖ్యాన సహితముగా

చతుష్షష్టి తంత్ర (64) అనువాదకులు

బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్

M.A.,సంస్కృతమ్

ప్రచురణ కర్తలు

గొల్లపూడి వీరాస్వామి సన్

పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్

కోటగుమ్మం - రాజమండ్రి- 533 101



2011 వెల : 395-00

# అంకితం

జననీ జనకులకు



సంగీత- సాహిత్య-మంత్రమూర్తులు

మేడవరపు పండిత సుబ్రహ్మణ్యశాస్త్రి- సూర్యసావిత్రి

# విషయ సూచిక


| | |
|---|---|
| "సంపత్కరీ" తెలుగు వ్యాఖ్యానమునందు ఉదహరించిన 173 గ్రంధములు | 12 |
| శారదా పీఠిక | 16 |
| న్యాస విశిష్టత | 18 |
| మాతృకా రహస్యం | 20 |
| మాలినీ న్యాసం | 21 |
| శారదా తిలక సంస్కరణ | 21 |
| శారదా తిలకమునకు 6 వ్యాఖ్యానములు | 22 |
| **అథ ప్రధమః పటలః** | |
| మంగళాచరణం | 23 |
| శక్తిస్తుతి | 26 |
| గ్రంధప్రయోజనం | 27 |
| గ్రంధప్రతిపాద్య విషయములు | 28 |
| శివుని నిర్గుణ - సగుణ భేదములు | 28 |
| శక్త్యావిర్భావము - నాదోత్పత్తి | 29 |
| శబ్దబ్రహ్మోత్పత్తి | 30 |
| పశ్యంతి | 31 |
| చరాచర స్వరూపము | 34 |
| దోషదోష్య నిరూపణము | 35 |
| సాంఖ్యతత్త్వం | 36 |
| దశవాయువులు | 38 |
| షడూర్ములు | 38 |
| కుండలిని నుండి వివిధ మంత్రోత్పత్తి | 40 |
| రెండన్నర శ్లోకములో 64 పీఠముల పేర్లు | 44 |
| శతరుద్రమనగా ఈ మంత్రములు | 46 |
| శివతంత్ర గాయత్రీ మంత్రము | 47 |
| **అథ ద్వితీయ పటలః** | |
| అథ వైఖరీ సృష్టి ప్రకరణం | 50 |
| అక్షరముల శివశక్తిమయత్వము | 52 |
| 38 కళలు | 53 |
| 50 ప్రణవ కళలు | 54 |
| 50 రుద్ర - శక్తి నామములు | 55 |
| 50 శక్తినామములు | 56 |
| 50 కేశవశక్తి నామములు | 56 |
| మంత్రముల లింగభేదము | 58 |
| 1. ఛిన్న దోషము | 60 |
| 2. రుద్ధం | 61 |
| 3. శక్తి హీనం | 61 |
| 4. పరాంగ్ముఖః | 61 |
| 5. బధిర | 62 |
| 6. నేత్ర హీనం | 62 |
| 7. కీలితం | 62 |
| 8. స్తంభితః | 63 |
| 9. దగ్ధం | 63 |
| 10. త్రస్తః, | 63 |
| 11. భీతః | 63 |
| 12. మలినవీ | 64 |
| 13. తిరస్కృత | 64 |
| 14. సుషుప్త | 64 |
| 15. మదోన్మత్త | 64 |
| 16. భేదితః | 64 |
| 17. మూర్ఛిత | 65 |

18. హృతవీర్య 65
19. హీన 20. ప్రధ్వస్తః 65
21. బాల 66
22. కుమార 66
23. యువ 66
24. ప్రౌఢ 66
25. వృద్ధ దోషములు 66
26. నిస్త్రింశ 66
27. నిర్బీజ 66
28. సిద్ధిహీన 67
29. మంద 67
30. కూట 67
31. నిరంశక 67
32. సత్వహీన 67
33. కేకరం 67
34. బీజహీనక 67
35. ధూమిత 67
36. ఆలింగిత 67
37. మోహిత 67
38. క్షుధార్త 67
39. అతిదృప్త 67
40. అంగభీర 68
41. అతిక్రుద్ధ 68
42. అతిక్రూర 69
43. సవ్రీడ 69
44. శాంతమానస 69
45. స్థానభ్రష్ట 69
46. వికల 70
47. నిఃస్నేహ 70
48. అతివృద్ధ 70
49. పీడిత దోషము వలన సిద్ధిహాని 71
మంత్రములకు 10 సంస్కారములు 72
నక్షత్ర చక్రం 75
రాశిఫలం 78
రాశులలో వర్ణములు 79
అకథహ చక్రము 79
దీపస్థానం 82
కూర్మచక్రం 82
పురశ్చరణకు శుభస్థానములు 83
గురువు లక్షణములు 84
శిష్యలక్షణములు 84
శిష్య పరీక్షాకాలము 85

అథ తృతీయః పటలః

దీక్షాంగ నిర్ణయం 86
మండప నిర్మాణవిధి 89
శూలం - తోరణం - వేది 91
మండల నిర్మాణం 95
అంకురార్పణ పాత్ర నియమం 93
బలిద్రవ్యములు 95
1. చతురస్రకుండ ప్రమాణం, నిర్మాణం 97
2. యోనికుండ నిర్మాణవిధి 98
3. అర్థచంద్రకుండం 99
4. త్ర్యస్ర కుండం 100
5. వృత్తకుండం 100
6. షడస్ర కుండం 101
7. పద్మకుండము 102
8. అష్టాస్ర కుండము 102
హోమకుండము లోతు, మేఖలా లక్షణములు 104
నేమి లక్షణము 105

| | |
|---|---|
| నాభి ప్రమాణము | 106 |
| ప్రయోగ భేదం | 108 |
| స్థండిల లక్షణము | 108 |
| వేదిక రచనావిధి | 110 |
| స్రువలక్షణం | 111 |
| సర్వతోభద్ర మండలం | 111 |
| నవనాభ మండలం | 117 |
| పంచాబ్జ మండలం | 118 |
| **అథ చతుర్థః పటలః** | |
| - అథ దీక్షా ప్రకరణం - | 119 |
| గురువు యాగమంటప ప్రవేశం | 120 |
| వర్థిని | 121 |
| ఆత్మయాగం | 122 |
| బహిర్యాగవిధి | 123 |
| ప్రాణప్రతిష్ఠ మంత్రము | 125 |
| ఉపచారములు | 126 |
| అస్త్రదేవతా ధ్యానం | 128 |
| **అథ పంచమః పటలః** | |
| అథ అగ్ని జననం | 130 |
| అగ్నియొక్క అష్టమూర్తులు | 134 |
| అగ్నికి ప్రియమంత్రము | 135 |
| స్రుక్ స్రువ సంస్కారము | 136 |
| ఆజ్య సంస్కారము | 136 |
| హోమవిధి | 137 |
| అగ్నియొక్కగర్భాధానాది సంస్కారములు | 140 |
| అగ్నిపితృపూజ | 141 |
| నాడీ సంధానం | 143 |
| షడధ్వశోధనం | 144 |
| 5. కలాధ్వలు | 145 |
| శివతత్త్వము | 146 |
| వైష్ణవ తత్త్వములు | 147 |
| సాంఖ్య తత్త్వములు | 147 |
| ప్రకృతి తత్త్వములు | 147 |
| త్రిపురా తత్త్వములు | 147 |
| ప్రయోగ విధి | 148 |
| శిష్యునియందు ఆత్మచైతన్య యోజనం | 149 |
| 1. క్రియావతీ దీక్ష | 152 |
| 2. వర్ణాత్మికా దీక్ష | 155 |
| 3. కళావతీ దీక్ష | 156 |
| 4. వేధమయీదీక్ష | 158 |
| హోమద్రవ్య పరిమాణము | 163 |
| హోమభేదమందు అగ్నిధ్యాన భేదం | 166 |
| **అథ షష్ఠః పటలః** | |
| అథమాతృకా ప్రకరణం | 169 |
| వాగ్దేవతా ధ్యానం | 170 |
| అక్షర ధ్యాన శ్లోకములు | 170 |
| అక్షరన్యాస స్థానములు | 174 |
| మాతృకా చక్రము | 175 |
| పీఠశక్తులు | 176 |
| బ్రాహ్మ్యాది ధ్యాన శ్లోకములు | 178 |
| సృష్టిన్యాసం | 179 |
| వర్ణేశ్వరీ ధ్యానం | 179 |
| సంహారన్యాసం | 179 |
| శారదా ధ్యానం | 181 |
| శ్రీకంఠ మాతృకాన్యాసం | 181 |
| అర్థనారీశ్వర ధ్యానం | 182 |
| కేశవమాతృకా న్యాసం | 182 |
| అర్థలక్ష్మీ ధ్యానం | 183 |
| విశ్వజననీ న్యాసము | 183 |
| మహాలక్ష్మీ న్యాసము | 184 |

సమస్త జననీ న్యాసం 184
సమ్మోహనీ న్యాసం 185
ప్రపంచయాగం 186
క్రమవిధానం 187
కామ్యకర్మ విధానము 189
అభిచారము తొలగు హోమము 191
మాతృకా పూజ 192
త్రిశక్తి ముద్రిక 195
నవరత్న ముద్రిక 196
మాతృకాధారణ యంత్రము 198

అథ సప్తమః పటలః

అథభూతలిపి ప్రకరణం 198
నవవర్గ దేవతలు 200
వాగేశ్వరీ ధ్యానము 201
ఆసనమంత్రం 203
64 శక్తుల నామములు 204
హోమాదివిధి 204
1. వియద్యంత్రం 205
2. వాయవ్యయంత్రము 206
3. ఆగ్నేయ యంత్రము 207
4. వారుణ యంత్రము 208
5. పార్థివ యంత్రము 208
వాగీశ్వరీ మంత్రం 209
ఆవరణ పూజ 210
మరొక వాగీశ్వరీ మంత్రము 212
హంసవాగీశ్వరీ మంత్రము 214
మరొక "హంసవాగీశ్వరీ" మంత్రము216
బాహ్మీఘృతం 217
వాగీశ్వరీ మంత్రాంతరము 218
సరస్వతీ ఉపాసక నియమములు 219

అథాష్టమః పటలః

అథమహాలక్ష్మీ ప్రకరణమ్ 222
పీఠమంత్రం 223
చతుర్బీజ మంత్రము 227
దశాక్షర మంత్రము 228
ద్వాదశాక్షర మంత్రము 230
మండప ధ్యానం 232
మహాలక్ష్మీ స్వరూప ధ్యానం 234
పురశ్చరణము 235
లక్ష్మీ యంత్రము 244
27 అక్షరముల లక్ష్మీ మంత్రము 245
మహాలక్ష్మీ ఉపాసక నియమములు248

అథ నవమః పటలః

అథ భువనేశ్వరీ ప్రకరణమ్ 250
యోని న్యాసము 252
భువనేశీ పూజాయంత్రం 253
త్రిగుణ యంత్రము 260
షడ్గుణిత యంత్రము 260
ద్వాదశ గుణిత యంత్రము 261
పుత్రప్రద యంత్రము 262
త్రిబీజ మంత్రము 263
మరొక మంత్రము 265
అంగావరణ దేవతలు 266
పాశాది త్ర్యక్షరములు 267
ఘటార్గళ యంత్రము 269
ఘటార్గళ యంత్రం 273

అథ దశమః పటలః

అథ త్వరితా ప్రకరణమ్ 274
కింకరీ పూజ 276
విజయప్రద యంత్రము 280
లక్ష్మీకీర్తిప్రదయంత్రము 280

| | |
|---|---|
| శ్రీపద త్వరితా యంత్రము | 281 |
| అనుగ్రహ యంత్రము | 282 |
| చతుష్షష్టి పదయంత్రము | 283 |
| త్రికంటకీ మంత్రము | 284 |
| వశ్యత్రికంటకీ మంత్రము | 285 |
| నిత్యామంత్రము | 286 |
| మరొక త్వరితా మంత్రము | 289 |
| వజ్రప్రస్తారిణీ మంత్రము | 290 |
| త్రైపుట మంత్రము | 293 |
| అశ్వారూఢా మంత్రము | 295 |
| అన్నపూర్ణా మంత్రము | 297 |
| పద్మావతీ మంత్రము | 298 |
| పద్మావతీ యంత్రము | 299 |
| **అథైకాదశః పటలః** | |
| అథ దుర్గా ప్రకరణమ్ | 300 |
| దుర్గాయంత్రము | 304 |
| మహిషమర్దినీ మంత్రం | 304 |
| జయదుర్గా మంత్రము | 306 |
| శూలినీ దుర్గా మంత్రము | 308 |
| భూతావేశము వదలించుట | 311 |
| వనదుర్గా మంత్రము | 312 |
| ప్రయోగ విధానము | 315 |
| పుత్తలీప్రయోగం | 318 |
| వనదుర్గా యంత్రము | 325 |
| **అథ ద్వాదశః పటలః** | |
| అథ భైరవీ ప్రకరణమ్ | 326 |
| నవయోనిన్యాసం | 329 |
| పురశ్చరణ | 333 |
| త్రిపుర భైరవీ గాయత్రి | 341 |
| త్రిపురభైరవీ యంత్రము | 341 |
| సౌభాగ్యద యంత్రము | 642 |
| మనోభవాత్మక యంత్రము | 343 |
| త్రిపుర భైరవీ స్తోత్రము | 344 |
| రాజమాతంగినీ | 347 |
| రాజమాతంగినీ స్తుతి | 361 |
| **అథ త్రయోదశః పటలః** | |
| అథ గణపతి ప్రకరణం | 363 |
| 2. మహాగణపతి మంత్రము | 368 |
| చతురావృత్తి తర్పణము | 374 |
| మహాగణపతి యంత్రము | 375 |
| 3. విరిగణపతి మంత్రము | 377 |
| 4. శక్తి గణపతి మంత్రము | 379 |
| 5. హస్తిముఖ గణపతి | 381 |
| 6. క్షిప్రప్రసాద గణపతి | 382 |
| 7. హేరంబ గణపతి | 384 |
| 55 అక్షరముల మాలామంత్రము | 387 |
| సుబ్రహ్మణ్య మంత్రము | 387 |
| గణేశ స్తుతి | 389 |
| **అథ చతుర్దశః పటలః** | |
| అథ సౌర ప్రకరణమ్ | 393 |
| సూర్యమంత్రము | 398 |
| మూర్తికల్పన మంత్రము | 401 |
| అర్ఘ్య విధి | 402 |
| ప్రయోజన తిలకమంత్రము | 404 |
| మార్తండ భైరవ బీజము | 406 |
| అజపామంత్రము | 408 |
| అగ్నిమంత్రము | 411 |
| తురగాగ్ని మంత్రము | 416 |
| **అథ పంచదశః పటలః** | |
| అథవిష్ణు ప్రకరణమ్ | 422 |
| విభూతి పంజరన్యాసం | 424 |
| మూర్తి పంజర న్యాసము | 424 |

| | |
|---|---|
| కిరీట మంత్రము | 427 |
| ద్వాదశాక్షర మంత్రము | 430 |
| లక్ష్మీవాసుదేవ మంత్రము | 432 |
| దధివామన మంత్రము | 434 |
| దధివామన యంత్రము | 437 |
| హయగ్రీవ మంత్రము | 438 |
| రామ మంత్రము | 441 |
| ధారణ యంత్రము | 445 |
| వరాహ మంత్రము | 446 |
| వరాహ యంత్రం | 450 |
| ధరణీమంత్రము | 453 |
| **అథ షోడశః పటలః** | |
| అథ నృసింహ ప్రకరణమ్ | 456 |
| పురశ్చరణ విధానము | 457 |
| నృసింహ యంత్రము | 461 |
| రిపు ధ్వంసన యంత్రము | 462 |
| జ్వాలానృసింహ మంత్రం | 463 |
| లక్ష్మీనృసింహ మంత్రము | 467 |
| హోమ ఫలము | 467 |
| నృసింహ యంత్రము | 468 |
| సుదర్శన మంత్రము | 469 |
| చక్రరచనా ప్రకారము | 475 |
| బలిదాన విధి | 476 |
| రాశుల దిశలు | 477 |
| బలి మంత్రము | 477 |
| పంచగవ్య ఘృతపాకవిధి | 480 |
| షోడశార యంత్రము | 482 |
| చక్ర మంత్రము | 484 |
| **అథ సప్తదశః పటలః** | |
| అథ పురుషోత్తమ ప్రకరణం | 485 |
| జగన్నాథ ధ్యానము | 489 |
| లక్ష్మ్యాది మంత్రములు | 490 |
| శ్రీకర మంత్రము | 493 |
| పురశ్చరణ విధానము | 494 |
| గోపాల మంత్రము | 496 |
| గోపాల యంత్రము | 499 |
| కామలింగ యంత్రము | 500 |
| సర్వతోభద్ర యంత్రం | 501 |
| ఏకాక్షర కామమంత్రము | 502 |
| జగన్మోహన యంత్రము | 505 |
| కామ గాయత్రి | 506 |
| వశ్యకర యంత్రము | 506 |
| దశావతార స్తోత్రము | 507 |
| 1. మత్స్యావతారము | 507 |
| 2. కూర్మావతారము | 507 |
| 3. వరాహావతారం | 507 |
| 4. నృసింహావతారం | 508 |
| 5. వామనావతారం | 508 |
| 6. పరశురామావతారం | 508 |
| 7. శ్రీరామావతారం | 508 |
| 8. బలభద్ర రామావతారం | 509 |
| 9. బుద్ధావతారం | 509 |
| 10. హయగ్రీవాతారం | 509 |
| **అథాష్టదశః పటలః** | |
| అథ శివ ప్రకరణమ్ | 510 |
| గోళకన్యాసము | 511 |
| వ్యాపకన్యాస మంత్రము | 512 |
| పీఠమంత్రము | 513 |
| ఆవరణ దేవతార్చన | 513 |
| అష్టాక్షర మంత్రము | 515 |
| వృషభ ధ్యానము | 517 |
| క్షేత్రపాల ధ్యానము | 517 |

చండేశధ్యానము 517
దుర్గాధ్యానము 517
షణ్ముఖ ధ్యానము 517
నందిధ్యానము 517
విఘ్ననాయక ధ్యానము 517
సేనాపతి ధ్యానము 518
శివుని ప్రాసాద మంత్రము 518
అష్టత్రింశత్ కళాన్యాసము 519
అష్టాక్షరప్రాసాద మంత్రము 523
మృత్యుంజయ మంత్రము 525
మహామృత్యుంజయ యంత్రము 526

అథైకోన వింశః పటలః

అథ దక్షిణామూర్తి ప్రకరణమ్ 527
దక్షిణా ధ్యానము 529
మరొక దక్షిణామూర్తి మంత్రము 530
నీలకంఠ మంత్రము 532
శివచింతామణి మంత్రము 534
పుత్తలీ ప్రయోగము 535
చింతామణి యంత్రం 537
మనోరథ ప్రద యంత్రము 537
ఆపద గ్రహఘ్న యంత్రము 538
శివ తుంబురు బీజము 539
స్వదేహమందు పీఠ కల్పన 541
తుంబురు యంత్రము 544
ఖడ్గరావణ మంత్రము 544
ఈశానాది పంచమూర్తి న్యాసం 546

అథ వింశః పటలః

అథ అఘోర ప్రకరణం 549
పురశ్చరణ 551
యంత్ర కథనం 553
మరొక అఘోర యంత్రము 554
పాశుపతాస్త్ర మంత్రము 555
క్షేత్రపాల మంత్రము 556
క్షేత్రపాల బలిమంత్రము 557
బటుక భైరవ మంత్రము 558
సాత్విక ధ్యానము 560
రాజసధ్యానము 560
తామసధ్యానం 560
బలి రెండు విధములు 568
మంత్రభస్మము 569
మంత్రాభిషేకము 570
గజాశ్వాది శాంతివిధి 573
రాజస బలిదానవిధి 574
బలి సంకల్ప మంత్రము 574
ఆపదుద్ధరణ యంత్రము 575
చండేశ్వర మంత్రము 576
శివస్తుతి 579

అథైకవింశః పటలః

అథ గాయత్రీ ప్రకరణమ్ 580
శిఖాగాయత్రీ మంత్రము 581
అక్షర న్యాసము 582
గాయత్రీ పదన్యాసము 583
గాయత్రీ షడంగన్యాసం 584
దశావరణార్చన 585
వివిధ ద్రవ్యహోమ ఫలితము 587
ఆగ్నేయ మంత్రవిద్య 588
వర్ణన్యాసము 589
పదన్యాసము 590
సాధన విషయము 594
పంచ దుర్గలు 601
పంచదుర్గా ప్రయోగములు 601
సికతా ప్రయోగము 605
పంచగవ్య పరిమాణవిధి 608
ఏకోన పంచాశత్ యంత్రము 609
ఆగ్నేయాస్త్ర యంత్రము 610

| | |
|---|---|
| **అథ ద్వావింశః పటలః** | |
| అథ దినాస్త్ర - కృత్యాస్త్ర ప్రకరణమ్ | 610 |
| దుర్గా ధ్యానము | 613 |
| పుత్తలీ ప్రయోగం | 615 |
| కృత్యాస్త్ర మంత్రప్రయోగము | 617 |
| లవణ మంత్రము | 618 |
| చిటిమంత్రము | 619 |
| పురశ్చరణాది కథనము | 620 |
| పంచపుత్తలీ ప్రయోగము | 623 |
| నక్షత్ర వృక్షములు | 628 |
| **అథత్రయోవింశః పటలః** | |
| అథత్ర్యంబక ప్రకరణమ్ | 630 |
| వివిధ సాధనలు | 633 |
| శతాక్షరమంత్రము | 635 |
| అథ వరుణ ప్రకరణం | 639 |
| ప్రాణప్రతిష్ఠామంత్రము | 643 |
| షడంగ న్యాసము | 643 |
| తత్రప్రకారః | 646 |
| మృతాది శక్తుల స్థానములు | 647 |
| ప్రాణప్రతిష్ఠా యంత్రము | 648 |
| ముద్రాప్రకరణం | 649 |
| అథమాలా ప్రకరణమ్ | 651 |
| అథ షట్కర్మ ప్రకరణం | 652 |
| ఆసనములు | 654 |
| షట్‌కర్మ విన్యాసములు | 658 |
| **అథ చతుర్వింశః పటలః** | |
| అథ యంత్ర ప్రకరణం | 660 |
| వశ్యయంత్రము | 661 |
| మృత్యుంజయ యంత్రము | 662 |
| గ్రహజ్వర యంత్రం | 662 |
| సర్పనాశన యంత్రము | 663 |
| ఉచ్చాటన యంత్రము | 663 |
| భూతఘ్న యంత్రము | 664 |
| విద్వేషణ యంత్రము | 665 |
| గారుడ యంత్రం | 666 |
| సంజీవన యంత్రము | 668 |
| పిండయంత్రము | 668 |
| వశ్యకర యంత్రము | 669 |
| స్తంభన యంత్రము | 670 |
| వాక్‌స్తంభన యంత్రము | 671 |
| శిశురోదన రక్షా యంత్రము | 672 |
| స్త్రీ వశ్య యంత్రము | 673 |
| మన్మధ యంత్రము | 673 |
| యంత్రలేఖన ద్రవ్యములు | 673 |
| దేవీస్తుతి | 374 |
| ఫలశృతి | 678 |
| **అథ పంచవింశః పటలః** | |
| అథయోగ ప్రకరణమ్ | 679 |
| యోగము 8 విధములు | 679 |
| 1. యమములు పది | 680 |
| 2. నియమములు - పది | 680 |
| 3. ఆసనములు - అయిదు | 381 |
| 4. ప్రాణాయామము | 381 |
| 5. ప్రత్యాహారము | 381 |
| 6. ధారణ | 681 |
| 7. ధ్యానం | 682 |
| 8. సమాధి | 682 |
| కుండలినీ ధ్యానం | 683 |
| కుండలినీ స్తుతి | 685 |
| గ్రంధకృత్ పరిచయం | 687 |
| గ్రంధ పరిచయం | 687 |
| కాశ్మీర్ సిరీస్ ఆఫ్ టెక్స్‌ట్స్ అండ్ స్టడీస్ | 689 |

# "సంపత్కరీ" తెలుగు వ్యాఖ్యానమునందు ఉదహరించిన 173 గ్రంథములు

1. అగస్తిసంహిత
2. అతీతాగమం
3. అత్రిః
4. ఆథర్వణికః
5. అపేక్షితార్థద్యోతనికి
6. అభినవగుప్తపాదాః
7. ఆచార్యాః
8. ఆనందభైరవః
9. ఆమ్నాయ రహస్యం
10. ఈశానశివ
11. ఈశానసంహిత
12. ఈశ్వరప్రత్యభిజ్ఞ
13. ఉత్తర షట్కం
14. ఉత్తరామ్నాయ మతం
15. ఉత్పలాచార్యాః
16. ఋగ్వేదః
17. కల్పసూత్రం
18. కల్పాంతరం
19. కాత్యాయనః
20. కాదిమతం
21. కామికాగమం
22. కాళిదాసః
23. కాలోత్తరాగమః
24. క్రియాకాండశేఖరః
25. క్రియాకాల గుణోత్తరతంత్రం
26. క్రియాసారం
27. కులప్రకాశ తంత్రం
28. కోశః
29. గణపతి సంహిత
30. గణేశ్వర విమర్శిని
31. గురుప్రోక్తవన దుర్గాకల్పం
32. గౌతమ కల్పం
33. గౌతమతంత్రవ్యాకరణ
34. గౌతమః
35. గౌరీతంత్రం
36. చండేశ్వరాచార్యః
37. చతుర్వర్గ చింతామణిః
38. ఛందోగపరిశిష్టం
39. ఛందోగ ఆర్షేయబ్రాహ్మణం
40. జయద్రథయామళం
41. జైమిని
42. జ్యోతిషరత్నమాల

43. జ్ఞానమాల
44. జ్ఞానరత్నావళి
45. డామరం
46. తత్వసాగర సంహిత
47. తంత్రప్రకాశ
48. తాపని
49. తైత్తరీయశాఖ
50. త్రికభేదం
51. త్రికాండమండనం
52. త్రికాండం
53. త్రిపురాసారం
54. త్రైలోక్యసారం
55. త్రోతలాతంత్రం
56. త్రోతలామతం
57. దక్షిణామూర్తి సంహిత
58. దశపటలం
59. దశాక్షరి
60. దివ్యసారస్వతం
61. దేవీమతం
62. దేవ్యాగమం
63. ద్యుమణిమాలాప్రబంధం
64. ధూమావతీకల్పం
65. నాగభట్టః
66. నారదకల్పం
67. నారదీయం
68. నారదపంచరాత్రం
69. నారదః
70. నారసింహకల్పం
71. నారాయణీయం
72. నారాయణీయోపనిషత్
73. నిఘంటుమాతృక
74. నీలతంత్రం
75. నృసింహతాపని
76. పద్మనాభీయం
77. పద్మపాదాచార్యః
78. పంచరాత్రం
79. పింగళామతం
80. పౌష్కరాగమం
81. ప్రతిష్ఠాపద్ధతి
82. ప్రతిష్ఠాసారసంగ్రహం
83. ప్రతిష్ఠాసారతంత్రం
84. ప్రపంచసారతంత్రం
85. ప్రయోగసారం
86. బహ్వృచ పరిశిష్టం
87. వాతూలోత్తర తంత్రం
88. బోధాయనః
89. బ్రహ్మయామళం
90. బ్రహ్మాండపురాణం
91. భట్టాచార్యః
92. భర్తృహరిః

| | |
|---|---|
| **93.** భామహః | **116.** యోగినీహృదయం |
| **94.** భాస్కరాచార్యః | **117.** రత్నావళి |
| **95.** భావార్థ చరణం | **118.** రాజమార్తాండం |
| **96.** భువనేశీ పారిజాతం | **119.** రామకంఠః |
| **97.** భైరవస్తోత్రం | **120.** రామపూర్వతాపిని |
| **98.** భైరవీస్తవము | **121.** లక్షణ సంగ్రహం |
| **99.** భృగుసంహిత | **122.** లఘుటీక |
| **100.** మంత్ర తంత్ర ప్రకాశ | **123.** లీలావతి |
| **101.** మంత్రదేవ ప్రకాశిక | **124.** రుద్రయామళం |
| **102.** మంత్రముక్తావళి | **125.** వశిష్ఠ సంహిత |
| **103.** మంత్ర రత్నావళి | **126.** వామన సూత్రం |
| **104.** మంత్రసార సంగ్రహం | **127.** వాయవీయసంహిత |
| **105.** మయమతం | **128.** వార్తికకారః |
| **106.** మహాకపిల పంచరాత్రం | **129.** వాశిష్ఠ సంహిత |
| **107.** మహాసంహిత | **130.** వాస్తు శాస్త్రం |
| **108.** మహాసమ్మోహనం | **131.** విజ్ఞాన చంద్రిక |
| **109.** మార్తాండభైరవః | **132.** విశ్వకర్మ |
| **110.** మాలినీ విజయం | **133.** విశ్వసారోద్ధారం |
| **111.** మూలనారాయణీయ రహస్యపటలః | **134.** విష్ణుపురాణం |
| | **135.** విష్ణుపురాణటీక |
| **112.** మోహశూరోత్తరం | **136.** వీరాగమం |
| **113.** యామళం | **137.** వైద్యక నిఘంటు |
| **114.** యోగశివ పద్ధతి | **138.** వైష్ణవ తంత్రం |
| **115.** యోగసారం | **139.** వైష్ణవ తిలకం |

140. వైశంపాయన సంహిత
141. వైహాయసీ మంత్రప్రకాశ
142. శాంకర కల్పం
143. శివసూత్రం
144. శివసూత్రవృత్తి
145. శివసంహిత
146. శివస్వామి
147. శుల్బం
148. శైవపంచాక్షరి
149. శౌనకకల్పం
150. శ్రీకంఠాచార్యః
151. శ్రీధరాచార్యః
152. శ్రీపంచమీ మతం
153. శ్రీమతంగ పారమేశ్వరం
154. షడన్వయ మహారత్నం
155. సనత్ కుమార సంహిత
156. సారసంగ్రహం
157. సారస్వత మతం
158. సిద్ధాంత శేఖరం
159. సిద్ధాంత సాగరం
160. సిద్ధాంత సారసంగ్రహం
161. సిద్ధేశ్వరీ తంత్రం
162. సూపశాస్త్రం
163. సోమశంభు పద్ధతి
164. సౌత్రామణి తంత్రం
165. సంవిత్ శాస్త్రం
166. సంహిత
167. స్కందయామళం
168. స్మృతిసారం
169. స్వచ్ఛందభైరవ తంత్రం
170. స్వాయంభువం
171. హిరణ్యగర్భ సంహిత
172. హయశీర్షపంచరాత్రం
173. హంసోహపిషత్

# శారదా పీఠిక

కాశ్మీరదేశీయుడైన "లక్ష్మణదేశి కేంద్ర" విరచితమైనది, ఈ 'శారదాతిలకం' అనే మంత్ర శాస్త్రగ్రంథము. ఇది దక్షిణభారత దేశములో ఎంతో ప్రాచుర్యం పొందింది. ఇతడు "ఉత్పలాచార్యు"ని శిష్యుడు. 25 పటలములలో రచించబడినది. దీనికి రాఘవభట్టు "పదార్థాదర్శ" అనే చక్కటి సంస్కృత వ్యాఖ్యానము రచించాడు.

శారదాతిలకమందు సాత్త్విక - రాజస - తామసములైన మంత్రప్రయోగములు తెలుపబడినవి. దేశకాల పరిస్థితులననుసరించి శారదాతిలక సంస్కృత వ్యాఖ్యకు, 'సంపత్కరీ' అను వివరణ పూర్వక వ్యాఖ్యానమును తెలుగులో రచించడం (అనువదించడం) జరిగింది. మంత్రశాస్త్రమునకు సంబంధించి, సమస్త విషయములు ఇందున్నవి.

సాధకుల హితముకోరి మరికొంత ఇతర గ్రంథములలోని సాధన విషయము చెప్పబడుచున్నది. మంత్ర శాస్త్రమునందు సాధనకు నాలుగు పీఠములు ముఖ్యమైనవి. ఇవి జపసాధనలో శీఘ్ర ఫలితమునిచ్చును.

1. **అరణ్యపీఠం** - మనుష్య సంచారములేని అటవీ ప్రాంతము. ఇచట, భగ్న ఆలయములందు, కొండ శిఖరమందు, నిర్భయముగా ఏకాంతముగా జపసాధన చేసినచో మంత్రము త్వరితముగా సిద్ధించును.

2. **శ్మశాన పీఠం** - రాత్రియందు శ్మశానములో మంత్రజపం చేయుడం. కొన్ని జైన గ్రంథములందు శ్రీకృష్ణుని సోదరుడైన గజసుకుమాలుడు శ్మశాన పీఠమందు శివమంత్ర సాధన చేసి ఆత్మజ్ఞాన సిద్ధిపొందినట్లు ఉల్లేఖించబడినది. నాలుగు పీఠములలో దీనినే "ప్రథమ పీఠం" అంటారు.

3. **శవ పీఠం** - మృతకళేబరంపై కూర్చుండి జపించే సాధన. శ్రీహర్షుడు, శవపీఠంపై (తల్లిశవంపై) కూర్చొని ఏకాక్షర శివ చింతామణి

జపించి మంత్రసిద్ధి పొంది మహాకవి అయినాడు. రాజులచే బంగారు మూటలు, ఏనుగుల సమూహం బహుమతులుగా సత్కారం పొందాడు.

శ్రీహర్షుడు బాల్యంలో విద్యాభ్యాస కాలంలో, మందుడుగా ఉండేవాడు. ఒకనాడు ఆ వూరికి ఒక సిద్ధుడు వచ్చాడు. తండ్రిలేని శ్రీహర్షుణ్ణి, గొప్పవాడిగా చేద్దామని అతని తల్లి ఆ సిద్ధునివద్దకు తీసుకు వెళ్ళి అతని మందబుద్ధిని వివరించి, అతనికి ఏదైనా తరణోపాయం సూచించమని ప్రార్థించింది.

అపుడు, ఆ సిద్ధుడు ఏకాక్షర శివ చింతామణీ మంత్రమును ఆమెకు ఉపదేశించి, దీనిని కుమారునిచే శవపీఠంపై సాధన చేయించమని ఆదేశించాడు. ఆ తల్లి తన కుమారుడు ఎంతో గొప్పవాడు కావాలని దృఢ నిశ్చయం కలదై ఆ రాత్రి అతనిని శ్మశానమునకు తీసుకు వెళ్ళింది.

శ్మశానములో తాను వెల్లకిలా పడుకుని, తనపై తన కుమారుణ్ణి కూర్చొనమని, కళ్ళుమూసుకొని తాను చెప్పబోవు మంత్రమును తెల్లవార్లు జపించమని, ఎట్టి పరిస్థితిలోనూ కళ్లు తెరవవద్దని – ప్రసిద్ధ వ్యక్తిగా జీవించమని దీవించి అతనికి మంత్రోపదేశం చేసింది.

తల్లి ఆజ్ఞ పాటించి శ్రీహర్షుడు ఆమెపై పద్మాసనంలో కూర్చొని కళ్లుమూసుకొని, ఏకాగ్రతగా జపం చేయడం ప్రారంభించాడు. అతడు ఏకాగ్రతలో ఉండటం గమనించిన తల్లి తాను శవంగా మారడానికి కొంగును కంఠానికి బిగించుకొని మరణించింది.

తన కుమారుని బంగారు భవిష్యత్తుకు ఆ తల్లి తానే శవపీఠమైంది. తెల్లవారేవరకు జపం చేసాడు శ్రీహర్షుడు. సూర్యోదయం అయింది. జ్ఞానసిద్ధి కలిగింది. కాని తల్లి శవమును గుర్తించి భోరున విలపించాడు. తల్లి చివరి కోరిక తీర్చాలని నిశ్చయించుకున్నాడు.

కాశీ వెళ్లి మహాపండితులను ఆశ్రయించాడు సకలశాస్త్రాలు అభ్యసించాడు. "నైషధం" అనే సంస్కృత మహాకావ్యం రచించి, మహాకవి కాళిదాసు సరసన స్థానం సంపాదించాడు.

సంస్కృత పంచమహాకావ్యాల్లో ఒకటిగా నైషధం ప్రఖ్యాతి పొందింది. రాజులకు – చక్రవర్తులకు పరమాప్తుడయ్యాడు. భోగము – యోగము రెండూ అనుభవించాడు. నైషధం విద్వదౌషధంగా ఖ్యాతి వహించింది. అదీ శవపీఠ జపసాధనలో ఒక యదార్థ గాథ.

శ్రీహర్షుని తల్లిపేరు "మామల్లదేవీ". భారతదేశ కవులచరిత్రలో, మాతృప్రేమకు పరాకాష్ఠగా నిలిచే ఈ సంఘటన – తల్లితనానికి ఔన్నత్యంగా నిలిచిందనడంలో ఏమీ సందేహం లేదు. మాతృత్యాగ విశిష్టత తెలియచెప్పే ఈ ఘటన స్మరణంచేతనే హృదయం శ్రీమాత్రే నమః అంటున్నది.

4. **శ్యామా పీఠం** – ఇది అతి కఠినమైన సాధన. సాధారణ మానవులు దీనిని సాధించలేరు. మనోనిగ్రహం చాలా అవసరం. ఏకాంతమందు 16 సం॥ల నవయౌవన, సౌందర్యవతిని, దిగంబరముగా పరుండబెట్టి ఆమెదగ్గర కూర్చొని, మనస్సును చంచలము పొందనీయక జపసాధన చేయాలి. సాధకుడు కఠోరబ్రహ్మచర్యం అవలంబించాలి.

పూర్వకాలములో వ్యాసమహర్షి కుమారుడు శుకుడు – స్థూలభద్రాచార్యుడు – 10వ శతాబ్దములో హేమచంద్రాచార్యుడు ఈ సాధనచేసి సిద్ధి పొందారు.

## న్యాస విశిష్టత

దేవనాగరిలిపిలో 16 అచ్చులు – 35 హల్లులు మొత్తం 51 అక్షరములున్నాయి. అకారాది – క్షకారాంతవర్ణములనే "మాతృక" అంటారు. న్యాసమనగా "ఉంచుట" అని అర్థం. అక్షరములను శరీరములోని

అవయవములందు ఉంచుటను, అనగా ఆ అక్షరము ఆ అంగమునందుంచి నట్లు భావించుటయే న్యాసమనబడును.

మంత్రశాస్త్రమునందు న్యాసమునకు చాలా ప్రాధాన్యత కలదు. కేవలం న్యాసమాత్రముననే సిద్ధి కలుగుననుట కూడా యధార్థ విషయమే. ఇందులకు ప్రమాణము కూడా శాస్త్రపరముగా యున్నది. మాతృకాన్యాసములో అకారాది – క్షకారంత వర్ణములను, క్రమముగా న్యాసం చేయడం జరుగుతుంది. దీనినిగూర్చి "బ్రహ్మయామళం"లోనూ "నరపతి జయచర్యాస్వరోదయం" అనే గ్రంథంలో మాత్రాస్వరాధ్యాయం లోనూ విపులముగా యున్నది.

ఈ అక్షరములు – మనం మాట్లాడే భాష ఇదంతా వైఖరీవాక్కు అనబడుతుంది. అక్షరములు విఖరముగా బయటకు వెదజల్లునట్లు వచ్చును గాన వైఖరి అయినది.

మన శరీరము మల దోషయుక్తమైనది. ఇది అశుచికి నిలయము. దీనిని పవిత్రముగా చేయుట కొరకే న్యాసవిధానము ఋషులచే కల్పించ బడినది. పతంజలియొక్క యోగసూత్ర భాష్యమునందు – అయిదు కారణములవల్ల ఈ శరీరము అపవిత్రమైనదని ఇట్లు నిరూపించబడినది.

శ్లో॥ జిహ్వాదగ్ధా పరాన్నేన కరౌదగ్ధౌ ప్రతిగ్రహాత్ ।
మనోదగ్ధం పరస్త్రీభిః కథం సిద్ధిః వరాననే ॥

ఇటువంటి అపవిత్రమైన శరీరమును, పరిపూర్ణ పవిత్రముగా చేయునదే "న్యాసప్రక్రియ". కనుక అంగన్యాస – కరన్యాసములే గాక, మాతృకాన్యాసం కూడా సాధకులు ఆచరించాలి.

షోఢాన్యాసం నిత్యం ఆచరించు మంత్రవేత్త కేవలం తన ఏకహస్త తాడనచే ఏనుగును సంహరించగలడని శాస్త్రప్రమాణమున్నది. పాదతాడనచే మహావృక్షమును పడగొట్టగలడు. కనుక న్యాసము చాలా మహత్తు గలది.

పంచోపచార పూజలో అయిదు ద్రవ్యములూ ఒక్కొక్కసారి లభించక పోవచ్చు. అపుడు "లం - పృధివీతత్త్వాత్మనే గంధం సమర్పయామి" అని లం అను వర్ణముచేత పృథివీతత్త్వమును నిరూపించుచున్నాము.

కనుక అక్షరములందు అపారమైన శక్తి కలదు. అదిపరిపూర్ణముగా కలదే "మాతృక". శక్తిజనని అక్షరములు, అందుచేతనే మాతృక అను పేరు సార్ధకము. **మంత్రజపమువలన కుండలినీ శక్తి ప్రబోధమగును.**

వైఖరీవాక్కు, మధ్యమయందు నాదాభాసరూపముగా పరిణమించును. అటుపిమ్మట పశ్యంతియందు విశుద్ధ నాదమయ జ్యోతిస్వరూపముగా పరివర్తన చెందును. ఆపై పశ్యంతీవాక్కు - పరావాక్కును పొంది శబ్దబ్రహ్మ యగును. అదే పరమసిద్ధి. పూర్ణాహంత ప్రాప్తి.

## మాతృకా రహస్యం

అకారాది - హకారంత (క్షకారాంత) వర్ణమాల మాతృక అని అందరికీ తెలిసినదే. ఇది అచ్చుల - తదనంతరం హల్లుల కలయిక. దీనికి మరొక రూపమున్నది. ఇది రహస్యసాధనా విధానము. ఇది 'మాలినీ న్యాసం' అంటారు.

ఇందు అచ్చులు - హల్లులు క్రమముగా నుండక, 'న'కారముతో ప్రారంభించి "ఫ" కారముతో అంతమగును. దీనిని క్షుబ్ధవర్ణమాల అంటారు. మొదటి క్రమరీతి వర్ణమాల మాతృకను అక్షుబ్ధవర్ణమాల అంటారు. ఇందు శివతత్త్వసమావేశము ఆలస్యముగా జరుగును.

మాలినీన్యాసమునందు శీఘ్రసిద్ధి, త్వరితముగా శివతత్త్వసమావేశము జరుగును. "యోగినీ హృదయం" అనే గ్రంధమునందు మాతృకాసృష్టి న్యాసాది భేదములు కలవు. ఆద్యాశక్తి విశ్వమయరూపము ధరించవలెనని భావించినపుడు ఒక స్పందనం ఏర్పడును. దాని ప్రథమ పరిణామమే

శ్రీచక్ర ఆవిర్భావం. ఇందు పంచమహాభూతములు. పంచాశత్ వర్ణములు – జగత్సృష్టి జరిగినవి.

## మాలినీ న్యాసం

అతిరహస్యమైన మాలినీన్యాసముయొక్క రూపము వివరించబడు చున్నది. ఇది న కారాది –ఫకారాంతముగా నుండును. మాతృకా న్యాస స్థానములో ఈ నకారాది అక్షరములుపయోగించవలయును.

**మాలినీ** – న – ఋ – ౠ – ఌ – ౡ – థ – చ – ధ – ఈ – ణ – ఉ – బ – క – ఖ – గ – జ – ఐ – అ – చ – భ – య – డ – ఢ – ఠ – ఝ – ఞ – జ – ర – ట – ప – ఛ – ల – ఆ – సరిః – హ – ష – క్ష – మ – శం – త – ఏ – ఐ – ఓ – ఔ – ద – ఫ”

దీనిని “భిన్నయోనిమాలినీ” అని కూడా తంత్రవేత్తలు వ్యవహరిస్తారు.

## శారదా తిలక సంస్కరణ

ఈ శారదాతిలక తంత్రగ్రంథము మొదటిసారిగా బెంగాలీ లిపిలో 1880లో, రసికమోహన చటోపాధ్యాయ, కలకత్తానుండి కేవలం మూలం ప్రచురించారు. కొద్దినెలలకే పండితజీవానంద విద్యాసాగరులు దేవనాగరి లిపిలో మూలం మాత్రం ప్రచురించారు.

కాశీనుండి 1886లో రాఘవభట్టుయొక్క పదార్థాదర్శవ్యాఖ్యతో శారదాతిలకం సంస్కృతంలో ప్రచురించారు. 1941లో ఇదే గ్రంథము మహాదేవభట్టుయొక్క గూఢార్థదీపికతో కాశీలో ప్రచురించబడింది.

గూఢార్థదీపిక, పదార్థాదర్శ వ్యాఖ్యానముకంటే ప్రాచీనమైనది. పదార్థాదర్శ వ్యాఖ్యతో ప్రసిద్ధ తంత్ర పండితుడు “ఆర్థర్ ఎవలాన్” ఆగమానుసంధాన సమితి ద్వారా 1933లో శారదాతిలకం ప్రచురించారు.

ఇది "తాంత్రిక టెక్సట్ సిరీస్"లో 17వ వాల్యూమ్‌గా ముద్రితమైనది. ఆ తరువాత సుమారు 50 సంవత్సరములకు 1982లో, ఢిల్లీ నుండి సంస్కృత పదార్థా దర్శ వ్యాఖ్యానములో ప్రచురితమైంది. శారదా తిలకమునకు అనేక సంస్కృత టీకలు - వ్యాఖ్యానములూ ఉన్నవి. అన్నీ ప్రచురితము కాలేదు.

## శారదా తిలకమునకు 6 వ్యాఖ్యానములు

1. త్రివిక్రమభట్టారకుడు (రామభారతీ శిష్యుడు) రచించిన "సుగూఢార్ధ దీపిక"
2. ప్రేమనిధి పంత్ రచించిన "శబ్దార్థ చింతామణీ" వ్యాఖ్య
3. శ్రీహర్షదీక్షిత విరచిత - "హర్షకౌముది"
4. కామరూప (అస్సాం) పండితుడు జగద్గురు భట్టాచార్య సిద్ధాంత వాగీశ విరచిత - "గూఢార్ధ ప్రకాశిక"
5. మాధవ విరచిత - శారదాతిలక టీక
6. రాఘవభట్ట విరచిత - "పదార్థా దర్శ" వ్యాఖ్య, ఈ వ్యాఖ్యానము క్రీ॥శ 1484లో రచించబడినది.

రాఘవభట్టు తన వ్యాఖ్యానములో అచ్చటచ్చటా "అర్ధద్యోతనికా" అనే సంస్కృత వ్యాఖ్యను పేర్కొన్నాడు. ఇది కూడా ప్రచురితము కాలేదు.

తెలుగు సాధకుల సౌకర్యార్థము, దేశకాల పరిస్థితుల ననుసరించి "సంపత్కరీ" అనే తెలుగు వివరణ వ్యాఖ్యానము సులభశైలిలో వ్రాయబడినది. ఇది ప్రయోజనకరము కాగలదని భావిస్తున్నాను

12-2-2010
మహాశివరాత్రి
అహమ్మదాబాద్

మేడవరపు సంపత్ కుమార్

ఓం

శ్రీ లక్ష్మణ దేశికేంద్ర విరచితం

# శారదా తిలకమ్

## "సంపత్కరీ" తెలుగు వ్యాఖ్యానం

## అథ ప్రథమః పటలః

### మంగళాచరణం

మహః స్తుతిః

శ్లో॥ నిత్యానందవపు ర్నిరంతరగలత్ పంచాశదర్ణైః క్రమాత్
వ్యాప్తంయేన చరాచరాత్మకమిదం శబ్దార్థరూపం జగత్ ।
శబ్దబ్రహ్మయదూచిరే సుకృతిన శ్చైౖ తన్యమంతర్గతం
తద్వ్యోద్యాదనిశం శశాంకసదనం వాచామధీశంమహః ॥

శ్లో॥ **మాతామహామహాశైలం మహస్తదపితామహం**
**కారణంజగతాంవందే వారణం ముఖవారణం ॥**

**శ్లో॥ శారదా తిలకే తంత్రే గురూణాముపదేశతః ।**

**ఆంధ్రభాషామయీవ్యాఖ్యా నామ్నా "సంపత్కరీ" కృతా ॥**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నిత్యానందరూపమై, 50 అక్షరములతో శబ్దార్థరూపమైన ఈ సమస్త ప్రపంచమూ వ్యాప్తమైయున్నది. పండితులు దీనినే శబ్దబ్రహ్మ అంటారు. ఇదే సుషుమ్నలో చైతన్యరూపము నుండి, సహస్రారమందుండు చంద్రమండలము వరకు గమనము చేయుచూ సమస్త వర్ణముల పుట్టుకకు, సమస్త మంత్రముల ప్రాదుర్భావమునకు కారణమైనది. ఇట్టి తేజోరూప వాగ్దేవతకు నమస్కరించుచున్నాను.

ఈ శ్లోకమునందు గ్రంథకర్త భైరవీమంత్రం నిక్షిప్తం చేసాదని కొందరు భావిస్తున్నట్లు, "పదార్థాదర్శ" వ్యాఖ్యానంలో రాఘవభట్టు ఇలా పేర్కొన్నాడు.

త్రైపురం అయిన తేజస్సు మనలను రక్షించుగాక ! "క్రమాత్" - కశ్చమశ్చ కరమాః తాన్ అత్తి లక్షణయా గృహ్ణాతీతి క్రమాత్" అని సమాసం. కకారం క్రింద కకారం, రేఫచేత లకారం గ్రహించవచ్చునని వ్యాకరణ పరిభాష. ఇందుకు ప్రమాణంగా "రేణలోఽపేష్యతే గ్రహణంతేన" కలదు సంహితయందు కూడా"

"అతఏవమహేశాని ర-లయోః సమతాభవేత్ '

క కింద ల, దీనికింద మకారం దానిచేత హః, "**అంతర్గతం**, అంతే, అంతే రోరేఫః గతః సంగతోయత్రతత్, పునః కీదృక్, **వ్యాప్తం**, విః = చతుః సంఖ్యా చతుర్థస్వరః తేనాప్తం గృహీతమ్ ।

ఇక్కడ సంఖ్యానిర్దేశం వరరుచి పరిభాషననుసరించి తెలుసుకోవాలి "య - ర - ల - వ" - ఇందు వకారము నాల్గవ సంఖ్యను తెలియజేయును. న కారము శూన్యమును సున్నను తెలియజేస్తుంది. అనగా బిందువు, అనుస్వారము.

ఈ విధంగా త్రిపురాషట్ కూటంలో మధ్య బీజముయొక్క ఉద్ధారణ జరిగినది. ఇక ప్రథమబీజ హకార, సకారములు ఇట్లు చెప్పబడినవి. (మధ్యషట్ హస్ కలరీమ్)

నిత్యానందవపుః నిత్యః పురుషః తేన హ కారః, ఆనంద మయీత్వాత్ = ఆనందోత్పాదన చేయును కనుక ఆనందము = శక్తి, ఇది సకారము (ప్రథమకూటం హసైం).

శశాంక్ సదనం = సకారము ఏతేన బిందుస్థం, శబ్దార్థరూపం, శబ్దశబ్దముచే శబ్దాదులు గ్రహింపబడును, అర్థశబ్దము విషయ వాచకము; తేన శబ్దాదయో విషయాస్తే చ దశేతి దశసంఖ్యా తథా ఔకారః తద్రూపం యత్ర తత్తథా = "శబ్దార్థ" పదమునకు పదిసంఖ్య, దీనిచే అకారాది పదవ అక్షరము "ఔ"కారము వచ్చును. (ఋ - ౠ - ఌ - ౡ నాలుగు అక్షరములు నపుంసకములు గాక పరిగణించబడవు.) హస్రౌః

చైతన్యలోని - న్యకారమునందు తకారము 6వ సంఖ్యను సూచించును (క - ట - ప - యాది సూత్రముచేత) న్యలోని యకారము 1వ సంఖ్యను సూచించగా, వరరుచి పరిభాషరీత్యా "అంకానాం వామతోగతిః" అందుచేత 16 అనగా షోడశిగా తెలియవలయును. తేన విసర్గః (తృతీయకూటం హస్రౌః) వాచామధీశం అని చెప్పుటచే మైధున సృష్ట జగతః కామోత్పన్నత్వాత్ మధ్యమ బీజస్య కామరాజతోక్తా (క్లీం)

"సుకృతినః యదంత్యబీజం శబ్దబ్రహ్మేత్యూచిరే" అని చెప్పుటవలన, చివరిదైన శాక్తబీజము (సౌః) చెప్పబడినది "త్రిధామ జననీదేవీ శబ్దబ్రహ్మస్వరూపిణీ" "**సిద్ధేశ్వరీ మత**"మందు.-

శ్లో॥ వాగ్భవం ప్రథమంబీజం కామరాజం ద్వితీయకం
శక్తిబీజం తృతీయంతు చతుర్వర్గ ఫలప్రదమ్ ॥

ఈ విధముగా మంగళాచారణ శ్లోకములో బాలా బీజములు, మూడూ నిక్షిప్తములై యున్నవి. ఇలా బాలా మంత్రము, (త్రిపురా) భైరవీ మంత్రములు రెండూ శ్లోకములో ఉన్నవి.

జ్ఞానార్ణవ తంత్రమునందు భగవతిభైరవి మూడు విధములుగా చెప్పబడినది. 1. బాలా 2. భైరవి 3. సుందరి ఈ విధముగా త్రిబీజాభైరవి, త్రిబీజాబాలా మంత్రము, షోడశి, మంగళాచరణ శ్లోకములో నిక్షిప్తము చేయబడినవి.

## శక్తిస్తుతి

శ్లో॥ అంతః స్మితోల్లసితమిందుకళావతంసం
ఇందీవరోదర సహోదర నేత్రశోభి ।
హేతుస్త్రిలోకవిభవస్య నవేందుమౌళే
అంతఃపురందిశతు మంగళమాదరాద్వః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సదాశివుని, శక్తిని స్తుతించుచున్నాడు. శివుడు శక్తిసహితుడైనపుడే సృష్టికార్య సమర్థుడగును.

లోలోన లీలగా చిరునవ్వు నవ్వినంతమాత్రముననే ఈ సమస్త విశ్వమునూ సృజించగల సమర్థుడు, ఇందు కళను ముకుటాభరణముగా ధరించినవాడు, కమలనేత్రుడు, మూడులోకముల ఐశ్వర్యమునకు కారణమైనవాడు అయిన ఆ సదాశివుని అంతఃపురము (ఆత్మలింగము) అందరికీ శుభమునిచ్చు గాక !

ఈ శ్లోకములో శ్లేషాలంకారముచే భువనేశ్వరీ మంత్రము (హ్రీం) నిక్షిప్తము చేయబడినది. త్రిలోకవిభవ హేతువైన శివుడు = హకారము; అంతఃస్మిత = అగ్ని = రకారము (రేఫ) ఇందీవరసహోదర = లక్ష్మి =

ఈకారము; చంద్రకళావతంస = అనుస్వారము; ఇవన్నీ కలసి "హ్రీం" బీజమేర్పడును.

## గురుస్తుతి

శ్లో॥ సంసార సింధో స్తరణైక హేతూన్
దధేగురూన్ మూర్ధ్ని శివస్వరూపాన్ ।
రజాంసియేషాం పదపంకజానాం
తీర్థాభిషేకశ్రియ మావహంతి ॥

## గ్రంథప్రయోజనం

శ్లో॥ సారంవక్ష్యామి తంత్రాణాం శారదాతిలకం శుభం ।
ధర్మార్ధకామమోక్షాణాం ప్రాప్తేః ప్రథమకారణమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - "యస్యదేవే పరాభక్తిః యధాదేవేతథాగురౌ" అను ఆగమవచనమువనుసరించి, గురుభక్తి కూడా విద్యాప్రాప్తికి అంతరంగసాధనమగుచున్నది. కనుక పరదేవతకు నమస్కరించిన పిమ్మట గురుదేవునకు గ్రంథకర్త నమస్కరించుచున్నాడు.

ఇచట "గురూన్" అని బహువచనప్రయోగము చేయుట వలన గురువూ, గురువుయొక్క గురువు పరమగురువు పరాపరగురు - పరమేష్ఠిగురులు స్మరణకు వచ్చుచున్నారు.

సంసారరూప సముద్రమును దాటుటకు ఏకమాత్ర కారణమైన శివస్వరూపుడైన **గురువునకు ఉత్పలాచార్యునకు** నమస్కరించుచున్నాను. గురు పాదధూళి తీర్థాభిషేకఫలితము నిచ్చును.

పాదధూళి అని చెప్పుటవలన, గురు నమస్కారము ఎల్లప్పుడూ పాదములు స్పృశించి చేయవలెనని తెలుపుచున్నాడు.

శీర్యత ఇతి శారం = స్థూలంకర్మఫలం, తద్దదాతీతి "శారదా" స్థూలమైన కర్మఫలమును ఇచ్చునది, శారద అనబడును. ఆమెకు అలంకారముగా శోభించునది తిలకము, బొట్టే ముఖమునకు అందమును కలిగించును కదా !

**మరొక అర్థము** – శరః అనగా స్వతంత్రము దీని భావము శారం = స్వాతంత్ర్యము, దీనినిచ్చునది శారద; అనగా జీవ భావమును తొలగించి శివభావము నిచ్చునది శారద, ఆమెకు శోభనిచ్చునది తిలకము, అదేవిధముగా సర్వతంత్రశాస్త్రముల యొక్క సారభూతమైనది ఈ "శారదాతిలక తంత్రము".

దీనిని సాధకుల హితముకోరి చెప్పుచున్నాను. గ్రంథవిషయము – ప్రయోజనము – సంబంధము – అధికారి అనే నాలుగు అనుబంధములూ తెలియజేయుచున్నాను.

## గ్రంథప్రతిపాద్య విషయములు

శ్లో॥ శబ్దార్థ సృష్టి ర్మునిభిశ్ఛందోభిర్దైవతైస్సహ
విధిశ్చ యంత్రమంత్రాణాం తంత్రేఽస్మిన్నభిధీయతే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఈ శారదా తిలక తంత్రగ్రంథము నందు, ఋషి, ఛంద, దేవత సహిత, శబ్దార్థ సృష్టి, మంత్ర – యంత్ర – తంత్రములు విధులు చెప్పబడును.

## శివుని నిర్గుణ – సగుణ భేదములు

శ్లో॥ నిర్గుణః సగుణశ్చేతి శివోజ్ఞేయః సనాతనః ।
నిర్గుణః ప్రకృతేరన్యః సగుణః సకలః స్మృతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సనాతనుడైన శివుడు, నిర్గుణ – సగుణభేదముచే రెండు ప్రకారములు. ప్రకృతి సంబంధశూన్యుడైన శివుడు నిర్గుణుడు. ప్రకృతితో కలసియున్నపుడు సగుణుడు.

వేదాంతమతమందు ప్రకృతిని అవిద్య అంటారు. శైవులు శక్తి అంటారు. సాంఖ్యమతమునందు సత్త్వరజ – తమోగుణ రూపమైన సామ్యావస్థను ప్రధానము లేదా వికృతి అంటారు.

## శక్త్యావిర్భావము – నాదోత్పత్తి

శ్లో॥ సచ్చిదానంద విభవాత్ సకలాత్ పరమేశ్వరాత్
ఆసీచ్ఛక్తిస్తతో నాదో నాదాత్ బిందు సముద్భవః ।
పరాశక్తిమయః సాక్షాత్ త్రిధాఽసౌ భిద్యతేపునః
బిందుర్నాదో బీజమితి తస్యభేదాస్సమీరితాః ।
బిందుఃశివాత్మకో బీజం శక్తిర్నాదస్తమోర్మిథః
సమవాయః సమాఖ్యాతః సర్వాగమ విశారదైః ।
రౌద్రీబిందో స్తతో నాదాత్జ్యేష్ఠా బీజాదజాయత
వామాతాభ్యః సముత్పన్నాః రుద్రబ్రహ్మరమాధిపాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సత్ – చిత్ – ఆనందరూప ఐశ్వర్యముచే పూర్ణుడైన సగుణ పరమేశ్వరునియొక్క ప్రకృతితో కలియుటచే ఏర్పడిన శక్తిచే నాదము, నాదము వలన బిందువు ఏర్పడినవి.

పరమేశ్వరునియొక్క ప్రధమకళ (శక్తి లేదా ప్రకృతి) ప్రళయకాల మందు సూక్ష్మమైన అనాదియైన చైతన్యముతో కలసియుండును. అది మరల పరమేశ్వర సంయోగముచే మరల మరల త్రిగుణములతో కలసి సృష్టికి యోగ్యమైన ప్రపంచకార్యమందు సాధనలో సూక్ష్మమైన స్థూలరూప జగత్తును ప్రభవింపచేయును.

కనుకనే శైవాగమమందు ముఖ్యముగా శక్తి, నాదము, బిందు, నిష్కల, సకలములు పంచతత్వములు అంగీకరింపబడినవి.

పరాశక్తిమయమైన బిందువు మూడు రూపములుగా విభాజితమై యుండును. 1. బిందువు, 2. నాదము, 3. బీజము. బిందువు శివాత్మకము, బీజము శక్త్యాత్మకము. శివశక్తి సమావేశమువలన నాదము పుట్టును.

శివుడు శక్తియందు క్షోభము కలిగించినపుడు ఏర్పడిన నాదము సృష్టికి కారణమగుచున్నది.

బిందువుచే రౌద్రీ, నాదముచే జ్యేష్ఠా, బీజముచే వామా ఏర్పడినవి. మరల అదే క్రమములో రుద్ర బ్రహ్మ - విష్ణువులు ఏర్పడ్డారు.

## శబ్దబ్రహ్మోత్పత్తి

శ్లో॥ సంజ్ఞానేచ్ఛా క్రియాత్మానో వహ్నీంద్వర్క స్వరూపిణః
భిద్యమానాత్ పరాత్‌బిందో రవ్యక్తాత్మా రవోఽభవత్ ।
శబ్దబ్రహ్మేతి తంప్రాహుః సర్వాగమ విశారదాః
శబ్దబ్రహ్మేతి శబ్దార్థం శబ్దమిత్యపరేజగుః ।
న హి తేషాంతయోః సిద్ధిః జడత్వాదుభయోరపి
చైతన్యంసర్వభూతానాం శబ్దబ్రహ్మేతిమేమతిః ।
తత్‌ప్రాప్య కుండలీరూపం ప్రాణినాం దేహ మధ్యగం
వర్ణాత్మనాఽఽవిర్భవతి గద్యపద్యాది భేదతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - రుద్ర - బ్రహ్మ - విష్ణువులు, క్రమముగా ఇచ్ఛా - క్రియా - జ్ఞానరూపులు. అగ్ని - చంద్ర - సూర్యరూపులు. ఇచ్ఛాశక్తి గౌరి - క్రియాశక్తి బ్రాహ్మి - జ్ఞానశక్తి వైష్ణవి.

ప్రధమబిందువుచే వర్ణవిశేషరహితమైన అఖండనాదము పుట్టినది. దీనినే "శబ్దబ్రహ్మ" అందురు. కొందరు శబ్దార్థమును శబ్దబ్రహ్మ

అనుచున్నారు. మరికొందరు కేవలం అఖండ స్ఫోటాత్మక శబ్దమునే శబ్దబ్రహ్మ అనుచున్నారు.

కాని ఈ రెండూ జడములగుటచే సృష్టి చేయుటకు యోగ్యములు కావు. గ్రంథకారుని అభిప్రాయరీత్యా, బిందువుచే ఉత్పన్నమైన ప్రాణుల చైతన్యరూప అఖండనాదమే శబ్దబ్రహ్మ. ఇంతవరకు శబ్దసృష్టి చెప్పబడినది.

ప్రాణుల శరీరమునందు ఈ చైతన్యమే, కుండలినిగానుండి, కంఠాది స్థానములను పొంది గద్య। పద్యాదిరూపమును పొందుచున్నది. అందుచేత ఈ సమస్త శబ్దసృష్టీ "కుండలినీ శక్తి" చేతనే జరుగుచున్నది.

## పశ్యంతి

శ్లో॥ అథ బింద్వాత్మనః శంభోః కాలబంధోః కలాత్మనః
అజాయత జగత్సాక్షీ సర్వవ్యాపీ సదాశివః ।
సదాశివాద్ భవేదీశః తతోరుద్రసముద్భవః
మూలభూతాత్ తతోఽవ్యక్తాత్ వికృతాత్ పరవస్తునః
ఆసీత్ కిలమహత్ తత్వం గుణాంతఃకారణాత్మకమ్ ।
అభూత్తస్మాదహంకారః త్రివిథః సృష్టి భేదతః
వైకారికాదహంకారాద్దేవావైకారికాదశ ।
దిగ్వాతార్క ప్రచేతోఽ శ్వివహ్నీంద్రోపేంద్రమిత్రకాః
తైజసాదింద్రియాణ్యా సంస్తన్మాత్రాక్రమయోగతః ।
భూతాదికాదహంకారాత్ పంచభూతాని జజ్ఞిరే
శబ్దాత్ పూర్వం వియిత్ స్పర్శాత్ వాయూరూపాద్ధుతాశనః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మాయచే కూడిన (ప్రకృతిచే) బిందురూప శివునిచే పంచకృత్యపరాయణుడైన సదాశివుడు ఏర్పడ్డాడు. (సృష్టి – స్థితి – సంహార – నిగ్రహ – అనుగ్రహములు పంచకృత్యములు)

సదాశివునినుండి ఈశ్వరుడు, ఈశ్వరుని నుండి రుద్రుడు, రుద్రుని నుండి విష్ణువు, విష్ణువునుండి బ్రహ్మ ఉద్భవించారు.

జగత్‌కు కారణభూతమైన అవ్యక్తమూల ప్రకృతియందు సత్వాది గుణవైషమ్యం ఏర్పడి, పంచతన్మాత్రలు - అంతఃకరణ చతుష్టయమునకు కారణభూతమైన ఉభయాత్మకమైన మహత్తత్వము ఏర్పడినవి.

ఈ మహత్తు నుంచి వైకారిక, తైజస, భూతాదిరూప మూడు అహంకారము లేర్పడినవి. వైకారిక అహంకారమునుండి 10మంది దేవతలు ఏర్పడ్డారు. 1. దిక్, 2. వాయువు, 3. సూర్యుడు, 4. జలము, 5. దేవ, 6. అగ్ని, 7. ఇంద్ర, 8. ఉపేంద్ర, 9. మిత్ర (ద్వాదశాదిత్యులలో మూడవ రూపుడు) 10. బ్రహ్మ వీరు ఇంద్రియముల అధిష్ఠాన దేవతలు.

11వ దేవత చంద్రుడు కూడా మనస్సుకు అధిష్ఠానదేవత యగుచున్నాడు. తైజసాహంకారము నుండి అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, మనస్సు పంచన్మాత్రలు (రూప - రస - గంధ - స్పర్శ - శబ్దములు) పుట్టినవి.

భూతాది అహంకారమునుండి తన్మాత్రములయోగముచే) పృథివ్యాది పంచమహాభూతములు ఏర్పడినవి. సర్వప్రధమం శబ్దతన్మాత్రచే ఆకాశము, స్పర్శ తన్మాత్రముచే వాయువు, రూపతన్మాత్రముచే తేజస్సు ఏర్పడినవి.

శ్లో॥ రసాదంభః క్షమాగంధాదితితేషాం సముద్భవః
స్వచ్ఛం వియన్మరుత్ కృష్ణో రక్తో౽గ్నిర్విశదంపయః ।
పీతాభూమిః పంచభూతాన్యేకైకాధారతోవిదుః
శబ్దస్పర్శరూపరసగంధా భూతగుణాఃస్మృతాః ।
వృత్తం దివస్తత్ షడ్ బిందులాంఛితం మాతరిశ్వనః
అంభోజమంభసో భూమే శ్చతురస్రం సవజ్రకమ్ ।
తత్తద్ భూత సమాభాని మండలాని విదుర్బుధాః

వర్ణైఃస్వైరంచితాన్యాహుః స్వస్వనామావృతాన్యపి ।
ధరాది పంచభూతాని నివృత్త్యాద్యాః కలాఃస్మృతాః
నివృతిః సప్రతిష్ఠాస్యాత్ విద్యాశాంతిరనంతరమ్ ।
శాంత్యతీతేతి విజ్ఞేయా నాదదేహసముద్భవాః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - రసతన్మాత్రచే జలము, గంధతన్మాత్రచే భూమి పుట్టినవి. గాలి నలుపు, అగ్ని ఎరుపు, జలము తెలుపు, భూమి పసుపు వర్ణము కలిగియుండును.

ఆకాశమునందు శబ్దము, వాయువునందు స్పర్శ, తేజస్సునందు రూపము, స్పర్శ, శబ్దము - జలమునందు రస, రూప, స్పర్శ శబ్దములు - భూమియందు రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములు, గుణములుగా యుండును.

వీటి మండలములు వివరించుచున్నాడు. ఆకాశమండలము వృత్తాకారముచే సూచించబడును. ఆ వృత్తముపై ఆ పరిధి రేఖాబిందువులు వాయుమండలమును సూచించును.

త్రికోణముయొక్క సంపాతరేఖలు పొడిగించి, వాటిని స్వస్తికాకార ముగా లిఖించినచో దానిలో ఏర్పడు త్రికోణమండలము అగ్నిమండల రూపమగును.

కమలమును చంద్రాకారముగా రెండు భాగములు చేసినపుడు ఏర్పడు, రెండు అర్ధచంద్రాకారములు జలమండలములగును. చతురస్రములో అష్టవజ్ర విభూషిత మండలము పృథివీ మండలమగును. ఆయా మండలములను ఆయా భూతవర్ణములతో పూర్ణముగా లిఖించ వలయును.

రెండు పరస్పర సంబంద్ధరేఖలు ఎదురెదురుగా మూడుప్రక్కలా వంపు తిరిగినచో దానిని "వజ్రం" అందురు. ఈప్రకారము చతురస్రమునందు

ఒకవైపు రేఖకు రెండు వజ్రములు, నాలుగు రేఖలకు మొత్తం 8 వజ్రరేఖలు వచ్చును.

ఇపుడు సంహారక్రమములో పంచమహాభూతముల కళలు చెప్పబడుచున్నవి. పృథ్వియొక్క కళపేరు నివృతి, జలముయొక్క కళపేరు ప్రతిష్ఠా, అగ్నియొక్క కళపేరు విద్యా, వాయుకళ శాంతి, ఆకాశకళ శాంత్యతీతా అనబడును.

ఈ చరాచర ప్రపంచమంతయూ పంచభూతాత్మకమైయున్నది.

## చరాచర స్వరూపము

శ్లో॥ అచరాబహుధాభిన్నా గిరివృక్షాదిభేదతః
చరాస్త్రివిధాప్రోక్తాః స్వేదాండజజరాయుజాః ।
స్వేదజాః క్రిమికీటాద్యాః అండజాపన్నగాదయః
జరాయుజా మనుష్యాద్యాస్తేషు నృణాంనిగద్యతే ।
ఉద్భవః పుంస్త్రియోర్యోగాత్ శుక్రశోణిత సంయుతాత్
బిందురేకో విశేత్ గర్భముభయాత్మా క్రమాదసౌ ।
రజోఽధికే భవేన్నారీ భవేద్రేతోఽధికః పుమాన్ ।
ఉభయోస్సమతాయాం నపుంసకమితి స్థితిః
పూర్వకర్మానురూపేణ మోహపాశేన యంత్రితః ।
కశ్చిదాత్మా తదా తస్మిన్ జీవభావం ప్రపద్యతే
అథమాత్రా హృతైరన్న పానాద్యైః పోషితః క్రమాత్ ।
దినాత్ పక్షాత్ తతో మాసాద్ వర్ధతేతత్వదేహవాన్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ చరాచరమునందు పంచభూతములున్నవి. ఇపుడు త్రివృత్కరణ పక్షము, పంచీకరణ పక్షము వివరించుచున్నాడు.

దేవతలు తైజసశరీరులు, వారి దేహము సగభాగము తేజస్సుతోనూ, మిగిలినది రెండు నాలుగు భాగములుగా పృథ్వీ - జలము ఉండును. ఇది త్రివృత్ కరణ పక్షము.

పంచీకరణ పక్షమునందు తేజస్సు ఆరుభాగములు పృథ్వీ - జల - వాయు, ఆకాశకములు పది, పది భాగములుగా యుండును.

చరములు 1. స్వేదజ, 2. అండజ, 3. జరాయుజములని మూడు విధములు. క్రిమి కీటకాదులు స్వేదజములు అనగా చమటనుండి మరియు తేమనుండి పుట్టును. పక్షులు - తాబేళ్ళు - సర్పములు మొదలైన అండజములు. మనుష్యాదులు జరాయుజములు.

మనుష్యుని ఉత్పత్తి వివరించుచున్నాడు. స్త్రీ పురుషుల శోణిత - శుక్రములు కలియుటచే మానవుడు పుట్టుచున్నాడు. ఇట్టి అగ్నీషోమాత్మక బిందువు గర్భమునందు ప్రవేశించును. ఈ బిందువునందు రజస్సు అధికముగానుండుటచే స్త్రీజన్మ కలుగును. రేతోధికముచే పురుషుడు పుట్టెదరు.

శుక్లశోణితములు రెండూ సమసంఖ్యలో కలసినచో నపుంసకులు పుట్టెదరు. పూర్వజన్మ కర్మానుసారముగా జీవుడు పుణ్యాపాపములు అనుభవించుటకు శరీరమునందు ప్రవేశించును. ఈవిధముగా ఆత్మ, జీవభావమును పొందుచున్నది.

తల్లితీసుకొనిన అన్నపానములచే క్రమముగా రోజులు - పక్షములు గడిచి ఒకనెలలో 24 తత్త్వములతో శరీరధారణచేసి వృద్ధిపొందును.

## దోషదూష్య నిరూపణము

శ్లో॥ దోషైః దూష్యైః సుఖంప్రాప్తో వ్యక్తింయాతి నిజేంద్రియైః
వాతపిత్త కఫాదోషా దూష్యాస్స్యుః సప్తధాతవః ।

త్వగసృగ్ మాంసమేదోఽస్థి మజ్జాశుక్రాణితాన్విదుః
జ్ఞానేంద్రియాణి శ్రోత్రంత్వగ్ దృక్జిహ్వానాసికావిదుః ।
జ్ఞానేంద్రియార్థాః శబ్దాద్యాః స్మృతాకర్మేంద్రియాణ్యపి
వాక్పాణిపాదపాయ్వంధు సంజ్ఞాన్యాహుర్మనీషిణః ।
వచనాదానగతయో విసర్గానంద సంయుతాః
కర్మేంద్రియార్థాః సంప్రోక్తా అంతఃకరణమాత్మనః ।
మనోబుద్ధిరహంకారశ్చిత్తంచ పరికీర్తితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వాత - పిత్త - కఫములకు దోషమని పేరు సప్తధాతువులకు దూష్యమని పేరు. 1. చర్మము, 2. రక్తము, 3. మాంసము, 4. మేద, 5. ఎముకలు, 6. మూలుగు, 7. శుక్లము.

నేత్రము - చెవులు - చర్మము - నాలుక - ముక్కు ఇవి 5 జ్ఞానేంద్రియములు. ముఖము - కాళ్లు - చేతులు - గుదము - లింగము ఇవి 5 కర్మేంద్రియములు.

మనస్సు - బుద్ధి - అహంకారము (నేను అనుభావము) చిత్తము (ఇందు ఆలోచనలు సంస్కారరూపముగా లేదా వాసనారూపముగా నిక్షిప్తమై యుండును) ఈ నాలుగూ అంతఃకరణముయొక్క నాలుగు భేదములు.

## సాంఖ్యతత్త్వం

శ్లో॥ దశేంద్రియాణి భూతాని మనసాసహ షోడశ
వికారాఃస్యుః ప్రకృతయః పంచభూతాన్యహంకృతిః ।
అవ్యక్తం మహదిత్యష్టౌ తన్మాత్రాశ్చ మహానపి
సాహంకారా వికృతయః సప్తతత్వవిదో విదుః ।
అగ్నీషోమాత్మకోదేహో బిందుర్యదు భయాత్మకః
దక్షిణాంశః స్మృతః సూర్యో వామభాగోనిశాకరః ।

నాడీర్దశ విదుస్తాసు ముఖ్యాస్త్రిస్రః ప్రకీర్తితాః
ఇడావామే తనోర్మధ్యే సుషుమ్నా పింగళే పరే ।
మధ్యాతాస్వపి నాడీ స్యాదగ్నీషోమస్వరూపిణీ
గాంధారీ హస్తిజిహ్వాచ సుపూషాలంబుషామతా ।
యశస్వినీ శంఖినీ చ కుహూ స్యుః సప్తనాడయః ।
నాడయోఽనంతాః సముత్పన్నాః సుషుమ్ణా పంచపర్వసు
మూలాధారోద్గత ప్రాణస్తాభిః వ్యాప్నోతి తత్తనుమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - దశఇంద్రియములు, పంచ మహాభూతములు, మనస్సు ఈ 16 వికారములు అనబడును. పంచ భూతములు, అహంకారము, మహత్, అవ్యక్తము ఈ 8 ప్రకృతులనబడును. పంచతన్మాత్రలు - మహత్తు అహంకారము ఈ 7 వికృతులు.

ఈ శరీరము అగ్నీషోమాత్మకము. శుక్రము అగ్నిస్వరూపము మరియు శోణితము సోమస్వరూపము. శరీరముయొక్క కుడివైపు భాగము సూర్యుడు లేదా అగ్నిస్థానము. ఎడమవైపు చంద్రరూపము.

శరీరమునందు అనేక నాడులున్ననూ ముఖ్యమైనవి 10 కలవు. వీటిలో మరింత ముఖ్యమైనవి 3. (1) శరీరమధ్యలో ఇడానాడి వామ అండకోశము నుండి విలు ఆకారములో వంపుతిరిగి ఎడమముక్కువరకు వ్యాపించి యున్నది.

(2) శరీరముమధ్యనుండి వెన్నుముక నుండి బ్రహ్మరంధ్రమువరకు సుషుమ్ణానాడి వ్యాపించియున్నది. (3) పింగళానాడి కుడి అండకోశము నుండి విల్లు ఆకారములో వంపుతిరిగి కుడిముక్కు వరకు వ్యాపించి యున్నది.

మిగిలిన 7 - గాంధారీ - హస్తిజిహ్వా - సుపూషా - అలంబుషా - యశస్వినీ - శంఖినీ - కుహూనాడులు. సుషుమ్ణానాడి యందు స్వాధిష్ఠాన

– మణిపుర – అనాహత – విశుద్ధ – ఆజ్ఞాచక్రములు పంచపర్వములుగా యుండును. వీటినుండి అసంఖ్యాకమైన నాడులు వ్యాపించియుండును.

## దశవాయువులు

శ్లో॥ వాయవోఽత్ర దశప్రోక్తా వహ్నయశ్చ దశస్మృతాః
ప్రాణాద్యామరుతః పంచ నాగః కూర్మో ధనంజయః ।
కృకలః స్యాద్ దేవదత్త ఇతి నామభిరీరితాః
అగ్నయో దోషదూష్యేషు సంలీనాదశదేహినః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఈ శరీరమునందు 10 వాయువులు 10 అగ్నులు ఉన్నవి ప్రాణ – అపాన – సమాన – వ్యాన – ఉదానములు పంచప్రాణములు, ఇవి నాగ – కూర్మ – ధనంజయ – కృకల – దేవదత్త అనేవి పంచ ఉపవాయువులు మొత్తం పది.

శరీరమునందు వాత – కఫ – పిత్తములందు సప్తధాతువులందు మొత్తం 3+7 = పది అగ్నులున్నవి.

## షడూర్ములు

శ్లో॥ బుభుక్షాచ పిపాసాచ ప్రాణస్యమనసఃస్మృతౌ
శోకమోహౌ శరీరస్య జరామృత్యూషడూర్మయః ।
స్నాయ్వస్థి మజ్జా శుక్రాత్ త్వంగ్మాంసాస్రాణి శోణితాత్
షాట్కౌశిక మిదంప్రోక్తం సర్వదేహేషు దేహినామ్ ।
ఇత్థంభూతస్తదాగర్భే పూర్వజన్మశుభాశుభం
స్మరన్ తిష్ఠతి దుఃఖాత్మా చ్ఛన్నదేహో జరాయుణా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఆకలి – దప్పికలు రెండూ ప్రాణధర్మములు, శోకమోహములు మనోధర్మములు, జరామృత్యువులు

రెండూ శరీర ధర్మములు, మొత్తం ఈ ఆరూ షడూర్ములు అనబడును. ఇవి కలవాడు జీవుడు, ఇవిలేనివాడు శివుడు.

తండ్రివలన శిశువునకు స్నాయువు – అస్థి – మజ్జ నిర్మాణమగును. తల్లి శోణితమువలన చర్మము – రక్తము – మాంసము ఏర్పడును. కనుక ఈ దేహము షాట్ కౌశికమనబడుచున్నది.

గర్భాశయమునందు ఇటువంటి జీవుడు శరీరముతో పూర్వజన్మల కర్మను స్మరించుచుండును. ఈ శరీరము మావిచే కప్పబడి యుండును. ఎంతో దుఃఖప్రదముగా ఈ అవస్థ యుండును.

శ్లో॥ కాలక్రమేణ స శిశుర్మాతరం క్లేశయన్నపి
సంపిండితశరీరోథ జాయతేऽయమవాంగ్ముఖః ।
క్షణం తిష్ఠతి నిశ్చేష్టో భీత్యారోదితు మిచ్ఛతి
తతశ్చైతన్య రూపాసా సర్వగా విశ్వరూపిణీ ।
శివ సన్నిధిమాసాద్య నిత్యానందగుణోదయా
దిక్కాలాద్యనవచ్ఛిన్నా సర్వదేహానుగా శుభా ।
పరాపర విభాగేన పరాశక్తిరియంస్మృతా
యోగినాం హృదయంభోజే నృత్యంతీ నిత్యమంజసా ।
ఆధారేసర్వభూతానాం స్ఫురంతీ విద్యుదాకృతిః
శంఖావర్తక్రమాత్‌దేవీ సర్వమావృత్య తిష్ఠతి ।
కుండలీ భూత సర్పాణామంగ శ్రియము పేయుషీ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కాలక్రమముగా 9 - 10 నెలల పిమ్మట తల్లికి క్లేశము కలిగించుచూ, సంకుచిత గాత్రుడై అధోముఖుడై భూమిపై జన్మించును. కొద్ది క్షణములు నిశ్చేష్టుడై యుండి పిమ్మట భయముచే రోదించును.

పిమ్మట విశ్వరూపిణి, చైతన్యరూపా అయిన కుండలిని దిక్కాలముల కతీతముగా దేహమంతా వ్యాపించి యుండును. శివసన్నిధిలో నిత్యానంద రూపములుగా యుండును. ఇది పరాపరవిభాగములచే రెండు విధములు.

యోగుల హృదయమందు, సర్వప్రాణులకు మూలాధారమునందు విద్యుత్ వలె స్ఫురించుచూ, శంఖములోని చుట్లువలె వ్యాపించియుండును.

## కుండలిని నుండి వివిధ మంత్రోత్పత్తి

శ్లో॥ ఏకధా గుణితాశక్తిః సర్వవిశ్వప్రవర్తినీ
వేదాదిబీజం శ్రీబీజం శక్తి బీజం మనోభవం ।
ప్రాసాదం తుంబురం పిండం చింతారత్నం గణేశ్వరం
మార్తాండభైరవం దౌర్గం నారసింహవరాహజం ।
వాసుదేవం హయగ్రీవం బీజం శ్రీపురుషోత్తమం
అన్యాన్యపి చ బీజాని తదోత్పాదయతి ధృవమ్ ।
యదాభవతి సా సంవిత్ ద్విగుణీకృత విగ్రహా
హంసవర్ణౌ పరాత్మానౌ శబ్దార్థౌ వాసరక్షపే ।
సృజత్యేషాపరాదేవీ తదా ప్రకృతి పూరుషౌ
యద్యదన్యజ్జగత్యస్యాం యుగ్మంతత్తదజాయత ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – శబ్దార్ధరూపము ఈ కుండలినీ శక్తి ఏకరూపముగా ఉన్నపుడు, అది ప్రణవము – వేదము – శ్రీం – హ్రీం ఇత్యాది ఏకాక్షర బీజములు – ప్రాసాద – తుంబురు – పిండ – శివచింతామణి – వినాయక, మార్తాండ – భైరవ – దుర్గా – నరసింహ. వరాహ – వాసుదేవ – హయగ్రీవ – పురుషోత్తమాదిబీజములను ఉద్భవింప చేయును.

జ్ఞానరూపిణి అయిన ఈ కుండలినీ శక్తి ద్విగుణీకృతమైనపుడు అనగా రెండు శక్తిశరీరములుగా ఏర్పడినపుడు పరమాత్మవాచకమైన "హంస" మంత్రము - జంటపదార్థములు ఉత్పన్నములగును.

శ్లో॥ యంత్రంత్రిగుణితం దేవ్యా లోకత్రయం గుణత్రయం
ధామత్రయం సావేదానాం త్రయంవర్ణత్రయం శుభమ్ ।
త్రిపుష్కరం స్వరాన్దేవీ బ్రహ్మాదీనాం త్రయత్రయం
వహ్నేః కాలత్రయం శక్తిత్రయం వృత్తిత్రయం మహత్ ।
నాడీత్రయం త్రివర్గం సాయద్యదన్యత్ త్రిధామతమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీ శక్తి త్రిరూపధారణి అయినపుడు, త్రిపురామంత్రము, వేదత్రయము, అగ్నిత్రయము, శక్తిత్రయము (రౌద్రీ - జ్యేష్ఠా - వామా) వృత్తిత్రయము (అధ్యయనం - అధ్యాపనం - ప్రతిగ్రహం) లేదా కృషి - వాణిజ్య - పశుపాలనములు; నాడీత్రయము, త్రివర్గము ఇంకా మూడు సంఖ్యచే ఏర్పడు సర్వపదార్థములు ఉద్భవించును.

శ్లో॥ చతుఃప్రకారగుణితా శాంభవీ శర్మదాయినీ
తదానీం పద్మినీ బంధోః కరోతి చతురక్షరమ్ ।
చతురర్ణం మహాదేవ్యా దేవీ తత్వ చతుష్టయం
చతురః సాగరానంతః కరణానాం చతుష్టయమ్ ।
సూక్ష్మాదీంశ్చతురో భావాన్ విష్ణోర్మూర్తి చతుష్టయం
చతుష్టయం గణేశానా మాత్మాదీనాం చతుష్టయం ।
ఓజాపూకాదికం పీఠం ధర్మాదీనాం చతుష్టయం
దమకాదీన్ గజాన్ దేవీ యద్యదన్యచ్చతుష్టయమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీశక్తి చతుర్గుణితమైనపుడు, ఓం - హ్రీం - హం - సః అను మంత్రములోనూ, మహాలక్ష్మి

– గణపతి – విష్ణువుల చతురక్షరమంత్రములు, ఓడ్యాణ – జాలంధర – పూర్ణగిరి – కామరూప చతుష్పీఠములు (ఓజాపూకా), ధర్మచతుష్టయం, దమాది చతుష్టయం గజచతుష్టయం. (లక్ష్మీదేవి నాలుగు గజములు) మొ॥ చతుష్టయములను ఉద్భవింపచేయును.

శ్లో॥ పంచధా గుణితాపత్నీ శంభోః సర్వార్థదాయినీ
త్రిపురాపంచకూటంసా తస్యాః పంచాక్షర ద్వయమ్ ।
పంచాక్షరం మహేశస్య పంచవర్ణం గరుత్మతః ।
సమ్మోహనాన్ పంచ కామాన్ బాణాన్ పంచసురద్రుమాన్
పంచప్రాణాదికాన్ వాయూన్ పంచవర్ణాన్ మహేశితుః ।
మూర్తీః పంచ కళాఃపంచ పంచబ్రహ్మబుచః క్రమాత్
సృజత్యేషా పరాశక్తిర్వేద వేదార్థ రూపిణీ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – కుండలినీ శక్తి పంచధావ్యక్త మైనపుడు, త్రిపురా పంచవర్ణములు (హ్ – స్ – క్ – ల్ – ర్), త్రిపురా పంచాక్షరములు (గ్లుం – స్లుం – మ్లుం – ప్లుం – న్లుం) – శివపంచాక్షరి – గరుడపంచాక్షరి – శివపంచముఖములు – మన్మథుని పంచబాణములు – పంచదేవతా వృక్షములు (మందార – పారిజాత – సంతాన – కల్పద్రుమ – హరిచందనములు) పంచప్రాణములు – పంచవాయువులు – పంచకళలు – పంచబ్రహ్మమంత్రములు ఉద్భవించినవి.

శ్లో॥ షోఢా సాగుణితాదేవీ ధత్తేమంత్రం షడక్షరం
షట్కూటం త్రిపురామంత్రం గాణపత్యం షడక్షరమ్ ।
షడక్షరంహిమరుచేర్నారసింహం షడక్షరం
ఋతూన్ వసంతముఖ్యాన్ షడమోదాదీన్ గణాధిపాన్ ।
కోశానూర్మీన్ రసాన్శక్తీః శాకిన్యాద్యాః షడధ్వనః

యం్త్రంషడ్గుణితం శక్తేః షడధారానజీజనత్ ।
షడ్విధం యజ్జగత్యస్మిన్ సర్వంతత్ పరమేశ్వరీ

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – కుండలినీశక్తి ఆరువిధముల వ్యక్తమయినపుడు, షడ క్షరమంత్రములు, గణపతి – చంద్ర – నరసింహ షడక్షరముల మంత్రములు, ఆరు ఋతువులు, ఆరుకోశములు, షడూర్మలు, షడ్గుణిత యంత్రములు, షట్చక్రములు – షడ్విధవస్తువులు పుట్టును.

శ్లో॥ సప్తధా గుణితానిత్యా శంకరార్ధ శరీరిణీ
సప్తార్ణం త్రిపురామంత్రం సప్తవర్ణం వినాయకమ్ ।
సప్తకం వ్యాహృతీనాం సా సప్తవర్ణం సుదర్శనం
లోకాన్గిరీన్ స్వరాన్ ధాతూన్ మునీన్ ద్వీపాన్ గ్రహానపి ।
సమిధః సప్తసంఖ్యాతాః సప్త జిహ్వాహవిర్భుజః
అన్యత్ సప్తవిధం యద్యత్ తదస్యాః సమాజాయత ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – కుండలినీశక్తి సప్తవిధముల వ్యక్తమయినపుడు త్రిపురాసప్తాక్షరమంత్రము, సప్తాక్షర వినాయక మంత్రము, సప్తవ్యాహృతులు, సప్తాక్షర సుదర్శనమంత్రము, సప్తలోకములు, సప్త పర్వతములు, సప్తస్వరములు, సప్తఋషులు, సప్తగ్రహములు, సప్తజ్వాలలు సప్తసమిధలు ఉద్భవించినవి.

వేదమందు – ఇట్లు చెప్పబడినది.
“సప్త తే అగ్నే సమిధః సప్త జిహ్వా
సప్తఋషయః సప్తధామ ప్రియాణి – ఇతి

అర్క – పలాశ – ఖదిర – అపామార్గ – పిప్పల – ఔదుంబరః – శమీ ఈ ఏడూ సప్తసమిధలు అనబడును.

శ్లో॥ అష్టధాగుణితాశక్తిః శైవమష్టాక్షరద్వయం
విష్ణోః శ్రీకర నామానం మంత్రమష్టాక్షరం పరమ్ ।

అష్టాక్షరం హరేః శక్తేరష్టాక్షరయుగం పరం
భానోరష్టాక్షరం దౌర్గమష్టార్ణం పరమాత్మనః ।
అష్టార్ణం నీలకంఠస్య వాసుదేవాత్మకం మనుం
యంత్రంకామార్గలం దివ్యం దేవీ యంత్రం ఘటార్గలమ్ ।
గంధాష్టకం శుభందేవీ దేవానాం హృదయం గమం
బ్రహ్మాద్యా భైరవాన్ సర్వాన్ మూర్తీరాశా వసూనపి ।
అష్టపీఠం మహాదేవ్యా అష్టాష్టక సమన్వితం
అష్టౌసా ప్రకృతీర్విఘ్న వక్రతుండాదికాన్ క్రమాత్ ।
అణిమాదిగుణాన్ నాగాన్ వహ్నేర్మూర్తీర్యమాదికాన్
అష్టాత్మకం జగత్యస్మిన్ సర్వం వితనుతే యదా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీశక్తి అష్టవిధముల వ్యక్తిమైనపుడు శివునియొక్క రెండు విధముల అక్షారముల మంత్రములు - విష్ణువుయొక్క శ్రీకరమంత్రము - సూర్య, దుర్గా - నీలకంఠ - పరమాత్మ - విష్ణు - భైరవ - కామార్గల - ఘటార్గల మంత్రములుద్భవించును.

గంధాష్టకము - అష్టాష్టక దేవీపీఠములు (64) అష్టమూర్తులు - అష్టసిద్ధులు - అష్టనాగులు - అష్టదిశలు - అష్టవసువులు - అష్టవిఘ్నములు - ప్రపంచములో అష్టవిధ పదార్ధములూ ఉద్భవించును.

## రెండన్నర శ్లోకములలో 64 పీఠములపేర్లు

శ్లో॥ మాయా మంగళ నాగవామన మహాలక్ష్మీ చరిత్రా భృగు
చ్ఛాయాఛత్ర హిరణ్యహస్తిన మహేంద్రోడ్డీశ చంపాపురమ్।
షష్ఠ క్షీరకమంజనేశ్వర పురైలాశ్చంద్రపూః శ్రీగిరిః
కోలాకుల్లుక పూర్ణపర్వత కురుక్షేత్రైక లింగార్బుదాః ॥

2. కాశ్మీరైకామ్ర కాంచీ మలయ గిరవైకారకంధూతదేవీ
కోట్టామ్రేతో శజాలం ధరసురభి మనీషాద్రి కాశీప్రయాగాః
త్రిస్రోతః కామకోట్యోజ్జయిని సమధురం కోశలాకాన్యకుబ్జో
డ్యానౌంకారాట్టహాసావిరజ ఇహతతః కుండినం రాజగేహమ్॥

3. నేపాల పుండ్రవర్ధన మాళవపరసీర కామరూప కేదారాః
వింధ్య మహామఠగోశ్రుతి కాంపిల్య శ్రీపీఠ మరుదీశాః ।

శ్లో॥ గుణితానవధా నిత్యా సూతేమంత్రం నవాత్మకం
నవకంశక్తి తత్వానాం తత్వరూపా మహేశ్వరీ ।
నవకంపీఠశక్తీనాం శృంగారాదీన్ రసాన్నవ
మాణిక్యాదీని రత్నాని నవవర్గయుతానిసా ।
నవకం ప్రాణదూతీనాం మండలం నవకం శుభం
యద్యన్నవాత్మకం లోకే సర్వమస్యా ఉదంచతి ।
దశాక్షరం గణపతేస్త్వరితాయా దశాక్షరం
దశాక్షరం సరస్వత్యా యక్షిణ్యాః సాదశాక్షరమ్ ।
వాసుదేవాత్మకం మంత్రమశ్వారూఢా దశాక్షరం
నామ్నాపద్మావతీ మంత్రం రమామంత్రం దశాక్షరమ్ ।
త్రిపురా దశకూటంసా త్రిపురాయా దశాక్షరం
నాడీనాందశకం విష్ణో రవతారాన్ దశక్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీశక్తి తొమ్మిది విధములుగా వ్యక్తమైనపుడు, చండీనవార్ణమంత్రము - నవశక్తులు - నవరసములు - నవకుండములు నవప్రాణదూతికలు - నవరత్నములు - నవవర్గములు పుట్టును.

కుండలినీశక్తి పదివిధములుగా వ్యక్తమైనచో, గణపతి - త్వరితా - యక్షిణి - వాసుదేవ - పద్మావతీ - అశ్వారూఢా - త్రిపురాదశకూట -

సరస్వతీ దశాక్షరమంత్రములు - దశనాడులు - దశలోకపాలురు - దశావతారములు ఉద్భవించును.

శ్లో॥ ఏకాదశక్రమాత్ సంవిత్ గుణితా సా జగన్మయీ
రుద్రైకాదశినీ మాద్యశక్తే రేకాదశాక్షరమ్ ।
ఏకాదశాక్షరం వాణ్యా రుద్రానేకాదశ క్రమాత్
సముద్గిరతి సర్వాత్మా గుణితాద్వాద శక్రమాత్ ।
నిత్యామంత్రం మహేశాన్యా వాసుదేవాత్మకం మనుం
రాశీన్ భానూన్ హరేర్మూర్తీర్యంత్రం సాద్వాదశాత్మకమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీ శక్తి పదకొండు విధములుగా వ్యక్తమైనపుడు, రుద్రైకాదశని - సరస్వతీ ఏకాదశాక్షర మంత్రము, ఏకాదశ రుద్రులు ఉద్భవింతురు.

కుండలినీశక్తి ద్వాదశవిధములుగా అభివ్యక్తమైనచో నిత్యా - వాసుదేవ - విష్ణు మంత్రములు - ద్వాదశరాశులు - ద్వాదశ ఆదిత్యులు - ద్వాదశ విష్ణుమూర్తులు ఉద్భవించును. ఏకాదశ రుద్రం నమక చమకాలు 11 సార్లు ఆవృత్తమవుతాయి.

## శతరుద్రమనగా ఈ మంత్రములు

☞ **షట్షష్టిర్నీలసూక్తం చ పునః షోడశబుక్జపః**
**ఏషతేహే నమస్తేద్వే నతం విద్వయమేవ చ ।**
**మీఢుష్టమ చతుష్కంచ ఏతత్తు శతరుద్రీయమ్ ॥**

శ్లో॥ చతుర్వింశతి తత్వాసా యదాభవతి శోభనా
గాయత్రీం సవితుః శంభోః గాయత్రీం మదనాత్మికామ్ ।
గాయత్రీం విష్ణుగాయత్రీం గాయత్రీం త్రిపదత్మానః
గాయత్రీం దక్షిణామూర్తేః గాయత్రీం త్రిపదాత్మనః

గాయత్రీం దక్షిణామూర్తేః గాయత్రీం శంభుయోషితః ।
ద్వాత్రింశద్ భేదగుణితా సర్వమంత్రమయీ విభుః
సూతేమృత్యుంజయంమంత్ర నారసింహం మహామనుమ్
లవణాఖ్యం మనుంమంత్రం వరుణస్య మహాత్మనః
హయగ్రీవం మనుందౌర్గం వారాహం వహ్నినాయకమ్ ।
గణేశితుర్మహామంత్రం మంత్రమన్మాధిపస్య సా
మంత్రం శ్రీదక్షిణామూర్తే ర్మాలామంత్రం మనోభవః ।
త్రిష్టుభం వనవాసిన్యా అఘోరాఖ్యం మహామనుం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీ శక్తి 24 విధములుగా వ్యక్తమైనపుడు, గాయత్రీ - శివ - విష్ణు గాయత్రీ మంత్రములు, దక్షిణామూర్తి, క్లిన్నా గాయత్రీ మంత్రములు ఉద్భవించును.

## శివతంత్ర గాయత్రీ మంత్రము

☞ **మహేశాయవిద్మహే వాగ్విశుద్ధాయ ధీమహి**
**తన్నోశివః ప్రచోదయాత్ ॥**

కుండలిని 32 విధములుగా అభివ్యక్తమైనపుడు, మృత్యుంజయ - నారసింహ - మహావరుణ - లవణ - హయగ్రీవ - దుర్గా వారాహ, వహ్నిఉపస్థాన - గణపతి - దక్షిణామూర్తి - మన్మధ తారా - అఘోర - క్షేత్రపాలక మొదలైన మంత్రములుద్భవించును.

ఆధర్వణికులు, వక్రతుండ గణపతి 32 అక్షరముల మంత్రమును ఇట్లు దర్శించిరి.

☞ **రాయస్పోష ప్రదాతాచ నిధిదో రత్నదో మతః**
**రక్షోహణో వలాహనో వక్రతుండాయ హుం నమః ।**

శ్లో॥ షట్త్రింశతంచ తత్వానాం శైవానాం రచయత్యసౌ
ద్విచత్వారింశతా మూలే గుణితా విశ్వనాయికా ।

శక్తిం తతో ధ్వనిస్తస్మాన్నాదస్త స్మాన్నిరోధికా
తతోఽర్ధేందుస్తతో బిందుస్తస్మాదాసీత్ పరాతతః ।
పశ్యంతీ మధ్యమావాచి వైఖరీ శబ్దజన్మభూః
ఇచ్ఛా జ్ఞానక్రియాత్మాసౌ తేజోరూపా గుణాత్మికా ।
క్రమేణానేన సృజతి కుండలీ వర్ణమాలికాం
అకారాది సకారాంతా ద్విచత్వారింశదాత్మికామ్ ।
పంచాశద్వారగుణితా పంచాశద్వార్ణమాలికాం
నిరోధికాభవేద్వహ్ని రర్ధేందుః స్యాన్నిశాకరః ।
అర్కఃస్యాదుభయోర్యోగే బింద్వాత్మా తేజసాంనిధిః
జాతావర్ణా యతోబిందోః శివశక్తిమయాదతః ।
అగ్నీషోమాత్మకాస్తేస్యుః శివశక్తిమయాద్రవేః
యేనసంభవ మాపన్నాః సోమ సూర్యాగ్నిరూపిణః ।

**సంపత్కరి తెలుగు వ్యాఖ్యానం** - కుండలినీశక్తి 36 విధములుగా ప్రకటమైనపుడు, 36 తత్వములు, మంత్రములు ఉద్భవించును. 42 విధములుగా వ్యక్తమైనపుడు ముందుగా శక్తి - ధ్వని - నాద - నిరోధికాలు క్రమముగా ఏర్పడును.

**"కాదిమతం"**లో అక్షరముల ధ్వని ఇట్లు ఏర్పడునని క్రమం వివరించ బడినది.

పిమ్మట నిరోధికనుండి అర్ధేందు - ద్విఅర్ధేందు - బిందు - పరా - పశ్యంతి - మధ్మమా - వైఖరీ ఉత్పన్నమగును. ఇచ్ఛాజ్ఞాన క్రియారూపమైన ఈ తేజస్సు నుండి అకారాది సకారాంత అక్షరములు ఉద్భవించును.

**"కాదిమతం"**-లో అక్షరముల ధ్వని ఇట్లు ఏర్పడునని క్రమం వివరించ బడినది.

☞ **స్వాత్మేచ్ఛా శక్తిఘాతేన ప్రాణవాయుస్వరూపతః**

**మూలాధారేసముత్పన్నః పరాఖ్యోనాద ఉత్తమః**

స్వాత్మేచ్ఛా శక్తిఘాతేన ప్రాణవాయుస్వరూపతః
మూలాధారే సముత్పన్నః పరాఖ్యోనాద ఉత్తమః ।
స ఏవోర్ధ్వం తయానీతః స్వాధిష్ఠానే విజృంభితః
పశ్యంత్యాఖ్యామవాప్నోతి తమైవోర్ధ్వం శనైః శనైః ।
అనాహతే బుద్ధితత్వసమేతో మధ్యమా భిధః
తయాతతదోర్ధ్వం నున్నఃసన్ విశుద్ధౌ కంఠదేశతః ।
వైఖర్యాఖ్యస్తతః కంఠ శీర్షతాల్వోష్ఠదంతగః
జిహ్వామూలాగ్రపృష్ఠస్థ స్తథా నాసాగ్రతఃక్రమాత్ ।
కంఠ తాల్వోష్ఠ కంఠౌ ద్దంతౌష్ఠద్వయతస్తథా
సముత్పన్నాన్యక్షరాణి క్రమాదాది క్షకావధి ।
ఆదిక్షాంతరతేత్యేషా మక్షరత్వముదీరితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అదేవిధముగా కుండలిని 50 విధములుగా అభివ్యక్తమైనపుడు అకారాది – క్షకారాంత 50 అక్షరము లుద్భవించుచున్నవి. వీటి అభిన్నముగా రుద్రకళలు పుట్టుచున్నవి.

నిరోధిక అగ్నిస్వరూపము కనుక శివాత్మకమగుచున్నది. బిందువు చంద్రస్వరూపము కనుక శక్త్యాత్మకము. శివశక్తియోగముచే ఆ బిందువు తేజోరూపమైన సూర్యుడగుచున్నది. కనుక ఆ బిందువుచేతనే అక్షరములు పుట్టుచున్నవి.

అందుచేత అక్షరములన్నియూ అగీషోమాత్మకములే మరియు సోమ – సూర్య – అగ్ని రూపములే అగుచున్నవి.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*ప్రథమపటలః సమాప్తః*

❖❖❖

# అథ ద్వితీయ పటలః

## అథ వైఖరీ సృష్టి ప్రకరణం

శ్లో॥ తతో వ్యక్తిప్రవక్ష్యామి వర్ణానాం వదనేన్నృణాం
ప్రేరితామరుతా నిత్యం సుషుమ్ణా రంధ్రనిర్గతాః ।
కంఠాదికరణైః వర్ణాః క్రమాదావిర్భవంతితే
ఏషుస్వరాః స్మృతాః సౌమ్యాః స్పర్శాః సౌరాః శుభోదయాః।
తత్వాత్మానః స్మృతాః స్పర్శా మకారః పురుషోయతః
వ్యాపకాదశతే కామధనధర్మప్రదాయినః ।
హ్రస్వాఃస్వరేషు పూర్వోక్తః పరోదీర్ఘః క్రమాదిమే
శివశక్తిమయాస్తే స్యుః బిందుసర్గావసానికాః
బిందుః పుమాన్ రవిఃప్రోక్తః సర్గః శక్తిర్నిశాకరః
స్వరాణాంమధ్యమం యచ్చ తచ్చతుష్కం నపుంసకమ్ ।
పింగళాయాం స్థితాహ్రస్వా ఇడాయాం సంగతాపరే
సుషుమ్ణా మధ్యగాజ్ఞేయాశ్చత్వారోయే నపుంసకాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు వైఖరీసృష్టిని వివరించుచున్నాడు. ముందుగా వాయుప్రేరణచే పశ్యంతీ స్థానముచేరి సుషుమ్ణచేరి, అచటనుండి కంఠం - దవడలు మొదలగు స్థానములద్వారా క్రమముగా ఒక్కొక్క అక్షరముయొక్క ధ్వని కలుగును.

అకారాది విసర్గాంతము అః వరకు అచ్చులు అనబడును. కకారాది క్షకారాంతములు హల్లులు అనబడును. అచ్చులు సోమ స్వరూపము.

హల్లులలో కకారాది మకారాంతము సౌరము, యకారాది క్షకారాంతము అగ్ని స్వరూపము.

భర్తృహరి - ధ్వని ఆవిర్భావమును ఇట్లు వివరించెను.

☞ **ఆత్మాబుధ్యా సమేత్యర్థాన్ మనోయుంక్తే వివక్షయా**
**మనః కాయాగ్ని మాహంతి సప్రేరయతి మారుతమ్ ।**
**మారుతస్తూరసిచరన్ మంద్రం జనయతి స్వరమ్ ॥**

హల్లులో "మ"కారము, పరమాత్మ అనబడును. యకారాది క్షకారాంత పది వర్ణములు వ్యాపకములనబడును. అక్షరములన్నియూ చతుర్వర్గముల నిచ్చును. మకారము బిందురూపము కనుక పూర్ణము.

అచ్చులలో అ - ఇ - ఉ - ఋ - ల - ఎ - ఒ, లు హ్రస్వము లనబడును. ఆ - ఈ - ఊ - ౠ - ౡ - ఏ - ఔ,లు దీర్ఘము లనబడును. హ్రస్వములు పురుషరూపములు - దీర్ఘములు స్త్రీరూపములో హ్రస్వములకు చివర బిందువు చేరినచో అది హ్రస్వమే యగును. విసర్గ చేరినచో దీర్ఘమనబడును.

బిందువు పురుష - మరియు సూర్యస్వరూపము, విసర్గ శక్తి మరియు చంద్రవిసర్గ శక్తి మరియు చంద్ర స్వరూపము. అచ్చులలో ఋ - ౠ ఌ - ౡ ఈ నాలుగూ నపుంసక అక్షరములనబడును.

హ్రస్వవర్ణములు పింగళానాడియందుండును. దీర్ఘ వర్ణములు ఇడానాడియందుండును. నపుంసక వర్ణములు సుషుమ్నయందుండును.

"ప్రయోగసారము"నందు ఇట్లు చెప్పబడినది.

☞ **స్వరం సప్తమమారభ్య చత్వారో యేనపుంసకాః ।**
**తేసుషుమ్ణాశ్రితే ప్రాణే ప్రోద్యంత్యయన సంక్రమే ॥**

# అక్షరముల శివశక్తిమయత్వము

శ్లో॥ వినాస్వరైస్తు నాన్యేషాం జాయతే వ్యక్తిరంజసా
శివశక్తిమయాన్ ప్రాహుస్తస్మాద్ వర్ణాన్ మనీషిణః ।
కారణాత్ పంచభూతానాముద్భూతిం మాతృకాయతః
తతోభూతాత్మికావర్ణాః పంచపంచ విభాగతః ।
వాయ్వగ్ని భూజలాకాశాః పంచాశల్లిపయఃక్రమాత్
పంచహ్రస్వాః పంచదీర్ఘా బింద్వంతాః సంధిసంభవాః ।
పంచశః కాదయః షక్షల సహాంతాః సమీరితాః
సోమసూర్యాగ్నిభేదేన మాతృకా వర్ణ సంభవాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అచ్చుల కలయికలేనిదే హల్లులు ధ్వనించవు. కనుక హల్లులు శివశక్త్యాత్మకములనబడును.

పంచభూతములకు కారణుడైన శివుడు, శక్తిమయబిందువు ద్వారా మాతృకాక్షరముల ఉత్పత్తి జరిగినది. కనుకనే అక్షరములు కూడా పంచ - పంచ విభాగముచే నున్నవి.

ఈ 50 అక్షరములూ క్రమముగా వాయు - అగ్ని - భూ - జల - ఆకాశ స్వరూపములు. 5 హ్రస్వములు, 5 దీర్ఘములు, బింద్వంత సంధ్యక్షరములు (ఎ - ఐ - ఔ - అః) క్రమముగా తెలియవలెను.

కాది, క - చ - ట - త - ప - ఒక హ్రస్వము (అ) ఒక దీర్ఘము (ఆ) ఒక్కొక్క సంధ్యక్షరం (ఏ) - య - షా ఈ పది అక్షరములూ వాయ్వాత్మకములు. ఇదేవిధముగా - ఇ - ఈ - ఖ - చ - ఠ - థ - ఫ - ఐ - ర - క్షా ఈ పది అక్షరములు అగ్నిరూపములు. ఉ - ఊ - గ - జ - డ - ద - బ - ఓ - ల లు జలాత్మకములు. సోమాత్మక + సూర్యాత్మక + అగ్న్యాత్మకములు ఇలా 16 + 12 + 10 అగుచున్నవి.

**"ఈశ్వరప్రత్యభిజ్ఞ"** యందు ఇలా పేర్కొనబడినది.

☞ **యదేకతర నిర్మాణే కార్యంజాతు న జాయతే ।**

**తస్మాత్ సర్వపదార్థేషు సామరస్యం వ్యవస్థితమ్ ॥**

**ప్రయోగమునందు -**

☞ **ప్రసిద్ధా వర్ణమాలా సా మాతృకేత్యుచ్యతే పరా ।**

## 38 కళలు

శ్లో॥ అష్టత్రింశత్ కలాస్తత్తన్మండలేషు వ్యవస్థితాః

..........................................................

తారస్య పంచభేదేభ్యః పంచాశద్వర్ణగాః కళాః ।

..........................................................

ఇతి పంచ శదాఖ్యాతాః కళాః సర్వసమృద్ధిదాః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ప్రణవమునందుండు అకార - ఉకార - మకారముల నుండి 38 కళలుద్భవించినవి. ఇవి సోమ - సూర్య - అగ్ని మండలములందుండును.

16 అచ్చులలో ఈ కళలుండును. 1. అమృతా, 2. మానదా, 3. పూషా, 4. తుష్టిః, 5. పుష్టీ, 6. రతి, 7. ధృతి, 8. శశినీ, 9. చంద్రికా, 10. కాంతి, 11. జ్యోత్స్నా, 12. శ్రీం, 13. ప్రీతిః, 14. అంగదా, 15. పూర్ణా, 16. పూర్ణామృతా । ఇవి సోమాత్మకములు.

ఇక సూర్యమండలమునందుండు 12 లక్షరములు క కారమునుండి ఠ కారమువరకు అనులోమముగానూ, భకారము నుండి డ కార పర్యంతము విలోమముగాను ఈ క్రింది కళలతో ఉండును.

1. తపిని, 2. తాపినీ, 3. ధూమ్రా, 4. మరీచి, 5. జ్వాలిని, 6. రుచి, 7. సుషుమ్నా, 8. భోగదా, 9. విశ్వా, 10. బోధిని, 11. ధారిణి 12. క్షమా.

ఇక 10 అగ్నికళలు, య కారాది - క్ష కారంతము ఈ పేర్లతో ఉండును. 1. ధూమ్రా, 2. అర్చి 3. ఊష్మా, 4. జ్వలిని, 5. జ్వాలిని, 6. విస్ఫులింగినీ, 7. సుశ్రీరి - సురూపా, 9. కపిలా, 10. హవ్యకవ్యహా। ఇవి వరదాభయముద్రలతో నుండును. వీటి వర్ణములు శ్వేత - పీత - అరుణములుగా ఉంటాయి.

"ఉత్తరషట్క"మందు ఇట్లు చెప్పబడినది.

☞ **వామేనాభయ సంయుక్తాం వరదాం దక్షిణే న తు ॥**

## 50 ప్రణవ కళలు

ఇపుడు ప్రణవమునకు అకార - ఉకార - మకార - బిందు - నాదముల అయిదింటిచే 50 కళలుద్భవించినవి. ఇవి కవర్గ, చవర్గ అక్షరములు అకారమునుండి పుట్టినవి. వీటిపేర్లు 1. సృష్టి, 2. బుద్ధి, 3. స్మృతి, 4. మేధ, 5. కాంతి, 6. లక్ష్మి 7. ధృతి, 8. స్థిరా, 9. స్థితి, 10. సిద్ధా.

ఇవి అకారరూప పరబ్రహ్మనుండి ఉత్పన్నమైనవి. ఇవి తప్తకాంచన సన్నిభములు. ఈ కళలన్నియూ రుద్రాక్ష - పుష్పమాలా - కమలద్వయ - కుండికా ధారణ కలిగి యుండును.

ఇక టవర్గ - తవర్గులు ఉకార రూప విష్ణు పరబ్రహ్మ నుండి ఉద్భవించినవి. వీటిపేర్లు 1. జరా, 2. పాలినీ, 3. శాంతి, 4. ఈశ్వరి, 5. రతి, 6. కాముకి, 7. వరదా, 8. ఆహ్లాదినీ, 9. ప్రీతి, 10. దీర్ఘా. వీటి హస్తములందు వరదాభయ శంఖచక్రములుండును.

ఇక పవర్గ - యవర్గులు మకారరూపరుద్రునినుండి ఉద్భవించినవి. వీటి పేర్లు 1. తీక్ష్ణా, 2. రౌద్రీ, 3. భయా, 4. నిద్రా, 5. తంద్రీ, 6. క్షుధా, 7. క్రోధినీ, 8. క్రియా, 9. ఉత్కారీ, 10. మృత్యు ఇవి శరత్ గౌరవర్ణముతో వరదాభయ శూలకపాలములు ధరించియుండును.

ష - స - హ - క్ష నాలుగు అక్షరముల కళలు బిందువునుండి ప్రకటితమైనవి. వీటిపేర్లు 1. శ్వేత, 2. అరుణ, 3. అసిత, 4. అనంత. ఇవి జపాకుసుమం వలె ఎఱ్ఱగా నుండును. వరదాభయ హరిణపరశువులను ధరించి యుండును.

ఇక అ నుండి అః వరకు 16 అచ్చుల కళలు నాదమునుండి ఉద్భవించినవి. వీటిని షోడశి అని కూడా అంటారు. వీటిపేర్లు 1. నివృతి, 2. ప్రతిష్ఠా, 3. విద్యా, 4. శాంతి, 5. ఇంధికా, 6. దీపికా, 7. రేచికా, 8. మోచికా, 9. పరా, 10. సూక్ష్మా, 11. సూక్ష్మామృతా, 12. జ్ఞానామృతా, 13. ఆప్యాయనీ, 14. వ్యాపినీ, 15. వ్యోమరూపా, 16. అనంతా.

ఇవన్నీ ధవళవర్ణశోభితములు. పుస్తక జపమాల - త్రిశూల - కపాలములు ధరించి యుండును.

## 50 రుద్ర - శక్తి నామములు

ఇంతవరకూ చెప్పినవి రుద్రుని నుండి ఉద్భవించినవి. ఇపుడు ఆ 50 మంది రుద్రుల పేర్లు వివరించుచున్నాడు. ముందుగా 16 అచ్చుల నుద్భవింపచేయు రుద్రుల పేర్లు 1. శ్రీకంథ, 2. అనంత, 3. సూక్ష్మ, 4. త్రిమూర్తి, 5. అమరేశ్వర, 6. అర్ఘీశ, 7. భారభూతీశ, 8. అతిథీశ, 9. స్థాణు, 10. హర, 11. ఝింటీశ, 12. భౌతిక 13. సద్యోజాత 14. అను గ్రహేశ్వర 15. అక్రూర, 16. మహాసేన.

ఇక హల్లుల మూర్తులను పేర్కొనుచున్నాడు. 1. క్రోధీశ, 2. చండేశ, 3. పంచాంతక, 4. శివోత్తమ, 5. ఏకరుద్ర, 6. కూర్మ, 7. ఏకనేత్ర, 8. చతురానన, 9. అజేశ, 10. శర్వ, 11. సోమేశ, 12. లాంగలి, 13. దారుక, 14. అర్ధనారీశ్వర, 15. ఉమాకాంత, 16. ఆషాఢీ, 17. దండి, 18. అద్రి, 19. మీన, 20. మేష, 21. లోహిత, 22. శిఖి, 23. ఛగలండేశ,

**24. ద్విరండేశ, 25. మహాకాల, 26. వాలీశ 27. భుజంగోశ, 28. పినాకీశ, 29. ఖడ్గీశ, 30. వకేశ, 31. శ్వేతభృగ్వీశ, 32. లకులీశ, 33. శివ, 34. సంవర్తక, ఇవి హల్లుల రుద్రమూర్తులపేర్లు.**

**వీటి అన్నిటి వర్ణములు ఎరుపు. వీరు కపాలశూలములు ధరించి యుందురు.**

## 50 శక్తినామములు

**16 అచ్చుల రుద్రులకూ రుద్రశక్తులపేర్లు ఇట్లున్నవి. 1. పూర్ణోదరీ, 2. విరజా, 3. శాల్మలి, 4. లోలాక్షి, 5. వర్తులాక్షీ, 6. దీర్ఘఘోణా, 7. సుదీర్ఘముఖీ, 8. గోముఖి, 9. దీర్ఘజిహ్వా, 10. కుండోదరి, 11. ఊర్ధ్వకేశీ, 12. వికృతముఖి, 13. జ్వాలాముఖి, 14. ఉల్కాముఖి, 15. సుశ్రీముఖీ, 16. విద్యాముఖీ.**

**34 హల్లుల రుద్రులకూ రుద్రశక్తుల పేర్లు 1. మహాకాళి, 2. మహా సరస్వతి, 3. సర్వసిద్ధి సమన్వితా గౌరీ 4. త్రైలోక్య విద్యా, 5. మంత్రశక్తి, 6. ఆత్మశక్తి, 7. భూతమాతా, 8. లంబోదరీ 9. ద్రావిణీ, 10. నాగరీ, 11. ఖేచరీ, 12. మంజరి, 13. రూపిణీ, 14. వారిణీ, 15. కాకోదరీ, 16. పూతనా, 17. భద్రకాళీ, 18. యోగినీ, 19. శంఖినీ, 20. గర్జినీ, 21. కాళరాత్రి, 22. కుబ్జినీ, 23. కపర్దిని, 24. వజ్రిణి, 25. జయా, 26. సుముఖా, 27. ఐశ్వర్యా, 28. రేవతి, 29. మాధవీ, 30. వారుణీ, 31. వాయునీ, 32. రక్షోవిదారిణీ, 33. సహజాలక్ష్మీ, 34. మాయావ్యాపినీ.**

## 50 కేశవశక్తి నామములు

శ్లో॥ కేశవ నారాయణ మాధవ గోవింద విష్ణవః

..................................................

ఏతాః ప్రియతమాంకేషు నిషణ్ణా సస్మితాననాః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 50 వర్ణములకు విష్ణుమూర్తులను, విష్ణుశక్తులను వివరించుచున్నాడు. 16 అచ్చులకూ విష్ణురూపుల పేర్లు.

1. కేశవ, 2. నారాయణ, 3. మాధవ, 4. గోవింద, 5. విష్ణు, 6. మధుసూదన, 7. త్రివిక్రమ, 8. వామన, 9. శ్రీధర, 10. హృషీకేశ, 11. పద్మనాభ, 12. దామోదర, 13. వాసుదేవ, 14. సంకర్షణ, 15. ప్రద్యుమ్న, 16. అనిరుద్ధ.

హల్లుల 34 విష్ణుమూర్తుల పేర్లు ఇట్లున్నవి. 1. చక్రి, 2. గదీ, 3. శారంగీ, 4. ఖడ్గీ, 5. శంఖీ, 6. హలి, 7. ముసలీ, 8. శూలి, 9. పాశీ, 10. అంకుశి, 11. ముకుంద, 12. నందజ, 13. నంద, 14. నర, 15. నరకజిత్, 16. హరి, 17. కృష్ణ, 18. సత్య, 19. సాత్వత, 20. శౌరి, 21. శూర, 22. జనార్దన, 23. భూధర, 24. విశ్వమూర్తి, 25. వైకుంఠ, 26. పురుషోత్తమ 27. బలి, 29. బలానుజ, 30. బాలవృషఘ్న, 32. వృషసింహ, 32. వరాహ, 33. విమల, 34. నృషింహ.

ఇక విష్ణుశక్తులపేర్లు ముందుగా 16 అచ్చులకు 16 విష్ణుశక్తుల పేర్లు. 1. కీర్తి, 2. తుష్టి, 3. పుష్టి, 4. ధృతి, 5. శాంతి, 6. క్రియా, 7. దయా, 8. మేధా, 9. సహర్షా, 10. శ్రద్ధా, 11. లజ్జా, 12. లక్ష్మీ, 13. సరస్వతి, 14. ప్రీతి, 15. రతి, 16. కాంతి.

34 హల్లుల విష్ణుశక్తుల పేర్లు ఇట్లున్నవి. 1. జయా, 2. దుర్గా, 3. వినదా, 4. సునదా, 5. స్మృతి, 6. బుద్ధి, 7. సమృద్ధి, 8. శుద్ధి, 9. భక్తి, 10. బుద్ధి, 11. స్మృతి, 12. క్షమా, 13. రమా, 14. ఉమా, 15. క్లేదినీ, 16. క్లిన్నా, 17. వసుదా, 18. అపరా, 19. పరా, 20. పరాయణా, 21. సూక్ష్మా, 22. సంధ్యా, 23. ప్రజ్ఞా, 24. ప్రభా, 25. నిశా, 26. అమోఘా, 27. విద్యుతా, 28. ప్రభా, 29. సత్యా, 30. చండా, 31. వాణీ, 32. విలాసినీ, 33. విజయా, 34. విరజా.

వీరంతా విష్ణుమూర్తుల అంకపీఠముపై మందస్మితవదనారవిందులై అభయముద్రతో కమలము ధరించి యుందురు.

## మంత్రముల లింగభేదము

శ్లో॥ మాతృకావర్ణ భేదేభ్యః సర్వేమంత్రాః ప్రజజ్ఞిరే
మంత్రవిద్యావిభాగేన త్రివిధా మంత్రజాతయః ।
పుంస్త్రీ నపుంసకాత్మానో మంత్రాసర్వే సమీరితాః
మంత్రాః పుందేవతాజ్ఞేయా విద్యాస్త్రీ దేవతాః స్మృతాః ।
పుంమంత్రా హుంఫండంతాఃస్యుః ద్విఠాంతాశ్చస్త్రియోమతాః
నపుంసకానమోఽంతాః స్యురిత్యుక్తా మన్నవస్త్రిధా ।
శస్తాస్తే త్రివిధామంత్రా వశ్యశాంత్యభిచారకే
అగ్నీషోమాత్మకామంత్రా విజ్ఞేయాః క్రూరసౌమ్యయోః ।
శస్తాస్తే త్రివిధామంత్రా వశ్యశాంత్యభిచారకే
అగ్నీషోమాత్మకామంత్రా విజ్ఞేయాః క్రూరసౌమ్యయోః ।
కర్మణోర్వహ్నితారాంత్య వియత్ప్రాయా స్సమీరితాః
ఆగ్నేయా మనవఃసౌమ్యాః భూయిష్ఠేంద్వమృతాక్షరాః ।
ఆగ్నేయాః సంప్రబుధ్యంతే ప్రాణే చరతి దక్షిణే
భాగేఽన్యస్మిన్ స్థితేప్రాణే సౌమ్యాబోధంప్రయాంతిచ ।
నాడీద్వయంగతేప్రాణే సర్వే బోధం ప్రయాంతిచ
ప్రచయచ్ఛంతి ఫలం సర్వేప్రబుద్ధా మంత్రిణాం సదా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఓం - ర - క్ష - హ, అను బీజాక్షరములుండు మంత్రములు ఆగ్నేయములనబడును. "వ - స" ఉండునవి సౌమ్యములనబడును.

మాతృకలోని వర్ణభేదముచే సమస్త మంత్రములూ ఉద్భవించినవి. ఇవి పుంలింగ – స్త్రీలింగ – నపుంసకలింగ భేదముల దుండును. పుంలింగ దేవత కలవి పుంమంత్రములు, స్త్రీ దేవతగల మంత్రములు విద్యా అనబడును.

మంత్రముల చివర 'హుంఫట్' అని ఉన్నచో అవి పుంలింగ మంత్రములు. స్వాహా – అని ఉన్నచో అవి స్త్రీలింగ మంత్రములు. నమః – శబ్దము చివర ఉన్నచో అవి నపుంసక మంత్రములనబడును.

ఈ మూడు రకములైన మంత్రములు వశ్య – శాంతి – అభిచార కర్మలందు ప్రశస్తములు. అగ్నిషోమాత్మకములైన మంత్రములు క్రూర – సౌమ్య కర్మలందు వినియోగింపబడుచున్నవి.

దక్షిణనాసికయందు వాయు సంచారము జరుగునపుడు ఆగ్నేయ మంత్రములు శక్తి కలిగి యుండును. వామనాసికయందు వాయు సంచార కాలమున సౌమ్యమంత్రములు ప్రబుద్ధమగును. రెండింటియందు వాయు సంచారము జరుగునపుడు అన్ని మంత్రములు శక్తివంతముగా నుండును.

"పింగళామత" మందు ఇట్లున్నది.

☞ **రౌద్రోఽపి శాంతతామేతి శాంతజాతి సమన్వితః।**
**మంత్రః శాంతోఽపి రౌద్రత్వం హుంఫట్ పల్లవితోయది ॥**

శ్లో॥ ఛిన్నాదిదుష్టాయే మంత్రా పాలయంతి నసాధకం
ఛిన్నోరుద్ధః శక్తిహీనః పరాంగ్ముఖ ఉదీరితః ।
బధిరో నేత్ర హీనశ్చ కీలితస్తంభితస్తథా
దగ్ధస్త్రస్తశ్చ భీతశ్చ మలినశ్చతిరస్కృతః ।
భేదితశ్చ సుషుప్తశ్చ మదోన్మత్తశ్చ మూర్ఛితః
హృతవీర్యశ్చ హీనశ్చ ప్రధ్వస్తో బాలకఃపునః ।

కుమారస్తు యువా ప్రౌఢో వృద్ధో నిస్త్రింశకస్తథా
నిర్బీజః సిద్ధిహీనశ్చ మందఃకూటస్తథాపునః ।
నిరంశః సత్వహీనశ్చ కేకరో బీజహీనకః
ధూమితాలింగితౌ స్యాతాం మోహితశ్చ క్షుధాతురః ।
అతిక్రూరశ్చ సవ్రీడః శాంతమానస ఏవచ ।
స్థానభ్రష్టశ్చ వికలః సోఽతివృద్ధః సమీరితః
అతిక్రూరశ్చ సవ్రీడః శాంతమానసఏవచ ।
స్థానభ్రష్టశ్చ వికలః సోఽతివృద్ధః ప్రకీర్తితః
నిస్నేహః పీడితశ్చాపి వక్ష్యామ్యేషాం చలక్షణమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రములందు 48 రకముల దోషములుండును. ఇవి ఛిన్న - రుద్ధ - దుష్ట - శక్తిహీన - పరాంగ్ముఖ మొదలగునవి వీటిని విశదముగా వివరించెదను.

మంత్రములు దోషరహితముగా నున్నపుడే సాధకునికి సిద్ధి కలిగించును.

## 1. ఛిన్న దోషము

శ్లో॥ మనోర్యస్యాది మధ్యాంతే ష్వనిలంబీజముచ్యతే
సంయుక్తంవా వియుక్తంవా ఖరాక్రాంతం త్రిధాపునః
చతుర్ధా పంచధా వాస్యుః సమంత్రః ఛిన్నసంజ్ఞకః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రమునందు ఆద్యంతములందు యం, బీజముండిననూ, రెండుసార్లు ఉచ్చరితమైననూ ఛిన్నమను దోషము కలుగును. ఆ - ఈ - ఊ - ఐ - ఔ ఈ బీజము లందు హ్రీం బీజము 3 - 4 - 5 దీర్ఘ స్వరములచే ఆక్రాంతమైననూ ఆ మంత్రము ఛిన్నమనబడును.

## 2. రుద్ధం

శ్లో॥ ఆదిమధ్యావసానేషు భూబీజద్వంద్వ లాంఛితః ।
రుద్ధ మంత్రస్స విజ్ఞేయో భుక్తిముక్తి వివర్జితాః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రములో ఆది మధ్యాంతములందు, లం బీజము రెండుసార్లు ఉచ్చరితమైనచో రుద్ధ మనబడును. ఇట్టి మంత్రము భుక్తి – ముక్తులను ఇవ్వదు. దీనిని వర్జించాలి.

## 3. శక్తి హీనం

శ్లో॥ మాయాత్రితత్వశ్రీబీజ రావహీనస్తు యోమనుః ।
శక్తిహీనస్సకథితో యస్యమధ్యేన విద్యంతే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఓం – హ్రీం – శ్రీం – హుం – ఫ్రేం బీజములు మంత్రములందు ఒకటి కూడా లేనిచో దానిని శక్తిహీనమంటారు. అది నిష్ఫలం.

పరాంగ్ముఖం గూర్చి గ్రంథాంతరమందిట్లున్నది.

<u>**“మంత్రముక్తావళి”**</u> యందిట్లున్నది.

☞ **యస్యకామకళాబిజం మధ్యస్థానే న విద్యతే**
**ఆదౌమాయాంకుశశ్చాంతే విజ్ఞేయోఽసా పరాంగ్ముఖః** ॥

## 4. పరాంగ్ముఖః

శ్లో॥ కామబీజముఖే మాయా శిరస్యంకుశమేవవా ।
అసౌపరాంగ్ముఖ ప్రోక్తో హకారో బిందు సంయుతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రమునందు హ్రీం – క్రీం మొదటపోయిననూ, చివర క్రోం లేకపోయిననూ దానిని పరాంగ్ముఖ మంత్రం అంటారు. ఇది దోషము.

## 5. బధిర

శ్లో॥ ............................ హకారో బిందు సంయుతః ।
ఆద్యంతమధ్యేష్విందుర్వా న భవేత్ బధిరఃస్మృతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రములో ఆది మధ్యాంతరములందు, హం - సం - బీజములు లేనిచో బధిర మంత్రమందు ఇది ఒక దోషము.

మరొక గ్రంథమిందిట్లున్నది.

☞ **శూన్యంబిందు సమాయుక్తం ఆద్యంతే వాథ మధ్యతః ।
నభవేజ్జీవ బీజంవా యస్యాసా బధిరః స్మృతః ॥**

## 6. నేత్ర హీనం

శ్లో॥ పంచవర్ణో మనుర్యః స్యాద్ రేఫార్కేందు వివర్జితః ।
నేత్రహీనః స విజ్ఞేయో దుఃఖశోకామయ ప్రదః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పంచాక్షరములున్న మంత్రములో ర - హ - స బీజములు లేనిచో అది నేత్రహీనమందురు. ఇట్టి మంత్రము దుఃఖము - రోగము కలిగించును.

## 7. కీలితం

శ్లో॥ ఆదిమధ్యావసానేషు సంహప్రాసాద వాగ్భవాః ।
హకారో బిందుమాన్ జీవో రావం వాపి చతుష్కలమ్ ॥
మాయానమామి చపదంనాస్తి యస్మిన్ స కీలితః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రముయొక్క ఆది మధ్యాంతములందు హంసః - హ్రౌం - ఐం - హం - సః - ఫ్రేం - హూం - హ్రీం - నమామి, బీజములు లేనిచో ఆ మంత్రము కీలిత మనబడును.

గ్రంథాంతరమందిట్లున్నది. "కీలితో బీజవర్జితః"

+ అంతరన్యేన బీజేన వ్యాప్తః కీలిత ఉచ్యతే ॥

## 8. స్తంభితః

శ్లో॥ ఏకం మధ్యే ద్వయంమూర్ధ్ని యస్మిన్నస్త్ర పురందరౌ ।
విద్యేతే స తు మంత్రః స్యాత్ స్తంభితః సిద్ధిరోధకః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఏ మంత్రముయొక్క మధ్యలో "ఫట్" కారము ల కారము, లేదా చివరలో రెండు ఫట్‌కారములు ల కారము ఉండవో దానిని స్తంభిత మంత్రమందురు. ఇది మంత్రసిద్ధి కలుగకుండా నిరోధించును.

## 9. దగ్ధం

శ్లో॥ ఏకం మధ్యే ద్వయంమూర్ధ్ని యస్మిన్నస్త్ర పురందరౌ ।
విద్యేతే స తు మంత్రః స్యాత్ స్తంభితః సిద్ధిరోధకః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రాదిలో ర - య - సమవేతరూపముగా, అనగా, ర్య. 7 సార్లు వచ్చునో అది దగ్ధ మంత్ర మనబడును.

## 10. త్రస్తః, 11. భీతః

శ్లో॥ అస్త్రంద్వాభ్యాంత్రిభిః షడ్భిరష్టాభిః దృశ్యేతేఽక్షరైః ।
త్రస్తః సోఽభిహితో యస్య ముఖేన ప్రణవః స్థితః ॥
శివో వా శక్తిరథవా భీతాఖ్యః సప్రకీర్తితః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 2 - 3 - 6 - 8 అక్షరముల మంత్రములో "హుంఫట్" ఉన్నచో అది త్రస్త మంత్రమనబడును. మంత్రముయొక్క ఆదిలో ఓం - హం - హ్రీం బీజములు ఉండవో అది భీతమంత్రము అనబడును. దీనిని జపించిన భయం కలుగును.

## 12. మలిన, 13. తిరస్కృత

శ్లో॥ ఆది మధ్యావసానేషు భవేన్మార్ణ చతుష్టయం ।
యస్యమంత్రస్సమవినో మంత్రవిత్ తం వివర్జయేత్ ॥
యస్యమధ్యే దకారోఽథ క్రోధో వామూర్ధనిద్విధా
అస్త్రంతిష్ఠతి మంత్రః స తిరస్కృత ఉదాహృతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రముయొక్క ఆది మధ్యాంతములందు మొత్తం నాలుగు "మ"కారములున్నచో అది మలిన మంత్రమనబడును. మంత్రముయొక్క మధ్యాంతములందు ద - హుం - రెండు "హుంఫట్" కారములున్నచో అది తిరస్కృత మంత్రమనబడును.

భేదిత మంత్రం గూర్చి -

"మంత్ర ముక్తావళి" యందిట్లున్నది.

☞ **అస్త్రవర్ణ ద్వయంమధ్యే వషడంతే తదైవచ ।**
**యస్య మంత్రస్య భిన్నోఽసౌ విజ్ఞేయం సిద్ధివర్జితః ॥**

## 14. సుషుప్త 15. మదోన్మత్త 16. భేదితః

శ్లో॥ భ్యో ద్వయం హృదయే శీర్షే వషడస్రంచ మధ్యతః
యస్యాసౌ భేదితో మంత్రః త్యాజ్యః సిద్ధిషు సూరిభిః ।
త్రివర్ణో హంసహీనోయః సుషుప్తః స ఉదాహృతః
మంత్రోవాప్యథవా విద్యా సప్తాధిక దశాక్షరః ॥
షట్కార పంచకాదిర్యో మదోన్మత్త ఉదీరితః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రముయొక్క హృదయ మందు రెండు "భ్యో" (భ్యః), మధ్యలో "హుంఫట్" - అంతమందు వషట్ యున్నచో అది భేదితమంత్రమనబడును.

3 అక్షరముల మంత్రములో హం - సః అనే ఏ ఒక్క అక్షరమూ లేనిచో అది సుషుప్త మంత్రమనబడును.

7 నుండి 18 అక్షరములు గల మంత్రములో 5 సార్లు ఫట్ కారము ఉన్నచో అది మదోన్మత్త మంత్రమనబడును.

"పింగళామత" గ్రంథములో ఇట్లున్నది.

☞ **విద్యా వా మంత్ర రాజోవా స్యాత్ సప్తదశాధికః।**
**ఫట్కారాః పంచ పూర్వంచేదున్మత్తః స ప్రకీర్తితః॥**

## 17. మూర్ఛిత 18. హృతవీర్య

శ్లో॥ తద్వదస్త్రం స్థితంమధ్యే యస్యమంత్రః స మూర్ఛితః ।
విరామస్థానగం యస్య హృతవీర్యః సకథ్యతే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రముయొక్క మధ్యలో 5 సార్లు హుంఫట్ ఉన్నచో అది మూర్ఛితమంత్ర మనబడును. మంత్రము యొక్క చివర 5 సార్లు హుంఫట్ ఉన్నచో అది హృతవీర్య మంత్రమన బడును.

## 19. హీన 20. ప్రధ్వస్తః

శ్లో॥ ఏకోన వింశత్యర్ణో వా యోమంత్రస్తార సంయుతః ।
హృల్లేఖాంకుశ బీజాఢ్య స్తంప్రధ్వస్తం ప్రచక్షతే ॥
ఆదౌమధ్యే తథామూర్ధ్ని చతురస్రయుతో మనుః ।
జ్ఞాతవ్యో హీన ఇత్యేష యః స్యాదష్టాదశాక్షరః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అష్టాదశాక్షర మంత్రములో, ఆది మధ్యాంతములందు, 4 సార్లు హుంఫట్ ఉన్నచో అది హీన మంత్ర మనబడును. 19 అక్షరముల మంత్రములో ఓంకారముతో బాటు హ్రీం కారము లేదా క్రోం బీజము ఉన్నచో అది ప్రధ్వస్త మంత్రమనబడును.

హృల్లేఖ (హ్రీం) గూర్చి **"భువనేశీపారిజాత"** మందు ఇట్లున్నది -

☞ **మాయాబీజ మిదం ప్రోక్తం భువనత్రయ మక్షరం ।**
**హృల్లేఖేయం చ యోగేశీ భువనేశీ చ యోగినీ ॥**

## 21. బాల, 22. కుమార 23. యువ 24. ప్రౌఢ 25. వృద్ధ దోషములు

శ్లో॥ సప్తవర్ణో మనుర్బాలః కుమారోఽష్టాక్షరస్తు యః ।
షోడశార్ణోయువా ప్రౌఢ శ్చత్వారింశల్లి పిర్మనుః ॥
త్రింశదర్ణశ్చతుః షష్టి వర్ణో మంత్రః శతాక్షరః
చతుః శతాక్షరశ్చాపి వృద్ధ ఇత్యభిధీయతే ॥

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - 7 అక్షరముల మంత్రము బాలక మంత్రము, 8 అక్షరముల మంత్రము కుమారము 16 అక్షరముల మంత్రము యువ, 24 అక్షరముల మంత్రము ప్రౌఢ - 30 - 64 - 100 - 104 అక్షరములు గల మంత్రములు వృద్ధమంత్రములనబడును. ఇవి ఫలితము నివ్వవు.

గ్రంధాంతరమందు వృద్ధమంత్రములు క్షుద్రకర్మను చక్కగా నిర్వహించునని ఇట్లు చెప్పబడినది.

**క్షుద్ర కర్మైవ కుర్వంతి వృద్ధాస్తే ।**

## 26. నిస్త్రింశ 27. నిర్బీజ

శ్లో॥ నవాక్షరో ధృవయుతో మనుర్నిస్త్రింశ ఈరితః ।
యస్యావసానే హృదయం శిరోమంత్రశ్చమధ్యతః ॥
శిఖావర్మచ నస్యాతాం వౌషట్ కారఏవచ
శివశక్త్యర్ణహీనోవా స నిర్బీజ ఇతి స్మృతాః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఓంకారముతో కూడిన నవాక్షరమంత్రము నిస్త్రింశ (ఘాతుకం) మంత్రమనబడును. మంత్రము యొక్క మధ్యలో స్వాహా - అంతమందు నమః - మరియు హుం - వషట్ - వౌషట్ - ఫట్ - హం - స - బీజములు లేనిచో అది నిర్బీజ మంత్రమనబడును.

తంత్రాంతరమందిట్లున్నది.

☞ **నిర్బీజస్తు సమాఖ్యాతః ఆదావోంకార వర్జితః ॥**

## 28. సిద్ధిహీన 29. మంద 30. కూట 31. నిరంశక

శ్లో॥ ఏషుస్థానేషు ఫట్కారః షోఢాయస్మిన్ ప్రదృశ్యతే ।
స మంత్రః సిద్ధిహీనః స్యాన్మందః పంక్త్యక్షరోమనుః ।
కూట ఏకాక్షరోమంత్రః స ఏవోక్తో నిరంశకః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రముయొక్క ఆది - మధ్యాంతరములందు, మొత్తం 6సార్లు ఫట్కారము వచ్చినచో అ సిద్ధిహీన మంత్రమనబడును. పది అక్షరముల మంత్రము మందము. ఒకే అక్షరము గల మంత్రము కూటము దీనినే నిరంశకమని కూడా అంటారు. ఇవి ఫలించవు. వీటిని గ్రహించరాదు.

## 32. సత్వహీన 33. కేకరం 34. బీజహీనక 35. ధూమిత 36. ఆలింగిత 37. మోహిత 38. క్షుధార్త 39. అతిదృప్త

శ్లో॥ ద్వివర్ణః సత్వహీనః స్యాచ్చతుర్వర్ణస్తు కేకరః ।
షడక్షరో బీజహీనస్తు అర్ధ సప్తాక్షరోమనుః ॥
సార్ధద్వాదశవర్ణోవా ధూమితః సతునిందితః ।
సార్ధ బీజత్రయ స్తద్వదేకవింశతి వర్ణకః ॥

అవింశత్యర్ణస్త్రింశదర్ణోయః స్యాదాలింగితస్తుసః ।
ద్వాత్రింశతి వర్ణోయః సప్తవింశతి వర్ణకః ॥
క్షుధార్తః సతువిజ్ఞేయః చతుర్వింశతి వర్ణకః ।
ఏకాదశాక్షరోవాపి పంచవింశతి వర్ణకః ॥
త్రయోవింశతి వర్ణోవా మంత్రోదృప్త ఉదాహృతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – రెండు అక్షరముల మంత్రము సత్వహీనము, నాలుగక్షరముల మంత్రము కేకరము, ఆరక్షరముల మంత్రము బీజహీనము, ఏడున్నర అక్షరముల, పన్నెండున్నర అక్షరముల మంత్రము ధూమితము. ఇది సర్వథా నిందితము.

అదేవిధముగా మూడున్నర అక్షరముల, 21 అక్షరముల మంత్రము కూడా ధూమిత దోషము కలిగియుండును. 20–30 అక్షరముల మంత్రము ఆలింగితమనబడును.

32 అక్షరముల మంత్రము మోహితము – 24 అక్షరముల మంత్రము 27 అక్షరముల మంత్రము క్షుధార్తము. 11 అక్షరముల – 25 అక్షరముల – ఆఇ అక్షరముల మంత్రము అతిదృప్త మనబడును. ఇవి సిద్ధించవు.

'మంత్రముక్తావళి' యందిట్లున్నది.

☞ **చతుర్వింశాక్షరంవాథ మంత్రమేకాదశాక్షరం ।స**
**శతార్ధం త్రయోవింశం అతిదృప్తంతు తంవిదుః ॥**

## 40. అంగభీన 41. అతిక్రుద్ధ

శ్లో॥ షడ్వింశత్యక్షరోమంత్రః షట్త్రింశద్వర్ణకస్తథా ।
త్రింశదేకోనవర్ణో వాఽప్యం గహీనోఽభిధీయతే ॥
అష్టావింశత్యక్షరోవా ఏకత్రింశదథాపి వా ।
అతిక్రుద్ధః సకథితో నిందితః సర్వకర్మసు ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 26 అక్షరముల మంత్రము, 36 అక్షరముల మంత్రము, 29 అక్షరముల మంత్రము అంగహీనమనబడును. 28 అక్షరముల మంత్రము - 31 అక్షరముల మంత్రము అతిక్రుద్ధ మంత్రమనబడును. ఇవి సిద్ధించవు.

## 42. అతిక్రూర 43. సవ్రీడ 44. శాంతమానస 45. స్థానభ్రష్ట

శ్లో॥ త్రింశదక్షరకోమంత్రః త్రయస్త్రింశదధాపి వా ।
అతిక్రూరః సకథితో నిందితః సర్వకర్మసు ॥
చత్వారింశతమారభ్య త్రిషష్టి సవ్రీడ సంజ్ఞకాః ॥
పంచషష్ట్యక్షరాయేస్యుః మంత్రాస్తే శాంతమానసాః
ఏకోన శతపర్యంతం పంచషష్ట్యక్షరాదితః ॥
యే మంత్రాస్తే నిగదితాః స్థానభ్రష్టాహ్వాయాబుధైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 30 అక్షరముల మంత్రము, 35 అక్షరముల మంత్రము అతిక్రూరమనబడును. ఇది గ్రహించరాదు. 24 అక్షరములనుండి 63 అక్షరముల వరకు గల ఏ మంత్రమైనా సవ్రీడ మంత్రమందురు.

ఇందు 24 రకముల మంత్రములు వచ్చును. ఇవి గ్రహించరాదు. మరి అట్లయినచో 26-29-28-31-35 ఇలా విడివిడిగా మరికొన్ని మంత్రముల అక్షరములు చెప్పి, వాటికి అంగహీన ఇత్యాది దోషములు ఎందుకు చెప్పబడినవి - అన్నచో - దానికి కారణము, 24 నుండి 63 వరకూ అక్షరములు గల మంత్రములు అత్యంత దోషయుక్తములు అని భావము. ఇవి అసలు గ్రహించరాదు.

65 అక్షరముల మంత్రము శాంతమానసదోషము కలది. 66 అక్షరముల నుండి 99 అక్షరముల పర్యంతముగల మంత్రములు స్థాన

భ్రష్టము లనబడును. ఇవి 34 రకములుగా ఏర్పడుచున్నవి. వీటిని గ్రహించరాదు.

గ్రంథాంతరములందు - మూక - నగ్న - భుజంగమ - శూన్య - హతములు మొదలైనవి చెప్పబడినవి.

**న్యాసం వినా భవేన్మూకః** - న్యాసము లేని మంత్రము మూకమంత్ర మనబడును.

☞ **పల్లవేన వినామంత్రో నగ్నః సంప్రకీర్తితః -**

☞ **ఋషిదైవతఛందోభిః పరిత్యక్తో భుజంగమః -**

☞ **యస్యజాపం శృణోత్యన్యః సమంత్రః శూన్య ఉచ్యతే -**

☞ **శిరోహీనః హతః ప్రోక్తః -**

జపము చేయబోవు మంత్రవర్ణముల శోధన విధానము ఇట్లు చెప్పబడినది.

☞ **మూలాధారోత్పన్నాన్ మంత్రవర్ణాన్ బ్రహ్మారంధ్ర పర్యంతం గతాగతాని కుర్వతో ధ్యాత్వా వాయుధారణం కృత్వా సహస్రం జపేదితి శోధన ప్రకారమాహుః ॥**

**కృత్తివాస తంత్రంలో** దారిత మంత్రం గూర్చి ఇట్లు చెప్పబడినది.

☞ **ఆదిమధ్యావసానేషు ధృవో యస్య న విద్యతే ।**
**సదారిత ఇతిఖ్యాతః తంత్రేఽ స్మిన్ కృత్తివాససా ॥**

ధృవమనగా ఓంకారము, మంత్రములో ఆది మధ్యాంతములలో ఎక్కడైననూ ప్రణవములేనిచో అది దారిత మంత్రమనబడును ఇది దోషము కనుక దీనిని గ్రహించరాదు.

## 46. వికల 47. నిఃస్నేహ 48. అతివృద్ధ 49. పీడిత

శ్లో॥ వికలాస్త్రేఽ భిధీయంతే శతంసార్ధం శతంతువా ।
శతద్వయం ద్వినవతి రేక హీనాథవాపివా ॥

శతత్రయం యత్ సంఖ్యా నిఃస్నేహాస్తే సమీరితాః ।
చతుఃశతాన్యధారభ్య యావద్వర్ణ సహస్రకమ్ ॥
అతివృద్ధః ప్రయోగేషు పరిత్యాజ్య సదాబుధైః ।
సహస్రార్ణాధికా మంత్రా దండకాపీడితాహ్వాయాః ॥
ద్విసహస్రాక్ష రా మంత్రా ఖండశః శతధా కృతాః ।
జ్ఞాతవ్యాః స్తోత్రరూపాస్తే మంత్రాఏతే యధాస్థితాః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 13 అక్షరముల, 15 అక్షరముల మంత్రములనబడును. 100 అక్షరముల, 150 అక్షరముల మంత్రములు 200 అక్షరముల, 180 అక్షరముల మంత్రములు (92 అక్షరముల మంత్రము) 91 అక్షరముల మంత్రములు, 300 అక్షరముల మంత్రములు నిఃస్నేహమనబడును.

400 అక్షరములనుండి 1000 అక్షరముల వరకు గల మంత్రములు అతివృద్ధ మంత్రములనబడును. వీటిని గ్రహించరాదు. 1000 అక్షరములు దాటినవి దండకములు అనబడును. ఇవి స్తోత్ర విభాగములో చేరును. ఇవి పీడిత దోషము గలవి.

2000 అక్షరముల మంత్రము 100 అక్షరములు ఖండముగా విభజించిననూ అవి స్తోత్ర సాహిత్యమగును. వీటిని జపించరాదు.

## దోషము వలన సిద్ధిహాని

శ్లో॥ తధా విద్యాశ్చ బోద్ధవ్యా మంత్రిభిః కామ్యకర్మసు ।
దోషానిమా నివిజ్ఞాయ యోమంత్రం భజతే జడః ॥
సిద్ధిర్నజాయతే తస్య కల్పకోటి శతైరపి ।
శోధయేదూర్ధ్వపవనో బధ్యాయోని ముద్రయా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈపైన 49 రకములు గల, మంత్రములను సాధకులు గ్రహించరాదు. అవి సిద్ధించవు. వీటిని కోటి కోటి సంవత్సరములు జపించిననూ సిద్ధినివ్వవు.

"వీటిని సాధకుడు స్వాత్మభిన్నముగా భావించి యోనిముద్ర బంధించి శోధించాలి".

ఈ విధానము కేవలము యోగశాస్త్రకుశలురు మాత్రమే చేయగలరు.

యోనిముద్రాలక్షణము

☞ **పార్ష్ణిభాగాత్ సుసంపీడ్య యోనిమార్గం తథా గుదం ।**
**అపాన మూర్ధమాకర్షేత్ మూలబంధో నిగద్యతే ॥**
**గుదమేఢ్రాంతరం యోనిః తామాంకుంచ్య ప్రబంధయేత్ ।**
**యువాభవతి వృద్ధోఽపి సతతం మూలబంధనాత్ ॥**

## మంత్రములకు 10 సంస్కారములు

శ్లో॥ మంత్రాణాం దశసంస్కారాః కథ్యంతే సిద్ధిదాయినః ।
జననం జీవనం పశ్చాత్ తాడనం బోధనం తథా ॥
అథాభిషేకో విమలీకరణాప్యాయనే పునః ।
తర్పణం దీపనం గుప్తిర్దశైతా మంత్రసంస్క్రియాః ॥
మంత్రాణాం మాతృకామధ్యాదుద్ధారోజననం స్మృతం ।
ప్రణవాంతరితాన్ కృత్వా మంత్రవర్ణాన్ జపేత్ సుధీః ॥
ఏతజ్జీవ నమిత్యాహుః మంత్రతంత్ర విశారదాః ।
మంత్రవర్ణాన్ సమాలిఖ్య తాడయేచ్చందనాంభసా ॥
ప్రత్యేకం వాయునా మంత్రీ తాడనం తదుదాహృతం ।
విలిఖ్యమంత్రంతంమంత్రీ ప్రసూనైః కరవీరజైః
తన్మాంత్రక్షర సంఖ్యాతైః హన్యాద్యాంతేన బోధనమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రముల దోష పరిహారము చేయుటకు పది సంస్కారములు చెప్పబడినవి. యోనిముద్ర ధరించి సుషుమ్ణా మార్గములో శోధన చేయలేనివారు వీటిని ఆచరించాలి.

వీటిపేర్లు **1.** జననం, **2.** జీవనం, **3.** తాడనం, **4.** బోధనం, **5.** అభిషేకం, **6.** విమలీకరణం, **7.** ఆప్యాయనం, **8.** తర్పణం, **9.** దీపనం, **10.** గుప్తిః.

✡ శుభముహూర్తమున పీఠమునందు లేదా భూర్జపత్రముపై కుంకుమ పువ్వు - గోరోచనాదులచే మాతృకాబ్జము లిఖించి, ఇవ్వవలసిన మంత్రమును అనగా ఆయా అక్షరములను ఒక్కొక్కటిగా ఉద్ధరించాలి. ఇది గురువు చేయవలసిన కార్యము. దీనినే "జననం" అందురు.

**2.** ఆ మంత్రమునకు ప్రతీ అక్షరమునకు ఆద్యంతములందు ప్రణవమును చేర్చి **100**సార్లు జపించవలయును. దీనినే మంత్రజీవనం అందురు.

**ఉదా :- ఓం నమశ్శివాయ**

**ఓం ఓం ఓం న ఓం మ ఓం శి ఓం వా ఓం య ఓం**

**3.** మంత్రాక్షరములను గోరోచన – కుంకుమపువ్వులచే లిఖించి, చందన గంధముచే 'యం' బీజమునుచ్చరించుచూ, ప్రతీ అక్షరమును దర్భతో లేదా గంధజలము చల్లుచూ **100**సార్లు కొట్టుటయే గంధజలము చల్లుటయే తాడనమనబడును.

**4.** మంత్రాక్షరములను గోరోచన - కుంకుమచే లిఖించి (భూర్జపత్రముపై) ఎర్రగన్నేరు పూలతో, రంబీజమునుచ్చ రించుచూ, మంత్రాక్షరము లెన్ని కలవో అన్నిసార్లు తాడనము చేయవలయును. ఇదియే బోధన సంస్కారమనబడును.

మంత్రసంస్కార విషయములో పింగళామతము మంత్ర తంత్ర ప్రకాశ, గ్రంధములు సప్తసంసారములిట్లు పేర్కొన్నవి.

"పింగళామతము"లో ఇట్లున్నది.

☞ **జననం జీవనం బోధస్తాడనం నిర్మలీకృతిః ।**
**ఆప్యాయనాభిషేకౌచ క్రియాంకైః సప్తభిః ధృవమ్ ॥**

"**మంత్ర తంత్రప్రకాశ**"లో ఇట్లున్నది.

☞ **అథాస్మై ప్రవదేన్మంత్రం సంస్కృతం సుముహూర్తకే।**
**సప్తైతే మంత్రసంస్కారాః దుర్లభా భువిమానవైః ॥**

శ్లో॥ స్వతంత్రోక్త విధానేన మంత్రీమంత్రార్ణ సంఖ్యయా ।
అశ్వత్థపల్లవైర్మంత్రమభిషించేత్ విశుద్ధయే ॥
సంచింత్యమనసా మంత్రం జ్యోతిర్మంత్రేణ నిర్దహేత్ ।
మంత్రేమలత్రయం మంత్రీ విమలీకరణం త్విదమ్ ॥
తారంవ్యోమాగ్ని మనుయుగ్ దండీజ్యోతిర్మనుర్మతః ।
కుశోదకేన జప్తేన ప్రత్యర్ణం ప్రోక్షణం మనోః ॥
తేనమంత్రేణ వారిణా మంత్రే తర్పణం తర్పణం స్మృతమ్॥
తారమాయా రమాయోగే మనోర్దీపనముచ్యతే ।
జప్యమానస్య మంత్రస్య గోపనస్త్య ప్రకాశనమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 5) సాధకుడు తన సంప్రదాయానుసారముగా అశ్వత్థ పల్లవములచే, మంత్రాక్షర సంఖ్యచే అన్నిసార్లు ఆ మంత్రమును అభిషేకించాలి.

సంప్రదాయమనగా శైవమంత్రములు శివతంత్రానుసారముగానూ, విష్ణుమంత్రములు వైష్ణవసంప్రదాయానుసారముగానూ ఆచరించాలి.

**6.** సాధకుడు మూలాధారమునుండి కుండలిని ఊర్ధ్వముఖము గావించి, మంత్రమును స్మరించుచూ, జ్యోతిర్మంత్రముచే మంత్రములోని

మతత్రయమును (సహజం - ఆగంతు - కం - మాయీ) సంస్కరించవలయును. ఇదే విమలీకరణము.

**జ్యోతిర్మంత్రము - ఓం హ్రౌం**

**7.** పైమంత్రముచ్చరించుచూ (అముం) మంత్రం తర్పయామి నమః అని నీటితో తర్పణము చేయవలయును. దీనినే తర్పణం అందురు. అదే మంత్రముతో ఒక్కొక్క అక్షరముపై **108**సార్లు జలప్రోక్షణ చేసిన ఆప్యాయనమగును. **8**

ఇక దీపనమును వివరించుచున్నాడు. **9**

"ఓం హ్రీం శ్రీం" ఈ మంత్రముచే మూలమంత్రమును జోడించి అనగా సంపుటము చేసి ఏడుసార్లు జపించిన దీపనమగును.

**10.** తాను ఉపదేశము పొంది, జపించుచున్న మంత్రమును పైకి ఉచ్చరించుట లేదా ఎవరికైనా వినిపించిన అది నిష్ఫలమగును. తాను జపించు మంత్రమును రహస్యముగా నుంచుటయే "గుప్తి" అనబడును.

శ్లోకములోని "దండి" శబ్దము అనుస్వారమును తెలియజేయు చున్నది. ఇందులకు ప్రమాణము **"నిఘంటుమాత్రుక"**లో ఇట్లున్నది

☞ **అమక్రూరేశకో దండీ బిందుకః కామగుహ్యకః ।**
**కంచుః ప్రాచీనయోనిశ్చ సౌఖ్యదుఃఖ ప్రబంధకః ॥**

## నక్షత్ర చక్రం

శ్లో॥ స్వతారారాశి కోష్ఠానామనుకూలం భజేన్మనుం ।
ప్రాపలోభాత్పటుః ప్రాజ్యం రుద్రస్యాద్రి రురుఃకరమ్ ॥
లోకలోపపటుః గ్రామఖలౌద్యో భేషు భేదితాః ।
వర్ణాఃక్రమాత్ స్వరాంత్యౌతు రేవత్యంశ గతౌతదా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సాధకుడు తన జన్మనక్షత్రం రాశులకు అనుకూలమైన మంత్రమును గ్రహించవలయును.

అట్టి మంత్రము శీఘ్రముగా సిద్ధించును. స్వరముల చివర అనుస్వారము, విసర్గ ఉన్నచో అవి రేవతీ నక్షత్ర విభాగములో అంతర్భావము చెందును.

అశ్విన్యాది 27 నక్షత్రములకు అకారాది క్షకారాంత వర్ణములు ఈ క్రింది పట్టికలో వివరించడమైనది.

✡ **వరరుచి** పరిభాష ఇట్లున్నది.

☞ **కటపయవర్గ భవైరిహ పిండాంత్యైరక్షరైరంకాః ।**
**నఞ్ చశూన్యం జ్ఞేయం తథా స్వరే కేవలే కథితే ॥**

| | | |
|---|---|---|
| 1. | అశ్విని | అ - ఆ |
| 2. | భరణి | ఇ |
| 3. | కృత్తిక | ఈ - ఉ - ఊ |
| 4. | రోహిణి | ఋ - ౠ - ఌ - ౡ |
| 5. | మృగశిర | ఎ |
| 6. | ఆర్ద్ర | ఏ |
| 7. | పునర్వసు | ఐ - ఒ |
| 8. | పుష్యమి | ఓ |
| 9. | ఆశ్లేష | ఔ - క |
| 10. | మఖ | ఖ - గ |
| 11. | పుబ్బ | ఘ |

| | | |
|---|---|---|
| **12.** | ఉత్తర | జ - చ |
| **13.** | హస్త | ఛ - జ |
| **14.** | చిత్త | ఝ - ఞ |
| **15.** | స్వాతి | ట |
| **16.** | విశాఖ | ఠ - డ |
| **17.** | అనూరాధ | ఢ - ణ - త |
| **18.** | జ్యేష్ఠం | థ |
| **19.** | మూల | ద - ధ - న |
| **20.** | పూర్వాషాఢ | ప |
| **21.** | ఉత్తరాషాఢ | ఫ |
| **22.** | శ్రవణం | బ |
| **23.** | ధనిష్ఠం | భ - మ |
| **24.** | శతభిషం | య |
| **25.** | పూర్వాభాద్ర | ర - ల |
| **26.** | ఉత్తరాభాద్ర | వ - శ - ష |
| **27.** | రేవతి | స - అం - అః - ల |

శ్లో॥ జన్మ సంపత్ విపత్క్షేమ ప్రత్యరిః సాధకోవధః ।
మిత్రం పరమ మిత్రం చ జన్మాదీని పునః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - జన్మ - సంపత్ - విపత్ - క్షేమ - ప్రత్యక్ - సాధన - నైధన - మిత్ర - పరమమిత్రములనునవి, తొమ్మిది తారాబలమును తెలియజేయును.

ఏ నక్షత్రమనందు సాధకుని నామము యొక్క మొదటి అక్షరమున్నదో, దానినుండి మంత్రముయొక్క మొదటి అక్షరమున్న నక్షత్రము వరకు లెక్కించి, తొమ్మిదిచే భాగించిన జన్మాది తారలు తెలియును.

**2 - 4 - 6 - 8 - 9** తారలు మంచివి. అనగా సంపత్ తార - క్షేమతార - సాధనతార - మిత్రతార - పరమమిత్రతారలు మంచివి.

## రాశిఫలం

శ్లో॥ వాలం గౌరం ఖురంశోణం శమీశోభేతిరాశిషు
క్రమేణ ఖేదితా వర్ణాః కన్యాయాం శాదయః స్మృతాః ॥
లగ్నంధనం భ్రాతృ బంధు పుత్రశతృ కళత్రకాః
మరణం ధర్మకర్మాయ వ్యయాద్వాదశరాశయః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - జన్మరాశినుండి 12వ రాశి వరకు ఆ భావములు ఇట్లుండును. సాధకుని నామాద్యక్షరమున్న రాశినుండి, మంత్రాద్యక్షరమున్న రాశివరకు లెక్కించవలయును. **6 - 8 - 12** మంచివి కావు. మిగిలినవి మంచివి.

| | | |
|---|---|---|
| 2 ధనం / 3 సోదర | 1 లగ్నం | 12 వ్యయం / లాభం 11 |
| 4 బంధు | | కర్మ 10 |
| 5 పుత్ర / 6 శతృ | భార్య 7 | ధర్మం 9 / మరణం 8 |

# రాశులలో వర్ణములు




ఉదాహరణ :- సంపత్ కుమార్ అనే సాధకుని, నామాద్యక్షరము "స" అను ఆరవరాశియైన కన్యయందున్నది.

ఈ రాశినుండి **6 - 8 - 9**వ రాశులు అనగా

**6**వ రాశి కుంభరాశిలోని = మ - య - ర - వ - ళ

**8**వ రాశి మేషరాశిలోని = అ - ఆ - ఇ - ఈ

**12**వ రాశి సింహరాశి = క - ఖ

అనే అక్షరములతో ప్రారంభమైన మంత్రములు ఫలించవు. మిగిలిన అక్షరములతో ప్రారంభమగు మంత్రములన్నీ సిద్ధించును.

# అకథహ చక్రము

శ్లో॥ చతురస్రే లిఖేద్వర్ణాన్ చతుఃకోష్ఠ సమన్వితే
అకారాదిక్ష కారాంతాన్ స్వనామాద్యక్షరాదితః ।
సిద్ధాదీన్ కల్పయేన్మంత్రీ కుర్యాత్ సిద్ధాదిభిః పునః

సిద్ధాదీన్ సిద్ధిదః సిద్ధిదః సిద్ధో జపాత్ సాధ్యోహుతాదిభిః ।
సుసిద్ధః ప్రాప్తిమాత్రేణ సాధకం భక్షయేదరిః
సిద్ధార్ణా బాంధవాః ప్రోక్తాః సాధ్యాస్తే సేవకాః స్మృతాః ।
సుసిద్ధాః పోషకాజ్ఞేయాః శత్రవో ఘాతకామతాః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ అకథహ చక్రము 4 భాగములతో నుండును. 1. సిద్ధ, 2. సాధ్య, 3. సిద్ధ సుసిద్ధ, 4. సిద్ధారి. ఏ భాగమునందు సాధకుని నామాద్యక్షరముండునో అది సిద్ధ చతుష్క మగును. అచటనుండి ప్రాదక్షిణ క్రమముగా మంత్రాద్యక్షరమున్న చతుష్కమును లెక్కించవలయును.

1. సిద్ధమంత్రము జపముచే సిద్ధించును.
2. సాధ్యమంత్రము పురశ్చరణ చేసి సిద్ధించును.
3. సుసిద్ధ మంత్రము ఉపదేశ మాత్రముచే సిద్ధించును.
4. సిద్ధారి మంత్రము సాధకుని నాశనము చేయును.

1 2

| | | | |
|---|---|---|---|
| అ క 1 థ హ | ఉ జ ప 1 | ఆ ఖ 2 ద క్ష | ఊ చ ఫ 2 |
| ఓ డ బ 1 | ఌ ఝ మ 1 | ఔ ధ శ 2 | ఌ ఈ య 2 |
| ఇం ఘ న 4 | ఋూ జ భ 4 | ఇ గ ధ 3 | ఋ ఛ వ 3 |
| అః త స 4 | ఐ ఠ ల 4 | అం ణ ష 3 | ఏ ట ర 3 |

4 3

ఉదాహరణ :- "సంపత్ కుమార్" అనే సాధకుని పేరులో మొదటి అక్షరము "స"కారము నాల్గవ గడిలో నున్నది. కనుక అది "సిద చతుష్క" మగును.

దానికి రెండవ చతుష్కము సాధ్య చతుష్కమగును. మూడవగడి సుసిద్ధ చతుష్కమగును. అందున్న నాలుగు గడులలో, ఆ - ఖ - ద - క్ష - ఊ - చ - ఫ - ఔ - ధ - శ - ఌ - జ - య అనే 13 అక్షరములతో మొదలైన మంత్రములు వెంటనే శీఘ్రముగా సిద్ధించును.

నాల్గవగడి "సిద్ధారి" చతుష్కమగును. ఈ చతుష్కమందున్న నాలుగు గడులలోనున్న అక్షరములతో ప్రారంభమగు మంత్రములు గ్రహించరాదు.

"<u>భువనేశీ పారిజాత</u>"మనే గ్రంథమిట్లున్నది.

☞ **మాయాబీజ సమాయుక్తః క్షిప్రం సిద్ధిప్రదోభవేత్ ।**
**పిండస్తు కేవలో మంత్రో మాయాబీజోజ్జ్వలీకృతః ॥**
**మాయాబీజాద్భవేత్ ప్రాణో బీజం చైతన్యవీర్యవత్**

"మహాకపిల పంచరాత్ర" మనే గ్రంథమందు మంత్రారవణము మూడు విధములని ఇట్లు పేర్కొన్నది.

☞ **త్రివిధః కీర్తితో మంత్రః సిద్ధః సాధ్యః సుసిద్ధకః ।**
**అల్పాక్షరో భవేత్ సిద్ధః సాధ్యో మాలార్ధ మాలకౌ ॥**
**అత ఊర్ధ్వం సుసిద్ధః స కవిత్వే చాతి నిందితః ॥**

"<u>మాలినీ విజయ</u>" మనే గ్రంథమందు ఒక విశేషము చెప్పబడినది. ఇది కొంత తాత్త్విక దృష్టితో చెప్పినట్లు తెలియును.

☞ **స్థానస్థా వరదామంత్రా ధ్యానస్థా చ ఫలప్రదాః ।**
**ధ్యానస్థాన వినిర్ముక్తాః సుసిద్ధా అపి వైరిణః ॥**

గ్రంథాంతరమందు కొన్ని శబ్దములు గల మంత్రములు శోధించ నవసరము లేదని ఇట్లున్నది.

☞ **నమః ప్రణవ సంయోగౌ అపభ్రంశాక్ష రాణి చ ।**
**వర్జయిత్వైవ గణనం కర్తవ్యం చ సురేశ్వరి ॥**

## దీపస్థానం

శ్లో॥ దీపస్థానం సమాశ్రిత్య కృతం కర్మ ఫలప్రదం
చతురస్రాం భువం భిత్వా కోష్ఠానాం నవకంలిఖేత్ ।
పూర్వకోష్ఠాదివిలిఖేత్ సప్తవర్గాననుక్రమాత్
లక్ష్మీశే మధ్యకోష్ఠే స్వరాన్ యుగ్మక్రమాల్లిఖేత్ ।
దిక్షు పూర్వాదితో యత్ర క్షేత్రాఖ్యాద్యక్షర స్థితం
ముఖంతత్ తస్యజానీయాద్ధస్తావుభయతఃస్థితౌ ।
కోష్ఠే కుక్షీ ఉభేపాదౌ ద్వేశిష్టం పుచ్ఛమీరితం
క్రమేణానేన విభజే న్మధ్యస్థమపి భాగతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కకారము నుండి క్షకారము వరకు గల అక్షరములకు దీపమని సంజ్ఞ కలదు. అకారము నుండి అః వరకు గల అచ్చులకు పీఠమను సంజ్ఞ ఉన్నది. కూర్మచక్రములో సాధకులకు ఉపయోగించు దిశలలో కూర్చొని జపము చేసినచో తేజస్సు వృద్ధి పొందును. జపము శీఘ్రముగా సిద్ధించును.

## కూర్మచక్రం

తూర్పు

| | | | | |
|---|---|---|---|---|
| ఈశాన్యం | ల–క్ష | క–ఖ–గ–ఘ–ఙ | చ–ఛ–జ–ఝ–ఞ | ఆగ్నేయం |
| ఉత్తరం | శ – ష<br>స – హ | మధ్య<br>అ–ఆ–ఇ–ఈ–ఉ–ఊ–<br>ఌ–ౡ–ఋ–ౠ–ఏ<br>ఐ–ఓ–ఔ–అం–అః | ట–ఠ–డ<br>ఢ–ణ | దక్షిణం |
| వాయవ్యం | య ర ల వ | ప–ఫ–బ–భ–మ | త–థ–ద–ధ–న | నైఋతి |

పశ్చిమం

శ్లో॥ ముఖస్థో లభతేసిద్ధిం కరస్థః స్వల్ప జీవనః
ఉదాసీనః కుక్షి సంస్థః పాదస్థో దుఃఖమాప్నుయాత్ ॥
పుచ్ఛస్థః పీడ్యతే మంత్రీ బంధనోచ్చాటనాదిభిః
కూర్మచక్రమిదం ప్రోక్తం మంత్రాణాం సిద్ధిసాధనమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మంత్రసిద్ధి సాధించుటలో కూర్మచక్రము ఎంతో ఉపయోగపడును. సాధకుడు తాను నివసించుచున్న గ్రామముయొక్క మొదటి అక్షరము ఉన్న గడి ఏ దిశను తెలియజేయు చున్నదో ఆ దిశాముఖముగా జపము చేయవలయును.

గ్రామాద్యక్షరమున్న గడి ముఖమగును. తరువాత గడి హస్తమగును. అది స్వల్పలాభము కలిగించును. తరువాత కుక్షి, ఇది నిష్ఫలం. పాదస్థానము దుఃఖదాయకము. పుచ్ఛస్థానము బంధనాదులు కలుగును.

## పురశ్చరణకు శుభస్థానములు

శ్లో॥ పుణ్యక్షేత్రం నదీతీరం గుహా పర్వత మస్తకం
తీర్థప్రదేశాః సింధూనాం సంగమాః పావనం వనమ్ ।
ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటంగిరీః
దేవతాయతనం కూలం సముద్రస్య నిజం గృహమ్ ॥
సాధనేషు ప్రశస్యంతే స్థానాన్యేతాని మంత్రిణాం
భైక్ష్యంహవిష్యం శాకాని విహితాని ఫలంపయః ।
మూలంశక్తుర్యవోత్పన్నో భక్ష్యాణ్యేతాని మంత్రిణామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – జపసాధనం, పురశ్చరణకు ఈ స్థానములు ప్రశస్తములు. జ్యోతిర్లింగ – శక్తిపీఠములు – నదీతీరం – పర్వతశిఖరం – గుహ – సంగమస్థలం – ఏకాంతవనములు – మారేడు చెట్టు మూలం – సముద్రతీరం – స్వగృహం మంచివి.

సాధన సమయములో సాధకుడు శాఖాహారము - హవిస్సు - ఫలములు - పాలు - సత్తుపిండి మాత్రమే స్వీకరించాలి. సత్వగుణముతో ప్రవర్తించాలి. నియమనిష్ఠలు ఎంతో అవసరము.

## గురువు లక్షణములు

శ్లో॥ పురుషార్థ సమావాప్త్యై సత్‌శిష్యో గురుమాశ్రయేత్
మాతృతః పితృతః శుద్ధః శుద్ధభావో జితేంద్రియః ।
సర్వాగమానాం సారజ్ఞః సర్వశాస్త్రార్థ తత్త్వవిత్
పరోపకార నిరతో జపపూజాది తత్పరః ।
అమోఘవచనః శాంతో వేదవేదార్థ పారగః
యోగమార్గాను సంధాయీ దేవతా హృదయం గమః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సాధకుడు సిద్ధికొరకు ఉపదేశార్థమై సద్గురువును ఆశ్రయించవలయును. గురువునకు ఈ లక్షణములుండవలయును.

ఉన్నతవంశమునందు జన్మించవలయును. లేదా తల్లిదండ్రులు శీలవంతులై యుండాలి. జితేంద్రియుడు - వేదశాస్త్రములు చదివినవాడు - పరోపకారి - కపటము లేనివాడు - యోగమార్గము తెలిసినవాడు - జపపూజాదికములు ఆచరించువాడు - దర్శనీయుడు - శాంతస్వభావుడు - వాక్సిద్ధి కలవాడు అయి ఉండవలయును.

## శిష్యలక్షణములు

శ్లో॥ శిష్యః కులీనః శుద్ధాత్మా పురుషార్థ పరాయణః
అధీత వేదః కుశలో దూరముక్త మనోభవః ।
హితైషీ ప్రాణినాం నిత్య మాస్తికః త్యక్తనాస్తికః
స్వధర్మ నిరతో భక్త్యా పితృమాతృహితోద్యతః ।
వాంగ్మనఃకాయ వసుభిః గురుశుశ్రూషణే రతః

త్యక్తాభిమానో గురుషు జాతి విద్యాధనాదిభిః ।
గుర్వాజ్ఞా పాలనార్థంహి ప్రాణవ్యయ రతోద్యతః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శిష్యుడు కూడా మంచి లక్షణములు కలవాడై యుండవలయును. మంచి వంశములో పుట్టినవాడు - వేదములు చదివినవాడు - కామవికారములు, నాస్తికబుద్ధి లేనివాడు - తల్లిదండ్రులను సేవించువాడు - మనోవాక్ కాయములచే, ధనముచే గురుసేవ చేయుటకు ఇష్టపడువాడు, తనయొక్క జాతి - విద్య - ధనములచే గర్వములేనివాడు, గురువాక్యము పాటించుటకు తన ప్రాణములను సైతము అర్పించుటకు సిద్ధపడువాడు, అయి ఉండవలెను.

## శిష్య పరీక్షాకాలము

శ్లో॥ మంత్రపూజా రహస్యాని యోగోపయతి సర్వదా
త్రికాలం యో నమస్కుర్యాత్ ఆమాచార తత్వవిత్ ।
ఏకాబ్దేన భవేత్ యోగ్యో బ్రాహ్మణోఽబ్దద్వయాన్నృపః ।
సశుశ్రూషుః పరిగ్రాహ్యో దీక్షాయాగవ్రతాదిషు

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శిష్యునిగా స్వీకరించుటకు ముందు గురువు అతనిని పరీక్షించవలయును. తంత్రశాస్త్రప్రకారము శిష్యుడు మూడువేళల గురువందనము చేయవలయును.

బ్రాహ్మణుని శిష్యునిగా స్వీకరించుటకు అతని శీలము పరిశీలించుటకు, స్వభావము తెలుసుకొనుటకు ఒక సంవత్సరకాలము అవధిగా నిర్ణయించబడినది.

క్షత్రియుని 2 సం॥ల పిమ్మట, వైశ్యుని 3 సం॥ల పిమ్మట, శూద్రుని 4 సం॥లు పరిశీలించిన పిమ్మట దీక్ష - యాగ - వ్రతాదులకు అర్హుడగును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*ద్వితీయ పటలః సమాప్తః*

❖❖❖

# అథ తృతీయః పటలః

## దీక్షాంగ నిర్ణయం

శ్లో॥ తతో వక్ష్యామి దీక్షాంగం వాస్తుయాగపురస్సరం
కృతేనయేన మంత్రజ్ఞో దీక్షాయాః ఫలమశ్నుతే ।
రాక్షసం వాస్తునామానం హత్వాఽధిష్ఠాయ తత్తనుం
స్థితాస్త్రి పంచాశద్దేవాస్తేభ్యః పూర్వం బలింహరేత్ ।
బలిమండల మేతేషాం యధావదభిదీయతే
పూర్వాపరాయతం సూత్రం విన్యసేదుక్త మానతః ।
తన్మధ్యం కించిదాలంబ్య మత్స్యౌద్వౌ పరితోలిఖేత్
తయోర్మధ్యే స్థితం సూత్రం విన్యసేద్దక్షిణోత్తరమ్ ।
ద్వాభ్యాంద్వాభ్యాం తథాఽగ్రాభ్యా కోణేషుమకరాన్ లిఖేత్
మత్స్యమధ్యే స్థితాగ్రాణి తత్రసూత్రాణి పాతయేత్ ।
చతురస్రం భవేత్తత్ర చతుః కోష్ఠ సమన్వితం
తత్పునర్విభజేన్మంత్రీ చతుఃషష్ఠి పదం యధా ॥

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు దీక్షాంగవిధి, వాస్తు యాగ సహితముగా చెప్పబడుచున్నది. దీక్షా విధానములో వాస్తు అనే రాక్షసునియొక్క శరీరమును 53మంది దేవతలు ఆక్రమించియున్నారు. ముందుగా వారికి బలిదానం సమర్పించాలి.

అందు నిమిత్తమై 64 గడులతో వాస్తు బలిమండపం లిఖించాలి. ముందుగా తూర్పునుండి పడమరకు వాస్తు శాస్త్రమందు చెప్పబడిన ప్రమాణములతో రేఖ లిఖించాలి. ఆ రేఖ మధ్య భాగమునుండి ఉత్తర – దక్షిణములుగా తాడులాగి రెండు రెండు చిహ్నములు ఏర్పరచాలి.

ఆ మధ్యలో నున్న సూత్రమును దక్షిణము నుండి ఉత్తరమునకు కలపాలి. తూర్పున ఉన్న చిహ్నమునుండి ఈశాన్యం – ఆగ్నేయం దిశగా ఒక్కొక్క చిహ్నముంచాలి.

మరల ఆ సూత్రమునుండి ఉత్తరముగా నున్న చిహ్నమందు ఈశాన్య – వాయువ్య దిశలలో చిహ్నములుంచాలి.

అదేవిధముగా పశ్చిమరేఖకు వాయవ్యనైఋతి దిశలందు ఒక్కొక్క చిహ్నముంచాలి. ఇలా చేయడంవలన వాయవ్యమందు ఒక రేఖ ఏర్పడుతుంది. మరల దక్షిణ రేఖలో నైరుతి, ఆగ్నేయమందు చిహ్నము లుంచాలి.

అలా రెంటినీ కలిపితే చతుష్కోణమేర్పడుతుంది. దానిమధ్యలో రెండువైపులా ఒక సమానరేఖను గీసినచో **8** గడులు ఏర్పడతాయి. ఇలా **64** గడలు ఏర్పడతాయి.

దీక్ష గ్రహించే శుభసమయాలను గూర్చి

"మంత్రసార సంగ్రహ"మునందిట్లున్నది.

☞ **ద్వితీయా పంచమీ వాపి షష్ఠీ వాపి విశేషతః।**
**ద్వాదశ్యామపి కర్తవ్యం త్రయోదశ్యామథాపివా ॥**

–"కాలోత్త రాగమం" నందిట్లున్నది.

☞ **భూతికామైః సితేముక్తికామైస్తు కృష్ణపక్షకే।**

"రుద్రయామళము"నందిట్లున్నది

☞ **సత్తీర్థేకర్కమవిధుగ్రాసే తంతు దామన పర్వణోః।**
**మంత్రదీక్షాం ప్రకుర్వాణో మాసర్క్షాదీన్ నశోధయేత్ ॥**

"సిద్ధాంతశేఖరము" నందు ఇట్లున్నది.

☞ **విషువేఽ ప్యయనద్వంద్వే ఆషాఢ్యాం (సంక్రాంత్యాం) దమనోత్సవే।**
**దీక్షాకార్యాతు కాలేషు పవిత్రారోప కర్మణి ॥**

శ్లో॥ ఈశానాద్రాక్షసోయావత్ యావదగ్నేః ప్రభంజనః ।
ఏవంసూత్రద్వయం దద్యాత్ కర్ణ సూత్రం సమాహితః ।
బ్రహ్మాణం పూజయేదాదౌ మధ్యే కోష్ఠ చతుష్టయే
దిక్ చతుష్కేషు పూర్వాది యజేదార్యమనంతరమ్ ।
వివస్వంతం తతోమిత్రం మహీధరమతః పరం
కోణార్ధకోష్ఠ ద్వంద్వేషు వహ్న్యాది పరితః పునః ।
సావిత్రం సవితారంచ శక్రమింద్ర జయంపునః
రుద్రం రుద్రజయం విద్వానాపం చాప్యపవత్సకమ్ ।

..........................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు ఈశాన్యమునుండి నైఋతివరకు ఒకరేఖ, ఆగ్నేయమునుండి వాయవ్యకోణమునకు ఒకరేఖ లిఖించినచో చతురస్రములో రెండు రెండు కోణములు కలియుటవలన, కర్ణసూత్ర మేర్పడును.

మధ్యకోష్ఠచతుష్టయమందు "ఓం నమో బ్రహ్మణే" అని బ్రహ్మను పూజించాలి. దీనికిముందు యోగపీఠపూజను ఈ మంత్రంతో చేయాలి.

☞ **సర్వజ్ఞాన క్రియావ్యక్త కమలాసనాయ యోగపీఠాయ నమః ॥**

అటు పిమ్మట తూర్పుదిశన ఆర్య - దక్షిణదిశన వివస్వాన్ - పశ్చిమదిశన మిత్ర - ఉత్తరదిశన మహీధరులను అర్చించాలి.

పిమ్మట ఆగ్నేయకోణమునందు కర్ణరేఖ లిఖించిన సగభాగంపైన గల గడియందు సావిత్రిని, కిందగడియందు సవితను, నైరుతిలో పైన - క్రింద క్రమముగా శక్ర ఇంద్రజయులను, వాయవ్యకోణమునందు రుద్ర - రుద్రజయులను, ఈశానకోణమునందు ఆపః - ఆపవత్సలను పూజించాలి.

మరల కర్ణసూత్రముయొక్క రెండుగడులయందు పైన, క్రింద, ఆర్యశర్వ – గుహ – అర్యమా – జృంభక – పిలిపిచ్ఛక – చరకీ – విదారీ – పూతలను పూజించాలి.

పూర్వదిశ కోష్టములందు ఈశాన – పర్జన్య – జయంత – శక్ర – భాస్కర – సత్య – వృష – అంతరిక్షములను,

దక్షిణదిశయందు అగ్ని – పూషా – వితథ – యమ – గృహరక్షక – గంధర్వ – భృంగరాజ – మృగములను,

పశ్చిమదిశలో నిరృతి – దౌవారిక – సుగ్రీవ – వరుణ – పుష్పదంత – అసుర – శేష – రోగ దేవతలను,

ఉత్తరదిశలో వాయు – నాగ – ముఖ్య – సోమ – భల్లాట – అర్గళ – దితి – అందితులను పూజించాలి.

వీరందరికీ పాయసాన్నబలి సమర్పించాలి.

64 గడులూ పంచరంగులతో వర్ణశోభితం చేయాలి.

## మండప నిర్మాణవిధి

శ్లో॥ నక్షత్ర రాశి వారాణామనుకూలే శుభేஉహని
తతోభూమితలే శుద్ధే తుషాంగార వివర్జితే ।
పుణ్యాహం వాచయిత్వాతు మండపం రచయేచ్ఛుభమ్ ।
పంచభిః సప్తభిర్వాస్తైర్నవభిర్వా మతాంతరం
షోడశస్తంభ సంయుక్తం చత్వారస్తే షుమధ్యగాః ।
అష్టహస్తసముచ్ఛ్రాయాః సంస్థాప్యాద్వాదశాஉభితః
పంచహస్త ప్రమాణాస్తే విచ్ఛిద్రా ఋజువఃశుభాః ।
తత్పంచమాంశం నిఖనేత్ మేదిన్యాం తంత్రవిత్తమః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శోభముహూర్తమున మండప నిర్మాణము నిర్మించుటకు ప్రయత్నించాలి. ఆ భూమి పరిశుభ్రమై పొట్టు – బొగ్గులు లేనిదై ఉండాలి. పుణ్యాహవాచనం చేసి మొదలుపెట్టాలి.

ఆ మండపం 5 - 7 - లేదా 9 హస్తముల ప్రమాణముండాలి. మండపమునందు 16 స్తంభములుండాలి. మధ్యలో 4 స్తంభములు రావాలి, మిగిలిన 12 నాలుగు దిశలందూ రావాలి. మండపం ఎత్తు 8 హస్తముల ప్రమాణముండాలి.

లేదా అన్ని స్తంభములూ 5 హస్తముల ప్రమాణము కలిగి యుండాలి. ఛిద్రములు, వంకరలు ఉండరాదు.

శుభముహూర్తము గూర్చి

**"రాజమార్తాండము"** అనే గ్రంథమునందిట్లున్నది.

☞ **ఆదిత్యద్వయ రోహిణీ మృగశిరో హస్తాధనీష్ఠోత్తరా**
**పుష్యావిష్ణునుఘూను రాధ పవనైః శుద్ధైః సుతారాన్వితైః।**
**సౌమ్యానాం దివసేషు పాపరహితే యోగేవిరక్తే తిథౌ**
**విష్టిత్యక్తదినే వదంతిమున యో వేశ్మాది కార్యం శుభమ్।**

**"బోధాయనుడు"** ఇట్లు పేర్కొనెను.

☞ **పుణ్యాహం వాక్యం స్వస్తి బుద్ధిమిత్యోం కారపూర్వం**
**త్రిస్త్రిరేకైకా మాశిషం వాచయిత్వా॥**

**"క్రియాసారము"**నందు కూడా ఇట్లున్నది.

☞ **కృత్వాభూమిం సమాంతత్ర వృత్తం హస్తమితం సమం।**
**ద్వాదశాంగుళ మానోచ్ఛం శంకుం ఖదిర నిర్మితమ్॥**
**అలాఖే యజ్ఞవార్క్షంవా తత్ర సంస్థాపయేత్ సుధీః**

# శూలం - తోరణం - వేది

శ్లో॥ నారికేళ దళైర్వంశై చ్ఛాదయేత్ తత్సమంతతః ।
ద్వారేషు తోరణానిస్యుః క్రమాత్ క్షీరమహీరుకమ్ ॥
స్తంభోచ్ఛ్రాయః స్మృతస్తేషాం సప్తహస్తైః పృథక్ పృథక్ ।
దశాంగుళ ప్రమాణేన తత్పరీణాహ ~~ఈ~~రితః ॥
తిర్యక్ ఫలక మానంస్యాత్ స్తంభానామర్ధ మానతః
శూలాని కల్పయే న్మధ్యే తోరణే హస్తమానతః ॥
దిక్షు ధ్వజాన్ని బధ్నీయాల్లోకపాల సమప్రభాన్
వితాన దర్భమాలాద్యైరలంకుర్వీత మండపమ్ ॥
తత్త్రిభాగమితే క్షేత్రేఽ రత్రిమాత్ర సమన్వితాం
చతురస్రాం తతోవేదీం మండలాయ ప్రకల్పయేత్ ॥
ప్రాగేవ దీక్షా దివసాద్ సప్తభిర్విధి వద్దినైః
సర్వమంగళ సంపత్యై విదధ్యాదంకురార్పణమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - స్తంభముల ఎత్తులో అయిదవ వంతు భూమిలో పునాది తీయాలి. మండపం నిర్మాణంలో శంకుస్థాపనకు కొబ్బరాకులు వెదురు ఆకులతో తోరణాలు కట్టాలి. నాలుగు వైపులా అశ్వత్థా - మేడి - ప్లక్ష - మర్రి ఆకులతోగాని క్షీరమహీరుకం ఆకులతో గాని తోరణం కట్టాలి.

స్తంభము ఎత్తు 7 హస్తములు ప్రశస్తము, మధ్యమం 6 - కనిష్టం - 5, స్తంభం వెడల్పు 10 అంగుళములు. సింహద్వారం స్తంభం ఎత్తులో సగం ఉండాలి. తోరణస్తంభమునకు మధ్యలో శూలం 1 హస్తమాత్రం వుండాలి.

ఎనిమిది దిశలందూ లోకపాలకుల రంగులననుసరించి, ధ్వజములు నిలపాలి. మండపంలో మధ్యభాగంలో వేదిక నిర్మించాలి.

దీక్షతీసుకునే దినమునకు 7 రోజులముందు విధిపూర్వకముగా అంకుశారోపణ (రాటపాతుట) చేయాలి.

## మండల నిర్మాణం

శ్లో॥ మండపస్యోత్తరేభాగే శాలాం పూర్వ పరాయతాం ।
గూఢాం కుర్యాత్ తతస్తస్యాం మండలం రచయేత్సుధీః ॥
పంచహస్తప్రమాణాని పంచసూత్రాణి పాతయేత్
పూర్వాపరాయతాన్యేషాం అంతరం ద్వాదశాంగుళమ్ ॥
దక్షిణోత్తర సూత్రాణి తద్వదేకాదశార్పయేత్
పదానితత్రజాయంతే చత్వారింశత్ ప్రమార్జయేత్ ।
పంక్త్యాం వీథీశ్చత స్రోంతశ్చతుష్కోభయ పార్శ్వయోః
వీథ్యా ద్వేచ చతుష్కోష్ఠ త్రయ మంత్రాఽవశిష్యతే ।
పదాని రంజయేత్తాని శ్వేత పీతారుణాసితైః
రజోభిః శ్యామలేనాఽథ వీథీరాపూరయేత్సుధీః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మండపంలో ఉత్తరదిశలో 10 × 5 కొలతలతో దక్షిణముఖం ఉండేలా ఒకశాల నిర్మించాలి. దానికి కిటికీలు ఉండరాదు. అందు మండల నిర్మాణం ఇలా చేయాలి.

ఆ శాల మధ్యభాగంలో తూర్పునుండి పడమరకు 5 హస్తముల సూత్రమునిచ్చి దానియందు దక్షిణమునుండి ఉత్తరమునకు 12 అంగుళముల చొప్పున రెండు రెండు సూత్రముల ఆధారముగా సూత్రములు (దారములు) కట్టాలి.

దానికి బయట నాలుగు ప్రక్కలా 4 వీధులు నిర్మించాలి. తూర్పు నుండి 4 గడుల 1 వీధి, దక్షిణమునుండి 8 గడుల ఒకవీధి, పడమర నుండి 4 గడుల ఒకవీధి, ఉత్తరమునుండి 8 కోణముల 1 వీధి మార్జనం చేయాలి.

మరల మధ్యనున్న నాలుగు కోష్టముల రెండు ప్రక్కలందూ రెండు రెండు గడుల వీధులను మార్జనం చేయాలి. ఇలా చేయుటవలన మూడు మూడు చతుష్కోష్టకములు, అనగా 12 గడులు మిగులును.

వాయవ్య కోణమందు నాలుగు గడులూ తెలుపురంగుతోనూ, ఆగ్నేయంలో 4 గడులు పసుపు, నైఋతి - ఎరుపు, ఈశాన్యం - నలుపు రంగుతోనూ అలంకరించాలి.

## అంకురార్పణ పాత్ర నియమం

శ్లో॥ పాత్రాణి త్రివిధాన్యాహుః అంకురార్పణ కర్మసు
పాలికాః పంచముఖ్యశ్చ శరావాంశ్చ చతుఃక్రమాత్ ।
ప్రోక్తాఃస్యుః సర్వతంత్రజ్ఞైః హరిబ్రహ్మశివాత్మకాః
ఏషాముచ్ఛ్రాయ ఉన్నేయః షోడశద్వాదశాష్టభిః ।
అంగుళైః క్రమశస్తాని శుభాన్యావేష్ట్య తంతునా
ప్రక్షాల్య దేశికస్తేషు ఏదేష్వాహిత శాలిషు ।
సగంధ దర్భకూర్చేషు పశ్చిమాది నివేశయేత్
కరీషవాలుకా మృద్భిస్తాని పాత్రాణి పూరయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అంకురార్పణ పాత్రలు మూడు విధములు. 1. పాలికలు 2. పంచముఖులు 3. మూకుడులు. ఇవి ప్రతీదీ నాలుగేసి ఉండాలి. ఈ మూడూ వరుసగా విష్ణు - బ్రహ్మ - శివ స్వరూపములు. వీటి కొలతలు 16 - 12 - 8 అంగుళములు.

ఆచార్యుడు ముందుగా వీటిని శుభ్రం చేయాలి. పిమ్మట దారంతో 3సార్లు వాటిపై చుట్టాలి. గంధము - కుశలు అందుంచి, పశ్చిమాది క్రమముగా వాటిని బియ్యంపై స్థాపించాలి. (కొత్తతువ్వాలుపై బియ్యం ముందుగా పోసుకోవాలి).

పశ్చిమంలో 4 గడులందు 4 పాలికలు, మధ్య నాలుగు కోష్ఠములందు 4 పంచముఖులు, తూర్పున నాలుగు కోష్ఠములందు 4 మూకుడులూ ఉంచాలి. పిమ్మట వాటియందు ఎండిన ఆవుపేడపొడి + ఇసుక + మట్టి మిశ్రమం అన్నింటియందు పోసి వాటిని నింపాలి.

**"సిద్ధాంతశేఖర"** గ్రంథమందు పాత్రల కొలతలు ప్రత్యేకించి నియమ మవసరంలేదని ఇలా చెప్పబడినది.

☞ **యధాసంభవ మానంవా పాలికాది సమాచరేత్ ॥**

శ్లో॥ సుధాబీజేన బీజాని దుగ్ధైః ప్రక్షాల్యతంత్రవిత్
మూలమంత్రాభిజప్తాని పంచఘోషపురః సరమ్ ।
ఆశీర్వాగ్భిః ద్విజాతీనాం మంగళాచారపూర్వకం
నిర్యపేత్తేషు పాత్రేషు దేశికోయతమానసః ।
శాలి శ్యామాఢకీ ముద్గతిలనిష్పావ సర్షపాః
కులత్థకంగుమాషాశ్చ బీజాన్యం కురకర్మణి ।
హరిద్రాద్భిః సమభ్యుక్ష్య వస్త్రైరాచ్ఛాద్యదేశికః
బలిత్రివిధ పాత్రాణాం దిక్షుపూర్వాదితో హరేత్ ।
ప్రణవాద్యైర్నమోఽంతైశ్చరాత్రౌ రాత్రీశనామభిః
భూతాని పిత రోయక్షా నాగాబ్రహ్మశివో హరిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఆచార్యుడు 'వం' బీజ ముచ్చరించుచూ, పంచఘోషములు (పటహ - ఢక్క - మృదంగ - ముఖ

వాద్య - శంఖములు) మంగళ ధ్వని చేయుచుండగా బ్రాహ్మణుల ఆశీర్వచనములతో వాటియందు ఈ క్రింది విత్తములుంచాలి.

శాలి ధాన్యం (హేమంత ఋతువులో వచ్చు ధాన్య విశేషము) చామలు - కందులు - పెసలు - మినుములు - తిలలు - ఆవాలు - ఉలవలు - రాజమాసషములు ఆపాలికలందు పోసి, పసుపుగుడ్డతో వాటిని ఆచ్ఛాదన చేసి, పూర్వాదిక్రమముగా బలిదానము చేయాలి.

**బలిమంత్రము :-**

☞ **ఓం భూతేభ్యో నమః గంధ - పుష్ప - ధూప - దీప - నైవేద్య - తాంబూల సహితం బలిం గృహ్ణంతు స్వాహా ॥**

రెండవరోజు రాత్రి "భూతేభ్యో నమః" అను స్థానములో పితృభ్యో నమః అని చేర్చాలి.

## బలిద్రవ్యములు

శ్లో॥ సప్తానామపి రాత్రీణాం దేవతాః సముదీరితాః
భూతేభ్య స్యుః లాజతిల హరిద్రా దధి సక్తవః ।
సాన్నాః పితృభ్యః సతిలాస్తండులాః పరికీర్తితాః
కరంభలాజా యక్షేభ్యో నారికేలోదకాన్వితాః ।
సక్తు పిష్టంచ నాగేభ్యో బ్రహ్మణే పంకజాక్షతం
సాపూపమన్నం శర్వాయ విష్ణవే తు గుడౌదనమ్ ।
తతో లోకేశ్వరేభ్యోఽపి వితరేద్విధివద్బలిం
దీక్షాయామభిషేకేషు నవవేశ్మప్రవేశనే ।
ఉత్సవేషు చ సంపత్త్యై విదధ్యాదంకురార్పణమ్
ప్రాకప్రోక్తే మండపే విద్వాన్ వేదికాయా బహిస్త్రిధా ।

క్షేత్రం విభజ్య మధ్యాంశే పూర్వాది పరికల్పయేత్
అష్టాస్వాశాసు కుండాని రమ్యాకారాణ్యనుక్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఏడురోజులూ రాత్రులందు 1. భూత, 2. పితర, 3. యక్ష, 4. నాగ, 5. బ్రహ్మ, 6. శివ, 7. హరులకు ఈ క్రింది నైవేద్యములు సమర్పించవలయును.

**ప్రథమరాత్రి** - పేలాలు – తిలలు – పసుపు – పెరుగు – సత్తుపిండి – అన్నము.

**ద్వితీయరాత్రి** - తిలసహిత అక్షత బియ్యము

**తృతీయరాత్రి** - పెరుగు కలిపిన పిండి – పేలాలు

**చతుర్థరాత్రి** - కొబ్బరినీరుతో కలిపిన సత్తుపిండి.

**పంచమరాత్రి** - కమలములు – అక్షతలు

**షష్ఠరాత్రి** - అన్నము – అప్పాలు

**సప్తమరాత్రి** - బెల్లపు అన్నం

ఇటువంటి అంకురార్పణవిధి, పాలికలనుంచి వారంరోజులు బలి సమర్పించుట, మంత్రదీక్ష గ్రహించు సమయమునందే గాక, రాజ్య అభిషేకమునందు, గృహప్రవేశమునందు, వివాహమునందు, ఉత్సవములందు ఆచరించినచో సంపత్ వృద్ధి కలుగును. పిమ్మట వేదిక బయట క్షేత్రమును 3 భాగములు చేసి, మధ్య భాగమందు తూర్పు మొదలుగా 8 దిశలందు 8 కుండములు నిర్మించాలి.

**1. చతురస్ర కుండం, 2.యోని, 3. అర్థచంద్ర, 4. త్ర్యస్ర, 5. సువర్తుల, 6. షడస్ర, 7. పంకజాకార, 8. అష్టాస్ర కుండములు నిర్మించాలి. దీనినిగూర్చి**

**"నారదీయము"** నందిట్లున్నది.

☞ **కుండ వేద్యంతరం చైవ సపాదకరసమ్మితం**

**అత్రపాదశబ్దః కించి ధికోప లక్షకః ।**

**తేన మధ్యమోత్తమ మండపవిషయత్వమస్య ॥**

**"వశిష్ఠ సంహిత"** యందిట్లున్నది.

☞ **త్రయోదశాంగుళం త్యక్త్వా వేదికాయాశ్చతుర్దిశం ।**

**కుండాని స్వాగమోక్తాని విదధ్యాద్ విధివద్‌బుధః ॥**

## 1. చతురస్రకుండ ప్రమాణం, నిర్మాణం

శ్లో॥ ఆచార్యకుండం మధ్యేస్యాత్ గౌరీపతి మహేంద్రయోః ।
హస్తమాన మితాంభూమిం పూర్వవత్ పరికల్పయేత్ ।
సమంతాత్ కుండమేతత్ స్యాచ్చతురస్రం శుభావహం
చతుర్వింశత్యంగుళాఢ్యం హస్తంతంత్ర విదోవిదుః ।
కర్తుః దక్షిణ హస్తస్య మధ్యమాంగుళి పర్వణః
మధ్యస్య దీర్ఘమానేన మానాంగుళముదీరితమ్ ।
యవానామష్టభిఃక్లుప్తం మానాంగుళముదీరితం
చతురస్రీకృతం క్షేత్రం పచధావిభజేత్ సుధీః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - తూర్పు - ఈశాన్యముల మధ్య భాగమందు ఆచార్యకుండం తొమ్మిదవది ఏర్పరచవలయును. ఇది వృత్తాకారముగాగాని, చతురస్రాకారముగా గాని నిర్మించవలయును. ఇది ఒక హస్తము పొడవు, ఒక హస్తము వెడల్పు ఉండవలెను.

దీక్ష గ్రహించు శిష్యుని కుడిచేయి, మధ్యమవేలి యొక్క మధ్యమవేలి యొక్క మధ్యమపర్వంతో సమానంగా ఒక అంగుళంగా గ్రహించి 24 అంగుళ ప్రమాణముగా నిర్మించాలి.

8 యవల గింజ ప్రమాణము ఒక అంగుళముగా శాస్త్రకారులు నిర్ధారించియున్నారు.



## 2. యోనికుండ నిర్మాణవిధి

శ్లో॥ న్యసేత్ పురస్తాదేకాంశం కోణార్ధార్ధ ప్రమాణతః
భ్రమయేత్ కోణమానేన తధాన్యదపి మంత్రవిత్ ।
సూత్రయుగ్మం తతో దద్యాత్ కుండం యోనినిభంభవేత్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఒక హస్తప్రమాణం చతురస్ర మేర్పరచి దానిని 5 భాగములు చేసి (5వ భాగము 4 అంగుళముల 61/2 యవలు సుమారుగా నుండును) ఉత్తరమునుండి దక్షిణమునకు వెళ్ళు మధ్యరేఖను ఉత్తరదిశగా 5వ అంశం పెంచాలి. ఉత్తరంవైపు పెరిగిన రేఖను తూర్పు మరియు పశ్చిమరేఖలతో కలపాలి.

ఇదేవిధముగా తూర్పు – దక్షిణరేఖలను, పశ్చిమ – దక్షిణరేఖలను, పశ్చిమ – దక్షిణరేఖలను కలపాలి. మరల తూర్పుదక్షిణ రేఖయొక్క అర్ధభాగముతో, మరియు పశ్చిమదక్షిణరేఖ అర్ధభాగముతో అర్ధవృత్తము నిర్మించాలి. అపుడు అది యోని ఆకారములో కుండమేర్పడును.



**'లీలావతి'**యందు చతురస్రకుండ క్షేత్రఫలం గూర్చి అంగుళ విషయములో ఇట్లున్నది.

☞ **సమశృతౌ తుల్యచతుర్భుజే చ తథాయతే తద్భుజ కోటిఘాతః।**

**'త్రిశతి'** యందు శ్రీధరాచార్యులు

☞ **సమలంబక చతురస్రే త్ర్యస్రిక్షేత్రే చ జాయతే కరణం।**
**భూవదన సమాసార్థం మధ్యమ లంబేన సంగుణయేత్॥**

## 3. అర్ధచంద్రకుండం

శ్లో॥ చతురస్రీకృతంక్షేత్రం దశధా విభజేత్పునః ।
ఏకమేకం త్యజేదంశ మధ ఊర్ధ్వంచ తంత్రవిత్ ॥
జ్యాసూత్రం పాతయేదగ్రే తన్మానాత్ భ్రమయేత్తతః
అర్ధచంద్రనిభం కుండం రమణీయ మిదం భవేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ముందుగా చతురస్రీకృతము చేసిన క్షేత్రమును పదిభాగములు చేయాలి. పైన ఒక భాగము, క్రింద ఒక భాగము వదిలేయాలి. క్రింద నుంచి పైవరకు అర్ధవృత్తము నిర్మించాలి రెండుజ్యాలను కలపాలి. అపుడు అర్ధచంద్రకుండమేర్పడును. ఇది ఎంతో మనోహరముగా నుండును.



## 4. త్ర్యస్ర కుండం

శ్లో॥ చతుర్ధా భేదితేక్షేత్రే న్యసేదుభయ పార్శ్వయోః
ఏకైకమంశం తన్మానాదగ్రతో లాంఛయేత్తతః ।
సూత్రద్వయం తతఃకుర్యాత్ త్ర్యస్రం కుండముదాహృతమ్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ముందుగా చతురస్ర క్షేత్రమును నిర్మించాలి. మధ్యరేఖనుండి రెండువైపులా నాలుగుభాగాలు చేయాలి. పిమ్మట మధ్యలోనున్న లంబరేఖను తూర్పువైపునకు నాల్గవవంతు పెంచాలి. ఆధారరేఖను కూడా రెండువైపులా చతుర్థాంశము పెంచాలి మరల లంబరేఖనుండి పెరిగినరేఖను రెండువైపులా పెరిగిన క్షేత్రముతో కలపాలి. ఇపుడు త్ర్యస్యకుండమేర్పడును.



## 5. వృత్తకుండం

శ్లో॥ అష్టాదశాంశే క్షేత్రేచ న్యసేదేకం బహిర్ బుధః ।
భ్రమయేత్తేన మానేన వృత్తంకుండమనుత్తమమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చతురస్రక్షేత్రమును 18 భాగములు చేయాలి. మధ్యనుండి తూర్పు - పడమరలు, ఉత్తర - దక్షిణరేఖ లందు ఒక్కొక్క అంశమును పెంచాలి. పిమ్మట వ్యాసముయొక్క కేంద్ర బిందువునుండి నాలుగువైపులా వృత్తం లిఖించాలి. అపుడు వృత్తకుండ మేర్పడును.



## 6. షడస్ర కుండం

శ్లో॥ అష్టధా విభజేత్ క్షేత్రం మధ్య సూత్రస్య పార్శ్వయోః ।
భాగంన్యసేదేకమేకం భాగేనాఽనేన మధ్యతః ॥
కుర్యాత్ పార్శ్వద్వయే మత్స్య చతుష్కంతంత్రవిత్తమః
సూత్ర షట్కం తతో దద్యాత్ షడస్రంకుండముత్తమమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ముందుగా చతురస్ర క్షేత్రము యొక్క మధ్యనుండి రెండువైపుల రేఖను 8 భాగములు చేయాలి. పిమ్మట మధ్యన ఉత్తర -దక్షిణ, మరియు తూర్పు - పడమర రేఖలను అష్టమాంశము పెంచాలి. ఆ పెరిగిన రేఖలచే ఏర్పడినదానిని, కేంద్రము నుండి ఒక వృత్తము నిర్మించాలి.

ఆ పెరిగిన రేఖకు రెండువైపుల 4 బిందువులుంచి 6 సూత్రములను కలిపినచో షడస్రకుండమేర్పడును.



## 7. పద్మకుండము

శ్లో॥ చతురస్రీకృతం క్షేత్రం నిభజ్యాష్ట దశాంశతః ।
ఏకంభాగం బహిర్న్యస్య భ్రామయేత్తేన వర్తులమ్ ॥
వృత్తాని కర్ణికాదీనాం బహిస్త్రీణి ప్రకల్పయేత్
పద్మకుండమిదం ప్రోక్తం విలోచనమనోహరమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చతురస్ర క్షేత్రమును 18 భాగములు చేయాలి. మరల ఒక భాగము బయటకు విడిచి నాలుగు వైపులా వృత్తము లిఖించాలి. పిమ్మట కర్ణిక బయట 3 వృత్తములు లిఖించాలి. అపుడు అత్యంత మనోహరమైన పద్మకుండ మేర్పడును.



## 8. అష్టాస్ర కుండము

శ్లో॥ పూర్వోక్తం విభజేత్ క్షేత్రం చతుర్వింశతి భాగతః
ఏకంభాగం బహిర్ న్యస్య చతురస్రం ప్రకల్పయేత్ ॥

అంతస్థ చతురస్రస్య కోణార్ధార్ధ ప్రమాణతః
బాహ్యస్య చతురస్ర్య కోణాభ్యాం పరిలాంఛయేత్ ॥
దిశంప్రతి యధాన్యాయ మష్టసూత్రాణి పాతయేత్
అష్టాస్రం కుండమేతద్ధి తంత్రవిద్భిరుదాహృతమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – 18 అంగుళముల చతురస్రమును 24 భాగములు చేయాలి. పిమ్మట నాలుగువైపుల ఒక భాగము బయటకు విడచి, లోపల చతురస్ర కోణమును సగభాగము బయటి చతురస్ర కోణముతో కలపాలి. 8 దిశలను 8 సూత్రములతో జోడించిన అష్టాస్రకుండ మేర్పడును.

"**ఆమ్నాయ రహస్య**" మందిట్లున్నది.

☞ **కుండాని చతురస్రాణి వృత్తానామాకృతానిచ।**

అని రెండువిధములుగా చెప్పబడియున్నది.

"**జ్ఞానరత్నావళి**"యందు

**దిక్షు వేదాస్త్రవృత్తాని పంచమంత్రీశగోచరమ్ ॥**

అన్నచోట వృత్తశబ్దముచే వృత్తార – చంద్ర – పద్మములు వివక్షితములగుచున్నవి.



# హోమకుండము లోతు, మేఖలా లక్షణములు

శ్లో॥ యావాన్ కుండస్య విస్తారః ఖననంతావదీరితం ।
కుండానాంయాదృ శం రూపం మేఖలానాం చ తాదృశమ్॥
కుండానాం మేఖలాస్త్రిస్రో ముష్టి మాత్రే తు తాః క్రమాత్ ।
ఉత్సేధాయామతో జ్ఞేయా ద్వ్యేకార్ధాంగుళ సమ్మితాః
అరత్నిమాత్రే కుండేస్యు స్తాస్త్రి ద్వ్యేకాంగుళాత్మికాః ॥
ఏకహస్తమితే కుండే వాదాగ్ని నయనాంగుళాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కుండముయొక్క విస్తారము ననుసరించి, దానిలోతు ఏర్పరచవలయును. హోమకుండమునకు చుట్టూ కట్టెడి ఆకారములను “మేఖల” అంటారు. చతురస్రకుండమునకు చతురస్ర మేఖల, యోనికుండమునకు యోనిరూపమేఖలలు ఏర్పరచాలి.

ప్రతీకుండమునకు మూడు మేఖలలు నిర్మించవలయును త్రిమేఖలా పక్షమునందు, దాని ఎత్తు వెడల్పులు పిడికిటి ప్రమాణము ఉండవలయును. మొదటి మేఖల రెండు అంగుళములు వెడల్పు ఉన్నచో రెండవమేఖల మొదటిమేఖల కంటే ఒక అంగుళము ఎత్తు - వెడల్పు ఎక్కువ వుండవలయును. మూడవ మేఖల మరొక అరఅంగుళము ఎక్కువగా యుండవలయును.

అరత్ని (మూర) ప్రమాణము కుండమున్నచో మూడు మేఖలలూ క్రమముగా 3 - 2- 1 అంగుళముల ఎత్తు, వెడల్పులుండవలయును.

దీనినిగూర్చి “లక్షణసంగ్రహము” నందిట్లున్నది.

☞ **ప్రథమా ద్వ్యంగుళాయామా ఉన్నతా సానవాంగులైః ।**
**మధ్యాతుత్ర్యంగుళాబాహ్యా తృతీయామ యమాంగులైః ॥**

“యోగినీహృదయ” మందిట్లున్నది.

☞ **మేఖలాః శృణు మే దేవి హస్తాదిషు విశేషతః ।**

**షట్ నాగార్కాంశ సంభాగైర్మితాః స్యుర్గోపితాః శుభాః ॥**

## నేమి లక్షణము

శ్లో॥ మేఖలానాం భవేదంతః పరితో నేమిరంగులాత్
ఏకహస్తస్య కుండస్య వర్ధయేత్ యత్ క్రమాత్ సుధీః ।
దశహస్తాంతమన్యేషాం అర్ధాంగుళ వశాత్ పృథక్ ॥
కుండే ద్విహస్తే తా జ్ఞేయా రసవేద గుణాంగుళాః
చతుర్హస్తే తాజ్ఞేయా రసవేదగుణాంగుళాః
చతుర్హస్తేషు కుండేషు వసుతర్క్యయుగాంగుళాః ।
కుండేరసకరే తాఃస్యు దశాష్టర్త్వంగుళాన్వితాః
వసుహస్తమితే కుండే భాను పంక్త్యష్టకాంగుళాః ।
దశహస్తమితే కుండే మనుభాను దశాంగుళాః
విస్తారోత్సేధతో జ్ఞేయామేఖలా సర్వతోబుధైః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మేఖల లోపల చుట్టూ వుండు కంఠభాగమునే "నేమి" అంటారు" కుండము 1 హస్తమున్నచో 1 అంగుళము లోపల చుట్టూ కంఠనిర్మాణము చేయవలయును.

10 హస్తముల కుండమునకు = అరఅంగుళము పెంచుతూ లోపల కంఠము నిర్మించవలయును.

2 హస్తముల కుండమునకు = మేఖలలు 4 × 3 ఉండాలి.
4 హస్తముల కుండమునకు = 8 × 6 × 4
6 హస్తముల కుండమునకు = 10 × 8 × 6
8 హస్తముల కుండమునకు = 12 × 10 × 8
10 హస్తముల కుండమునకు = 14 × 12 × 10
ఈ మేఖలలపై అశ్వత్థపత్రాకారములో "యోని" గుర్తు నిర్మించాలి.

శ్లో॥ ముష్ట్యరత్ని ఏక హస్తానాం కుండానాం యోనిరీరితా
షట్‌చతుర్ ద్విఅంగుళీయామ విస్తారోన్నత శాలినీ ॥
ఏకాంగుళం తు యోన్యగ్రం కుర్యాదీష దధో ముఖం
ఏకైకాంగులతో యోనిం కుండేష్యన్యేషు వర్ధయేత్ ॥
యవద్వయ క్రమేణైవ యోన్యగ్రమపి వర్ధయేత్
స్థలాదారభ్య నాళం స్యాత్ యోన్యామధ్యే సరంధ్రకమ్ ॥
నార్పయేత్ కుండకోణేషు యోనిం తాం తంత్రవిత్తమః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిడికిలి - అరత్ని - హస్త ప్రమాణముల కుండమునకు, క్రమముగా 6 - 4 - 2 అంగుళముల వెడల్పు, ఎత్తులతో యోని నిర్మించాలి. యోనియొక్క అగ్రభాగము ఒక అంగుళముండి దాని ముఖము కొద్దిగా క్రిందకు వంగి యుండాలి.

ఇదేవిధముగా ఇతర కుండములకు వాటి విస్తారముననుసరించి రెండు - రెండు యవగింజల ప్రమాణము అంగుళ యోని అగ్రభాగము పెంచుచూ నిర్మించ వలయును. యోని మధ్యస్థలమందు మేఖల నుండి, ఛిద్ర సహితనాళము నిర్మించాలి.

## నాభి ప్రమాణము

శ్లో॥ కుండానాం కల్పయేదంతర్నాభిమంబుజసన్నిభం ।
తత్తత్ కుండానురూపం వా మానమస్య నిగద్యతే ॥
ముష్ట్యరత్ని ఏకహస్తానాం నాభిరుత్ సేధతారతః
ద్విత్రివేదాంగుళోపేతా కుండేష్వన్యేషువర్ధయేత్ ॥
యవద్వయక్రమేణైవ నాభింపృథగుదారధీః
యోనికుండే యోనిమబ్జకుండే నాభింవివర్జయేత్ ॥
నాభిక్షేత్రంత్రిధాభిత్వా మధ్యేకుర్వీత కర్ణికాం

బహిరంశద్వయేనాష్టౌ పత్రాణి పరికల్పయేత్ ॥
ముష్టిమాత్ర మితం కుండం శతార్ధే సంప్రచక్షతే
శతహోమేఽరత్నిమాత్రం హస్తమాత్రం సహస్రకే ॥
ద్విహస్తమయుతే లక్షే చతుర్హస్తముదీరితం
దశలక్షే తు షడ్ హస్తం కోట్యామష్టకరం స్మృతమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - హోమకుండము బయట కమలాకారములో "నాభి"ని నిర్మించాలి. లేదా కుండాకారము ననుసరించి అదే ఆకారము నిర్మించవచ్చు. పిడికిలి - అరత్ని - హస్తప్రమాణము గల కుండమునకు నాభియొక్క ఎత్తు క్రమముగా 2 - 3 - 4 అంగుళములుండ వలెను.

ఇతర కుండములకు రెండు - రెండు యవగింజల ప్రమాణము పెంచుతూ నిర్మించవలెను. అయితే యోని రూపకుండమునకు, పద్మ కుండమునకు నాభి నిరిమంచనవసరము లేదు. నాభిక్షేత్రమును 3 భాగములు చేసి, మధ్యభాగమందు కర్ణికను ఏర్పరచవలెను. మిగిలిన రెండు భాగములందు అష్టకమలము నిర్మించాలి.

50 సార్లు హోమం చేయుటకు - పిడికిలి మాత్రం కుండం

| | | |
|---|---|---|
| 100 సార్లు చేయుటకు | = | అరత్ని కుండం |
| 1000 సార్లు చేయుటకు | = | హస్త ప్రమాణ హోమకుండం |
| 10,000 సార్లు చేయుటకు | = | 2 హస్త ప్రమాణములు |
| 1 లక్ష చేయుటకు | = | 4 హస్తములు |
| 10 లక్షలకు | = | 6 హస్తములు |
| 1 కోటి హోమమునకు | = | 8 హస్తముల కుండం నిర్మించాలి. |

# ప్రయోగ భేదం

శ్లో॥ సర్వసిద్ధికరంకుండం చతురస్రముదాహృతం
పుత్రప్రదం యోనికుండ మర్ధేంద్వాభం శుభప్రదమ్ ॥
శతృక్షయకరం త్ర్యస్రం వర్తులం శాంతికర్మణి
ఛేదమారణయోః కుండం షడస్రం పద్మసన్నిభమ్ ॥
వృష్టిదం రోగశమనం కుండమష్టాస్ర మీరితం
విప్రాణాం చతురస్రం స్యాద్రాజ్ఞాం వర్తుల మిష్యతే ॥
వైశ్యానామర్ధ చంద్రాభం శూద్రాణాంత్ర్యస్రమీరితం ।
చతురస్రంతు సర్వేషాం కేచిదిచ్ఛంతి తాంత్రికాః ॥
ప్రాచ్యాం శిరః సమాఖ్యాతం బాహూ దక్షిణ సౌమ్యయోః
ఉదరంకుండ మిత్యుక్తం యోనిః పాదౌ తు పశ్చిమే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చతురస్రకుండము సర్వసిద్ధులను ఇచ్చును. యోనికుండము పుత్రప్రదము. అర్ధచంద్రకుండము సర్వ శుభప్రదము. త్ర్యస్రకుండము శతృనాశనం. వర్తులకుండం శాంతిప్రదం. షడస్రకుండం మారణం. పద్మకుండం వృష్టిప్రదం. అష్టాస్ర కుండం రోగనాశకం.

బ్రాహ్మణులకు చతురస్రకుండం. క్షత్రియులకు వర్తులకుండం, వైశ్యులకు అర్ధచంద్రకుండం, శూద్రులకు త్ర్యస్రకుండం ప్రశస్తములు. చతురస్రకుండము అందరికీ శుభప్రదమని కొందరు తాంత్రికులు చెప్పుచున్నారు.

కుండలముయొక్క తూర్పుభాగము ప్రకృతి యొక్క - శిరస్సు - దక్షిణ ఉత్తరములు రెండు బాహువులు - కుండము ఉదరము - పశ్చిమ, యోనులు రెండు పాదములు.

# స్థండిల లక్షణము

శ్లో॥ నిత్యం నైమిత్తికం కామ్యం స్థండిలే వా సమాచరేత్
హస్తమాత్రేణ తత్ కుర్యాత్ వాలుకాభిః సుశోభనమ్ ।
అంగుళోతసేధ సంయుక్తం చతురస్రం సమంతతః
శ్రీపర్ణీ శింశపాక్షీరశాఖి ష్వేకతమం గురుః ।
గృహీత్వా విభజేత్ హస్తమాత్రం షట్ త్రింశతాపునః
లింశత్యం శైర్భవేద్దండో వేదీతైరష్టభిర్భవేత్ ।
ఏకాంశేన మితః కంఠః సప్తభాగమితం ముఖం
వేదిత్ర్యంశేన విస్తారః కంఠస్యపరికీర్తితః ।
అగ్రం కంఠ సమానం స్యా న్ముఖే మార్గం ప్రకల్పయేత్
కనిష్ఠాగుళిమానేన సర్పిషో నిర్గమాయ చ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – హోమకుండము లేనిచోట, నిత్యనైమిత్తిక కర్మలు చేయుటకొరకు స్థండిలమును ఉపయోగించవచ్చును. దీని ప్రమాణము హస్తమాత్రముండును. అది ఎఱ్ఱ మట్టితో అలుక వలయును. ఒక అంగుళము ఎత్తులో చతురస్రముగా చేయవలయును. "స్రుక్" (గరిటె) శ్రీపర్ణి – శింశిపా – వటాది క్షీరవృక్షములలో ఏదో ఒకదానిచే హస్త ప్రమాణము చేయించవలయును. హస్తప్రమాణ కాష్ఠమును **36** భాగములు చేసి **20** భాగములు దండమునకై వదలి **8** భాగములు వేదికొరకు వదలి, ఒక భాగములో కంఠము, **7** భాగములందు ముఖమును చేయవలయును.

వేదియొక్క **3** అంగుళములందు కంఠ విస్తారము చెప్పబడినది. ముఖము కంఠముతో సమానముగా, అనగా వేదియొక్క **3** భాగముల పర్యంతము వెడల్పుగా యుండాలి. ముఖమందు నేయి జారుటకు వీలుగా చిటికెనవ్రేలు ప్రమాణములో ఛిద్రము కల్పించాలి.

# వేదిక రచనావిధి

శ్లో॥ వేదిమధ్యే విధాతవ్యా భాగేనైకేన కర్ణికా
విదధీత బహిస్తస్యా ఏకాంశేనాఽభితోఽవటమ్ ।
తస్యఖాత త్రిభిర్భాగైః వృత్తమర్ధాంశతో భవేత్
అంశేనైకేన పరితో దలానిపరికల్పయేత్ ।
మేఖలాముఖకేదోస్యాత్ పరితోఽర్ధాంశమానతః ॥
దండమూలాగ్రయోః కుంభౌ గుణవేదాంగుళైః క్రమాత్
గండీయుగం యమాంశైః స్యాద్దండస్యానాహ ఈరితః ।
షడ్భిరంశైః పృష్ఠభాగో వేద్యాః కూర్మాకృతిర్భవేత్
హంసస్యవా హస్తినోవా పోత్రిణోవా ముఖంలిఖేత్ ।
ముఖస్యపృష్ఠ భాగోఽస్యాః సప్రోక్తం లక్షణంస్రుచః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వేదికమధ్యయందు ఒక భాగముతో కర్ణికా నిర్మాణము చేయవలయును. దానికి బయట నాలుగు వైపులా ఒక అంశమందు గొయ్యి నిర్మించాలి. మూడు భాగములందు (2 అంగుళములు) గొయ్యి, ఒక అంగుళము దాని వృత్తము నిర్మించాలి. దానిచుట్టూ 1 అంగుళము దళ నిర్మాణము చేయాలి.

మరల ముఖము మరియు వేదిక మధ్యలో మేఖలా నిర్మాణము అరంగుళ ప్రమాణముతో నిర్మించాలి. దండము, మరియు మూలాగ్ర భాగమందు 3 - 4 అంగుళములలో 2 కుంభములు నిర్మించాలి. 2 - 2 అంగుళములలో కంకణాకారముగా నిర్మించాలి.

దండవైశాల్యము 6 అంశములు. వేదికపృష్ఠభాగము కూర్మపీఠా కారములో ఉండాలి. స్రుక్ వెనుకభాగమునందు హంస - ఏనుగు - వరాహము చిత్రించాలి.

# స్రువలక్షణం

శ్లో॥ స్రుచశ్చతుర్వింశతి భిర్భాగైరారచయేత్ స్రువం
ద్వావింశత్యా దండమానమంశైరేతస్య కీర్తితమ్ ।
చతుర్భిరంశైరానాహః కర్షాజ్యగ్రాహి తచ్ఛిరః
అంశద్వయేన నిఖనేత్ పంకేమృగపదాకృతి ।
దండమూలాగ్రయోర్గండీ భవేత్ కంకణభూషితా

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – స్రుక్ లక్షణము ముందుగా చెప్పినాడు. ఇపుడు స్రువ లక్షణము వివరించుచున్నాడు.

స్రుక్ యొక్క 24వ భాగమందు అనగా 36 భాగములలో 24వ భాగమునందు స్రువం నిర్మించాలి. 22 భాగములు దండము కొరకు విడచి, 4 అంశములందు (4 అంగుళములు) దాని వెడల్పు 2 అంగుళములలో శిరస్సు 16 మాషముల (మినపగింజలు) ప్రమాణముతో నిర్మించాలి.

ఖరదలో మృగముయొక్క పదము ఏ ఆకృతిలో అచ్చుపడునో దానిలోతు అలా ఉండాలి. దండముయొక్క మూలభాగము, అగ్రభాగము కంకణాభూషితమై యుండాలి (దీనినే గండి = తొడుగు అంటారు).

10 గురివింద గింజలు ఒక మాషమనబడును. 16 మాషములు ఒక కర్షమనబడును. అనంతరము సర్వతోభద్రమండల రచనావిధానము వివరించబడుచున్నది.

# సర్వతోభద్ర మండలం

శ్లో॥ చతురస్రే చతుః కుష్ఠే సూత్ర సమన్వితే
చతుర్ష్వపి చ కోష్ఠేషు కోణసూత్ర చ తాష్టయమ్ ।
మధ్యేమధ్యేయథా మత్స్యాః భవేయుః పాత యేత్తథా

పూర్వాపరాయతే ద్వేద్వే మంత్రీ యామ్యోత్తరాయతే ।
పాతయేత్తేషు మత్స్యేషు సమంసూత్ర చతుష్టయమ్
పూర్వవత్ కోణకోష్ఠేషు కర్ణసూత్రాణి పాతయేత్ ।
తదుద్భూతేషు మత్స్యేషు దద్యాత్ సూత్ర చతుష్టయం
తతః కోష్ఠేషు మత్స్యాః స్యుస్తేషు సూత్రాణిపాతయేత్ ।
యావత్ శతద్వయం మంత్రీ షట్ పంచాశత్ పదాన్యపి
తావత్తేనైవ విధినా తత్ర సూత్రాణి పాతయేత్ ।

.................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చదరంగంలో నిలువుగా ఎనిమిది గళ్లు. అడ్డంగా ఎనిమిది గళ్లు ఉంటాయి. అదేవిధంగా ఈ సర్వతోభద్రమండ చక్రంలో నిలువుగా 16 గళ్లు అడ్డంగా 16 గళ్లు వచ్చేలా లిఖించాలి. మొత్తం గడుల సంఖ్య 256. ఇందు మధ్యలోని 36 గడులు ఒక పద్మంగా, దాని బయట నాలుగు ప్రక్కలా 28 గడులు పీఠంగా అంచుగీసి నిర్మించాలి.

దానికి బయట నాలుగు ప్రక్కలా రెండు పంక్తులందూ గల 80 గడులందు వీధి నిర్మాణం చేయాలి. దానికి బయట మిగిలిన రెండు పంక్తులందు గల 112 గడులలో ద్వారము శోభ - ఉపశోభ నిర్మించాలి. ఈ విధంగా శాస్త్రోక్తంగా పద్మనిర్మాణం చేయాలి.

శ్లో॥ పద్మక్షేత్రస్య సంత్యజ్య ద్వాదశాంశం బహిఃసుధీః
తన్మధ్యం విభజేత్ వృత్తస్త్రిభిః సమవిభాగతః ।
ఆద్యంస్యాత్ కర్ణికాస్థానం కేశరాణాం ద్వితీయకం
తృతీయం పద్మపత్రాణా ముక్తాంశేన దళాగ్రకమ్ ।
బాహ్యవృత్తాంతరాళస్య మానంయద్ విధినాసుధీః
నిధాయకేశరాగ్రేషు పరితోఽర్ధ నిశాకరాన్ ।

లిఖిత్వా సంధి సంస్థాని తత్రసూత్రాణి పాతయేత్
దళాగ్రాణాంచ యన్మానం తన్మానం వృత్త మాలిఖేత్ ।
తదంతరాళే తన్మధ్య సూత్రస్యోభయతః సుధీః
ఆలిఖేత్ బాహ్యహస్తేన దళాగ్రాణి సమంతతః ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** – పద్మక్షేత్రముగా చెప్పబడినది 12 గడుల కైవారం వుంటుంది. అందు ఒక గడిభాగం చుట్టూ విడిచి, మిగిలిన దానిని సమవిభాగం చేసి మూడు వృత్తాలుగా విభజించాలి. మొదటిది కర్ణికాస్థానం, రెండవది వృత్తకేశరములస్థానం, మూడవది పద్మపత్రస్థానం అని చెప్పబడుతుంది.

మిగిలిన 12 అంశభాగమందు దళాగ్రముల నిర్మాణము కొరకు విడిచి పెట్టబడింది. బాహ్యవృత్త మధ్యమందు (పత్రావృత్తం) ఎంత ఖాళీ ఉన్నదో అంతే ప్రమాణముతో కేశరావృత్తము రెండు ప్రక్కలా అర్ధ చంద్రాకార ఆకృతిని లిఖించాలి.

ఈ ప్రకారముగా 8 అర్ధ చంద్రాకార ఆకృతులు ఏర్పడతాయి. ఇలా నాల్గవ వృత్త అంతరాళమందు అష్టదళకములో నాలుగువైపులా కలిపి (చుట్టూ) ఏర్పరచాలి.

శ్లో॥ దళమూలేషు యుగశః కేశరాణి ప్రకల్పయేత్
ఏతత్ సాధారణం ప్రోక్తం పంకజంతంత్ర వేదిభిః ।
పదాని త్రీణి పాదార్థం పీఠ కోణేషు మార్జయేత్
అవశిష్టైః పదైర్విద్వాన్ గాత్రాణి పరికల్పయేత్ ।
పదాని వీథిసంస్థాఇ మార్జయేత్ పంకభేదతః
దిక్షు ద్వారాణి రచయేత్ ద్విచతుః కోష్ఠకైస్తతః ।

పదైస్త్రిభిరథైకేన శోభాఃస్యుర్ ద్వార పార్శ్వయోః
ఉపశోభాః స్యురేకేన త్రిభిఃకోష్ఠైకైస్తతః ।
దిక్షు ద్వారాణి రచయేత్ ద్విచతుః కోష్ఠకైస్తతః ।
పదైస్త్రిభిరథైకేన శోభాఃస్యుర్ ద్వార పార్శ్వయోః
ఉపశోభాః స్యురేకేన త్రిభిఃకోష్ఠై రనంతరమ్ ।
అవశిష్టైః పదైఃషడ్భిః కోణానాం స్యాచ్చతుష్టయమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు కేశరముల నిర్మాణం చెప్పుచున్నాడు. ప్రత్యేకదళముయొక్క మూలభాగమందు రెండేసి కేసరములు లిఖించాలి. చూడచక్కని పద్మం వృత్తంగా ఏర్పడుతుంది.

ఇక పీఠ నిర్మాణము చెప్పబడుచున్నది. పీఠము కొరకు ఉంచిన పంక్తియందు ఒక్కొక్క కోణమునందు, మరియు దానిప్రక్కన రెండురెండు కోష్ఠములు (గడులు) మొత్తం ముడుగడుల పీఠపాదము ఏర్పడును. మిగిలిన నాలుగు గడులతో పీఠశరీరము నిర్మించవలయును. దీనిని ఒక రంగుతో నింపాలి.

వీధికొరకు విడిచిన రెండు పంక్తులూ మరొక రంగుతో నింపాలి. పిమ్మట నాలుగు ప్రక్కలా రెండేసి గడలు, నాలుగు గడలు ద్వారముగా నిర్మించాలి.

ద్వారముయొక్క లోపలప్రక్క భాగమందున్న మూడు మూడు గడులూ, మరియు బయటనున్న గడిలో ఒక్కొక్కటీ రంగుతో నింపాలి. ఈ విధంగా 8 శోభస్థానములు ఏర్పడును.

పిమ్మట ఆ పంక్తిని బయట రెండు మరియు ఒక్కొక్క కోష్ఠమూ, అలాగే బయటి మూడు మూడు కోష్ఠములూ రంగుతో నింపాలి. ఈ

ప్రకారము 8 ఉపశోభస్థానము లేర్పడును. ఆపై లోపలి పంక్తియందు ఉపశోభతో యున్న రెండు మరియు మూడు, మూడు కోష్ఠములు అలాగే బయట పంక్తియందున్న మూడు మూడు కోష్ఠకములూ రంగుతో నింపాలి.

శ్లో॥ రంజయేత్ పంచభిర్వర్ణైః మండలం తన్మనోహరం
పీతం హరిద్రాచూర్ణంస్యాత్ సితతండుల సంభవమ్ ।
కుసుంభచూర్ణమరుణం కృష్ణ దగ్ధ పులాకజం
బిల్వాది పత్రజం శ్యామ మిత్యుక్తం వర్ణపంచకమ్ ।
అంగుళోత్సేధ విస్తారాః సీమారేఖాః సితాః శుభాః
కర్ణికాంపీత వర్ణేన కేశరాణ్యరుణానిచ ।
శుక్లవర్ణేన పత్రాణి తత్సంధిం శ్యామలేన చ
రజసా రంజయేన్మంత్రీ యద్వాపీతైవ కర్ణికా ।
కేశరాః పీతరక్తాః స్యురరుణాని దళాన్యపి
సంధయః శుక్ల వర్ణాఃస్యుః పీతేనాఽప్యసితేనవా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** -ఈ మండలమును ఎలా రంగులతో నింపాలి, అనునది వివరించుచున్నాడు. పసుపుగుండ- బియ్యపు పిండి - కుంకం - ధాన్యంపొట్టు కాల్చినబూడిద (నల్లరంగుమసి), బిల్వ పత్రం నూరినది శ్యామవర్ణం ముందు సిద్ధంచేసుకోవాలి. ఈ విధంగా అయిదు రంగులూ ఏర్పడతాయి.

సర్వతోభద్ర మండలం సీమారేఖ ఒక అంగుళం ఎత్తులో బియ్యం పిండితో చుట్టూ లిఖించాలి. కర్ణికలు (వృత్తరేఖలు) పసుపుతోను, కేశరములు కుంకంతోనూ రంగుగా లిఖించాలి.

అష్టపత్రములు తెలుపువర్ణంతోను, వాటి సంధులు శ్యామవర్ణంతోను, కర్ణికలు ఎరుపువర్ణంతోను, లేదా పసుపు వర్ణంతోనూ లిఖించాలి.

శ్లో॥ రంజయేత్ పీఠగర్భాణి పాదాః స్యురరుణప్రభాః
గాత్రాణి తస్యశుక్లాని వీథీషు చ చతుస్వపి ।
ఆలిఖేత్ కల్పలతికా దళపుష్ప ఫలాన్వితాః
వర్ణై ర్నానావిధైశ్చిత్రై సర్వదృష్టి మనోహరాః ।
ద్వారాణి శ్వేతవర్ణాని శోభారక్తాస్సమీరితాః
ఉపశోభాః పీతవర్ణాః కోణాన్యసిత భాని చ ।
తిస్రోరేఖా బహిః కుర్యాత్ సితరక్తాసితాక్రమాత్
మండలం సర్వతో భద్రమేతత్ సాధారణం స్మృతమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – కేశరములు పసుపు కుంకుమ తోనూ, పత్రములు కుంకమతోనూ, సంధులు కాటుకవర్ణంతోనూ లిఖించాలి.

పీఠకోణము అలాగే పాదము కుంకుమతో లిఖించాలి. దాని గాత్రము బియ్యంపిండితో లిఖించాలి. నాలుగు వీధులూ శ్యామవర్ణం, కల్పలతికవలె తీర్చాలి. ఈ కల్పలత వివిధ రంగులతో మనోహరంగా చిత్రించాలి.

ద్వారము తెలుపు మరియు ఎరుపుతో ఉండాలి. ఉపశోభాస్థానము పసుపురంగు, శోభాస్థానము ఎరుపురంగు, కోణములు నలుపురంగులోనూ లిఖించాలి. దీని బయట మూడు రేఖలు వరుసగా తెలుపు – ఎరుపు – మరియు నలుపురంగులలో లిఖించాలి.

శ్లో॥ చతురస్రాంభువం భిత్వా దిగ్భ్యో ద్వాదశధాసుధీః
పాతయేత్తత్ర సూత్రాణి కోష్ఠానాం దృశ్యతే శతమ్ ।
చతుశ్చత్వారింశదాఢ్యం పశ్చాత్ షట్ త్రింశతాఽంబుజం
కోష్ఠైః ప్రకల్పయేత్ పీఠం పంక్త్యాం నైవాత్ర వీథికాః ।

ద్వారశోభే యథాపూర్వముపశోభ న దృశ్యతే
అవశిష్టైః పదైః కుర్యాత్ షడ్భిః కోణానితంత్రవిత్ ।
విదధ్యాత్ పూర్వవచ్ఛేషమేవంవా మండలంశుభం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 12 గడులు అడ్డంగా, 12 గడులు నిలువుగా ఒక చతురస్రం మండలం ఏర్పరచాలి. మొత్తం 144 గడులతో ఒక మండలం ఏర్పడుతుంది. వాటి మధ్యన 36 గడులలో ఒక కమలం ఏర్పరచాలి. దీనికి వీధులు ఉండవు. ద్వారములు ఉంటాయి, కాని ఉపశోభలు ఉండవు. మిగిలిన 6 - 6 గడులలో రంగు నింపాలి. బయట మూడు రేఖలు నిర్మించాలి.

## నవనాభ మండలం

శ్లో॥ చతురస్రే చతుః షష్టి పదాన్యార చయేత్సుధీః
పదైశ్చతుర్భిః పద్మం స్యాన్మధ్యే తత్పరితఃపునః ।
వీథీశ్చతస్రః కుర్వీత మండలాంతావసానికాః
దిగ్గతేషు చతుష్కేషు పంకజాని సమాలిఖేత్ ।
విదిగ్గత చతుష్కాని ఖిత్వాషోడశధా సుధీః
మార్జయేత్ స్వస్తికా కారం శ్వేతపీతారుణాసితైః ।
రజోభిః పూరయేత్తాని స్వస్తి కాని శివాదితః
ప్రాక్ప్రోక్తేనైవ మార్గేణ శేషమన్యత్ సమాపయేత్ ।
నవనాభమిదం ప్రోక్తం మండలం సర్వసిద్ధిదమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 8 గడులు అడ్డంగా, 8 గడులు నిలువుగా, చదరంగం గడులవలె ఒక చతురస్రం నిర్మించాలి. మొత్తం 64 గడులు ఏర్పడతాయి. మధ్యలో నాలుగు గడులలో చుట్టూ

ఒక పద్మం లిఖించాలి. దాని చుట్టూ నాలుగువైపులా 8 – 8 గడులతో 4 వీధులు నిర్మించాలి.

ఈ ప్రకారము 8 దిశలందు 4 కోష్టాష్టకములు మిగులుతాయి. వాటిలో నాలుగుదిశలందు 4 – 4 గడులలో 4 పద్మములు లిఖించాలి, కోణములందున్న 4 – 4 గడులలో (16) బియ్యం నింపాలి. ఇలా చేయడం వలన స్వస్తికాకార మండలం ఏర్పడును.

ఈశాన్యకోణమునుండి వాయువ్యకోణ పర్యంతం ముందు చెప్పినట్లుగా రంగులతో అలంకరించాలి. పిమ్మట వీధులందు కల్పలతాదులను నిర్మించాలి. దీనినే "నవనాభి" మండలం అంటారు. ఇది సర్వసిద్ధులను ఇచ్చును.

## పంచాబ్జ మండలం

శ్లో॥ పంచాబ్జం మండలంప్రోక్త మేతత్ స్వస్తిక వర్జితం
దీక్షాయాం దేవపూజార్థం మండలానాం చతుష్టయమ్ ।
సర్వతంత్రానుసారేణ ప్రోక్తం సర్వ సమృద్ధిదమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – స్వస్తిక లేకుండా దీనినే పంచాబ్జ మండలం అని కూడా వ్యవహరిస్తారు. దీక్షా సమయములోను, పూజలయందు పైన చెప్పిన నాలుగు మండలములు రంగవల్లులతో అందముగా లిఖించి తంత్రసాధన చేసిన సకలసిద్ధులు కలుగును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*తృతీయః పటలః సమాప్తః*

❖❖❖

# అథ చతుర్థః పటలః

## - అథ దీక్షా ప్రకరణం -

శ్లో॥ అథ దీక్షాం ప్రవక్ష్యామి మంత్రిణాం హితకామ్యయా
వినయయా న లభ్యేత సర్వమంత్ర ఫలం యతః ।
దివ్యం జ్ఞానంయతో దద్యాత్ కుర్యాత్ పాపస్య సంక్షయః
తస్మాత్ దీక్షేతి సంప్రోక్తా దేశికైః తంత్రవేదిభిః ।
చతుర్విధా సా సందిష్టా క్రియావత్యాది భేదతః
క్రియావతీ వర్ణమయీ కళాత్మా వేధమయ్యపి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు దీక్షావిధానము చెప్పబడుచున్నది. దీక్ష అనగా "దివ్యజ్ఞానమును ఇచ్చుట" అందువలన పాపము నశించును. ఇది 4 విధములు. 1. క్రియావతి, 2. వర్ణమయి, 3. కళాత్మా, 4. వేధ దీక్ష. **"షడ్వన్వయ మహారత్న"** గ్రంథమందు దీక్ష మూడు విధములుగా ఇట్లు చెప్పబడినది.

☞ **త్రివిధాసా భవేద్దీక్షా ప్రథమాత్వాణవా పరా ।**
**శాక్తేయీ శాంభవీ చాన్యా సద్యోముక్తివిధాయినీ ॥**

**'వాయవీయ సంహిత'** యందు కూడా ఇట్లున్నది.

☞ **శాంభవీ చైవ శాక్తే చ మాంత్రీ చైవ శివాగమే ।**
**దీక్షోపదిశ్యతే త్రేధా శివేన పరమాత్మనా ॥**
**గురోరాలోక మాత్రేణ, స్పర్శాత్, సంభాషణాదపి ।**
**సద్యః సంజ్ఞా భవేజ్జంతోః దీక్షాసా "శాంభవీ" మతా ॥**
**శాక్తీ జ్ఞానవతీ దీక్షా శిష్యదేహం ప్రవిశ్య తు**
**గురుణా యోగమార్గేణ క్రియతే జ్ఞానచక్షుషా ॥**
**మంత్రీ క్రియావతీ దీక్షా కుండమండల పూర్వికా ॥**

# గురువు యాగమంటప ప్రవేశం

శ్లో॥ యాయాదలంకృతో మౌనీ యాగార్థం యాగమంటపం ।
ఆచమ్యవిధినా తత్రా సామాన్యార్ఘ్యం విధాయ చ ॥
ద్వారమస్త్రాంబుభిః ప్రోక్ష్య ద్వారపూజాం సమాచరేత్
.................................................................. ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ముందుగా దీక్షనిచ్చు గురువు స్నానసంధ్యలు ఆచరించిన పిమ్మట, శుచిగా – అలంకారయుక్తుడై, మౌనముగా యాగశాలకు రావలయును.

అచట మరల ఆచమనము, సామాన్య అర్ఘ్యము ఆచరించి – "ఓం హ్రః ద్వారార్ఘ్యం సాధయామి" అని ద్వారమందు నిలవాలి. మరల "అస్త్రాయ ఫట్" అను మంత్రముతో యాగమంటప ద్వారము ప్రక్షాళన చేయాలి.

గుమ్మంపైనున్న ద్వారబంధమునందు (ఊర్ధ్వ ఉదుంబరకం) గణపతి – లక్ష్మి – సరస్వతి దేవులను పూజించాలి కుడిభాగమున గణపతి – క్షేత్రపాలకులనర్చించాలి. ఎడమవైపున పుష్పజలముతో గంగా – యమున లను పూజించాలి. పిమ్మట గుమ్మమునకు ఓంహ్రః అస్త్రాయఫట్ నమః అని అస్త్ర పూజ చేయాలి.

"ఉత్తిష్ఠంతు భూతపిశాచాః" అని సమస్త విఘ్నములు దూరం చేయాలి. పిమ్మట ద్వారబంధంయొక్క ఎడమభాగమును స్పృశించి, కుడికాలు లోపల ఉంచి ప్రవేశించాలి. మండపంలో నైఋతి దిశయందు క్షేత్రపాలుని, బ్రహ్మను అర్చించాలి. పిమ్మట పంచగవ్యములతో మండపం ప్రోక్షించాలి.

మండపం లోపలినుండి గుమ్మంవరకు గల హస్తప్రమాణ స్థలమును చతుష్పథం అంటారు. మూల మంత్రముతో చతుష్పథం వరకు వీక్షణ

చేతను, అస్త్రమంత్రముచ్చరించి దర్భలతో తాడనము, కవచమంత్రముతో ప్రోక్షణము చేయాలి. పిమ్మట చందనాగరు కర్పూరములతో ధూపం వేయాలి.

అస్త్రమంత్రము 7సార్లు ఉచ్చరించుచూ పేలాలను మండపమునందు చల్లాలి. లేది వికిరములు (ఎర్ర చందనం పసుపు ఆవాలు - భస్మ - దూర్వా - అక్షతలను వికిరములు అంటారు) చల్లాలి. ఈ వికిరములు సర్వవిఘ్నములను పోగొట్టును.

## వర్ధిని

శ్లో॥ ఈశస్యదిశివర్ధిన్యా ఆసనాయ ప్రకల్పయేత్
పుణ్యాహం వాచయిత్వాతు బ్రాహ్మణాన్ పరితోష్యచ ।
ఉక్తేషు మండలేష్వేకం వేదికాయాం సమాలిఖేత్
విశేత్ మృద్వాసనేమంత్రీ పాంగ్ముఖో వాప్యుదంగ్ముఖః ।
స్థాపయేద్దక్షిణేభాగే పూజాద్రవ్యాణి దేశికః
సువాసితాంబుసంపూర్ణం సవ్యేకుంభం సుశోభనమ్ ।
ప్రక్షాళనాయకరయోః పశ్చాత్ పాత్రం నివేశయేత్
ఘృతప్రజ్వాలితాన్ దీపాన్ స్థాపయేత్ పరితః శుభాన్ ।
దర్పణం చామరం ఛత్రం తాళవృంతం మనోహరం

.....................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వర్ధిని పాత్రను ఈశాన్య దిశలో ఉంచాలి. (వర్ధిని అంటే నీళ్లు నింపిన జారీచెంబు, దీనినే పంచపాత్ర అని వ్యవహరిస్తారు) అందుకు ముందుగా ఈశాన్యంలో కొన్ని వికరములు చల్లాలి. పిమ్మట పుణ్యాహవాచనము చేసి బ్రాహ్మణులకు దక్షిణలనిచ్చి సంతృప్తపరచి వేదికపై తూర్పు లేదా ఉత్తరముఖంగా కూర్చోవాలి.

కుడివైపు పూజాద్రవ్యములుంచాలి. దాని ప్రక్కన చేతులు శుభ్రం చేసుకొనుటకు నీటిపాత్ర ఉంచాలి. నేతితో వెలిగించిన దీపాలు చుట్టూ అలంకరించాలి. అద్దము, ఛత్రము, చామరము, తాళవృంతము, మొదలగు మంగళకర ద్రవ్యములు ఉపచారము నిమిత్తము సిద్ధం చేసుకోవాలి.

పిమ్మట అస్త్రముద్రతో దిగ్బంధనం చేసి గురూపదిష్ట మార్గములో చిన్మంత్రముతో ఆత్మానుసంధానం చేయాలి. పిమ్మట 'యం' బీజముతో శరీర శోషణ, రం బీజముతో కుంభకము ఆచరించాలి. పిమ్మట మరల వాయు బీజముతో తన నుండి పాపపురుష బహిర్గమును చింతన చేయాలి.

వం బీజముతో నీటిని చల్లుకొనిన తన దేహమును అమృతమయమైనట్లుగా భావించాలి. పిమ్మట మాతృకాన్యాసం చేయాలి. ఆపై హంస న్యాసము ఇట్లు ఆచరించాలి.

**హం - పురుషాత్మనే నమః - శిరసి।**

**సః - ప్రకృత్యాత్మనే నమః - ముఖే।**

**హంసః - ప్రకృతిపురుషాత్మనే నమః - హృదయే।**

తరువాత మూలమంత్రముతో ప్రాణాయామం ఆచరించాలి.

## ఆత్మయాగం

శ్లో॥ కల్పయేదాత్మనో దేహే పీఠం ధర్మాదిభిః క్రమాత్
అంసోరుయుగ్మయోర్విద్వాన్ ప్రాదక్షిణ్యేన దేశికః ।
ధర్మంజ్ఞానంచ వైరాగ్యమైశ్వర్యం న్యస్యతుక్రమాత్
ముఖపార్శ్వ నాభి పార్శ్వేఽధర్మాదీంశ్చ ప్రకల్పయేత్ ।

......................................................................................

......................................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అనంతరము అంగన్యాస, కరన్యాసములాచరించి ఆత్మయాగము చేయుటకు ఉపక్రమించాలి.

ముందుగా ధర్మ – జ్ఞాన – వైరాగ్య – ఐశ్వర్యములను ప్రదక్షిణక్రమముగా దక్షిణభుజం వామభుజం –వామోరు – దక్షిణోరువులందు న్యాసము చేయాలి.

ముఖ – వామ పార్శ్వ – నాభి – దక్షిణపార్శ్వములందు అధర్మ – అజ్ఞాన – అవైరాగ్య – అనైశ్వర్యములను న్యాసం చేయాలి. హృదయమందు సోమ సూర్యాగ్నుల న్యాసం చేయాలి. ఇష్టదేవతా ధ్యానం చేసి ముద్రలు ప్రదర్శించి, అస్త్రమంత్రముతో శంఖప్రక్షాళన చేయాలి.

పిమ్మట అందు నీరుపోసి, దానిని స్పృశించి 8 సార్లు మూలమంత్రం జపించాలి. తరువాత రెండు చేతులతో దానిని ఆచ్ఛాదన చేసి అద్భ్యో నమః అని 8 సార్లు పఠించి, మూలమంత్రం 8 సార్లు జపించాలి.

తదనంతరం అస్త్రమంత్రము చిటిక వేసి రక్షణ చేసి, కవచ మంత్ర ముతో అవగుంఠనము ధేనుముద్ర – సంనిరోధముద్రలు ప్రదర్శించాలి. తన దేహమందు అనన్యబుద్ధిచే 5సార్లు పుష్పాంజలి సమర్పించాలి.

## బహిర్యాగవిధి

శ్లో॥ విసృజ్యతోయం ప్రోక్షణ్యాః పూరయేత్తాంయథా పురా
తతస్తన్మండలం మంత్రీ గంధాద్యైః సాధుపూజయేత్ ।
శాలిభిః కర్ణికామధ్య మాపూర్యోపరి తండులైః
అలంకృత్య పునస్తేషు దర్భానాస్తీర్య తంత్రవిత్ ।
అథఃకూర్మ శిలారూఢాం శరచ్చంద్ర నిభప్రభాం
ఆధార శక్తిం ప్రయజేత్ పంకజద్వయ ధారిణీమ్ ॥
మూర్ధ్నితస్యాః సమారూఢం కూర్మనీలాభమర్చయేత్
ఊర్ధ్వం బ్రహ్మశిలాసీనమనంతం కుంద సన్నిభమ్ ।
యజేచ్చక్రధరం మూర్ధ్ని ధారయంతం వసుంధరాం

అభ్యర్చయేద్వసుమతీం స్ఫురత్సాగర మేఖలామ్ ।

.......................................................................

.......................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు బహిర్యాగము చెప్పబడుచున్నది. ప్రోక్షణి పాత్రలో కొత్తనీరుపోసి సర్వతో భద్రమండలాయన మః, అని మండలపూజ చేయాలి. కర్ణిక మధ్యలో ఒక కుంచెడు శాలిధాన్యం పోసి దానిపై అష్టమాంశం బియ్యం పోసి దానిపై కూర్చనుంచాలి. (కూర్చ అనగా 27 దర్భలతో, మూడు పాయలుగా చేసి జడవలె అల్లినది, దీనినే విష్టరం అని కూడా అంటారు)

పిమ్మట కూర్మచక్రముపై ఆదారశక్తిని, ఆపై తెల్లనివర్ణముతో శోభించు అనంతుని, అనంతుని తలపై తమాలశ్యామలయైన భూమిని పూజించాలి. పిమ్మట మణిమంటప మధ్యనుండు కల్పవృక్షమును, దాని క్రింద వేదికను పూజించాలి.

అనంతరం రక్తవర్ణముతోనుండు ధర్మమును వృషభముగాను, శ్యామవర్ణముతోనుండు జ్ఞాన సింహరూపమును, పసుపు వర్ణముతోనుండు వైర్యగ్యమును భూతస్వరూపగాను, నలుపువర్ణముతో నుండు ఐశ్వర్య గజ రూపమును నాలుగు పీఠపాదములుగా భావించి అర్చించాలి.

తరువాత అనంతస్వరూప పద్మములో కేసరములను 50 వర్ణములుగా పూజించాలి. ఆత్మ – అంతరాత్మా – పరమాత్మా – జ్ఞానాత్మలను పీఠశక్తులను ధ్యానించాలి.

పిమ్మట కుశాక్షతలు గంధపుష్ప, జలములతో నింపిన కలశమును స్థాపించాలి. ఘటమునందు నీరు నింపు సమయమున ప్రతిలోమక్రమముగా మాతృక పఠించుచూ మూలమంత్ర జపం చేయాలి.

కుంభమందు గంధాష్టకము పోసి ప్రాణప్రతిష్ఠ చేయాలి. గంధాష్టకము శివ – శక్తి – విష్ణువులకు భిన్నముగానుండును.

1. శివగంధాష్టకము - చందనం - అగురు - కర్పూరం - తమాల - జల - కుంకుమ - కుశీత - కుష్ఠములు ।
2. శక్తిగంధాష్టకము - చందనం - అగురు - కర్పూరం - కచ్చోరం - కుంకుమ - గోరోచనం - జటామాంసి - కపి ।
3. విష్ణుగంధాష్టకము - చందనం - అగురు - హ్రీబేరం - కుష్ఠం - కుంకుమ - సేవ్యకం - జటామాంసి - ముర.

## ప్రాణప్రతిష్ఠ మంత్రము

**ఆంహ్రీంక్రోం ఓం యం రంలంవంశం షంసం హౌం అముష్య ప్రాణా ఇహ ప్రాణాః జీవ ఇహ స్థితః, అముష్య సర్వేంద్రియాణి అముష్య వాంగ్మనోనయన శ్రోత్రఘ్రాణ ప్రాణాః ఇహాగత్య సుఖంచిరం తిష్ఠంతు స్వాహా ॥**

ఈ ప్రాణమంత్రము సకల దేవతార్చనలోనూ జీవప్రదమగును.

ప్రాణప్రతిష్ఠానంతరం అశ్వత్థ - పనస - మామిడి చిగురులతో కలశముఖమును ఆచ్ఛాదన చేసి, ఆపై 2 పట్టువస్త్రములతో వేష్టనం చేయాలి. (చుట్టూ చుట్టాలి).

తరువాత గురువు మూలమంత్రముతో ఇష్టదేవతను కలశమునందు ఆవాహన చేయాలి.

ఇక గ్రంథాంతరములందిట్లున్నది.

**"శౌనక కల్పము"**నందు మండూకాది పూజ ఇట్లున్నది.

☞ **మండూకాది పృథివ్యాది కర్ణికాయాంయజేత్ క్రమాత్ ।**

**"డామరము"** నందు - కూర్చను గూర్చి ఇట్లున్నది.

☞ **సప్తవింశతి దర్భాణాం వేణ్యగ్రేగ్రంథిభూషితం ।**
**విష్టరేసర్వయజ్ఞేషు లక్షణం పరికీర్తితమ్ ॥**

"కలశ" శబ్ద వ్యుత్పత్తిని గూర్చి గ్రంథాంతరమందిట్లున్నది.

☞ **యదాతు శంకరం మధ్యే ఐశాన్యాం శ్రీపతింయజేత్**
**ఆగ్నేయాంచ తధా హంసం నైఋత్యాం పార్వతీ సుతమ్ ।**
**వాయవ్యాం చ సదా పూజ్యా భవానీ భక్తవత్సలా ॥**

శక్తిపంచాయతనము గూర్చి ఇట్లున్నది.

☞ **భవానీం తు యధామధ్యే ఐశాన్యాం మాధవం యజేత్**
**ఆగ్నేయాం పార్వతీ నాధం నైఋత్యాంగణనాయకమ్ ।**
**ప్రద్యోతనంతు వాయవ్యామాచార్యస్తు ప్రపూజయేత్ ॥**

☞ **స్వస్థాన వర్జితాః దేవాః శోక దుఃఖ భయప్రదాః ।**
**తన్మండలస్థితో రాజా సాధకశ్చ వినశ్యతి ॥**

**"రామపూర్వతాపినీ"** గ్రంథమందిట్లున్నది.

☞ **సోభయస్యాఽ స్యదేవస్య విగ్రహో యంత్రకల్పనా ।**
**వినాయంత్రేణచేత్ పూజాదేవతా న ప్రసీదతి ॥**

## ఉపచారములు

శ్లో॥ అథోపచారాన్ కుర్వీత మంత్రవిత్ స్వాగతాదికాన్
పాద్యం పాదాంబుజే దద్యాత్ దేవస్య హృదయాణునా ।
ఏతత్ శ్యామాక దూర్వాబ్జ విష్ణుక్రాంతాభిరీరితమ్ ।

.................................................................

తత్ర తత్ర జలందద్యాదుపచారాంతరాంతరా ।
అంగాదిలోకపాలాంతం యజేదావరణాన్యపి ॥
కేశరేష్వగ్ని కోణాది హృదయాదీని పూజయేత్
తారావ్యాహృతిభిర్హుత్వా మూల మంత్రేణ మంత్రివిత ।
సర్పిష్మతా పాయసేన పంచవింశతి సంఖ్యయా
హుత్వా వ్యాహృతిభిర్భూయః గంధాద్యైః పునరర్చయేత్ ।

తతోనివేద్యముద్ ధృత్య శోధయిత్వాజలంపునః
పంచోపచారైః సంపూజ్య దర్శయేచ్ఛత్రచామరే ॥

......................................................................

......................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** -ఆవాహనానంతరం సంస్థాపన - సన్నిధాన - సన్నిరోధ, సకలీకరణ - అవగుంఠన ముద్రలు ప్రదర్శించి, అర్ఘ్య పాద్యాది 16 ఉపచారములు ఆచరించాలి. శ్యామాక - దూర్వా - కమల - విష్ణుక్రాంత మిశ్రిత జలముతో పాద్యం సమర్పించాలి.

ప్రతీ ఉపచారము పిమ్మట జలసమర్పణ చేయాలి. మూలమంత్ర పుటితముతో మాతృకాక్షరములుచ్చరించుచూ గంధాది ఉపచారములు చేయాలి. లోకపాలురను, ఆవరణములను అర్చించి పూజాపుష్పాలు కమలము - గన్నేరు - జాజి - మొగలి - సంపెంగ - మల్లి - మందార- గులాబి - దేవకాంచనం - అశోక - ఉమ్మెత - బిల్వపత్ర - అర్జునం - అగస్త్య మొదలగునవి ఉపయోగించాలి. మలినములు - భూమిపై పడినవి, క్రిమికీటకములచే కొరకబడినవి పనికిరావు.

దేవుని శిరస్సుపై ఎల్లప్పుడూ పుష్పం ఉండాలి. ఆగ్నేయమందు హృదయమును, ఈశాన్యమునందు శిరస్సును, నైఋతియందు శాఖా మంత్రమును, వాయవ్యమందు కవచమంత్రముతో పుష్పపూజ చేయాలి.

**పిమ్మట ఓం స్వాహా, భూః స్వాహా, భువః స్వాహా, స్వః స్వాహా, ఓం భూః భువః స్వః స్వాహా** అని నాలుగు ఆహుతులిచ్చి, ఆజ్యసహిత పాయసము నైవేద్యంచేసి 25సార్లు మరల మూలమంత్రం కలిపి వాహృతి హోమం ఆచరించాలి.

పిమ్మట జలశోధనచేసి, మరల పంచోపచారములు చేసి ఛత్ర చారములు దర్శింపచేయాలి.

**"తత్త్వసాగర సంహిత"** యందు, పుష్పములు సహజముగానే నిర్మాల్యములని, మానసికార్చన అని నిర్మాల్యమని ఇట్లు చెప్పబడినది.

☞ **జాతమాత్రాణి పుష్పాణి ఘ్రాతాన్యేవ నిసర్గతః**
**పంచభిశ్చమహాభూతైః భానునాశశినాతథా ।**
**ప్రాణిభిశ్చద్విరేఫాద్యైః పుష్పైరేవ న సంశయః ॥**
**అల్పబుద్ధివతో నృణాం బాహ్యపుష్పైర్భవేత్ క్రియా ।**

**"మంత్ర తంత్ర పకాశ"** యందు గంధజల విశిష్టత యిట్లున్నది.

☞ **శుద్ధతోయాత్ గంధతోయం శ్రేష్ఠ శతగుణోత్తరం**
**గంగాదితీర్ధతోయానాం ఫలం శాస్త్రప్రణోదితమ్ ॥**

## అస్త్రదేవతా ధ్యానం

శ్లో॥ తతః శంభోర్దిశి గురుర్వికిరే పూర్వసంచితే
హేతువస్త్రాది సంయుక్తాం కర్కరీం తోయపూరితామ్ ।

..............................................................................

తతశ్చ సంస్కృతే వహ్నౌ గోక్షీరేణ చరుంపచేత్
అస్త్రేణక్షాలితే పాత్రే నవే తామ్రమయాదికే ।
తండులాన్ శాలిసంభూతాన్ మూలమంత్రాభితాన్
ప్రసృతీనాం పంచదశ క్షిప్త్వాచాఽస్త్రమనుం జపేత్ ।
ప్రాంగ్ముఖో మూల మంత్రేణ దేశికేంద్రశ్చరుం పచేత్
తం బిభజ్య త్రిధాభాగమేకం దేవాయ కల్పయేత్ ॥

..............................................................................

..............................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అనంతరం అగ్నికి విసర్జన చెప్పి, నైవేద్య స్థలమును శుద్ధిచేసి కర్పూర తాంబూలము సమర్పించాలి. మూలమంత్రం సహస్రం జపంచేసి దేవతార్పణం చేయాలి.

పిమ్మట ఈశాన్యమందు పంచపాత్రనుంచి అస్త్రదేవతను దానిపై స్థాపించి పూజించాలి. ఈ అస్త్రదేవత ఖడ్గఖేటకములు ధరించి సింహ వానముపై ఆసీనురాలై, భయానకరూపము గలదై పశ్చిమాభిముఖముగా నుండును.

తరువాత 15 ప్రస్రుతుల శాలిబియ్యము, ఒక పాత్రలో గోక్షీరముతో కలిపి మూలమంత్రముతో సంస్కరింపబడిన అగ్నియందు వండాలి. దీనిని చరుద్రవ్యమంటారు. ఉడికిన తరువాత నెయ్యి అభిఘరించి, కవచమంత్రము పఠించి క్రిందకు దింపాలి.

చరుద్రవ్యమును రెండు సమభాగములు చేసి, ఒకటి దేవతకు ఉంచి, రెండవదానిని హోమం చేయాలి. మొదటిదానిని నైవేద్యంచేసి, ఆచమనం చేసి గురుశిష్యులిరువురూ భుజించాలి.

గురువు మరల ఆచమనంచేసి శిష్యుని శరీరమందు షడంగన్యాసము చేసి సకలీకరణం చేయాలి. పిమ్మట క్షీరవృక్షదంతకాష్ఠమును శిష్యునకు ఇచ్చి దంతధావనం ఆదేశించాలి.

పిమ్మట శిష్యునిచే ఆచమనం చేయించి మూలమంత్రము పఠించుచూ శిష్యుని శిఖాబంధం చేయాలి. గురుశిష్యులిరువురూ వేదివద్ద దర్భాసనముపై ఆ రాత్రి శయించాలి. దీనినే అధివాసం అంటారు.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*చతుర్థః పటలః సమాప్తః*

❖❖❖

# అథ పంచమః పటలః

## అథ అగ్ని జననం

శ్లో॥ తతోఽగ్ని జననం వక్ష్యే సర్వ తంత్రానుసారతః ।
ఆచార్యకుడే విధివత్ సంస్కృతే శాస్త్రవర్త్మనా ॥
అష్టాదశస్యుః సంస్కారాః కుండానాం తంత్రచోదితాః
వీక్షణంమూల మంత్రేణ శరేణప్రోక్షణం మతమ్ ।
తేనైవ తాడనం దర్భైర్వర్మణాఽభ్యుక్షణంస్మృతం
అస్త్రేణఖననోద్ధారౌ హృన్మంత్రేణ ప్రపూరణమ్ ।
సమీకరణమస్త్రేణ సేచనం వర్మణా మతం
కుట్టనంహేతి మంత్రేణ వర్మమంత్రేణ మార్జనమ్ ।
విలేపనం కలారూప కల్పనం తదనంతరం
త్రిసూత్రీకరణం పశ్చాత్ హృదయేనార్చనంమతమ్ ।
అస్త్రేణ వజ్రీకరణం హృన్మంత్రేణ కుశైః శుభైః
చతుష్పథం తనుత్రేణ తనుయాదక్షపాటనమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అగ్నికుండ సంస్కారములు చెప్పబడుచున్నవి. ఇవి 18 రకములు. 1. వీణం - మూలమంత్రము పఠించుచూ హోమకుండమును చూచుట. 2. ప్రోక్షణం - అస్త్రాయఫట్ అని హస్తాగ్రభాగముతో కుండమును స్పృశించుట. 3. తాడనం - అదే అస్త్రమంత్రముచే దర్భతో కుండమును కొట్టుట. 4. అభ్యుక్షణం - వర్మ మంత్రముతో (కవచాయహుం) పిడికిలి నీటితో చల్లుట.

**5,6,7.** ఖనన - ఉద్ధార - ప్రపూరణలు - అస్త్రమంత్రముతో మండమునందు కొద్ది మట్టిని త్రవ్వి, చేతితో బయటకు తీయడం, నమః మంత్రముతో కొత్తమట్టిని అందు నింపడం.

**8.** సమీకరణం – అస్త్రమంత్రముతో మట్టిని సమతలంగా సవరించడం **9 .** సేచనం – కవచాయహుం అనుచూ కొద్దిగా నీళ్లు చల్లడం **10.** కుట్టనం – అస్త్రమంత్రముతో దానిని నొక్కడం. **11.** మార్జనం – వర్మమంత్రముతో తుడవడం **12.** విలేపనం – చేతితో అలకడం **13.** కలాకల్పనం – చంద్ర–సూర్యాస్నలను అందుభావించడం **14.** త్రిసూత్రీకరణం – మూడుచుట్లు దారం చుట్టడం.

**15.** వజ్రీకరణం – అస్త్రమంత్రముతో ఆ భూమిని గట్టిపరచుట, **16.** చతుష్పథం – నమోమంత్రముతో కుండము నాలుగువైపులా కుశలుంచుట, **17.** అక్షపాటనం – వర్మమంత్రముతో రాక్షస నివారణమైనట్లు భావించుట, **18.** అపసరణం – హుంకారముతో దుష్ట శక్తులను పారదోలినట్లు భావించుట. ఇవియే అష్టాదశకుండ సంస్కారము లనబడును.

ఇవన్నీ ఆచరించలేనివారు వీక్షణ – ప్రోక్షణ – తాడన – అభ్యు క్షణములు చేసిన చాలును.

శ్లో॥ తిస్రస్తిస్రో లిఖేల్లేఖా హృదాప్రాగుదగ్రదాః
ప్రాగగ్రాణాం స్మృతాదేవా ముకుందేశ పురందరాః ।
రేఖాణాముదగగ్రాణాం బ్రహ్మావైవస్వతేందవః
అథవా షట్కోణావృతం త్రికోణం తత్ర సంలిఖేత్ ।
సర్వాణ్యభుక్ష్య తారేణ యోగపీఠోమథార్చయేత్
వాగీశ్వరీ మృతుస్నాతాం నీలేందీవర సన్నిభామ్ ।

..........................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట కుండమునకు దక్షిణమున పూర్వాభిముఖముగా మూడురేఖలు, అలాగే పశ్చిమదిశనందు ఉత్తరాభిముఖముగా మూడు రేఖలు లిఖించాలి. వాటి అగ్రభాగములు

వరుసగా ముకుంద – ఈశ్వర – పురందరు (ఇంద్రుడు)లుగా భావించాలి. ఇలా ఉత్తరమందూ, తూర్పునందూ మూడేసి రేఖలు లిఖించాలి.

ఉత్తరాభిముఖముగా ఉన్న రేఖల అగ్రభాగములు బ్రహ్మ – వైవస్వత – చంద్రులుగా భావించాలి. లేదా షట్కోణము లిఖించి అందు ఒక త్రికోణము లిఖించాలి.

మరల ప్రణవముతో అభ్యుక్షణము చేసి, వాగీశ్వరీ యోగపీఠము నర్చించాలి. "హ్రీం వాగీశ్వరీ వాగీశ్వర యోర్యోగపీఠాయ నమః" పిమ్మట ఋతుస్నాత అయిన భగవతి వాగీశ్వరిని షోడశోపచారములతో పూజించాలి.

సూర్యకాంతమణివల్ల జనించిన అగ్ని, లేదా శ్రోత్రియగృహమునుంచి అగ్నిని, లేదా అరణినుంచి మథించిన అగ్నిని పాత్రయందుంచి క్రవ్యాద అంశమును విడిచిపెట్టాలి.

ఆ అగ్నిని వీక్షణాదులచే గురువు సంస్కరించాలి. పిమ్మట పాత్రయందలి అగ్నిని 'రం' బీజముచ్చరించి కొంతభాగమును నైఋతి దిశయందు వదలి, మరల రంబీజముతో దానిని చైతన్యవంతముగా భావించి, ధేనుముద్ర ప్రదర్శించి అమృతీకరణము – అస్త్రమంత్రముతో సంరక్షణము, కవచమంత్రముతో అవగుంఠనంచేసి, కుండముచుట్టూ మూడుసార్లు త్రిప్పి, మోకాలిపై భూమిపై కూర్చొని శివబీజముతో అగ్నిస్థాపన చేయాలి.

పిమ్మట వాగీశ్వరీ – వాగీశ్వరులకు ఆచమనముచేయించి, తాను చేసి ఈ క్రింది మంత్రముతో అగ్నిప్రజ్వాలన చేయాలి

☞ **చిత్పింగళ హనహన, దహదహ, పచపచ, సర్వజ్ఞా జ్ఞాపయ స్వాహా'** పిమ్మట ఇలా ధ్యానించాలి.

శ్లో॥ అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదంహుతాశనం ।
సువర్ణవర్ణమమలం సమిద్ధం విశ్వతోముఖమ్ ॥

పిమ్మట అగ్నియొక్క సప్తజిహ్వలను తన శరీరమందు న్యాసం చేయాలి.

| | | | |
|---|---|---|---|
| లింగే | - | స్ర్యూం | హిరణ్యాయై నమః । |
| పాదయోః | - | షం | గగనాయై నమః । |
| శిరసి | - | శం | రక్తాయయై నమః । |
| ముఖే | - | వం | కృష్ణానయై నమః । |
| ఘ్రాణే | - | లం | సుప్రభాయై నమః । |
| నేత్రయోః | - | రం | బహురూపాయై నమః । |
| సర్వాంగే | - | యం | అతిరిక్తాయై నమః । |

ఇవి అగ్నియొక్క సాత్త్వికీ జిహ్వాలు, ఇపుడు రాజసీ జిహ్వాలు వాటి న్యాసము చెప్పబడుచున్నవి. ఇవి కామ్యకర్మ యందుపయోగపడును.

| | | | |
|---|---|---|---|
| లింగే | - | స్ర్యూం | పద్మరాగాయై నమః । |
| పాదయోః | - | షం | సువర్ణాయై నమః । |
| శిరసి | - | శం | భద్రలోహితాయై నమః । |
| ముఖే | - | వం | లోహితాయై నమః । |
| ఘ్రాణే | - | లం | శ్వేతాయై నమః । |
| నేత్రయోః | - | రం | ధూమన్యై నమః । |
| సర్వాంగే | - | యం | కరాలికాయై నమః । |

ఇపుడు తామసీ జిహ్వాలు చెప్పబడుచున్నవి. ఇవి అభిచార కర్మలందు ప్రయోగించవలయును.

| | | | |
|---|---|---|---|
| లింగే | - | స్ర్యూం విశ్వమూర్త్యై నమః । | |
| పాదయోః | - | షం | స్ఫులింగిన్యై నమః । |
| శిరసి | - | శం | ధూమ్రవర్ణాయై నమః । |
| ముఖే | - | వం | మనోజవాయై నమః । |
| ఘ్రాణే | - | లం | లోహితాయై నమః । |
| నేత్రయోః | - | రం | కరాళాయై నమః । |
| సర్వాంగే | - | యం | కాళ్యై నమః । |

ఈ ఏడు జిహ్వాలకు ఏడుగురు అధిదేవతలు కలరు. 1. దేవతలు 2. పితరులు 3. గంధర్వులు 4. యక్షులు 5. నాగులు 6. పిశాచాలు 7. రాక్షసులు.

## అగ్నియొక్క అష్టమూర్తులు

శ్లో॥ మూర్తిరష్టౌ తనౌ న్యస్యేత్ దేశికో జాతవేదసః
మూర్ధాంస పార్శ్వ కట్యంధు కటిపార్శ్వాంస కపునః ।
ప్రదక్షిణ వశాన్ న్యస్యేదుచ్యంతే తా యథాక్రమాత్

....................................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అగ్నికి అష్టమూర్తులు కలవు. వాటిని క్రమేణ 8 అవయవములందు న్యాసము చేయాలి.

| | | | |
|---|---|---|---|
| 1. | మూర్ధాయాం | - | ఓం అగ్నయే జాతవేదసే నమః । |
| 2. | వామస్కంధే | - | ఓం అగ్నయే సప్తజిహ్వాయ నమః । |
| 3. | వామపార్శ్వే | - | ఓం అగ్నయే అశ్వోదరజాయ నమః । |
| 4. | వామకట్యాం | - | ఓం అగ్నయే అశ్వోదరజాయ నమః । |
| 5. | లింగే | - | ఓం అగ్నయే వైశ్వానరాయ నమః । |

6. దక్షిణ కట్యాం - ఓం అగ్నయే కౌమారతేజాయ నమః ।

7. దక్షిణపార్శ్వే - ఓం అగ్నయే విశ్వముఖాయ నమః ।

8. దక్షిణస్కందే - ఓం అగ్నయే దేవముఖాయ నమః ।

ఇపుడు అగ్నిని ఇలా ధ్యానించాలి.

శ్లో॥ ఇష్టం శక్తిం స్వస్తికాభీతిముచ్చైః
దీర్ఘై ర్దోభిర్ధారయంతం జవాభమ్ ।
హేమకల్పం పద్మసంస్థం త్రినేత్రం
ధ్యాయేద్వహ్నిం బద్ధమౌలింజటాభిః ॥

పిమ్మట – “రం అగ్న్యాసనాయ నమః” అను మంత్రముతో, అగ్నికి ఆసనమునిచ్చి, కుండముయొక్క మేఖలకు విశుద్ధజలముతో అభిషేకించి, మధ్య మేఖలను దర్భతో పరిస్తరణ చేయాలి.

తూర్పుదిశను విడిచ మిగిలిన మూడుదిశలందు పరిధులనేర్పచాలి. ఒక మూర పొడవుతో మోదుగ – వైకంకత (            ) మారేడు సమిధలను పరిధి అంటారు.

## అగ్నికి ప్రియమంత్రము

అగ్నిదేవునకు ఈక్రింది మంత్రము ఎంతో ఇష్టమైనది. దీనితో పంచోపచారపూజ చేయాలి.

☞ **వైశ్వానర జాతవేద ఇహావహ।**

**లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా।**

పిమ్మట షట్ కోణమధ్యమందు అగ్ని జిహ్వాలను అర్చించాలి. ఆపై వృత్తమందు అష్టదళములలో అగ్ని అష్టమూర్తులను పూజించాలి. వీరు శక్తి – స్వస్తికధారులు. ఆపై అష్టదిక్పాలురను అర్చించాలి.

## స్రుక్ స్రువ సంస్కారము

శ్లో॥ పశ్చాదాదాయ పాణిభ్యాం స్రుక్స్రువౌ తావధోముఖౌ
త్రిః సంప్రతాపయేద్వహ్నౌ దర్భా నాదాయదేశికః ।
తదగ్రమధ్యమూలాని శోధయేత్తైర్యధాక్రమాత్
గృహీత్వా వామహస్తేన ప్రోక్షయేత్ దక్షిణేన తౌ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట రెండుచేతులతో స్రుక్ – స్రువములు గ్రహించి వాటిని అధోముఖముగా అగ్నికి చూపించి వేడిచేయాలి. ఒక కుశ అగ్రభాగముతో స్రుక్ – స్రువముల అగ్రభాగమును, కుశమధ్యభాగముతో వాటి మధ్యభాగమును, మూలభాగముతో మూలభాగమును స్పృశించి శుద్ధి చేయాలి.

పిమ్మట వానిని ఎడమచేతియందుంచుకొని, కుడిచేతితో ప్రోక్షిణీ జలముతో తడపాలి. మరల వాటిని అగ్నితప్తంచేసి కుశలతో మార్జనం చేసి ఆ కుశలను అగ్నిలో వేయాలి. కుశాసనము తన కుడివైపున ఉంచాలి.

## ఆజ్య సంస్కారము

శ్లో॥ ఆజ్యస్థాలీమథాదాయ ప్రోక్షయేదస్త్రవారిణా
తస్యామాజ్యం వినిక్షిప్యం సంస్కృతంవీక్షణాదిభిః ।
నిరుహ్యావాయవ్యేఽంగారాన్ హృదాతేషు నివేశయేత్
ఇదం తాపనముద్దిష్టం దేశికైస్తంత్రవేదిభిః ।
సందీప్యదర్భయుగళ మాజ్యే క్షిప్త్వాఽనలేక్షిపేత్
గురుర్హృదయ మంత్రేణ పవిత్రీకరణం త్విదమ్ ।
దీప్తేన దర్భయుగ్మేన నీరాజ్యాజ్యం స వర్మణా

అగ్నౌ విసర్జయేద్ దర్భ మభిద్యోతన మీరితమ్ ।
ఘృతే(ప్రజ్వలితాన్ దర్భాన్ ప్రదర్శ్యాఽఽలస్త్రాణునాగురుః
జాతవేదసి తాన్ న్యస్యేదుద్యోతనమిదం స్మృతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట అస్త్రమంత్రము జపించుచూ, ఆజ్యస్థాలీ(పాత్ర)ను ప్రక్షాళనచేసి, దానియందు నేయిని పోసి వీక్షణాదులతో సంస్కరించాలి.

మరల కుండమునుండి అగ్నినితీసి వాయవ్యకోణమందుంచి "నమః" మంత్రము పఠించుచు నేతితో నిండిన ఆజ్యస్థాలిని అచట ఉంచాలి. దీనినే తంత్రవేత్తలు సంపన్నాజ్యముయొక్క తాపన సంస్కారం అంటారు.

గురువు రెండు కుశలను అగ్నియదు కొంతవేడిచేసి 'నమో' అని చదువుతూ ఆ నేతియందుంచి ఆజ్యమును పవిత్రము చేయాలి.

మండుతున్న మరొక కుశచే కవచమంత్రముతో ఆజ్యమునకు ఆరతి ఇచ్చి అగ్నియందు విడచిపెట్టాలి. దీనినే "అభిద్యోతన" సంస్కారం అంటారు.

మరల జ్వలించు కుశచేత అణుమంత్రముతో, నేతిపాత్రకు చూపించి, అగ్నియందు పడవేయాలి. దీనిని "ఉద్యోతన" సంస్కారమంటారు.

## హోమవిధి

శ్లో॥ గృహీత్వా ఘృతమంగారాన్ ప్రత్యూహ్యాగ్నౌజలంస్పృశేత్
అంగుష్ఠోపకనిష్ఠాభ్యాం దర్భౌప్రాదేశ సమ్మితౌ ।
ఘృతోత్పునీయాదస్త్రేణ ఘృతముత్వ వనంత్విదం
తద్వద్హృదయమంత్రేణ కుశాభ్యా మాత్మసమ్ముఖమ్ ।
ఘృతే సంప్లవనం కుర్యాత్ సంస్కారాః షడదీరితాః

ప్రాదేశమాత్రం సగ్రంథి దర్భయుగ్మం ఘృతాంతరే ।
నిక్షిప్యభాగౌ ద్వౌ కృత్వా పక్షౌ శుక్లేతరౌస్మరేత్
వామేనాడీమిడాంభాగే దక్షిణే పింగళాంపునః ।
సుషుమ్ణాం మధ్యతో ధ్యాత్వా కుర్యాద్ధోమంయథావిధి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఆజ్యస్థాలిని అగ్నియందు తప్తము కావించి, కిందనుంచి జలమును స్పృశించాలి. మరల ప్రాదేశ మంత్రం పొడవుగల కుశను గ్రహించి, అంగుష్ఠ – అనామికలతో పట్టుకొని, అస్త్రమంత్రము చదువుచూ ఘృతమును పవిత్రము చేయాలి. ఇది ఘృతమునకు “ఉత్ప్లవన” సంస్కారమనబడును.

మరల “నమః” మంత్రము చదువుచూ రెండుకుశలతో తన ఎదురుగానున్న ఆజ్యపాత్రపై అటూ, ఇటూ నేతిని కలపాలి. దీనిని “సంప్లవనం” అంటారు.

ఈ విధముగా ఆజ్యమునకు 6 సంస్కారములు చెప్పబడినవి. ప్రాదేశమాత్ర ప్రమాణములో గ్రంథితో కూడిన రెండు దర్భలు ఘృతమునందుంచి రెండు భాగములు చేయాలి. వాటిని కుడి, ఎడమ భాగములందు విడిచిపెట్టాలి.

పిమ్మట ఎడమప్రక్క శుక్లపక్షమును, కుడిప్రక్క కృష్ణపక్షమును భావించాలి. అదేవిధముగా ఎడమవైపున ఇడానాడిని, కుడివైపున పింగళానాడిని, మధ్యలో సుషుమ్నానాడిని ధ్యానించి, స్రువముతో తన కుడివైపునుండి ఘృతము గ్రహించి “నమః” అని హోమం ప్రారంభించాలి.

శ్లో॥ స్రువేణ దక్షిణాత్భాగాత్ ఆదాయాఽజ్యం హృదాగురుః
జుహుయాదగ్నయే స్వాహా ఇత్యగ్నేర్దక్షిణలోచనే ।
వామతస్తద్వదాదాయ వామే వహ్నౌ విలోచనే

జుహుయాదధసోమాయ స్వాహేతి హృదయాణునా ।
హృన్మంత్రేణ స్రువేణాజ్యం భాగాదాదాయ దక్షిణాత్
జుహుయాదగ్నయే స్విష్టకృతే స్వాహేతి తన్ముఖే ।
ఇతి సంపాతయేత్ భాగే స్వాజ్యస్యాఽన్వాహుతిక్రమాత్
ఇత్యగ్ని నేత్రవక్త్రాణాం కుర్యాదుద్ఘాటనంగురుః ।
సతారాభిర్ వ్యాహృతిభి రాజ్యేన జుహుయాత్ పునః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ముందుగా స్రువముతో కుడిభాగమునుండి నేతిని గ్రహించి "అగ్నయేస్వాహా" అనుచూ అగ్నియొక్క కుడికన్నును భావించి హోమం చేయాలి. అదే విధముగా మరల "అగ్నయేస్వాహా" అనుచూ ఎడమభాగము నుండి నేతిని గ్రహించి, అగ్నియొక్క ఎడమకన్నును భావించి అగ్నికుండంలో హోమం చేయాలి.

"నమః" అనుచు మధ్యభాగమునుండి స్రువముతో నేతిని గ్రహించి "సోమాయ స్వాహా" అనుచూ, అగ్నియొక్క లలాట నేత్రమును భావించి ఆహుతి చేయాలి. మరల దక్షిణ భాగము నుండి "నమః" అనుచూ స్రువముతో నేతిని గ్రహించి "అగ్నీషోమీ భ్యాం స్వాహా" హృదయాయ నమః అనుచూ హోమం చేయాలి.

"అగ్నయే స్విష్టకృతే స్వాహా" అను మంత్రముతో అగ్నియొక్క ముఖము భావించి హోమం చేయాలి. ఈ విధముగా గురువు ప్రత్యేక ఆహుతులతో అగ్నియొక్క నేత్ర - హృదయ మరియు ముఖములందు హోమం చేయాలి.

హోమము చేయు నేతిని గూర్చి **"పింగళామతము"** నందిట్లున్నది.

శ్లో॥ ఉత్తమం గోఘృతం జ్ఞేయం మధ్యమం మహిషీ ఘృతం
అధమం ఛాగలీజాతం తస్మాత్ గవ్యం ప్రశ్యస్యతే ॥

**"సోమశంభు పద్ధతి"** యందు, 6 అగ్నిజిహ్వల (నాలుకల) గూర్చి ఇట్లున్నది.

శ్లో॥ రుద్రేంద్రవహి మాంసాద వరుణానిలగోచరే ।
హిరణ్యాద్యాః స్థితా వహ్నౌ రసనాః షట్ హ్యనుక్రమాత్ ।

**"గణేశవిమర్శిని"** యందిట్లున్నది.

శ్లో॥ మధ్యేచ కోణషట్కేచ జిహ్వా సంపూజయేత్తతః
హిరణ్యాతప్తహేమాభా శూలపాణి దిశిస్థితా ।
వైఢూర్య వర్ణాగగనా ప్రాచ్యాం దిశిసమాశ్రితా
తరుణాదిత్య సంకాశా రక్తా జిహ్వాఽగ్నిదిక్స్థితా ।
కృష్ణానీలాబ్జ సంకాశా నైరుత్యాం దిశి సంస్థితా
సుప్రభా పద్మరాగాభా వారుణ్యాం దిశిసంస్థితా ।
అతిరిక్తా జపాభాసా వాయవ్యాందిశి సంస్థితా
బహురూపాయ ధార్ధాభా దక్షినోత్తర సంస్థితా ।
ఏతాజ్వాలా రుచాపీతా వరాభయయుతా అపి ॥

"శైవాగమము" నందు దర్భల ప్రాదేశ మాత్రత్వముగూర్చి ఇట్లున్నది.

**ప్రాదేశమాత్ర దర్భాభ్యా మంగుష్ఠా నామికాగ్రకైః ।**
**ఘృతాభ్యాం సముఖం వహ్నౌ రస్త్రేణోత్పవనంచరేత్ ॥**

## అగ్నియొక్క గర్భాధానాది సంస్కారములు

శ్లో॥ జుహుయాదగ్ని మంత్రేణ త్రివారం దేశికోత్తమః
గర్భాధానాదికావహ్నేః క్రియా నిర్వర్తయే క్రమాత్ ।
అష్టాభిరాజ్యాహుతిభిః ప్రణవేన పృథక్ పృథక్
గర్భాధానం పుంసవనం సీమంతోన్నయనంపునః ।

అనంతరం జాతకర్మా స్యాన్నామకరణం తథా
ఉపనిష్క్రమణం పశ్చాదన్నప్రాశనమీరితమ్ ।
చౌలోపయనే భూయో మహానామ్న్యం మహావ్రతం
అథోపనిషదం పశ్చాత్ గోదానోద్వాహకౌ మృతిః ।
శుభేషు స్యుర్వి వాహాంతాః క్రియాస్తాః క్రూరకర్మసు
మరణాంతాః సముద్దిష్టాః వహ్నేరాగమ వేదిభిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ప్రణవమంత్రముతో ప్రతీ సంస్కారమునందు 8-8 సార్లు ఆహుతి సమర్పించాలి. 1. గర్భాధానము 2. పుంసవనము, 3. సీమంతోన్నయనము, 4. జాతకర్మ, 5. నామకరణము, 6. ఉపనిష్క్రమణము, 7. అన్నప్రాశన, 8. చూడాకర్మ, 9. ఉపనయనము, 10. సావర్తనం.

ఈ సమావర్తన స్నానానంతరం గోదానం - వివాహం - మృతి ఈ సంస్కారములు చేయాలి. శుభకర్మలందు గర్భాధానము నుండి వివాహ పర్యంత సంస్కారములు అగ్నికి ఆచరించాలి. అభిచారాది కర్మలందు మరణాంత సంస్కారములు చేయాలి. "నామకరణం శివాగ్ని" అని చేయాలని గ్రంథాంతరములో **"వాయవీయ సంహిత"** యందిట్లున్నది.

☞ **జాతం ధాత్వైవమాకారం జాతకర్మ సమాచరేత్**
**నాలాపనయనం కృత్వా తతః సంశోధ్య సూతకం।**
**"శివాగ్ని" రితి నామాస్య కృత్వాహుతి పురస్సరం**
**పిత్రోర్విసర్జనంకృత్వా చౌలోపనయనాదికం।**
**అథోద్వాహావసానీంచ కృత్వా సంస్కార మస్యతు ॥**

## అగ్నిపితృపూజ

శ్లో॥ తతశ్చ పితరౌతస్య సంపూజ్యాత్మని యోజయేత్
సమిధః పంచ జుహుయా న్మూలాగ్ర ఘృత సంప్లుతాః ।

మంత్రైర్జిహ్వాంగ మూర్తీనాం క్రమాద్వహ్నేర్యథావిథి
ప్రత్యేకంజుహుయాదేకాం మాహుతిం తంత్ర విత్తమః ।
అవదాయ స్రువేణాజ్యం చతుఃస్రుచి విధాయతాం
స్రువేణతిష్ఠన్నేవాగ్నౌ దేశికో యతమానసః ।
జుహుయాద్వహ్ని మంత్రేణ వౌషడంతేన సంపదే
విఘ్నేశ్వరస్యమంత్రేణ జుహుయాదాహుతీర్దశ ।
సామాన్యం సర్వతంత్రాణామేతదగ్ని ముఖంమతం ।
తతః పీఠం సమభ్యర్చ్య దేవతాయా హుతాశనే ।
అర్చయేద్వహ్ని రూపాంతాం దేవతామిష్టదాయినీం
తన్ముఖే జుహుయాన్మంత్రీ పంచవింశతి సంఖ్యయా ।
ఆజ్యేన మూలమంత్రేణ వక్త్రైకీ కరణం త్విదం
వహ్నిదేవతయోరైక్యమాత్మనా సభభావయన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట అగ్నియొక్క తల్లిదండ్రులను పూజించాలి. అగ్నియందు ఆత్మను భావించి 5 సమిధలు ఆమూలాగ్రము నేతిలో ముంచి వాటిని హోమం చేయాలి.

పిమ్మట స్రువముతో నాలుగుసార్లు నేతిని గ్రహించి స్రుచము నందుంచి, దానిని స్రువముతో మూసి, నిలబడి, వౌషడంత మూల మంత్ర ముతో హోమం చేయాలి. పిమ్మట మహాగణపతికి 10 ఆహుతు లివ్వాలి.

పిమ్మట ప్రస్తుతము తాననుష్ఠిచుచున్న దేవతయొక్క పీఠపూజ చేయాలి. ఇష్టదేవతను అగ్నిరూపము భావించి 25 ఆహుతులివ్వాలి.

ఈవిధముగా మూలమంత్రముతో ఆజ్యము ద్వారా అగ్నియొక్క ఏకీకరణము పూర్తవుతుంది. పిమ్మట ఆ అగ్ని మరియు ప్రకృత ఇష్టదేవతా ఏకీకరణమూ తన ఆత్మయందుంచినట్లు భావించాలి.

"**శైవాగమము**"నందు భావనగూర్చి ఇట్లున్నది.

☞ **ఇతీష్టవక్త్రే వక్త్రాణా మంతర్భావస్తు చైకతా।**
**అథవా కుండమానత్వం యదీష్టవదనే స్మరేత్॥**

## నాడీ సంధానం

శ్లో॥ మూలమంత్రేణ జుహుయా దాజ్యైనైకాదశాహుతీః
నాడీసంధాన ముద్దిష్ట మేతదాగమ వేదిభిః ।
జుహుయాదంగముఖ్యానా మావృతీనామనుక్రమాత్
తతోఽన్యేష్వపి కుండేషు సంస్కృతేషు యథావిధి
ఆచార్యో విహరేదగ్నిం పూర్వాదిషు సమాహితః ।
ఋత్విజో గంధ పుష్పాద్యైరంగాద్యా వరణాన్వితాం
మూలేనాజ్యేన జుహుయుః పునరాజ్యాన్వితైస్తిలైః
ద్రవ్యైర్వా కల్పవిహితైః సహస్రం సాష్టకం పృథక్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట మూలమంత్రముతో 12సార్లు ఆజ్యాహుతి సమర్పించాలి. దీనినే "నాడీసంధానం" అంటారు. ఇదే ప్రకారము అగ్నియొక్క అంగదేవతలు, పరివారదేవతలకు మూల మంత్రముతో ఒక్కొక్క ఆహుతి సమర్పించాలి.

## రెండవరోజు చేయవలసినది

దీక్షా దినమునకు రెండవరోజున అగ్నికుండమునకు తూర్పుదిశ మొదలుకొని, ఈశాన్యదిశ పర్యంతము సమాహితచిత్తముతో అగ్నిస్థాపన చేయాలి.

ఋత్విజులు గంధ పుష్పాది ఉపచారములతో అంగాది ఆవరణము లతో తంత్రోక్తముగా దేవతాపూజ చేసి, మూలమంత్రము చదువుచూ నేతితో

లేదా ఆజ్యయుక్త చరుద్రవ్యముతో (హోమము చేయు పదార్థములు) 25 సార్లు హోమం చేయాలి.

పిమ్మట రెండవరోజున ఆజ్యయుక్త తిలలతో 25 ఆహుతులివ్వాలి. ఇతర ద్రవ్యములతో కూడా 108 సార్లు హోమం చేయవచ్చు. హోమము ధూమాధిక్యముగా నుండరాదు.

**"బహ్వృచ పరిశిష్టము"** నందిట్లున్నది.

☞ **అంధోబుధః సధూమేచ జుహుయాత్ యోహుతాశనే**
**యజమానో భవేదంధః సపుత్రఇతిచ శృతిః**

**"చందోగ పరిశిష్టము"** నందిట్లున్నది.

☞ **యోఽ నర్చిషి జుహోత్యగ్నౌ వ్యంగారిణి చ మానవః**
**మందాగ్ని రామయావీ చ దరిద్రశ్చోప జాయతే।**
**తస్మాత్ సమిద్ధేహోతవ్యం నాసమిద్ధే కధంచన**
**ఆరోగ్యమిచ్ఛ తాయుశ్చ శ్రియమిత్యాంతకీం తధా।**

**"మహాకపిల పంచరాత్రము"** నందు జ్వాలలు లేని అగ్నియందు హోమము చేయరాదని ఇట్లు చెప్పబడినది.

☞ **అప్రదీప్తే న హోతవ్యం మధ్యమే నాప్యనిందితే**
**ప్రదీప్తే లేవిహానేఽ గ్నౌ హోతవ్యం కర్మసిద్ధయే॥**

# షడధ్వశోధనం

శ్లో॥ తతః సుధౌత దంతాస్యం స్నాతం శిష్యం సమాహితం
పాయయిత్వా పంచగవ్యం కుండస్యాంతిక మానయేత్ ।
విలోక్య దివ్యదృష్ట్యాతం తచ్చైతన్యం హృదంబుజాత్
గురురాత్మని సంయోజ్య కుర్యాదధ్వ విశోధనమ్ ।

ఉక్తం కలాధ్వా తత్త్వాధ్వా భువనాధ్వేతి చత్రయం
వర్ణాధ్వాచ పదాధ్వాచ మంత్రాధ్వేత్యపరంత్రయం ।
నివృత్యాద్యాః కలాః పంచ కలాధ్వేతి ప్రకీర్తితః
తత్త్వాధ్వా బహుధాభిన్నః శివాద్యాగమభేదతః ।
షట్త్రింశత్ శివతత్త్వాని ద్వాత్రింశద్ వైష్ణవానిచ
చతుర్వింశతి తత్త్వాని మైత్రాణి ప్రకృతేః పునః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట దంతధావనము మరల చేసుకొని, స్నానమాచరించిన శిష్యుని, గురువు స్వయముగా పంచ గవ్యములను సేవింపచేయాలి. కుండసమీపనమునకు తీసుకొనివచ్చి, తన దివదృష్టితో శిష్యుని చైతన్యశక్తిని హృదయకమలము నుండి లాగి తన ఆత్మయందుంచి "అధ్వశోధన" చేయాలి.

అర్థరూపమైన అధ్వలు మూడు కలవు. 1. కలాధ్వ, 2. తత్త్వాధ్వ, 3. భువనాధ్వ, శబ్దరూపములైన అధ్వలు మరి మూడు కలవు. 1. వర్ణాధ్వా, 2. పదాధ్వ, 3. మంత్రాధ్వ.

## 5. కలాధ్వలు

కలాధ్వలు 5 కలవు. 1. నివృత్తి, 2. ప్రతిష్ఠ, 3. విద్యా, 4. శాంతి, 5. శాంత్యతీత, తత్త్వాధ్వ శివాది ఆగమభేదముచే అనేక రకములుగా నున్నది. శైవాగమరీత్యా 36 తత్త్వములు, వైష్ణవాగమ రీత్యా 32 తత్త్వములు. సాంఖ్యమతరీత్యా 24 తత్త్వములు కలవు. ప్రకృతి సిద్ధాంతమునందు 10 తత్త్వములు చెప్పబడినవి. త్రిపురామతమునందు 7 తత్త్వములు చెప్పబడినవి.

"**ప్రయోగ సారము**" నందు పంచగవ్యముగూర్చి ఇట్లు చెప్పబడినది.

☞ **పంచగవ్యం యధాప్రోక్తం పీత్వాఽచాంతం యధావిధి**
**ద్వారేణ దక్షిణేనాథ యాగస్థానం ప్రవేశయేత్।**

**"షడధ్వమహారత్నము"** నందిట్లున్నది.

☞ **శోధనం నామతత్వానాం కారణైకత్వచింతనం**
**వర్ణాదీనాం కలానాంచ తస్యాంబింద్వైక్య చింతనమ్।**

## శివతత్త్వము

శ్లో॥ తత్త్వాని శైవాన్యుచ్యంతే శివఃశక్తిఃసదాశివః
ఈశ్వరో విద్యయాసార్థం పంచశుద్ధాన్యమూని హి ।
మాయా కాలశ్చ నియతిః కలావిద్యా పునఃస్మృతా
రాగః పురుష ఏతాని శుద్ధాశుద్ధాని సప్త చ ।
ప్రకృతిర్బుధ్యహంకారో మనోజ్ఞానేంద్రియాణ్యథ
కర్మేంద్రియాణి తన్మాత్రాః పంచభూతాని దేశికాః ।
ఏతాన్యాహురశుద్ధాని చతుర్వింశతి రాగమే
శైవానామితి తత్త్వానాం విభాగోఽత్ర ప్రదర్శితః ।
జీవప్రాణ ధియశ్చిత్తం జ్ఞాన కర్మేంద్రియాణ్యథ
తన్మాత్రాః పంచభూతాని హృత్పద్మం తేజ సాంత్రయమ్।
వాసుదేవాదయశ్చేతి తత్త్వాన్యేతాని శార్ంగిణః
పంచభైతాని తన్మాత్రా ఇంద్రియాణి మనస్తథా ।
గర్వోబుద్ధిః ప్రధానం చ మైత్రాణీతి విదుర్బుధాః
నివృత్యాద్యాః కలాఃపంచ తతోబిందుఃకలాఃపునః ।
నాదఃశక్తిః సదాపూర్వః శివశ్చప్రకృతేర్విదుః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శివతత్త్వములు 36 ఇలా ఉండును. ముందుగా 5 శుద్ధ తత్త్వములు 1. శివ, 2. శక్తి, 3. సదాశివ,

4. విద్య, 5. శుద్ధ తత్త్వములు 1. శివ, 2. శక్తి, 3. సదాశివ, 4. విద్య, 5. ఈశ్వరులు, తరువాత 7 శుద్ధాశుద్ధతత్త్వములు 1. మాయ, 2. కాల, 3. నియతి, 4. కళ,5. విద్య, 6. రాగము, 7. పురుషుడు.

పిమ్మట అశుద్ధ తత్త్వములు 24. అవి, 1. ప్రకృతి, 2. బుద్ధి, 3. అహంకారము, 4. మనస్సు, 5-9. విధముల జ్ఞానేంద్రియములు, 10-14. కర్మేంద్రియములు 15-19. పంచన్మాత్రలు, 20-24. పంచమహాభూతములు. మొత్తం 5+7+24=36.

## వైష్ణవ తత్త్వములు

వైష్ణవ తత్త్వములు 32, జీవుడు, ప్రాణము, బుద్ధి, చిత్తము, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచన్మాత్రలు, పంచమహాభూతములు, హృత్పద్మము, సూర్య చంద్ర అగ్నిరూప తేజస్సులు మూడు, వాసుదేవాది చతుర్వ్యూహములు మొత్తం 32.

## సాంఖ్య తత్త్వములు

సాంఖ్య తత్త్వములు 24, పంచభూతములు, పంచతన్మాత్రలు, దశేంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము ప్రధానము (ప్రకృతి).

## ప్రకృతి తత్త్వములు

ఇవి పదిగానున్నవి. నివృత్యాది పచకళలు 6. బిందువు, 7. కళ, 8. నాదము 9. శక్తి, 10. సదాశివుడు.

# త్రిపురా తత్త్వములు

శ్లో॥ ఆత్మ విద్యా శివః పశ్చాత్ శివో విద్యాస్స్వయంపునః
సర్వతత్త్వం చ తత్త్వాని ప్రోక్తాని త్రిపదాత్మనః ।

తత్త్వాధ్వా కథితోహ్యేష తత్తదాగమ వేదిభిః
ఈరితో భువనాధ్వేతి భువనాని మనీషిభిః ।
వర్ణాధ్వేతి వదంత్యర్ణాదిక్షాంతాన్ మనీషిణః
వర్ణసంఘః పదాధ్వాస్యాత్ మంత్రాధ్వా మంత్రరాశయః ।
క్రమాదేతానధ్వనః షట్ శోధయేత్ గురుసత్తమః
పాదాంధునాభి హృద్ఖాల మూర్ధస్వపి శిశోఃస్మరేత్ ।
తతఃకూర్చేన విధివత్తం స్పృశేద్ జుహుయాద్గురుః
ఆచార్యకుండే సంశుద్ధైః స్తిలైరాజ్య పరిప్లుతైః ।
శోధయామ్యము మధ్వానం స్వాహేతి పృథ గధ్వనా
తారాద్యమాహుతీరష్టౌ క్రమాత్తాన్ విలయంన యేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - త్రిపురాతత్త్వములు 7 ఇట్లుండును. 1. ఆత్మ, 2. విద్య, 3. శివ, 4. శివ, 5. విద్య, 6. ఆత్మ, 7. సర్వతత్త్వం. ఆకాశవాయు తైజసాప్య పార్థివ భువనములు అయిదూ భువనాధ్వ అనబడును.

అకారాది క్షకారాంత వర్ణములు “వర్ణాధ్వ” అనబడును. వర్ణముల సమూహము “పదాధ్వ” అనబడును. మరియు మంత్రములయొక్క గుంపును “మంత్రాధ్వ” అందురు.

పిమ్మట కుండ సమీపమునందు శిష్యసహితముగా కూర్చొని గురువు, షడధ్వలను శోధించుటకు, వాటిని క్రమముగా పాద - గుహ్య - నాభి - హృదయ - లలాట - శిరః ప్రదేశములందు స్మరించి శోధన చేయాలి.

## ప్రయోగ విధి

1. పాదమునందు కలాధ్వను స్మరించి “గుహ్యానాభిహృదయ వక్త్ర శిరఃస్సు పంచకలాః విన్యసామి” అని తత్త్వాధ్వ శోధన ఆచరించాలి. 3.

నాభియందు భువనాధ్వను 4. హృదయమందు వర్ణాధ్వను 5. లలాట మందు పదాధ్వను 6. శిరస్సునందు మంత్రాధ్వను స్మరణ పూర్వక **న్యాసము** చేసి, షడధ్వసంశోధనం చేయాలి.

పిమ్మట గురువు కూర్చతో శిష్యుని స్పృశించుచూ, 8 ఆహుతులగ్నికి సమర్పించాలి. శుద్ధిచేసిన తిలలను నేతితో తడిపి "అధ్వానం శోధయామి స్వాహా" అనుచూ ప్రతీ అధ్వకూ విడివిడిగా 6 ఆహుతులు సమర్పించాలి.

మరల ప్రణవముతో 8 ఆహుతులిచ్చి, సంహారక్రమముతో ఆ అగ్నిని శివునియందు లీనము చేయాలి. పిమ్మట విలీనమైన ఆ అగ్నిని సృష్టిక్రమముచే ఉత్పన్నం చేసినట్లు భావించాలి.

**"వాయవీయసంహిత"** యందు పదాధ్వ-మంత్రాధ్వగూర్చి ఇట్లు వివరించబడినది.

☞ **అనేకభేదసంభిన్నః పదాధ్వా పదసంహతిః**
**మహామంత్రోపమంత్రాణాం వర్తతేఽ వయవాత్మనా ।**
**ప్రధానావయవత్వేన సోఽ ధ్వా పంచపదాత్మకః**
**మంత్రరాశయః అకచట తపయాః సప్తమంత్రాః ।**

## శిష్యునియందు ఆత్మచైతన్య యోజనం

శ్లో॥ విలోకయన్ తం దివ్యదృష్ట్యా తంశిశుం దేశికోత్తమః
ఆత్మస్థితం తచ్చైతన్యం పునఃశిష్యే నియోజయేత్ ।
స్రుచా పూర్ణాహుతిం దత్వా మూలమంత్రేణ మంత్రవిత్
ఉద్వాస్య దేవతాం కుంభే సాంగాం సావరణాం గురుః ।
పునర్ వ్యాహృతిభిర్ హృత్వా జిహ్వాదీనాం విభావసోః
ఏకైక మాహుతిం హుత్వా పరిషిచ్యాద్ భిరాత్మని ।

పానకంయోజయిత్వా స్వే పరిధీన్ సపరిస్తరాన్
నైమిత్తికే దహేన్మంత్రీ నిత్యే తు న దహేదిమాన్ ।
నేత్రే శిష్యస్య బధ్నీయాద్ నేత్రమంత్రేణ వాససా
కరేగృహిత్వా తం శిష్యం కుండతో మండలంనయేత్ ।
తస్యాంజలిం పునః పుష్పైః పూరయిత్వాయథావిధి
కలశే దేవతాప్రీత్యై క్షేపయేన్మూలముచ్చరన్ ।
వ్యపోహ్య తం నేత్ర బంధ మాసీనం దర్భ సంస్తరే
ఆత్మయాగక్రమాద్ భూయః సంపూత్యోత్పాద్యదేశికః ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** – గురువు దివ్యదృష్టిచే శిష్యుని చూచుచూ, ఆత్మగతచైతన్యమును శిష్యునియందు పునః స్థాపించాలి. మంత్రజ్ఞ సాధకుడు మూలమంత్రము చదువుచూ స్రుచతో పూర్ణాహుతి ప్రదానం చేయాలి. మరల అగ్నియందు ఇంతకుముందు స్థాపించిన అంగ – ఆవరణ సహిత సమస్త దేవతలను విసర్జించి వారిని కుంభమందుంచాలి.

వ్యస్త – సమస్త వ్యాహృతులతో హోమముచేసి అగ్నిజిహ్వాలకు, అధిదేవతలకు, అంగ – మూర్తి – లోకపాలకులకు వారి ఆయుధములకు చతుర్థ్యంతము చెప్పి స్వాహాపదము చేర్చి ఒక్కొక్క ఆహుతి సమర్పించాలి.

(ఇచట సంప్రదాయరీత్యా మా గురువుగారు బ్రహ్మశ్రీ రుద్రకపాల శాస్త్రిగారు వ్యాహృతులకు, మహావ్యాహృతులద్వారా ఇవ్వాలని చెప్పారు. మహావ్యాహృతు లిట్లుండును.

**ఓం భూరగ్నయేచ పృథివ్యై చ మహతేచ స్వాహా ।**

**ఓం భువోవాయవే చాంతరీక్షాయచ మహతేచ స్వాహా ।**

**ఓం స్వరాదిత్యాయ చ దివేచ మహతే చ స్వాహా ।**

**ఓం భూర్భువః స్వశ్చంద్రమసే చ నక్షత్రేభ్యశ్చ దిగ్భ్యశ్చ, మహతేచ స్వాహా**

అలాగే హోమ హోమసమాప్తి కూడా "మహావ్యాహృతుల"తో చేయాలని ఆదేశించారు – మేడవరపు సంపత్‌కుమార్)

తరువాత ప్రోక్షణీజలముతో అగ్నినభిషేకించి అగ్నిని తన ఆత్మయందు ఏకీకరణముచేసి పరిధులను పరిస్తరణ సహితముగా అగ్నియందు జ్వలించాలి. ఈ విధానమును సాధకుడు నైమిత్తిక కర్మనందే చేయాలి. నిత్యకర్మయందు ఈ పరిధులను జ్వలించరాదు.

మరల నూతనవస్త్రముతో "నేత్రాభ్యాంవౌషట్" అని పఠించుచూ గురువు, శిష్యుని నేత్రములకు కట్టుకట్టాలి. శిష్యుని చేయి పట్టుకొని కుండ సమీపమునకు తీసుకొనిరావాలి.

శిష్యుని అంజలిలో నిండుగా పూవులుంచి, మూలమంత్రము పఠించుచూ, పశ్చిమద్వారమువద్దకు తీసుకువచ్చి కలశముపై ఆ పూవులను వేయించాలి. అపుడు దేవతా ప్రసన్నమగును.

అనంతరము నేత్రములకు కట్టిన గుడ్డతీసి వేయాలి. పిమ్మట కుశాసనముపై కూర్చుండబెట్టి శిష్యునిచే భూతసంహార, భూతసృష్టి క్రమముతో ఆత్మయాగము చేయించాలి.

"**నారాయణీయము**" నందు విశేషముగా ఇట్లున్నది.

☞ **న్యాసం శిష్యతనౌ కృత్వా తం ప్రదక్షిణ మానయేత్**
**పశ్చిమద్వారమానీయ క్షేపయేత్ కుసుమాంజలిమ్ ॥**

శ్లో॥ తత్తన్మంత్రో దితాన్ న్యాసాన్ కుర్యాద్దేహే శిశోస్తదా
పంచోపచారైః కుంభస్థాం పూజయిత్వేష్టదేవతామ్ ।
తస్యాః తంత్రోక్తమార్గేణ విదధ్యాత్ సకలీకృతిం
మండలేఽలంకృతే శిష్యమన్యస్మిన్నుపవేశయేత్ ।

నదత్సు పంచవాద్యేషు సార్ధం విప్రాశిషాగురుః
విధివత్ కుంభముద్ ధృత్య తన్ముఖస్థాన్ సురద్రుమాన్ ।
శిశోఃశిరసి విన్యస్య మాతృకాం మనసాజపన్
మూలేన సాథితైస్తోయైరభిషించేత్ తమాత్మవిత్ ।
పూజితాం పునరాదాయ వర్ధినీమస్త్రరూపిణీం
తస్యాం సుసాధితితైస్తోయైః శిక్షేద్రక్షార్థ మంజసా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అనంతరము కుంభమందలి దేవతలకు పంచోపచారపూజ చేయించాలి. శిష్యుని దేహమునందు ఆయా దేవతల న్యాసములు చేయాలి. సకలీకరణం ఆచరించాలి. పిమ్మట అలంకృత మండలమునకు బయట ఈశాన్యమునందు కూర్చుండబెట్టాలి.

బ్రాహ్మణ ఆశీర్వాదమును పంచవాద్యములు ఘోషించుచుండగా పొంది విధ్యుక్తముగా కుంభమును పైకెత్తి, దానియందు స్థాపించిన కల్పవృక్షమును మనస్సునందు విలోమ రూపముగా మాతృకను జపించుచూ శిష్యుని శిరస్సుపై నుంచాలి.

మరల మూలమంత్రముతో కలశజలముతో శిష్యుని అభిషేకించాలి. పూర్వదిశయందు అస్త్రమంత్రముతో పూజించిన వర్ధినిని (జారీచెంబును) తీసుకొని, అందలి జలముతో తత్వములతో శిష్యుని అభిషేకించాలి.

## 1. క్రియావతీ దీక్ష

శ్లో॥ అవశిష్టేనతోయేన శిష్యమాచామయేద్గురుః
తతస్తం సకలీకుర్యాద్ దేవతాత్మాన మాత్మవిత్ ।
ఉత్థాయ శిష్యో విమలే వాససీ పరిధాయచ
ఆచమ్య వాగ్యతో బూత్వా నిషీదేత్ సన్నిధౌగురోః ।

దేవతామాత్మనః శిష్యే సంక్రాంతాం దేశికోత్తమత్తమః
పూజయేద్ గంధ పుష్పాద్యైరైక్యం సంభావయస్తయోః ।
దద్యాద్విద్యాం తతస్తస్మై వినీతాయాఽఽంబపూర్వకం
గురోర్లబ్ధాం పునర్విద్యా మష్టకృత్వో జపేత్ సుధీః ।
గురువిద్యా దేవతానామైక్యం సంభావయన్థియా
ప్రణమేద్ దండవత్ బూమౌ గురుంతం దేవతాత్మకమ్ ।

☞ **తస్య పాదాంబుజ ద్వంద్వం నిజమూర్ధని యోజయేత్**
**శరీరమర్థంప్రాణం చ సర్వంతస్మై నివేదయేత్।**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మిగిలిన జలముతో ఆచమనం చేయించాలి. అనంతరము శిష్యుడు నూతన వస్త్రములు ధరించి వచ్చి, గురు సమీపమున కూర్చుండి ఆచమనం చేయాలి.

శిష్యునియందున్న ఆత్మయందు దేవతాసంక్రమణమును తెలుసుకొని, దేవతతో అభిన్నుడైన శిష్యుని గంధ పుష్పాదులచే పూజించాలి. (ఇందువల్ల తాను గురువుననే అహంకారము తొలగును. శిష్యుడు కూడా దేవతాస్వరూపుడే).

పిమ్మట శిష్యుని చేతిలో నీరుపోసి మంత్రదానము చేయాలి. శిష్యుడు ఆ మంత్రమును 8సార్లు జపించాలి. ఇదే క్రియావతీ దీక్ష అనబడును. గురువు అచటనే తన శక్తి హీనము కాకుండా 1008 సార్లు మంత్రజపం చేయాలి.

గురువు - మంత్రము - దేవత ఈ మూడూ ఒకటే అను ఏకత్వ భావనను శిష్యుడు కలిగి యుండాలి. గురువునకు సాష్టాంగ ప్రణామ మాచరించి, గురువుగారి చరణ కమలములను తన శిరస్సుపై నుంచుకొని, తన ధన - మన - ప్రాణములన్నీ గురుసమర్పణ చేయాలి.

గురుదక్షిణ ఇవ్వవలెనని **"మంత్రతంత్రప్రకాశ"** యందు ఇట్లు పేర్కొనబడినది.

☞ **ఆచార్యా దనభిప్రాప్తః ప్రాప్తశ్చాదత్త దక్షిణః**
**సతతం జప్యమానోఽపి మంత్రఃసిద్ధిం నగచ్ఛతి ।**
**సర్వస్వం వాతదర్థంవా విత్తశార్య వివర్జితః**
**గురవేదక్షిణాం దత్వా తతో మంత్రగ్రహో మతః ।**

**"వాయవీయ సంహిత"** యందిట్లున్నది.

☞ **మండపం గురవే దద్యాత్ యాగోపకరణైస్సహా ।**

కుడిచెవిలో మూడుసార్లు మంత్రం చెప్పవలెనని మరొకచోట ఇట్లు చెప్పబడినది. ఋష్యాది సహితంగా ఉపదేశించాలి.

☞ **ఋష్యాదియుక్తమథ మంత్రవరం యధావత్**
**బ్రూయాత్ త్రిశో గురురనర్ఘ మవామకర్ణే ॥**

**"ప్రయోగసార"** గ్రంథమందు విధి నిషిద్ధములిట్లు వివరింప బడినవి.

దేవస్థానే గురుస్థానే శ్మశానేవా చతుష్పథే
పాదుకాసన విణ్మూత్ర మైధునాని పరిత్యజేత్ ।
దేవం గురుం గురుస్థానం క్షేత్రం క్షేత్రాధి దేవతాః
సిద్ధం సిద్ధాధికారాంశ్చ శ్రీపూర్వం సముదీరయేత్ ।
ప్రమత్తా మంత్యజాం కన్యాం పుష్పితాం పతితస్తనీం
విరూపాంముక్తకేశీంచ కౌమార్తాంచ న నిందయేత్ ।
కన్యాయోనిం పశుక్రీడాం దిగ్వస్త్రాం ప్రకటస్తనీం
నాలోకయేద్ పరద్రవ్యం పరదారాంశ్చ వర్జయేత్ ।
ధాన్యగోగురు దేవాగ్ని విద్యాకోశ నరాన్ ప్రతి

నైవప్రసారయేత్ పాదౌ నైతానపి నలంఘయేత్ ।
ప్రతిగ్రహం న గృహ్ణీయా దాత్మ భోగ విధిత్సయా
ధారయేదార్జవం సత్యం సౌశీల్యం సమతాంధృవమ్ ॥

**"షడన్వయ మహారాత్రము"** నందిట్లున్నది.

నలంఘయేద్ గురోరాజ్ఞా ముత్తరం నవదేత్తథా
రాత్రౌ దివాచ తస్యాజ్ఞాం దాసవత్పరి పాలయేత్ ।
అద్వైతం దేవపూజాశ్చ గురోరగ్రే పరిత్యజేత్
అంగభంగంచ లీలాంచ న కుర్యాద్ గురుసన్నిధౌ ।
ప్రగురోః సన్నిధౌ నైవ స్వగురుం ప్రణమేద్ బుధః
నమస్కారాయ చోద్యుక్తం గురుర్దృష్ట్వా నివారయేత్ ।
న నియోగం గురోర్దద్యాత్ యుష్మదానైవభాషయేత్ ॥

## 2. వర్ణాత్మికా దీక్ష

శ్లో॥ ఋత్విగ్భ్యో దక్షిణాం దత్వా సమగ్రాం ప్రియమానసః
బ్రాహ్మణాంస్తర్పయేత్ పశ్చాత్ భక్ష్యభోజ్యైః సదక్షిణైః ।
ఏషాక్రియావతీ దీక్షా ప్రోక్తా సర్వ సమృద్ధిదా
అథ వర్ణాత్మికాం వక్ష్యే దీక్షామాగమవేదితామ్ ।
పుంప్రకృత్యాత్మకా వర్ణాః శరీరమపితాదృశం
యతస్తస్మాత్తనౌ న్యస్యేద్ వర్ణాన్ శిష్యస్య దేశికః ।
తత్తత్ స్థాన యుతాన్ వర్ణాన్ ప్రతిలోమేన సంహరేత్
స్వాజ్ఞయా దేవతాభావాత్ విధినాదేశికోత్తమః ।
తదావిలీన తత్త్వోఽయం శిష్యోదివ్యతనుర్భవేత్
పరమాత్మని సంయోజ్య తచ్చైతన్యం గురూత్తమః

తస్మాదుత్పాద్య తాన్ వర్ణాన్ న్యస్యేచ్ఛిష్యతనౌ పునః ।
సృష్టిక్రమేణ విధివచ్చైతన్యంచ నియోజయేత్
జాయాతే దేవతాభావః పరానందమయః శిశోః ।

**సంపత్కురీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట సమస్త ఋత్విజులకు దక్షిణలిచ్చి సత్కరించాలి. వివిధ రకముల భక్ష్యభోజ్యములతో భోజనం చేయించాలి. ఇదంతా "క్రియాదీక్ష" అనబడును.

ఇపుడు "వర్ణాత్మికాదీక్ష" వివరించబడుచున్నది. వర్ణములు పురుష రూపములు, శిష్యుడూ పురుషుడే. శిష్యశరీరమునందు గురువు వర్ణన్యాసము చేసి, శిష్యగత చైతన్యమును పరమాత్మయందు సంలగ్నము చేసి, తానో దేవతాస్వరూపుడై ప్రతిలోమ క్రమములో ముందు ముందు వర్ణములను దాని పూర్వవర్ణములతో ఉపసంహరించాలి.

ఈవిధముగా శిష్యుని శరీరమునందు వర్ణములు విలీనముచేసి అతని శరీరమును దేవమయము చేయవలయును. అతని శరీరమునందు సృష్టి క్రమానుసారముగా న్యాసమ చేయాలి.

అపుడు శిష్యునియందు దేవతాభావము కలిగి శుద్ధ ఆనంద స్వరూపుడగును. ఈవిధముగా చేసిన వర్ణదీక్ష సమస్త జ్ఞానములకూ జనని వంటిది యగుచున్నది.

## 3. కళావతీ దీక్ష

శ్లో॥ తతః కళావతీ దీక్షా యథావదభిహాయతే
నివృత్త్యాద్యాః కలాఃపంచ భూతానాం శక్తయోయతః ।
తస్మాత్ భూతమయే దేహే ధ్యాత్వాతావేధమేచ్ఛిశోః
నివృత్తిర్జాను పర్యంతం తలాదారభ్య సంస్థితా ।

జానునోర్నాభిపర్యంతం ప్రతిష్ఠావ్యాప్య తిష్ఠతి
నాభేః కంఠావధివ్యాప్తా విద్యాశాంతిస్తతః పరమ్ ।
కంఠాల్లలాట పర్యంతం వ్యాప్తా తస్మాచ్ఛిఖావధి
శాంత్యతీతా కళా జ్ఞేయా కళావ్యాప్తి రితీరితా ।
సంహారక్రమయోగేన స్థానాత్ స్థానాంతరే గురుః
సంయోజ్య వేధయేత్ విద్వాన్ ఆజ్ఞయాతాః శివావధి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నివృత్యాది పంచకళలందు సమస్తభూతముల శక్తియున్నది. వీటిని గురువు ధ్యానపూర్వకముగా శిష్యుని పాంచభౌతికదేహ భేదనముచేసి, వాటిని అతని శరీరమునందు ప్రవేశింప చేయాలి. దీనినే "కళాదీక్ష" అంటారు.

పాదతలమునుండి మోకాలు పర్యంతము నివృత్తి కళ యుండును. మోకాలునుండి నాభి పర్యంతము ప్రతిష్ఠాకళయుండును. నాభినుండి కంఠపర్యంతము విద్యాకళ యుండును. కంఠమునుండి లలాట పర్యంతము శాంతికళ యుండును. లలాటమునుండి శిఖపర్యంతము శాంత్యతీత కళ యుండును.

గురువు ఈ అయిదు కళలను సంహార క్రమానుసారముగా వేధ చేయాలి. ఆజ్ఞాచక్రము నుండి శివచక్రపర్యంతము ఒక చక్రముతో మరొక చక్రమును అనుసంధానము చేయాలి. ఈ దీక్షవలన శిష్యుడు దివ్యభావము పొందును.

**"దశపటలి"** యందు శుశ్రూషను ఇట్లు ప్రశంసించిరి.

శిష్యేణాపి ప్రకర్తవ్యా శుశ్రూషాచ గురోః సదా
శుశ్రూషయా వినావిద్యా నభవేత్ సా ఫలప్రదా ।
గురౌతుష్టే శివస్తుష్టః శివేతుష్టే జగత్త్రయం

గురౌ రుష్టే మహేశాని నాహంత్రాతా త్వయాసహ ।
తస్మాత్ సర్వప్రయత్నేన గురోఃకోపం న కారయేత్

## 4. వేధమయీదీక్ష

శ్లో॥ తతో వేధమయీం వక్ష్యే దీక్షాం సంసారమోచినీం
ధ్యాయేత్ శిష్యతనోర్మత్యే మూలాధారే చతుర్దలే ।
త్రికోణమధ్యే విమలే తేజస్త్రయ విజృంభితే
వలయత్రయం సంయుక్తాం తడిత్కోటి సమప్రభామ్ ।
శివశక్తిమయీం దేవీం చేతనామాత్ర విగ్రహాం
సూక్ష్మాం సైక్ష్మతరాంశక్తింభిత్వా షట్చక్రమంజసా ।
గచ్ఛంతీం మధ్యమార్గేణ దివ్యాం పరశివావథి
వాదిసాంత దళస్థార్ణాన్ సంహరేత్ కమలాసనే ।
తం షట్పత్రమయే పద్మే బాదిలాంతాక్షరాన్వితే
స్వాధిష్ఠానే సమాయోజ్య వేధయేదాజ్ఞయాగురుః ।
తాన్వర్ణాన్ సంహరేద్ విష్ణో తంపునర్నాభిపంకజే
దశపత్రే డాదిఫాంత వర్ణాఢ్యే యోజయేద్గురుః ।
తాన్వర్ణాన్ సంహరేత్ రుద్రేతం పునర్హృదయాంబుజే
కాదిఠాతార్క వర్ణాఢ్యే యోజయిత్వేశ్వరేగురుః ।
తాన్వర్ణాన్ సంహరేద స్మింస్తంభూయః కంఠ పంకజే
స్వరాఢ్య షోడశదలే యోజయిత్వా స్వరాన్ పునః ।
సదాశివే తాన్ సంహృత్య తం పునర్భ్రూసరోరుహే
ద్విపత్రే హక్షలసితే యోజయిత్వా తతోగురుః ।

**సంపత్కురీ తెలుగు వ్యాఖ్యానం** - సంసారమునుండి ముక్తి కలిగించు వేధమయీ దీక్ష వివరించబడుచున్నది. గురువు సర్వప్రథమముగా శిష్య శరీరములోని మూలాధారస్థిత త్రికోణ మధ్యచతుర్దల పద్మమందు సోమసూర్యాగ్ని తేజోసమేత కుండలినీ శక్తిని ధ్యానించాలి.

ఈ కుండలిని మూడు చుట్లుగా యుండును. దీని వెలుగు కోటానుకోట్ల విద్యుత్ ప్రభలతోనుండును. ఇది సూక్ష్మాతి సూక్ష్మమైనది. షట్చక్రములను (మూలాధార - స్వాధిష్ఠాన - మణిపుర - అనాహత - విశుద్ధ - ఆజ్ఞాచక్రములు) భేదించి, సుషుమ్నారూప మధ్యమార్గముద్వారా పరశివ పర్యంతమూ వెళ్ళును.

మూలాధారమందున్న వ - శ - ష - స, అక్షరములను బ్రహ్మయందు ఉపసంక్రమణం చేయాలి. స్వాధిష్ఠానమందున్న షట్దళ పద్మములో బ - భ - మ - య - ర - ల అక్షరములను విష్ణువునందు ఉపసంహారం చేయాలి.

దశదళ శోభితమైన మణిపూరచక్రమందు, డ - భ - ణ - త - థ - ధ - న - ప - ఫ, అక్షరములను రుద్రునియందు సంక్రమింప చేయాలి. ద్వాదశ పత్రాత్మకమైన అనాహతమందు, క - ఖ - గ - ఘ - జ - ట - ఠ అక్షరములను ఈశ్వరునియందు సమావేశం చేయాలి.

మరల ఆ వర్ణములను అచటనుండి పైకి తీసుకొని వెళ్ళి కంఠస్థానమందున్న 16 అచ్చులరూపమైన విశుద్ధచక్రమందు (16 దళములు కల పద్మమిది) స్థాపించి, సదాశివునిలో లీనం చేయాలి.

మరల ఈ వర్ణములన్నిటినీ భ్రూమధ్యమందు ద్విదళ శోభితమైన ఆజ్ఞాచక్రమందు హ - క్ష అను అక్షరములందు స్థాపించి బిందువునందు కళతో సంయుక్తం చేయాలి. మరల దానిని నాదమందు, నాదమును నాదాంతమందు, సంయుక్తం చేయాలి.

శ్లో॥ తమున్యాం సమాయోజ్య విష్ణువక్త్రాంతరే చతాం
తాంపునర్ గురువక్త్రేతు యోజయేత్ దేశికోత్తమః ।
సహైవ మాత్మనా శక్తింవేధయే త్పరమేశ్వరే ।
గుర్వాజ్ఞయా ఛిన్నపాశస్తదాశిష్యః పతేద్ భువి ॥
సంజాత దివ్యబోధోఽసౌ సర్వం విందతి తత్క్షణాత్
సాక్షాత్ శివో భవత్యేష నాత్రకార్యా విచారణా ।
ఏషావేధ మయీ దీక్షా సర్వసంవిత్ ప్రదాయినీ
క్రమాచ్చతుర్విధా దీక్షా తంత్రేఽస్మిన్ సమ్యగీరితా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నాదాంతమును ఉన్మనీ యందు, దానిని విష్ణువునందు, మరల దానిని గురుముఖమునందు గురువు సంయుక్తం చేయాలి. ఈవిధముగా శిష్యుని జీవాత్మ కుండలినీశక్తి ద్వారా శోధింపబడి పరమాత్మయందు నివేశింపబడును. ఇలా చేయుటవలన శిష్యుడు పాశముక్తుడై నేలపైబడును.

పిమ్మట దివ్యబోధ కలిగి మేల్కొని గురుచరణారవిందములకు నమస్కరించవలయును. శిష్యుడు సర్వజ్ఞుడగును. శివస్వరూపుడగును. ఇందు సందేహములేదు. ఈ "వేధమయీదీక్ష" సంపూర్ణజ్ఞానమును కలిగించును. ఈ విధముగా తంత్రశాస్త్రమునందు 4 దీక్షలు వివరించ బడినవి. 1. క్రియావతీదీక్ష 2. వర్ణాత్మికాదీక్ష 3. కళావతీదీక్ష 4. వేధమయీ దీక్ష.

**విశేష వ్యాఖ్యానము :-** జీవుని బంధించు పాశత్రయము ఈ విధముగా వుండును. 1. సహజప్రాప్త భోగము 2. ఆంగంతుక భోగము 3. సంసర్గ జన్యభోగము.

**పాశస్తు సత్సుచాసత్సు కర్మావస్థా సమీరితా**
**త్రివిధః సతువిజ్ఞేయః పాశోబంధైక సాధనః ।**
**ప్రథమః సహజః పాశస్తథా చాగంతుకః పరః**
**ప్రాసంగికః తృతీయఃస్యాదితి పాశత్రయం స్మృతమ్ ।**

**"శ్రీకంఠాచార్యులు"** బోధగూర్చి ఇట్లు పేర్కొన్నారు.

**కాలజ్ఞానం తథాకాల వంచనాన్యతనౌ తథా**
**ప్రవేశో వేధ ఇత్యాది ప్రసన్నే లభ్యతే శివే ॥**

**"షడన్వయ మహారత్నము"** నందు దీక్ష (ఆణవీదీక్ష) పది విధములుగా చెప్పబడినది.

**ఆణవీ బహుధాదీక్షా శాక్తేయీ శాంభవీ పునః**
**ఏకథైవేతి విద్వద్భిః పఠ్యతే శాస్త్రకోవిదైః ।**
**ఆణవీబహుధేత్యుక్తా తద్భేదమధునోచ్యతే**
**1. స్మార్తీ 2. మానసికీ 3. యౌగీ 4. చాక్షుషీ, 5. స్పార్శనీతథా**
**6. వాచికీ 7. మాంత్రికీ 8. హౌత్రీ 9. శాస్త్రీ 10. చేత్యభిషేచకీ**
**విదేశస్థం గురుఃస్మృత్వా శిష్యం పాశత్రయం క్రమాత్ ।**
**విశ్లిష్య లయభోగాంగ విధానేన పరేశివే**
**సమ్యగ్ యోజన రూపైషా స్మార్తీ దీక్షేతి కథ్యతే ।**
**స్వసన్నిధౌ సమాసీన మాలోక్య మనసాశుచిమ్**
**మలత్రయాదుపాయైర్యా మోచికా సాతు మానసీ।**
**యోగక్త్రకమతో యోగీ శిష్యదేహం ప్రవిశ్యతు**
**గృహీత్వాత స్య చాత్మానం స్వాత్మనా యోజనాత్మికా**
**యోగదీక్షేతి సాప్రోక్తా మలత్రయ వినాశినీ ।**

శివోహమితి నిశ్చిత్య వీక్షణం కరుణార్ద్రయా
దృశాసా చాక్షుషీ సర్వపాప ప్రణాశినీ ।
స్వయం పరశివో భూత్వా నిఃసందిగ్ధ మనాగురుః
**శివహస్తేన** శిష్యస్య సమంత్రం మూర్ధ్ని సంస్పృశేత్ ।
**స్పర్శదీక్షేతి** సాప్రోక్తా శివాభివ్యక్తి కారిణీ ॥

**శివహస్త** లక్షణమును **"సోమశంభుపద్ధతి"** గ్రంథమునందిట్లు వివరించబడినది.

☞ **గంధైర్మండలకం స్వీయే విదధ్యాత్ దక్షిణేకరే**
**విధినాత్రార్చయేద్ దేవమిత్థం స్యాత్ శివహస్తకమ్** ।

వాచికీ మొదలగు మిగిలిన దీక్షల లక్షణమిట్లుండును.

గురువక్త్రం నిజవక్త్రం విభావ్యగురురాదరాత్
గురువక్త్ర ప్రయోగేన దివ్యమంత్రాదికం శిశౌ ।
ముద్రా న్యాసాదిభిః సార్ధం దద్యాత్సేయం హి **వాచికీ**
దీక్షాపరా తదా మంత్రన్యాస సంయుక్త విగ్రహః ।
స్వయంమంత్ర తనుర్భూత్వా సక్రమం మంత్రమాదరాత్
దద్యాత్ శిష్యాయ సాదీక్షా **మాంత్రీ** మల విఘాతినీ ।
కుండే వా స్థండిలే వాపి నిక్షిప్యాగ్నిం విధానతః
లయభోగక్రమేణైవ ప్రత్యధ్వానం యథాక్రమమ్ ।
మంత్రవర్ణ కళాతత్వ పదవిష్టపమేవచ
శుధ్యర్థం హోమరూపైషా **హౌత్రీ** దీక్షా సమీరితా ।
యోగ్యశిష్యాయ భక్తాయ శుశ్రూషార్చాపరాయచ
సార్థం శాస్త్రపదా త్రయ్యా **శాస్త్రీ** దీక్షేతి సోచ్యతే ।

శివంచ శివపత్నీం చ కుంభేసంపూజ్యసాదరం
శివకుంభాభిషేకాత్సా దీక్షా స్యాదభిషేచకీ ।

## హోమద్రవ్య పరిమాణము

శ్లో॥ అథాఽత్ర హోమద్రవ్యాణాం ప్రమాణమభిధీయతే
కర్షమాత్రం ఘృతం హోమే శుక్తిమాత్రం పయఃస్మృతం ।
ఉక్తాని పంచగవ్యాని తత్సమాని మనీషిభిః
తత్సమం మధుదుగ్ధాన్నమక్షమాత్రముదాహృతమ్ ।
దధిప్రసృతి మాత్రంస్యా ల్లాజాః స్యుర్ముష్టిసమ్మితాః
పృథుకాస్తత్ప్రమాణాఃస్యుః శక్త్యోఽపి తథోదితాః ।
గుడం పలార్ధమానం స్యాత్ శర్కరాపి తథామతా
గ్రాసార్ధం చరుమానం స్యాదిక్షుః పర్వావధిర్మతః ।
ఏకైకం పత్రపుష్పాణి తథాఽపూపాని కల్పయేత్
కదలీఫలనారంగ ఫలాన్యేకైకశో విదుః ।
మాతులుంగ చతుఃఖండంపనసం దశధాకృతం
అష్టధా నారికేళాని ఖండితాని విదుర్బుధాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – హోమముచేయు ద్రవ్యముల పరిమాణము చెప్పబడుచున్నది. నేయి హోమము చేయునపుడు "కర్ష" మాత్రం చేయాలి. నూనె హోమం చేయునపనుడు కూడా ఇదే ప్రమాణం గ్రహించవలయును.

**కర్షమనగా :–**

గుంజాభిర్దశభిర్మాషః శాణో మాషచతుష్టయం
ద్వౌశోణౌ ఘటకః, కాలో బదరం ద్రక్షణశ్చయః ।

తౌద్వౌ పాణితలం కర్షః సువర్ణం కవలగ్రహః
పిచుర్బిడాల పదకం తిందుకోఽక్షశ్చ తద్ద్వయమ్ ।
శుక్తిరష్టమికా తే ద్వే పలంబిల్వం చతుర్థికా
ముష్టిరామ్రం ప్రకుంచోఽథ ద్వేపలే ప్రసృతిస్తథా ।

| | |
|---|---|
| 10 గురివింద గింజలు | 1 మాషం అనబడును. |
| 4 మాషములు | 1 శోణం అనబడును. |
| 2 శోణములు | 1 ఘటకం, లేదా 1 బదరం |
| 2 ఘటకములు | 1 కర్షం లేదా 1 చులుకం.<br>ఆచమనం చేయునపుడు కుడిచేయిని ఎట్లు ఉంచెదమో అది చులుకము అనబడును. |
| 2 కర్షములు | 1 శుక్తి |

పాలు హోమం చేయునపుడు 1 శుక్తిప్రమాణంగా ఉండాలి. పంచ గవ్యములు కూడా ఇదే ప్రమాణముగా గ్రహించాలి. తేనె, బియ్యం కర్షమెత్తు ఉండాలి.

పెరుగు 1 ప్రసృతి (2 పలములు) ఉండాలి. పేలాలు ముష్టి మాత్రం ఉండాలి. పృథుకములు (            ) సత్తుపిండి అదే ప్రమాణముండాలి.

బెల్లం అర్ధపలం, శర్కర కూడా అంతే. పత్ర, పుష్పములు హోమం చేయునపుడు ఒక్కొక్కటిగా చేయాలి. అపూపములు (అప్పాలు, జంతికలు వంటి భక్ష్యములు) ఒక్కొక్కటిగా హోమం చేయాలి.

అరటిపండు, నారింజ, ఒక్కొక్క పండుగా చేయాలి. ముక్కలు చేయరాదు. మాతులుంగము (            ) 4 ముక్కలుగా చేసి ఒక్కొక్క

ముక్క చేయాలి. పనసపండు పది ముక్కలుగా చేసి ఒక్కొక్క భాగము చేయాలి తొనలతో హోమం చేయరాదు.

కొబ్బరి 8 ముక్కలుగా చేసి ఒక్కొక్కముక్క హోమం చేయాలి.

శ్లో॥ త్రిధాకృతం ఫలం కపిత్థం ఖండితంత్రిధా
ఉర్వారుక ఫలం హోమే చోదితం ఖండితంత్రిధా ।
ఫలాన్యన్యాని ఖండాని సమిధః స్యుర్దశాంగులాః
దూర్వాత్రయం సముద్దిష్టం గుడూచీ చతురంగుళా ।
వ్రీహయో ముష్టిమాత్రాః స్యుర్ముద్గమాషాయవాఅపి
తండులాః స్యుస్తదర్థాంశాః కోద్రవాముష్టి సమ్మతాః ।
గోధూమ రక్తకలమా విహితా ముష్టి మానతః
తిలాశ్చులుకమాత్రాః స్యుః సర్షపాస్తత్ ప్రమాణకాః ।
శుక్తిప్రమాణం లవణం మరీచాన్యేక వింశతిః
పురం బదరమానం స్యాద్రామఠం తత్సమం స్మృతమ్ ।
చందనాగురు కర్పూర కస్తూరీ కుంకుమానిచ
తింతిడీబీజమానాని సముద్దిష్టాని దేశికైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మారేడుకాయ హోమం చేయునపుడు మూడు ముక్కలు చేయాలి. వెలగపండూ అంతే. ఉర్వారుకం (దోసకాయ) మూడు ముక్కలు చేయాలి. ఇతర ఫలములు కూడా మూడు ముక్కలు చేసి హోమం ఆచరించాలి.

సమిధలు 10 అంగుళముల పొడవు ఉండాలి. దూర్వలు మూడు అంగుళములుండాలి. తిప్పతీగ నాలుగు అంగుళములుండాలి. ధాన్యము – కందులు – పెసలు – మినుములు – యవలు కోద్రవములు ( ) ముష్టిమాత్రం గ్రహించాలి.

బియ్యం అర్ధముష్టి గ్రహించాలి. గోధుమలు రక్తకలమ (?) ముష్టిమాత్రంవీ తీసుకొని హోమం చేయాలి. తిలలు - ఆవాలు ఒక చులుకముతో గ్రహించి హోమం ఆచరించాలి. ఉప్పు రెండు కర్షములు (ఒక శుక్తిమాత్రము), మిరియాలు 21 చొప్పున హోమం చేయాలి.

గుగ్గులము ఒక బదరం (2 శోణములు లేదా 80 గురివిందగింజల ఎత్తు) ఇంగువకూడా ఇదే పరిమాణములో హోమం చేయాలి. చందనం - అగురు - కర్పూరం - కస్తూరి - కుంకుమపువ్వ - చింతగింజలూ - ఇదే ప్రమాణంతో హోమం చేయాలి.

## హోమభేదమందు అగ్నిధ్యాన భేదం

శ్లో॥ వైశ్వానరం స్థితం ధ్యాయేత్ సమిద్ధోమేషు దేశికః
శయానమాజ్యహోమేషు నిషణ్ణం శేషవస్తుషు ।
ఆస్యాంతర్జుహుయాదగ్నేర్వివశ్చిత్ సర్వకర్మసు
సధూమోఽగ్నిః శిరోజ్ఞేయం నిర్ధూమశ్చక్షురేవహి ।
జ్వలత్ కృష్ణో భవేత్ కర్ణః కాష్ఠమగ్నే ర్నసస్తథా
ప్రజ్వలోఽగ్నిస్తథా జిహ్వా ఏతదేవాఽగ్నిలక్షణమ్ ।
కర్ణహోమే భవేద్వ్యాధి నేత్రేఽంధత్వముదీరితమ్
నాసికాయాం మనఃపీడా మస్తకే ధనసంక్షయః ।
స్వర్ణ సింధూరబాలార్క కుంకుమ క్షౌద్రసన్నిభః
సువర్ణరేతసో వర్ణః శోభనః పరికీర్తితః ।
భేరీవారిద హస్తీంద్ర ధ్వనిర్వహ్నేః శుభావహః ।
నాగచంపక పున్నాగ పాటలాయూథికానిభః
పద్మేందీవర కహ్లార సర్పిగుగ్గులు సన్నిభః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సమిధలతో హోమము చేయునపుడు అగ్నిహోత్రుడు నిలబడియున్నట్లు ధ్యానించాలి. కేవలం నేతితో హోమం చేయునపుడు అగ్ని పడుకొనియున్నట్లు భావించి ధ్యానించాలి. ఇతర ద్రవ్యములతో హోమము చేయునపుడు అగ్ని కూర్చొని యున్నట్లు భావించి ధ్యానించాలి.

పొగతో నిండిన అగ్నిని శిరస్సు అంటారు. పొగలేని అగ్నిని చక్షువు అంటారు. జ్వలించు నల్లని వర్ణ అగ్నిని కర్ణ సంజ్ఞ. కేవలం కుష్ఠ మాత్రాగ్నిని నాసిక అంటారు.

చక్కగా జ్వలించు అగ్నిని జిహ్వా అంటారు. సర్వకార్యములందు అగ్ని జిహ్వాలందే హోమం ఆచరించాలి. అగ్ని కర్ణస్థానముగా నున్నపుడు హోమం చేసిన వ్యాధి కలుగును. నేత్రస్థానమునందు హోమం చేసిన మనోవ్యాధి కలుగును. శిరఃస్థితిలో హోమం చేసిన దరిద్రము, ధననష్టము కలుగును.

శతృనాశము కొరకు హోమము చేయునపుడు పైదుష్ట లక్షణములతో హోమం చేసిన, ఆయా అవయవములు వైకల్యము నొందును.

అగ్నివర్ణము, సింధూర - సువర్ణ - ఉదయించు సూర్యుడు - కుంకుమపువ్వు - తేనె, ఈ రంగులలో నుండవలయును. సువర్ణ వర్ణము ప్రశస్తము.

హోమము చేయునపుడు భేరి - మేఘ గర్జనం గజఘీంకారము వంటి శబ్దములు రావలయును. నాగ - సంపెంగ - మల్లి - జాజి - పాటల - కలువ - నెయ్యి - గుగ్గిల గంధమువంటి సువాసన వెలువడ వలయును.

**"శ్రీమతంగ పారమేశ్వరము"** నందిట్లున్నది.

☞ **దివ్యానామప్య దివ్యానామాకృష్ణౌ విష్ఫతే సదా**
**ధ్మాత చామీకర ప్రఖ్యో హరితాళనిభశ్చయః**

అభిచారకర్మయందు ఉగ్రగంధము వెలువడవలెను.

☞ **ఉగ్రగంధోఽ భిచారేఽ త్ర ప్రశస్తః సర్వదాఽ నలః ।**

శ్లో॥ ప్రదక్షిణాః త్యక్త కంపాశ్ఛత్రాభాః శిఖినః శిఖాః ।
శుభదాయజమానస్య రాజ్యస్యాపి విశేషతః ॥
కుందేందు ధవళో ధూమో వహ్నేః ప్రోక్తః శుభావహః ।
కృష్ణః కృష్ణగతేర్వర్ణో యజమానం వినాశయేత్ ॥
శ్వేతోరాష్ట్రం నిహంత్యాశు వాయసస్వర సన్నిభః ।
ఖరస్వర సమో వహ్నేః ధనిః సర్వ వినాశకృత్ ॥
పూతిగంధో హుతభుజో హోతుర్ దుఃఖ ప్రదోభవేత్
ఛిన్నావర్తా శిఖా కుర్యాత్ మృత్యుం ధన పరిక్షయం ॥
శుకపక్షనిభోధూమః పారావత సమప్రభః ।
హానిం తురగ జాతీనాం గవాంచ కురుతేఽ చిరాత్ ॥
ఏవంవిధేషు దోషేషు ప్రాయశ్చిత్తాయ దేశికః
మూలేనాజ్యేన జుహుయాత్ పంచవింశతి మాహుతీః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కంపన రహితమై ఛత్రాకారముగా అగ్నిజ్వాలకుడివైపుగా తిరుగుచున్నచో యజమానికి శుభప్రదము. ఆ ప్రదేశమునకు శుభకారకమూ అగును. అగ్నియొక్క ధూమము తెల్లగా, ఎర్రగానున్న శుభప్రదము.

నల్లనిపొగ యజమానిని నాశనము చేయును. అగ్ని తెల్లగా జ్వలించిన, కాకి స్వరమువలె ధ్వనించిన, రాష్ట్రనాశనం. గాడిదస్వరం వంటి ధ్వని సర్వనాశనము చేయును.

పూతిగంధము వంటి దుర్గంధము వ్యాపించిన హోతకు దుఃఖప్రదము. అగ్నిశిఖలు ఛిన్నమైన, యజామినకి మరణము కలుగును. ధనము నాశన మగును. హోమకాలమందు చిలుకరెక్కలవలె పొగరంగు ఆకుపచ్చగా నున్ననూ, పావురం రంగులో ఉన్ననూ పశునష్టం కలుగును. ఇటువంటి దోషయుక్తములైన శకునములు ప్రకటితమైనపుడు, గురువు మూలమంత్రము పఠించి 25 ఆహూతులిచ్చి ప్రాయశ్చిత్తం ఆచరించాలి.

*ఇతి శ్రీ లక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదాతిలక తంత్రే*
*పంచమః పటలః సమాప్తః*

❖❖❖

# అథ షష్ఠః పటలః

## అథమాతృకా ప్రకరణం

శ్లో॥ అథవర్ణతనుం వక్ష్యే విశ్వబోధ విధాయినీం
యస్యామనుపలబ్ధాయాం సర్వమేత జ్జగజ్జడమ్ ॥
ఋషి బ్రహ్మా సముద్దిష్టో గాయత్రీ ఛందఈరితం
సరస్వతీ సమాఖ్యాతా దేవతా దేశికోత్తమైః ।
అక్లీబహ్రా స్వదీర్ఘాంతర్గతైః షడ్వర్గకైః క్రమాత్
షడంగాని విధేయాని జాతియుక్తాని దేశికైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సమస్త జగత్తుకూ జ్ఞానశక్తిని ప్రసాదించు "మాతృక"ను వివరించుచున్నాడు. ఈ మాతృకకు బ్రహ్మఋషి – గాయత్రీ ఛందస్సు – సరస్వతీదేవతా

1. అం – కం – ఖం – గం – ఘం – ఆం – హృదయాయ నమః ఇలా షడంగ న్యాసమాచరించాలి.

అ - ఈ - ఉ - ఏ - ఓ - అం (హ్రస్వములు)

ఆ - ఈ - ఊ - ఐ - ఔ - అః (దీర్ఘములు)

క - చ - ట - త - ప - య (వర్గములు)

వీటిని పరస్పరం మేళవించి షడంగన్యాసం చేయాలి.

ఉదా - 2 ఇంచం ఛంజం షం ఇం ఈం - శిరసేస్వాహా

## వాగ్దేవతా ధ్యానం

శ్లో॥ పంచాశల్లిపిభిర్విభక్త ముఖదోః పన్మధ్య వక్షః స్థలాం
భాస్వన్మౌళినిబద్ధ చంద్రశకలామాపీన తుంగస్తనీమ్ ।
ముద్రా మక్షగుణం సుధాఢ్యకలశం విద్యాం చ హస్తాంబుజైః
బిభ్రాణాం విశదప్రభాం త్రినయనాం వాగ్దేవతామాశ్రమే ॥

ఇచట "పదార్థాదర్శ" వ్యాఖ్యానములో, రాఘవభట్టు, అక్షరములకు కూడా ధ్యానశ్లోకములు, ఇతర తంత్రగ్రంథము నుండి ఉల్లేఖించాడు. అవి కూడా సాధకుల సౌకర్యార్థము వ్రాయబడుచున్నవి.

## అక్షర ధ్యాన శ్లోకములు

అ- చామీకరనిభః శూలగదారాజద్ భుజాష్టకః ।
చతురాస్యోఽతికాయః స్యాదకారః కూర్మవాహనః ॥

ఆ- పాశాంకుశకరాశ్వేతా పద్మసంస్థే భవాహనా
షష్ట్యర్థ యోజనమితా స్యాదా మౌక్తిక భుషణా ।

ఇ- పీతం కరాబ్జ కులిశపరశుం వైరినాశనమ్
ద్వ్యేకయోజనమానం స్యాదికారం కచ్ఛపస్థితమ్ ।

ఈ- దశయోజన దీర్ఘార్థ నాహోఽసౌ హంసవాహనా
ఈఃస్యాత్ పుష్టిప్రదా శ్వేతామౌక్తికాఢ్యా సితాననా ।
ఉ- గదాంకుశకరం కాకవాహనం కృష్ణభూషణం
ఊ- యోజనద్విసహస్రాణాం మానముద్వయ మక్షరమ్ ।
ఋ- పాశశక్తి భుజంరక్తం వహ్నిబింబ స్థితోష్ట్రగం
ౠ- ఉక్తప్రమాణం కాలఘ్నమృ ౠ వర్ణద్వయం భవేత్ ।
ఌ - చతురస్రాబ్జ హంసస్థం పుష్టరాగ సమప్రభమ్
ౡ పాశవజ్రకరం రౌద్రం ఌ యుగ్మం స్యాన్నిరోధనమ్ ।
ఏ- గదాఫలారి పద్మాఢ్యకరం హారవిభూషణం ।
చక్రవాకస్థితం శ్యామమేకారం తు మహద్భవేత్ ।
ఐ- నవకుందనిభాశూల వజ్రబాహో ద్విపస్థితా
కోటియోజనమానాస్యా ద్వైమూర్తిః కవితాకరీ ।
ఓ- చిన్మయం సర్వగం శాంతం ద్విసహస్రకరోజ్వలం
పీతం గోవృష సంస్థం స్యాదోరూపం శ్రీకరాత్మకమ్ ।
ఔ- తప్తహేమనిభా పాశచక్రబాహు ర్విభూతిదా
యోజనానాం సహస్రేణ స్యాదౌవర్ణామితౌజసా ।
అం- వజ్ర శూలకరం క్షుద్రం ఫలదం ఖరవాహనం
సహస్రయోజనమితం స్వారాంతద్విభుజం స్మరేత్ ।
క- భూబింబగజసంస్థః స్యాన్నవ కుంకుమ సన్నిభః
శూలవజ్రవరః కార్ణః సహస్రద్వయయోజనః ।
ఖ- పాశతోమర హస్తః ఖో మేషసంస్థో నిరోధనః
యోజనానాం సహస్రేణ మితః కృష్ణో విభీషణః ।

గ- పాశాంకుశ కరః పద్మే ఫణిసంస్థోஉరుణప్రభః ।
గకారః సర్పభూషః స్యాచ్ఛత యోజన సంస్థితః ।
ఘ- ఉష్ట్రో లూఖన సంస్థఃస్యాద్ గదావజ్ర కరోஉమితః
యోజనానాం సహస్రేణ ద్విముఖో ఘః సితేతరః ।
జ- కోటియోజనదీర్ఘార్థ నాహంకృష్ణం జ్వలత్ ప్రభం
ద్విభుజం కాకవాహం స్యాత్ జార్ణం క్షుద్రఫలప్రదమ్ ।
చ- యుగాగ్ర పద్మసంస్థః స్యాచ్చతుర్బాహుః సితప్రభః ।
చఃకపర్దీ సుగంధాఢ్యః కోటియోజన సంస్థితః ।
ఛ- సితస్తావన్మితః పద్మే చతుర్బాహు శ్ఛవర్ణకః
జ,ఝ- జఝౌ చ కోటిమానౌ స్తశ్చతుర్బాహూసితప్రభౌ ।
ఞ- యోజనానాం సహస్రైః స్యాత్ సమ్మితం కాకవాహనం
విద్వేషకరణం ఞార్ణం కృష్ణవర్ణం భుజద్వయమ్ ।
ట క్రౌంచస్థో ద్విభుజష్టః స్యాన్నాగబద్ధో మహాధ్వనిః ।
ఠ ధరాపద్మ గజేంద్రస్థ ష్ఠవర్ణో ద్వికరోజ్వలః ।
డ- లక్షయోజన మానఃస్యాత్ గరనాశకరోవిభుః
డవర్ణోஉప్యష్ట బాహుః స్యాచ్చతుర్వక్త్రః స్వలంకృతః ।
ఢ- యోజనానాం సహస్రేణ మితః కువలయేస్థితః
అగ్నిబింబజగో ఢార్ణో దశబాహుర్ జ్వలత్ ప్రభః ।
ణ- సహస్రమానం వ్యాఘ్రస్థం యోజనానాంహి ణంభవేత్
షష్టిహాయన సంస్థఃస్యాత్ చతుర్బాహుః స్వలంకృతః ।
త- సహస్రమానో గంధాఢ్యః కుంకుమా భశ్చతాక్షరః
కోటియోజన మానఃస్యాదష్టబాహుశ్చతుర్ముఖః ।

ఠ- పీతవర్ణా వృషారూఢ స్థవర్ణోఽపి భయంకరః
ద- ద్విముఖంషడ్ భుజం కోటిమానందం మహిషస్థితమ్ ।
ధ- సింహవాహశ్చతుర్బాహుర్ధశ్చతుర్లక్ష సమ్మిత
న- ద్విభుజం కాకవాహంనం తత్ సహస్రైర్మితం భవేతమ్ ।
ప- వింశభుజో దశాస్యః పః కోటిమానో బకస్థితః ।
ఫ- దశకోటిమితః ఫార్ణో యోజనానాం భుజద్వయః ।
బ- కంఠీరవసితాంభోజే నిషణ శ్చంచలః సితః
షడాస్యోద్విభుజోబః స్యాద్దశకోటి మితోఽరుణః ।
భ- నీలోత్పల లసద్ధం సవాహనః పుష్టి దాయకః
త్రిహస్తం త్రిముఖం వ్యాఘ్రువాహనం భీషణాకృతిమ్ ।
మ- దశలక్షమితం మార్ణం ధూమ్రాభం స్యాన్మహాబలమ్
చతుర్భుజో మకారః స్యాత్ సవిషోరగ సన్నిభః ।
య- మండితో ముండమాలాభిః శశిఖండ విరాజితః
వ్యాప్తశ్చతుర్ముఖో ధూమ్రో యార్ణఃస్యాన్మృగసంస్థితః ।
ర- త్రికోణాంబుజ మేషస్థో రార్ణో బాహు చతుష్టయః
చతురస్రాబ్జ దంతీంద్ర పృష్ఠేనోపరి రాజితా ।
ల- చతుర్భుజాలకారస్య మూర్తిఃస్యాత్ ఘుసృణప్రభా ।
వ- అబ్ధిస్థ పద్మనక్రస్థో ద్విభుజోవః సితః స్మృతః ।
శ- కరద్వయాబ్జగా హేమవర్ణా శార్ణాకృతిస్తథా ।
ష- సహస్రమానః కృష్ణాభో ద్విభుజః కార్మణేఽథవః ।
స- కోటిమానః సితఃసః స్యాద్ధంసగో ద్విభుజాన్వితః ।

హ- హోర్ణః శ్వేత స్త్రి బాహుః స్యాత్ వ్యాప్త శీతాంశు శేఖరః ।

ళ- పాశాభయకరా ళార్ణ మూర్తిఃశ్వేతా గజస్థితా

క్ష- భూబింబ శైలసంస్థః క్షో దశబాహుర్మణి ప్రభః ।

మూర్తిభేదా యథాఽర్ణానాం మయాఽత్త ప్రతిపాదితా ॥

## అక్షరన్యాస స్థానములు

శ్లో॥ లలాటముఖ వృత్తాక్షి శృతి ఘ్రాణేషు గండయోః
ఓష్ఠ దంతోత్తమాంగాస్య దోఃపత్ సంధ్యాగ్రకేషుచ ।
పార్శ్వయోః పృష్ఠతో నాభౌ జఠరే హృదయేఽసవో
కకుద్యంసేచ హృత్పూర్వం పాణిపాదయుగేతధా ।
జఠరాననయోర్న్యస్యేత్ మాతృకార్ణాన్ యథాక్రమాత్
త్వగసృంగ్ మాంసమేదోఽస్థి మజ్జాశుక్రాత్మకాన్విదుః ।
నాదిహాంతాన్ న్యసేదాత్మ పరమజ్ఞాన పూర్వకాన్
దీక్షితః ప్రోక్తమార్గేణ న్యసేల్లక్షం సమాహితః ।
జపేత్ తత్సంఖ్యయా విద్వానయుతం మధురాప్లుతైః
విదధీత తిలైర్హోమం మాతృకామ న్వహంజపేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పైన చెప్పిన 50 అక్షరములకు, శరీరమునందు న్యాసస్థానములు వివరింపబడుచున్నవి.

**1.** లలాటము **2.** ముఖవృత్తము **3,4.** రెండు నేత్రములు **5,6.** రెండు చెవులు **7.** ముక్కు **8.** చెక్కిలి **9.** పెదవులు **10.** దంతములు **11.** శిరస్సు **12.** ముఖము **13,14.** భుజములు, కాలిసంధి ప్రదేశములు అగ్రభాగము **15,16.** రెండు ప్రక్కల వెనుకభాగము **17.** నాభి

**18.** జఠరము **19.** హృదయము **20.** కంథ **21.** మెడ **22.** వక్షము **23.24.** రెండు చేతులు.

**25,26.** రెండు కాళ్లు **27.** కడుపు **28.** ముఖము, ఈ **28** స్థానములలో కవర్గ - చవర్గ - టవర్గ - తవర్గ - పవర్గ, య - ర - ల వర్ణములు న్యాసం చేయాలి.

త్వక్ - అస్థి - మాంస - మేద - అసృక్ - మజ్జ శుక్రములందు, వ - శ - ష - స - హ ళ - క్ష, వర్ణములు న్యాసం చేయాలి. దీక్ష పొందిన సాధకుడు మాతృకను లక్షమార్లు న్యాసము, లక్షమార్లు జపము చేయాలి. ఈ ప్రక్రియందు ఒకసారి న్యాసము, ఒకసారి జపము ఆచరించాలి. పిమ్మట త్రిమధురములతో (నెయ్యి - తేనె - పాలు) తడిపిన తిలలు పదివేలమార్లు హోమం చేయాలి. ప్రతీ ఆహుతియందూ ఒకసారి మాతృకను జపించాలి.

## మాతృకా చక్రము

శ్లో॥ వ్యోమేంద్వో రసనార్ణ కర్ణికమాచాం ద్వంద్వైః స్ఫురత్ కేశరం
పత్రాంతర్గత పంచవర్గయశలార్ణాదిత్రివర్గం క్రమాత్ ।
ఆశాస్వస్త్రిషులాంతలాంగలి యుజా క్షౌణీపురేణావృతం
పద్మ కల్పితమత్ర పూజయతుతాం వర్ణాత్మికాందేవతామ్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సరస్వతి శ్వేతవర్ణ శోభిత మైనది. ఈ వర్ణదేవతకు ఈ క్రిందివిధముగా మాతృకాచక్రము లిఖించి పూజించాలి. వాగ్దేవత శ్వేత కమలముపై ఆసీనురాలై యుండును.




## పీఠశక్తులు

శ్లో॥ ఆధారశక్తి మారభ్య పీఠ శక్త్యంత మర్చయేత్
మేధాప్రజ్ఞా ప్రభావిద్యా ధీర్ధృతి స్మృతి బుద్ధయః ।
విద్యేశ్వరీతి సంప్రోక్తా భారత్యా నవశక్తయః
వర్ణాబ్జేనాసనం దద్యాత్ మూర్తిం మూలేన కల్పయేత్ ।
ఆవాహ్య పూజయేత్తస్యాం దేవీమావరణై స్సహ
అంగైరావరణం పూర్వం ద్వితీయం యుగ్మశః స్వరైః ।

అష్టవర్గైరావరణం పూర్వం ద్వితీయం యుగ్మశః స్వరైః ।
పంచమం మాతృభిఃప్రోక్తం షష్ఠంలోకేశ్వరై స్మృతమ్ ।
లోకపాలాయుధైః ప్రోక్తం వజ్రాద్యైః సప్తమంతతః
విధినాஉనేన వర్ణేశీముపచారైః ప్రపూజయేత్ ।
వ్యాపినీ పాలినీ పశ్చాత్ పావనీ క్లేదినీ తథా
ధారిణీ మాలినీ భూయో హంసినీ శాంతినీ స్మృతా ।
శుభ్రాః పత్రేషు సంపూజ్యా ధృతాక్షగుణ పుస్తకాః
బ్రాహ్మీమాహేశ్వరీభూయః కౌమారీవైష్ణవీ మతా ।
వారాహ్యానంతరేంద్రాణీ చాముండా సప్తమీ మతా
అష్టమీస్యాన్మహాలక్ష్మీః ప్రోక్తాః స్యుర్విశ్వమాతరః ॥

**సంపత్కురీ తెలుగు వ్యాఖ్యానం** – ఆధారశక్తి నుండి ఆరంభించి పీఠశక్తివరకు అర్చన చేయాలి. సరస్వతి 9 శక్తులు కలవు. 1. మేధా 2. ప్రజ్ఞా, 3. ప్రభా 4. విద్యా 4. ధీ 6. ధృతి 7. స్మృతి 8. బుద్ధి 9. విద్యేశ్వరి

"వర్ణాబ్జాయ నమః" అను మంత్రముతో, ఆసనము కల్పించాలి. మూలమంత్రముతో (ఓం హ్రీం) మూర్తిస్థాపన చేయాలి. ఈ ప్రకారము ఆవాహనచేసి 7 ఆవరణములను ఇలా అర్చించాలి.

1. ప్రథమావరణం – వృత్తమధ్యములో అంగమంత్రములతో పూజించాలి.
2. ద్వితీయావరణం – రెండు రెండు అచ్చులతో, (అం ఆం నమః)
3. తృతీయావరణం – అష్టవర్గులతో (కవర్గ – చవర్గ మొ॥)
4. చతుర్థావరణం – శక్తి నామములతో
5. పంమావరణం – మాతృకాక్షరములతో
6. షష్ఠావరణం – లోకపాలకుల నామములతో
7. సప్తమావరణం – లోకపాలకుల ఆయుధములకు, వజ్రాదులతో

పిమ్మట గంధాది ఉపచారములతో వాగ్దేవతను పూజించాలి. అనంతరం లక్షమాల - పుస్తకం ధరించిన అష్టదేవీ మూర్తులను అర్చించాలి. 1. వ్యాపిని 2. పాలినీ 3. పావనీ 4. క్లేదినీ 5. ధారిణీ 6. మాలినీ 7. హంసినీ 8. శాంతినీ.

భూపురమునందు బ్రాహ్మీ - మాహేశ్వరీ - కౌమారీ - వైష్ణవీ - వారాహీ - ఇంద్రాణీ - చాముండా - మహాలక్ష్మీ అనే విశ్వమాతలను భక్తితో పూజించాలి. వారి ధ్యాన శ్లోకములు ఈ విధముగా యున్నవి.

## బ్రాహ్మ్యాది ధ్యాన శ్లోకములు

**బ్రాహ్మీ** -దండంకమండులుం పశ్చాదక్ష సూత్రమథాఽభయం
బిభ్రతీ కనకచ్ఛాయా బ్రాహ్మీ కృష్ణా జినో జ్వలా ।

**మాహేశ్వరీ**- శూలం పరశ్వథుం క్షుద్రదుందుభిం నృకరోటికాం
వహంతీ హిమసంకాశా ధేయామాహేశ్వరీ శుభా ।

**కౌమారీ** - అంకుశం దండ ఖట్వాంగౌ పాశంచదధతీ కరైః
బంధూకపుష్ప సంకాశా కౌమారీ కామదాయినీ ।

**వైష్ణవీ** - చక్రం ఘంటం కపాలంచ శంఖం చ దధతీకరైః
తమాల శ్యామలాధ్యేయా వైష్ణవీ విభ్రయోజ్వలా ।

**వారాహీ** - ముషలంకరవాలంచ ఖేటకం దధతీ హలం
కరైశ్చతుర్భిః వారాహీ ధేయాకాల ఘనచ్ఛవిః ।

**ఇంద్రాణీ** - అంకుశంతోమరం విద్యుత్ కులిశంబిభ్రతీ కరైః
ఇంద్ర నీలనిభేంద్రాణీ ధ్యేయా సర్వ సమృద్ధిదా ।

**చాముండా** - శూలం కృపాణం నృశిరః కపాలం దధతీకరైః
ముండస్రక్ మండితా ధ్యేయా చాముండారక్త విగ్రహా ।

# సృష్టిన్యాసం

శ్లో॥ న్యసేత్ సర్గాన్వితాన్ సృష్ట్వా ధ్యాత్వా దేవీం యథావిధి
సర్గబింద్వంతికాన్ న్యస్య డార్ణాద్యాన్ స్థితివర్త్మనా ।
విద్యాత్ పూర్వోదితాన్ విద్వానృష్యాదీ నంగసంయుతాన్
ధ్యాయేద్వర్ణేశ్వరీమత్ర వల్లభేన సమన్వితామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సృష్టిమార్గములో షడంగ న్యాసమాచరించాలి. "అః నమః లలాటే, ఆఃనమః ముఖవృత్తే ఇత్యాదిగా న్యాసం చేయాలి. స్థితిక్రమమందు అనగా స్థితిన్యాసమందు డకారము మొదలుకొని రకార పర్యంతము న్యాసం చేయాలి. వీటికి ఋషి - చందో - దేవతలు పూర్వోక్తముగానే యుండును.

## వర్ణేశ్వరీ ధ్యానం

శ్లో॥ సింధూరకాంతి మమితాభరణాంత్రినేత్రాం
విద్యాక్షసత్ర మృగపోతవరం దధానామ్ ।
పార్శ్వ స్థితాం భగవతీమపి కాంచనాంగీం
ధ్యాయేత్ కరాబ్జధృత పుస్తక వర్ణమాలామ్ ॥

# సంహారన్యాసం

శ్లో॥ అభ్యర్చనాదికం సర్వం విదధ్యాత్ పూర్వవర్త్మనా
బిందుయుక్తామిమాంన్యస్యేత్ సంహృత్యా ప్రతిలోమతః ।
విద్యాత్ పూర్వోదితాన్ విద్వాన్ ఋష్యాదీనంగ సంయుతాన్
ధ్యేయావర్ణమయే పీఠా దేవీ వాగ్వల్లభా శివా ।
న్యాసార్చనాదికం సర్వం కుర్యాత్ పూర్వోక్త వర్త్మనా

తారోత్థాభిః కలాభిస్తాం న్యసేత్ సాధకసత్తమః ।
వర్ణాద్యాస్తారసంయుక్తా వ్యస్తవ్యాస్తా నమోఽన్వితాః
ఋషిః ప్రజాపతిశ్ఛందో గాయత్రం సముదాహృతమ్ ।
కలాత్మా వర్ణజననీ దేవతా శారదా స్మృతా
హ్రస్వదీర్ఘాంతరగతైః షడంగం ప్రణవైః స్మృతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ధ్యానాంతరం, ప్రతిలోమంగా క్షకారాది-అకారాంత వర్ణములకు బిందువును చేర్చిన సంహారన్యాసమగును. ఋషి-ఛందో-దేవతలు ముందువలెనే యుండును.

సంహారక్రమమందు - క్ష నమః హృదాదిముఖే "హంనమః" హృదాది జఠరే ఇత్యాదిగా యుండును.

సంహారమాతృకను ఇలా ధ్యానించాలి.

శ్లో॥ అక్షస్రజం హరిణపోత ముదగ్రటంకం
విద్యాంకరైరవిరతం దధతీం త్రినేత్రామ్ ।
అర్ధేందుమౌళి మరుణామరవిందవాసాం
వర్ణేశ్వరీం ప్రణమత స్తనభార నమ్రామ్ ॥

అయిదు కళలూ నివృత్యాదులు మాతృకతోకలిపి పూర్వోక్తస్థానము లందు న్యాసము చేయాలి. మరల సంహారక్రమమునందు ప్రణవయుక్త అకారాది వర్ణములకు, చివర నమః - లలాటే... మొ॥.

**విశేషము :-** అంతర్గత పదార్థము బయట భాసింపచేయడం సృష్టి అనబడును. శివునియందు భాసింపచేయుట స్థితి అనబడును. సంస్కార మాత్రశేషమును మరల లోపల ప్రవేశింపచేయడం సంహారము అనబడును.

వీటికి కూడా ప్రజాపతి ఋషి – గాయత్రీ ఛందః – కళాత్మా వర్ణజననీ శారదాదేవతా, క్లీబవర్ణములైన (ఋ - ౠ - ఌ ౡ)వి, వర్జించి, హ్రస్వ దీర్ఘముల మధ్యలో ప్రణవము చేర్చి షడంగన్యాసము చేయాలి.

ఉదా - అం ఓం ఆం హృదయాయ నమః ।

## శారదా ధ్యానం

శ్లో॥ హస్తైః పద్మం రథాంగం గుణమథ హరిణం పుస్తకం వర్ణమాలాం
టంకం శుభ్రం కపాలం దరమమృతలసద్ధేమకుంభం వహంతీమ్।
ముక్తా విద్యుత్పయోద స్ఫటిక నవజపాబంధురైః పంచవక్త్రైః
త్ర్యక్షైర్వక్షోజనమ్రాం సకల శశినిభాం శారదాంతాం నమామి ॥

## శ్రీకంఠ మాతృకాన్యాసం

శ్లో॥ అర్చయేదుక్తమార్గేణ శారదాం సర్వకామదాం
తార్తీయ పూర్వాంతాం న్యస్యేన్నమోంతాం రుద్ర సంయుతామ్॥
సధాతుప్రాణ శక్త్యాత్మయుక్తా యాదిషుతే క్రమాత్
ఋషిఃస్యాద్దక్షిణామూర్తిర్గాయత్రం ఛందఈరితమ్ ।
అర్ధనారీశ్వరః ప్రోక్తో దేవతా తంత్రవేదిభిః
హసాషడ్దీర్ఘయుక్తేన కుర్యాదంగాని దేశికః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శ్రీకంఠ మాతృకా న్యాసమందు "హసౌ" బీజము చేర్చి రుద్రుడు మరియు శక్తులకు చతుర్థ్యంతము చెప్పి, చివర నమః చెప్పి ఆయాస్థానములందు చేర్చాలి.

ఉదా - హసౌ శ్రీకంఠేశ పూర్ణోదరీభ్యాం నమః - లలాటే" ఇత్యాది.

మరల సాధకుడు యకారాది దశ వ్యాపకాక్షరముల ముందు త్వగాదులను చేర్చి సప్తధాతువులనూ పేర్కొని ఆత్మశక్తితోబాటు రుద్రశక్తిని న్యాసం చేయాలి.

ఉదా – **ఓం హౌసౌం యం త్వగాత్మభ్యాం బాలీశసుముఖీశ్వరీభ్యాం నమః - హృదయే -**

ఈ న్యాసమునకు దక్షిణామూర్తి ఋషిః – గాయత్రీ ఛందః – అర్ధనారీశ్వరో దేవతా । ఆరుదీర్ఘాక్షరములతో (ఆ – ఈ – ఊ – ఐ – ఔ – అః) హసౌ చేర్చి షడంగ న్యాసమాచరించాలి.

## అర్ధనారీశ్వర ధ్యానం

శ్లో॥ బంధూక కాంచన నిభం రుచిరాక్ష మాలాం
పాశాంకుశౌచ వరదం నిజబాహు దండైః ।
బిభ్రాణమిందు శకలాభరణం త్రినేత్ర
మర్ధాంబికేశమనిశం వపురాశ్రయామః ॥

## కేశవమాతృకా న్యాసం

శ్లో॥ పూర్వోక్తేనైవ మార్గేణ పూజయేత్ తం యధావిధి
స్మరాద్యాం మాతృకాంన్యస్యేత్ కేశవాది నమోఽన్వితామ్।
సధాతుప్రాణ శక్త్యాత్మయుక్తా యాదిషు విష్ణవః
ఋషిః ప్రజాపతిః ప్రోక్తో గాయత్రం ఛందఈరితమ్ ।
అర్ధలక్ష్మీః హరిః సాక్షాత్ దేవతాఽత్ర సమీరితా
దీర్ఘయుక్తేన బీజేన షడంగాని సమాచరేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అదేవిధముగా కేశవమాతృకా న్యాసము చెప్పబడుచున్నది. ఓం అంకేశవీ కీర్తిభ్యాం నమః – లలాటే, ఇత్యాది. "యం త్వగాత్మనే పురుషోత్తమ వసుధాభ్యాం నమః – హృదయే ఇత్యాది. ఈ న్యాసమునకు ప్రజాపతి ఋషిః – గాయత్రీఛందః – అర్ధ లక్ష్మీ హరిర్దేవతా ఆం – ఈం – ఊం – ఐం – ఔం – అః, లతో క్లాం – క్లీం చేర్చి షడంగన్యాసము లాచరించాలి. ఉదా – ఆం క్లీం హృదయే నమః, ఇత్యాది

## అర్ధలక్ష్మీధ్యానం

శ్లో॥ హస్తై ర్బిభ్రత్ సరసిజగదాశంఖ చక్రాణి విద్యాం
పద్మోదర్యా కనకకలశం మేఘ విద్యుత్ విలాసమ్ ।
నామో తుంగస్తనమవిరలా కల్పమాశ్లేషలోభా
దేకీభూతం వపురవతువః పుండరీకాక్ష లక్ష్మ్యోః ॥

## విశ్వజననీ న్యాసము

ఈ న్యాసమునకు వశిష్ఠఋషిః – గాయత్రీఛందః – సర్వ సౌభాగ్య దాయినీ విశ్వజననీ దేవతా ।

ఓం ఆం క్లీం హ్రీం హృదయాయ నమః – హృది ఇత్యాది.

### ధ్యానం

ఉద్యత్కోటిదివాకర ప్రతిభటోత్తుంగోరు పీనస్తనీ
బహ్వోర్ధేందు కిరీటహార రసనామంజీర సంశోభితా ।
బిభ్రాణా కరపంకజైర్జపవటీం పాశాంకుశౌ పుస్తకం
దిశ్యాద్ వో జగదీశ్వరీ త్రినయనా పద్మే నిషణ్ణాముఖమ్ ॥

## మహాలక్ష్మీన్యాసము

శ్లో॥ పురోదితేన విధినా దేవీ మన్వహమర్చయేత్
న్యసేచ్ఛ్రీబీజ సంపన్నాం మాతృకాం విధినా తనౌ ।
ఋషిర్భృగుః స్మృతం ఛందోగాయత్రం దేవతాస్మృతా ।
సమస్త సంపదామాది ర్జగతాం నాయికా బుధైః ।
ప్రాక్ ప్రస్తుతేన బీజేన కుర్యాదంగాని సాధకః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ న్యాసమందు విధానము ఇట్లుండును.

ఉదా :- ఓం శ్రీం అం నమః - లలాటే ఇత్యాది.

ఈ న్యాసమునకు భృగుః ఋషిః - గాయత్రీ ఛందః - మహాలక్ష్మీ దేవతా. షడంగన్యాసము పూర్వమువలెనే, శ్రీబీజము చేర్చి చేయాలి.

ఉదా - ఆంశ్రీం హృదయాయ నమః - ఇత్యాది -

### ధ్యానం

విద్యుద్దామ సమప్రభాంహిమగిరి ప్రఖ్యైశ్చతుర్భిర్గజైః
శుండాదండ సముద్ధృతామృతఘటైరాసించ్య మానామిమామ్।
భిభ్రాణాం కరపంకజైర్జపవటీం పద్మద్వయం పుస్తకం
భాస్వద్రత్న సముజ్వలాం కుచనతాం ధ్యాయేజ్జగత్ స్వామినీమ్॥

## సమస్త జననీ న్యాసం

శ్లో॥ ఆరాధయే దిమాం ప్రోక్త వర్త్మనా కుసుమాదిభిః
న్యసేద్ స్మరాద్యాం వపుషి మాతృకాం మంగళప్రదామ్ ।

ఋషిః సమ్మోహనః ప్రోక్తశ్ఛందో గాయత్రముచ్యతే
దేవతా మంత్రిభిఃప్రోక్తా సమస్త జననీ పరా ।
స్మరేణ దీర్ఘయుక్తేన విదధ్యాదంగకల్పనామ్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ న్యాసమునందు ఆం క్లీం హృదయే ఇత్యాది. ఈ న్యాసమునకు ఋషిః సమ్మోహనః - గాయత్రీ ఛందః - పరాంబా సమస్త జగజ్జననీ దేవతా. షడ్ దీర్ఘయుక్త కామ మంత్రము (క్లీం)తో అంగన్యాస - కరన్యాసము లాచరించాలి.

## ధ్యానం

బాలార్కకోటి రుచిరాం స్ఫటికాక్షమాలాం
కోదండమిక్షు జనితం స్మర పంచబాణాన్ ।
విద్యాంచ హస్త కమలై ర్దధీతాం త్రినేత్రాం
ధ్యాయేత్ సమస్త జననీం నవచంద్రచూడామ్ ॥

## సమ్మోహనీ న్యాసం

శ్లో॥ అర్చనాది క్రియాః సర్వాఃప్రోక్తాః పూర్వవిధానతః
శక్తి శ్రీకామబీజాద్యాం దేవీం వర్ణతనుంభజేత్ ।
ఋషిః పూర్వోదితశ్ఛందో గాయత్రం దేవతా బుధైః
సమ్మోహినీ సముద్దిష్టా సర్వలోక వశంకరీ ।
ఆవర్తితై స్త్రిభిర్బీజైః షడంగాని ప్రకల్పయేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ న్యాసమునకు సమ్మోహన ఋషిః - గాయత్రీ ఛందః - సమ్మోహినీ దేవతా - హ్రీం క్లీం శ్రీం బీజములు రెండుసార్లు ఆవృత్తిగా చెప్పి షడంగన్యాసమాచరించాలి.

## ధ్యానం

ధ్యాయేయమక్షవలయేక్షు శరాసపాశాన్
పద్మయాంకుశ శరాన్ వరపుస్తకం చ ।
ఆబిభ్రతీం నిజకరైరరుణాంకుచార్తాం
సమ్మోహినీం త్రినయనాం తరుణేందు చూడామ్ ॥

## ప్రపంచయాగం

శ్లో॥ యజేదావరణైః సార్థం ఉపచారై స్సుశోభనం
ప్రపంచయాగం వక్ష్యామి సచ్చిదానంద సిద్ధిదమ్ ।
వేదాదిః శక్తిరజపా పరమాత్మ మహామనుః
వహ్నిరాజ్ఞయాచ కథితా పంచమంత్రాః శుభావహాః ।
తారశక్త్యాదికాం న్యస్యే దజపాత్మద్వితాంతికాం
మాతృకాముక్తమార్గేణ సృష్ట్యాదేహీ విధానవిత్ ।
ఋషిర్ బ్రహ్మ సముద్దిష్టశ్ఛందో గాయత్ర మీరితం
సమస్తవర్ణసం వ్యాప్త పరంతేజోఽస్య దేవతా ।
స్వాహాద్యైః పంచమనుభిః పంచాంగానిప్రకల్పయేత్
అస్త్రందిక్షు బుధః కుర్యాత్ భూయోహరిహరాక్షరైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సచ్చిదానంద సిద్ధి కలిగించు "ప్రపంచయాగము" వివరింబడుచున్నది. ఈ యాగమునందు ముఖ్యమైన పంచబీజాక్షరములున్నవి. అవి – **ఓం** - **హ్రీం** - **హంసః** - **సోఽహం** - **స్వాహా** ఈ మంత్రముతో లలాటాదులందు ముందుగా న్యాసమాచరించాలి.

దీనినే విలోమముగా పంచాంగన్యాసము ఆచరించాలి. ఈ మంత్రమునకు బ్రహ్మాఋషిః – గాయత్రీఛందః – సమస్త వర్ణవ్యాపీ పరతేజో దేవతా ।

## విలోమ విధికి ఉదాహరణ

**స్వాహా హృదయాయ నమః।**

**సోఽహం శిరసే స్వాహా।**

**హంసః శిఖాయై వషట్।**

**హ్రీం కవచాయ హుమ్।**

**ఓం నేత్రద్వయాభ్యాం వౌషట్।**

### బ్రహ్మ ధ్యానం

తారాది పంచమనుభిః పరిచీయమానం
మానైరగమ్యమనిశం జగదేకమూలమ్ ।
సచ్చిత్సమస్తగమనశ్వర ముచ్యతం తత్
తేజః పరం భజత సాంద్రసుధాంశు రాశిమ్ ॥

## క్రమవిధానం

శ్లో॥ పంచభూత మయావర్ణా వర్గశః ప్రాసదీరితాః
తస్మాత్ జ్ఞానేంద్రియాత్మానః ప్రపంచం తన్మయంవిదుః।
దేహోఽపి తాదృశస్తస్మిన్ న్యస్యేద్ వర్ణాన్ విలోమతః
తత్తత్ స్థానయుతాన్ మంత్రీ జుహుయాత్ పరతేజసి ।
ఏవంవర్ణమయం హోమం కృత్వా దివ్యతనుర్భవేత్
న్యస్యమంత్రీ యధాన్యాయం దేహే విశ్వస్య మాతరమ్ ।
జపేన్మంత్రాన్ భజేద్దేవాన్ యజేదగ్నిమనన్యధీః
దివ్యై శ్చజుహుయాదగ్నౌ మంత్రవిత్ తంత్రచోదితైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వర్ణములు పంచభూత స్వరూపములు. వీటినుంచే జ్ఞానేంద్రియములు, సమస్త ప్రపంచమూ

ఉత్పన్నమైనవి మన దేహము కూడా పంచభూతాత్మకమే. కనుక పాంచభౌతికమైన ఈ దేహమునందు పంచభూతాత్మక వర్ణములను విలోమ క్రమముగా న్యాసం చేయాలి.

ఉదా : ఉ – ఔ – గ – జ – డ – బ – ల – హ, పృథివ్యాత్మకాన్ దశవర్ణాన్ తలాది జాను పర్యంతం న్యసామి.

అలాగే, నాభిపర్యంతం, హృదయ పర్యంతం...

ఆకాశవర్ణములు శిరస్సునందు ప్రారంభించి, పాదతల పర్యంతం న్యాసము చేయాలి.

పిమ్మట మంత్రజ్ఞుడైన సాధకుడు **"ఓం హ్రీం క్షం హంసః సోఽహం స్వాహా"** అని సంహార క్రమములో న్యాసం చేయాలి.

**"క్షకార తదధిష్ఠాతృ దేవతాం తత్తత్ స్థానం చ తదవచ్ఛిన్న చైతన్యే జుహోమి"** అని కూడా ధ్యానం చేయవచ్చు.

ఈవిధముగా తన శరీరమందు శాస్త్రీయముగా విశ్వజననీ న్యాసము చేసి, పిమ్మట వర్ణమయహోమము నాచరించి దివ్యశరీరమును పొంద వలయును. పిమ్మట ఏకాగ్రచిత్తముతో మంత్రజపముచేసి, తంత్రోక్త ద్రవ్యములతో హోమం ఆచరించాలి.

**విమర్శ** – మాతృకతో సంపుటితము చేసిన మంత్రమును జపించు విధానము కూడా ఉన్నది. మాతృక సిద్ధించినచో అన్ని మంత్రములూ సిద్ధించును.

**"కులప్రకాశ తంత్రము"** నందిట్లున్నది.

**మంత్రీతు ప్రజపేన్మంత్రం మాతృకాక్షర సంపుటం**
**క్రమోత్ క్రమాత్ శతావృత్యా మాసాత్ సిద్ధో భవేన్నరః ।**

మాతృకాజపమాత్రేణ మంత్రాణాం కోఓబి కోటయః
సుసిద్ధాః స్యుర్న సందేహో యస్మాత్సర్వం తదుద్భవమ్।

**"ప్రయోగసారము"**నందు మాతృకావిశిష్టత ఇట్లు చెప్పబడినది.

☞ **మాతృకా యాంతు సిద్ధాయాం సిద్ధాస్యుర్మంత్ర జాతయః**
**సర్వేమంత్రా యతో మగ్నా మాతృకాయా మితస్తతః।**

## కామ్యకర్మ విధానము

శ్లో॥ అశ్వత్థోడుంబరప్లక్ష న్యగ్రోధ సమిధస్తిలాః
సిద్ధార్థ పాయసాజ్యాని ద్రవ్యాణ్యష్టౌ విదుర్బుధాః ।
అమీభిర్జుహు యాల్లక్షం యదర్ధం వా సమాహితః
సర్వాన్ కామానవాప్నోతి పరాంసిద్ధించ విందతి ।
ఏభిరర్క సహస్రాణి హుత్వా మంత్రీ వినాశయేత్
రిపూన్ క్షుద్రగ్రహాన్ భూతాన్ జ్వరాచ్ఛా పాంశ్చ పన్నగాన్ ।
మంత్రాణామయథా వృత్తి ప్రతిపత్తి సముద్భవాన్
వికారాన్ నాశయేదాశు హోమోఽయం సముదీరితః ।
ఏభిస్త్రిమధురోపేతై ర్జుహుయాల్లక్ష మానతః
అచిరాదేవ సాభవేత్ సాక్షాద్ భూమిపురందరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 1. రావి 2. మేడి 3. ప్లక్ష ( ) 4. మఱ్ఱి వీటి సమిధలను, 5. తిలలు 6. తెల్లావాలు 7. పాయసం 8. నేయి ఈ ద్రవ్యములను గ్రహించి, ఒక లక్ష హోమం ఆచరించాలి.

ఒక్కొక్క ద్రవ్యముతో **1250** సార్లు హోమం చేయాలి. ఇలా హోమం చేయుటవలన సాధకుడు గొప్ప సిద్ధిని పొందును. సర్వాభీష్టములూ నెరవేరును.

ఈ ద్రవ్యమలతో బాటు వేయి జిల్లేడు ఆకులు కూడా హోమం చేసిన శతృవులు చేసిన ప్రయోగములు, గ్రహబాధ మానసికబాధ నశించును.

పైన చెప్పిన అష్టద్రవ్యములతోబాటు, త్రిమధురములు కలిపి ఒక లక్ష హోమం చేసినచో అధికారము, ఉద్యోగము లభించును.

శ్లో॥ అమీభిః సాధకో హుత్వా వశ్యాదీనపి సాధయేత్
హుత్వాలక్షం తిలైః శుద్దై ర్ముచ్యంతే సర్వపాతకైః ।
పాయసాన్నేన జుహుయాన్మంత్రీ సర్వసమృద్ధయే
పద్మానాంలక్ష హోమేన మహతీం శ్రియమాప్నుయాత్ ।
ఘృతేన జుహుయాల్లక్షం ప్రాప్నుయాత్ కీర్తిముత్తమామ్
జాతీకుసుమ హోమేన సర్వలోక వశం న యేత్ ।
సంశోధితై స్త్రి మధ్వక్తై ర్లవణై ర్లక్షమానతః
జుహుయాద్గులికాః కృత్వా వశయేత్ సర్వమంజసా ।
లిఖిత్వా పత్రఖండేషు మాతృకార్ణాన్ పృథక్ పృథక్
అభ్యర్చ్య జుహుయాద్ వహ్నౌ తత్పత్రాక్షరముచ్చరన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – త్రిమధురయుక్త అష్టద్రవ్య హోమముచేత సాధకుడు, వశీకరణాదులను కూడా సాధింప సమర్థ డగును. త్రిమధురములతో తిలలు కలిపి ఒక లక్ష హోమం చేసిన సర్వ పాపములూ నశించును.

పాయసాన్న హోమముచే అభీష్టసిద్ధి కలుగును. కమలములతో ఒక లక్ష హోమమాచరించి. సంపద వృద్ధి చెందును. కేవలం నెయ్యితో లక్ష హోమం చేసిన కీర్తి కలుగును. జాజి పుష్ప హోమముచేత జగద్వశ్యము సిద్ధించును.

శుద్ధిచేసిన త్రిమధుర మిశ్రిత లవణహోమముచేత (గుటికలుగా చేసి హోమం చేయాలి) జగద్ వశ్యము కలుగును. ఆకులపై ఒక్కొక్క అక్షరమును లిఖించి, వాటిని ఉచ్చరించుచూ మాతృకాక్షర హోమం చేసిన, ఇతరులు చేసిన అభిచారప్రయోగములు తొలగిపోవును.

## అభిచారము తొలగు హోమము

శ్లో॥ అభిచార హరో హోమః సర్వరక్షా ప్రసిద్ధిదః
సహస్రహోమే వితరేత్ దక్షిణాం నిష్కమానతః ।
అర్ధంవా శక్తితో దద్యాత్ యధోక్తం ఫలమాప్నుయాత్
అనయాసప్త సంజప్తం పిబేత్ ప్రాతర్దినే దినే
సలిలం సభవేద్ వాగ్మీ లభతే కవితాం పరామ్ ।
బ్రాహ్మీరసే వ చాకల్కే పయసా విపచేత్ ఘృతం
అయుతం మాతృకాజప్తాం వచాం వా పయసా పిబేత్ ।
సలభే న్మహతీం మేధా మచిరాన్నాఽత్ర సంశయః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అభిచార హోమము ఒక సహస్రకుండమునందు ఆచరించినచో ఒక నిష్కము (నాలుగు బంగారు నాణెములు) దక్షిణగా ఇవ్వవలయును. అంత శక్తి లేనిచో రెండు బంగారు నాణెములను దక్షిణగా ఇచ్చినను యధోక్త ఫలము పొందగలరు.

మాతృకను 7సార్లు మంత్రించి ఆ జలము ప్రతిదినమూ సేవించిన, వాక్పటుత్వము కలుగును. వసను నూరి బ్రాహ్మీస్వరసము నందు, నేతితో

కలిపి, దానికి నాలుగురెట్లు పాలతో వండాలి. దానిని వెయ్యిసార్లు మాతృకతో జపించి, ప్రాతఃకాలమున సేవించిన మేధస్సు వృద్ధి చెందును. జ్ఞాపకశక్తి పెరుగును.

కేవలం బ్రాహ్మీరసము లేదా వచారసము ఒక వేయిసార్లు అభిమంత్రించి, పాలతో సేవించిననూ మేధాశక్తి ద్విగుణీకృతమగును.

## మాతృకా పూజ

శ్లో॥ పూర్వోక్తం పంకజం కృత్వా కుంభం సంస్థాప్య పూర్వవత్
క్వాథేన పూరయేన్మంత్రీ యథావత్ క్షీర శాఖినామ్ ।
అష్టగంధం విలోడ్యాఽస్మిన్నవరత్న సమన్వితే
ఆవాహ్య పూజయేద్దేవీం మాతృకాముక్త మార్గతః ।
సహస్ర సాధితై స్తోయైరభిషించేత్ ప్రియం నరం
భానువారే శుభేలగ్నే బ్రాహ్మణానపి భోజయేత్ ।
గురవే దక్షిణాందద్యాత్ భక్తియుక్తః స్వశక్తితః
రక్షాకరం విశేషేణ కృత్యాద్రోహో పశాంతిదమ్ ।
ఐశ్వర్య జననం పుంసాం సర్వసౌభాగ్య సిద్ధిదం
అభిషేకమిమం ప్రాహు ర్విశ్వసమ్మోహన ప్రదమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పూర్వోక్త ప్రకారముగా చక్రము లిఖించి, అందు కలశమును స్థాపించి, దానియందు క్షీరవృక్షము యొక్క క్వాథము (కషాయం) నింపవలయును. దానియందు నవరత్నములూ ఉంచి అష్టగంధములతో విలోడనం చేయాలి. ఆ కలశమునందు, మాతృకా దేవతలను ఆహ్వానించి పూజించాలి.

పిమ్మట ఆదివారమునాడు శుభలగ్నముమందు, ఆ కలశమును వెయ్యిసార్లు అభిమంత్రించి, దానితో ప్రియవ్యక్తిని అభిషేకించాలి. బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. యధాశక్తి గురుదక్షిణ సమర్పించాలి. ఇది రక్షాకరముగా నుండును. ఉపద్రవములు సర్వమూ నశించును. ఐశ్వర్యము ప్రాప్తించును.

శ్లో॥ పూర్వోక్తం మండలం కృత్వా మంత్రీనవపదాన్వితం
మధ్యాది స్థాపయేత్తేషు పదేషు కలశాన్ నవ ।
తంతుభిర్వేష్టితాన్ శుద్ధాన్ బహిశ్చందన చర్చితాన్
సుధూపవాసితాన్ మంత్రీ దూర్వాక్షత సమిన్వితాన్ ।
ఆపూర్యశుద్ధ తోయైస్తాన్ వేష్టయేదం శుకైస్తుతాన్
ముక్తా మాణిక్యవైఢూర్యగోమేధాన్ వజ్రవిద్రుమౌ ।
పద్మరాగం మరకతం నీలంచేతి యథాక్రమాత్
ఉక్తానినవరత్నాని తేషు కుంభేషు నిక్షిపేత్ ।
విష్ణుక్రాంతా మింద్రవల్లీం దేవీం దూర్వాంచ నిక్షిపేత్
స్థాపయేత్ కుంభ వక్త్రేషు కోమలాంశ్చూతపల్లవాన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మరల పూర్వోక్త మండలము లిఖించి, మధ్యలో కలిపి మొత్తం తొమ్మిది కొత్త కలశములను స్థాపించాలి. ఇది మరొక ప్రక్రియ. ఆ కలశములకు దారముచుట్టి, గంధముపూసి, చక్కటి ధూపంతో సువాసితం చేసి అందు దూర్వాక్షతలను, శుద్ధజలమును నింపాలి.

వాటియందు నవరత్నములనూ (ముత్యము – కెంపు – వైడూర్యము – గోమేదము – వజ్రము – పగడము – మరకతము – పుష్యరాగము నీలము) ఉంచాలి. విష్ణుక్రాంతను, ఇంద్రవల్లిని, సహదేవి, దూర్వామావి చిగుళ్లు కూడా ఆ కలశమునందుంచాలి.

శ్లో॥ విన్యసేదక్షతోపేతాంశ్చషకాంశ్చ ఫలాన్వితాన్
మధ్యే కుంభే సమారాధ్య దేవీం మంత్రీ వృషాదితః ।
అర్చయేద్దిక్షు కుంభేషు వ్యాపిన్యాద్యాః పురోదితాః
వర్గమంత్రయుతాః ప్రోక్త లక్షణాః సర్వసిద్ధిదాః ।
శర్కరాఘృత సంయుక్తం పాయసం చ నివేదయేత్
పుష్ట్వా కుంభాన్ కుశైర్విద్యాం జపేత్ సాగ్రం శతం శతమ్।
అభిషించేత్ విలోమేన సాధ్యంతం దత్తదక్షిణమ్
సర్వపాపక్షయకరం శుభదం శాంతి సిద్ధిదమ్ ।
పుత్రప్రదంచ వంధ్యానా మభిషేక మిమం విదుః
జరార్తస్య పురఃస్థిత్వా జపేత్ సాగ్రం సహస్రకమ్ ।
జ్వరోనశ్యతి తస్యాశు క్షుద్ర భూతగ్రహా అపి
వలీపలితరోగఘ్నః క్షుత్ పిపాసా ప్రణాశనః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మరియు ఆ కలశమందు పై భాగమున అక్షతలు, ఫలములు కల చషకము నుంచాలి. ఇంద్రాది దిగ్దేవతలను, దేవిని అందు ఆరాధించాలి. కలశము చుట్టూ అకారాది వర్ణయుక్త వ్యాపిన్యాది శక్తులను అర్చించాలి. చక్కెర – నేయి కలిపి నైవేద్యము చేయాలి.

పిమ్మట ప్రత్యేక కుంభమునూ కుశతో స్పృశించుచూ, క్రమముగా 108 సార్లు మూలమంత్రం జపించాలి. దక్షిణ సమర్పించిన శిష్యుని ఆ జలముతో అభిషేకించాలి. అతడు సర్వశుభములను పొందును. ఇటువంటి అభిషేకము గొడ్రాలికి చేసినచో సంతానవతి యగును.

జ్వరపీడితుని ఎదుట సహస్రజపముచే, రోగము నివారణమగును. భూతగ్రహ బాధలు తొలగును. ముసలితనమునందు వచ్చు రోగములు రావు. ఆకలి దప్పికల నణచును.

## త్రిశక్తి ముద్రిక

శ్లో॥ సోమసూర్యాగ్నిరూపాః స్యుః వర్ణాలోహత్రయంతథా
రౌప్యమిందుః స్మృతోహేమ సూర్యస్తామ్రం హుతాశనః ।
లోహభాగాః సముద్దిష్టాః స్వరాద్యక్షర సంఖ్యయా
తైర్లోహైః కారయేన్ముద్రాం అసంకలిత సంగతామ్ ।
సాగ్రం సహస్రం సంజప్య స్పృష్ట్వాతాంజుహుయాత్తతః
తస్యాం సంపాతయేన్మంత్రీ సర్పిషాపూర్వ సంఖ్యయా ।
నిక్షిప్యకుంభే తాంముద్రా మభిషేకోక్త వర్త్మనా
ఆవాహ్యాపూజయేద్దేవీ ముపచారైః సమాహితః ।
అభిషిచ్యవినీతాయ దద్యాత్ తాంముద్రికాంగురుః
ఇయంరక్షః క్షుద్రరోగ విషజ్వరవినాశినీ ।
వ్యాల చేరమృగాదిభ్యో రక్షాం కుర్యాత్ విశేషతః
యుద్ధే విజయమాప్నోతి ధారయన్మనుజేశ్వరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సోమసూర్యాగ్నులు ముగ్గురూ, మూడు లోకములకు ప్రతినిధులు. చంద్రునకు వెండి, సూర్యునకు బంగారము, అగ్నికి రాగి చెప్పబడినవి. వెండి 16 - బంగారం - 12 - రాగి 10 భాగములు గ్రహించి 3 ఉంగరములు చేసి, మరల ఒక ఉంగరంగా దానిని తయారుచేయించాలి.

దానిని చేతియందు పట్టుకొని 1008సార్లు మంత్రం జపించి, 1008 సార్లు హోమం చేయాలి. హోమం చేయునపుడు స్రువమునందు శేషించిన నేతిభాగమును వేరొక పాత్రలో ఉంచాలి. ఇలా ప్రతీసారీ చేయాలి.

మరల పూర్వోక్తవిధానములో ఆ ఉంగరమును, కలశమునందుంచి, దేవిని ఆవాహనచేసి పూజ చేయాలి. ఆ ముద్రికను కలశజలముతో అభిషేకించి, శిష్యునకు సమర్పించాలి. ఇదే "త్రిశక్తి" ఉంగరము. దీనిని ధరించిన క్షుద్రబాధ, రాక్షస గ్రహబాధలు, రోగములు తొలగిపోవును. ఆత్మ బలము పెరుగును.

## నవరత్న ముద్రిక

శ్లో॥ విభజే న్మాతృకాం మంత్రీ నవవర్గాన్ యథాక్రమాత్
అష్టావష్టౌ స్వరాః స్పర్శాః పంచశో వ్యాపకా అపి ।
నవవర్గాః సముత్పన్నా నవవర్గేశ్వరాగ్రహాః
అర్కేందు రక్తజ్ఞ గురుభృగు మందాహి కేతవః ।
మాణిక్యం మౌక్తికంచారు విద్రుమంగారుడం పునః
పుష్పరాగం లసద్వజ్రం నీలం గోమేదకం శుభమ్ ।
వైఢూర్యం నవరత్నాని ముద్రాంతైః కల్పయేచ్ఛుభాం
జపహోమాదికం సర్వంకుర్యాత్ పూర్వోక్త వర్త్మనా ।
యోముద్రాం ధారయేదేనాం తస్య స్యుర్వవగా గ్రహాః
వర్ధతే తస్య సౌభాగ్యం లక్ష్మీరవ్యాహతా భవేత్ ।
కృత్యాద్రోహా వినశ్యంతి నశ్యంతి సకలాపదః
రక్షోభూత పిశాచాద్యాం నేక్షంతే తంభయాకులాః ।
ఉపర్యుపరి వర్ధంతే ధనరత్నాది సంపదః
ముద్రికాయాః ప్రసాదేన రాజలక్ష్మీః స్థిరాసదా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు నవరత్న ముద్రికా విధానము చెప్పబడుచున్నది. సాధకుడు 16 అచ్చులను, 25 హల్లులను, యకారాది క్షకారాంతములను నవవర్గులుగా 5సార్లు ఇలా న్యాసం చేయాలి.

**1. 16** అచ్చులనూ ఉచ్చరించి "సోమమండలాయ నమః" అని శిరస్సునుండి కంఠపర్యంతము, మరల కకారమునుండి మకారము వరకు హల్లులను ఉచ్చరించి "సూర్యమండలాయ నమః" అని కంఠమునుండి హృదయ పర్యంతము, యకారాది క్షకారాంత వర్ణములను ఉచ్చరించి "వహ్ని మండలాయ నమః" అని, హృదయమునుండి పాదపర్యంతము న్యాస మాచరించాలి. ఈ మండలత్రయముచే ఒక న్యాసమగును.

**2.** మరల అకారమునుండి ఠకారము వరకు ఉచ్చరించి "సోమ మండలాయ నమః" శిరస్సు నుండి హృదయ పర్యంతము డకారాది క్షకారాంత వర్ణములను ఉచ్చరించి "అగ్నిమండలాయన మః" అనుచూ హృదయమునుండి పాద పర్యంతమూ ఒక న్యాసమాచరించాలి. ఇది అగ్నీ షోమీయమను రెండవ న్యాసము.

**3.** మరల అకారాది క్షకారాంత వర్ణములను ఉచ్చరించి "హంస పురుషాత్మనే నమః" అని సర్వాంగమందు వ్యాపకరూపముగా న్యాసము చేయాలి. ఇది మూడవదైన "హంసన్యాసము".

మరల "అం - ఆం - ఇం - ఈం - ఉం - ఊం ఋం - ౠం - ౢ అను నవ వర్ణములను ఉచ్చరించి "సూర్యాయ భగవతే నమః" అని సూర్యాది కేతు పర్యంత గ్రహములను న్యాసము చేయాలి. మరల పై మూడు న్యాసములూ విలోమముగా ఆచరించాలి. ఇది "గ్రహన్యాస" మనబడును. ఇలా **5** న్యాసములగును.

నవవర్గులకు నవగ్రహములు ప్రతినిధులగుదురు. నవరత్నములతో ఒక ఉంగరము తయారుచేయించాలి. పూర్వోక్త విధానములో జపహోమము లాచరించి, దానిని శుభముహూర్తములో ధరించాలి.

నవరత్న ముద్రికా ధారణవలన జగద్ వశ్యము - సంపదవృద్ధి - గ్రహబాధా నివారణ సిద్ధించును. దుష్టశక్తులు భయపడి తొలగిపోవును.

## మాతృకాధారణ యంత్రము

శ్లో॥ తార్తీయోజ్వల కర్ణికం స్వరయుగైరావిర్భవత్కేసరం
వర్గోల్లాసి వసుచ్ఛదం వసుమతీ గేహేన సంవేష్టితమ్ ।
తారాధీశ్వర వారివర్ణవిలస ద్దిక్కోణ సంశోభితం
యంత్రం వర్ణతనోః పరం నిగదితం సర్వామయఘ్నపరమ్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – కర్ణికలయందు త్రిపురా బీజములయొక్క మూడవ మంత్రకూటము (హస్త్రౌంః) లిఖించాలి. కేసరములందు రెండేసి అచ్చులు లిఖించాలి. అష్టపత్రములందు మాతృకయొక్క అష్టవర్గులూ లిఖించాలి. దానిని లకారముతో వేష్టనం చేయాలి.

దిశలందు రకారము లేదా ఓం వం లిఖించాలి. దీనిని "వర్ణ శరీర యంత్రము" అంటారు. దీనిని భూర్జపత్రము, లేదా బంగారు రేకుపై లిఖించి, పూజించి, ధరించినచో సర్వపాపములు తొలగి శుభములు కలుగును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదాతిలక తంత్రే*
*షష్ఠః పటలః సమాప్తః*

❖❖❖

# అథ సప్తమః పటలః

## అథభూతలిపి ప్రకరణం

శ్లో॥ అథభూతలిపిం వక్ష్యే సుగోప్యామతి దుర్లభాం
యాంప్రాప్య శంభోర్మునయః సర్వాన్ కామాన్ ప్రపేదిరే ।
పంచహ్రస్వాః సంధివర్ణా వ్యోమేరాగ్నిజలం ధరా
అంత్యమాద్యం ద్వితీయం చ చతుర్థం మధ్యమం క్రమాత్।

పంచవర్గాక్షరాణి స్యుర్వాంతం శ్వేతేందుభిః సహ
ఏషాభూతలిపిః ప్రోక్తా ద్విచత్వారింశదక్షరైః ।
ఆయంబరార్ణా వర్గాణాం పంచమాసి శార్ణసంయుతాః
వర్గాద్యా ఇతి విజ్ఞేయా నవవర్గాః స్మృతా అమీ ।
వ్యోమేరాగ్ని జలక్షోణీ వర్గవర్ణాన్ పృథగ్ విదుః
ద్వితీయవర్గే భూర్వస్యాన్నవమే న జలం ధరా ।

**సంపత్కురీ తెలుగు వ్యాఖ్యానం** – యంత్రలేఖనమును సిద్ధింప చేయు "భూతలిపి" చెప్పబడుచున్నది. ఇందు 42 అక్షరములుండును. ఇవి 9 వర్గములుగా యుండును.

1. 5 హ్రస్వములు – అ – ఇ – ఉ – ఋ – ఌ ।
2. 4 సంధివర్ణములు – ఎ – ఐ – ఓ – ఔ ।
3. వ, వర్గు – హ – య – ర – వల ।
4. వ, వర్గు – ఙ – క – ఖ – గ ।
5. వ, వర్గు – ఞ – చ – ఛ – ఝ – జ ।
6. వ, వర్గు – ణ – ట – ఠ – డ – ఢ ।
7. వ, వర్గు – న – త – థ – ద – ధ ।
8. వ, వర్గు – మ – ప – ఫ – భ – బ ।
9. వ, వర్గు – శ – ష – స ।

ఇందు "పంచమహాభూత" విభాగము ఇట్లుండును.

1. **ఆకాశ రూపములు** – అ – ఏ – హ – డ – ఞ – న – ణ – మ – శ.
2. **వాయురూపములు** – ఇ – ఐ – య – క – ట – త – ప – ష
3. **తేజోరూపములు** – ఉ – ఓ – ఖ – ఛ – ఠ – థ – ఫ – స.

4. **జలరూపములు** - ఋూ - ఔ - ఘ - ఝ - ఢ - ధ - భ

5. **పృథ్వీ రూపములు** - ఌ - ల - గ - జ - డ - ద - బ

# నవవర్గ దేవతలు

శ్లో॥ విరించివిష్ణు రుద్రాశ్వి ప్రజాపతి దిగీశ్వరాః
క్రియాదిశక్తి సహితాః క్రమాత్ స్యుర్వర్గ దేవతాః ।
ఋషిః స్యాద్దక్షిణామూర్తి ర్గాయత్రం ఛందఈరితం
దేవతాకథితాసద్భిః సాక్షాత్ వర్ణేశ్వరీ పరా ।
హాది షడ్వర్గకైః కుర్యాత్ షడంగాని సజాతిభిః
ధ్యాయేల్లిపితరో ర్మూలే దేవీం తన్మయ పంకజే ।
వదంతి సుధియో వృక్షం నిత్యం వర్ణమయం శుభం
పరసం విన్మహా బీజం బిందునాద మహాశిఫం ।
పృథివ్యక్షర శాఖాభిః సర్వాశాసు విజృంభితం
సలిలాక్షర పత్రైఃస్వైః సంఛాదిత జగత్ త్రయమ్ ।
వహ్నివర్ణాంకురేర్దీప్తం రత్నైరివ సురద్రుమం
మరుద్వర్ణలసత్ పుష్పైర్ద్యోతయంతం వపుః శ్రియమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ అక్షరరూపమునకు, కుండలినీశక్తి మహాబీజము. బిందునాదము దీనికి మూలము (వేరు). పృథ్వీభూతరూప అక్షరశాఖలచే అన్ని దిశలా వ్యాపించి యున్నది.

జలరూప అక్షరముల ఆకులుగలదై, అగ్నిరూప వర్ణాంకురములతో, కల్పవృక్షమువలె, వాయువర్ణరూప పుష్పములచే భాసిల్లుచున్నది. ఆకాశ వర్ణరూప ఫలములచే నమ్రమై యున్నది. ఈ వృక్షముక్రింద సర్వప్రాణులూ ఆశ్రయముపొంది యున్నారు. ఈ వృక్షము అమృత రూపమధువుచే, వాగేశ్వరీరూప పరమేశ్వరిని అభిషేకమొనర్చుచున్నది.

శ్లో॥ వేదాగమాదిభిః క్లుప్తం సమున్నతి మనోహరం
శివశక్తిమయం సాక్షాచ్ఛాయాశ్రిత జగత్ త్రయమ్ ।
ఏనమాశ్రిత్య మునయః సర్వాన్ కామానవాప్నుయుః ॥
ఆధార దేశేఽధిష్ఠానే నాభౌహృది గలేపునః
బిందేనాదే తతఃశక్త్యాం శివే దేశిక సత్తమః ।
నవధారేషు విన్యస్య స్వరాన్ నవయథావిధి ॥
హాదివర్ణాంస్తనై న్యస్యేన్ముఖే ఊర్ధ్వార్వాదితః సుధీః ।
ఊర్ధ్వమాహేంద్ర యామ్యోదక్ పశ్చిమేషు సమాహితః ॥
గుహ్యహృద్భ్రూవిలే న్యస్యేత్ శాదివర్ణత్రయం క్రమాత్ ॥
సృష్ట్యాం సర్గావసానా స్యాత్ స్థితౌ వహ్నిమరుత్ పయః
వియద్భూమి క్రమాన్న్యస్యేద్ బిందు సర్గావసానికామ్ ।
సంహృతౌ ప్రతిలోమేన విన్యసేద్ బిందుభూషితాం ॥
ఆగమోక్తేన మార్గేణ దీక్షితః సాధకోత్తమః
లక్షంన్యస్యేజ్జపేత్తావదయుతం జుహుయాత్ తిలైః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఈ వర్ణాత్మక వృక్షము, వేద – ఆగమ, – శాస్త్ర – శాస్త్రముల ద్వారా సౌందర్యశోభితమై ఉన్నతస్థానము పొందినది. ఇది సాక్షాత్తు శివశక్తిమయమైనది. దీని నీడలో మూడు లోకములూ ఆశ్రయము పొందినవి. ఈ వృక్షఛాయలో మునులు, సాధకులు అభీష్టసిద్ధిని పొందుచున్నారు.

## వాగేశ్వరీ ధ్యానము

శ్లో॥ అంకోన్ముక్త శశాంకకోటి సదృశీ మాపీనతుంగస్తనీం
చంద్రార్ధాంకితమస్తకాం మధుమదాదాలోల నేత్రత్రయామ్।

**బిభ్రాణామనిశం వరం జపటీం విద్యాం కపాలం కరై**
**రాద్యాం యౌవన గర్వితాం లిపితనుం వాగీశ్వరీ మాశ్రయే॥**

పిమ్మట, శరీరములోని నవాధార స్థానములందు (మూలాధార - లింగ - నాభి - హృదయ - కంఠ - భ్రూమధ్య - లలాట - శిఖ - శివ స్థానములు) నవస్వరములూ బిందు సహితముగా న్యాసము చేయాలి.

హాదివర్ణములు అయిదూ (హం - యం - రం - వం - లం) తనయందు పంచవక్త్రములుగా భావించి, ఊర్ధ్వముఖ - పూర్వముఖ - దక్షిణాముఖ - ఉదంగ్ముఖ - పశ్చిమముఖలందు న్యాసము చేయాలి.

అనంతరం కర - చరణాగ్ర - భుజ -2 ఉపమూల (మోచేయి) (మోకాలు) - పాదాంగుళి ప్రథమసంధి - మణిబంధ - గుల్ఫ - జఠర - 2 ప్రక్కలు - నాభి - పృష్ఠములందు బిందుయుక్తముగా న్యాసము చేయాలి.

పిమ్మట గుహ్య - హృదయ - భ్రూస్థానములందు, శ - ష - స, లు న్యాసము చేయాలి. ఇది సృష్టి క్రమము. స్థితిక్రమమునందు అగ్ని - వాయు - జల - ఆకాశ - పృథ్వీ వర్ణములు బిందు విసర్గసహితముగా న్యాసం చేయాలి. ఉదా - ఊంః - ఇంః - ఋంః - అంః ఇత్యాది. సంహారక్రమమునందు భూతలిపి అక్షరములు విలోమముగా బిందుయుక్తముగా న్యాసం చేయాలి.

ఇలా భూతలిపిన్యాసముచేసి, ఒకసారి జపించాలి. ఇలా ఒక లక్షసార్లు న్యాసము, లక్షజపము చేసి తిలలతో హోమం చేయాలి. ఇంతకుముందు చెప్పిన అష్టదళ పద్మమేర్పరచి, పీఠశక్తులను పూజించి, దేవిని (మాతృక) ఆహ్వానించి, అంగావరణ దేవతలనర్చించాలి.

## ఆసనమంత్రం

**"హసౌః వర్ణాబ్జాయ భూతలిపి యోగపీఠాయ నమః"**

ఆవరణపూజాక్రమమిట్లుండును. ప్రథమావరణమందు అంగాది ఆవరణము, ద్వితీయమందు అంబికాదులు, తృతీయమందు మాతృక చతుర్థమందు 16 శక్తులు, పంచమమందు 32 శక్తులు ( ) షష్ఠమందు 64 శక్తులు, సప్తమమందు శక్తియుక్త దిక్పాలురు, అష్టమమందు దిక్పాలకుల వజ్రాది ఆయుధములు పూజించాలి.

అంబికాదులు 4గురు - అంబిక - వాగ్భవి - దుర్గా - శ్రీ.

మాతృకయందు - బ్రాహ్మీ - వైష్ణవీ మొదలైవారు.

**16 శక్తుల నామములు** - 1. కరాళి 2. వికరాళి 3. ఉమా 4. సరస్వతి 5. శ్రీ 6. దుర్గా 7. ఉషా 8. లక్ష్మి 9. శృతి 10. స్మృతి 11. ధృతి 12. శ్రద్ధా 13. మేధా 14. మతి 15. కాంతి 16. ఆర్యా ।

**32 శక్తులనామములు** - 1. విద్యా 2. హ్రీం 3. పుష్టి 4. ప్రజ్ఞా 5. సినీవాలి 6. కుహు 7. రుద్రా 8. వర్యా 9. ప్రభా 10. నందా 11. పూషా 12. బుద్ధిదా 13. కాళరాత్రి 14. మహారాత్రి 15. భద్రకాళి 16. కపర్దినీ 17. వికృతి 18. దండినీ 19. ముండినీ 20. సేందు ఖండా 21. శిఖండినీ 22. నిశుంభశుంభమథినీ 23. మహిషాసుర మర్ధిని 24. ఇంద్రాణి 25. రుద్రాణి 26. శంకరార్ధ శరీరిణి 27. నారీ 28. నారాయణి 29. త్రిశూలినీ 30. పాలినీ 31. అంబికా 32. హ్లాదినీ.

ఈ శక్తులు చక్రముధరించి, ఉత్తమభూషణములు ధరించి యుండును. వీరి ముఖము పిశాచమువలె భయంకరమైనది.

# 64 శక్తుల నామములు

1. పింగళాక్షీ 2. విడాలాక్షి 3. సమృద్ధి 4. వృద్ధి 5. శ్రద్ధ 6. స్వాహా 7. స్వధా 8. మాయా 9. వసుంధరా 10. త్రిలోకధాత్రి 11. సావిత్రి 12. గాయత్రి 13. త్రిదశేశ్వరి 14. సురుపా 15. బహురూపా, 16. స్కందమాత 17. అచ్యుతప్రియా 18. విమలా 19. అమలా 20. సంమృతి 27. సంధ్యా 28. మాతా 29. హంసీ 31. మర్దికా 32. రంజికా

33. పరా 34. దేవమాత 35. భగవతి 36. దేవకి 37. కమలాసనా 38. త్రిముఖీ 39. సప్తముఖ్యా 40. సురాసురవిమర్దినీ 41. లంబోష్ఠి 42. ఊర్థ్వకేశి 43. బహుశీర్ష్నా 44. వృకోదరి 45. రథరేఖా 46. శశిరేఖా 47. గగనవేగా 48. పవనవేగా 49. త్రిభువన పాలా 50. అనంగమేఖలా 55. అనంగ కుసుమా 56. విశ్వరూపా 57. అసురభయంకరీ 58. అక్షోభ్యా 59. సత్యవాదినీ 60. వజ్ర రూపా 61. శుచివ్రతా 62. వరదా 63. వాగీశా 64. సంజ్ఞా.

వీరందరూ చాపబాణధారులు - జ్వాలా జిహ్వా శోభితులు - మహాప్రభతో వెలుగొందువారు - దంష్ట్రలు - ఊర్ధ్వకేశములతో, యుద్ధోప్రకాంత మనస్కులై, సర్వాభరణ శోభితులై పూజనీయు లగుచున్నారు.

# హోమాదివిధి

శ్లో॥ ఉత్పలైర్జుహయాత్ తద్వన్మహాలక్ష్మీః ప్రజాయతే
పలాశకుసుమైర్హుత్వా వత్సరేణ కవిర్భవేత్ ।
రాజీలవణ హోమేన వనితాం వశమానయేత్
మాతృకోక్తాని కర్మాణి కుర్యాదత్రాపి సాధకః ।
భూతలిప్యా పుటీకృత్య మోమంత్రం భజతే నరః

క్రమోత్క్రమాచ్ఛతావృత్యా తస్యసిద్ధోభవేన్మనుః ।
సుషుప్త భుజగాకారాం కుండలీం మధ్యవర్త్మనా
సంగమయ్య పరంస్థానం ప్రాణవిత తాంపరామృతైః ।
ప్లావయేన్మూర్ధ్ని మూలాంతం యోగోఽయం సర్వసిద్ధిదః
అనయాన్యస్తదేహస్తు తేజసా భాస్కరోభవేత్ ।
యంత్రక్రియా విశేషాంస్తు జ్ఞాత్వా కర్మాణి సాధయేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – లోకపాలకులను, వారివారి వజ్రాది ఆయుధములను పూజించి భూతలిపి దేవతను అర్చించాలి. పదివేలు కమలములతో హోమం చేసిన రాజవశ్యమగును. సంపద వృద్ధి చెందును.

మోదుగపూలతో హోమం చేసిన ఒక సంవత్సరకాలములో సాధకుడు గొప్ప పండితుడు – కవి అగును. రాజీ (          ) లవణము కలిపి హోమం చేసిన స్త్రీ వశ్యము సిద్ధించును. సాధకుడు భూతలిపితో సంపుటితము చేసి కామ్యకర్మలు ఆచరించవలయును.

శయినించియున్న సర్పమువలెనుండు, కుండలినీశక్తిని, సాధకుడు సుషుమ్నామార్గము ద్వారా షట్చక్రములు భేదించి సహస్రారకమలమందు శివచక్రములోని పరామృతముతో సంయుక్తముచేసి ఆ పరామృతముతో శిరస్సునుండి మూలాధారము పర్యంతము ప్లావనము (తడుపుట) చేయవలయును. ఇది సర్వసిద్ధులను కలిగించును.

## 1. వియద్యంత్రం

శ్లో॥ బింద్వాఢ్యం గగనం తదేవ శివయుక్ జ్ఞానీచతుర్థ్యాయుతో
నత్యంతో మనురేష మద్యవిహితః సాధ్యస్య బంధ్వక్షరైః ।
పతేష్వక్షరశో హకారపుటితాం స్తద్బూత వర్ణాన్ లిఖే

చ్ఛిష్ట చ్చాంత్యదలే విలిఖ్య మతిమాన్ వృత్తేన సంవేష్టమత్।
వియద్యంత్రమిదం ప్రోక్తం లాక్షాచందన నిర్మితం
రోహిణ్యాముదయే రాహోర్విషఘ్నం సర్వశాంతిదమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పంచభూత యంత్రములు చెప్పబడుచున్నవి. ముందుగా ఆకాశయంత్రము వివరింపబడుఉన్నది. "హేంజ్ఞానినే నమః" అని యంత్ర మధ్యమందు, సాధ్యనామముతో, అభిలషిత కార్యముతో సహలిఖించాలి.

ఉదా : "దేవదత్త స్య విషం హర హే జ్ఞానినే నమః ।

పిమ్మట, ఆకాశభూత అక్షరములను హకారముతో సంపుటితము చేసి లిఖించాలి. అష్టమపత్రమందు ఆకాశభూత రెండు వర్ణములగను హకార సంపుటితంగా లిఖించాలి. దీనిని చుట్టి ధరించాలి. ఈ వియ ద్యంత్రము లాక్షాచందనముల మిశ్రమముతో రోహిణీ కాలముహూర్తము నందు లిఖించాలి. దినముయొక్క ఆదికాలము వాయవ్యమనబడును. వర్తమాన లగ్నము యొక్క ఆదికాలము వాయవ్య మనబడును. ఆ లగ్న ఉదయకాలమే రాహూదయము అనబడును. ఇది విషనాశకము.

## 2. వాయవ్యయంత్రము

శ్లో॥ యాద్వ్యాసాక్ష్యధరేందుఖండ శిరసా స్యాతాంక్రమాత్జేయుతం
కోపేశం నమసాన్వితం విరచయేన్మధ్యే దళేష్వష్టసు ।
వాయవ్యాన్ యపుటాన్ విలిఖ్య విధినా శిష్టార్ణమంత్యేదళే
యంత్రంవాయుగృహేణ వేష్టితమిదం సాత్యాత్తాలపత్రే స్థితమ్ ।
స్వాత్యాంమందోదయే యంత్రం వాయవ్యే నిఖనేద్ రిపోః
ద్వార్యుచ్చాటనకృత్ తస్యమృతి ర్వా భవతి ధృవమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – "యిం – యేం – కోపేశాయ నమః" అని యంత్రమధ్యమందు లిఖించి, అష్టదళములూ యకార పుటితముగా వాయివ్యవర్ణములు లిఖించాలి. అష్టమ దళమందు యికారముతో కలిపి శేషించిన వాయవ్యవర్ణములు లిఖించాలి.

ఇందు కూడా కామ్య కర్మలిఖించాలి. స్వాతీ నక్షత్రమందు మకర – కుంభ లగ్నముల కాలములో దీనిని లిఖించి శత్రుద్వారమువద్ద పాతినచో నిశ్చయముగా అతనికి ఉచ్చాటన మగును.

## 3. ఆగ్నేయ యంత్రము

శ్లో॥ వహ్నేర్బీజయుగం క్రమాచ్ఛ్రవణ సద్యార్ధేందుయుక్స్యాత్ స్వరా
రీఃఫట్ హృన్మనురేష మధ్యవిహితః పత్రేషు వహ్న్యాద్భవాన్ ।
వర్ణాన్ వహ్నినిరోధితాన్ ప్రవిలిఖేత్ సాధ్యాక్షరైః పోషకైః
అంత్యంచాంఒత్యదళే కృశాను పురగం భూర్జోదరే కల్పితమ్ ।
శుభవారర్ క్షసంయోగే లాక్షా కుంకుమ నిర్మితం
రక్షాకృత్ సర్వభూతానాం యంత్ర మాగ్నేయ మీరితమ్ ।
ఘాతకాక్షర మిశ్రంతత్ కృత్తికాయాం కుజోదయే
చితాంగారేణ తద్వస్త్రే లిఖితం నాశయేద్రిపుమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఆగ్నేయ యంత్రమునందు "యం రోం హ్రీం ఫట్ నమః" అని మంత్రము, అభిలషిత కర్మ పేర్కొనుచూ యంత్రమునందు లిఖించాలి. దళములందు, రంబీజముతో ఆగ్నేయాక్షర ములు వ్రాయాలి.

దీనిని భూర్జపత్రముపై లాక్షాకుంకుమ మిశ్రమంతో శుభ ముహూర్తమున లిఖించాలి. కృత్తికానక్షత్రమునాడు మేష – వృశ్చిక లగ్నములందు, శత్రునామముతో శ్మశానంలోని బొగ్గుతో వస్త్రంపై లిఖించినంత మాత్రమున శత్రునాశనమగును.

## 4. వారుణ యంత్రము

శ్లో॥ నాసార్ధేందు మదంబు తన్మనుమనుయుతం సార్ధేందుః జేంతోవిధు
ర్విధ్వంతే తు భువే నమోనిగదితో మధ్యేమనుర్వారణాన్।
వర్ణాన్ పత్రపుటేషు వాక్షరపుటాన్ సాద్యస్య బంధ్వక్షరై
రాలిఖ్యాప్యపురేణ వేష్టితమిదం యంత్రం భవేద్వారుణమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – వారుణ యంత్రమందు **"వృం వౌం విధవే భువనే నమః"** అను మంత్రము సాధ్యనామాక్షరములతో లిఖించాలి. అష్టదళములందు "వం" పుటిత వారుణాక్షరములు లిఖించాలి. మరల రెండు వారుణ అక్షరములు రెండు వం బీజములతో సంపుటితం చేసి వ్రాయాలి.

దీనిని ఎర్రచందన జలముతో భూర్జపత్రమునందు శతభిషా నక్షత్రమునాడు వృషభ – తులాలగ్నములందు వ్రాయాలి. దీనివలన వశీకరణము సిద్ధించును.

## 5. పార్థివ యంత్రము

శ్లో॥ గండోబిందు విభూషితో వసుమతీ స్యాత్తాదృశీగండయో
ర్మధ్యస్థౌ తు జ గౌలుకేనతిరిమం మంత్రంలిఖేన్మధ్యతః।
లాంతాన్ లార్ణపుటీకృతాన్ వసుమతీ వర్ణాన్ దళేష్వాలిఖేత్
సేవావర్ణయుతాన్ యధావిధి భువో గేహేన సంవేష్టయేత్॥
జ్యేష్ఠాయాముదితే సౌమ్యే మృదిగైరిక నిర్మితం
పారి&థవయంత్ర ముచిరాత్ సర్వత్ర స్తంభకృద్భవేత్।
గుహ్యాత్ గుహ్యతరాం నిత్యాం శ్రీభూతలిపి దేవతామ్
యఃసేవతే శుభైః పుత్రైర్ధన ధాన్యై శ్చ పూర్యతే।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పార్థివయంత్రమునందు "ఙ్ల లం గజగండలుకే నమః" అని సాధ్యనామముతో మధ్య లిఖించాలి. లం బీజముతో, పృథివీ అక్షరములను సంపుటితముచేసి దళములందు లిఖించాలి. అష్టమదళమందు కేవలం లంలంలం... వ్రాయాలి. నాలుగు దిశలందు లంబీజం లిఖించాలి.

జ్యేష్ఠానక్షత్రమునాడు కన్యా - మిథున లగ్నములలో గైరిక ధాతువు (కొండమట్టి)తో లిఖించిన, వాయు - అగ్ని - జల - శుక్ర - ఖడ్గ - సేనా - శతృస్తంభనమగును.

అత్యంత రహస్యమైన "భూతలిపి"ని, నిత్యమూ పూజించి - జపించు సాధకులు సమస్త శుభములూ పొందెదరు.

## వాగీశ్వరీ మంత్రం

శ్లో॥ అద్రిర్వరుణ సంరుద్ధో దవాగ్వాదిని ఠ ద్వయం
వాగీశ్వర్యా దశార్ణోయం మంత్రో వాగ్విభవప్రదః ।
ఋషిఃకణ్వో విరాట్ ఛందో దేవతావాక్ సమీరితా
శిరః శ్రవణదృక్ నాసా వదనాంధు గుదేష్వీమాన్ ।
న్యస్యార్ణాన్ ప్రాగ్వదంగాని మాతృకోక్తాని కల్పయేత్
దశలక్షం జపేన్మంత్రం దశాంశం జుహు యత్తతః ।
పుండరీకైః పయోభక్తై స్తిలైర్వా మధురాప్లుతైః
మాతృకోదీరితే పీఠే వాగీశీ మర్చయేత్ సుధీః ।
వర్ణాబ్జేనాసనం దద్యాన్మూర్తిం మూలేన కల్పయేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు దశాక్షర సరస్వతీ మంత్రము చెప్పబడుచున్నది. మనువు - వదవద వాగ్వాదిని స్వాహా ।

కణ్వఋషిః - విరాట్ ఛందః - వాణీదేవతా । శిరస్సు 2 చెవులు, 2 నేత్రములు - రెండు నాసారంధ్రములు - ముఖము - లింగము గుదములందు పదిస్థానములలో మూలమంత్రమందలి పది అక్షరములతో న్యాసం చేయాలి.

ధ్యానము ఇలా చేయాలి.

శ్లో॥ తరుణశకల మిందోర బిభ్రతీ శుభ్రకాంతిః
కుచభరనమితాంగీ సన్నిషణ్ణా సితాబ్జే ।
నిజకరకమలోద్య ల్లేఖనీ పుస్తకశ్రీః
సకల విభవసిద్ధ్యై పాతువాగ్దేవతా నః ॥

ఈ మంత్రము పదిలక్షలు జపించి - పురశ్చరణము చేసిన సిద్ధించును. పాలతో తడిపిన కలువలు లేదా త్రిమధురయుక్త తిలలతో హోమమాచరించాలి.

## ఆవరణ పూజ

శ్లో॥ ఆదావంగాని సంపూజ్య పశ్చాచ్ఛక్తీరిమాయజేత్
యోగాసత్యాచ విమలా జ్ఞానాబుద్ధిః స్మృతిః పునః ।
మేధా ప్రజ్ఞాన పత్రేషు ముద్రాపుస్తక ధారిణీః
దళాగ్రేషు సమభ్యర&్య బ్రాహ్మ్యాద్యాస్తా యధావిధి ।
లోకపాలాః బహిఃపూజ్యాస్తేషామస్త్రాణి తద్బహిః
ఏవం సంపూజయేన్మంత్రీ జపహోమాది తత్పరః ।
బ్రహ్మచర్యరతః శుద్ధః శుద్ధదంత నఖాదికః
సంస్మరన్ సర్వవనితాః సతతం దేవతాధియా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ప్రథమావరణమందు - అంగములను పూజించాలి.

ద్వితీయావరణమందు - రెండేసి అచ్చులు రెండు హల్లులు

తృతీయావరణమందు - అష్టవర్గులను

చతుర్థావరణమందు - యోగాది 8 శక్తులను పూజించాలి. వారి పేరు 1. యోగా 2. సత్యా 3. విమలా 4. జ్ఞానా 5. బుద్ధి 6. స్మృతి 7. మేధా 8. ప్రజ్ఞా.

వీరంతా ముద్రా - పుస్తకధారిణులుగా యుంటారు. పిమ్మట పత్రాగ్రములందు బాహ్మీ మొద॥ మాతృకలను అర్చించాలి. బయట - లోకపాలకులను, వారికి బయట లోకపాలుర ఆయుధములను అర్చించాలి. సాధకుడు బ్రహ్మచర్య నిష్ఠను పాటించాలి. శరీరము - మనస్సు శుద్ధి కలిగి యుండాలి. సకల స్త్రీలయందు దేవతా భావనతో ప్రవర్తించాలి.

శ్లో॥ కవిత్తం లభతే ధీమాన్ మాసైః ద్వాదశభిర్ధ్రువం
పీత్వా తన్మంత్రితంతోయం సహస్రంప్రత్యహంజపేత్ ।
మహాకవి రేభవేన్మంత్రీ వత్సరేణ న సంశయః
ఉరోమాత్రే జలేస్థిత్వా ధ్యాయన్మార్తండమండలే ।
స్థితాందేవీం ప్రతిదినం త్రిసహస్రం జపేన్మనుం
లభతే **మండలాత్** సిద్ధిం వాచాను ప్రతిమాంభువి ।
పలాశబిల్వకుసుమైర్బుహుయాన్మధురోక్షితేః ।
హోమోఽయం సర్వసౌభాగ్య లక్ష్మివశ్యప్రదో భవేత్
రాజవృక్ష సముద్ భూతౌః ప్రసూనైర్మధురాప్లుతైః ।
తత్సమిద్భిశ్చజుహుయాత్ కవిత్వమతులం లభేత్
ఏవం దశాక్షరీ ప్రోక్తా సిద్ధయే వాచమిచ్ఛతామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సాధకుడు వాగీశ్వరీ మంత్రముచే అభిమంత్రించిన, జలమును సంవత్సరకాలము నిత్యమూ

సేవించిన గొప్ప విద్యావేత్త యగును. సృజనాత్మకశక్తి వృద్ధి చెందును. నిత్యమూ సహస్ర జపము చేయు సాధకుడు ఒక సంవత్సరకాలములో కవి యగును.

తొడలవరకు నీళ్లలోనిలబడి, సూర్యమండలమందు సరస్వతిని ధ్యానించి, ప్రతిదినము మూడువేలు మంత్రజపము చేసినచో **49** రోజులలో గొప్పసిద్ధి కలుగును.

(ఇచ్చట మూలములోని "మండల" శబ్దమునకు **49** రోజులని రాఘవభట్టు "పదార్ధాదర్శ" వ్యాఖ్యానములో ఇట్లు పేర్కొన్నాడు "మండలాదిత్యేకోన పంచాశద్దివసైరిత్యర్థః")

మోదుగ - బిల్వ పుష్పములు, త్రిమధురములతో తడిపి హోమము చేసిననూ, లేదా వాటి సమిధలతో నిత్యమూ హోమము చేసిననూ బృహస్పతి వంటి పాండిత్యము, కీర్తి కలుగును. రాజవృక్ష సమిధలతో హోమం చేసినచో కవి యగును.

**"సారస్వతమతము"**నందు దీని ప్రశంస ఇట్లున్నది. దీనికి ఓం - హ్రీం చేర్చిన మరింత విశేష ఫలదాయకమని చెప్పినది.

☞ **తారామాయా సంపుటోఽ యం మహాసారస్వతప్రదః**

## మరొక వాగీశ్వరీ మంత్రము

శ్లో॥ హృదయాంతే భగవతి వదశబ్దయుగం తతః
వాగ్దేవి వహ్ని జాయాంతం వాగ్భవాద్యం సముద్ధరేత్ ।
మనుంషోడశ వర్ణాఢ్యం వాగైశ్వర్య ఫలప్రదం
మనోఃషడ్భిః పదైః కుర్యాత్ షడంగాని సజాతిభిః ।
హవిష్యాశీ జపేత్ సమ్యక్ వసులక్ష మనన్యధీః
దశాంశం జుహుయాదంతే తిలైః రాజ్య పరిప్లుతైః ।

మాతృకోక్తే యజేత్ పీఠే దేవీం ప్రాగీరిత క్రమాత్
పిబేత్త న్మంత్రితం తోయం ప్రాతఃకాలే దినేదినే ।
విద్వాన్ వత్సరతో మంత్రీ భవేన్నాస్తి విచారణా
అభిషించేజ్జలైర్జప్తై రాత్మానం స్నాన కర్మణి ।
తర్పయేత్తాంజలైః శుద్ధైః అతిమేధామవాప్నుయాత్
పుష్పగంధాదికం సర్వం తజ్జప్తం ధారయేత్ సుధీః ।
సభాయాంపూజ్యతే సద్భిర్వాదే చ విజయీ భవేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇది వాగీశ్వరీ షోడశాక్షర మంత్రము.

**మనువు - "ఐం నమో భగవతి వదదవద వాగ్దేవి స్వాహా ।**

దీనిని 6 భాగములతో షడంగన్యాసము చేయాలి. ఋష్యాదులు పూర్వము వలెనే. ధ్యానము ఈ క్రింది విధముగా చేయాలి.

శ్లో॥ శుభ్రాంస్వచ్ఛ విలేపమాల్యవసనాం శీతాంశుఖండో జ్వలాం
వ్యాఖ్యామక్షగుణం సు9ధాఢ్యకలశం విద్యాంచ హస్తాంబుజైః
బిభ్రాణాం కమలాసనాం కుచనతాం వాగ్దేవతాంసుస్మితాం
వందే వాగ్విభవప్రదాం త్రినయనాం సౌభాగ్య సంపత్కరీమ్॥

సాధకుడు హవిష్యాన్నము తినుచుఐ, పై మంత్రమును 8 లక్షలు జపించి, ఘృత మిశ్రిత తిలలతో దశాంశహోమ మాచరించి పురశ్చరణ చేసిన సిద్ధించును.

ప్రతిదినము పీఠార్చన చేసి, సప్తవారము మూలమంత్రముతో అభి మంత్రించిన జలము, ఏడుసార్లు సేవించిన ఒక సంవత్సరకాలములో గొప్ప విద్యావంతుడగును. ఇందు సందేహము లేదు. స్నాన సమయము నందు ఈ మంత్రము జపించిన మేధస్సు వృద్ధి చెందును. ప్రతినిత్యమూ

శుద్ధజలముతో వాగీశ్వరికి తర్పణము చేసినచో, ఉన్నవిద్యాప్రాప్తి - ధారణాశక్తి సిద్ధించును.

7సార్లు వాగీశ్వరీ మంత్రముతో గంధ - పుష్పాదులను అభిమంత్రించి, ధరించినచో సభయందు గౌరవము, విజయములు ప్రాప్తించును. వాదమునందు జయము కలుగును.

## హంసవాగీశ్వరీ మంత్రము

శ్లో॥ తారోమాయోఽధరో బిందుః శక్తిస్తారం సరస్వతీ
జేంతా నత్యంతికో మంత్రః ప్రోక్త ఏకాదశాక్షరః ।
బ్రహ్మరంధ్రేభ్రువోర్మధ్యే నవరంధ్రేషు చక్రమాత్
మంత్రవర్ణాన్ న్యసేన్మంత్రీ వాగ్భవేనాంగ కల్పనా ।
జపేద్ ద్వాదశ లక్షాణి తత్సహస్రం సితాంబుజైః
నాగచంపక పుష్పైర్వా జుహుయత్ సాధకోత్తమః ।
మాతృకోక్తే యజేత్పీఠే వక్ష్యమాణ క్రమేణతాం
వర్ణాబ్జేనాసనం కుర్యాత్ మూర్తిం మూలేన కల్పయేత్ ।
దేవ్యాదక్షిణతః పూజ్యా సంస్కృతా వాంగ్మయీ తతః
ప్రాకృతా వామతః పూజ్యావాంగ్మయీ సర్వసిద్ధిదా ।

**సంపత్కుమార్ తెలుగు వ్యాఖ్యానం** – హంసవాగీశ్వరీ ఏకాదశాక్షర మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం హ్రీం ఐం క్లీం ఓం సరస్వత్యై నమః।**

ఇందలి ప్రతీ అక్షరమూ, బ్రహ్మరంధ్ర - భ్రూమధ్య - 2 కర్ణ - 2 నేత్ర - 2 నాసారంధ్ర - ముఖ - లింగ - గుద స్థానములందు న్యాసం చేయాలి. ఋష్యాదులు పూర్వమువలెనే ఇలా ధ్యానించాలి.

శ్లో॥ వాణీం పూర్ణనిశాకరోజ్వలముఖీం కర్పూరకుంద ప్రభాం
చంద్రార్ధాంకిత మస్తకాం నిజకరైః సంబిభ్రతీ మాదరాత్ ।
వీణామక్ష గుణం సుధాఢ్యకలశం విద్యాంచ తుంగస్తనీం
దివ్యైరాభరణైర్విభూషితతనుం హంసాధి రూఢాంభజే ॥

ఈ మంత్రము 12 లక్షలు జపించి, తెల్లకలువలు లేదా నాగమల్లి - సంపెంగపూలతో 12వేలు హోమంచేసి పురశ్చరణ చేయాలి. ముందు మాతృకాపీఠము నర్చించాలి.

**"హసౌహంసః వాగీశ్వరీ యోగపీఠాయ మః"** అని ఆసనం కల్పించాలి. మూలమంత్రముతో దేవీమూర్తిని భావించి ఆహ్వానించాలి.

వాగీశ్వరీ దక్షిణ భాగమందు సంస్కృత వాంగ్మయమును, వామ భాగమునందు ప్రాకృత వాఙ్మయమును పూజించాలి.

శ్లో॥ ఇష్ట్వా పూర్వవదంగాని ప్రజ్ఞాద4ఆ్యః పూజయేత్తతః
ప్రజ్ఞామేధాశృతిః శక్తిః స్మృతిర్వాగీశ్వరీ మతిః ।
స్వస్తిశ్చేతి సమాఖ్యాతా బ్రాహ్మ్యాద్యాస్తదనంతరం
లోకేశానర్చయేద్ భూయః తదస్త్రాణి చ తద్బహిః ।
ఇతి సంపూజయేద్దేవీం సాక్షాద్వాగ్వల్లభో భవేత్
దశాక్షరీ సముక్తాని కర్మాణ్యత్రాపి సాధయేత్ ।
పూజనం పూర్వవత్ కుర్యాదత్రాపి సాధకోత్తమః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ ప్రకారము పూజించి అంగాది ఆవరణలు, ప్రజ్ఞాది శక్తులను పూజించాలి. 1. ప్రజ్ఞా 2. మేధా 3. శృతి 4. శక్తి 5. స్మృతి 6. వాగీశ్వరి 7. మతి 8. స్వస్తి. తదనంతరం బ్రాహ్మీ మొదలగువారిని, లోకేశ్వరులను, వారి ఆయుధములను అర్చించాలి.

ఇలా పూజించిన సాధకుడు సరస్వతీ కృపకు, పాత్రుడగును. దశాక్షరీ ప్రయోగములవలెనే, ఈ మంత్రముతో కూడా కామ్యకర్మలను సాధించ వచ్చును.

## మరొక "హంసవాగీశ్వరీ" మంత్రము

శ్లో॥ వాచస్పతేఽమృతే భూయః ప్లువః ప్లురితి కీర్తయేత్
వాగాద్యోమునిభిః ప్రోక్తో రుద్రసంఖ్యాక్షరోమనుః ।
కుర్యాదంగాని విధివత్ వాగాద్యైః పంచభిః పదైః
మాతృకాం విన్యసేత్ పూర్వం పూర్వవత్తాం యధావిధి ।
రుద్రలక్షం జపేన్మంత్రం దశాంశం జుహుయాద్ ఘృతైః
మాతృకాకల్పితే పీఠే పూజయేత్తాం యధాపురా ।
పలాశకుసుమైర్హుత్వా పరాంసిద్ధి మవాప్నుయాత్
కదంబకుసుమైస్త ద్వత్ ఫలైః శ్రీవృక్ష సంభవైః ।
అచిరాత్ శ్రియమాప్నోతి వాచాంకుంద సముద్భవైః
నంద్యావర్త ప్రసూనైర్వా హుత్వా వాగ్వల్లభోభవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మరొక "హంసవాగీశ్వరీ" ఏకాదశాక్షర మంత్రము వివరింపబడుచున్నది.

**మనుః - ఐం వాచస్పతే అమృతే ప్లువః ప్లుః ।**

ఈ మంత్ర సాధనకు ధ్యానశ్లోకము ఇలా పఠించవలయును.

శ్లో॥ ఆసీనాకమలే కరైర్జపవటీం పద్మద్వయం పుస్తకం
బిభ్రాణా తరుణేందుబద్ధ ముకుటా ముక్తేందుకుందప్రభా।
భాలోన్మీలితలోచనా కుచభరాక్రాంతా భవద్భూతయే
భూయాద్ వాగధిదేవతా మునిగణైరాసేవ్యమానాఽనిశమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 11 లక్షలు జపించి, దశాంశము నేతితో హోమం చేయాలి. ప్రయోగమంతయు పూర్వమువలెనే యుండును. దీనికి ఐం బీజం – ప్లుః శక్తిః – మంత్రములోని పంచాంగము లతో న్యాసము.

మోదుగ పూవులతో హోమం చేసిన సమస్త విద్యాసిద్ధులూ కలుగును. కదంబ (కడిమి) కుసుమములతో లేదా బిల్వ ఫలములతో హోమం చేసిన సంపద – శాస్త్రవిజ్ఞానం సిద్ధించును. మల్లె – నంద్యావర్త (గంధతగర) సుమాలతో హోమం చేసిన వాగ్వల్లభుడగును.

## బ్రాహ్మీఘృతం

శ్లో॥ బ్రాహ్మీరసే వ చాకల్కే కపిలాజ్యం పచేజ్జపన్
పిబేద్దినాదౌ తన్నిత్యం సర్వశాస్త్రార్థ విద్భవేత్ ।
అనయా విద్యయా జప్తం బ్రాహ్మీపత్రం ప్రభక్షయేత్
న విస్మరతి మేధావీ శ్రుతాన్ వేదాగమాన్ పునః ।
బహునా కిమయం విద్యా జపతాం కామదో మణిః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - బ్రాహ్మీఘృత నిర్మాణము చెప్పబడుచున్నది. వస చూర్ణము – బ్రాహ్మీరసము (సరస్వతీ ఆకురసము) – కపిల గోఘృతము ఈ మూడూ, హంసవాగీశ్వరీ మంత్రము జపించుచూ వండాలి. ఘృతమునకు 8 భాగములు కల్కము, ఘృతమునకు 4 రెట్లు బ్రాహ్మీరసము ఉండాలి.

దానిని సమంత్రకముగా ప్రాతః కాలమునందు 7 రోజులు సేవించిన, జ్ఞాపకశక్తి – మేధాశక్తి – ధారణాశక్తి వృద్ధి పొందును. ఈ మంత్ర పఠనముతో సరస్వతీ ఆకు తినిననూ జ్ఞాపకశక్తి పెరుగును. ఇది శివ చింతామణివంటి గొప్ప ప్రయోగమని సకల తంత్రములందూ చెప్పబడినది.

"నారాయణీయము"నందు హంసవాగీశ్వరీమంత్రము దశాక్షరిగా ఇట్లు చెప్పబడినది.

☞ **వాక్ కూర్మః పార్శ్వయుక్ శుక్రంతే కేశాంతేఽమృతే ప్లవః ।**
**ప్లురంతాదశవర్ణేయం విద్యాముఖ్యా సరస్వతీ ॥**

## వాగీశ్వరీ మంత్రాంతరము

శ్లో॥ తోయస్థం శయనం విష్ణోః సకేవల చతుర్ముఖః
బింద్వార్ధీశయుతో వహ్నిర్బిందు సద్యోఽంబుమాన్ భృగుః
ఉక్తానిత్రీణి బీజాని సద్భిః సారస్వతార్థినాం
అంగాని కల్పయేద్ బీజై ద్విరుక్తై ర్జాతిసంయుతైః ।
త్రిలక్షం ప్రజపేన్మంత్రం జుహుయాత్తద్దశాంశతః
పాయసేనాజ్యసిక్తేన సంస్కృతే హవ్యవాహనే ।
వాగీశీం పూజయేత్పీఠే విధినామాతృకోదితే
వ్యాఘాతకుసుమైర్హుత్వా వాక్సిద్ధిమతులాం లభేత్ ।
నంద్యావర్తైః శుభైః కుందైర్ హుత్వావాక్సిద్ధామాప్నుయిత్
జాతిపుష్పైః సితాంభోజైః సిక్తైః చందనవారిణా ।
సితాంవచాంవా బ్రాహ్మీంవా జప్తాంఖాదేద్దినేదినే
మేధాం కామమవాప్నోతి సాధకో నాత్ర సంశయః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మూడక్షరముల వాగీశ్వరీ మంత్రము చెప్పబడుఉన్నది.

**మనుః - ఐం రూం స్వోమ్ ॥**

ఈ బీజత్రయముతో రెండుసార్లు పఠించి షడంగన్యాసంచేయాలి.

## ధ్యానం

ముక్తాహారావదాతాం శిరసి శశికళా లంకృతాం బాహుభిఃస్వైః
వ్యాఖ్యాంవర్ణాక్షమాలాం మణిమయ కలశం పుస్తకంచోద్వహంతీమ్
ఆపీనోత్తుంగ వక్షోరుహభర వినమన్మధ్య దేశామధీశాం
వాచామీడే చిరాయ త్రిభువననమితాం పుండరీకేనిషణ్ణామ్ ॥

ఈ మంత్రమును 3 లక్షలు జపించి, దశాంశము ఘృతసహిత పాయసం హోమం చేయాలి. రాజవృక్ష పుష్పములతో హోమం చేసిన అనుపమమైన వాక్సిద్ధి కలుగును.

చందన గంధ జలముతో తడిపిన జాజిపూలు, తెల్లకలువలు, నంద్యావర్త పుష్పములు, మల్లెలతో హోమం చేసిననూ వాక్సిద్ధి కలుగును. ఈ మంత్ర జపమువలన సభాజయం వాదజయం కలుగును. ఇదే మంత్రముతో తెల్లవస – సరస్వతీ ఆకు తినిననూ జ్ఞాపకశక్తి వృద్ధి పొందును.

# సరస్వతీ ఉపాసక నియమములు

శ్లో॥ సుసితైర్గంధకుసుమై పూజాసారస్వతే విధౌ
దూర్వాబీజాంకురం పుష్పం రాజవృక్ష సముద్భవమ్ ।
ఉత్పలానిప్రశస్తాని సింధువారాంకురాణిచ
భజన్ సరస్వతీం నిత్యం ఏతానిపరివర్జయేత్ ।
ఆమ్రాతం గంజనం బిల్వం కరంజంలశునంతథా
తైలం పలాండుం పిణ్యాకం శాంర్గాష్టమపిభోజనే ।
సర్వం పర్యుషితం త్యాజ్యం సదాసారస్వతార్థినా
నాచిరేన్ని శితాంబూలం స్త్రియంగచ్ఛేద్దివా నిశా ।
న సంధ్యయో స్వపేజ్జాతు నాశుచిః కించిదుచ్చరేత్
ప్రదోషేషు భవేన్మౌనీ దిగ్వస్త్రాంన విలోకయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సమస్త సారస్వత ఉపాసనా విధియందు సుగంధయుక్త శ్వేత కుసుమములు, దూర్వా - యవాంకురములు - రాజవృక్ష (            ) పుష్పములు - తెల్లకలువలు - నిర్గుండీ అంకురములు ప్రశస్తములు.

ఇక సరస్వతీ ఉపాసకులు భోజనమునందు, ఈ క్రింది పదార్థములను వర్జించవలయును. 1. ఆమ్రాతం (            ) 2. గుంజనం (కేరెట్‌దుంప) 3. ఉల్లి 4. వెల్లుల్లి 5. ప్రత్యక్షంగా నువ్వులనూనె 6. మారేడు 7. శార్‌ఙ్గాష్టం (సింగోడాదుంప) 8. పిణ్యాకం (            ) తినరాదు.

అదేవిధముగా ఒక రాత్రి నిలువయుండిన, వండిన పదార్థములు, ఉదా : చద్దన్నం, నిన్న వండిన పులిహోర - బూర్లు మొదలైనవి. రాత్రియందు తాంబూలము వేసుకొనరాదు. పగటియందు స్త్రీ సంగమము చేయరాదు. నగ్నస్త్రీలను చూడరాదు.

పొరబాటునకూడా రెండు సంధ్యాకాలములందు నిద్రించరాదు. అపవిత్రముగా యుండి మాట్లాడరాదు. ప్రదోషకాలమునందు మౌనంగా యుండాలి. స్త్రీలను నిందించరాదు. రజస్వల అయిన స్త్రీతో సంగమం చేయరాదు. అసత్యమాడరాదు. పుస్తకములు దాటరాదు.

శ్లో॥ అక్షరాధ్యాని పత్రాణి నాపేక్షే త నలం ఘయేత్
చతుర్దశ్యష్టమీపర్వ ప్రతిపత్ గ్రహణేషుచ ।
సంక్రమేష చ సర్వేషు విద్యంనైవ పఠేద్బుధః
వ్యాఖ్యానే సంత్యజేన్నిద్రామాలస్యంజృంభనం పునః ।
క్రోథం నిష్ఠీవనం తద్వన్నీచాంగ స్పర్శనంతథా
మనుష్యసర్పమార్జార మండూక నకులాదయః ।

అంతరాయది గచ్ఛేయుః తదావ్యాఖ్యాం పరిత్యజేత్
నిశాసుదీపభ్రంశేచ సద్యః పాఠం పరిత్యజేత్ ।
జ్ఞాత్వా దోషానిమాన్ సమ్యక్ భక్త్యాయో భారతీం భజేత్
వాచాంసిద్ధి మవాప్నోతి వాచస్పతి రివాపరః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అక్షరములున్న కాగితములను, పత్రములను తృణీకార భావముతో చూడరాదు. అష్టమి - చతుర్దశి - అమావాస్య - పూర్ణిమ - ప్రతిపత్ - గ్రహణం - సంక్రాంతి రోజులలో అధ్యయనము చేయరాదు.

గ్రంథమును వ్యాఖ్యానించు సందర్భములో నిద్ర - ఆవలింత - ఒళ్ళు విరుపు నిషిద్ధములు. క్రోధము - ఉమ్మట - నాభి క్రిందిభాగము స్పృశించుట పనికిరాదు. మనుష్య - సర్వ - మార్జార - మండూక - ముంగిస మొ॥ మధ్యనుంచి వెళ్ళిన, వ్యాఖ్యానమును నిలుపుచేయ వలయును.

రాత్రియందు దీపము కొండెక్కినచో పాఠము నిలుపు చేయ వలయును. ఈ నియమములు పాటించు సరస్వతీ సాధకుడు బృహస్పతి వంటివాడై వాక్సిద్ధిని పొందును.

అంగుష్ఠ సహితముగా ఈ క్రింది పనులు చేయవలెనని శాస్త్రము బోధించుచున్నది. అంగుష్ఠ రహితముగా రాక్షసులు చేయుదురు.

☞ **దానం ప్రతిగ్రహోహోమో భోజనం బలిరేవచ ।**
**సాంగుష్ఠేన సదాకార్యమసురేభ్యోఽ_న్యథా భవేత్ ॥**

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*సప్తమః పటలః సమాప్తః*

❖❖❖

# అథాష్టమః పటలః

## అథమహాక్ష్మీప్రకరణమ్

శ్లో॥ అథవక్ష్యే శ్రియోమంత్రాన్ శ్రీసౌభాగ్యఫలప్రదాన్
యస్యాః కటాక్షమాత్రేణ త్రైలోక్యమభివర్ధతే ।
వాంతం వహ్నౌ సమారూఢం వామనేత్రేందు సంయుతం
బీజమేతత్ శ్రియఃప్రోక్తం చింతామణి రివాపరః ।
ఋషిర్భృగుర్ నివృచ్ఛందో దేవతా శ్రీః మీరితా
షడ్దీర్ఘయుక్త బీజేన కుర్యాదంగా నిషట్ క్రమాత్ ।
భానులక్షం జపేన్మంత్రం దీక్షితో విజితేంద్రియః
శ్రియమప్యర్చయేన్నిత్యం సుగంధి కుసుమాదిభిః ।
తత్సహస్రం ప్రజుహుయాత్ కమలైర్మధు రోక్షితైః
జపాంతే జుహు యాన్మంత్రీ తిలైర్వామధు రాప్లుతైః ।
బిల్వైః ఫలైర్వా జుహుయాత్ త్రిభిర్వా సాధకోత్తమః
అత్రసమ్యగ్యజేత్ పీఠం నవశక్తి సమన్వితమ్ ।
విభూతిరున్నతిః కాంతిః సృష్టిః కీర్తిశ్చ సన్నతిః
పుష్టిరుత్ కృష్టిరుద్ధి శ్చ సంప్రోక్తా నవశక్తయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మహాలక్ష్మీ మంత్రములను వివరించుచున్నాడు.

మనుః – శ్రీం । ఈ మంత్రము సర్వమనోరథములను తీర్చును.

ఋషిః – భృగుః । చంధస్సు – నివృత్ । శ్రీదేవతా । శ్రాం శ్రీం ఇత్యాది షడ్దీర్ఘ బీజములతో షడంగన్యాసమాచరించాలి.

## ధ్యానం

కాంత్యా కాంచన సన్నిభాం హిమగిరిప్రఖ్యైశ్చతుర్భిర్గజైః
హస్తోత్క్షిప్త హిరణ్మయామృత ఘటైరాసిచ్యమానాం శ్రియమ్ ।
బిభ్రాణాం వరమబ్జయుగ్మమభయం హస్తైః కిరీటోజ్వలాం
క్షౌమాబద్ధ నితంబబింబలసితాం వందేఽరవిందస్థితామ్॥

ఈ మంత్రమును 12 లక్షలు జపించి, త్రిమధు మిశ్రిత తిలలతో హోమం చేయాలి. లేదా మారేడు పండ్లతో చేయవచ్చు. మూడు ద్రవ్యములతో విడివిడిగా నాలుగేసివేలు హోమం చేయవచ్చు. పిమ్మట ఈ నవశక్తులతో మహాపీఠ పూజ చేయాలి.

1. విభూతి 2. ఉన్నతి 3. కాంతి 4. సృష్టి 5. కీర్తి 6. సన్నతి 7. పుష్టి 8. ఉత్కృష్టి 9.జ బుద్ధి.

## పీఠమంత్రం

శ్లో॥ అత్రావాహ్య యజేద్దేవీం పరివారైః సమన్వితాం
బీజాద్యమాసనం దత్వా మూర్తిం మూలేన కల్పయేత్ ।
యజేద్ పూర్వవదంగాని దిగ్దలే ష్వర్చయేత్తతః
వాసుదేవం సంకర&షణం ప్రద్యుమ్న మనిరుద్ధకమ్ ।
హిమపీతతమావేంద్ర నీలాభాన్ పీతవాససః
శాఖచక్రగదాపద్మధారిణస్తాన్ చతుర్భుజాన్ ।
విదిగ్గతేషు పత్రేషు దమకాదోన్ యజేత్ గజాన్
దమకం సలిలం చైవ గుగ్గులంచ కురుంటకమ్ ।
యజేత్ శంఖనిధిందేవ్యా దక్షిణే దయితాన్వితాం
ముక్తామాణిక్యసంకాశా కించిత్ స్మితముఖాంబుజౌ ।

అన్యోన్యాలింగనపరౌ శంఖపంకజ దారిణౌ
విగలద్రత్న వర్షాభ్యాం శంఖాభ్యాం మూర్ధ్నిలాంబఖితౌ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - "శ్రీం సర్వశక్తి కమలాసనాయ నమః" అని పీఠపూజ చేయాలి. మూలమంత్రముతో ఆవాహనం. పిమ్మట అంగపూజ, నాలుగు వైపులా వాసుదేవ - సంకర్షణ - ప్రద్యుమ్న - అనిరుద్ధులను అర్చించాలి. వీరు పీతుంబరధారులు - తమాలనీవర్ణులు - శంఖ - చక్రగదాపద్మధారులు, చతుర్భుజులుగా నుందురు.

ఆగ్నేయాదికోణములందు 4 గజములను 1. దమకము 2. సలిలము 3. గుగ్గులు 4. కురంటకము లనే వాటిని అర్చించాలి. ఇవి రజతప్రభలతో, హేమకుంభములు ధరించి యుండును. దీనిని గూర్చి **"నారాయణీయము"** నందిట్లున్నది.

☞ **ఆగ్నేయాదిషు పత్రేషు గుగ్గులుశ్చ కురంటకః**
**దమకః సలిలశ్చేతి హస్తినో రజతప్రభాః ।**
**హేమకుంభ ధరాః ధ్యేయాః ।**

లక్ష్మీదేవి దక్షిణభాగమందు భార్యాసహిత శంఖనిధిని అర్చించాలి. ఈ దంపతులు ముక్తామాణిక్య లావణ్యయుక్తులై స్వచ్ఛముగా మందస్మిత శోభితులై యుందురు.

వీరు పరస్పరాలింగితులై యుందురు. శంఖము, కమలము ధరించి యుందురు. తమ కరకమలములందలి శంఖములతో రత్నములు వర్షించుచుందురు.

శ్లో॥ తుందిలం కంబుకనిధిం వసుధారాం ఘనస్తనీం
వామతః పంకజనిధిం ప్రియయా సహితంయజేత్ ।
సింధూరాభౌభుజాశ్లిష్టౌ రక్త పద్మోత్పలాన్వితౌ

నిఃసరద్రత్న ధారాభ్యాం పద్మాభ్యాం మూర్ధ్నిలాంఛితౌ ।
తుందిలం పంకజనిథిం తన్వీం వసుమతీమపి
దళాగ్రేషు యజేదేతా బలాక్యాద్యాః సమంతతః ।
బలాకీ విమలా చైవ కమలావనమూలికా
విభీషికా మాలికాచ శాంకరీ వసుమాలికా ।
పంకజద్వయ ధారిణ్యో ముక్తాహార సమప్రభాః
లోకేశానర్చయేదంతే వజ్రాద్యస్త్రాణి తద్భహిః ।
ఇత్థం యో భజతే దేవీం విథినా సాధకోత్తమః
ధనధాన్య సమృద్ధః స్యాచ్ఛ్రియమాప్నోత్య నిందితామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ శంఖనిధి పెద్ద బొజ్జ (ఉదరము) కలవాడు, భార్య వసుధారయొక్క స్తనములు కఠినములు. పిమ్మట అదే కర్ణికయందు ఎడమభాగమున భార్యాసహిత "పద్మనిధి"ని పూజించాలి.

ఈ దంపతుల శరీరము సింధూరవర్ణములో నుండును. పరస్పర భుజములు కౌగిలించుకొని యుండును. ఇరువురి చేతులందూ ఎర్రని కమలములుండును. ఇద్దరూ రత్నవర్షమును కురిపించు 2 కమలములను, శిరస్సులందు ధరించియుందురు.

పద్మనిధి శరీరము లావుగాయుండును. భార్య కూడా ఘనస్తని. ఈమె పేరు వసుమతి. పిమ్మట అష్టదళములందు శక్తులనారాధించాలి. 1. బలాకీ 2. విమల 3. కమలా 4. వనమాలికా 5. విభీషికా 6. మాలికా 7. శాంకరీ 8. వసు మాలికా.

వీరు తమ రెండుచేతులందు కమలములు దరించి ముక్తాహార ప్రభలతో వెలుగొందుచుందురు. అటు పిమ్మట లోకపాలకులను, వారి వారి ఆయుధములను అర్చించాలి.

ఉత్తమ సాధకుడు ఈ విధముగా మహాలక్ష్మిని అర్చించినచో ధనధాన్య సమృద్ధిని, కీర్తిని పొందగలడు.

శ్లో॥ వక్షః ప్రమాణే సలిలేస్థిత్వా మంత్రమిమం జపేత్
త్రిలక్షం సంయతో మంత్రీ దేవీం ధ్యాత్వాఽర్కమండలే।
స భవేదల్పకాలేన రమయా వసతిః స్థిరా
విష్ణుగేహస్థ బిల్వస్య మూలమాస్థాయ మంత్రవిత్ ॥
త్రిలక్షం ప్రజపేన్మంత్రం వాంఛితం లభతే ధనమ్ ।
అశోకవహ్నౌ జుహుయాత్తండులై రాజ్యలోడితైః
వశయత్య చిరాదేవ త్రైలోక్యమపి మంత్రవిత్ ॥
జుహుయాత్తండులైః శుద్ధైరర్కా గ్నౌ నియుతం వశౌ
రాజ్యశ్రియమవాప్నోతి రాజపుత్రో మహీయసీమ్ ।
జుహుయత్ ఖాదిరే వహ్నౌ తండులైర్మధురోక్షితైః ॥
రాజావశ్యోభవేత్ శీఘ్రం మహాలక్ష్మీశ్చ వర్ధతే
బిల్వచ్ఛాయా మధివసన్ బిల్వమిశ్ర హవిష్యభుక్ ।
సంవత్సర ద్వయంహుత్వా తత్ఫలైరథవాంఽబుజైః
సాధకేంద్రో మహాలక్ష్మీం చక్షుషా పశ్యతిధృవమ్ ।
హవిషాఘృతసిక్తేన పాయసేన ససర్పిషా
హుత్వా శ్రియమవాప్నోతి నియుతం మంత్రవిత్తమః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – నీళ్లలో వక్షఃస్థలమువరకు నిలబడి, సూర్యమండలమందు దేవిని ధ్యానించుచూ, మూలమంత్రమును మూడు లక్షలు జపించాలి. విష్ణుదేవాలయమందలి మారేడుచెట్టు క్రింద కూడా మూడు లక్షలు జపించవచ్చు. సాధకుడు తాను కోరినంత ధనవంతు డగును.

అశోక సమిధలతో, నేయి, బియ్యముతో హోమంచేసిన, స్వల్ప కాలములోనే జనవశ్యము సిద్ధించును. జిల్లేడు సమిధలు, నేయి, బియ్యం హోమం చేసిన (10 వేలు) అధికారము సిద్ధించును. రాజవశ్యము జరుగును.

త్రిమధుర మిశ్రిత బియ్యముతో, చంద్రసమిధలు హోమం చేసిన అధికారులు వశమగుదురు. మారేడుచెట్టు నీడలో అచటనే ఉంటూ హవిష్యాన్నము భుజించుచూ, మారేడుపండ్లు, కమలములతో హోమ మాచరించిన రెండు సంవత్సరములలో మహాలక్ష్మి దర్శనము కలుగును. అఖండైశ్వర్య సంపన్నుడగును.

నేతితో పాయసహోమమాచరించిన, (10వేలు) సమస్త సంపదలు కలుగును. త్రిమధురమిశ్రిత ఎర్ర కలువలు ఒక లక్ష హోమమాచరించిన ప్రళయ పర్యంతము అతని వంశమునందు లక్ష్మి స్థిరముగా నిలుచును.

## చతుర్భుజ మంత్రము

శ్లో॥ వాగ్భవం వనితా విష్ణోర్మాయా మకరకేతనః
చతుర్భుజాత్మవో మంత్రశ్చతుర్వర్గ ఫలప్రదః ।
అంగానిమర్యా ద్దీర్ఘాఢ్య రమాబీజేన మంత్రవిత్
భానులక్షం హవిష్యాశీ జపేదంతే సరోరుహైః ।
జుహుయాదరుణైః ఫుల్లై స్తత్సహస్రం జితేంద్రియః
రమాయాః కల్పితే పీఠే తద్విధానేన పూజయేత్ ।
కుర్యాత్ ప్రయోగాంస్తత్రస్థాన్ మనునాతేన సాధకః
నిధిభిః సేవ్యతే నిత్యం మూర్తిమద్భిరుపస్థితైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మహాలక్ష్మి చతుర్భుజమంత్ర మిట్లుండును.

**మనుః : ఐం - శ్రీం - హ్రీం క్లీం।**

ఈ నాలుగు బీజాక్షరములు నాలుగు పురుషార్థములనూ ఇచ్చును. ఆం – ఈం – ఊం – ఐం – ఔం – అః – అను దీర్ఘాక్షరములకుం శ్రీం బీజము చేర్చి షడంగన్యాసమాచరించాలి.

### ధ్యానం

మాణిక్యప్రతిమప్రభాం హిమనిభైస్తుంగైశ్చతుర్భిర్గజైః
హస్తాగ్రాహిత రత్నకుంభసలిలై రాసిచ్యమానాం సదా ।
హస్తాబ్జైర్వర దానమంబుజయుగాభీతీర్దధానాం హరేః
కాంతాంకాంక్షిత పారిజాతల తికాం వందే సరోజాసనామ్।

హవిష్య భోజనము చేయుచూ, బ్రహ్మచర్యాది నియమములతో 12 లక్షలు జపించి, ఘృతమిశ్రిత వర్తకమలములలో 12 వేలు హోమం చేయాలి. లక్ష్మీపీఠమునందు నిత్యార్చన చేయాలి. మూలమంత్రముతో ప్రయోగములు సాధించవచ్చు. నవనిధులూ సాధకుని సేవించును.

## దశాక్షర మంత్రము

శ్లో॥ దీర్ఘాయాదిర్విసర్గాంతో బ్రహ్మ భానుర్వసుంధరా
వాంతే సిన్యై ప్రియావహ్నిర్మనుః ప్రోక్తో దశాక్షరః ।
ఋషిర్దక్షో విరాట్ ఛందో దేవతా శ్రీః సమీరితా
దేవ్యై హృదయమాఖ్యాతం పద్మిన్యై శిర ఈరితం ।
విష్ణుపత్న్యైశిఖాప్రోక్తా వరదాయై తనుచ్ఛదాం
అస్త్రం కమలరూపాయై నమోఽంతాః ప్రణవాదికాః
అంగమంత్రాః సముద్దిష్టాః ధ్యాయేద్దేవీ మనన్యధీః ।
దశలక్షం జాపేన్మంత్రం మంత్రవిద్విజితేంద్రియః

దశాంశంజుహు యాన్మంత్రీ మధురాక్తైః సరోరుహైః ।
శ్రీపీఠే పూజయేద్దేవీ మంగాని ప్రథమంయజేత్
బలాకాద్యాస్తతః పూజ్యా లోకేశాస్త్రా వృతీఅపి ।
సముద్రాయంసరితి కంఠ మాత్ర జలేస్థితః
త్రిలక్షం ప్రజపేన్మంత్రీ సాక్షాద్ వైశ్రవణో భవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మహాలక్ష్మి దశాక్షరమంత్ర మిట్లుండును.

**మనుః – నమః కమలవాసిన్యై స్వాహా ॥**

ఈ మంత్రమునకు ఋషి దక్షుడు – ఛందస్సు విరాట్ – దేవతాశ్రీ పంచాంగ న్యాసములిట్లుండును.

| | | |
|---|---|---|
| దేవ్యై నమః | – | హృదయే నమః |
| పద్మిన్యై నమః | – | శిరసే స్వాహా । |
| విష్ణుపత్న్యై నమః | – | శిఖాయై వషట్ । |
| వరదాయై నమః | – | కవచాయ హుం |
| కమలరూపాయై నమః | – | అస్త్రాయ ఫట్ |

ఇందు నేత్రత్రయన్యాసము లేదు.

## ధ్యానం

ఆసీనా సరసీరుహే స్మితముఖీ హస్తాంబుజైర్బిభ్రతీ
దానం పద్మయుగా భయేచ వపుషా సౌదామినీ సన్నిభా ।
ముక్తాదామ విరాజమాన పృథులోత్తుంగస్తనోద్భాసినీ
పాయాద్వః కమలా కటాక్ష విభవైరానందయంతీ హరిమ్ ।

నియమనిష్ఠలతో ఈ మంత్రమును పదిలక్షలు జపించి, త్రిమధుర యుక్త కమలములతో పదివేలు హోమం చేయాలి. పీఠాది –

లోకపాలాయుధాంత ఆవరణార్చన సర్వత్రా సమానమే. (బలాక్యాది నవశక్తులనూ పూజించాలి)

నదియందుగాని - సముద్రమునందుగాని, కంఠమువరకు నీళ్లలో నిలబడి మూడులక్షలు జపించిన, కుబేరుడంతటి ధనవంతుడగును.

శ్లో॥ ఆరాధ్యోత్తర నక్షత్రే దేవీం స్రక్ చందనాదిభిః
నంద్యావర్తభవైః పుష్పైః సహస్రంజుహుయాత్తతః ।
పౌర్ణమాస్యాం ఫలైర్బిల్వై ర్జ హుయాన్మధురాప్లుతైః
పంచమ్యాం విశదాంభోజైః శుక్రవారే సుగంధిభిః ।
అన్యైర్వావిశదైః పుష్పైః ప్రతిమాసం విశాల ధీః
సభవేదబ్ద మాత్రేణ సర్వదా సంపదాం నిధిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఉత్తరా నక్షత్రయమందు (ఉత్తఫల్గుని - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర) సుగంధపుష్ప - చందనాదులతో పూజించి లేదా నంద్యావర్తములతో పూజించి వేయి హోమం చేసిన అధిక ధనవంతుడగును.

త్రిమధు మిశ్రిత బిల్వఫలములతో పున్నమియందు హోమమాచరించి ననూ, పంచమీ శుక్రవారంనాడు కమలములతో లేదా ఇతర సువాసన పూలతో హోమం చేసిననూ ఒక సంవత్సర కాలములో సాధకుడు సంపదలకు నిధి యగును.

## ద్వాదశాక్షర మంత్రము

శ్లో॥ వాగ్భవం శంభువనితా రమామకర కేతనః
తార్తీయంచ జగత్ పార్శ్వో వహ్నిబీజసముజ్వలః ।
అర్ధీశాఢ్యో భృగుస్త్యై హ్యాన్మంత్రోఽయం ద్వాదశాక్షరః

మహాలక్ష్మ్యాః సముద్దిష్ట స్తారాద్యః సర్వసిద్ధిదః ।
ఋషిర్బ్రహ్మా సముద్దిష్ట శ్ఛందో గాయత్రమీరితం
దేవతా జగతామాది ర్మహాలక్ష్మీః సమీరితా ।
హస్తౌ సంశోధ్య మంత్రేణ తారాదిర్ హృదయాంతికం
బీజానాం పంచకం న్యస్యేత్ అంగులీషు యథాక్రమమ్ ।
మంత్రశేషం న్యసేన్మంత్రీ తలయోరుభయోరసి
మూర్ధాది చరణంయావ న్మంత్రేణ వ్యాపకం న్యసేత్ ।
మూర్ధాస్య వక్షో గుహ్యాంఘ్రౌ పంచబీజాని విన్యసేత్ ।
మూర్ధాస్య వక్షో గుహ్యాంఘ్రౌ పంచబీజాని విన్యసేత్
శేషాన్న్యసేత్ సప్తవర్ణాన్ హృదయే సప్తధాతుషు ।
అంగానిపంచభిర్బీజైరస్త్రం శిష్టాక్షరైర్భవేత్
జ్ఞానైశ్వర్యాదిభిర్యుక్తైరస్త్రం శిష్టాక్షరైర్భవేత్
జ్ఞానైశ్వర్యాదిభిర్యుక్తైః చతుర్థ్యంతైః సజాతిభిః ।
జ్ఞానమైశ్వర్య శక్తీచ బలవీర్యే సతేజసీ
జ్ఞానైశ్వర్యాదయః ప్రోక్తాః షట్ క్రమాదంగదేవతాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మహాలక్ష్మి ద్వాదశాక్షర మంత్రమిట్లుండును.

**మనుః – ఐం హ్రీం శ్రీం క్లీం హౌస్ః జగత్ ప్రసూత్యై నమః**

ఈ మంత్రమునకు ఋషి – బ్రహ్మ, ఛందస్సు – గాయత్రి, దేవత జగత్కారణభూత మహాలక్ష్మి. ప్రణవమునుండి నమః పర్యంతము ఐం ఇత్యాది పంచబీజములతో పంచాంగుళములందు న్యాసం ఆచరించాలి.

జగత్ ప్రసూత్యైః కరతల, కరపృష్ఠములు 5 బీజాక్షరములతో హృదయాది న్యాసములు, సంపూర్ణ మంత్రములోని 5 బీజములతో మూర్ధా

-వక్షఃస్థలం-గుహ్యం-చరణద్వయమునందు న్యాసం చేయాలి. మిగిలిన **7** అక్షరములతో సప్తధాతువులందు హృదయములో న్యాసమాచరించాలి.

జ్ఞాన - ఐశ్వర్య - శక్తి - బల - వీర్య - తేజస్సులందు, బీజములు చేర్చి షడంగన్యాసం చేయాలి.

ఉదా : ఓం ఐం జ్ఞానాయ నమః - హృదయాయ నమః ।
ఓం హ్రీం ఐశ్వర్యాయ నమః - శిరసే స్వాహా ।
ఓం శ్రీం శక్త్యై నమః - శిఖాయైవషట్ । ఇత్యాది.

## మండప ధ్యానం

చంపకాశోక పున్నాగ పాటలైరుపశోభితం
లవంగమాధవీ బిల్వ దేవదారు నమేరుభిః ।
మందార పారిజాతాద్యైః కల్పవృక్షైః సుపుష్పితైః
చందనైః కర్ణికారైశ్చ మాతులింగైశ్చ వంజులైః ।
దాడిమీ లకుచాంకోలైః పూగైః కురవకైరపి
కదళీకుంద మందార నారికేళైరలంకఋుతమ్ ।
అన్యైః సుగంధి పుష్పాద్యైః వృక్షసంఘైశ్చమండితం
మాలతీ మల్లికాజాతీ కేతకీ శతపత్రకైః ।
పారంతీతులసీ నంద్యావర్తైర్దమనకైరపి
సర్వర్తుకుసుమోపేతై ర్నమది&భ రుపశోభితమ్ ।
మందమారుత సంభిన్న కుసుమామోది దింగ్ముఖం
తస్యమధ్యే సదోత్ఫుల్లైః కుముదోత్పల పంకజైః ।
సౌగంధికైశ్చ కహ్లారైర్నవైః కువలయై రపి
హంససారసకారండ భ్రమరై శ్చక్ర నామభిః ।

అన్యైః కలకలారావైర్విహగైరుప శోభితే
మహాసరసి తన్మధ్యే పులినేఽతిమనోహరే ।
పరితః పారిజాతాఢ్యం **మండపం మణికుట్టితం**
ఉద్యదాదిత్యసంకాశం భాస్వరం శశిశీతలమ్ ।
**చతుర్ద్వార** సమాయుక్తం **హేమప్రాకార** శోభితం
రత్నోపక్లుప్తి తుంగగోపుర తోరణం
హేమదండ సమాలంబి ధ్వజావళి పరిష్కృతమ్ ।
నవరత్న సమాబద్ధ స్తంభరాజి విరాజితం
సహస్రదీప సంయుక్త దీపదండ విరాజితమ్ ।
తప్తహాటక సంక్లప్త వాతాయన మనోహరం
నానావర్ణాం శుకోద్బద్ధ సువర్ణశతకోటిభిః ।
కింకిణీ మాలికాయుక్త పతాకాభిరలంకృతం
జాతరూప మయైరత్న విచిత్రై రతి విస్తృతైః ।
మాణిక్యవజ్ర వైఢూర్య స్వర్ణమాలా వలీయుతైః
అంతరాంతర సంబంద్ధ రత్నైర్ దృష్టి మనోహరైః ।
విచిత్రైశ్చిత్ర వర్ణైశ్చ వితానై రుపశోభితం
సర్వరత్న సమాయుక్తం హేమ కుట్టిమముజ్వలమ్ ।
కౌతకీ మాలతీ జాతీ చంపకోత్పల కేసరైః
మల్లికా తులసీ జాతీ నంద్యావర్త కదంబకైః ।
ఏతైరన్యైశ్చ కుసుమైరలంకృత మహీతలమ్
అంబు కాశ్మీర కస్తూరీ మృగనాభి తమాలకైః ।
చందనాగురు కర్పూరైలంకృత మహీతలమ్
అంబు కాశ్మీర కస్తూరీ మృగనాభి తమాలకైః ।

చందనాగురు కర్పూరై రామోదిత దిగంతరం
**ఏవం సంచింత్యమనసా** మండపం సుమనోహరమ్ ।
తన్మధ్యే భావయేన్మంత్రీ పారిజాత మనోహరం
తస్యాథస్తాత్ స్మరేన్మంత్రీ రత్న సింహాసనం మహత్ ।
తస్మిన్ సంచింత యేద్దేవీం మహాలక్ష్మీం మనోరమామ్

## మహాలక్ష్మీ స్వరూప ధ్యానం

శ్లో॥ బాలార్క ద్యుతి మిందుఖండ విలసత్కోటీ రహారోజ్వలాం
రత్నాకల్ప విభూషితాం కుచనతాం శాలేః కరైర్మంజరీమ్।
పద్మేకౌస్తుభరత్నమప్యవిరతం సంబిభ్రతీం సుస్మితాం
ఫుల్లాంభోజ విలోచనత్రయయుతాం ధ్యాయేత్పరాందేవతామ్॥

2. శింజన్మంజీర సంశోభి పదాంభోజ విరాజితాం
నవరత్న గణాకర్ణ కాంచీదామ విభూషితామ్ ।
ముక్తా మాణిక్య వైఢూర్య సంబద్ధోరబంధనాం
విభ్రాజమానాం మధ్యేన వలిత్రితయ శోభినా ।
జాహ్నవీ సరిదావర్త శోభినాభి విభూషితాం
పాటీర పంక కర్పూర కుంకుమాలంకృతస్తనీమ్ ।
వారివాహ వినిర్ముక్త ముక్తాదామ గరీయసీం
వహంతీముత్తరాసంగ దుకూల పరికల్పితమ్ ।
తప్తకాంచన సంనద్ధ వైఢూర్యాంగద భూషణాం
పద్మరాగస్ఫురత్ స్వర్ణ కంకణాఢ్య కరాంబుజామ్ ।
మాణిక్య శకలాబద్ధ ముద్రికాభిరలంకృతామ్
తప్తహాటక సంక్లప్త మాలాగ్రైవేయ శోభితామ్ ।

విచిత్ర వివిధా కల్ప కంబుసంకాశ కంధరాం
ఉద్యద్దినకరాకార మణితాటంక మండితామ్ ।
రత్నాంకితలసత్ స్వర్ణ కర్ణ పూరోపశోభితాం
జపావిద్రుమలావణ్య లలితా ధరపల్లవామ్ ।
దాడిమీ ఫలబీజాభ దంత పంక్తి విరాజితాం
కలంక కార్శ్య నిర్ముక్త శరచ్చంద్ర నిభాననామ్ ।
పుండరీక దళాకార నయనత్రయ సుందరీం
భ్రూలతాజిత కందర్ప కరకార్ముక విభ్రమామ్ ।
పుండరీక దళాకార నయనత్రయ సుందరీం
భ్రూలతాజిత కందర్ప కరకార్ముక విభ్రమామ్ ।
వికసత్తిలపుష్పశ్రీ విజయోద్యత నాసికాం
లలాటకాంతివిభవ విజితార్ధ సుధాకరామ్ ।
సాంద్ర సౌరభ సంపన్న కస్తూరీ తిలకాంకితాం
మత్తావిమాలా విలసదల కాఢ్యముఖాంబుజామ్ ।
పారిజాత ప్రసూనశ్రీ వాహి ధమ్మిల్ల బంధనాం
అనర్ఘ్యరత్న ఘటితమలకుటాంకిత మస్తకామ్ ।
సర్వలావణ్య వసతిం భవనం విభ్రమశ్రియః
తేజసాం జన్మభూమింతాం మహాలక్ష్మీంమనోహరామ్ ।

## పురశ్చరణము

శ్లో॥ ఏవం సంచింతయన్ దేవీం హవిష్యాశీ జితేంద్రియః
భానులక్షం జపేన్మంత్రం దశాంశంజుహుయాద్ ఘృతైః ।
జుహుయాచ్ఛ్రీఫలైః శుద్ధైః సుగంధైరయుతద్వయమ్ ।

శ్రీబీజస్యోదితే పీఠే మహాలక్ష్మీం ప్రపూజయేత్
శ్రీబీజేనాసనం దద్యా న్మూర్తిం మూలేన కల్పయేత్ ।
పూజయేద్దక్షిణే పార్శ్వే దేవ్యాః శంకరనందనం
అన్యతః పుష్పధన్వానం పుష్పాంజలి కరంయజేత్ ।
అంగాని పూర్వముక్తేషు స్థానేషు విధివత్ యజేత్
ఉమాద్యాః పుత్రమధ్యస్థాః శక్తీరష్టౌ యజేత్ క్రమాత్ ।
అథోమా శ్రీసరస్వత్యౌ దుర్గా ధరణిసంయుతా
గాయత్రీ దేవ్యుషా చైవ పద్మహస్తాః సుభూషణాః

**సంపత్కుమార్ తెలుగు వ్యాఖ్యానం** - నియమనిష్ఠలతో సాధకుడు 12 లక్షలు మంత్రజపం చేసి, నేతితో 12వేలు హోమం చేయాలి. మరల బిల్వఫలములు, కమలములతో ప్రత్యేకం పదివేలు హోమమాచరించాలి. సుగంధజలముతో 20 వేలు తర్పణం చేయాలి. పీఠపూజాదులు యదావిధిగా నిర్వహించాలి.

మహాలక్ష్మికి కుడిప్రక్క గణపతిని, ఎడమప్రక్క మన్మథుని అర్చించాలి. అష్టపత్రముల మధ్యయందు ఉమాది అష్టశక్తులను అర్చించాలి. 1. ఉమ 2. శ్రీ 3. సరస్వతి 4. దుర్గా 5. ధరణి 6. గాయత్రి 7. దేవి 8. ఉషా వీరంతా కమలధారిణులు, సువర్ణాలంకారములుగా నుందురు.

శ్లో జహ్నుసూర్యసుతే పూజ్యే పాదప్రక్షాలనోద్యతే
శంఖపద్మనిధీ పూజ్యౌ పార్శ్వయోర్ధృత చామరౌ ।
ధృతాతపత్రం వరుణం పూజయేత్ పశ్చిమేతతః
సంపూజ్యరాశీన్ పరితో యజేదథ నవగ్రహాన్ ।
పూజయేద్దిగ్గజాన్ దిక్షు చతుర్దంతవిభూషితాన్
ఐరావతః పుండరీకో వామనః కుముదోంఽజనః ।

పుష్పదంతః సార్వభౌమః సుప్రతీకశ్చ తేక్రమాత్
అభ్యర్చయేదథేంద్రాదీన్ తదస్త్రాణ్యపి తద్బహిః ।
ఆగమోక్తేనవిధినా సుగంధైః సుమనోహరాః
పూజయేత్ గంధపుష్పాద్యైః దేవీమన్వహమాదరాత్ ।
దూర్వాభిరాజ్యసిక్తా భిర్జుహుయాదా యుషేనరః
దశరాత్రం సిమిద్దేగ్నావష్టోత్తర సహస్రకమ్ ।
గుడూచీరాజ్య సంసిక్తా జుహుయాత్ సప్తవాసరం
అష్టోత్తర సహస్రం యః సజీవేత్ శరదాం శతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మహాలక్ష్మికి పాదప్రక్షాళన చేయు గంగా - యమునలను అర్చించాలి. పిమ్మట చామరధారిణులైన శంఖనిధి - పద్మనిధులను, దేవి పశ్చిమభాగమున ఛత్రము ధరించిన వరుణుని అర్చించాలి.

నాలుగు ప్రక్కలా మేషాదిరాశులను, నవగ్రహములను అర్చించాలి. ఎనిమిది దిశలందు నాలుగేసి దంతములు కల 8 దిగ్గజములను 1. ఐరావతం 2. పుండరీకం 3. వామనం 4. కుముదం 5. అంజనం 6. పుష్పదంతం 7. సుప్రతీకం 8. సార్వభౌమం అనేపేర్లు గల వాటిని పూజించాలి.

తరువాత ఇంద్రాదిలోకపాలురను, వారి వారి వజ్రాది ఆయుధములను యంత్రము యొక్కబయట అర్చించాలి.

గంధపుష్పములతో భక్తితో పూజించాలి. 1008 ఆజ్యసహిత దూర్వలను హోమంచేసిన ఆయుర్వృద్ధి కలుగును. ఈ విధముగా తిప్పతీగతో 1008 సార్లు 7 రోజులు హోమం చేసిన అపమృత్యువు తొలగి చిరకాలము జీవించును.

శ్లో॥ హుత్వాతిలాన్ ఘృతాభ్యక్తాన్ దీర్ఘమాయురవాప్నుయాత్
ఆరభ్యాఽర్కదినం మంత్రీ దశరాత్రం దినేదినే ।
ఆజ్యాక్తార్క సమిద్ధోమాదారోగ్యం లభతే ధ్రువం
కంఠ మాత్రోదకే స్థిత్వా ధ్యాత్వా దేవీం దివాకరే ।
ఊర్ధ్వబాహుర్దశశత మష్టోత్తరమిమం జపేత్
ఆరోగ్యంలభతే సద్యో వాంఛితాన్యపి మంత్రవిత్ ।
శాలిభిర్ జుహ్వాతో నిత్యమష్టోత్తర సహస్రకం
అచిరాదేవమహతీ లక్ష్మీః సంజాయతే ధ్రువమ్ ।
ప్రసూనైర్జుహు యాన్మంత్రీ లక్ష్మీవల్లీ సముద్భవైః
నంద్యావర్త సముత్థైర్వా సిద్ధార్థైశ్చ ఘృతాప్లుతైః ।
మహతీంశ్రియమాప్నోతి మాన్యతే సర్వజంతుభిః
మరీచ జీరకోన్మిశ్రైః నారికేళ రజోయుతైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఘృతమిశ్రిత తిలలతో 1008 సార్లు 7 రోజులు హోమం చేసిననూ దీర్ఘాయువు కలుగును. ఆదివారము నుండి ఘృతసహిత జిల్లేడు సమిధలతో 10రోజులు 1008 సార్లు హోమ మాచరించిన రోగములు నశించి ఆరోగ్యము కలుగును.

జలమునందు కంఠపర్యంతము నిలబడి, సూర్యబింబమునందు, మహాలక్ష్మిని ధ్యానించుచూ, బాహువులు పైకెత్తి నమస్కరించుచూ, 1008 సార్లు మంత్రజపం చేసిన ఆరోగ్యము కలుగును. మరియు అభీష్టము కూడా సిద్ధించును.

ప్రతీరోజూ ధాన్యపు కంకులను 1008సార్లు 7 రోజులు హోమం చేసిన ధనధాన్యసిద్ధి కలుగును.

లక్ష్మీలత పూలతోగాని, నందావర్త పుష్పములు లేదా తెల్లావాలు నేతితో కలిపి హోమం ఆచరించిన గొప్పధనవంతుడగును. జగద్ వశ్యము సిద్ధించును. మిరియాలు - జీలకర్ర కలిపి నారికేళ రజముతో ప్రతిదినమూ 108 ఆహుతులిచ్చిన సంపద వృద్ధి చెందును.

శ్లో॥ సగుడై రాజ్యసంపక్త్యై రపూపై రాజ్యలోలితైః
జుహుయాత్పాయసాహారో మంత్రవిద్విజితేంద్రియః ।
అష్టోత్తరశతం నిత్యం మండలాద్ధనదో భవేత్
హవిషాగుడ మిశ్రేణ జుహుయా దన్నవాన్ భవేత్ ।
జపాపుష్పాణి జుహుయా దష్టోత్తర సహస్రకం
గృహీత్వా ప్రజపేద్భస్మ నాగవల్లీ రసాన్వితమ్ ।
తిలకం తనుయాత్తేన సర్వవశ్యకరం భవేత్
బ్రహ్మవృక్ష సమిత్ పుష్పైర్బ్రాహ్మణాన్ వశయేద్వశీ ।
జాతీపుష్పైశ్చరాజానం వైశ్యాన్ రక్తోత్పలైస్సుధీః
శూద్రా న్నీలోత్పలైర్హుత్వా వశయేన్మంత్ర విత్తమః ।
పుష్పైర్మధూకజైర్హుత్వా వశమానయతిస్త్రియః
కృత్వానవపదాత్మానం మండలం యంత్ర భూషితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నేతితో వండిన అప్పాలు, ఘృతసహితముగా రోజూ 108 సార్లు హోమంచేసిన గొప్ప ధనవంతు డగును. సాధకుడు పాయసాన్నము తినుచూ నియమనిష్ఠలతో వీటిని ఆచరించాలి. ఘృతసహిత గుడమును హోమం చేసిన అన్నవృద్ధి కలుగును.

జపాపుష్పములతో (మందారపూవులు) 1008 సార్లు హోమంచేసి, ఆ భస్మమును తమలపాకు రసముతో కలిపి, తిలక ధారణచేసినచో జగద్ వశ్యము సిద్ధించును. అధికారులు అనుకూలురగుదురు. మోదుగ సమిధలు, మోదుగపూలు హోమం చేసిన బ్రాహ్మణులు, ఉన్నతులు వశమగుదురు.

జాజిపూలతో హోమం చేసిన రాజవశ్యమగును. ఎర్రకమలములతో హోమం వలన వైశ్యులు, నీలికలువలతో హోమం వలన శూద్రులు వశులగుదరు. ఇప్పపూలతో హోమం చేసిన స్త్రీలు వశమగుదురు. నవ పదాత్మక మండలము నిర్మించి అందు యంత్రమునుంచి దానినభిషకించాలి.

శ్లో॥ అభిషేకం ప్రకుర్వీత విధినా సర్వ సిద్ధయే
కలశాన్ స్థాపయేత్తేషు పదేషు శుభలక్షణాన్ ।
చందనాలిప్త సర్వాంగాన్ దూర్వాక్షతసమన్వితాన్
దుకూల వేష్టితానేతాన్ పూరయేత్తీర్థ వారిణా ।
నవరత్న సమాబద్ధం కర్షకాంచన కల్పితం
మధ్యకుంభేక్షిపేత్ పద్మం యంత్రాఢ్యం దేశికోత్తమః
చందనోశీరకర్పూర జాతీకంకోల కుంకుమం
కుష్ఠాగురు తమాలై లాయుషం సంపిష్య భాగతః ।
విలోడ్య సర్వకుంభేషు రత్న్యాపి వినిక్షిపేత్
లక్ష్మీర్ దూర్వాసదాభద్రా సహదేవీ మధువ్రతా ।
ముశలీ శక్రవల్లీ చ క్రాంతాపామార్గ పత్రకాన్
ప్రియంగుముద్గ గోధూమ వ్రీహీంశ్చ సతిలాన్ యవాన్ ।
శాలితండుల మాషాంశ్చ ప్రక్షాల్యైతేషు నిక్షిపేత్
ధాత్రీలకుచబిల్వానాం కదళీ నారికేళయోః
పద్మం సౌగంధికం జాతిం మల్లికాంబకులంతథా ।
చంపకాశోక పున్నాగ తులసీకేత కోద్భవం
పల్లవాని వటాశత్థ ప్లక్షోడుంబర శాఖినామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అభిషేకానంతరం నవ పదములందు "కలశస్థాపన" వివరించుచున్నాడు. కలశమునందు

దూర్వాక్షతలుంచి, దానికి చందన గంధము పూయాలి. మరియు తీర్థ జలముపోసి, వస్త్రముచుట్టి నవరత్నములు, కర్షమాత్రము (160 రత్తీలు) బంగారు నాణెముంచాలి.

కుంభమందు యంత్రరూప పద్మమునుంచి, అందు చందనం - వట్టివేళ్ళు - కర్పూరము - జాజి - కంకోలము - కుంకుమ - కుష్ఠము - అగురు - తమాలము - ఏలకులు సమభాగములుగా గ్రహించి చూర్ణము చేసినది అందుంచాలి.

ఆ చూర్ణమును కుంభజలములో బాగుగా కలిపి అన్ని 9 కుంభము లందూ నవరత్నములుంచాలి. పిమ్మట లక్ష్మి - దూర్వ - ముస్త - సహదేవి - గుంటగలగర - ముసలీకంద - శుక్రవల్లి (ఇంద్రవారుణి) విష్ణుక్రాంత - అపామార్గ పత్రములు - ప్రియంకము, పెసలు, గోధుమలు - ధాన్యము - తిలలు - మినుములు - బియ్యము - బాగుగా శుభ్రంచేసి అన్ని కుంభములందూ వేయాలి.

పిమ్మట ఉసిరి - లకుచం (నిమ్మ) మారేడు - అరటిపండు - కొబ్బరిముక్కలు వేయాలి. కమలం - జాజి - మల్లి - వకుళ - సంపెంగ - అశోక - పున్నాగ - తులసీ - మొగలి పుష్పములు కూడా ఆ 9 కుంభములందు వేయాలి.

మరియు మఱ్రి - రావి - మేడి - ప్లక్ష (      ) చిగుళ్ళు కూడా వేయాలి.

శ్లో॥ బ్రహ్మకూర్చం వినిక్షిప్య చషకైః సఫలాక్షతైః
పిధాయ కుంభవక్త్రాణి క్షౌమైరాచ్ఛాదయేత్తతః ।
ఆవాహ్య మధ్యకలశే మహాలక్ష్మీం ప్రపూజయేత్
యజేదుమాదాయః శిష్టేషు కలశేష్వష్టసు క్రమాత్ ।

గంధైర్మనోహరైః పుష్పై ర్ధూపదీప సమన్వితైః
నివేద్య భక్ష్య భోజ్యాని తాన్ స్పృష్ట్వా ప్రజపేన్మనుమ్ ।
త్రిసహస్రం జపస్యాంతే సాధ్యమానీయ సంయతం
సంస్థాప్యస్థండిలేపీఠం తస్మింస్తం వినివేశయేత్ ।
రమ్యైరాభరణైర్వస్త్రైరలంకృత్య తమాదరాత్
సుమంగాళిభిర్నారీభిః క్షిప్త పుష్పాక్షతాన్వితామ్ ।
అర్చితానాం ద్విజాతీ నామాశీర్వాద పురః సరం
నదత్సు పంచవాద్యేషు ముహూర్తే శోభనే సుధీః ।
మధ్యస్థం కుంభముద్ధృత్య మహాలక్ష్మీమనుంస్మరన్
లభిషించేత్ క్రమాదన్యైః కలశైరపి దేశికః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఆ కలశములందు కూర్చను, దర్భలనుంచి, సంపెంగ పుష్పాక్షతలనుంచి, పట్టువస్త్రముతో ఆచ్ఛాదన చేయాలి. పిమ్మట మధ్య కలశమునందు మహాలక్ష్మిని ఆవాహనంచేసి పూజించాలి. మిగిలిన 8 కుంభములందూ ఉమాది 8 శక్తులను పూజించాలి. వాటికి పంచోపచారములు ఆచరించాలి.

వివిధరకముల భక్ష్యభోజనములు నైవేద్యం పెట్టాలి. అన్ని కలశములను కుశలతో తాకుచూ 3 వేలు మహాలక్ష్మి మంత్రము జపించాలి. పిమ్మట శిష్యుని, లేదా యజమానిని ఆ సమీపమున కూర్చుండబెట్టి అతనిని వస్త్రాలంకారములతో అలంకరించి, సౌభాగ్యవంతులైన స్త్రీలచే ఆశీర్వదింప చేయాలి.

పంచవాద్యములు ఘోషించుచుండగా బ్రాహ్మణాశీర్వాదములు పొందాలి. పిమ్మట మధ్యకుంభములోని జలముతో మహాలక్ష్మిని స్మరించుచూ శిష్యుని అభిషేకించాలి. ఇలా మిగిలిన కలశములలోని జలమును కూడా గ్రహించి అభిషేకించాలి.

శ్లో॥ కరేణాఽస్యశిరః స్పృష్ట్యా ప్రయుంజీతా శిషంగురుః
భద్రమస్తు శివంచాస్తు మహాలక్ష్మీః ప్రసీదతు ।
రక్షంతుత్వాం సదాదేవాః సంపదః సంతు సర్వదా
అథోత్థాయాఽభిషిక్తఃసన్ వాససీ పరిధాయచ ।
యథావిధి సమాచమ్య దండవత్ ప్రణమేత్ గురుం
వస్త్రైరాభరణై ర్ధాన్యై ర్గంధై ర్గోమ హిషాదిభిః ।
దాసీదాసైశ్చ విధివత్తోషయేద్దేవతా ధియా
బ్రాహ్మణాన్ భోజయేత్ పశ్చాద్దీనాంధకృపణైస్సహ ।
మహాంతముత్సవం కుర్యాద్భవనే బంధు భిస్సహ
తదా కృతార్థ మాత్మానం మన్యతే మనుజోత్తమః ।
అభిషిక్తో నరపతిః పరాన్ విజయతేఽచిరాత్
పట్టేచ్ఛుః పట్టమాప్నోతి రాజపుత్రోన సంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – గురువు తన చేతితో శిష్యుని శిరము స్పృశించి, ఆశీర్వదించాలి. నూతన వస్త్రములు సమర్పించాలి. మరల ఆచమనం చేసిన శిష్యుడు, గురువునకు సాష్టాంగ ప్రణామం ఆచరించాలి.

గురుదక్షిణగా వస్త్ర – భూషణ – ధన – ధాన్య – గౌమహిషీ – దాసదాసీ జనమును సమర్పించాలి. పిమ్మట బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. దీన – దరిద్ర – అంధులకు కూడా అన్న సంతర్పణ చేయాలి. ఈ విధముగా నిర్వహించిన అభిషేకము వలన శతృజయమగును. అధికారము కోరువారు పదవిని, ముద్రాధికారము పొందెదరు.

శ్లో॥ అభిషిక్తా సతీవంధ్యా సూతేపుత్రం మహామతిం
మహారోగేషు జాతేషు కృత్యాద్రోహేషు దేశికః ।

భూతేషు దుర్నిమిత్తాదౌ విదధ్యాదభిషేచనం
సర్వసంపత్కరం పుంసాం సర్వసౌభాగ్య సిద్ధిదమ్ ।
సర్వసంపత్కరం పుంసాం సర్వసౌభాగ్య సిద్ధిదమ్ ।
సర్వరోగప్రశమనం సర్వాపద్వినివారకం
గర్భరక్షాకరం స్త్రీణాం దీర్ఘాయుర్జనకంపరమ్ ।
ప్రసూతానామపి స్త్రీణాం సూతికాగార రక్షకం
ప్రణష్టపుష్ప గర్భాణాం పుష్పగర్భాభిరక్షణమ్ ।
ఆసన్న శతృభీతానాం నాశనంచ మహీభృతాం
అభిషేకమిమం ప్రాహు రాగమార్థ విశారదాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - గౌద్రాలు ఈ విధముగా అభిషేకించబడినచో బుద్ధిమంతుడై పుత్రుని కనును. మహారోగములు ఏర్పడినపుడు, అభిచారప్రయోగములు జరిగినపుడు, అపశకునము, దుర్నిమిత్తములు కనబడినపుడు, దీనినాచరించిన సర్వాపదలు తొలగిపోవును.

స్త్రీలకు గర్భరక్ష కలిగించును. బాలింతకు క్షేమము గలుగును. మృతవత్సకు, గర్భస్రావములు జరుగుచున్నపుడు దీనినాచరించిన సత్సంతానము కలుగును. శతృభయము కలిగినపుడు దానినాచరించిన, శతృనాశనము జరుగునని సకలాగమవేత్తలు ఉపదేశించుచున్నారు.

## లక్ష్మీయంత్రము

శ్లో॥ వేదాది స్థిత సాధ్యనామ యుగశః శ్రీశక్తిమారాన్వితం
కింజల్కేషు దినేశపత్ర విలసన్మంత్రాక్షరం తద్బహిః ।
పద్మంవ్యంజన కేసరం స్వరలసత్పత్రాష్టయుగ్మం ధరా

బింబాభ్యాం వషడంతయా త్వరితయాయంత్రం లిఖేత్ వేష్టితమ్॥
భూపురద్వయకోణేషు హక్షౌ లేఖ్యౌ పునః పునః
మహాలక్ష్మీ యంత్రమిదం సర్వైశ్వర్యఫలప్రదమ్ ॥
సర్వదుఃఖప్రశమనం సర్వాపద్వినివారణం
బహునాకిమిహోక్తేన పరమస్మాన్నవిద్యతే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మహాలక్ష్మీ యంత్ర విధానము చెప్పబడుచున్నది. ముందుగా వృత్తము లిఖించి అందు సాధ్యనామము, కామ్య కర్మ లిఖించాలి. పిమ్మట దానిపై కేసరస్థానములందు శ్రీం - క్లీం శ్రీం - హ్రీం క్లీం - శ్రీం హ్రీం, క్షం - శ్రీం క్లీం - క్లీం హ్రీం - హ్రీం శ్రీం లిఖించాలి. దానిబయట 12 పద్మదళములందు మంత్రాక్షరములు లిఖించాలి.

దానిబయట కేసరములందు రెండేసి హల్లులు, కకారాదిగా లిఖించాలి. మరల దానిపై షోడశ పద్మదళములందు 16 అచ్చులు లిఖించాలి. దానిని త్వరితామంత్రముతో వస్త్రస్టనంచేసి, భూపురవేష్టితం చేయాలి. భూపురమునకు ప్రతీకోణమునందు "హ-క్ష" అక్షరద్వయము లిఖించాలి.

ఈ మహాలక్ష్మీయంత్రము సకల సంపదలనిచ్చును. దుఃఖములను పోగొట్టును. ఆపదలను దూరము చేయును.

## 27 అక్షరముల లక్ష్మీ మంత్రము

శ్లో॥ శంభుపత్నీ శ్రియారుద్ధా కమౌభగవతీ మహీ
బ్రహ్మాదిత్యౌ ధరాదీర్ఘా లః క్షాది ర్భగవాన్ మరుత్ ।
ప్రసీదయుగళం భూయః శ్రీరుద్ధా భువనేశ్వరీ

మహాలక్ష్మి నమో௨ంతః స్యాత్ ప్రణవాదిరయంమనుః ।
సప్త వింశత్యక్షరాఢ్యః ప్రోక్తః సర్వసమృద్ధిదపి
కమలే హృదయంప్రోక్తం శిరఃస్యాత్ కమలాలయే ।
శిఖాప్రసీదతేనైవ కవచం చతురక్షరైః
అస్త్రమేతైః పదైః కుర్యాత్ త్రిబీజపుటితైః పృథక్ ।
లక్షం జపేత్ ఫలైర్ బిల్వైర్ జుహుయాన్మధురోక్షితైః
దశాంశం సంస్కృతే వహ్నౌ ప్రాక్ప్రోక్తేనైవ వర్త్మనా ।
శ్రీబీజోక్తే యజేత్ పీఠే వక్ష్యమాణక్రమే తాం
అంగావృత్తేర్బహిః పూజ్యామూర్తయః శ్రీధరాదయః ।
శ్రీధరాఖ్యం హృషీకేశం వైకుంఠం విశ్వరూపకం
వాసుదేవం సంకర్షణం ప్రద్యుమ్న మనిరుద్ధకమ్ ।
దళమూలేషు సంపూజ్య పత్రమధ్యేషు సంయజేత్
భారతీం పార్వతీం చాంద్రీం శచీం చ దమకాదికాన్ ।
దళాగ్రేష్వర్చయేద్బాణాన్ మహాలక్ష్మ్యాః క్రమాదమూన్
అనురాగం చ సంవాదం విజయం వల్లభమదమ్ ।
హర్షం బలం చతేజంచ లోకనాథాన నంతరమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మహాలక్ష్మియొుక్క "సప్తవింశత్యక్షర" మంత్రము వివరింపబడుచున్నది.

**మనుః - ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం హ్రీం శ్రీం మహాలక్ష్మై నమః ।**

శ్రీం హ్రీం శ్రీం బీజములతో ప్రత్యేముగా కమలే - కమలాలయే - ప్రసీద ప్రసీద మహాలక్ష్మ్యై పదములు సంపుటితము చేసి హృదయ - శిర - శిఖా - కవచ - అస్త్ర న్యాసములు చేయాలి.

ఉదా : శ్రీంహ్రీంశ్రీం కమలే శ్రీంహ్రీంశ్రీం హృదయాయ నమః

## ధ్యానశ్లోకం

సింధూరారుణ కాంతిమబ్జవసతిం సౌందర్యవారాంనిధిం
కోటీరాంగద హారకుండలకటీ సూత్రాదిభిర్ భూషితామ్ ।
హస్తాబ్జైర్వసుపత్ర మబ్జయుగలాదర్శౌ వహంతీం పరాం
ఆవీతాం పరిచారికాభిరనిశం ధ్యాయేత్ ప్రియాంశార్ఙ్గిణః

పై మంత్రము లక్ష జపించి, త్రిమధుర సిక్త బిల్వఫలములతో హోమం చేయాలి. అంగపూజచేతి శ్రీధరాదులను అర్చించాలి. **1.** శ్రీధర **2.** హృషీకేశ **3.** వైకుంఠ **4.** విశ్వరూపక **5.** వాసుదేవ **6.** సంకర్షణ **7.** ప్రద్యుమ్న **8.** అనిరుద్ధులు.

పత్ర మధ్యభాగమందు భారతి – పార్వతి – చాంద్రీ – శఛీలను పూజించి, నాలుగు కోణములందు దమక మొద॥ దిగ్గజములను అర్చించాలి. దళాగ్రములందు మహాలక్ష్మి **8** బాణములను అర్చించాలి. **1.** అనురాగ **2.** సంవాద **3.** విజయ **4.** వల్లభ **5.** మద **6.** హర్ష **7.** బల **8.** తేజ పిమ్మట లోకపాలకులను, వారి ఆయుధములను పూజించాలి. ఈ విధముగా అర్చించిన సాధకుని ఇంట మహాలక్ష్మి స్థిరనివాసము చేయును.

శ్లో॥ ఉత్పలైర్జుహుయాల్లక్షం చందనాం భసి లోలితైః
శత్రూణాంలభతే రాజ్యం వినాయుద్ధేన పార్థివః ।
జపన్ రాజసభాంగచ్ఛేత్ సంభావ్యేత తయానరః
దూర్వాదేవీ మహాలక్ష్మి ర్విష్ణుక్రాంతా మధువ్రతా ।
ముశలీ శుక్రవల్లీచ సదాభద్రాఽఽంజలిప్రియా
హరిచందన కర్పూర చందనాంకోల రోచనాః ।
మాలూరకేసరౌ కుష్ఠం సర్వంపిష్ట్వా నిశారసైః

అష్టోత్తర సహస్రంతు జపిత్వా తిలకక్రియామ్ ।
కుర్వతో మంత్రిణః సర్వే వశే తిష్ఠత్యహర్నిశం
శ్రియో మంత్రంభజేన్మంత్రీ శ్రీసూక్తాన్యపి సంజపేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చందనగంధ జలముతో డిపిన ఉత్పలములు ఒక లక్ష హోమం చేసిన, యుద్ధరహితముగానే శత్రు రాజ్యము వశమగును. (స్వల్ప ప్రయత్నము చేతనే అధిక లాభము కలుగును) అధికారము ప్రాప్తించును. ఈ మంత్రజపము చేయుచూ సభయందు ప్రవేశించిన, సత్కారము పొందును.

దూర్వా - సహదేవి - మహాలక్ష్మి (?) - విష్ణుక్రాంత - మధుమ్రతా (గుంటగలగర) ముసలి - ఇంద్రవారుణి - ముస్త - అంజలి ప్రియా - హరిచందనం - కర్పూరం - చందనం - అంకోలం (ఊడుగ) గోరోచనం - బల్వం - నాగకేశరం - కుష్ఠం అన్నీ సమభాగములుగా గ్రహించి పసుపుతో నూరి 108 జపించి తిలకంగా ధరించిన సర్వమూ అనుకూల ముగా నుండును. సాధకుడు శ్రీసూక్తమును కూడా జపించవచ్చును. అధిక ఫలము సిద్ధించును.

## మహాలక్ష్మీ ఉపాసక నియమములు

శ్లో॥ భూయసీం శ్రియమాకాంక్షన్ సత్యవాదీ భవేత్సదా
ప్రత్యగా శాముఖోఽశ్నీయాత్ స్మితపూర్వం ప్రియంవదేత్।
భూషయేద్ గంధపుష్పాద్యై ర్వా త్మానం నియతః శుచిః
శయీత శుద్ధశయ్యాయాం తరుణ్యా సహనాన్యయా ।
నగ్నో నాఽవతరేదంభస్తై లాభ్యక్తో న భక్షయేత్
హరిద్రాం న ముఖే లిప్యే న్నస్వపే దశుచిః క్వచిత్ ।

న వృధా విలిఖేద్భూమిం న బిల్వద్రోణ మంబుజం
ధారయేన్మూర్ధ్ని నైవాఽద్యాత్ లోణంతైలం చ కేవలమ్ ।
మలినో నభవేజ్జాతు కుత్సితాన్నం న భక్షయేత్
ద్రోణపంకజ బిల్వాని పద్భ్యాం జాతునలంఘయేత్ ।
సహదేవీ మింద్రవల్లీ శ్రీవల్లీం విష్ణువల్లభాం
కన్యాంజంబుం ప్రవాలం చ ధారయేన్మూర్ధ్ని సర్వదా ।
ఇత్యాచారపరో నిత్యం విష్ణుభక్తో దృఢవ్రతః
శ్రియమాప్నోతి మహతీం దేవానామపి దుర్లభామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మహాలక్ష్మీ ఉపాసకులు ఈ నియమములు పాటించాలి. ఎల్లప్పుడూ పశ్చిమముఖముగానే భోజనం చేయాలి. నవ్వుతూ మాట్లాడాలి. గంధపుష్పాదులను, సుగంధ ద్రవ్యములను ధరించాలి.

శుభ్రమైన శయ్యపై శయనించాలి. వయస్సు అధికము గల స్త్రీలతో సంగమించరాదు. నగ్నముగా స్నానము చేయరాదు. నువ్వులు కలసిన ఏ పదార్థములనూ తినరాదు. పసుపు ముఖమునకు పూసుకొనరాదు. అపవిత్రముగా నిదురించరాదు.

వృధాగా భూమిపై గీకరాదు. బిల్వం, ద్రోణం (తుమ్మి) కమలము శిరస్సుపై ధరించరాదు. కేవలం లవణము, కేవలం నూనె సేవించరాదు. చద్దన్నం తినరాదు. ఎప్పుడూ మలినముగా నుండరాదు. బిల్వం - ద్రోణం - కమలములను కాలితో తాకరాదు.

సహదేవి - ఇంద్రవారుణి - శ్రీలత - విష్ణుక్రాంత - కలబంద - పగడం శిరస్సుపై ధరించవచ్చు. ఈవిధమైన ఆచారములు పాటించు, ఉపాసకుడు, విష్ణుభక్తి కలిగినవాడై, అఖండైశ్వర్యమును పొందును.

"నారాయణీయము"నందు పంచమియందు ఉత్తరానక్షత్రమునాడు స్త్రీ సంగమం చేయరాదని ఇట్లు నిషేధించినది.

☞ **పంచమ్యాముత్తరే చ్చస్త్రీ వర్జ్యా, ప్రత్యంగ్ముఖోఽ శనే**
**బిల్వై ర్నమార్జయేత్ దంతాన్, త్రిసంధ్యం ప్రణమేచ్చతాన్ ।**
**పాయసంబిల్వబిజంచ భక్షయేచ్ఛుక్ల పర్వణి ॥**

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*అష్టమః పటలః సమాప్తః*

❖❖❖

# అథ నవమః పటలః

## అథ భువనేశ్వరీ ప్రకరణమ్

శ్లో॥ అథవక్ష్యే జగద్ధాత్రీ మధునా భువనేశ్వరీం
బ్రహ్మాదయోఽపి యాంజ్ఞాత్వా లేభిరే శ్రియమూర్జితమ్ ।
నకులీశోఽగ్నిమారూఢో వామనేత్రార్థ చంద్రవాన్
బీజంతస్యా యధాఖ్యాతం సేవితం సిద్ధికాంక్షిభిః ।
ఋషింశక్తిర్భవేచ్ఛందో గాయత్రీదేవతా మనోః
కథితాస్వర సంఘేన సేవితాభునేశ్వరీ ।
షడ్దీర్ఘయుక్త బీజేన కుర్యాదంగాని షట్క్రమాత్
సంహారసృష్టిమార్గేణ మాతృకాన్యస్త విగ్రహః ।
సద్యాదిహ్రస్వబీజాద్యాన్యస్తవ్యాః భూతసప్రభాః
అంగానివిన్యసేత్ పంచాబ్జాతియుక్తాని షట్క్రమాత్ ।
మంత్రన్యాసం తతః కుర్యాత్ దేవతాభావసిద్ధయే
హృల్లేఖామూర్ధ్ని వదనే గగనాం హృదయాంబుజే ।

**రక్తాం కరాళికాంగుహ్యే మహోచ్ఛుష్మాం పదద్వయే**
**ఊర్ధ్వప్రాగ్దక్షిణోదీచ్య పశ్చిమేషు ముఖేషు చ ।**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు భువనేశ్వరీ మంత్రము చెప్పబడుచున్నది. ఇది మూడక్షరములు. దీనికి మంత్ర శాస్త్రమునందు 4 భేదములున్నవి. 1. వాక్పుటితము 2. వాక్ శ్రీపుటితము 3. శ్రీకామపుటితము 4. కామశ్రీపుటితము. ముఖ్యముగా ఇది ఏకాక్షర బీజము.

**మనుః - హ్రీం ॥**

ఋషి - వశిష్ఠపుత్రుడు శక్తి, ఛందస్సు - గాయత్రి, ఈం శక్తిః, హంబీజం, భువనేశ్వరీదేవతా ।

హ్రాం - హ్రీం - హ్రూం - హ్రైం - హ్రౌం - హ్రః అను బీజముతో షడంగన్యాసము ముందుగా సాధకుడు సంహార - సృష్టిమార్గములలో మాతృకాన్యాసం చేయాలి. మంత్రదేవతా న్యాసం ఇలా ఆచరించాలి.

హృల్లేఖాయై నమః - మూర్ధ్ని ।
గగనాయై నమః - వదనే ।
రక్తాయై నమః - హృదయే ।
కరాలికాయై నమః - గుహ్యే ।
మహోచ్ఛుష్మాయై నమః - పదద్వయే ।

పిమ్మట నాలుగుదిశలా, పైన, పంచహ్రస్వములతో (ఓం ఎం - ఉం ఇం - అం) మూలబీజమును హ్రం - హ్రుం - హ్రిం - హ్రః అని న్యాసం చేయాలి.

ఇచట "గూఢార్థ దీపికా" వ్యాఖ్యానకారుడు పంచహ్రస్వములను ఓ - ఎ - ౠ - ఋ - ఉ గా వివరించినాడు. కానీ అది తప్పు. నపుంసక

వ్యతిరిక్తములైనవాటినే గ్రహించాలి. ఇందు ఋ – ౠ లు నపుంసకములు. కొందరు కేవలం స్వరమాత్రమే బీజమంటారు. అదియునూ సరికాదు. "దశపటలి" యందిట్లున్నది.

☞ **సద్యోష్ఠ శృతినేత్రాద్యైర్విద్యాం సంభేద్య మంత్రవిత్।**
**హృల్లేఖాదీన్ ప్రవిన్యసేత్।**

## యోని న్యాసము

శ్లో॥ బ్రహ్మాణం విన్యసేద్ భాలే గాయత్ర్యా సహ సంయుతం
సావిత్ర్యా సంయుతం విష్ణుం కపోలే దక్షిణే న్యసేత్।
వాగీశ్వర్యాసమాయుక్తం వామగండే మహేశ్వరం
శ్రియాధనపతిం న్యస్యేద్ వామకర్ణాగ్రకే పునః।
రత్యాస్మరం ముఖేన్యస్య పుష్ట్యా గణపతిం న్యసేత్
సవ్యకర్ణోపరి నిధీ కర్ణ గండాంతరాలయోః।
న్యస్తవ్యౌ వదనే మూలం భూయశ్చై తాంస్తనౌన్యసేత్
కంఠమూలే స్తనద్వంద్వే వామాంసే హృదయాంబుజే।
సవ్యాంసే పార్శ్వ యుగళే నాభిదేశే చదేశికః
భాలాంస పార్శ్వజఠరే పార్శ్వాంసాపరకే హృది।
బ్రహ్మాణాద్యాస్తతోన్యస్యా విధినా ప్రోక్త లక్షణాః
మూలేన వ్యాపకందేహే న్యస్య దేవీం విధి చింతయేత్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – యోనిన్యాసము ఇట్లు ఆచరించవలయును.

**హాంగాయత్రీ సహితాయ హాంబ్రహ్మణే నమః – భాలే।**
**హ్రీం సావిత్రీ సహితాయ హిం విష్ణవే నమః – కపాలే।**

**హూం వాగీశ్వర సహితాయ హుం మహేశ్వరాయ నమః - వామగండే**

**శ్రీం కుబేరాయ నమః - వామకర్ణాగ్రే।**

**క్లీం మన్మధాయ నమః - ముఖే।**

**గణపతయే నమః - దక్షిణ కర్ణే।**

**శంఖనిధయే నమః - సవ్యకర్ణోపరి।**

**పద్మనిధయే నమః - గండాంతరాలే।**

మూలేన - ముఖే। ఇలా న్యాసం చేయాలి. మరలా హాం గాయత్ర సహితాయ హం బ్రహ్మణే నమః నుండి మూలమంత్ర పర్యంతము లేదా కేవలం "హ్రీం" బీజముతో, కంఠముల - స్తన - నామాంస హృదయ - దక్షిణస్కంధ - పార్శ్వద్వయ - నాభి స్థానములందు న్యాసం ఆచరించాలి.

పిమ్మట బాల - అంస - పార్శ్వభాగ - జఠర - అపరపార్శ్వ - స్కంధోపరి - హృదయములందూ న్యాసం చేయాలి. మూలమంత్రముతో వ్యాపకన్యాసం కూడా చేయవచ్చు. వ్యాపకమనగా మస్తకాదిపాదాంగుష్ఠమ్।

## ధ్యానశ్లోకం

ఉద్యద్దినద్యుతి మిందుకిరీటాం తుంగకుచాం నయనత్రయయుక్తాం
స్మేరముఖీం వరదాంకుశ పాశాభీతి కరాం ప్రభజేత్ భువనేశీమ్ ॥

ఈ భువనేశ్వరీ మంత్రము 32 లక్షలు జపించి, త్రిమధురయుక్త అష్టద్రవ్యములతో 32వేలు హోమం చేయాలి.

## భువనేశీ పూజాయంత్రం

శ్లో॥ దద్యాదర్ఘ్యం దినేశాయ తత్ర సంచింత్య పార్వతీం
పద్మమష్టదళం బాహ్యే వృత్తం షోడశభిర్దలైః ।
విలిఖేత్ కర్ణి కామధ్యే షట్కోణమతి సుందరం
తతః సంపూజయేత్పీఠం నవశక్తి సమన్వితమ్ ।

జయాఖ్యా విజయాపశ్చాదజితా చాఽపరాజితా
నిత్యావిలాసినీ గోగ్ధ్రీ అఘోరామంగళానవ ।
బీజాద్యమాసనం దత్వా మూర్తింతేనైవ కల్పయేత్
తస్యాం సంపూజయేద్దేవీ మావా హ్యావరణైః సహ ।
మధ్యప్రాగ్ యామ్య సౌమ్యేషు పశ్చిమేషు యధాక్రమం
హృల్లేఖాద్యాః సమభ్యర్చ్యాః పంచభూత సమప్రభాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - హోమానంతరం సూర్యమండలమందు పార్వతిని ధ్యానించుచూ అర్ఘ్యప్రదానం చేయాలి. ఇపుడు భువనేశ్వరీయంత్ర రచనావిధానము వివరింపబడుచున్నది.

అష్టదళకమలము లిఖించి, దాని బయట షోడశదళయుక్త వృత్తము నిర్మించాలి. మధ్యకర్ణికలో (వృత్తములో) షట్కోణం లిఖించి దానిపై నవశక్తులతో కూడిన పీఠపూజ చేయాలి. నవశక్తుల నామములిట్లుండును. 1. జయా 2. విజయ 3. అజితా 4. అపరాజిత 5. నిత్యా 6. విలాసినీ 7. దోగ్ధ్రీ 8. అఘోరా 9. మంగళా । "హ్రీం కమలసనాయ నమః" అనునది పీఠమంత్రము.

యంత్రముయొక్క మధ్య, పూర్వ - దక్షిణ - ఉత్తర - పశ్చిమ దిశలందు పంచమహాభూతములను హృల్లేఖాదాలతో అర్చించాలి. ఈ శక్తులన్నియు పాశాంకుశ అభయ ముద్రలను ధరించి యుండును.

శ్లో॥ షట్కోణేషు యజేన్మంత్రీ పశ్చాన్మిథున దేవతాః
ఇంద్రకోణే లసద్దండ కుండికాక్ష గుణాభయమ్ ।
గాయత్రీం పూజయేన్మంత్రీ బ్రహ్మాణమపి తాదృశం
రక్షఃకోణే శంఖచక్ర గదాపంకజ ధారిణీమ్ ।
సావిత్రీం పీతవసనాం యజేద్విష్ణుం చ తాదృశం

వాయుకోణే పరశ్వక్ష మాలాభయ వరాన్వితామ్ ।
యజేత్ సరస్వతీమిత్థం రుద్రంతాదృశలక్షణం
వహ్నికోణే యజేద్రత్న కుంభ మణికరండకమ్ ।
కరాభ్యాం బిభ్రతం పీతం తిందులం ధనదాయకం
ఆలింగ్య సవ్యహస్తేన వామేనాంబుజధారిణీమ్ ।
ధనదాంక సమారూఢాం హాలక్ష్మీం ప్రపూజయేత్
వారుణేమదనం బాణ పాశాంకుశ శరాసనమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఆగ్నేయాది కోణములందు అంగదేవతల నర్చించాలి. ఈశాన్యమందు కుండికా - అక్షముల - అభయముద్రలు ధరించిన గాయత్రిని బ్రహ్మను పూజించాలి. నైఋతి కోణమందు శంఖచక్రగదాపద్మములు ధరించిన పీతవసన అయిన సావిత్రిని, విష్ణువును పూజించాలి.

వాయవ్యకోణమందు పరశు - అక్షమాల - అభయ ముద్రలు ధరించిన సరస్వతిని - రుద్రుని అర్చించాలి. ఆగ్నేయ కోణమందు రత్నకుంభం - మణిఖచిత దర్పణం ధరించి పసుపువర్ణ దేహముతో బొజ్జ కలిగియుండు కుబేరుని, అతని కుడిచేతిచే ఆలింగనము చేసుకొనబడి, ఒడిలో కూర్చొని ఎడమచేతితో కమలము ధరించిన మహాలక్ష్మిని పూజించాలి.

శ్లో॥ ధారయింతం జపారక్తం పూజయేద్రత్నభూషణాం
సవ్యేన పతిమాశ్లిష్య వామేనోత్పల ధారిణీమ్ ।
పాణినా రమణాంకస్థాం రతింసమ్యక్ సమర్చయేత్
ఐశానే పూజయేత్ సమ్యగ్ విఘ్నరాజం ప్రియాన్వితం ।
సృణిపాశధరంకాంతా వరాంగ స్పృక్కరాంగుళం

మాధ్వీపూర్ణకపాలాఢ్య విఘ్నరాజ దిగంబరమ్ ।
పుష్కరే విగలద్రత్న స్ఫురచ్చషకధారిణం
సింధూరసదృశాకారా ముద్దామమద విభ్రమామ్ ।
ధృతరక్తోత్పలా మన్య పాణినా తు ధ్వజ స్పశం
ఆశ్లిష్ట కాంతారురుణాం పుష్టిమర్చేద్దిగంబరామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పశ్చిమమందు బాణపాశాంకుశ శరాసనములు ధరించి మందార పుష్పవర్ణములో నుండు కామదేవుని, అతనిని కుడిచేతితో కౌగలించుకొని ఎడమచేతితో కమలము ధరించిన రతి, అతని ఒడిలో నుండును.

మరల ఈశానకోణమందు పాశాంకుశములు ధరించి, తన అంగుళముతో తన స్త్రీ అయిన పుష్టియొక్క యోనిని స్పృశించు గణపతిని అర్చించాలి. ఇతని చేతియందు ఇప్పకల్లుతో నిండిన కపాలము ఉండును. ఇతడు దిగంబరముగానుండి, చేతిలోని కుంభమునుండి రత్నములు రాలుచుండగా, రత్నచషకము ధరించియుండును. పుష్టికూడా దిగంబరముగా, సింధూరవర్ణములో, మదముతో ఒక చేతిలో విఘ్నరాజు యొక్క లింగము స్పృశించుచు, మరొక చేతితో ఎర్రని కమలము ధరించి యుండును.

శ్లో॥ కర్ణికాయాం నిధీపూజ్యే షట్కోణ స్యాऽథ పార్శ్వయోః
అంగానికేసరేష్వేతాః పశ్చాత్ పత్రేషు పూజయేత్ ।
అనంగకుసుమా పశ్చాదనంగ కుసుమాతురా
అనంగమదనా తద్వదనంగమదనాతురా ।
భువనపాలా గగన వేగా చైవతతఃపరం
శశిరేఖాథ గగనరేఖా చేత్యష్ట శక్తయః ।

పాశాంకుశవరాభీతి ధారిణ్యోఽరుణ విగ్రహాః
తతః షోడశపత్రేషు కరాళీ వికరాళ్యుమా ।
సరస్వ శ్రీర్ దుర్గేషా లక్ష్మీశృత్యా స్మృతిర్ ధృతిః
శ్రద్ధామేధామతిః కాంతి రార్యా షోడశశక్తయః ।
ఖడ్గఖేటక ధారిణ్యః శ్యామాః పూజ్యాశ్చ మాతరః
పద్మాద్బహిః సమభ్యర్చ్యాః శక్తయః పరిచారికాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట కర్ణికయందు శక్తి సమేత శంఖనిధి, పద్మనిధులను అర్చించాలి. షట్కోణముయొక్క పార్శ్వ భాగమునందు అనంగకుసుమాది 8 అంగదేవతల నర్చించాలి.

1. అనంగకుసుమ 2. అనంగకుసుమాతురా 3. అనంగ మదనా 4. అనంగ మదనాతురా 5. భువనపాలా 6. గగన వేగా 7. శశిరేఖా 8. గగనరేఖా. వీరంతా పాశాంకుశములు, వరాభయ ముద్రలు ధరించి ఎర్రని శరీరముతో నుందురు. పిమ్మట 16 దళములందు 16 శక్తులను అర్చించాలి. వీరి నామములు.

1. కరాళి 2. వికరాలి 3. ఉమా 4. సరస్వతి 5. శ్రీ 6. దుర్గా 7. ఉషా 8. లక్ష్మి 9. శృతి 10. స్మృతి 11. ధృతి 12. శ్రద్ధా 13. మేధా 14. మతి 15. కాంతి 16. ఆర్యా.

వీరంతా ఖడ్గఖేటకములు ధరించి, శ్యామవర్ణ శరీరముతో నుందురు. పిమ్మట పద్మముయొక్క బయట 8 దిశలందూ పరిచారకుల నర్చించాలి.

శ్లో॥ ప్రథమానంగ రూపా స్యాదనంగమదనాతతః
మదనాతురాభువనవేగా భువనపాలికా ।
స్యాత్ సర్వశిశిరానంగవేదనాఽనంగమేఖలా
చషకం తాళవృంతంచ తాంబూలం ఛత్రముజ్వలం ।

చామరే చాంశుకం పుష్పం బిభ్రాణా కరపంకజైః
సర్వాభరణ సందీప్తాన్ లోకపాలాన్ బహిర్యజేత్ ।
వజ్రాదీన్యపి తద్బాహ్యే దేవీమిత్థం ప్రపూజయేత్
పూజ్యతే సకలైర్దేవైః కిం పునర్మను జోత్తమైః ।
మంత్రీ త్రిమధురోపేతైర్ హుత్వాఽశ్వత్థ సమిద్వరైః
బ్రాహ్మణాన్ వశయేచ్ఛీఘ్రం పార్థివాన్ పద్మహోమతః ।
పలాశపుష్పై స్తత్పత్నీర్ మంత్రిణం కుముదైరపి
పంచవింశతి సంజప్తైః జలై స్స్నానం దినేదినే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – వీరిపేరు 1. అనంగరూపా 2. అనంగమదనా 3. మదనాతురా 4. భువనవేగా 5. భువనపాలికా 6. సర్వశిశిరా 7. అనంగవేదనా 8. అనంగమేఖలా. వీరు క్రమముగా చషకము, విసనకర్ర, తాంబూలపుపెట్టె, శ్వేతఛత్రము, 2. చామరములు, వస్త్రము పుష్పము ధరించి యుందురు.

పిమ్మట లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి. ఈ విధముగా భువనేశ్వరిని అర్చించు సాధకుడు, దేవతలకు కూడా పూజ్యుడగును. త్రిమధుర మిశ్రిత రావిసమిధలను 10వేలు హోమం చేసిన బ్రాహ్మణులందరూ వశమగుదురు.

పద్మములతో త్రిమధుర మిశ్రితముగా హోమంచేసిన, క్షత్రియు లందరూ వశమగుదురు. మోదుగపూలతో హోమమాచరించిన రాజపత్ని వశమగును. కలువలతో హోమం చేసిన రాజమంత్రి వశమగును. 25 సార్లు అభిమంత్రించిన జలముతో ప్రతిదినము స్నానము చేసినచో సకల శుభములు జరుగును.

శ్లో॥ పంచవింశతి సంజప్తం జలంప్రాతః పిబేన్నరః
అవాప్య మహతీం ప్రజ్ఞాం కవీనామగ్రణీర్భవేత్ ।

కర్పూరాగురు సంయుక్తం కుంకుమం సాధు సాధితం
గృహీత్వా తిలకం కుర్యాద్రా జవశ్యమనుత్తమమ్ ।
శాలిపిష్ట మయీం కృత్వా పుత్తలీం మధురాన్వితాం
జప్తాం ప్రతిష్ఠిత ప్రాణాం భక్షయేద్రవివాసరే ।
వశంనయతి రాజానం నారీం వా నరమేవ వా
కంఠమాత్రోదకే స్థిత్వా వీక్ష్యతోయగతం రవిమ్ ।
త్రిసహస్రం జపేన్మంత్ర మిష్టాంకన్యాంలభేన్నరః
అన్నంతన్మంత్రితం మంత్రీ భుంజీత శ్రీప్రసిద్ధయే ।
లిఖిత్వా భస్మనామాయాం ససాధ్యాం ఫలకాదిషు
తత్కాలే దర్శయేద్యంత్రం సుఖంసూయేత గర్భిణీ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - భువనేశ్వరీ మంత్రముతో **25** సార్లు అభిమంత్రించిన జలము ప్రతిదినమూ ప్రాతఃకాలమున సేవించిన, ప్రతిభావంతుడైన కవి యగును. కర్పూరము - అగురు - కేశరములను చూర్ణముచేసి, **108** సార్లు మంత్రించి తిలకముగా ధరించిన సర్వవశ్యము సిద్ధించును.

ఆదివారమునాడు త్రిమధురమిశ్రిత బియ్యంపిండితో **12** అంగుళముల దేవిబొమ్మచేసి, భువనేశ్వరీ మంత్రముతో దానికి ప్రాణప్రతిష్ఠ చేసి, చేతియందుంచుకొని **108**సార్లు మంత్రించి, దానిని కుడికాలు బొటనవేలినుండి, ఎడమకాలి బొటనవేలి పర్యంతమూ భక్షించినచో రాజశ్యము, సాధ్య వశీకరణము సిద్ధించును.

కంఠపర్యంతము జలమునందు నిలబడి, సూర్యబింబమును చూచుచూ ప్రతిదినమూ **3** వేలు భువనేశ్వరీ మంత్రము జపించిన, అఖిలషిత కన్యను పొందును.

చెక్కపైగాని, భూర్జపత్రముపైగాని ఆవుపిడకల భస్మముతో లేదా మోదుగ భస్మముతో "హ్రీం అముక నామ్న్యాః గర్భిణ్యాః ప్రసవంకురుకురు" అని లిఖించి, గర్భిణికి చూపించిన, ఆమెకు సుఖప్రసవమగును.

## త్రిగుణ యంత్రము

శ్లో॥ శక్త్యంతః స్థిత సాధ్యర్మ్భవనే వహ్నేరః వృతంశక్తిభిః
బాహ్మోకోణగతే యుతం హరిహరైర్వర్ణైః కపోలార్పితైః ।
ఏశ్చాత్తైః పునరంయుతైర్లిపిభిరప్యావీత మిష్టార్థదం
యంత్రం భూపురమధ్యగం త్రిగుణితం సౌభాగ్యసంపత్ ప్రదమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - త్రికోణయంత్రమునకు పై భాగమునందు హ్ - ర్ - ఈం లిఖించి మధ్యలో సాధ్యసాధకములను లిఖించాలి. ఉదా - దేవదత్తస్య యజ్ఞదత్తం వశంకురుకురు" త్రికోణ అగ్రకోణములందు మూడింటియందు 3 హ్రీంలు లిఖించాలి.

రెండు పార్శ్వములందూ హరివర్ణములు (        ) హరవర్ణములు (        ) లిఖించి, పిమ్మట త్రికోణమును ఈం ఈం వర్ణముతో ఆవృతం చేయాలి. ఈ యంత్రము సౌభాగ్యమును, సంపదను ఇచ్చును.

## షడ్గుణిత యంత్రము

శ్లో॥ బీజాంతః స్థితసాధ్యనామ శరశో మాయారమామన్మథై
ర్వీతం వహ్నిపుర ద్వయే రసపుటేష్వాఖ్యాధ్య బీజత్రయమ్।
సాత్మానాత్మక మీశిఖం హరిహరైరాబద్ధ గండంబహిః
షడ్బీజైరనుబద్ధ సంధిలిపి భిర్వీతం గృహోభ్యాం భువః ।
చింతామణి నృసింహాభ్యాం లసత్కోణమిదం లిఖేత్
యంత్రం షడ్గుణితం దివ్యం నహతాంసర్వసిద్ధిదమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 2 పరస్పర సంపుటిత త్రికోణములతో, షట్కోణ పద్మం లిఖించాలి. మధ్యసాధ్యసాధక నామం వ్రాయాలి. షట్కోణ మధ్యలో 5 మాయాబీజములు 5 శ్రీబీజములు 5 కామబీజములు వేష్టితము చేయాలి.

పిమ్మట రెండు అగ్నికోణముల రెండు షట్కోణములందు మధ్యలో సాధ్య, సాధక, కర్మలిఖించి హ్రీం శ్రీం క్లీంతో వేష్టితం చేయాలి. అనగా ఒక్కొక్క షట్కోణమందు సాధ్య - సాధక - కర్మ - హ్రీం - శ్రీం - క్లీంలు ఆరూ లిఖించాలి. ఇలా రెండవషట్కోణం కూడా ఆవృతం చేయాలి.

మొదటిదానియందు సబిందుకముగాను, రెండవదానియందు విసర్గాంతముగాను లిఖించాలి. రెండువైపులా హరిహరవర్ణములు కోణముల 6 సంధులందు 6 బీజాక్షరములు లిఖించి భూపురముతో వేష్టితం చేయాలి.

పిమ్మట దిశలకోణములందు నృసింహమంత్రము, విదశలకోణము లందు చింతామణి మంత్రము లిఖించాలి. ఈ యంత్రధారణవలన సమస్త సిద్ధులూ కలుగును.

## ద్వాదశ గుణిత యంత్రము

శ్లో॥ బీజం వ్యాహృతి ఖిర్ వృతం గృహయుగద్వంద్వే వసోఃకోణగ
దౌర్గం బీజమనంతరం లిపియుగైరాబద్ధ గండంలిఖేత్ ।
గాయత్ర్యా రవిశక్తి బద్ధ వివరం త్రిష్టుబ్వృతం తత్తతో
వీతంమాతృకయా ధరాపురయుగే సత్సింహ చింతామణిమ్
యంత్రం దినేశ గుణితంప్రోక్తం రక్షాప్రసిద్ధిదం
సర్వసౌభాగ్యజననం సర్వశత్రు నివారణమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ముందుగా ద్వాదశకోణ పద్మం లిఖించాలి. మధ్యలో సాధ్యసాధక కర్మ లిఖించాలి. దీనిని విలోమ వ్యాహృతులతో సంపుటితం చేయాలి. 12 కోణములందు "ద్రః" లిఖించాలి. ప్రత్యేక కోణాగ్రభాగమందు "ఈం" లిఖించాలి.

రెండు పార్శ్వములందు విడివిడిగా, గాయిత్రియొక్క రెండేసి అక్షరములు విలోమముగా వ్రాయాలి. కోణాగ్రము యొక్కబయట 12 శక్తిబీజములు లిఖించాలి. ఈ యంత్రము సకల సిద్ధుల నిచ్చును.

## పుత్రప్రద యంత్రము

శ్లో॥ లిఖేత్ సరోజం రసపత్రయుక్తం
మధ్యేదళేష్వప్య ఖిలిఖ్యమయాం
స్వతావృతం యంత్రమిదం వధూనాం
పుత్రప్రదం భూమి గృహాంతరస్థమ్
షట్కోణమధ్యే ప్రవిలిఖ్య శక్తిం
కోణేషు తామేవ విలిఖ్యభూయః
ససాధ్యగర్భం వసుధాపురస్థం
యంత్రం భవేద్వశ్యకరం నరాణామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షడ్దలయుక్త కమలం లిఖించాలి. మధ్యయందు, దళములందు సాధ్య - సాధక సహిత హ్రీం బీజము లిఖించాలి. మరల అకారాది అః కారపర్యంతం నాలుగుప్రక్కలా మరియు భూపురమునందు లిఖించాలి. ఇది గర్భిణి ధరించిన పుత్ర సంతానము కలుగును.

షట్కోణము లిఖించి, మధ్యలో హ్రీం వ్రాయాలి. ఇతర కోణములందు కూడా హ్రీం వ్రాయలి. భూపురములందు సాధ్య సాధకములు వ్రాయాలి. ఇది వశీకరణమును సిద్ధింపచేయును.

## త్రిబీజ మంత్రము

శ్లో॥ వాగ్భవం శంభువనితా రమాబీజ త్రయాత్మకం
మంత్రం సముద్ధరేన్మంత్రీ త్రివర్గ ఫలసాధనమ్ ।
షడ్దీర్ఘ భాజా మధ్యేన వాగ్భవాద్యేన కల్పయేత్
షడంగాని మనోరస్య జాతియుక్తాని మంత్రవిత్ ।
కుర్యాత్ పూర్వోదితాన్న్యాసాన్ తద్దైవాత్రాపి సాధకః
రవిలక్షం జపేన్మంత్రం పాయసైర్మధురప్లుతైః ।
దశాంశం జుహుయాన్మంత్రీ పీఠే ప్రాగీరితేయజేత్
దేవీం ప్రాగుక్త మార్గేణ గంధాద్యైరతి శోభనైః ।
హుత్వా పలాశ కుసుమై ర్వాక్శ్రియం మహతీం లభేత్
బ్రాహ్మీఘృతం పిబేజ్జప్తం కవిత్వం వత్సరాద్భవేత్ ।
సిద్ధార్థాన్ లవణోపేతాన్ హుత్వామంత్రీ వశం నయేత్
నరనారీ నరపతీన్నాత్ర కార్యావిచారణా
చతురంగులజైః పుష్పై శ్చందనాంభః సముక్షితైః ।
హుత్వా వశీకరోత్యాశు త్రైలోక్యమపి సాధకః
జుహుయాదరుణాంభోజైరయుతం మధురాప్లుతైః ।
రాజ్యశ్రియమవాప్నోతి సతిలైస్తండులైస్తథా
ప్రాగుక్తాన్యపి కర్మాణి మంత్రేణానేన సాధయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మూడక్షరముల మంత్రము వివరించబడుచున్నది.

**మనుః :ఐం హ్రీం శ్రీం । ఈ మంత్రము ధర్మార్ధకామములను మూడింటినీ సిద్ధింపచేయును.**

ఐం హ్రాం ఐం, ఐం, హ్రీం ఐం ఇత్యాదిగాషడంగన్యాసము. ఋష్యాదులు పూర్వమువలెనే ఆచరించాలి.

## ధ్యానశ్లోకం

సింధూరారుణ విగ్రహాం త్రినయనాం మాణిక్యమౌళిస్ఫుర
త్తారానాయిక శేఖరాం స్మితముఖీ మాపీన వక్షోరుహామ్
పాణిభ్యాం మణిరత్నపూర్ణ చషకం రక్తోత్పలం బిభ్రతీ
సౌమ్యాం రత్నఘటస్థ సవ్యచరణాం ధ్యాయేత్పరామంబికామ్ ॥

ఇచట ధ్యానశ్లోకములో "కౌళసంప్రదాయము"లోనివారు, మణిపూర్ణ రత్నచషకం - అనుటకు బదులుగా "అళిపూర్ణరత్న చషకం అని పఠిస్తారు.

ఈ మంత్రము 12 లక్షలు జపించి, త్రిమధురమిశ్రిత పాయసహోమం 12వేలు ఆచరించిన సిద్ధించును. పలాశపుష్పములతో హోమం చేసిన వాక్సిద్ధి - ఐశ్వర్యము కలుగును.

బ్రాహ్మఘృతము అభిమంత్రించి నిత్యమూ, సేవించిన ఒక సంవత్సర కాలములో గొప్ప పండితుడు, కవి యగును. తెల్లావాలు, లవణముతో కలిపి హోమంచేసిన వశీకరణము సిద్ధించును.

రాజవృక్ష (          ) పుష్పములు, చందన గంధజలముతో తడిపి హోమం చేసిన జగత్త్రయి వశీకరణము అగును. త్రిమధుర మిశ్రిత రక్త కమలములు హోమంచేసిన, లేదా తిలయుక్త తండులములు హోమం చేసిన అధికారము ప్రాప్తించును.

# మరొక మంత్రము

శ్లో॥ వాగ్బీజపుటితామాయా విద్యేయం త్ర్యక్షరీ మతా
మధ్యేనదీర్ఘ యుక్తేన వాక్పుటేన ప్రకల్పయేత్ ।
అంగానిజాతియుక్తేన క్రమేణ మనువిత్తమః
యథాపురా సముద్దిష్టాన్న్యాసాన్ కుర్వీత మంత్రవిత్ ।
తత్యలక్షం జపేన్మంత్రం జుహుయాత్తద్దశాంశతః
పలాశపుష్పైః స్వాద్వక్తైః పుష్పైర్వా రాజవృక్షజైః ।
హృల్లేఖా విహితే పీఠే పూజయేత్ పరమేశ్వరీం
మధ్యాదిపూజయేత్ మంత్రీ హృల్లేఖాద్యాః పురోదితాః ।
మిథునానియజేన్మంత్రీ షట్కోణేషు యథాపురా
అంగపూజాకేసరేషు పూజ్యాః పత్రేషుమాతరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మూడక్షరముల మరొక మంత్రము చెప్పుచున్నాడు.

**మనుః : ఐం హ్రీం ఐం ।**

ఐం హ్రాం ఐం – ఐం హ్రీం ఐం – ఐం హ్రూం ఐం ఇత్యాదిషడంగ న్యాసములు. ఋష్యాదులు పూర్వమువలెనే ఆచరించాలి.

## ధ్యానశ్లోకం

శ్యామాంగీం శశిశేఖరాం నిజకరైర్దానం చ రక్తోత్పలం
రత్నాఢ్యం చషకం పరంభయహరం సంబిభ్రతీం శాశ్వతీమ్।
ముక్తాహారలసత్ పయోధరనతాం నేత్రత్రయోల్లాసినీం
వందేఽహం సురపూజితాం హరవధూం రక్తారవిందస్థితామ్॥

ఈ మంత్రము 25 లక్షలు జపించి, త్రిమధుర మిశ్రిత పలాశ పుష్పములతో లేదా రాజవృక్ష పుష్పములతో దశాంశహోమము ఆచరించిన మంత్రము సిద్ధించును.

హ్రీం బీజముతో పీఠపూజచేసి, సమస్త దేవతలను షట్కోణములందు శక్తి సహితులుగా ధ్యానించి అర్చించాలి. కేసరములందు అంగపూజ, పత్రములందు మాతృకలను పూజించాలి.

## అంగావరణ దేవతలు

శ్లో॥ భైరవాంక సమారూఢాః స్మేరవక్త్రా మదాలసాః
అసితాంగో రురుశ్చండః క్రోధ ఉన్మత్త సంజ్ఞకః ।
కపాలోభీషణః పశ్చాత్ సంహారీచాఽష్టభైరవాః
శూలంకపాలం ప్రేతం చ బిభ్రాణాః క్షుద్రదుందుభిమ్ ।
గజత్వగంబరా భీమాః కుటిలాలక శోభితాః
దీర్ఘాద్యా మాతరః ప్రోక్తా హ్రస్వాద్యా భైరవాః స్మృతాః ।
పూజ్యాః షోడశపత్రేషు కరాలాద్యాః పురోదితాః
తద్బాహ్యేఽనంగ రూపాద్యాః లోకేశాస్త్రాణి తద్బహిః ।
ఏవమారాధయేద్దేవీం శాస్త్రోక్తేనైవ వర్త్మనా
వశంనయితి రాజానం వనితాశ్చ మదాలసాః ।
మనునాజ్యేన జుహుయాల్లభతే వసువాంఛితం
సుగంధైః కుసుమైర్ హుత్వా శ్రియమాప్నోతి వాంఛితామ్ ।
మంత్రేణాఽనేన సంజప్తమశ్నీయాదన్న మన్వహం
భవేదరోగీ నియతం దీర్ఘమాయురవాప్నుయాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మాతృకాదేవతలందరూ భైరవుల ఒడిలో మదాలసలై, మందహాసముతో నుందురు. వీరు 8మంది. 1. అసితాంగ 2. రురు 3. చండ 4. క్రోధ 5. ఉన్మత్త 6. కపాలి 7. భీషణ 8. సంహార భైరవులు. వీరు చేతులలో శూల - కపాల - ప్రేత - క్షుద్రదుందుభులు ధరించి యుందురు.

గజచర్మముధరించి మహాభయంకరముగా, కుంచిత కేశములతో నుందురు. 8 దీర్ఘ బీజములు ఆ - ఈ - ఊ - ౠ - ఋూ - ఏ - ఔ - - అం, మాతృకలకు సంబంధించినవి, హ్రస్వబీజములు 8. అ - ఇ - ఉ - ఋ - ఌ - ఎ - ఓ - అం భైరవ స్వరూపములు.

మరల పత్రములందు కరాళీ మొదలగువారిని, పూజించాలి. దానికి బయట అనంగరూపాదులను, దానికి బయట ఇంద్రాది దిక్పాలకులను, వారి ఆయుధములను అర్చించాలి. ఈ విధముగా అర్చించు సాధకుడు రాజులను (అధికారులను) స్త్రీలను వశము చేసుకొనగలడు.

కేవలం నేతితో హోమమాచరించిన, వాంఛిత ధనమును పొంద గలడు. సుగంధ కుసుమములతో హోమము చేసిన సంపద, ఆరోగ్యము పొందును. అన్నమును అభిమంత్రించి భుజించిన ఆరోగ్యము, దీర్ఘాయువు సిద్ధించును.

## పాశాది త్ర్యక్షరములు

శ్లో॥ అనంతో బిందు సంయుక్తో మాయా బ్రహ్మాఽగ్నితారవాన్
పాశాదిత్ర్యక్షరోమంత్రః సర్వవశ్య ఫలప్రదః ।
ఋష్యాద్యాః పూర్వముక్తాః స్యుర్బీజేనాంగ క్రియామతా ।
హవిష్యభుగ్ జపేన్మంత్రం తత్త్వలక్షం జితేంద్రియః
తత్సహస్రం ప్రజుహుయాజ్జపాంతే మంత్రవిత్తమః ।
దధిక్షౌద్ర ఘృతాక్తాభిః సమిద్భిః క్షీరభూరుహాం

తత్సంఖ్యయా తిలైః శుద్ధైః జలాక్తైర్జుహుయాత్తతః ।
హృల్లేఖా విహితేపీఠే నవశక్తి సమన్వితే
అర్చయేత్పరమేశానీం వక్ష్యమాణ క్రమేణతామ్ ।
హృల్లేఖాద్యాయజేదాదౌ కర్ణికాయాం యథావిధి
అంగానికేసరేషు స్యుః పత్రస్థా మాతరః క్రమాత్ ।
ఇంద్రాదయః పునః పూజ్యాస్తేషామస్త్రాణి తద్బహిః
ఏవం సంపూజయేద్దేవీం సాక్షాద్వైశ్రవణో భవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మూడక్షరముల పాశాంకుశములతో కూడిన మంత్రమిది.

**మనుః - ఆం హ్రీం క్రోం ।**

ఋషాద్యుదులు పూర్వమువలెనే ఉచ్చరించవలయును. బీజములతో అంగన్యాసాదులు ఆచరించాలి.

## ధ్యానశ్లోకం

వరాంకుశౌ పాశమభీతి విద్యాం
కరైర్వహంతీం కమలాసనస్థామ్
బాలార్క కోటి ప్రతిమాం త్రినేత్రాం
భజేఽహ మాద్యాం భువనేశ్వరీంతామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ మంత్రమును 24 లక్షలు జపించి, అరశ్చరణ చేయాలి. త్రిమధురముతో తడిపిన క్షీరవృక్ష సమిధలు (రావి-మేడి-మర్రి) లేదా శుద్ధ జలముతో తడిపిన తిలలు హోమం చేయాలి.

భువనేశ్వరీ పీఠమందు నవశక్తులను అర్చించాలి. కేసరములందు అంగపూజ, పత్రములందు మాతృకలను, ఇంద్రాదులను, వారి ఆయుధములను అర్చించాలి. ఇట్టి సాధకుడు కుబేరుడంతటి వాడగును.

# ఘటార్గళ యంత్రము

శ్లో॥ ఆలిఖ్యాஉష్ట దిగర్గలా న్యదరగం పాశాదికం త్ర్యక్షరం
కోష్ఠేష్వంగమనూన్ పరేషు విలిఖేదష్టార్ణా మంత్రద్వయమ్।
అచ్పూర్వాపరషట్కయుగ్లవవరాన్ వ్యోమాసనానర్గలే
ష్వాలిఖ్యేంద్ర జలాధిపాది గుణశః పంక్తిద్వయం తత్పరమ్ ॥
కోష్ఠేష్వష్టయుగార్ణ మాతృ సహితాం యుగ్మ స్వరాంతర్గతాం
మాయాం కేసరగాందళేషు విలిఖేన్మూలం త్రిపంక్తిక్రమాత్।
త్రిఃపాశాంకుశవేష్టితం చలిపిభిర్వీతం క్రమాదుత్క్రమాత్
పద్మస్థేన ఘటేన పంకజముఖే నావేష్టితం తద్బహిః ।
ఘటార్గళ మిదంయంత్రం మంత్రిణాం ప్రాభృతం మతమ్।
పాశ్రీశక్తికందర్పకామశకేందిరాంకుశాః ॥
ప్రథమోஉష్టాక్షరో మంత్రస్తతః కామిని రంజని
స్వాహా తోஉష్టాక్షరో సద్భిరపరః కీర్తితోమనుః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సకలశుభములను ఇచ్చు "ఘటార్గళ యంత్రము"ను వివరించుచున్నాడు. ఇది అర్గళములకు బయట ఒక వృత్తముగానే లిఖించాలి. కొందరు రెండూ మూడూ - లేదా, నాలుగు వృత్తములతో లిఖించుచున్నారు. అది అసంబద్ధమని, పదార్థాదర్శ వ్యాఖ్యానములో రాఘవభట్టు శాసించాడు.

పద్మపాదాచార్యులు వృత్తద్వయం నిర్మించాలని చెప్పినట్లు వివరించాడు. వృత్తద్వయ కల్పన అప్రామాణికమని, ఒకే వృత్తం లిఖించాలని వ్యాఖ్యానంలో ఇలా చెప్పాడు.

"తదుపర్యష్ట కోష్ఠేషు పాశాద్యష్టాక్షరం అగ్రాదిలిఖిత్వా, పునశ్చ బాహ్యసంధిషు వృత్తంకృత్వా తదుత్పన్నేషు అష్టసు, కోష్ఠేషు కామిన్యష్టాక్షరం ఆలిఖ్య వర్తితాష్ట పరిధి సంధిషు వృత్తాత్ బహిః వృత్తం కృత్వా తదుత్పన్నేషు తదుత్పన్నేషు షోడశకోష్ఠేషు అష్టయుగార్ణం శక్తం షోడశాక్షరం విలిఖేత్, ఇత్యనేన పూర్వేణాన్వయ ఇతి కేచన 1. అన్యే 2. చతురస్రద్వయాంతర్బహిసంధిషు వృత్తద్వయం కారయిత్వా వర్తితాష్ట పరిధి సంధివృత్తాద్బహిసి వృత్తం కారయంతి । తత్ర కోష్ఠేషు అష్టయుగార్ణాం విలిఖేత్ ఇత్యాహుః ।

అన్యే 3. తు చతురస్ర బాహ్యా సంధీనాముపరి వృత్తమేకం వర్తితాష్ట పరిధి సంధిషు చ, ద్వితీయం వృత్తం కారయంతి తత్ పక్షత్రయమపి అసంబద్ధం, శ్రౌతస్య క్రమస్య బాధితత్వాత్ । కర్ణికావృత్త లగ్నాధోముఖ త్రికోణాకారాష్ట కోష్ఠానాం శూనత్వాచ్చ ।

కించ పూర్వపక్షే వృత్తత్రయ కల్పనమన్య పక్షయో వృత్తద్వయ కల్పనం చ అప్రామాణికమ్ । యావతా వినాన నిర్వాహస్తావదేవ కల్పనార్హమితి నాధికమ్ । అత ఏకమేవ వృత్తకల్పనీయమ్ । ఉపరివృత్తస్య తో పదమ కర్ణికాత్వేన సర్వైరిహాంగీకరణాత్ । అతో వక్ష్యమాణ సాంప్రదాయకార్థాను సరణమేవ శ్రేయః ॥

**ప్రథమాష్టక్షర మంత్రము - ఆం హ్రీం క్లీం క్లీం హ్రీం శ్రీం క్రోం ।**

**ద్వితీయాష్టక్షర మంత్రము - కామినిరంజని స్వాహా । వీటిని ఘటార్గళ యంత్రమునందు లిఖించవలయును.**

**శ్లో॥ హ్రీంగౌరి రుద్రదయితే యోగేశ్వరి సవర్మఫట్**
**ద్వితాంతః షోడశార్ణోఽయం మంత్రస్సద్భిరుదీరితః ।**
**లిఖిత్వాభూర్జ పత్రాదౌ యంత్రమేతద్య థావిధి**
**ధారయన్ వామబాహౌ వా కంఠే వానిజమూర్ధని ।**
**వశయేత్ సకలాన్ మర్త్యాన్ విశేషణ మహీపతీన్**
**నీలపట్టే విలిఖ్యైతద్ గుటికాం కృత్యతత్ పునః ।**
**సాధ్యప్రతికృతేః సిక్థ నిర్మితాయా హృదిన్యసేత్**
**పాత్రే త్రిమధురా పూర్ణే నిఃక్షిప్యైనాం విధానతః ।**
**సంపూజ్య గంధ పుష్పాద్యై ర్బలింనిక్షిప్య రాత్రిషు**

మూలమంత్రం జపేన్మంత్రీ నిత్యమష్ట సహస్రకమ్ ।
సప్తాహాద్వాంఛితాం నారీమాకర్షేత్ స్మరవిహ్వలాం
భర్జపత్రే విలిఖ్యైతద్ గుటికాం కృత్యతత్పునః ।
లాక్షయా తామ్రరజత కాంచనైర్వేష్టయేత్ క్రమాత్
తత్ కుంభేన్యస్య సంపూజ్య యధావద్ భువనేశ్వరీమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మరొక మంత్రము షోడశాక్షరి చెప్పబడుచున్నది.

**మను : హ్రీం గౌరి రుద్రదయితే యోగేశ్వరి హుంఫట్ స్వాహా**

ఈ మంత్రమును భూర్జపత్రముపై లిఖించి, లేదా నీలవస్త్రముపై లిఖించి (పుష్యార్కమందు లేదా శుభముహూర్తమునందు అనామిక రక్తముతో) ఎడమచేతికి – లేదా కంఠమునందు, లేదా తలపైగాని ధరించిన సమస్త జగమూ వశ్యమగును. అధికారులు వశ్యమగుదురు.

నీలవస్త్రముపై లిఖించి దానిని చుట్టి మధునిర్మిత (మైనంతో చేసిన) స్త్రీ బొమ్మనందు హృదయస్థానములోనుంచి త్రిమధురములుంచిన కుంభము నందుంచి పంచోపచారపూజ చేసి ప్రతిదినము రాత్రియందు పాయస బలి సమర్పించుచు, మూలమంత్రమును 8వేలు జపించిన, వారం రోజులలో తాను ఇష్టపడిన స్త్రీ వశ్యమగును.

ఈ మంత్రము భూర్జపత్రముపై లిఖించి యంత్రవేష్టితము చేసి, కుంభమందుంచి భువనేశ్వరిని ఆవాహనచేసి పూజించాలి.

శ్లో॥ సంస్పృశ్య తం జపేన్మంత్రం దివాకర సహస్రకం
అభిషిచ్యప్రియం సాధ్యం బధ్నీయాత్ యంత్రమాశిఖమ్ ।
కాంతిపుష్టిధనారోగ్య యశాంసి లభతే నరః
భిత్తౌ విలిఖ్య తన్మంత్రం పూజయేన్నిత్యమాదరాత్ ।

భూతప్రేతపిశాచాస్తం న వీక్షితుమపి క్షమాః
తద్విలిఖ్య శిరస్త్రాణే సాధితం ధారయన్ భటః ।
యుద్ధేరిపూన్ బహూన్ హత్వా జయమాప్నోతి పార్థివత్
వజ్రాంకితే వహ్నిపురద్వయేతాం
పాశాంకుశాఢ్యా ముదరస్థసాధ్యాం
మధ్యేఽథకోణేషుచ బాహ్యవృత్తే పునః
పునస్తత్ విలిఖేత్ సమంతాత్ ।
భూర్జేలిఖితమేతత్ స్యాత్ సర్వవశ్యకరంన్నృణాం
ఆరోగ్యైశ్వర్య జననం యుద్ధేషు విజయప్రదమ్ ।
భూర్జేసరోజే స్వరకేసరాఢ్యే వర్గాష్టపత్రే వసుధా పురస్థే ।
పాశాంకుశాభ్యాం గుణశః ప్రబద్ధాం
మాయాంలిఖేన్మధ్యగతాం ససాధ్యామ్ ॥
సర్వోత్తమమిదం యంత్రం ధారితం కురుతే నృణాం
ఆరోగ్యైశ్వర్య సౌభాగ్య విజయాదీన నారతమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కలశమును స్పృశించుచూ 12వేలు జపించి, ఆ కుంభజలముతో సాధ్యవ్యక్తికి అభిషేకించి, మంత్రమును శిఖయందు బంధించాలి. అతనికి పుష్టి - శాంతి - ధన - ఆరోగ్య - యశములు సిద్ధించును. దీనిని గోడపైవ్రాసి పూజించిన, ఆ గృహమునకు భూతప్రేత పిశాచముల వలన బాధలు కలుగవు.

శిరస్త్రాణము మంత్రించి ధరించిన యుద్ధ జయము కలుగును. షట్కోణమధ్యమందు హ్రీంతో సంపుటితము చేసిన ఆం-క్రోం బీజములు, సాధ్యనామమూ లిఖించి, కోణములందు, బయట వృత్తములందు లిఖించిన సర్వశుభములూ, అభీష్టసిద్ధీ కలుగును.

భూర్జపత్రమందు అష్టదళ పద్మములిఖించి కేసరములందు రెండేసి అచ్చులు, 8 వర్గాక్షరములు 8 దళములందు, భూపురమందు ఆం క్రోం హ్రీం ఆం క్రోంలు 3సార్లు లిఖించాలి. మధ్యలో సాధ్యనామము లిఖించాలి. ఇది సర్వోత్తమము. దీనిని ధరించు వ్యక్తి ఆరోగ్యము - ఐశ్వర్యము - కీర్తి పొందును.




*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదాతిలక తంత్రే*
*నవమః పటలః సమాప్తః*

❖❖❖

# అథ దశమః పటలః

## అథ త్వరితా ప్రకరణమ్

శ్లో॥ తతోఽభిధాస్యే త్వరితాం త్వరితం ఫలదాయినీం
తారో మాయావర్మబీజమృద్ధిరీశ స్వరాన్వితా ।
కూర్మస్తదంత్యో భగవాన్ క్షఃస్త్రీ దీర్ఘతనుచ్ఛదం
సంవర్తీ భగవాన్మాయా ఫడంతో ద్వాదశాక్షరః ।
మునిరర్జున ఆఖ్యాతో విరాట్ ఛందః సమీరితమ్
త్వరితాదేవతాప్రోక్తా పురుషార్థ ఫలప్రదా ।
మాయావివర్జితాన్ వర్ణాన్ మూర్ధ్ని భాలేగలేహృది
నాభిగుహ్యోరు యుగ్మేషు జానుజంఘా పదేషుచ ।
విన్యస్యవ్యాపకం కుర్యాత్ సమస్తేనైవ సాధకః
కూర్మాద్యైః సప్తభిర్వర్ణైః పూర్వపూర్వ వివర్జితైః ।
ద్వాభ్యాంద్వాభ్యాం షడంగాని కల్పయేత్సాధకోత్తమః
లక్షం సంజప్యమంత్రజ్ఞో మనుమేనం జితేంద్రియః ।
దశాంశంజుహుయాద్ బిల్వై ర్మధురాక్తైః సమిద్వరైః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు త్వరితముగా సిద్ధించు "త్వరితా" మంత్రము వివరింపబడుచున్నది.

**మనుః – ఓం హ్రీం హుంఖే చ ఛేక్షః స్త్రీ హూంక్షే హ్రీంఫట్।**

ఈ మంత్రమునకు ఋషి – అర్జునః, విరాట్ చందః, త్వరితాదేవతా, చతుర్విధ పురుషార్థే వినియోగః ।

ఈ మంత్రములోని హ్రీం రహిత దశాక్షరములనూ శిర – లలాట – కంఠ – హృదయ – నాభి – గుహ్య – ఊరుద్వయ – జాను – జంఘా

– పాదములందు న్యాసం చేయాలి. సమస్త మంత్రముతో వ్యాపక న్యాసం చేయాలి. ఖేచ, చఛే ఛేక్షః, క్షస్త్రీ, స్త్రీహుం, హుంక్షే అను బీజద్వయములతో షడంగన్యాసము లాచరించాలి.

## ధ్యానశ్లోకం

శ్యామాంబర్హికలాపశేఖరయుతా మబద్ధపర్ణాంశుకాం
సంజాహార లసత్పయోధరభరా మష్టాహిపాన్ బిభ్రతీమ్ ।
తాటంకాంగద మేఖలాగుణరణన్మంజీరతాం ప్రాపితాన్
కైరాతీం వరదాభయోదయత కరాం దేవీంత్రినేత్రాంభజే ॥

ఈ మంత్రము లక్ష జపించి, త్రిమధురయుక్త బిల్వసమిధలతోను, బిల్వఫలములతోనూ హోమం చేయవలయును.

శ్లో॥ హృల్లేఖా కల్పితేపీఠే, నవశక్తి సమన్వితే
పూజయేత్ త్వరితాం దేవీం వక్ష్యమాణ విదానతః ।
సంవర్తకోబిందుయుతః కవచం సకలం వియత్
వజ్రదేహ పురుద్వంద్వ మాభాష్య హింగులద్వయమ్ ।
గర్జయుగ్మం వియత్సేందు వర్మాంత్యో దీర్ఘబిందుమాన్
పంచాన నాయహృదయం పీఠ మంత్రః ప్రకీర్తితః ।
దద్యాదాసన మేతేన మూర్తిం మూలేన కల్పయేత్
అంగైః ప్రణీతాం గాయత్రీం కేసరేష్వర్చయేత్ క్రమాత్ ।
దళేషు పూజయేదేతాః శ్రీబీజాద్యాః సుభూషితాః
హుంకారీఖేచరీం చండాం ఛేదినీం క్షేపణీం స్త్రియామ్ ।
హూంకారీ క్షేమకారీంచ లోకేశాయుధ భూషణాః
ఫట్కారీమగ్రతో బాహ్యే కోదండ వరధారిణీమ్ ।
ద్వారస్య పార్శ్వయోః పూజ్యే హైమవేత్ర కరాంబుజే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ క్రింది పీఠమంత్రముతో ఆసనము కల్పించి, మూలమంత్రముతో ఆహ్వానించాలి.

**"క్షం హం వజ్రదేహ పురు పురు క్షిం క్షిం క్ష్రాం క్ష్రాం హంక్షాం పంచననాయ నమః**

కేసరములందు షడంగములు పూజించి ఉత్తరమందు ప్రణీత, ఈశాన్యమందు గాయత్రిని పూజించాలి.

అష్టదళములందు శ్రీబీజయుక్త 1. హుంకారీ 2. ఖేచరీ 3. చండా 4. ఛేదిన 5. క్షేపణీ 6. స్త్రీ 7. హూంకారీ 8. క్షేమకారీ శక్తుల నర్చించాలి. వీరంతా అందమైన ఆభరణములు, ఇంద్రాదుల ఆయుధముల వంటి, ఆయుధములు - వాహనములు ధరించియుందురు.

పిమ్మట అష్టదళ పద్మము బయట, అగ్రభాగము ఇరువైపులా ఫట్కారీ - కోదండధారిణీలను పూజించాలి వీరు తమ చేతులందు బంగారు బెత్తములబిఉ ధరించి యుందురు.

దళాగ్రములందు భైరవులను పూజించాలని "త్రోతలామతము" నందిట్లున్నది.

☞ **తద్బాహ్యే భైరవానష్టౌ పీఠమాతృ సమన్వితాన్"**

## కింకరీ పూజ

శ్లో॥ జయాఖ్యా విజయమాఖ్యాచ కింకరాయ పదంతతః
రక్షరక్ష పదస్యాంతే త్వరిజ్ఞా స్థిరోభవ ।
వర్మాస్త్రాంతేన మనునా కింకరం తద్బహిర్యజేత్
లగుడం బిభ్రతం కృష్ణం కృష్ణ బర్బరమూర్ధజమ్ ।
ఆరణ్యైరరుణై పుష్పైరతియుక్తైః సుగంధిభిః

పూజయేద్ ధూపదీపాద్యైః నృత్యగీతైర్మనోరమైః ।
ఏవంసిద్ధ మనుర్మంత్రీ నారీనరనరేశ్వరైః
మాన్యతే వత్సరాదర్వాన్ లక్ష్మ్యాజితధనేశ్వరః ।
యోనికుండం ప్రకల్ప్యాత్ర కుర్యాద్ధోమంనిజేచ్ఛయా
మల్లికాకుసుమై ర్హుత్వా వశయేదఖిలం జగత్ ।
కృత్యాద్రోహాదిశమనం పలాశకుసుమైర్హుతిం
ఇక్షుఖండైః శుభైర్హుత్వా మహతమృద్ధిమాప్నుయాత్ ।
దీర్ఘమాయుమవాప్నోతి దూర్వాహోమేన సాధకః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - త్వరితాదేవి కింకరిని ఈ మంత్రముతో, అష్టదళ పద్మమునకు బయట పూజించాలి. నల్లని శరీరములో దండధారియై ఉంగరాలజుట్టుతో కింకరి యుండును.

**మనుః : జయావిజయా కింకరాయ రక్ష రక్ష త్వరితాజ్ఞా స్థిరోభవఫట్** ॥

ఈమెను ఎర్రని అరణ్యపుష్పములతో, పంచోపచారములతో అర్చించాలి. నృత్యగీత వాద్యములతో పూజించిన సాధకుడు సర్వవశ్యశక్తిని పొందును.

ఒక సంవత్సరకాలములో గొప్ప ధనవంతుడగును. పిమ్మట యోన్యాకార కుండమును నిర్మించి మల్లి - పలాశ - పుష్పలముతో హోమం చేసిన అభిచారప్రయోగములు నశించును. చెరకుముక్కలతో హోమం చేసినచో ధనవృద్ధి - దూర్వాహోమంవలన దీర్ఘాయువూ కలుగును.

శ్లో॥ ధాన్యైః ప్రక్షాలితైర్హుత్వా శ్రియమిష్టాం సమాప్నుయాత్
యవైర్ధాన్య సమృద్ధిఃస్యాత్ గోధూమైరిష్ట సిద్ధయః ।
తండులైరక్షయా సిద్ధిః స్యాద్వృద్ధి ర్మహతీ తిలైః

మంత్రీనీలోత్పలై ర్హుత్వా నృపపత్నీం వశం నయేత్ ।
ప్రబుద్ధైః పంకజైర్హుత్వా వశంనయతి మేదినీం
అశోకైః పుత్రమాప్నోతి మధూకైరిష్టమాప్నుయాత్ ।
ఫలైర్జంబు భవైర్హుత్వా లభతే ధనమీప్సితమ్
పుష్పైః పాటలి సంభూతై రిష్ట మాప్నోతి సుందరీమ్ ।
పుష్పైర్బకుల సంభూతైః కీర్తిః స్యాదనపాయినీ
దీర్ఘమాయుర్లభేదామ్రై శ్చంపకైః కాంచనం లభేత్ ।
కుర్వీత సర్షపై ర్హోమం శత్రోర్నాశకరం సుధీః
పత్రైర్బకులజై ర్హుత్వా శీఘ్రముత్సాదయేదరీన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శుభ్రముచేసిన కడిగిన ధాన్యము హోమంచేసిన వాంఛితధనము పొందును. యవధాన్యహోమముచే ధాన్యవృద్ధి - పంటలు బాగా పండును. గోధుమ ధాన్యహోమముచే ఇష్టసిద్ధి కలుగును.

బియ్యం హోమంచేసిన అక్షయసిద్ధి - తిలలు హోమం చేసిన అభివృద్ధి - నీలకమలములు హోమం చేసిన రాజపత్ని వశమగును. వికసిత కమలహోమముచే జగద్వశ్యము కలుగును. అశోకపుష్ప హోమముచే పుత్రసంతానము పొందును. ఇప్పపూల హోమము వలన ఇష్టసిద్ధి.

నేరేడుపండ్లు హోమంచేసిన ఇష్టధనప్రాప్తి పాటలి పుష్పహోమం వలన, అఖిలషితస్త్రీని పొందును. వకుళ పుష్పహోమం వలన గొప్పకీర్తి, మామిడిపూలు, (పేత) సంపెంగపూల హోమం వలన బంగారము పొందును.

తెల్లావాలు హోమంచేసిన శతృనాశనం, వకుళ పత్రముల హోమం వలన శతృజయము సిద్ధించును.

శ్లో॥ శాల్మలీ పత్ర హోమేన సపత్నాన్ నాశయేద్ధ్రువం
కోద్రవైః కండనైస్తద్వన్నింబైర్విద్వేషయేన్మిథః ।
తుషహోమేన మూకఃస్యాదున్మత్తోఽక్షైర్భవేదరిః
అయుతం హోమ సంఖ్యాస్యాజ్జ జ్జపస్తావాన్ ప్రకీర్తితః ।
స్నానం తన్మంత్రితైస్తోయైః సర్వవ్యాధి హరంస్మృతం
తజ్జప్తంచులుకంతోయం ముఖేక్షిప్తం విషాపహమ్ ।
ఆర్తాయభేషజం దద్యాన్మంత్రేణానేన మంత్రవిత్
సభవేత్ వ్యాధినిర్ముక్తో మంత్రస్యాఽస్య ప్రభావతః ।
త్రిలోహీముద్రికానేన మనునాసాధు సాధితా
కృత్యాద్రోహాదిశమనీ సర్వవ్యాధి వినాశినీ ।
సర్వసంపత్ ప్రదానిత్యం సర్వవశ్యకరీమతా
యద్యద్ వాంఛతి మంత్రజ్ఞ స్తత్తదేతే న సాధ్యతే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – బూరుగు ఆకులతో హోమం చేసిన శత్రునాశనమగును. కోద్రవపొట్టు హోమం చేసిన, నిమ్మపండ్లతో హోమం చేసిన విద్వేషణము సిద్ధించును. మినుములు హోమం చేసిన శత్రువు మూగవాడగును. విభీతక ( ) ఫలహోమముచే శత్రువు పిచ్చివాడగును.

వీటన్నిటికీ 10 వేల సంఖ్యలో హోమం ఆచరించాలి. జపము కూడా అంతే సంఖ్యలో చేయాలి. త్వరితామంత్రముతో అభిమంత్రించిన జలస్నానము వలన రోగ నివారణమగును. ఒక చులుకము జలము మంత్రించి సేవించిననూ విషము నివారింపబడును.

అభిమంత్రించిన ఔషధము సేవించిన రోగము త్వరితముగా నివారణ మగును. బంగారము – వెండి – వెండి సమభాగములుగా గ్రహించి

ఉంగరముచేసి, మంత్రించి ధరించిన, అభిచార ప్రయోగములు నశించును. సర్వవ్యాధులూ నివారణమగును. ఈ మంత్ర సాధకుడు సమస్తమూ సాధించగలడు సంపద - వశ్యము సిద్ధించును.

## విజయప్రద యంత్రము

శ్లో॥ మధ్యే సరోజే దశపత్రయుక్తే
మాయాలిఖే ద్వాంఛిత సాధ్య గర్భామ్ ।
తారాదివర్ణాన్ దశమంత్ర సంస్థాన్
షట్కోణబీజం వసుధాపురస్థమ్ ॥
విధృతం త్వరితాయంత్రం విశేషాద్విజయప్రదమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - విజయమును కలిగించు త్వరితాయంత్రము వివరింపబడుచున్నది. దశపత్రయుక్త కమలమునందు, మధ్యలో "హ్రీం" బీసము, సాధ్య - కార్యములను లిఖించాలి. దశపత్రము లందు హ్రీం రహితముగా ఓంకారాది దశాక్షరములను లిఖించి, భూపురమందు షట్కోణ బీజాక్షరములు లిఖించాలి.

ఈ యంత్రధారణవలన కృత్యాప్రయోగములు తొలగును. సమస్త కార్యములందు విజయము ప్రాప్తించును. సర్ప - చోర - బాధలు కలుగవు.

## లక్ష్మీకీర్తిప్రదయంత్రము

శ్లో॥ తారే విలిఖేత్సరోజకుహరే పాధ్యాభిధానాన్వితం
మంత్రార్ణాన్ వసుసంఖ్యకాన్ వసుదళేష్వాలిఖ్య తద్బాహ్యతః।
శక్త్యాత్రిః పరివేష్టితం ఘటగతం పద్మస్థం మబ్జాననం
యంత్రం వశ్యకరం గ్రహాదిభయహృల్లక్ష్మీప్రదం కీర్తిదమ్॥

**కోష్ఠానాం శతమేక వింశతియుతం కృత్వా ధృవం మధ్యతః**
**సాధ్యాఢ్యం త్వరితాం శివాది విలిఖేన్మాయాం వినామంత్రవిత్ ।**
**రేఖాగ్రేషులసత్ త్రిశూల మసకృత్ సంజప్య సంపాతితం**
**యంత్రంక్ష్వేడ మహాభిచారశమనం వశ్యావహం శ్రీప్రదమ్**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అష్టదళకమలము లిఖించి మధ్యలో హుంపూర్వక సాధ్య - కర్మ - సాధకనామములు లిఖించి, దళములందు ఓం - హ్రీం - హ్రీం - హుం బీజములు వర్జించి, మిగిలిన 8 త్వరతాక్షరములూ వ్రాయలి. పిమ్మట దాని బయట మూడు శక్తి మంత్రములు వేష్టితం చేయాలి. అటుపై అష్టదళకమలాకృతిలో మండపం లిఖించి, అందు ఘటస్థాపన చేయాలి. దానియందు యంత్రముంచి పూజించి ధరించాలి. ఈ యంత్రము వశ్యకారకము - గ్రహ, బాధా నివారణము, కీర్తిప్రదమూ అగును.

## శ్రీపద త్వరితా యంత్రము

12 రేఖలు తూర్పునుండి పడమరకు గీసి 12 రేఖలు ఉత్తరమునుండి దక్షిణమునకు గీయాలి. ఇందు 121 గడులు ఏర్పడును. మధ్యలో ఈశాన్య కోణమునుండి ఓంకార సంపుటిత సాధ్యాక్షర - సాధ్యకర్మ - సాధక నామములు లిఖించాలి.

పిదప మాయాబీజ రహిత ఉత్వరితాదశాక్షరములను 12 ఆవృత్తులలో లిఖించి, తూర్పునుండి పడమరకు గీసిన 11 రేఖలూ, ఉత్తరమునుండి దక్షిణమునకు గీసిన రేఖలు పొడిగించి, త్రిశూలము ఆకారం ఏర్పరచాలి. ఈ యంత్రము పూజించి ధరించిన అభిచారకర్మలు, ఉన్మత్తత - మనోవైకల్యమూ తొలగును. లక్ష్మీప్రదమగును.

# అనుగ్రహ యంత్రము

శ్లో॥ ఏకాశీతిపదేషు టాంతవివరే సాధ్యంలిఖేన్మధ్యతః
పశ్చాత్ పంక్తిషు దిగ్గతాసు లిపిశో జూంసః శిఖాంతం లిఖేత్।
శిష్టేష్వీశనిశౌచరాది విలిఖేల్లక్ష్మీమనుం పంక్తిశః
శస్త్రా విర్వషడంతయా త్వరితయా వీతం చతుర్దిక్ష్వపి ॥
లాంతైః ప్రవీతం కమలాసనేన ఘటేన వీతం కమలాసనేన
సంసాధితం చక్రమనుగ్రహాఖ్యం దధ్యాత్ యధావత్ కనకాదిబద్ధమ్॥
కృత్యాప మృత్యురోగాదీన్ క్ష్వేడభూత మహాగ్రహాన్
జీవేద్వర్ష శతం పుత్రైః పైత్రైః ర్లక్ష్మ్యా చ నందతి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 9 నిలువు గడులు, 9 అడ్డ గడులతో 81 గడుల చతురస్రము లిఖించాలి. దానిమధ్యలో సాధ్య - కర్మ - సాధక నామములకు అటూ, ఇటూ రెండు రకారములు లిఖించాలి. నాలుగుదిశలా 4 - 4 గడులందు 5 పంక్తులందు జూం - సః - వషట్ అను నాలుగు అక్షరములు వ్రాయలి.

పిమ్మట నైరుతి కోణమునుండి ఈశాన్యకోణ పర్యంతము, ముందు చెప్పబోవు 64 అక్షరముల శ్రీమంత్రము లిఖించాలి. నాలుగు దిశలందూ త్వరితామంత్రమునకు ఫట్, మరియు వషట్ చేర్చి ఒక్కొక్క ఆవృత్తిగా 4సార్లు వేష్టితం చేయాలి. దానిని కూడా వకారముతో మాలవలె లిఖించాలి.

ఈ యంత్రమును కమలాసన మండపంనందు కలశస్థాపన చేసి, అందుంచి పూజించాలి. ఈ “అనుగ్రహయంత్రము” బంగారు - వెండి - లేదా రాగి తాయెత్తులోనుంచి ధరించిన, అపమృత్యు భయము తొలగి చిరకాలము సుఖముగా జీవించును

## శ్రీమంత్రం

శ్లో॥ శ్రీసా మాయా యామాసాశ్రీ సానోయాజ్ఞేజ్ఞేయానోసా ।
మాయిాలీలా లాలీయానా యాజ్ఞేలాలీ లీలాజ్ఞేయా ॥

## చతుష్షష్టి పదయంత్రము

శ్లో॥ లిఖేచ్చతుఃషష్టి పదేషు విద్వానీశాది కన్యాది రమామనుంతం
బాహ్యేయథావత్ త్వరితాభివీతం లాంతైశ్చవీతం వరకాంచనస్థమ్।
దేశేపురేవా నగరేగృహేవా వినిఃక్షిపే చ్చక్రమిదంయథావత్
తత్రధృవం గోమహిషాభివృద్ధిః సమ్యక్ ప్రజాసస్యసమృద్ధయఃస్యుః
కవచం భగవాంశ్చండో మేరుఃసర్గసమన్వితః
త్రికంటకీ సమాఖ్యాతా విద్యావర్ణ త్రయాత్మికా ।
ద్విరుక్తై ర్మంత్రవర్ణైః స్యాదంగక్లుప్తి రితీరితా
త్రిలక్ష ప్రజపేదేనా మాజ్యేనాం తే దశాంశతః ।
హుత్వాప్రాక్ ప్రోక్తమార్గేణ పూజయేత్తాం త్రికంటకీమ్
త్రిశూలముద్రాం పాణిభ్యాం బద్ధాత్మానం త్రికంటకీమ్ ।
ధ్యాయిన్ స్పృష్ట్వా జపేద్గ్రస్తం సద్యస్తం ముంచతిగ్రహః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ముందు చెప్పిన 64 అక్షరముల "శ్రీమంత్రము"ను 64 గడుల చతురస్రము నిర్మించి అందు లిఖించి, బయట నాలుగువైపులా త్వరితా మంత్రము, చివర వషట్‌తో లిఖించాలి.

ఈ యంత్రమును బంగారు పాత్రలోనుంచి గ్రామమునందుగాని, నగరమునందుగాని, దేశరాజధానిలోగాని పాతిపెట్టినచో పాడిపంటలు వృద్ధిచెంది, ప్రజలు సుఖముగా జీవింతురు. చతుష్షష్టిప్రదయంత్రము ఇట్లుండును.

ఓం హ్రీం హుం ఖే చ ఛే క్షః స్త్రీ హుం క్షేహ్రీం వషట్

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీ | సా | మా | యా | యా | మా | సా | శ్రీ |
| సా | నో | యా | జ్ఞే | జ్ఞే | యా | నో | సా |
| మా | యా | లీ | లా | లా | లీ | యా | మా |
| యా | జ్ఞే | లా | లీ | లీ | లా | జ్ఞే | యా |
| యా | జ్ఞే | లా | లీ | లీ | లా | జ్ఞే | యా |
| మా | యా | లీ | లా | లా | లీ | యా | మా |
| సా | నో | యా | జ్ఞే | జ్ఞే | యా | నో | సా |
| శ్రీ | సా | మా | యా | యా | మా | సా | శ్రీ |

ఓం హ్రీం హుం ఖే చ ఛే క్షః స్త్రీ హుం క్షేహ్రీం వషట్
ఓం హ్రీం హుం ఖే చ ఛే క్షః స్త్రీ హుం క్షేహ్రీం వషట్
ఓం హ్రీం హుం ఖే చ ఛే క్షః స్త్రీ హుం క్షేహ్రీం వషట్

# త్రికంటకీ మంత్రము

**త్రికంటకీ విద్యామంత్రము : హుం - ఖే - క్షః।**

ఈ మంత్రము రెండు ఆవృత్తములలో ఉచ్చరించి షడంగన్యాసమును ఆచరించాలి. ధ్యానము ఈ విధముగా చేయాలి.

శ్లో॥ లీలానాభేరథస్తాదరుణరుచిరథః కంఠదేశాత్సితాఽఽస్యాద్
వక్త్రైర్దంష్ట్రా కరాళైరుదపరిగతైర్భీషణాంగీం చతుర్భిః ।

దీపౌ కంబురథాంగం కరసరసిరుహై ర్ధారయంతీజటాంతః
స్ఫూర్జత్ శీతాంశుఖండా భవతు భయహరాదేవతావః త్రినేత్రా॥

ఈ మంత్రమును మూడు లక్షలు జపించి, దశాంశహోమముతో పురశ్చరణ చేసిన సిద్ధించును. మంత్రసిద్ధిని పొందిన సాధకుడు రెండు చేతులతో త్రిశూలముద్ర ధరించి, మంత్రజపముచేసి, పిశాచగ్రస్త పురుషుని స్పర్శచేసినచో అది తొలగిపోవును.

త్రిశూలముద్ర - రెండు చేతుల అంగుష్ఠములు, రెండు చిటికెన వ్రేళ్ళతో కలిపి, మిగిలిన మూడువ్రేళ్ళను పైకి చాపిన త్రిశూలాకారములో ఏర్పడును. దీనినే త్రిశూలముద్ర అందురు.

## వశ్యాత్రికంటకీ మంత్రము

శ్లో॥ క్లైరుద్ధాస్త్రీ త్రివర్ణేయం విద్యావశ్యాత్రికంటకీ
మంత్రార్ణై ర్వ్యిప్సితైః కుర్యా దంగషట్కం యథాపురా ।
పూర్వోక్తాం దేవతాం ధ్యాయన్ మంత్రంత్రినియుతం జపేత్
దశాంశం సర్పిషాహుత్వా వశయేద్వనితాంనరాన్ ।
తారోమాయా వాగ్భవాంతే నిత్యక్లిన్నేమదద్రవే
వాంజగ్మాయా వహ్ని జాయాంతో మంత్రః పంచదశాక్షరః
ద్వాభ్యాంద్వాభ్యాం పునర్ ద్వాభ్యాం ద్వాభ్యాంపంచభిరక్షరైః
వాచంవినా సమస్తేనా ప్యంగషట్కమథాచరేత్ ।
త్రిలక్షం ప్రజపేన్మంత్రం ఆజ్యేన జుహుయాత్త తః
దశాంశం పూజ యేత్పీఠం చతుఃశక్తి సమన్వితమ్ ।
ఆంపూర్వాం ద్రావిణీం వామాం శంభుకోణే సమర్చయేత్
ఆహ్లాదకారిణీం జ్యేష్ఠామీంకారాద్యాం హుతాశనే ।

పూజయేత్ క్షోభిణీం రౌద్రీ ముూంకారాద్యాం నిశాచరే
మధ్యేయజేత్ గుహ్యాశక్తిం వాగ్భవాద్యాం విచక్షణః ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - మూడక్షరముల "వశ్యత్రికంటకీ" మంత్రము వివరింపబడుచున్నది. ఇది రెండావృత్తములతో జపించి షడంగన్యాసము చేయాలి.

**మనుః - క్షేం స్త్రీం క్షేం।**

ఈ మంత్రమునకు ధ్యానము పూర్వమువలెనే చేయవలయును. మూడులక్షలు జపించి, నేతితో దశాంశహోమము పురశ్చరణ చేసిన సిద్ధించును. సకల స్త్రీ పురుషులను వశ్యము చేసుకొనగల మంత్రమిది.

## నిత్యామంత్రము

15 అక్షరముల "నిత్యా" మంత్రము ఇట్లుండును.

**మనుః - ఓం హ్రీం ఐం నిత్యక్లిన్నే మదద్రవే ఐం హ్రీం స్వాహా॥**

| | | |
|---|---|---|
| ఓం హ్రీం | - | హృదయాయ నమ |
| ఐంని | - | శిరసే స్వాహా। |
| త్యక్లి | - | శిఖ్యాఐవషట్। |
| న్నేమ | - | కవచాయహుం। |
| దద్రవే ఐంహ్రీం | - | నేత్రద్వయాయ వౌషట్। |
| పూర్తిమూలమంత్రం | - | అస్త్రాయ ఫట్। |

అని షడంగన్యాసమాచరించి, ఇలా ధ్యానించాలి.

శ్లో॥ ద్వీపంత్రికోణం విపులం సురద్రుమ మనోహరం
కూజత్ కోకిల నాదాఢ్యం మందంమారుత సేవితమ్ ।

భృంగపుష్పలతాకీర్ణ ముద్యచ్చంద్ర దివాకరం
స్మృత్వాసురాబ్ధిమధ్యస్థం తస్మిన్మాణిక్యమండపే ।
రత్నసింహాసనేన్యస్తే త్రికోణజ్వల కర్ణికే
పద్మేసంచింతయేద్దేవీం సాక్షాత్ త్రైలోక్యమోహినీమ్ ।
నిత్యాంభజేత్ బాల శశాంక చూడాం
పాశాంకుశౌ కల్పలతాం కపాలమ్ ।
హస్తైర్వహంతీమరుణాంత్రినేత్రాం
ఆస్థాలయంతీం కలవల్లకీంతామ్ ॥

ఈ విధముగా ధ్యానించి, మూడు లక్షలు జపించి, నేతితో దశాంశ హోమం చేయాలి. పూజయందు నాలుగు శక్తులను అర్చించాలి. త్రికోణ పీఠములో

ఈశాన్యమందు - అంద్రావిణ్యై వామాయై నమః ।

ఆగ్నేయమందు - ఈం ఆహ్లాదకారిణ్యై జ్యేష్ఠాయై నమః ।

నైరుతియందు - ఊం క్షోభిణ్యై రౌద్ర్యై నమః ।

మధ్యలో - ఐం గుహ్య శక్త్యై నమః । అని అర్చించాలి.

శ్లో॥ మాయాద్యమాసనందత్వా మూర్తింమూలేన కల్పయేత్
అత్రసంపూజ యేద్దేవీం వక్ష్యమాణ క్రమేణతు ।
అంగార్చనం కేసరేషు దళేష్వేతాః సమర్చయేత్
ఆద్యానిత్యా సుభద్రాఽన్యా మంగళా నరవీరిణీ ।
సుభగాదుర్భగాభూయః సప్తమీస్యాన్మనోన్మనీ
అష్టమీ రుద్రరూపాచ వీణావాదన తత్పరాః ।
రక్తామనోరమా దూత్యః సువేషామద మంథరాః
ఆద్యంతయుగ్మ రహితాః స్వరాః క్లీ బవివర్జితాః ।

బింద్వంతా మనవస్తాసామనంగస్మర మన్మథాః
కామోమారశ్చ పంచేషు పాశాంకుశధనుర్భృతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట "హ్రీం సర్వశక్త్యాత్మనే నమః" అను మంత్రముతో ఆసనము సమర్పించి, మూలమంత్రముతో ఆవాహన చేయాలి.

వీణను ప్రయోగించు 8 శక్తులను అష్టదళములందు పూజించాలి. 1. నిత్యా 2. సుభద్రా 3. మంగళా 4. నరవీరిణి 5. సుభగా 6. దుర్భగా 7. మనోన్మనీ 8. రుద్రా, వీరు ఎర్రని శరీరముతో మనోహరముగా నుందురు. వీరు దూతికలు. కామమదాలసలు అ – ఆ – అం – అః – ఋ – ౠ ఌ ౡ– ఈ 8 అక్షరములు వర్జించి, మిగిలిన 8 అచ్చులతో వీరి మంత్రములు ఇట్లుండును.

**ఇం ఆద్యాయై నిత్యాయై నమః ।**
**ఈం సుభద్రాయై నమః ।**
**ఉం మంగళాయై నమః ।**
**ఊం నరవీరిణ్యై నమః ।**
**ఎం సుభగాయై నమః ।**
**ఐం దుర్భగాయై నమః ।**
**ఓం మనోన్మన్యై నమః ।**
**ఔం రుద్రాయై నమః (ఓం రౌద్ర్యై నమః)**

పిమ్మట అష్టదళ పద్మమునకు నాలుగువైపులా అనంగ – స్మర – మన్మధ – కామ – మారులను 5గురినీ పూజించాలి. వీరంతా పంచ బాణములు, పాశాంకుశ ధనుస్సులు ధరించి యుందురు.

శ్లో॥ అపరాంగ నిషంగాఢ్యా రక్తాః పూజ్యాః సుభూషణాః
మాన్మథంవ్యోమ సర్గాఢ్యం తేషాంబీజముదాహృతమ్ ।

రతిఃస్యాద్విరతిః ప్రీతిర్విప్రీతి ర్మతి దుర్మతీ
ధృతిశ్చ విధృతి స్తుష్టి ర్వితుష్టిశ్చ దశస్మృతాః ।
రక్తా వీణాకరాద్వేద్వే కామానాం పార్శ్వయోః స్థితాః
సర్వాభరణ సంపన్నాః పూజ్యాః స్మేరముఖాంబుజాః ।
కీ&అబేష్ఠ ద్వయనిర్ముక్త ఖరాఢ్య శ్చతురాననః
బిందుమాన్ బీజమేతాసాం క్రమాల్లోకేశ్వరాన్ బహిః ।
ఏవం సంపూజయేద్దేవం దేవానామపి దుర్లభాం
పరమేశ్వర్య మాప్నోతి ప్రార్థ్యతే వనితాజనైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అయిదుగురు కామదేవులకూ ఇద్దరు చొప్పున, భార్యలు కలరు. వీరి పదిమంది పేర్లు ఇట్లుండును. 1. రతి 2. విరతి 3. ప్రీతి 4. విప్రీతి 5. మతి 6. దుర్మతి 7. ధృతి 8. విధృతి 9. తుష్టి 10. వితూష్టి. వీరంతా వీణాధారిణులై, అలంకారములు ధరించి, మందహాసముతో నుందురు. కామదేవునికి ఇరుప్రక్కలా ఇద్దరు భార్యలనూ అర్చించవలయును.

వీరి బీజాక్షరములు పదిమందికీ ఇలా ఉండును. జం – జాం – జిం – జీం – జుం – జూం – – జోం – జౌం – జం – జః, వీరిని పూజించిన పిమ్మట అష్టదళపద్మమునకు బయట, ఇంద్రాదులను, వారి ఆయుధములను అర్చించాలి. ఇట్టి సాధకుడు సంపత్ సౌభాగ్య సంతోషములను పొంది త్వరితాశక్తి అనుగ్రహమును పొందును.

## మరొక త్వరితా మంత్రము

శ్లో॥ వాగ్భవం మాన్మథం బీజం నిత్యక్లిన్నే మదౌపునః
ద్రవేవహ్నా వధూమంత్రో ద్వాదశార్ణోయమీరితః ॥

ఋషిస్సమ్మోహనశ్ఛందో నివృన్నిత్యాచ దేవతా
వాచాకృత్వా షడంగాని నిత్యాంధ్యాయేన్నిజేష్టదామ్ ।
చతుర్లక్షం జపిత్వాంఽతే మధురాక్తైర్మధూకజైః
కుసుమైరయుతం హుత్వాతోష యేద్ గురుమాత్మనః ।
శక్తిపీఠే యజేద్దేవీం వక్ష్యమాణేన వర్త్మనా
అంగాన్యర్చేద్యథా పూర్వం తతఃశక్తీరిమా యజేత్ ।
నిత్యానిరంజనా క్లిన్నా క్లేదినీ మదనాతురా
మదద్రవా ద్రావిణీ చ ద్రవిణోత్యష్ట శక్తయః ।
నీలోత్పల కపాలాఢ్య కరా రక్తాంబుజేక్షణాః
లోకపాలాన్ యజేదంత్యే వాహనాయుధ సంయుతాన్ ।
సిద్ధమంత్రం జపేన్మంత్రీ సహస్రంశయనస్థితః
యాంవిచింత్య స్త్రియంరాత్రౌ సాసమాయాతి తక్షణాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మరొకత్వరితామంత్రము "ద్వాదశాక్షరి" చెప్పబడుచున్నది.

**మనుః – "ఐంక్లీం నిత్యక్లిన్నే మదద్రవే స్వాహా ।**

ఈ మంత్రమునకు సమ్మోహన ఋషిః – నివృత్ ఛందః – నిత్యాదేవతా – ఐం బీజముతో షడంగన్యాసములాచరించాలి. క్లాం క్లీ ఇత్యాదిషడ్ దీర్ఘ బీజములతో షడంగన్యాసము చేయాలని పరమగురువులు చెప్పినట్లు రాఘవభట్టు తన సంస్కృతవ్యాఖ్యానములో పేర్కొన్నాడు. త్వరితను ఇలా ధ్యానించాలి.

## వజ్రప్రస్తారిణీ మంత్రము

శ్లో॥ వాఙ్మయానంతరం నిత్యే భూయో క్లిన్నేమదద్రవే
ద్విఠోంతో రవిసంఖ్యార్ణో మనుర్వశ్య ప్రదాయకః ।

అంగిరాః స్యాదృషిస్త్రిష్టుప్ ఛందో మునిభిరీరితం
వజ్రప్రస్తారిణీ ప్రోక్తా దేవతాభీష్టదాయినీ ।
వాగ్భవేన షడంగాని విదధ్యాన్మంత్ర విత్తమః
వజ్రప్రస్తారిణీం ధ్యాయేత్ సమాహిత మనాతతః ।
మంత్రీమంత్రం జపేల్లక్షం జపాంతేజుహు యాత్తతః
అయుతం రాజవృక్షోత్థైః ఘృతసిక్తైః సమిద్వరైః ।
శక్తిపీఠే యజేద్దేవీ మరుణైః కుసుమాదిభిః
అంగాని కేసరేషు స్యురర్చనీయా దళేష్విమాః ।
హృల్లేఖా క్లేదినీ క్లిన్నా క్షోభిణీ మదనాతురా
నిరంజనా రాగవతీ సప్తమీ మదనావతీ ।
మేఖలాద్రావిణీ పశ్చాద్వేగవత్యపరా స్మృతా
కపాలోత్పల ధారిణ్యాః శక్తయోరక్త విగ్రహాః ।
మాతరోదిగ్ విదిక్షు అర్చ్యాః పునః పూజ్యా దిగీశ్వరాః
భజేన్మంత్రీ మనుం నిత్య మర్చనాదిభిరాదరాత్ ।
దారిద్ర్యరోగనిర్ముక్తః సజీవేద్ శారదాంశతం ।
అస్మిన్మంత్రే రతో మంత్రీ వశయేదఖిలం జగత్ ॥
నిత్యంమంత్రై ర్పృథఃకుర్యాన్ముఖక్షాల న మన్వహం
అంజనం తిలకం పుణ్యం ధారయేన్మంత్రితం సుధీః ।
తాంబూలం మంత్రితంభక్ష్యేన్మంత్రితం సుధీః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – వజ్రప్రస్తారిణీ దేవిమంత్రము ద్వాదశాక్షరి చెప్పబడుచున్నది.

**మనుః – ఐంహ్రీం నిత్యక్లిన్నే మదద్రవే స్వాహా।**

ఈ మంత్రమునకు ఋషి అంగిరసుడు, ఛందస్సుత్రిష్టుప్, వజ్రప్రస్తారిణీ దేవత. ఐంబీజముతో షడంగములు చేసి ఇలా ధ్యానించాలి.

## ధ్యానశ్లోకం

**రక్తా బ్ధౌరక్తపోతే రవిదళకమలాభ్యంతరే సన్నిషణ్ణాం**
**రక్తాంగీ రక్తమౌళి స్ఫురిత శశికలాం స్మేరవక్త్రాంత్రినేత్రామ్।**
**బీజాపూరేషు పాశాంకుశమదనధనుః సత్కపాలాని హస్తైః**
**బిభ్రాణామానతాంగీ స్తనభర నమితామంచికామా శ్రయామః**

పై మంత్రము లక్ష జపించి, ఘృతముతో రాజవృక్ష సమిధలు పదివేలు హోమం చేయాలి. శక్తిపీఠమందు ఎర్రని పూలతో దేవిని పూజించి, 12 దళములందు అంగశక్తులను అర్చించాలి. 1. హృల్లేఖా 2. క్లేదిని 3. క్లిన్నా 4. క్షోభిణీ 5. మదనాతురా 6. నిరంజనా 7. రాగవతీ 8. మదనావతి 9. మేఖలా 10. ద్రావిణీ 11. వేగవతీ 12. స్మరా

వీరంతా ఎర్రనికమలములు, కపాలము ధరించి, ఎర్రని దేహముతో నుందురు. బయట నాలుగువైపులా, నాలుగు కోణములందూ అష్టమాతృకలను అర్చించాలి. దానికి వెలుపల అస్త్రవాహన సహిత దిక్పాలకుల నర్చించాలి. ఈ విధముగా పురశ్చరణ చేసిన సాధకుడు దారిద్ర్య రోగముక్తుడై, దీర్ఘాయువుగా సంపదతో జీవించును.

సాధకుడు ఈ మంత్రము జపించుచూ, ముఖప్రక్షాళన ప్రతినిత్యమూ చేసుకొన్నచో అభిమంత్రించి తిలకముధరించిననూ, అభిమంత్రిత తాంబూల భక్షణ (చర్వణం) చేసిననూ, సర్వజనులూ అనుకూలముగా నుందురు.

# త్రైపుట మంత్రము

శ్లో॥ శ్రీమాయా మదనైః ప్రోక్తో మంత్రీబీజత్రయాత్మకః
ఋషిః సమ్మోహనశ్ఛందో గాయత్రీ దేవతా మనోః ।
త్రిపుటాఖ్యా ద్విరుక్తైః బీజైరంగాని షట్క్రమాత్ ।
పారిజాతవనే రమ్యే మండపే మణికుట్టిమే
రత్నసింహాసనే సౌమ్యే పద్మే షట్కోణశోభితే ।
అధస్తాత్ కల్పవృక్షస్య నిషణ్ణాం దేవతాంస్మరేత్
చామరా దర్శతాంబూల కరండక సముద్గకాన్ ।
కరుణామృత వర్షిణ్యా పశ్యంతీం సాధకం దృశా
ఖానులక్షం జపేదేనం మనుం తావత్ సహస్రకమ్ ।
బిల్వారగ్వధసంభూతై ర్మధురాక్తైః సమిద్వరైః
జపాపుష్పైశ్చ జుహుయాత్తోషయేద్వసునా గురుమ్ ।
హృల్లేఖావిహితేపీఠే పూజయేత్తాం విధానతః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – త్రిపుటా మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : శ్రీం హ్రీం క్లీం।**

ఈ మంత్రమునకు, సమ్మోహన ఋషిః – గాయత్రీఛందః – త్రిపుటా దేవతా । మూలముతో 2 ఆవృతలలో షడంగన్యాసము చేయాలి.

## ధ్యానశ్లోకం

చాపం పాశాంబుజ సరసిజాన్యంకుశం పుష్పబాణాన్
బిభ్రాణాంతాం కరసరసిజై రత్నమౌళిం త్రినేత్రామ్ ।

హేమాబ్జాభాం కుచభరనతాం రత్నమంజీర కాంచీ
గ్రైవేయద్యై ర్విలసితతనుం భావయేచ్ఛక్తిమాద్యామ్ ॥
పారిజాతవనేరమ్యే మండపే మణికుట్టిమే
రత్న సింహాసనే సౌమ్యే పద్మే షట్కోణశోభితే ।
అధస్తాః కల్పవృక్షస్య నిషణ్ణాం దేవతాంస్మరేత్ ॥

ఈ త్రిపుటాదేవికి ఇరువైపులా చామరములు, దర్పణు, గంధపాత్ర, తాంబూల పేటిక ధరించి ఘృణినీ - సూర్యా - ఆదిత్యా - ప్రభావతీ అనే నలుగురు దూతికలు పరివేష్టించి యుందురు. త్రిపుటాదేవి సాధకుని దయతో చూచుచుండును.

ఈ మంత్రమును 12 లక్షలు జపించి, త్రిమధురయుక్త బిల్వ - రాజవృక్ష సమిధలతో, మందారపూలతో 12వేలు హోమం చేయాలి. గురుదక్షిణ సమర్పించాలి.

హృల్లేఖతో (హ్రీం) పీఠపూజ చేయాలి.

శ్లో॥ లక్ష్మీం హేమప్రభాంతన్వీం సహాబ్జయుగాభయదా
చక్రశంఖగదాంభోజధరం హేమనిభం హరిమ్ ।
పాశాంకుశాభీష్ట ధరాం గౌరీం జపారుణాం
మృగటంకాభయాభీష్ట ధరం స్వర్ణ నిభం హరమ్ ।
నీలోత్పలకరాం సౌమ్యాం రతింకాంచన సన్నిభామ్ ।
ధృతపాశాంకుశేష్వాస పుష్పేషు మరుణం స్మరం
పూర్వవన్నిథియుగ్మం తద్యజేదుభయ పార్శ్వయోః ।
బహిరంగాని సంపూజ్య పూజ్యాః పత్రేషు మాతరః
లోకేశాన్ వనితా రూపానర్చయేత్ సౌమ్య విగ్రహాన్ ।
ఇత్థంయః పూజయేద్దేవీం నిత్యం భక్తి సమన్వితః

సంప్రాప్య కవితాం దివ్యాం ప్రాప్యలక్ష్మీమనంతరామ్ ।
సౌభాగ్యమతులం లబ్ధ్వా విహరేత్ సుచిరంభువి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఆగ్నేయాది షట్కోణము లందు లక్ష్మి మొదలగు శక్తులను పూజించాలి. సువర్ణవర్ణ దేహముతో కమలాభము శంఖచ్రగదాధారి అయిన విష్ణువును లక్ష్మీసమేతముగా అర్చించాలి.

నైరుతియందు పాశాంకుశవరాభయ ముద్రలు ధరించి, జపాపుష్ప కాంతిలోనుండు గౌరిని, మరియు మృగపరశు వరాభయముద్రలు ధరించి బంగారు వర్ణములో నుండు హరుని అర్చించాలి. పిమ్మట నీలకమలము ధరించి కాంచన వర్ణముతో నుండు రతిని, మరియు పాశాంకుశ ధనుర్బాణ (పుష్పబాణములు) ధరించియుండు, అరుణ వర్ణములోనుండు మన్మథునీ పూజించాలి.

పిమ్మట దళముందు అష్టమాతృకలను, దానికి బయట, స్త్రీ రూపములో లోకపాలకులను అర్చించాలి. సిద్ధి పొందిన సాధకుడు గొప్ప కవిత్వశక్తిని, ఐశ్వర్యమును, దీర్ఘాయువును పొందును.

## అశ్వారూఢా మంత్రము

శ్లో॥ పాశాంకుశపుటా శక్తిర్షింటీశో గగనంసదృక్
పరమేశ్వరి శబ్దాంతే ద్వితాంతః ప్రణవాదికః ।
అశ్వారూఢామనుః ప్రోక్త స్త్రయోదశభిరక్షరైః
ద్వాభ్యామేకేన చైకేన ద్వాభ్యాం పంచభిరక్షరైః ।
ద్వాభ్యామంగాని షట్కుర్యాత్ తతోదేవీం విచింతయేత్ ।
బాణలక్షం జపేన్మంత్ర మాజ్యేనాంఽతే జితేంద్రియః ॥

దశాంశం జుహుయాద్దేవీం శక్తిపీఠే సమర్చయేత్
పాశాదిత్ర్యక్షరోక్తేన విధానేన సమాహితః ।
ఆజ్యాధాన్నహుతాన్మంత్రీ లభతే వాంఛితం ఫలమ్ ।
లవణైర్మధుసంసిక్తై ర్హోమేన వశయేత్ నృపాన్
తేనైవ విధినా మంత్రీ వశయేద్వనితామపి ।
ఆలిఖ్యకోష్ఠాని వికారసంఖ్యాన్యంతశ్చతుష్కే ప్రణవం ససాధ్యం।
అన్యేష్వపి ద్వాదశ మంత్రవర్ణాన్ లిఖేదిదం యంత్రమశేషవశ్యమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అశ్వారూఢ మంత్రము "త్రయోదశాక్షరి" వివరింపబడుచున్నది.

**మనుః : ఓం ఆం క్రోంహ్రీం ఏ హి పరమేశ్వరి స్వాహా।**

2 + 1 + 1 + 2 + 5 + 2 అక్షరములతో షడంగన్యాసము ఆచరించాలి. ఇలా ధ్యానించాలి.

## ధ్యానశ్లోకం

శ్లో॥ రక్తామశ్వాధిరూఢాం శశధరశకలాం బద్ధమౌళింత్రినేత్రాం
పాశేనాబధ్యసాధ్యాం స్మరశరవివశాం దక్షిణేనానయంతీమ్।
హస్తేనాఽన్యేన వేత్రం వరకనకమయం ధారయంతీంమనోజ్ఞాం
దేవీం ధ్యాయేదజస్రం కుచభరనమితాం దివ్యహారాభిరామామ్ ॥

ఈ మంత్రమును అయిదు లక్షలు జపించి, నేతితో దశాంశహోమం ఆచరించాలి. శక్తిపీఠమందు అర్చన చేయాలి. కేవలం ఆంక్రోంహ్రీం బీజత్రయముతో ఘృతమిశ్రిత అన్నమును హోమం చేసినచో, అభీష్టము సిద్ధించును.

లవణమిశ్రిత అన్నము, లేదా మధుమిశ్రిత అన్నము హోమం చేసిన అధికారవశ్యము, స్త్రీవశ్యమూ సిద్ధించును.

**16** గడులతో చతురస్రము నిర్మించి, చివరి నాలుగు గడులందు ప్రణవసహిత సాధ్య - కార్య - సాధకాక్షరములు లిఖించి, మిగిలిన **12** గడులందు, మంత్రములోని **12** అక్షరములు క్రమముగా వ్రాసి ధరించిన అభీష్టము సిద్ధించును. సర్వవశ్యమగును.

## అన్నపూర్ణా మంత్రము

శ్లో॥ మాయాహృద్ భగవత్యంతే మహేశ్వరి పదం వదేత్
అన్నపూర్ణే ఠయుగళం మనుః సప్తదశాక్షరః ।
అంగానిమాయయాకుర్యాత్తతో దేవీం విచింతయేత్
యధావిధి జపేన్మంత్రం వసుయుగ్మ సహస్రకమ్ ।
సాజ్యేనాఽన్నేన జుహుయాత్ తద్దశాంశమనంతరం
శక్తిపీఠే యజేద్దేవీ మంగలోకేశ్వరాయుధైః
ప్రాతరేనం జపేన్మంత్రం నిత్యమష్టోత్తరం శతమ్ ।
ఏతస్యాఽన్నసమృద్ధిః స్యాచ్ఛ్రియా సహ మహీయసీ
మాయా పద్మావతిపదం తతః పావకవల్లభా ।
సప్తార్ణో మనురాఖ్యాతః సర్వవశ్యప్రదాయకః
అంగానిమాయ యా కుర్యాత్ ధ్యాయేత్ త్రైలోక్య మోహినీమ్ ।
పంచలక్షం జపేన్మంత్రం దశాంశం జుహుయాత్ ఘృతైః
శక్తిపీఠే యజేద్దేవీ మంగాద్యావరణై స్సహ ।
కింజల్కేష్వంగ పూజాస్యాత్ పూజ్యాః పత్రేషు మాతరః
లోకపాలాః బహిః పూజ్యాః తదస్త్రాణితతో బహిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సప్తదశాక్షరి అన్నపూర్ణా మంత్రము వివరింపబడుచున్నది.

**మనుః : హ్రీం నమః భగవతి మాహేశ్వరి అన్నపూర్ణే స్వాహా ।**

బ్రహ్మఋషిః - అనుష్టుప్ ఛందః - హ్రీంబీజం - స్వాహా శక్తిః, హ్రాం హ్రీం ఇత్యాది మాయాదీర్ఘ బీజములతో షడంగన్యాసము. ఇలా ధ్యానించాలి.

శ్లో॥ రక్తాం విచిత్ర వసనాం నవ చంద్రచూడాం
అన్నప్రదాన నిరతాం స్తనభార నమ్రామ్ ।
నృత్యంత మిందుశకలాభరణం విలోక్య
హృష్టాం భజేత్ భగవతీం భవదుఃఖ హంత్రీమ్ ॥

ఈ మంత్రము 16 లక్షలు జపించి, ఆజ్య సహిత అన్నము 16 వేలు హోమం చేయాలి. శక్తిపీఠమందు అంగములను, వాహన ఆయుధ సహిత దిక్పాలకులను అర్చించాలి. ప్రతినిత్యము 108సార్లు మూలమంత్రము జపించిన అన్నసమృద్ధి, సంపద కలుగును.

## పద్మావతీ మంత్రము

సప్తాక్షర పద్మావతీ మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : హ్రీం పద్మావతి స్వాహా । బ్రహ్మా - ఋషిః, గాయత్రీఛందః హ్రీంబిజం - స్వాహా శక్తిః, హ్రీం బిజముతో షడంగ న్యాసములు చేసి ఇలా ధ్యానించాలి.**

శ్లో॥ పద్మాసనస్థాం కరపంక జాభ్యాం
రక్తోత్పలే సందధతీం త్రినేత్రామ్ ।
ఆ బిభ్రతీమాభరణానిరక్తాం
పద్మావతీం పద్మముఖీం భజామి ।

ఈ మంత్రమును 2 లక్షలు జపించి, నేతితో దశాంశహోమము చేయాలి. శక్తిపీఠమందు అంగాది ఆవరణార్చన చేయాలి. కేసరములందు

అంగపూజ - పత్రములందు మాతృకలు, బయ లోకపాలకులు, దానికి బయట వారి వాహన ఆయుధములను అర్చించాలి. సాధకుడు ఆకర్షణశక్తి పొందును.

## పద్మావతీ యంత్రము

శ్లో॥ షడస్రమధ్యే ప్రవిలిఖ్యశక్తిం కోణేషు శిష్టాని షడక్షరాణి
తద్బాహ్యతో మాతృకయాఽభివీతం పద్మావతీయంత్రమిదం ప్రశస్తమ్
తారం శిరసి విన్యస్య దేవీం సంచింత్యభారతీం
శక్తిబీజం న్యసేద్భాలే సంస్మృత్య భువనేశ్వరీమ్ ।
అమసౌ నేత్రయోర్న్యస్యేత్ ధ్యాత్వా సూర్యంహుతాశనం
ముఖవృత్తేన విన్యస్యేట్ఠాంతం చంద్రమనుస్మరన్ ।
జిహ్వాయాం విన్యసేద్బీజం రామాయాస్తాం విచింతయన్
స్వాహార్ణౌ గండయోర్న్యస్యేత్ తద్గజేంద్ర ధియాసుధీః ।
అమరం న్యాసమాఖ్యాతం కుర్వన్ ప్రతిదినం నరః
కీర్తి శ్రీకాంతి మేధానాం వల్లభో భవతిధ్రువమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణమునిర్మించి మధ్యలో హ్రీం లిఖించి, కోణములందు పద్మావతీ మంత్ర శేషాక్షరములను లిఖించి, నాలుగువైపులా 51 అక్షరముల మాతృక వేష్టితం చేయాలి.

ప్రణవముతో శిరమందు న్యాసం చేయాలి. భువనేశ్వరిని ధ్యానించి హ్రీం బీజమును లలాటమందు, సూర్యాగ్నులను ధ్యానించి అం - అః లను రెండు నేత్రములందు, చంద్రుని ధ్యానించి ఠంబీజమును ముఖవృత్తము నందు న్యాసము చేయాలి.

మహాలక్ష్మిని ధ్యానించి శ్రీం బీజమును, నాలుకయందు, లక్ష్మియొక్క రెండు గజములను ధ్యానించి "స్వాహా" శబ్దమును రెండు చెక్కిళ్లయందు

న్యాసం చేయాలి. దీనిని "అమర" న్యాసం అంటారు. దీనిని రోజూ ఆచరించిన కీర్తి - సంపద వృద్ధి చెందును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకే తంత్రే*
*దశమః పటలః సమాప్తః*

❖❖❖

# అథైకాదశః పటలః

## అథ దుర్గా ప్రకరణమ్

శ్లో॥ తతోదుర్గామనుం వక్ష్యే దృష్టాదృష్ట ఫలప్రదం
మాయాఽత్రిః కర్ణబింద్వాఢ్యో భూయోఽసౌ సర్గవాన్ భవేత్।
పంచాంతకః ప్రతిష్ఠావాన్ మారుతో భౌతికాసనః
తారాది హృదయాంతోఽయం మంత్రోవస్వ క్షరాత్మకః ।
ఋషిశ్చనారదశ్ఛందో గాయత్రం దేవతా మనోః
దుర్గా సమీరితా సద్భిర్దురితాపన్ని వారిణీ ।
నమస్కారవియుక్తేన మూలమంత్రేణ సాధకః
హ్రామాద్యై స్వహ కుర్వీతషడంగాని యధావిధి ।
వసులక్షం జపేన్మంత్రం తిలైర్మధురలోలితైః
పయోంధసావా జుహుయాత్తత్ సహస్రం జితేంద్రియః ।
పీఠమిత్థం యజేత్ సమ్యక్ నవశక్తి సమన్వితం
ప్రభామాయాజయాసుక్ష్మా విశుద్ధానందినీపునః ।
సుప్రభావిజయా సర్వసిద్ధిదా నవశక్తయః
అజ్భిర్ హ్రస్వత్రయక్లీబరహితైః పూజయేదిమాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అష్టాక్షర దుర్గామంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం హ్రీం దుందుర్గాయై నమః ।**

**ఋషిః – నారదః, గాయత్రీఛందః, దురితాపన్నిహారిణీ దుర్గాదేవతా,** హ్రాం – హ్రీం ఇత్యాది షడంగన్యాసము

ఉదా – ఓం హ్రీందుం దుర్గాయైహ్రాం హృదయాయ నమః ।

## ధ్యానశ్లోకం

**సింహస్థా శశిశేఖరా మరకత ప్రఖ్యై శ్చతుర్భిర్భుజైః**
**శంఖం చక్రధనుశ్శరాంశ్చ దధతీ నేత్రైస్త్రిభిః శోభితా ।**
**ఆముక్తాంగద హారకంకణ రణత్కాంచీరణ న్నూపురా**
**దుర్గాదుర్గతి హారిణీ భవతువో రత్నోల్లసత్ కుండలా ॥**

సకల దుర్గామంత్రముల సాధనయందు, ధ్యానాంతరం ఈ దుర్గాముద్ర ప్రదర్శించాలి

☞ **ముష్టింబధ్వా కరాభ్యాం తు వామస్యోపరిదక్షిణాం**
**కృత్వాశిరసి సంపూజ్యా దుర్గాముద్రేయ మీరితా ॥**

అనగా రెండు చేతులనూ పిడికిళ్లుగాచేసి, ఎడమ పిడికిలిపై కుడి పిడికిలినుంచి, శిరస్సుపైనుంచి ముద్రను ప్రదర్శించాలి. పిదప ఆయుధ ముద్రలు కూడా ప్రదర్శించవచ్చు.

పై మంత్రమును 8లక్షలు జపించి, త్రిమధుర మిశ్రిత తిలలతోగాని, పాయసముతోగాని 8 వేలు హోమం చేయాలి. నవశక్తులు 1. ప్రభా 2. మాయ 3. జయా 4. సూక్ష్మా 5. విశుద్ధా 6. నందిని 7. సుప్రభా 8. విజయా 9. సిద్ధిదా పీఠమందు అర్చించాలి.

అ – ఇ – ఉ – ఋ – ౠ – ఌ – ౡ అక్షరములు వర్జించి మిగిలిన 9 అచ్చులతో వీరిని పూజించాలి.

ఉదా : ఆం ప్రభాయై నమః, ప్రభాం పూజయామి.

ఈ మాయాయై నమః, మాయాం పూజయామి । ఇత్యాది

శ్లో॥ ప్రణవానంతరం వజ్ర నఖ దంష్ట్రాయుధాయచ
మహాసింహాయ వర్మాస్త్రం నతిః సింహమనుర్మతః ।
దద్యాదాసనమేతేన మూర్తిం మూలేన కల్పయేత్
తస్యాం సంపూజయే న్మూర్తౌ దేవీ మావాహ్య మంత్రవిత్ ।
అంగావృతిం పురాఽభ్యర్చ్య శక్తీః పత్రేషు పూజయేత్
జయాచ విజయాకీర్తిః ప్రీతిః పశ్చాత్ ప్రభాపునః ।
శ్రద్ధామేధా శృతిః ప్రోక్తా స్వనామాద్యక్షరాదికాః
పత్రాగ్రేష్వర్చయే దష్టావాయుధాని యథాక్రమాత్ ।
చక్రశంఖ గదాఖడ్గ పాశాంకుశ శరాన్ ధనుః
లోకేశ్వ రాంస్తతో బాహ్యే తేషామస్త్రాణ్యనంతరమ్ ।
ఇత్థం జపాదిభి ర్మంత్రీ మంత్రేసిద్ధే విధానవిత్
కుర్యాత్ ప్రయోగానేతేన మనునా స్వమనీషితాన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పీఠార్చనలో “ఓం వజ్రనఖ దంష్ట్రాయుధాయ మహా సింహాయ హుంఫట్” అను మంత్రముతో సింహాసనం సమర్పించాలి. మూలమంత్రముతో ఆవాహన చేయాలి. అంగదేవతలను 8 మందిని, దళముందలు 1. జయా 2. విజయా 3. కీర్తి 4. ప్రీతి 5. ప్రభా 6. శ్రద్ధా 7. మేధా 8. శృతి, అర్చించాలి. వీరి ప్రథమాక్షరములకు బిందువు చేర్చి పూజించాలి. ఉదా : జం జయాయై నమః, విం విజయాయై నమః ।

వీరు అష్టబుజములందూ చక్ర – శంఖ – గదా – ఖడ్గ – పాశ – అంకుశ – బాణ – ధనుస్సులు ధరించియుంటారు. పిమ్మట

లోకపాలకులను, వారి వాహన ఆయుధములను అర్చించాలి. మంత్రసిద్ధి పొందిన సాధకుడు ప్రయోగములు సాధించగలడు.

శ్లో॥ ప్రతిష్ఠీయవిధానేన కలశాన్ నవ శోభనాన్
రత్నహస్త్రమాది సంయుక్తాన్ పదేషు నవసుస్థితాన్ ।
మధ్యస్థే పూజయేత్ దేవీ మితరేషు జయాదికాః
సంపూజ్య గంధపుష్పాద్యైరభిషించేన్నరాధిపమ్ ।
రాజావిజయతే శత్రూన్ సాధకోవిజయ శ్రియం
ప్రాప్నోతి రోగీ దీర్ఘాయుః సర్వవ్యాధి వివర్జితః ।
వంధ్యాభిషిక్తా విధినా లభతే తనయంవరం
మంత్రేణాఽనేన సంజప్తమాజ్యం క్షుద్రజ్వరాపహమ్ ।
గర్భిణీనాంవిశేషణ జప్తమాజ్యం క్షుద్రజ్వరాపహమ్ ।
మధ్యేతారే బీజమంతః స్థసాధ్యం పత్రేష్వష్టామంత్రవర్ణాన్ విలిఖ్య
త్రిష్టుబ్వీతం వేష్టితం మాతృకార్ణైర్యంత్రం దౌర్గంభూపురస్థం విదధ్యాత్।
క్షుద్రభూతమహారోగ చేరసర్ప నివారణం
విజయశ్రీపదం పుంసాం గర్భిణీనా సుఖప్రదమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – నవనాభమండలమునందు 9 కలశములు స్థాపించి, అందు పంచరత్నములు, బంగారము, అష్టగంధము ఉంచాలి. మొదట మధ్యనున్న కలశమునందు దేవిని పూజించి, మిగిలిన 8 కలశములందు జయాది 8 మహాశక్తులనూ పూజించాలి. ఈ నవకలశముల జలముతో యజమానిని అభిషేకించిన అతనికి కార్యసిద్ధి కలుగును.

రోగికి అభిషేకించిన ఆరోగ్యము కలుగును. గొడ్రాలిని అభిషేకించిన సుపుత్రుని పొందును. క్షుద్రజ్వరములు తొలగుటకు, సుఖప్రసవమునకు అభిమంత్రిత ఘృతపానము చేయవలయును.

## దుర్గాయంత్రము

అష్టదళపద్మము లిఖించి అందు మధ్యలో ప్రణవ సహిత దుర్గా బీజము, సాధ్య - కర్మ - సాధక నామములు వ్రాయలి. 8 దళములందు దుర్గాయంత్రం వ్రాయాలి. పిమ్మట త్రిష్టుప్ (          ) మంత్రముతో వేష్టితం చేయాలి. భూపురమందు మాతృకాక్షరములు లిఖించాలి.

## మహిషమర్దినీ మంత్రం

శ్లో॥ భాంతం నియత్ సనయనం శ్వేతో మర్ది ని రద్వయం
అష్టాక్షరీయమాఖ్యాతా విద్యామహిషమర్దినీ ।
మహిషహింసకే హుంఫట్ హృదయం పరికీర్తితం
మహిషశత్రో శార్ఙ్గీ హుంఫట్ శిరోంగం సముదాహృతమ్।
మహిషే భీషయద్వంద్వం హుంఫడంతః శిఖామనుః
మహిషం హనయుగ్మాంతే దేవి హుంఫట్ తనుచ్ఛదమ్ ।
మహిషాంతే సూదని హుంఫడంత మస్త్రమీరితం
మంత్రైరేతై ర్జాతియుక్తైః పంచాంగాని ప్రకల్పయేత్ ।
అష్టలక్షం జపేన్మంత్రం తత్ సహస్రంతివైః శుభైః
హుత్వా ప్రాగీరితే పీఠే యజేన్మహిష మర్దినమ్
సంపూజ్యాంఽగాని పత్రేషు దుర్గాఖ్యాం వరవర్ణినీం
ఆర్యాహ్వాయాం తృతీయాం చ చతుర్థీ కనకప్రభామ్ ।
పంచమీం కృత్తికా సంజ్ఞాం షష్ఠీమప్యభయప్రదాం
కన్యాంసురూపాం ప్రభజేన్మంత్రీ దీర్ఘ స్వరైః క్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మహిషమర్దిని "అష్టాక్షర మంత్రము" చెప్పబడుచున్నది.

**మనుః : మహిషమర్ధిని స్వాహా। దీనికి న్యాసము ఇట్లుండును.**

మహిష హింసికే హుంఫట్ - హృదయాయ నమః।

మహిషశత్రో వార్జ్గీ హుంఫట్ - శిరసే స్వాహా।

మహిషం భీషయ భీషయ హుంఫట్ - శిఖాయై వషట్।

మహిషం హనహన దేవి హుంఫట్ - కవచాయహుమ్।

మహిషసూదని హుంఫట్ - అస్త్రాయఫట్।

అనంతరం ఇలా ద్యానించాలి.

ఋషిః - శాకవత్సః, ప్రకృతి ఛందః, మంబీజం, స్వాహా శక్తిః।

**శ్లో॥ గారుడోపల సన్నిభాం మణిమౌళి కుండలమండితాం**
**నేమి శంఖ కృపాణఖేటక బాణకార్ముక శూలకాన్**
**తర్జనీమపి బిభ్రతీం నిజబాహుః శశిశేఖరామ్ ।**

ఈ మంత్రమును 8 లక్షలు జపించి, తిలలతో 8వేలు హోమం చేయాలి. హోమానంతరం పీఠార్చన చేయాలి. అంగపూజానంతరం అష్టదళములందు 1. దుర్గా 2. వరవర్ణినీ 3. ఆర్యా 4. కనకప్రభా 5. కృత్తి 6. అభయప్రదా 7. కన్యా 8. సురూపా, వీరిని ఆ - ఈ - ఊ - ఏ - ఐ - ఓ - ఔ అనే బీజములతో అర్చించాలి.

ఉదా : ఓం ఆం దుర్గాయై నమః

**శ్లో॥ యజేదగ్రేష్వాయుధాని చక్ర శంఖాసి ఖేటకాన్**
**బాణం బాణాసనం శూలం కపాలంయాదిభిః క్రమాత్ ।**
**లోకపాలాః పునః పూజ్యాస్తదస్త్రాణి తతః పరం**
**వశయేత్తిలహోమేన నరాన్ నరపతీనపి ।**
**సిద్ధార్థైర్జుహు యన్మాంత్రీ రోగాత్ ముచ్యతే క్షణాత్**

పద్మైర్హుత్వా జయేచ్ఛత్రూన్ దూర్వాభిః శాంతిమాప్నుయాత్।
పలాశకుసుమైః పుష్టిం ధాన్యైర్ ధాన్యశ్రియం వ్రజేత్
కాకపక్షైః కృతో హోమోద్వేషం వితనుతే నృణామ్ ।
మరీచహోమాన్మరణం రిపురాప్నోతి సర్వదా
క్షుద్రారిచోర భుతాద్యాన్ ధాయత్వా దేవీం వినాశయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట పత్రాగ్రభాగములందు చక్ర - చక్ర - శంఖ - ఖడ్గ - ఖేటక - బాణ - ధనపు - శూల - కపాలములను, య - ర - ల - వ - శ - ష - స - హ అను అక్షరములు జోడించి అస్త్రపూజ చేయాలి.

ఉదా : యం చక్రాయ నమః ।

పిమ్మట లోకపాలురను వారి ఆయుధములను అర్చించాలి. సాధకుడు జగద్వశ్యము చేసుకొను సమర్థుడగును.

తెల్లావాలతో హోమం చేసిన తక్షణరోగశాంతి కమలములతో హోమం వలన శతృజయం, దూర్వాహోమం శాంతిదాయకం, మోదుగపూలహోమం పుష్టికరం, ధాన్యహోమం సంపదవృద్ధి, కాకిరెక్కలు హోమం చేసిన విద్వేషణ సిద్ధించును. మరీచి హోమంవలన మారణం, క్షుద్రబాధా నివారణం, శతృ - చోర - భూత బాధ నశించును.

## జయదుర్గా మంత్రము

శ్లో॥ తారోదుర్గోయుగం రక్తమంత్యం ధాంతం సలోచనం
ద్వితాంత జయదుర్గేయం విద్యావేద్యా దశాక్షరీ ।
తారాదిదుర్గే హృదయం దుర్గేశిర ఉదీరితం
దుర్గాయై స్యాచ్ఛిఖా వర్మ భూతరక్షిణి కీర్తితమ్ ।

తారాది దుర్గేద్వితయం రక్షిణ్యరక్షి సమీరితం
తారాది దుర్గేయుగలం రక్షిణ్యస్త్రం సమీరితమ్ ।
బాణలక్షం జపేన్మంత్రం ఘృతేన జుహుయాత్తతః
దశాంశసంస్కృతే వహ్నౌ బ్రాహ్మణానపి భోజయేత్ ।
అష్టాక్షరోదితే పీఠే పూజయేత్ పూర్వవత్సుధీః
మంత్రంజపన్ విశేద్యుద్ధే శత్రూన్ హన్యాద్విశేషతః ।
ప్రజపేత్ వ్యవహారాదౌ తత్రాపి విజయీ భవేత్
అర్చయేదస్త్ర శస్త్రాణి జయార్థీ విద్యయాऽనయా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - దశాక్షరి జయదుర్గా మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం దుర్గే దుర్గే రక్షిణి స్వాహా।**

మార్కండేయ ఋషిః - బృహతీ ఛందః - ఓం బీజం - స్వాహా శక్తిః 6 అంగన్యాసములు ఇట్లుండును.

| | | |
|---|---|---|
| ఓం దుర్గే నమః | - | హృదయాయ నమః । |
| ఓం దుర్గే | - | శిరసే స్వాహా । |
| ఓం దుర్గాయై | - | శిఖాయై వషట్ । |
| ఓం భూతరక్షణి | - | కవచాయ హుమ్ । |
| ఓం దుర్గే దుర్గే రక్షిణి | - | నేత్రాభ్యాం వౌషట్ । |
| ఓం దుర్గే దుర్గే రక్షిణి | - | అస్త్రాయఫట్ । |

అనంతరం ఇలా ధ్యానించాలి

శ్లో॥ కాలాభ్రాభాం కటాక్షైః గరికులభయదాం మౌళిబద్ధేందురేఖాం
శంఖంచక్రంకృపాణం త్రిశిఖమపి కరైరుద్వహంతీం త్రినేత్రామ్

సింహస్కంధాధిరూడాం త్రిభువనమఖిలం తేజసా పూరయంతీం
ధ్యాయేద్దుర్గాం జయాఖ్యాం త్రిదశపరివృతాం సేవితాం సిద్ధకామైః

ఈ మంత్రమును 5 లక్షలు జపించి నేతితో హోమం చేయాలి. పిమ్మట బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. పీఠార్చన చేయాలి. మంత్ర జపము వలన యుద్ధజయము, (కోర్టు వ్యవహారములందు, ఉద్యోగ పరీక్షలందు విజయము) సిద్ధించును. సాధకుడు తన పనిముట్లను ఈ మంత్రంతో నిత్యం అర్చించిన కార్యసిద్ధి కలుగును.

## శూలినీ దుర్గా మంత్రము

శ్లో॥ జ్వలజ్వల పదస్యాంతే శూలినీతి పదం వదేత్
దుష్టగ్రహం హుస్త్రాంతే వహ్నిజాయా విధిర్మనుః ।
భూతేంద్రియాక్షరైః ప్రోక్తో గ్రహక్షుద్రాది నాశకః
ఋషిర్దీర్ఘతమాః ప్రోక్తః కకుప్ ఛంద ఉదాహృతమ్ ।
శూలినీదేవతాప్రోక్తా సమస్త సురవందితా
దుర్గేహృద్వరదే శీర్షం వింధ్యవాసిని తచ్ఛిఖా ।
అసురాంతేమర్దిని స్యాత్ యుద్ధపూర్వప్రియే పునః
త్రాసయద్వితయం వర్మ దేవసిద్ధ సుపూజితే ।
నందిని స్యాద్రక్షయుగం మహాయోగీశ్వరి క్రమాత్
శూలిన్యాద్యా హుంఫడంతాః పంచాంగ మనవః స్మృతాః ।
మనుమేనం జపేన్మంత్రీ వర్ణలక్షం విచక్షణః
సర్పిషాఽనేన హోమస్తు తద్దశాంశ మితో భవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శూలినీదుర్గ - పంచదశాక్షరి ఇట్లుండును.

**మనుః : జ్వల జ్వల శూలిని దుష్టగ్రహం హుంఫట్ స్వాహా।**

ఈ మంత్రము గ్రహబాధలను, క్షుద్రరోగములను నివారించును.

ఋషిః దీర్ఘతమాః, కకుప్ ఛందః, ఉత్సాదోచ్చాటన, భ్రమ, మారణ, వ్యాధులు, భూతప్రేత డాకినీ పీడలు, అని "పదార్థాదర్శ" సంస్కృత వ్యాఖ్యానములో పేర్కొనబడినది)

**దుర్గే హృదయాయ నమః।**
**వరదే స్వాహా।**
**వింధ్యవాసిని శిఖాయై వషట్।**
**అసురమర్దిని యుద్ధప్రియే త్రాసయత్రాసయ కవచాయహుమ్।**
**ఓం శూలిని దుర్గే దేవసిద్ధ సుపూజితే నందిని రక్ష రక్ష**
**మహామేగేశ్వరి అస్త్రాయ హుంఫట్।**

అని పంచాంగ న్యాసం ఆచరించి, ఇలా ధ్యానించాలి.

శ్లో॥ అధ్యారూఢాం మృగేంద్రం సజలధర శ్యామలాం హస్తపద్మైః
శూలంబాణం కృపాణ మరిజల జగదా చాపపాశాన్ వహంతీమ్ ।
చంద్రోత్తం హంత్రినేత్రాం చిత సృభిరభితః ఖేటకాన్ బిభ్రతీభిః
కన్యాభిః సేవ్యమానాం ప్రతిభట భయదాం శూలినీం భావయామి॥

ఈ మంత్రమును 15 లక్షలు జపించి ఘృతమిశ్రిత అన్నముతో దశాంశహోమమాచరించాలి, పిమ్మట అష్టాక్షర యంత్రపీఠమునందు అర్చించాలి.

శ్లో॥ దుర్గాద్యా వరదా వింధ్యవాసిన్య సురమర్దినీ
యుద్ధప్రియా పంచమీస్యాత్ దేవసిద్ధ సుపూజితా ।
సప్తమీ నందినీప్రోక్తా మహాయోగేశ్వరీ పరా
దళాగ్రేషు తదస్త్రాణి శంఖ చక్ర మసింపునః ।
గదేషు చాపశూలాని పాశం పశ్చాత్ దిశాధిపాన్

ఇత్థం జపాదిభిః సిద్ధః కుర్యాత్కర్మ నిజేప్సితమ్ ।
అష్టోత్తర సహస్రం యస్తిలైస్త్రి మధురాప్లుతైః
నిత్యం ప్రజుహు యాత్తస్య శక్తిః స్యాదతిమానుషీ ।
అష్టోత్తర శతంనిత్యం సర్పిషాజుహుయాన్నరః
వాంఛితం వత్సరాదర్వాక్ ప్రాప్నుయాన్మహతీంశ్రియమ్ ।
దూర్వాహోమో భవేన్నృణాం సర్వవాంఛిత సిద్ధిదః
ఛారికాద్యాని శస్త్రాణి జప్తాని మనునాఽమునా ।
సంపాతాజ్య విలిప్తాని వితరంతి జయశ్రియమ్
అశ్వత్థార్క సమిద్భిర్వా తిలైర్వా మధురోక్షితైః ।
హోమోవశయతి క్షిప్ర మీప్సితాన్ మంత్రిణో నరాన్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అంగపూజానంతరం దళములందు, 1. దుర్గా 2. వరదా 3. వింధ్యవాసిని 4. అసురమర్దినీ 5. యుద్ధప్రియా 6. దేవసిద్ధ సుపూజితా 7. నందినీ 8. పరా శక్తులను ఆరాధించాలి.

పత్రాగ్రభాగములందు వీరి ఆయుధములైన శంఖ - చక్ర - అసి - గదా - బాణ - చాప - త్రిశూల - పాశములను అర్చించాలి. బయట దిక్పాలును, వారి ఆయుధములను అర్చించాలి. పాలు, నేయి, తేనె కలిపిన తిలలతో నిత్యమూ 1008 హోమం చేసిన ఒక సంవత్సర కాలములో అతీంద్రియ శక్తి సిద్ధించును.

దూర్వాహోమమువలన అభీష్టసిద్ధి, ఆయుధములు అభిమంత్రించి, హోమ శేషమైన నేతిచే ఖడ్గమునకు పూసిన యుద్ధజయము ప్రాప్తించును. త్రిమధుర మిశ్రితరావి, జిల్లేడు సమిధలు లేదా తిలలతో హోమం చేసిన వశీకరణము సిద్ధించును.

# భూతావేశము వదలించుట

శ్లో॥ ఉద్యదాయుధ హస్తాంతాం దేవీంకాలఘనప్రభాం
ధ్యాత్వాత్మానం జపేన్మంత్రం స్పృష్ట్వార్తం ముంచతి గ్రహః
సర్పాఖువృశ్చికాదీనాం విషమాశు వినాశయేత్
మనునాఽనేన విధివన్మంత్రవిద్దేవతాధియా ।
మంత్రేణానేన సంజప్తాన్ బాణానాదాయ సాధకః
విముంచేత్ ప్రతిసేనాయాం సాదృతం విదృతాభవేత్ ।
జుహుయాత్తిల సిద్ధార్థై ర్లక్షమేకం యథావిధి
నామయుక్తం జపన్మంత్రం యస్యాఽసౌ మృత్యుమేష్యతి।
గుటికాంగోమయోత్పన్నాం హుత్వాఽష్ట శతసంఖ్యయా
సప్తాహాత్ కురుతే మంత్రీ విద్వేషం స్నిగ్ధయోర్మిథః ।
గృహీత్వా గోమయం వ్యోమ్ని త్రిసహస్రం జపేత్తతః
గమిష్యతాం ద్వారదేశే నిఖాతం స్తంభనంభవేత్ ।
బహునోక్తేన కింసర్వం సాధయేన్మనుఽమునా

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నీలమేఘమువంటి కాంతి గలిగి, చేతియందు శత్రువధ నిమిత్తము శస్త్రము ధరించిన దుర్గను ధ్యానించుచూ, దయ్యము పట్టిన వ్యక్తిని స్పృశించి ఈ మంత్రము జపించిన ఆ భూతావేశము తొలగిపోవును. సర్ప - శునక - వృశ్చిక - మూషిక విషబాధలు తొలగును.

యుద్ధమునందు మంత్రించిన బాణములుప్రయోగించుటవలన జయము లభించును. తిలలు - తెల్లావాలతో ఒక లక్ష శత్రునామంతో హోమం చేసిన అతడు నాశనమగును. ఆవుపేడతో చేసిన గుటికలను (ఎండించిన ఆవుపేడ ఉంలు, ఇవి పిడకలవలెనే కొంత ధాన్యంపొట్టు

కలిపి ఉండలుగా చేసి ఎండించాలి) ప్రతిదినమూ 108సార్లు హోమం చేసిన ఒక వారం రోజులలో విద్వేషణ సిద్ధించును.

ఆవుపేడను భూమిపై వేయు సమయంలో, అది భూమిపై పడకుండానే దానిని గ్రహించి, చేతిలోనుంచుకొని మూడువేలు మంత్రజపం చేసి, దానిని ప్రయాణముకొరకు బయలుదేరు శత్రువుయొక్క గృహద్వారము వద్ద పాతిపెట్టిన అతనికి స్తంభనమగును. ఎక్కువగా చెప్పడం ఎందుకు? సర్వప్రయోగములూ ఈ మంత్రంతో సాధించవచ్చును.

## వనదుర్గా మంత్రము

శ్లో॥ ఉత్తిష్ఠ పదమాభాష్య పురుషి స్యాత్పదంతత:
పితామహ: సనేత్రేందు: స్వపిషి స్యాద్ భయం చమే ।
సముపస్థిత ముచ్చార్య యదిశక్యమనంతరం
అశక్యం వా పునస్తన్మే వదేత్ భగవతిం తత: ।
శమయాఽగ్నివధూ: సప్తత్రింశద్వర్ణాత్మకోమను:
ఋషిరారణ్యకశ్ఛందోఽప్యత్యనుష్టు బుదాహృతమ్ ।
దేవతావన దుర్గాస్యాత్ సర్వదుర్గాతి మోచినీ
పాదాష్ట సంధిష్టు గుదలింగా ధారోదరేషు చ ।
పార్శ్వహృత్స్తన కంఠేషు పునర్ బాహ్వాష్ట సంధిషు
ముఖనాసక పోలాక్షి కర్ణభ్రూమధ్య మూర్ధసు ।
మంత్రాక్షరాణి విన్యస్యేద్దేవతాభావ సిద్ధయే
షడ్భిశ్చతుర్భి రష్టాభిరష్టాభి: షడ్భిరింద్రియై: ।
మంత్రార్ణైరంగక్లప్తి:స్యా జ్జాతియుక్తైర్యథాక్రమం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – 37 అక్షరముల వనదుర్గా మంత్రము వివరింపబడుచున్నది

**మనుః - ఉత్తిష్ఠ పురుషి కింస్వపిషి భయంచమే సముపస్థితం**
**యదిశక్యమశక్యంవా తన్మేశమయ భగవతి స్వాహా।**

ఆరణ్యక ఋషిః - అత్యనుష్టుబ్ఛందః - వనదుర్గాదేవతా ఊం బీజం - స్వాహా శక్తిః, అంగన్యాసం ఇలా చేయాలి.

పాదాంగుళ సంధులందు - ఇవి 8. మంత్రంలోని ఒకొక్క అక్షరం గుద - లింగ - ఆధార - ఉదర - 2 పార్శ్వ - హృదయ - 2 స్తన - కంఠప్రదేశ - రెండు చేతుల అంగుళ సంధులు (8) - ఇలా ఇప్పటికి 26, ముఖ - నాసిక - కపోల - 2 నేత్ర - 2 కర్ణ - భ్రూమధ్య - శిరస్సులందు, మొత్తం 37 స్థానములందు మూలమంత్రంలోని ఒక్కొక్క అక్షరముతో న్యాసం ఆచరించాలి.

షడంగన్యాసము నందు :

| | | |
|---|---|---|
| ఓం ఉత్తిష్ఠ పురుష్యై | - | హృదయాయ నమః |
| ఓం కింస్వపిష్యై నమః | - | శిరసే స్వాహా। |
| ఓం భయంచమేసముపస్థితం | - | శిఖాయై వషట్। |
| ఓం యదిశక్యమశక్యంవా | - | కవచాయహుమ్। |
| ఓం తన్మేశమయ | - | నేత్రద్వయాయ వౌషట్। |
| ఓం భగవతి స్వాహా | - | అస్త్రాయఫట్। |

పిదప మనసులో వనదుర్గారూపం ఇలా భావించాలి.

శ్లో॥ సౌవర్ణాంబుజ మధ్యగాం త్రినయనాం సౌదామినీ సన్నిభాం
శంఖంచక్ర వరాభయాని దధతో మిందోః కళాం బిభ్రతీమ్।
గ్రైవేయాంగద హారకుండలధరా మాఖండలాద్యైః స్తుతాం
ధ్యాయేద్వింధ్యనివాసినీం శశిముఖీం పార్శ్వస్థపంచననామ్॥

ఇచట వ్యాఖ్యానములో "వా - తన్మే" అను అక్షరములు **కీలకములు,** హుందుర్గే అనునది **అకీలకమని** వ్యాఖ్యానించి ఇందులకు ప్రమాణముగా "ఈశాన సంహిత" యందలి శ్లోకములు ఉల్లేఖించబడ్డాయి.

☞ **ఏవమేషా మహాదేవీ నిష్కీలా సర్వసిద్ధిదా**
**గుణాంతే భువనేశానీం దుర్గాబీజం నియోజయేత్ ।**
**వర్మణోఽన్తే స్వకం బీజముక్త్వా చాంతేవిలోమతః**
**పూర్వోక్త బీజత్రితయం యోజయేత్ క్రౌంచదారణా ।**
**తదాప్రదీపితా విద్యా నిష్కీలా సర్వసిద్ధిదా ॥**

శ్లో॥ ఏవం ధ్యాత్వా జపేల్లక్ష చతుష్కం తద్దశాంశతః
జుహుయాద్ధ విషామంత్రీ శాలిభిః సర్పిషాతిలైః ।
ప్రాగీరితే యజేత్పీఠే దేవీమంగాదిభిస్సహ
అంగపూజా యథాపూర్వం దళమూలేష్విమా యజేత్ ।
ఆర్యాదుర్గాచ భద్రాఖ్యా భద్రకాళీ తతోఽంబికా
క్షేమాఽన్యా వేదగర్భాఖ్యా క్షేమంకర్యష్టశక్తయః ।
అస్త్రాణి పత్రమధ్యేషు శంఖచక్రాసి ఖేటకాన్
బాణకోదండశూలాని కపాలాంతాని పూజయేత్ ।
బ్రాహ్మ్యాద్యాః స్యుర్దలాగ్రేషు లోకపాలాస్తతః పరం
సిద్ధిమంత్రః ప్రయోగేషు దేవీమిత్థం విచింతయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ధ్యానశ్లోకములోనే మరొక విధమైన "వింధ్యవాసినీ" ధ్యానము ఉన్నది. దానిని ఇలా భావించాలి. తరళం ఛందస్సులో ఉన్నది.

శ్లో॥ కాలపావక సన్నిభాం కలితార్ధ చంద్రశిరోరుహాం
భాలనేత్రవిభూషణాం భయదాయిసింహ నిషేదుషీమ్ ।

శంఖచక్రకృపాణఖేటక చాపబాణ కరోటికా
శూలవాహిభుజాంభజే విజితాఖిలాసురసైనికామ్ ॥

ఈ విధముగా ధ్యానించిన సాధకుడు మంత్రమును నాలుగు లక్షలు జపించి, దశాంశము నేయి, బియ్యం, తిలలు, పాయసం 4 పదార్థములతో హోమం చేయాలి. పీఠపూజ అంగపూజ యధావిధిగా ఆచరించాలి. అష్టదళములందు ఈ శక్తులను పూజించాలి.

1. ఆర్యా 2. దుర్గా 3. భద్రా 4. భద్రకాళి 5. అంబికా 6. క్షేమా 7. వేదగర్భా 8. క్షేమకరీ. దళములమధ్యలో దేవియొక్క శంఖ - చక్ర - కృపాణ - ఖేటక - చాప - బాణ - త్రిశూల - కపాలములు అర్చించాలి.

దళాగ్రభాగములందు బ్రాహ్మీ మొదలగు వారిని దానికి బయట లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి.

## ప్రయోగ విధానము

శ్లో॥ ప్రాతః స్నానరతో నిత్యమష్టోత్తర సహస్రకం
జపేత్తస్యాశు సిధ్యంతి ధనధాన్యాది సంపదః ।
అనేనైవ విధానేన గ్రహక్షుద్రరిపూన్ జయేత్
నాభిమాత్రోదకేస్థిత్వా దేవీమర్కగతాంస్మరన్ ।
జపేదష్టోత్తర శతం లభేత మహతీం శ్రియం
అయుతం వటవృక్షోత్థైః సశృంగైరర్చితేఽనిలే ।
హోమంసమిద్వరైః కుర్యాన్నాశయే దాపదాంకులం
ఘోరాభిచారభూతాదీన్ శమయేద్విధినాఽమునా ।
అపామార్గ సమిద్భిర్వా తిలైర్వా కాననోద్భవైః
అభీష్టసిద్ధ్యై జుహుయాదర్యై ర్మంత్రీ సమిద్వరైః ।

సహస్రమర్కవారాది దివసాన్ దశ సంయుతః
సారాన్ శుద్ధాన్ సమాదాయ శకలాన్ మనునాఽమునా
జుహుయాదేధితే వహ్నౌ సప్తరాత్రమతంద్రితః ।
కుముదైర్వశయేద్విప్రాన్ నృపతీన్ పద్మహోమతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సాధకుడు నిత్యమూ ప్రాతః స్నానముచేసి, 1008 సార్లు వనదుర్గామంత్రము జపించినచో ధన - ధాన్యాది, అష్టవిధ సంపదలూ కలుగును. పదివేలు జపించి గ్రహ - అభిచార - శతృబాధలను నివారించగలడు. దేవిని ధ్యానించి నిత్యమూ 108సార్లు జపించిన అభీష్టసిద్ధి కలుగును.

మర్రిసమిధలతో (వీటికి కొనలు గలిగియుండాలి) హోమం చేసిన ఆపదలు తొలగును. అపామార్గ సమిధలతోగాని, అడవియందు పెరిగిన తిలలతోగాని హోమం చేసిన అభిచారప్రయోగములు నశించును.

ఆదివారమునుండి 10రోజులు, జిల్లేడు సమిధలతో 1000 సార్లు హోమం చేసిన అభీష్టము సిద్ధించును. చంద్రసమిధలతో మూడురోజులు, ఏడురాత్రులవరకు 1000సార్లు నిత్యము హోమం చేసిన సకల కార్యములూ సిద్ధించును. కుముద హోమముచే బ్రాహ్మణులు, వైశ్యులు కమలహోమముచే క్షత్రియులు వశమగుదురు.

శ్లో॥ శూద్రాన్ లవణహోమేన జాతీపుష్పైః సభాంపునః
వ్రీహిభిర్జుహుయాన్నిత్యం వత్సరాత్ వ్రీహిమాన్ భవేత్ ।
దూర్వాహోమేన దీర్ఘాయుర్మధునా రత్నవాన్ భవేత్
అన్నైరన్నసమృద్ధిః స్యాదాజ్యేన లభతేధనమ్ ।
గోదుగ్ధేన గవాంవృద్ధి మాప్నుయాన్నాత్రిసంశయః
జ్వరేగ్రహే గరేసర్పే తర్జన్యాం సంస్పృశన్ జపేత్ ।

స్మృత్వా శూల కరాందేవీం తత్క్షణాదేవ తాన్ హరేత్
దర్భితం సాధ్యనామార్ణైః పత్రే మను మిమంలిఖేత్ ।
కులాలమృత్ కృతాయాంతత్ ప్రతిమాయాం హృదిన్యసేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – లవణహోమముచే శూద్రులు వశమగుదురు. జాజిపూల హోమముచే సభావశ్యము సిద్ధించును. ధాన్య హోమము వలన ఒక సంవత్సర కాలములో ధాన్యవృద్ధి, దూర్వాహోమము వలన దీర్ఘాయువు, మధు (తేనె) హోమమువలన రత్నప్రాప్తి కలుగును.

అన్నహోమముచే అన్నసమృద్ధి, ఘృతహోమముచే ధనవృద్ధి, గోక్షీర హోమముచే గోవృద్ధి కలుగును. జ్వరపీడితునిగాని, గ్రహపీడితునిగాని, విషబాధితుని గాని, ఎడమచేయి చూపుడువేలితో స్పృశించుచూ ఈ మంత్రజపము చేయుటవలన, తత్క్షణమే బాధానివారణమగును.

భూర్జపత్రమందు సాధ్యనామము, కార్యము, ఈ మంత్రమందు లిఖించి, కుమ్మరి చక్రమునుండి మట్టినితెచ్చి దానితో 12 అంగుళముల బొమ్మను చేసి దాని మెడకు ఆ భూర్జపత్రమును కట్టి దానిని పూలతో పూజించాలి.

శ్లో॥ నిధాయాగ్రేజపేన్మంత్రం అష్టోత్తర సహస్రకం
సంధ్యాసుపక్షమాత్రేణ ధృవమాప్నోతి వాంఛితమ్ ।
అభ్యర్చ్య దేవీమనలే తీక్ష్ణతైలేన మంత్రవిత్
హుత్వాఽయుతం నిధాయాఽగ్రే తీక్ష్ణాంస్త్రింశచ్ఛరాన్ పునః
తేషు సంపాతయేద్భూయః స్పృష్ట్వాతాన్నియుతంజపేత్
వేధయేత్ పరసేనాయాంక్షణాన్నష్టా దిశోదశ ।
ప్రాప్నుయాన్నష్ట సంజ్ఞాసా పలాయనపరాయణా
జపిత్వాసిత గుంజానాం కుడవం కులికోదయే ।

వికిరేత్ శత్రుసేనాయాం గూఢః సన్నాపణాదిషు
జ్వరమారీ మహారోగైః పీడితా సైన్యనాయకైః ।
పరస్పరవిరోధేన నశ్యేద్ గచ్ఛేత్ప్రియేత సా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట దానిని తాను కూర్చొన్నచోట, కాలికింద నుంచి 1008 సార్లు ప్రతీరోజూ సంధ్యా కాలమందు జపించినచో సాధకుని మనోరథము సిద్ధించును.

అడవిపూలు, మరియు చందన గంధముచే పూజించి కటుతైలముతో 10వేలు హోమముచేసి 30 బాణములు ముందుంచి హోమశేషఘృతముతో బాణములను తడిపి, మరల బాణములను తాకుతూ ఒక లక్ష జపము చేయవలయును. ఇలా అభిమంత్రించిన బాణములను శత్రుసైన్యముపై ప్రయోగించిన వారు దశదిశలా పారిపోవుదురు.

నాలుగు పలముల తెల్లగురివిందగింజలు చూర్ణముచేసి, కులికయోగ కాలమునందు దానిని అభిమంత్రించి శత్రుసేనపై చల్లిననూ, లేదా శత్రువుయొక్క వ్యాపారస్థలమందు పడవేసిననూ, రోగపీడితుడై బాధలు పొందును. సైన్యమునందు పరస్పర విద్వేషముతో నశింతురు.ః

కులికయోగము గూర్చి **"జ్యోతిషరత్నమాల"** యందిట్లున్నది.

☞ **మన్వర్క దిగ్వసుబుతు వేదపక్షైరర్కాన్ ముహూర్తైః కులికేభవంతి ।**
**దివానిరేకైరథ యామినీషు తే గర్హితాః కర్మసుశోభనేషు ॥**

## పుత్తలీప్రయోగం

శ్లో॥ సేనాసంస్తంభనే మంత్రీ కారస్కరముద్భవైః
పుష్పైః సహస్రం జుహుయాత్ తత్పత్రైస్తాం నివర్తయేత్ ।
అంగారవారే కులికే జప్త్వా భస్మచితోద్భవం
వినిక్షిపేద్రిపోర్ మూర్ధ్ని విద్విష్టో దేశతో వ్రజేత్ ।

మరున్నిపాతితైః పత్రైః కారస్కరసముద్భవైః
తస్యపాదరజో యుక్తైః హోమాదుచ్చాటయేదరీన్ ।
కారస్కరమయీం కృత్వా ప్రతిమామతి శోభనాం
జప్త్వాం ప్రతిష్ఠిత ప్రాణాం ఛేదయేదంగ శఃపునః ।
కాకోలూక వసాయుక్తా మష్టోత్తర సహస్రకం
కృష్ణపక్షే చతుర్దశ్యాం శ్మశానే హవ్యవాహనే ।
జుహుయాత్ మ్రియతేఽరాతి రేవమేవ దినత్రయాత్
ఉన్మత్త సమిధాంహోమాత్ మృతాఃస్యుః శత్రవః క్షణాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చితాభస్మము గ్రహించి మంగళవారం దశమినాడు కులిగాయోగములో 108 సార్లు అభిమంత్రించి శత్రుశిరమునందు చల్లిన అతనికి ఉచ్చాటనమగును. (ఊరు వదలి వెళ్ళిపోవును).

శత్రుస్తంభనకు కారస్కర (                ) పుష్పములు లేదా వాటి ఆకులతో ఒక వెయ్యి హోమం చేసిన స్తంభన జరుగును. గాలికి రాలిన కారస్కర పత్రములు గ్రహించి, శత్రువుయొక్క ఎడమకాలి క్రింద మట్టిని గ్రహించి హోమం చేసినచో ఉచ్చాటనమగును.

సాధకుడు కారస్కర వృక్ష కాష్ఠముచే 96 అంగుళముల శత్రుప్రతిమను సుందరముగా నిర్మించాలి. పిమ్మట దానియందు ప్రాణప్రతిష్ఠ చేసి 108 సార్లు మంత్రించి, దాని ఒక్కొక్క అంగమూ ఛేదించాలి. మరల కాకి - గుడ్లగూబల వసతో 1008 సార్లు మాసశివరాత్రియందు (కృష్ణపక్ష చతుర్దశి) శ్మశానాగ్ని యందు హోమం చేసిన శత్రువు మూడురోజులలో నశింతురు.

ఉమ్మెత్త సమిధలతో హోమం చేసిన శత్రువులు నశింతురు. ఇచట ప్రతిమ (పుత్తలి) పరిమాణ విషయంలో గ్రంథాంతరమందిట్లున్నది.

☞ **మారణే దారురూపాంతాం ద్వాదశాంగుళ సమ్మితాం**
**షణ్ణవత్యంగులాం వాపి కుర్యాన్మాత్రాంగులైః క్రమాత్ ।**
**హోమార్థం కల్పితాయాస్తు తస్యాఃప్రోక్తో విధిః పరః**
**వశ్యాకర్షణయోః ప్రోక్తాం తాం కుర్యాత్ ద్వాదశాంగులైః ।**

శ్లో॥ ఉలూకకాకయోః పత్రైః స్వవసారక్తసంయుతైః
జుహుయాన్నిశికాంతారే శత్రుఃకాలాతిథి ర్భవేత్ ।
శత్రోః ప్రతికృతిమం మంత్రీ ప్రతిష్ఠిత సమీరణాం
విశోషణ విలిప్తాగీమత్యుష్ణే నిక్షిపేజ్జలే ।
జ్వరాక్రాంతో భవేచ్ఛీఘ్రందుగ్ధ సేకాచ్ఛమంనయేత్
తర్జనీం త్రిశిఖం దోర్భ్యాం ధారయంతీం భయంకరీమ్ ।
రక్తాంధ్యాత్వా రవేర్బింబే ప్రజపేదయుతం మనుం
మారయేదచిరాదేవ రిపూన్ బంధు సమన్వితాన్ ।
ఖడ్గ ఖేటక రాంక్రుద్ధాం సన్నద్ధాం భానుమండలే
ధ్యాత్వా మంత్రం జపేన్మంత్రీ నాశయేదచిరా దరీన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - గుడ్లగూబ - కాకి రెక్కలు, మరియు వాటి వస, రక్తముతో అర్ధరాత్రియందు అడవిలో హోమంచేసిన శత్రువు నశించును. శత్రువు యొక్క జన్మ నక్షత్ర అధిదైవత వృక్ష కాష్ఠముతో, ఒకవేళ అతని నక్షత్రము తెలియనపుడు కారస్కర వృక్ష కాష్ఠముతో 12 అంగుళముల బొమ్మ తయారుచేయాలి.

దానికి ప్రాణప్రతిష్ఠచేసి, విషమిశ్రిత మిరియములపొడి దానికి లేపనముచేసి దానిని మరుగుతున్న నీటిలో వేయాలి. వెంటనే శత్రువు విషజ్వరపీడితుడగును. అది నివారణ చేయదలచినచో ఆ బొమ్మను పాలలో వేయాలి. (పాలముంచినా - నీటముంచినా అంటే ఇదే)

ఒక చేతితో తర్జనిముద్ర, మరొకచేతితో త్రిశూలముద్ర ధరించి భయంకరముగా ఎఱ్ఱగానుండు దుర్గాదేవిని సూర్యమండలమందు ధ్యానించుచూ పైమంత్రమును 10వేలు జపించిననూ శత్రుబాధా నివారణ మగును.

శ్లో॥ చాపబాణ ధరాంభీమాం సింహస్థాం జ్వలనోపమాం
సృజంతీం బాణనివహాన్ ధావంతీం తాదృశంరిపుమ్ ।
ధ్యాత్వా జపేన్మను మిమమయుతం తోయమధ్యగః
రిపుంచపరసేనాంచ ద్రుతముచ్చాటయేద్ ధృవమ్ ।
ఆనిత్యక సమిద్ధోమాత్ ముచ్యతే రోగశోకతః
పుష్పైస్తదీయైర్వశయేత్ మధురాక్తై ర్మతంగజాన్ ।
రక్షాయై పంచగవ్యేన లింపేజ్జప్తేన దంతినః
గవ్యాజ్య తిల సిద్ధార్థై రానిత్యక సమిద్వరైః ।
దుగ్ధాన్న పంచగవ్యాభ్యాం తండులేన ఘృతే న చ
ఏతైః పృథక్ పృథక్ ద్రవ్యై రష్టోత్తర సహస్రకమ్ ।
జుహుయాద్దినశో విప్రాన్ భోజయేన్మధురాదిభిః
గురవేదక్షిణాం దద్యా ద్వస్త్రాభరణ సంయుతామ్ ।
మాతంగాశ్చతురంగాశ్చ వర్ధంతే విధినాఽమునా
సర్వవ్యాధి వినిర్ముక్తాః క్షుద్రపీడా వివర్జితాః ।
కారయేద్ రబహ్మ వృక్షేణ శిల్పినాయుధ పంచకం
శంఖఖడ్గరథాంగాని శార్ఙ్గం కౌమోదకేంక్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ధనుర్బాణములు ధరించి సింహముపైనుండు జ్వలనోపమైన దుర్గాదేవి శత్రువులను చీల్చి చెండాడు చున్నట్లు, భావించుచూ, జలములో నిలబడి పై మంత్రమును పదివేలు జపించిన, వెంటనే శత్రువుల ఉచ్చాటనము సిద్ధించును.

అనిత్య (           ) సమిధలతో హోమం చేసిన, సాదకుడు రోగ శోకములు లేనివాడగును. త్రిమధుర మిశ్రిత అదేవృక్ష పుష్పములతో హోమం చేసిన గజమును వశము చేసుకొనగలడు. ఈ మంత్రముతో అభిమంత్రించిన పంచగవ్యమును గజమునకు పూసినచో అది భద్రముగా, ఆరోగ్యముగా సౌమ్యముగా నుండును.

గోఘృతము, తిలలు, తెల్లావాలు, శ్రేష్టమైన ఆనిత్యక సమిధలు, పాలతో ఉడికించిన పాయసము, పంచగవ్యము, బియ్యము, వీటితో ఒక్కొక్కరోజు ఒక్కొక్క ద్రవ్యముతో 1008సార్లు హోమం చేయాలి. బ్రాహ్మణులకు మధురంగా భోజనం పెట్టాలి. వస్త్రాభరణములతో సత్కరించాలి. ఇలా ఆచరించు సాధకుడు సంపదతో దినదిన ప్రవర్ధమానమగును.

ఏ విధమైన వ్యాధి బాధలు, గ్రహ - క్షుద్ర బాధలూ పొందదు. బ్రహ్మవృక్షం (పలాశ) కాష్ఠముతో శిల్పిచే శంఖ - ఖడ్గ - చక్ర - శార్జ్గ (ధనుస్సు) - గద ఆయుధములు తయారు చేయించాలి.

ఇచట వ్యాఖ్యానములో శతృనాశనమునకు సంబంధించి కొంత విశేష వివరణ ఇవ్వబడినది.

☞ **ఆయుర్దాయం రిపోర్జ్ఞాత్వా లగ్నోక్తార్క్షానుగుణ్యతః**
**తదాత్మిక గ్రహాణాంచ స్థితిమష్టక వర్గకమ్ ।**
**త్రయాణామానుకూల్యేన కుర్యాత్తదభిచారకం**
**అన్యధాక్రూరకర్మాణి కుర్వాణం నాశయంతి హి ।**
**తాన్యేవ కర్మాణి తతస్తత్త్రయప్రాతికూల్యతః**
**విదధ్యాదన్యధాశక్త్యా నైష్ఫల్యం చాత్మనాశనమ్ ।**
**రిపోరష్టమలగ్నేచ కాలేత్వష్టమరాశిగే**
**స్థానే కుర్యాదనిష్టాని తద్వినాశాయ సాధకః ।**
**పాతాలయోగే నీ చాఖ్యే విషయోగే చమృత్యుజే**

**నాశయోగౌ చ దినజమృత్యా క్రకచయోగకీ ।**
**చండీశ చండాయుధకే మిహాశూలే చ కాణకే**
**రక్తస్థాణే కంటకాఖ్యే స్థాణే పంచార్కసంజ్ఞకే ।**
**కుర్యాత్ ప్రయోగాన్ ప్రత్యర్థిభంగాయ నిధనాయచ**
**నిగ్రహాయనిరీక్ష్యైవం కుర్యాత్ సిద్ధిమవాప్నుయాత్ ।**

శతృవుయొక్క లగ్నమునకు అష్టమలగ్నమందు, శతృరాశికి అష్టమరాశియందు, అష్టకవర్గలో బలహీనస్థానమును, చెడుదశలనూ గమనించి అభిచారప్రయోగం చేయాలి. శతృదశ బాగా నడుస్తున్నపుడు, చేసిన ప్రయోగము, ప్రయోగించినవానినే తిరిగి కొట్టును. చంద్రోదయం నుండి 15 ఘటికల కాలం "వేలా" అనబడును. ఈ కాలమునందు సముద్రమునందు క్షోభ కలుగును. ఇది చంద్రవేలా అంటారు. ఈ సమయమునందు క్రూరకర్మలు చేయరాదు. అది దాటిన తరువాత అనగా రాత్రి సుమారుగా 12 గంటలు దాటిన తరువాత చేసిన అభిచార కర్మ ఫలించును.

తిథులలో బహుళ అష్టమినుండి అమావాస్యవరకు మాత్రమే అభిచార ప్రక్రియ చేయుటకు అనువైన రోజులు. ఇలా ఎన్నో విషయాలు గమనించి విషనాడులయందు, కుళికాది యోగములయందు మాత్రమే అభిచార మాచరించాలి.

శ్లో॥ పంచగవ్యేషు నిఃక్షిప్య తానిస్పృష్ట్వా మనుంజపేత్
సమ్యక్ పంచ సహస్రాణి తేష సంపాతయన్ పునః ।
తావదాజ్యేన జుహుయాన్మంత్రైఃస్వైః పూజయేత్క్రమాత్
ఉద్ధృత్య పంచగవ్యేభ్యః పూర్వవత్ ప్రజపేన్మనుమ్ ।
అవటాన్ పంచనిఖనేద్దిక్షు మధ్యాదిషు క్రమాత్
అవటేష్వేషు పూర్ణేషు పంచగవ్యేన సాధకః ।

ఆయుధాని ప్రజప్తాని పంచఘోష పురస్సరం
విన్యసేత్తేషు మధ్యాది పూజాంకుర్యాద్వ్యధాపురా ।
వాలుకాభిః సమాపూర్య మృద్భిః కుర్యాత్ సమస్థలం
బలించ వికిరేత్తత్ర తేషాంమంత్రై ర్యధాక్రమమ్ ।
దిక్ పతిభ్యోబలిందత్వా బ్రాహ్మణాన్ భోజయేత్తతః
గురవే దక్షిణాం దద్యాత్ ఆత్మవిత్తానుసారతః
యత్రైవం విహితారక్షా దేశేవానగరేపురే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పైవిధముగా నిర్మించిన పంచాయుధములనూ, ఒక పలాశకాష్ఠ నిర్మిత పాత్రయందుంచి, అందు పంచగవ్యములుంచి, వాటిని స్పృశించుచూ ఒక్కొక్క వెయ్యిగా అయిదువేలు జపం చేయాలి. అదేవిధంగా అయిదువేలు హోమం చేయాలి.

హోమశేష ఘృతమును వెయ్యిసార్లు అభిమంత్రించి ఆయుధములపై చల్లాలి. పిమ్మట ప్రాణప్రతిష్ఠ చేసి, పూజించి సహస్రజపం చేయాలి. పిమ్మట భూమిపై ఒక గొయ్యితీసి దానికి నాలుగు దిశలా నాలుగు గోతులు తీసి, అందు పంచగవ్యములుంచి పంచవాద్య ఘోష జరుగుచుండగా, ఆ 5 ఆయుధములనూ మధ్యక్రమానుసారముగా పాతిపెట్టాలి. పిమ్మట అచట పూజించాలి. దానిపై ముందు ఇసుక, ఆపై మట్టివేసి సమతలంగా చేయాలి. అచట బలి సమర్పించాలి. పిమ్మట దిక్పాలురకు బలి సమర్పించి, బ్రాహ్మణులకు భోజనంపెట్టి, యధాశక్తి దక్షిణలను సమర్పించాలి.

ఇలా చేయడంవలన గృహము, గ్రామము, నగరము, రాష్ట్రము, దేశమూ క్షేమంగా సుఖసౌభాగ్యములతో, పాడిపంటలతో అభివృద్ధి చెందుచుండును.

శ్లో॥ గ్రామేగేహ్యేఽథవా తత్ర వర్ధంతే సంపదఃసదా
అశ్మపాతాదయోదోషా భూతప్రేతాది సంయుతాః ।

అభిచారకృతాః కృత్యా రిపుచేరాద్యుపద్రవాః
నేక్ష్యంతే తాందిశం బీతాస్తర్జితా దేవతాజ్ఞయా ।
పద్మంభాను దళాన్వితం ప్రవిలిఖేత్తత్కర్ణికాయాంపునః
తారంశక్తి గబీజసాధ్య సహితం తత్కేసరేషుక్రమాత్ ।
మర్దిన్యా మనుసంభవాన్ యుగలశోవర్ణాన్ పత్రగాన్
మంత్రార్ణాన్ గుణశోవిధాయ విలిఖేదంత్యంత దన్యేదళే ।
మాతృకావర్ణ సంవీతం భూపురద్వయ మధ్యగం
యంత్రం వింధ్యనివాసిన్యాఃప్రోక్తం సర్వసమృద్ధిదమ్ ।
రక్షాకరంవిశేషేణ క్షుద్రభూతాదినాశనం
రాజ్యదంభ్రష్ట రాజ్యానాం వశ్యదం వశ్యమిచ్ఛతామ్ ।
సుతార్ధినీనాంసుతదం రోగిణాం రోగశాంతిదం
బహునా కిమిహోక్తేన యంత్రంతత్ కామదోమణిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పైన చెప్పిన ఆయుధ ప్రయోగము నిర్వహించినచోట, ప్రకృతిబీభత్సములు, భూతబాధలు, రాళ్ల వర్షము సంభవించవు. ప్రజలు అందరూ సుఖసంతోషముతో నుందురు. శత్రు - చోర - క్రూర జంతువుల బాధ సంభవించదు.

దేవతాజ్ఞవలన దుష్టగ్రహములు ఆ గ్రామమువైపు కన్నెత్తి చూడలేవు.

## వనదుర్గా యంత్రము

ఇపుడు వనదుర్గాయంత్రము చెప్పబడుచున్నది. 12 దళములతో కమలము నిర్మించి, మధ్యలో ప్రణవము (ఓం) హ్రీం దుః అని వ్రాయలి. సాధ్య నామము, కర్మ కూడా వ్రాయలి. కేసరములందు ద్వాదశదళము లందు మహిషమర్ధిన్యై స్వాహా అను మంత్రమును 3 ఆవృత్తములలో రెండేసి అక్షరములు వ్రాయాలి. చివరి ఒక అక్షరము చివరి దళమందు వ్రాయాలి.

రెండుభూపురములమధ్య మాతృకను లిఖించి, దానిని వేష్టితం చేయాలి. ఈ వింధ్యవాసినీ యంత్రము సకల శుభములనిచ్చును. ఆపదల నుండి కాపాడును. క్షుద్రగ్రహబాధ నివారించును. వశీకరణమును సిద్ధింప చేయును. సంతానము నిచ్చును. రోగశాంతిని కలుగజేయును. ఎక్కువగా చప్పుట ఏల? సమస్తమూ ఇచ్చును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*ఏకాదశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ ద్వాదశః పటలః

## అథ భైరవీ ప్రకరణమ్

శ్లో॥ అజ్ఞాన తిమిరధ్వంసి సంసారార్ణవతారకం
ఆనందబీజ మవతా దతర్క్యం త్రైపురం మహః ।
అథవక్ష్యే పరాంవిద్యాం త్రిపురామతి గోపితాం
యాంజ్ఞాత్వా సిద్ధ సంఘూనామధిపో జాయతేనరః ।
వియద్భృగు హుతాశస్థో భౌతికోబిందు శేఖరః
వియత్తదాది కేంద్రాగ్ని స్థితంవామాక్షి బిందుమత్ ।
ఆకాశభృగు వహ్నిష్ఠో మనుః సర్గేందు ఖండవాన్
వాగ్భవం ప్రథమంబీజం కామబీజం ద్వితీయకమ్ ।
తృతీయం కామరాజాఖ్యం త్రిభిర్బీజైరితీరితా
పంచకూటా త్మికావిద్యా వేద్యాత్రిపురభైరవీ ।
ఋషిః స్యాద్దక్షిణామూర్తి శ్ఛందఃపంక్తిః సమీరితః
దేవతాదేశికైరుక్తా దేవీత్రిపురభైరవీ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - త్రిపురభైరవీ మంత్రం చెప్పబడుచున్నది. అజ్ఞానరూప అంధకారమును పోగొట్టి, సంసార

సముద్రమును దాటించునదీ, ఆనందములకు ఏకమాత్ర బీజమైనదీ, మనస్సుకూ వాక్కుకూ అందనిదీ అయినత్రైపుర రోచిస్సు మనలనందరినీ రక్షించుగాక.

"త్రిపురా" శబ్ద ఉత్పత్తిని గూర్చి ఇట్లు చెప్పబడినది.

త్రిమూర్తి సర్గాచ్చ పురాభవత్వాత్
త్రయీమయత్వాచ్చ పురైవ దేవ్యాః
లయేత్రిలోక్యా అపి పురాణత్వాత్
ప్రాయోఽంబికా యాస్త్రిపురేతి నామ ॥

"సిద్ధేశ్వరీ మతము" నందిట్లు చెప్పబడినది.

☞ **బ్రహ్మవిష్ణు మహేశానైస్త్రిదేవై రర్చితాపురా**
**త్రిపురే తితదానామ కథితం దైవతైః పురా ॥**

ఈ త్రిపురావిద్య అతి ప్రాచీనమైన మహిమాన్వితమైన రహస్య విద్య ఇది త్రికూటాత్మకమైనది. ప్రథమకూటము వాగ్భవమని, ద్వితీయ కూటము కాలీబీజము, తృతీయకూటము కామరాజబీజమని చెప్పబడును. దీనికి అతిరిక్తముగా హ్ – స్ – క్ – ల్ – ర్ అను పంచవర్ణముల సంయోగముచే పంచకూటాత్మికా త్రిపురభైరవీ అని కూడా చెప్పుదురు.

ఋషిః దక్షిణామూర్తిః – పంక్తిశ్ఛందః – త్రిపురభైరవీ దేవతా ।

శ్లో॥ నాభేరా చరణం న్యస్యే ద్వాగ్భవం మంత్రవిత్ పునః
హృదయాన్నాభిపర్యంతం కామబీజం ప్రవిన్యసేత్ ।
శిరసోహృత్ప్రదేశాంతం తార్తీయంవిన్యసేత్తతః
ఆద్యం ద్వితీయం కరయోస్తార్తీయముభయోర్న్యసేత్ ।
మూర్ధ్న్యాధారే హృదిన్యస్యేద్భూయో బీజత్రయంక్రమాత్
నవయోన్యాత్మకం న్యాసం కుర్యాద్బీజైస్త్రిభిః పునః ।

కర్ణయోశ్చిబుకే భూయః శంఖయోర్వదనే పునః
నేత్రయోర్నసి విన్యస్యేదంసయోః పిఠరే పునః ।
తతః కూర్పరయోః కుక్షౌజానునోర్ధ్వజమూర్ధని
పాదయోః గుహ్యదేశే చ పార్శ్వయోర్హృదయాంబుజే ।
స్తనయోః కంఠదేశేచ రత్యాది పథ విన్యసేత్
మూలేరతింహృది ప్రీతిం భ్రువోర్మధ్యే మనోభవామ్ ।
బాలాబీజైస్త్రిభిర్న్యస్యేత్ స్థానేష్వేషు విలోమతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రసాధకుడు వాగ్భవ బీజముచే నాభినుండి చరణమువరకు న్యాసం చేయాలి. హృదయమునుండి నాభిపర్యంతము కామబీజముతోనూ, శిరస్సునుండి హృదయపర్యంతము కామరాజబీజముతోనూ న్యాసమాచరించాలి.

ముందుగా రెండవ బీజముతో క్రమముగా ఎడమ, కుడిచేతులందు, తృతీయబీజముతో రెండుచేతులందు పిమ్మట మరల శిరస్సునందు ప్రథమ బీజము, మూలాధారమునందు ద్వితీయబీజము, అలాగే హృదయమునందు తృతీయబీజము న్యాసం చేయాలి.

**మనుః : హ్సైం - హస్క్లీం - హస్రౌః ।**

**ఐం బిజం - సౌః శక్తిః । క్లీంకీలకం ।**

## ధ్యానశ్లోకం

శ్లో॥ ఉద్యద్భాను సహస్రకాంతిమరుణక్షౌమాంశిరోమాలినీం
రక్తాలిప్త పయోధరాంజపవటీం విద్యామభీతిం వరమ్ ।
హస్తాబ్జై ర్దధతీం త్రినేత్ర విలసద్వక్త్రార విందశ్రియం
దేవీం బద్ధహిమాంశురత్నముకుటాం వందే సమందస్మితామ్

ప్రస్తారభేదముచే ఈ మంత్రము 30 రకములుగా నున్నది.

**"ఉత్తరషట్కము"** నందు ఆహ్లాదిన్యుద్ధారమిట్లున్నది.

**ఆదిమేనతు సాలుప్తా మధ్యమేన తు కీలితా**
**అంతిమేన తుసాఛిన్నా తేన విద్యానసిధ్యతి ।**
**ఆదిమాది మనాదించ మధ్యంమధ్యమమధ్యమం**
**అంత్యమంత్యమనంత్యం చ త్రిపురా శీఘ్ర సిద్ధిదా ।**
**ఆదిమధ్యేతు మధ్యాదౌ అంత్యమధ్యేతు సంస్థితౌ**
**పురః క్షోభాయ జప్తవ్యం విధినాఽనేన సాధకైః ।**

పిమ్మట నవయోని న్యాసము నాచరించాలి. అది చెప్పబడుచున్నది.

## నవయోనిన్యాసం

మూడు - మూడు స్థానములందు, క్రమముగా మూడు బీజాక్షరములు ఒక్కొక్క అక్షరముచేసిన ఒక యోనియగును. ఇలా 27 స్థానములందు మూడు బీజముల చొప్పున 9 ఆవృత్తములగును.

| | | |
|---|---|---|
| రెండు చెవులు చిబుకము | - | ఒక ఆవృత్తి |
| రెండు కంఠప్రాంతములు ముఖము | - | 2 |
| రెండు నేత్రములు నాసిక | - | 3 |
| రెండు భుజములు ఉదరము | - | 4 |
| రెండు మోచేతులు కుక్షి | - | 5 |
| రెండు మోకాళ్ళు లింగముయొక్క కొన | - | 6 |
| రెండుకాళ్ళు గుహ్యము | - | 7 |
| రెండుప్రక్కలు హృదయము | - | 8 |
| రెండుస్తనములు కంఠము | - | 9 |

ఇదియే యోనిన్యాసమనబడును. పిమ్మట ఐం రత్యై నమః మూలాధారే, సౌః ప్రీత్యై నమః హృదయే, క్లీం మనోభవాయై నమః భ్రూమధ్యే, సౌః అమృతేశ్యై నమః, క్లీం యోగేశ్యై నమః, ఐం విశ్వయోన్యై నమః అని పైన చెప్పిన స్థానములందు న్యాసము చేయాలి.

శ్లో॥ స్వస్వ బీజాదికంపూర్వం మూర్ధ్నీశాన మనోభవం
న్యసేద్వక్త్రే తత్పురుషం మకరధ్వజమాత్మవిత్ ।
హృద్యఘోర కుమారాది కందర్పంతదనంతరం
గుహ్యదేశే ప్రవిన్యస్యే ద్వామదేవాదిమన్మథమ్ ।
సద్యోజాతం కామదేవం పాదయోర్విన్యసేత్తతః
ఊర్ధ్వ ప్రాగ్దక్షిణోదీచ్య పశ్చిమేషు ముఖేషుతాన్ ।
ప్రవిన్యసే ద్యథాపూర్వం భృగుర్ వ్యోమాగ్ని సంస్థితః
సద్యాదిపంచహ్రస్వస్థో బీజమేషాం ప్రకీర్తితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట

| | | |
|---|---|---|
| "స్త్రం ఈశానమనోభవాయ నమః | - | శిరసే । |
| బ్లూంతత్పురుష మకరధ్వజాయనమః | - | ముఖే । |
| ఐం అఘోరకుమార కందర్పాయ నమః | - | హృదయే । |
| క్లీం వామదేవ మన్మథాయ నమః | - | గుహ్యే । |
| హ్రీం సద్యోజాత కామదేవాయ నమః | - | పాదయోః । |

అలాగే, మరలశరీరమునందు, ఊర్ధ్వ, పూర్వ - దక్షిణ - ఉత్తర - పశ్చిమములందు పంచముఖములను భావించి క్రమముగా న్యాసం చేయాలి.

ఈ ప్రకారము ఈశానాది పంచమూర్తులను క్రమముగా సద్యోపూర్వక ఓం - ఎం - ఉం - ఇం - అం పంచ హ్రస్వబీజమంత్రములలో హ్స్రాం చేర్చి న్యాసం చేయాలి.

**ఉదా : హ్స్రాం సద్య ఓం ఈశానాయ స్త్రీం మనోభవాయనమః మూర్ధ్ని**

**హ్స్రాం సద్య ఎం తత్పురుషాయ బ్లూంమకరధ్వజాయ నమః - వక్త్రే**

ఇలాగే ఊర్ధ్వాది పంచముఖములందూ ఆచరించాలి.

శ్లో॥ షడ్దీర్ఘయుక్తేనాద్యేన బీజేనాఽంగక్రియా మతా
పంచబాణాంస్తనౌ న్యస్యే న్మంత్రీ త్రైలోక్య మోహనామ్ ।
ద్రామాద్యాంద్రావిణీంమూర్ధ్ని ద్రీమాద్యాం క్షోభిణీం పదే
క్లీం వశీకరణం వక్త్రే గుహ్యే బ్లూం బీజపూర్వికామ్ ।
ఆకర్షిణీం హృదిపునః సర్గాంతర్ భృగు సంయుతం
సమ్మోహనీం క్రమాదేవం బాణన్యాసోఽయమీరితః ।
ఖాలభ్రూమధ్య వదన లంబికా కంఠ హృత్సు చ
నాభ్యధిష్ఠానయోః పంచ తారాద్యాః సుభగాదికాః ।
న్యస్తవ్యా విధినా దేవ్యో మంత్రిణా సుభగాభగా
భగ సర్పిణ్యథపరా భగమాలిన్యనంతరమ్ ।
అనంగాఽనంగ కుసుమా భూయశ్చాఽనంగ మేఖలా
అనంగమదనా సర్వా మదవిభ్రమ మంథరాః ।
ప్రధానదేవతావర్ణ భూషణాద్యైరలంకృతాః
అక్షస్రక్పుస్తకాభీతి వరదాఢ్య కరాంబుజాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట షడ్ దీర్ఘయుక్త బీజమంత్రముతో అంగన్యాసమాచరించాలి. ఉదా :

హస్రోః హసకల హ్రాంహ్రీం హస్రౌం - హృదయే ।

హస్రోః హసకలహ్రీం హ్రీంహస్రౌం - శిరసి ।

హస్రోః హసకలహ్రూం హ్రీం హస్రౌం - శిఖాయామ్

ఇత్యాదిగా అంగన్యాసముచేసి, మూడులోకములనూ మోహింపచేయు పంచబాణములతో కూడా ఆయా శక్తులను శరీరమునందు న్యాసము చేయాలి. దీనినే "బాణన్యాసం" అంటారు.

ద్రాం ద్రావిణ్యై నమః - హృదయే ।
ద్రీం క్షోభిణ్యై నమః - పాదయోః ।
క్లీం వశీకరణ్యై నమః - ముఖే ।
బ్లూం ఆకర్షిణ్యై నమః - గుహ్యే ।
సః సమ్మోహిన్యై నమః - హృదయే ।

పిమ్మట, భాల - భ్రూమధ్య ముఖ, లంబిక - కంఠ - హృదయ, నాభి, అధిష్ఠానములందు, పంచతారాయుక్త (ఐం - క్లీం - బ్లూం - స్త్రీం - సః) సుభగాదులను 8మందిని న్యాసం చేయాలి. 1. సుభగా 2. భగా 3. భగసర్పిణీ 4. పరాభగమాలినీ 5. అనంగా 6. అనంగకుసుమా 7. అనంగమేఖలా 8. అనంగమదనాం.

ఈ శక్తులందరూ ప్రధానదేవత అయిన త్రిపురతో సమానముగా రూప - వర్ణ - వస్త్రాభరణాలంకృతులుగా నుంటారు. కమలములవంటి చేతులందు పుస్తకం - జపమాల - వరదాభయముద్రలు ధరించి యుందురు.

శ్లో॥ వాక్కామం బ్లూం పునః స్త్రీం సస్తారాః పంచోదితాస్త్వమీ
న్యాసంకుర్యాద్ భూషణాఖ్యం తతః సాధకసత్తమః ।
న్యసేచ్ఛిరసి భాలభ్రూ కర్ణాక్షి యుగళేనసి
గండయోరోష్ఠయోర్దంత పంక్త్యోరాస్యే న్యసేత్ స్వరాన్ ।
చిబుకేఽథ గళే కంఠే పార్శ్వయోః స్తనయుగ్మకే
దోర్మూలయోః కూర్పరయోః పాణ్యోస్తత్ పృష్ఠదేశతః ।

నా భౌగుహ్యే పునశ్చోర్వో ర్జానునోర్జంఘయోస్తతః
స్ఫిచోః పత్తలయోః పశ్చాచ్చరణాంగుష్ఠయోర్ద్వయోః ।
కాదిరాంతాన్ న్యసేద్వర్ణాన్ స్థానేష్వేషు సమాహితః
కాంచ్యాం గ్రైవేయకే పశ్చాత్ కటకే హృది గుహ్యకే ।
కర్ణకుండలయోర్మౌలౌ వలశాన్ పక్షసాన్ లహౌ
అష్టావిమాన్ ప్రవిన్యస్యేదేవం దేశికసత్తమః ।
ఏవంన్యస్త శరీరోఽసౌ ధ్యాయేత్ త్రిపురభైరవీమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఐం - క్లీం - బ్లూం - సః వీటిని పంచతారలందురు. పిమ్మట 16 అచ్చులను, శిర - భాల - 2 భ్రూ - 2 కర్ణ - ఈ నేత్ర - నాసిక - 2 గండ - 2 ఓష్ఠ - 2 దంతపంక్తి - ముఖములందు న్యాసం చేయాలి.

పిమ్మట కకారాది రేఫ పర్యంతం 27 హల్లులను 2 చిబుక - గళ - కంఠ - ఈ పార్శ్వ - ఈ స్తన - 2 బాహుమూల (చంకలు) 2 - మోచేతులు, 2 - పిక్కలు, 2 నితంబములు, 2 పాదములు, 2 - పాదాంగుష్ఠములు న్యాసం చేయాలి.

మరల కాంచీ (మొలనూలు) గ్రైవేయక, కటక (గాజులు), హృదయ, గుహ్య 2 కర్ణకుండల, శిరః ప్రదేశములందు క్రమముగా వం - శం - శం - షం - క్షం - సం - లం - హం అను అక్షరములు న్యాసం చేయాలి. పిమ్మట త్రిపురభైరవిని ధ్యానించాలి.

## పురశ్చరణ

శ్లో॥ దీక్షాంప్రాప్య జపేన్మంత్రం తత్త్వ లక్షం జితేంద్రియః
పుష్పైర్భాను సహస్రాణి జుహుయాద్ బ్రహ్మవృక్షజైః ।

త్రిమధ్వక్తైః ప్రసూనైర్వా కరవీర సముద్భవైః
పద్మం వసుదళోపేతం నవయోన్యాఢ్యకర్ణికమ్ ।
ఇచ్ఛాదిశక్తిభిర్యుక్తం భైరవ్యాః పీఠమర్చయేత్
ఇచ్ఛా జ్ఞానాక్రియా పశ్చాత్ కామినీకామదాయినీ ।
వరదాభయ ధారిణ్యః సంప్రోక్తా నవశక్తయః ।
వాగ్భవంలోహితోరాయై శ్రీకంఠః లోహితోఽనలః
దీర్ఘవాన్యై పరా పశ్చాదపరాయై హసౌః పునః ।
సదాశివ మహాప్రేతం జేంఽతం పద్మాసనం నమః
అనేనమనునా దద్యాదాసనం శ్రీగురుక్రమమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - దీక్షపొందిన సాధకుడు ఈ మంత్రమును 36 లక్షలు జపించి, మోదుగపూలతో 12వేలు హోమం చేయాలి. లేదా త్రిమధురయుక్త గన్నేరుపూలతో హోమం ఆచరించాలి.

నవయోనియుక్త కర్ణికతో కూడిన అష్టదళ పద్మమును నిర్మించి, ఇచ్ఛాది 9 శక్తులను ఆవాహనచేసి, పీఠార్చన చేయాలి. 1. ఇచ్ఛా 2. జ్ఞాన 3. క్రియా 4. కామినీ 5. కామదాయినీ 6. రతి 7. రతిప్రియా 8. నందా 9. మనోన్మనీ. వీరు పీఠశక్తులు. వీరంతా వరదాభయముద్రలు ధరించియుందురు.

**పీఠమంత్రము : హ్రాస్రాః పరాయై అపరాయై హసౌః సదాశివ మహాప్రేతం పద్మాసనాయ నమః।**

ఈ పీఠమంత్రముతో పీఠార్చన చేసిన పిమ్మట

శ్లో॥ ప్రాంజ్మధ్యయోన్యంతరాళే పూజయేత్ కల్పయేత్ పునః
పంచభిః ప్రణవైః మూర్తిం తస్యామావాహ్యదేవతామ్ ।
పూజయేదాగమోక్తేన విధానేన సమాహితః

తారావాక్ శక్తిః కమలా హసఖ్ఫ్రేం హసౌ స్మృతాః ।
వామకోణే యజేద్ దేవ్యా రతిమిందు సమప్రభామ్ ।
రతింపాశధరాం సౌమ్యాం మదవిభ్రమ విహ్వలామ్ ॥
ప్రీతిందక్షిణకోణస్థాం తప్తకాంచన సన్నిభామ్ ।
అంకుశంప్రణతిం దోర్భ్యాం ధారయంతీం సమర్చయేత్॥
అగ్రేమనోభవాంరక్తాం రక్త పుష్పాద్యలంకృతామ్ ।
ఇక్షుకార్ముక పుష్పేషూన్ ధారయంతీంశుచిస్మితాం ॥
అంగాన్యభ్యర్చయేత్ పశ్చాద్యథాపూర్వం విధానవిత్ ।
దిక్ష్వగ్రేచనిజైర్మంత్రైః పూజయేద్బాణదేవతాః ॥
హస్తాబ్జైర్ధృత పుష్పేషు ప్రణామా భూత సప్రభాః
అష్టయోని ష్వష్టశక్తీః పూజయేత్ సుభగాదికాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మధ్యయోనియందు గురుక్రమమును పూజించాలి. తదనంతరం పంచప్రణవములతో (ఓం ఐం హ్రీం శ్రీం హసఖ్ఫ్రేం హసౌః) మూర్తిని (రూపమును) కల్పించి దానియందు దేవతాహ్వానము చేయాలి మధ్యయోనికి బయట దేవీ అంగపూజచేసి, నాలుగుదిశలా పంచప్రణవములతో పూజించాలి.

దేవియొక్క వామకోణమందు పాశ, ప్రణామముద్రలతో నుండు, మదవిహ్వలఅయిన రతిని పూజించాలి. దేవియొక్క క్షిణకోణమందు తప్తకాంచన వర్ణములో నుండి, రెండు చేతులా అంకుశ ప్రణామ ముద్రలతో నుండు ప్రీతిని పూజించాలి.

తరువాత ఎర్రనివర్ణములోనుండి, ఎర్రని పూలమాలలు ధరించి, చెరకువిల్లు - పుష్పబాణములు కలిగి, మందస్మితముతో నుండు మనోభవాను అర్చించాలి. పిమ్మట బాణదేవతలను అర్చించాలి. వీరు

పుష్పబాణములు ప్రణామముద్ర ధరించి పృథివ్యాది పంచమహాభూతములకు అనుగుణముగా ఆయావర్ణములతో నుందురు. పిమ్మట మిగిలిన అష్టయోనులందు సుభగాది అష్టమాతృకలను పూజించాలి.

శ్లో॥ మాతరౌ భైరవాంకస్థా మదవిభ్రమ విహ్వలాః
అష్టపత్రేషు సంపూజ్య యథావత్ కుసుమాదిభిః ।
లోకపాలాంస్తతో దిక్షు తేషామస్త్రాణి తద్బహిః
పూర్వజన్మకృతైః పుణ్యైః జ్ఞాత్వైనాంపరదేవతామ్ ।
యోభజేదుక్తమార్గేణ సభవేత్ సంపదాంపదం
ఏవంసిద్ధమనుర్మంత్రీ సాధయేదిష్టమాత్మనః ।
జుహుయాదరుణాంభోజై రదోషైర్మధురాప్లుతైః
లక్ష సంఖ్యం తదర్ధం వా ప్రత్యహం భోజయేద్ ద్విజాన్ ।
వనితా యువతీరమ్యాః పూజయేద్ దేవతాధియా
హోమాంతే ధనధాన్యాద్యైస్తోషయేద్గురుమాత్మనః ।
ఏవంకృతే జగద్వశ్యో రమాయా భవనంభవేత్
రక్తోత్పలైస్త్రిమధ్వక్తైరరుణైర్వా హ యారిజైః ।
పుష్పైః పయోఽన్నైః సఘృతై ర్హోమో విశ్వం వశంనయేత్
వాక్సిద్ధింలభతే మంత్రీ పలాశకుసుమైర్హుతాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ మాతృకలు భైరవుని ఒడిలో కూర్చుండి, మదవిహ్వలులై యుందురు. పిమ్మట దిశలందు లోకపాలురను, వారి అస్త్రములను పూజించాలి. పూర్వజన్మ పుణ్యవశమున ఈ ప్రకారము దేవతామహిమను తెలుసుకొని భక్తితో అర్చించు సాధకునకు సకల సంపదలూ కలుగును.

దోషరహితములైన త్రిమధురములలో లక్షసార్లు గాని లేదా 50వేల సార్లుగాని హోమం ఆచరించి బ్రాహ్మణభోజనం నిర్వహించాలి. స్త్రీలయందు దేవతాబుద్ధి కలిగి వారిని ఆదరించి, గౌరవించాలి. హోమాంతమునందు గురువును యధాశక్తి దక్షిణలతో సత్కరించాలి.

ఇట్టి ప్రక్రియ పూర్తిచేయు మంత్రవేత్తకు సమస్త జగత్తూ అధీనములో నుండును. త్రిమధురయుక్త ఎర్రనికమలములు, ఎర్రగన్నేరుపూలు లేదా ఘృతముతో ఇతర పుష్పములు, పాయసముతో హోమంచేసినచో గొప్ప వశీకరణశక్తి సిద్ధించును. మోదుగపూలతో హోమమాచిరంచిన వాక్సిద్ధి కలగును.

శ్లో॥ కర్పూరాగురు సంయుక్తం గుగ్గులుం జుహుయాత్సుధీః
జ్ఞానం దివ్యమవాప్నోతి తేనైవ సభవేత్ కవిః ।
క్షీరక్తైరమృతాఖండైః హోమః సర్వాపమృత్యుజిత్
దూర్వాభిరాయుషే హోమః క్షీరాక్తాభి ర్దినత్రయమ్ ।
గిరికర్ణీభవైః పుష్పైః బ్రాహ్మణాన్ వశయే ద్ధుతాన్
కహ్లారైః పార్థివాన్ పుష్పైస్తద్వధూ కర్ణికారజైః ।
మల్లికాకుసుమైర్హుత్వా రాజపుత్రాన్ వశంనయేత్
కోరంట కుసుమైర్వైశ్యాన్ వృషలాన్ పాటలోద్భవైః ।
అనులోమ విలోమాంతః స్థితసాధ్యా హ్వాయాన్వితాం
మంత్రముచ్చార్య జుహుయాన్మంత్రీ మధుర లోలితైః ।
సర్షపైః పటుసంమిశ్రైర్వశయేత్ పార్థివాన్ క్షణాత్
అనేనైవవిధానేన తత్పత్నీ స్తత్ సుతానపి ।
జాతీ బిల్వఫలైః పుష్పై ర్మధురత్రయలోలితైః
నరనారీ పరపతీన్ హోమతో వశయేద్ ధృవమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కర్పూరము - అగురు, గుగ్గిలముతో కలిపి హోమం చేసిన దివ్యజ్ఞానము సంప్రాప్తించును. కవి కూడా అగును. పాలతో తడిపిన తిప్పతీగ సమిధలతో హోమం చేసిన అపమృత్యువు తొలగును. ఆయుష్కాముడు పాలతో తడిపిన దూర్వాహమోమము మూడురోజులాచరించవలయును.

అపరాజిత (విష్ణుక్రాంత) పుష్పములతో హోమం చేసిన బ్రాహ్మణులు వశమగుదరు. కలువలతో హోమంవలన క్షత్రియులు, కొండగోగు పూలతో హోమం వలన రాజపత్ని, మల్లెపూల హోమం వలన రాజకుమారులు, గోరంటపూల హోమంవలన వైశ్యులూ, పాటలీపుష్ప (గులాబి) హోమంవలన సంకరజాతివారు వశమగుదురు.

శ్లో॥ మాలతీ వకుళోద్భూతైః పుష్పైశ్చందన లోలితైః
జుహుయాత్ కవితాంమంత్రీ లభతే వత్సరాంతరే ।
మధురత్రయ సంయుక్తైః ఫలైర్బిల్వ సముద్భవైః
జుహుయాద్వశయేల్లోకం శ్రియమాప్నోతి వాంఛితామ్ ।
పాటలైః కుముదైః కుందైరుత్పలై ర్నాగ చంపకైః
నంద్యావర్తై ర్వికసితైః కృతమాలైర్జుహోతి యః ।
జాయతే వత్సరాదర్వాన్ శ్రియా విజితి పార్థివః
సాజ్యమన్నం ప్రజుహుయాద్భవేదన్న సమృద్ధిభాన్ ।
కస్తూరీకుంకుమోపేతం కర్పూరం జుహుయాద్వశీ
కందర్పాదధికం సద్యః సౌందర్యమధిగచ్ఛతి ।
లాజాన్ రపజుహుయాన్మంత్రీ దధిక్షీరమధుప్లుతాన్
విజిత్యరోగా నఖిలాన్ సజీవేత్ శరదాంశతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చందనం లేపనంచేసిన సన్నజాజి, బహుళపుష్పములు హోమం చేసిన ఒక సంలో సాధకునకు కవిత్వశక్తి సిద్ధించును. త్రిమధురమిశ్రిత మారేడుఫలహోమముచే, జగద్వశ్యము - ఇష్టసిద్ధి కలుగును.

గులాబి - మల్లె - కలువ - కమలము - సంపెంగ - గంధతగరము (నందివర్ధనం) రాజవృక్షపుష్పములు, హోమము చేయుటవలన ఒక సంవత్సరములో గొప్ప ధనవంతుడగును. ఘృతమిశ్రిత పాయస హోమం వలన అన్న సమృద్ధి కలుగును. కస్తూరీ - కుంకుపువ్వుతో కలిపిన కర్పూర హోమమువలన సౌందర్యము కలుగును.

త్రిమధురమిశ్రిత పేలాలను హోమం చేయుటవలన రోగవిముక్తి కలిగి దీర్ఘాయువుగా జీవించును.

శ్లో॥ పాద్వయం మలయజం పాదం కుంకుమకేసరం
పాదం గోరోచనాయాంచ తానిపిష్ట్వా హిమాంభసా ।
విదధ్యాత్తిలకం భూయోయాన్ పశ్యేద్ యైర్విలోక్యతే
యాన్ స్పృశ్యతే యైర్వా వశ్యాః స్యుస్తస్యతేఽచిరాత్ ।
కర్పూరకపిచోరాణి సమభాగాని కల్పయేత్
చతుర్భాగా జటామాంసి తావతీ రోచనామతా ।
కుంకుమం సప్తభాగం స్యాద్ దిగ్భాగం చందనం మతం
అగురుర్నవ భాగః స్యాదితి భాగక్రమేణ చ ।
హిమాద్భిః కన్యయా పిష్టమేతత్ సర్వం సుసాధితం
ఆదాయతిలకం భాలే కుర్యాద్భూమిపతీన్ నరాన్ ।
వనితాంమద గర్వాఢ్యాం మదోన్మత్తాన్ మతంగజాన్
సింహవ్యాఘ్రాన్ మహాసర్పాన్ భూతభేతాళ రాక్షసాన్ ।
దర్శనాదేవవశయేత్ తిలకం ధారయన్నరః



త్రిపుర భైరవీ స్వరూపం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - రెండుసార్లు చందనం, ఒక పాలు కుంకుమపువ్వు, నాగకేసరములు, ఒకపాలు గోరోచనము వీటిని హిమజలంతో నూరి అభిమంత్రించి తిలకముగా ధరించిన, సాధకుని కంటిచూపు వలన సాధ్యవ్యక్తి వశమగును. సాధకుని స్పర్శవలన అందరూ వశమగుదురు

కర్పూరము - ఎర్రచందనం - కచ్చూరము సమాన భాగములుగా గ్రహించి, అందులో నాలుగుభాగములు జటామాంసి, అంతే పరిమాణములో గోరోచనం గ్రహించాలి. దీనికి **7** రెట్లు కుంకుమ మరియు పదిరెట్లు చందనం, **9** రెట్లు అగురు గ్రహించి, శ్మశానములో మాసశివరాత్రి నాడు కన్యచేత హిమజలముతో నూరించాలి.

దీనిని అభిమంత్రించి తిలకముగా ధరించిన అధికారులు, మదగర్వితులు, మదోన్మత్తులు, మదవతులైన స్త్రీలు, మదగజములు కూడా వశమగును. సింహ - వ్యాఘ్ర - మహాసర్పములు భూత భేతాళములు సాధకుని దర్శనమాత్రముననే అనుకూలమగును. **"సంవిత్ శాస్త్రము"** నందు కవిత్వసిద్ధి ఇట్లు చెప్పబడినది.

☞ **సారస్వత మయీమూర్తిమాది మూర్తి సమన్వితాం।**

**యఃస్మరేత్ ద్వాదశాంతే స్యాత్ సోఽ చిరాద్వాక్పతిర్భవేత్ ॥**

## త్రిపుర భైరవీ గాయత్రి

శ్లో॥ మన్మథం త్రిపురాదేవి విద్మహే పదమీరయేత్
ఉక్త్వాకామేశ్వరిపదం ప్రవదే ద్ధీమహీ తతః ।
తదంతే ప్రవదేద్ భూయః తన్నః క్లిన్నే ప్రచోదయాత్
గాయత్ర్యేషా సమాఖ్యాతా త్రైపురీ సర్వసిద్ధిదా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - త్రిపురభైరవియొక్క గాయత్రీమంత్రము చెప్పబడుచున్నది. **"ఐం త్రిపురాదేవి విద్మహే, కామేశ్వరి ధీమహి, తన్నో క్లిన్నే ప్రచోదయాత్"** ఈ మంత్రము సకల సిద్ధులనూ ఇచ్చును.

## త్రిపురభైరవీ యంత్రము

శ్లో॥ మధ్యాద్యం నవయోనిషు ప్రవిలిఖేత్ బీజానివర్ణాంస్త్రింశో
గాయత్ర్యాః పునరష్టపత్రవివరే ష్వాలిఖ్యలిప్యావృతమ్ ।
భూబింబద్వియేన మన్మతయుజా కోణేషు సంవేష్టితం
యంత్రంత్రైపురమీరితం త్రిభువన ప్రక్షోభకం శ్రీప్రదమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నవయోన్యాత్మకమైన ఈ యంత్ర మధ్యమునుండి త్రిపురయొక్క వాగ్బజ, కామబీజ, కామరాజ బీజములు ఒక్కొక్కటి మూడు ఆవృత్తములు లిఖించాలి. అష్టపత్రములందు త్రిపురగాయత్రి లిఖించాలి. పిమ్మట దానిపై వృత్తము లిఖించి అందు మాతృకాక్షరములు లిఖించాలి. భూపురకోణములందు పరస్పర విలోమముగా భైరవీ మన్మథ బీజములు లిఖించాలి.



శ్రీ భైరవీ యంత్రం

శ్లో॥ అస్మిన్ యంత్రే సమావాహ్య సమ్యక్ సంపూజ్యదేవతాం
హోమేన కృతసంపాతం లాక్షాలోహత్రయావృతమ్ ।
విధృతాం బాహునా యంత్రం యుద్ధేషు విజయావహం
వాదేవాగ్విజయం కుర్యాత్ కవిత్వం పుష్కలం దిశేత్ ।
ఆయురారోగ్య మిత్రాణి పుత్రాన్ పౌత్రాన్ వివర్ధయేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పై యంత్రమునందు త్రిపురభైరవిని ఆవాహనచేసి చక్కగా పూజించాలి. మరల హోమంచేసి శేషఘృతముతో యంత్రమును లిప్తముచేసి, బంగారం - వెండి - రాగి మిశ్రమ తాయెత్తునందుంచి, మూసివేసి, దానిని చేతికి ధరించాలి. ఇట్టి ప్రక్రియవలన దీనిని ధరించిన సాధకుడు విజయమును పొందును. ఆయురారోగ్యమిత్ర పుత్ర పౌత్ర సంపదలతో అభివృద్ధిచెంది చిరకాలము జీవించును.

## సౌభాగ్యద యంత్రము

శ్లో॥ కామం షట్కోణమధ్యే లిఖతుపునరిమంషట్సుకోణేషు పశ్చాత్
పత్రేషు ద్వ్యష్టసంఖ్యేష్వముమథపురతో వ్యోమబీజేన వీతమ్।

క్షౌణీబింబాంతరస్థం భుజదళలిఖితం రోచనా కుంకుమాభ్యాం
ప్రోక్తం సౌభాగ్యసంపత్ నిరుపమకవితా కీర్తిదం యంత్రమేతత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సౌభాగ్యప్రదమగు యంత్రము వివరించబడుచున్నది. షట్కోణము లిఖించి, అందు మధ్యన భైరవీ మధ్యబీజము (కామబీజము) లిఖించి దానిపై **16** పత్రములు లిఖించి మరలకామ బీజము లిఖించాలి.

పత్ర అగ్రభాగములందు కూడా ఇవే లిఖించాలి. పిమ్మట భూపురమందు నాలుగువైపులా వ్యోమబీజము (హం)తో, పరివేష్టితం చేయాలి.

ఈ యంత్రము భూర్జపత్రముపై గోరోచనా, కుంకుమ మిశ్రమంతో లిఖించి, పూజించి ధరించినచో సౌభాగ్యము, సంపత్, నిరుపమానమైన కవిత్వశక్తి, కీర్తి లభించును.

## మనోభవాత్మక యంత్రము

శ్లో॥ వహ్నేర్గేహయుగాంతరస్థమదనే మాయాంలిఖేద్వాగ్భవం
షట్కోణేష్వథ సంధిషు ప్రవిలిఖే ద్ధుంకార మావేష్టయేత్ ।
స్త్రీంబీజేన సమీరితం త్రిభువన ప్రక్షోభకం త్రైపురం
యంత్రం పంచమనోభవాత్మకమిదం సౌందర్య సంపత్కరమ్ ॥
అథరోబిందు మానోద్యో బ్రహ్మేంద్రస్థః శశీయుతః
ద్వితీయం భృగుసర్గాఢ్యో మనుస్తార్తీయ మీరితమ్ ।
ఏషాబాలేతి విఖ్యాతా త్రైలోక్యవశకారిణీ
జపపూజాదికం సర్వమస్యాః పూర్వవదాచరేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ పంచ మనోభవాత్మక యంత్రము ఎంతో విశిష్టమైనది. షట్కోణము లిఖించి అందు మధ్య "హ్రీం – ఐం" లిఖించాలి. మరల దానిపై వృత్తమునందు, కోణములమధ్య సంధుల యందు అయిదుసార్లు "బ్లూం" లిఖించి, చివర "స్త్రీం" లిఖించాలి. ఇలా అయిదు కామబీజములతో యంత్రము విరాజిల్లుచుండును. ఇది ముందువలెనే అర్చన, జపాదులు ఆచరించి ధరించిన సౌందర్య సంపత్ విలాసములు కలుగును.

సమస్త జగత్‌నూ వశపరచుకొను బాలామంత్రము చెప్పబడుచున్నది. ఈ మంత్రజపము వలన ఇష్టసిద్ధి కలుగును.

**మనుః : ఐం క్లీం సౌః।** పిమ్మట ఈ క్రింది స్తోత్రము పఠించాలి.

## త్రిపుర భైరవీ స్తోత్రము

శ్లో॥ బ్రహ్మాదయః స్తుతిపదైరపి సూక్ష్మరూపాం
జానంతినైవ జగదాదిమనాదిమూర్తిమ్ ।
తస్మాద్వయం కుచనతాం నవకుంకుమాభాం
స్థూలాంస్తుమః సకలవాంఙ్మయ మాతృభూతామ్ ॥

సద్యః సముద్యత సహస్రదివాకరాభాం
విద్యాక్షసూత్ర వరదాభయ చిహ్న హస్తాం ।
నేత్రోత్పలైస్త్రిభిరలంకృత పద్మవక్త్రాం
తాం తారహారరుచిరాం త్రిపురేభజామః ॥

సింధూర పుంజరుచిరం కుచభార నమ్రం
జన్మాంతరేషు కృతపుణ్యఫలైక గమ్యం ।
అన్యోన్య భేదకలహాకుల మానభేదై
ర్జానంతి కిం జడధియస్తవరూపమంబ ॥

స్థూలాంవదంతి మునయః శృతయోగృణంతి
సూక్ష్మాంవదంతి వచసామథివాసమన్యే ।
త్వాంమూల ముహురపరే జగతాం భవాని
మన్యామహే వయమపార కృపాంబురాశిమ్ ॥

చంద్రావతంస కలితాం శరదిందుశుభ్రాం
పంచాశదక్షరమయీం హృది భావయంతి ।
త్వాంపుస్తకం జపవటీ మమృతాఢ్య కుంభం
వ్యాఖ్యాంచ హస్తకమలైర్దధతీం త్రినేత్రామ్ ॥

శంభుస్త్వమద్రి తనయాకలితార్ధ భాగో
విష్ణుస్త్వమంబ కమలా పరిబద్ధదేహః ।
పద్మోద్భవస్త్వమసి వాగథివా సభూమిః
తేషాంక్రియాం చ జగతి త్రిపురే త్వమేవ ॥

ఆశ్రిత్య వాగ్భవ భవాంశ్చతురః పరాదీన్
భావాన్ పదేషు విహితార్థముదీరయంతీమ్ ।
కంఠాదిభిశ్చ కరణైః పరదేవతాం త్వాం
సంవిన్మయీంహృది కదాపి న విస్మరామి ॥

ఆకుంచ్యవాయుమవజిత్య చ వైరిషట్కం
ఆలోక్యనిశ్చలథియా నిజనాసికాగ్రమ్ ।
ధ్యాయంతి మూర్ధ్ని కలితేందు కళావతంసం
త్వద్రూపమంబ కృతినస్తరుణార్క బింబమ్ ॥

త్వంప్రాప్య మన్మథరిపో ర్వపురర్ధభాగం
సృష్టింకరోషి జగతామిది వేదవాదః ।

సత్యంతదద్రితనయే జగదేకమాతః
నోచేదశేషజగతః స్థితిరేవనస్యాత్ ॥
పూజాంవిధాయ కుసుమైః సురపాదపానాం
పీఠేతవాంబ కనకాచలగహ్వరేషు ।
గాయంతి సిద్ధవనితాః సహ కిన్నరీభిః
ఆస్వాదితాసవరసారుణనేత్ర పద్మాః ॥
☞ విద్యుద్విలాసవపుషః శ్రియమావహంతీం
యాంతీంస్వవాస భవనాచ్ఛివరాజధానీమ్ ।
సౌషుమ్ణమార్గ కమలాని వికాసయంతీం
దేవీంభజే హృదిపరామృతసిక్త గాత్రీమ్ ॥
ఆనందజన్మభవనం శృతీనాం
చైతన్యమాత్రతనుమంబ సమాశ్రయామి ।
బ్రహ్మేశవిష్ణు భిరభిష్టుత పాదపద్మం
సౌభాగ్యజన్మవసతిం త్రిపురేయథావత్ ॥
శబ్దార్థభావి భువనం సృజతీం దురూపా
యాతద్బిభర్తి పునరర్క తనుః స్వశక్త్యా ।
వహ్న్యాత్మికా హరతితత్ సకలంయుగాంతే
తాంశారదాం మనసి జాతు న విస్మరామి ॥
☞ నారాయణీతి నరకార్ణవ తారిణీతి
గౌరీతి ఖేదశమనీతి సరస్వతీతి ।
జ్ఞానప్రదేతి నయనత్రయ భూషితేతి
త్వామద్రిరాజతనయే విబుధావదంతి ॥

యేస్తు వంతిజగన్మాతః శ్లోకైర్ద్వాదశభిః క్రమాత్ ।
త్వామనుప్రాప్య వాక్సిద్ధిం ప్రాప్నుయుస్తే పరాంగతిమ్ ॥

ఈ పన్నెండు శ్లోకములూ, భక్తితో పారాయణ చేయుటవలన, వాక్సిద్ధి కలుగును. 12 సంఖ్య కోశభేదముచే **"ద్యుమణిమాలా"** అనే ప్రబంధముగా దీనిని భావించవచ్చు. దీని లక్షణమును **"భామహుడు"** అనే ఆలంకారికుడు ఇట్లు నిర్వచించాడు.

అథ ద్యుమణి మాలాస్యాత్ పద్యైర్ ద్వాదశభిః సమైః
ప్రత్యేకం నాయకోత్కర్ష ప్రకాశన పరాయణైః ।
ముఖబంధే శ్లోకయుగ్మం తథాశేషే ద్వయం మతం
కృతాద్యుమణి మాలేయం కీర్తివృద్ధికరీ నృణామ్ ।

ఇపుడు రాజమాతంగినీ మంత్రసాధన వివరింపబడుచున్నది.

## రాజమాతంగినీ

శ్లో॥ వాంఙ్మాయా కమలాస్త్రారం నమోఽంతే భగవత్యథ
శ్రీమాతంగీశ్వరవదేత్ సర్వజనమనోహరి ।
సర్వాది సుఖరాజ్యంతే సర్వాదిముఖ రంజని
సర్వరాజవశం పశ్చాత్ కరిసర్వపదంవదేత్ ।
స్త్రీపురుష వశంబ్రహ్మే నేత్ర మగ్న్యా సనం పునః
సర్వదుష్ట మృగవశంకరి సర్వభృగుస్త్వవ ।
శంకరిస్యాత్ సర్వలోక మముకం శివయుగ్రవిః
వశమానయ జాయాగ్నే రష్టాశీత్యక్షరోమనుః ।
న్యాసాన్మంత్రీ తనౌకుర్యాద్వక్ష్యమాణాన్ యథాక్రమం
శిరోలలాట భ్రూమధ్యే తాలుకంఠ గళోరసి ।

అనాహతే భుజద్వంద్వే జఠరే నాభిమండలే
స్వాధిష్ఠానే గుహ్యదేశే పాదయోర్దక్షిణాన్యయోః ।
మూలాధారే గుదే న్యస్యేత్ పదాన్యష్టాదశక్రమాత్
గుణైకద్విచతుః షడ్భిర్వసుషట్ పర్వతాష్టభిః ।
దశపంక్త్యష్టవేదాగ్ని చంద్రయుగ్మం గుణాక్షిభిః
పదక్లప్తిరియం ప్రోక్తా మంత్రవర్ణైర్యథాక్రమమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ రాజమాతంగిని మంత్రము 88 అక్షరములు గలది.

**మనుః - "ఐం హ్రీం శ్రీం ఓం నమో భగవతి శ్రీమాతంగీశ్వ సర్వ జనమనోహారి సర్వముఖారాజి సర్వముఖరంజని సర్వరాజవశంకరి సర్వస్త్రీపురుష వశంకరి, సర్వదుష్టమృగవశంకరి, సర్వసత్త్వ వశంకరి, సర్వలోక ముముకం మే వశమానయ స్వాహా ॥**

దక్షిణామూర్తిఋషిః । గాయత్రీఛందః । హ్రీంబీజం । స్వాహాశక్తిః । శరీరమునందు ఈ 18 స్థానములందు, మూలమంత్రములోని అక్షరములతో ఇలా న్యాసం ఆచరించాలి.

1. శిరస్సునందు - మంత్రములోని మొదటి మూడు లక్షరములు, ఐంహ్రీం, శ్రీం.
2. లలాటమునందు - 'ఓం' న్యాసము చేయాలి.
3. భ్రూమధ్యమందు - నమో
4. దవడలయందు - భగవతి
5. కంఠమునందు - శ్రీమాతంగీశ్వరి
6. మెడయందు - సర్వజనమనోహరిస
7. హృదయమునందు - సర్వముఖరాజి

8. అనాహతమందు - సర్వముఖరంజని

9.10. రెండుభుజములందు - సర్వరాజ, వశంకరి - సర్వస్త్రీ పురుష వశంకరి.

11. జఠరమందు - సర్వసత్త్వ వశంకరి.

12. నాభియందు - సర్వసత్త్వ వశంకరి

13. స్వాధిష్ఠానమునందు - సర్వలోకం

14. లింగమునందు - అముకం

15. కుడికాలియందు - మే

16. ఎడమకాలియందు - వశం

17. మూలాధారమందు - ఆనయ

18. గుదమునందు - స్వాహా ॥

శ్లో॥ రత్యాద్యా మూలహృదయభ్రూమధ్యేషు విచక్షణాః
వాక్శక్తి లక్ష్మీబీజాద్యా మాతంగ్యంతాః ప్రవిన్యసేత్ ।
శిరోవదనహృద్గుహ్య పాదేషు విధివన్న్యసేత్
హృల్లేఖాంగగనాంరక్తాం భూయోమంత్రీ కరాళికామ్ ।
మహోచ్ఛుష్మాం స్వనామాది వర్ణబీజపురస్సరాః
మాతంగ్యంతాః షడంగాని తతఃకుర్వీత సాధకః ।
వర్ణైశ్చతుర్భిర్వింశత్యాహృత్ త్రయోదశ భిఃశిరః
శిఖాఽష్టాదశభిఃప్రోక్తా వర్మతావద్భిరక్షరైః ।
స్యాత్ త్రయోదశభిర్నేత్రం ద్వాభ్యా మస్త్రం సమీరితం
విభక్తై ర్మూలమంత్రార్ణై ర్బాణ న్యాసమథాచరేత్ ।
మూర్ధ పాదాస్యగుహ్యేషు హృదంభోజే ప్రవిన్యసేత్ ।

ద్రావిణీం క్షోభిణీంభూయో వర్ధనీం మోహినీంపునః ।
ఆకర్షిణీం స్వనామాది బీజాద్యా శుభలక్షణాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట మూలాధార - హృదయ - భ్రూమధ్యములందు ఇలా న్యాసం చేయాలి.

ఐం హ్రీం శ్రీం రత్యై మాతంగ్యై నమః - మూలాధారే ।
ఐం హ్రీం శ్రీం ప్రీత్యై మాతంగ్యై నమః - హృదయే ।
ఐం హ్రీం శ్రీం మనోభవాయై మాతంగ్యై నమః - భ్రూమధ్యే ।

పిమ్మట శిరో - ముఖ - హృదయ - గుహ్య - పాదములందు, హృల్లేఖా - గగనా - రక్తా - కరాలికా - మహోచ్ఛుష్మలనే దేవీ రూపములను వారి నామ ప్రథమాక్షరముతో ఇలా న్యాసం చేయాలి.

హ్రాం హృల్లేఖాయై నమః - శిరసి ।
గం గగనాయై నమః - ముఖే
రం రక్తాయై నమః - హృదయే ।
కం కరాలికాయై నమః - గుహ్యే ।
మం మహోచ్ఛుష్మాయై నమః- పాదయోః ।

పిమ్మట, షడంగన్యాసమందు మూలమంత్రంలోని 88 అక్షరములనూ ఈ క్రింది విధముగా న్యాసం చేయాలి.

ఐం హ్రీం శ్రీం ఓం నమోభగవతి శ్రీమాతంగీశ్వరి సర్వజనమనోహరి - హృదయాయ నమః ।
సర్వముఖరాజి సర్వముఖరంజని - శిరసేస్వాహా ।
సర్వరాజవశంకరి సర్వస్త్రీపురుషవశంకరి - శిఖాయైవషట్ ।
సర్వదుష్టమృగవశంకరి సర్వసత్త్వశంకరి - కవచాయహుం ।

సర్వలోకమముకం మేవశమానయ - నేత్రత్రయాయ వౌషట్

స్వాహా - అస్త్రాయఫట్

మరల మూలమంత్రమును **5** భాగములు చేసి, (పైన చెప్పిన షడంగ న్యాసములో నేత్రన్యాసము విడచి) పంచాంగన్యాసమాచరించాలి. పంచాంగ న్యాసమునందు నేత్రన్యాసము ఉండదు.

మరల శిరో - పాద - ముఖ - గుహ్య - హృదయములందు ద్రావిణ్యాదులను ఇలా న్యాసం చేయాలి.

ద్రాంద్రావిణ్యై నమః - శిరసి ।

క్షోం క్షోభిణ్యై నమః - పాదయోః ।

వం వర్ధిన్యై నమః - ముఖే ।

మోం మోహిన్యై నమః - గుహ్యే ।

అం ఆకర్షిణ్యై నమః - హృదయే ।

శ్లో॥ మాతంగ్యంతాంస్తతోన్యస్యే న్మన్మథాన్ వదనాంసయోః ।
పార్శ్వకట్యోర్నాభిదేశే కటిపార్శ్వాంసకేపునః
బీజత్రయాదికాన్మంత్రీ మన్మథం మకరధ్వజమ్ ।
మదనం పుష్పధన్వానం పంచమం కుసుమాయుధం
షష్ఠం కందర్పనామానం మనోభవ రతిప్రియౌ ।
మాతంగ్యంతాస్తనైన్యస్యేత్ స్థానేత్వేతేషు మంత్రవిత్
ప్రథమాఽనంగ కుసుమా భూయోఽన్యాఽనంగ మేఖలా।
అనంగమదనా తద్వదనంగ మదనాతురా
అనంగమదన వేగా భూయశ్చాఽనంగ సంభవా ।
సప్తమ్యనంగ భువనపాలినీ స్యాదథవాఽష్టమీ
అనంగశశిరేఖాఽన్యా మాతంగ్యంతాః సమీరితాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మన్మథన్యాసం 8 స్థానము లందు ఇలా ఆచరించాలి.

ఐం హ్రీం శ్రీం మన్మథాయ మాతంగ్యై నమః – ముఖే

ఐం హ్రీం శ్రీం మకరధ్వజాయ మాతంగ్యై నమః – భుజయోః ।

ఐం హ్రీం శ్రీం మదనాయ మాతంగ్యై నమః – పార్శ్వయోః ।

ఐం హ్రీం శ్రీం పుష్పధన్వనే మాతంగ్యై నమః – కట్యాం ।

ఐం హ్రీం శ్రీం కుసుమాయుధాయ మాతంగ్యై నమః– నాభౌ ।

ఐం హ్రీం శ్రీం కందర్పాయ మాతంగ్యై నమః – కట్యాం । (పునః)

ఐం హ్రీం శ్రీం మనోభవాయ మాతంగ్యై నమః – దక్షిణపార్శ్వే ।

ఐం హ్రీం శ్రీం రతిప్రియాయ మాతంగ్యై నమః – వామపార్శ్వే ।

శ్లో॥ విన్యస్తవ్యాస్తనౌ మూలేఽధిష్ఠానే మణిపూరకే
హృత్ కంఠాస్యే భ్రువోర్మధ్యే మస్తకే మంత్రిణాతతః ।
ఆద్యే లక్ష్మీసరస్వత్యౌ రతిః ప్రీతిశ్చ కృత్తికా
శాంతిః పుష్టిస్తథా తుష్టిర్మాతంగీ పదశేఖరాః ।
మూలమంత్రంప్రవిన్యస్యేన్నిజమూర్ధని మంత్రవిత్
ఆధారదేశేఽధిష్ఠానే నాభౌపశ్చాదనాహతే ।
కంఠే వక్త్రే భ్రువోర్మధ్యే మస్తకేవిన్యసేత్ క్రమాత్
బ్రాహ్మ్యాద్యాః పూర్వముద్దిష్టా మాతంగీ పదపశ్చిమాః ।
ఏషుస్థానేషు విన్యస్యే దసితాంగాది భైరవాన్
మాతంగ్యంతాన్ న్యసేన్మంత్రీ మూలమంత్రం స్వమూర్ధని।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – శరీరమునందు మూలాధారాది 8 స్థానములందూ లక్ష్మి మొదలగువారిని ఇలా న్యాసం చేయాలి.

లం లక్ష్మై మాతంగ్యై నమః - మూలాధారే ।
సం సరస్వత్యై మాతంగ్యై నమః - స్వాధిష్ఠానే । (లింగమూలే)
రం రత్యై మాతంగ్యై నమః - మణిపురే । (నాభౌ)
ప్రీం ప్రీత్యై మాతంగ్యై నమః - హృదయే ।
కృం కృత్తికాయై మాతంగ్యై నమః - కంఠముఖే ।
శాం శాంత్యై మాతంగ్యై నమః - ఆస్యే ।
పుం పుష్ట్యై మాతంగ్యై నమః - భ్రువోర్మధ్యే ।
తుంతుష్టై మాతంగ్యై నమః - మస్తకే ।

మరల - ఆధార - స్వాధిష్ఠాన - నాభి - అనాహత - కంఠ - ముఖ - భ్రూ - మధ్య - మస్తకములందు బ్రాహ్మీ మొదలగువారిని మాతంగ్యై నమః అని చివర చేర్చి న్యాసం చేయాలి. ఇవే స్థానములందు అసితాంగాది అష్టభైరవులను మస్తకమునందు పూర్తి మూలమంత్రములందు అసితాంగాది అష్టభైరవులను మస్తకమునందు పూర్తి మూలమంత్రముతో న్యాసం చేయాలి.

శ్లో॥ ఆధారదేశేఽధిష్ఠానే నాభౌ పశ్చాదనాహతే
కంఠదేశే బ్రువోర్మధ్యే బిందేభూయః కలాపదే ।
నిరోధికాయామర్ధేందౌ నాదనాదాంతయోఃపునః
ఉన్మన్యాం విష్ణువక్త్రే చ ధృవమండలకేశివే ।
మాతంగ్యంతాః ప్రవిన్యస్యేద్వామాంజ్యేష్ఠామతః పరం
రౌద్రీంప్రశాంతిం శ్రద్ధాఖ్యాం పునర్మాహేశ్వరీమథ ।
క్రియాశక్తిం సులక్ష్మీంచ సృష్టిసంజ్ఞాంచ మోహినీమ్
ప్రమథాం శ్వాసినీం విద్యుల్లతాం చిచ్ఛక్తిమప్యథ ।
తతశ్చసుందరానందాం నందబుద్ధిమిమాఃక్రమాత్

శిరోభాల హృదాధారేష్వేతా బీజత్రయాదికాః ।
మాతంగ్యంతాః ప్రవిన్యస్యేద్యథావద్దేశికోత్తమః
మాతంగీం మహదాద్యాంతాం మహాలక్ష్మీం పదాదికామ్ ।
సిద్ధలక్ష్మీ పదాద్యాంతాం మూలమాధారమండలే
న్యస్యతేనైవ కుర్వీత వ్యాపకందేశికోత్తమః ।
ఏవన్యస్త శరీరోఽసౌ చింతయేదాత్మ దేవతామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట ఈ 16 స్థానములందు, వామాదిశక్తులను మాతంగ్యై నమః అని చివర చేర్చి న్యాసము చేయవలయును.

| | | | |
|---|---|---|---|
| 1. | వామాయై మాతంగ్యై నమః | - | మూలాధారే । |
| 2. | జ్యేష్ఠాయై మాతంగ్యై | - | స్వాధిష్ఠానే । |
| 3. | రౌద్ర్యై మాతంగ్యై నమః | - | నాభౌ । |
| 4. | ప్రశాంత్యై మాతంగ్యై నమః | - | అనాహతే । |
| 5. | శ్రద్ధాయై మాతంగ్యై నమః | - | కంఠే । |
| 6. | మాహేశ్వర్యై మాతంగ్యై నమః | - | భ్రూమధ్యే । |
| 7. | క్రియాశక్త్యై మాతంగ్యై నమః | - | బిందౌ । |
| 8. | సులక్ష్మ్యై మాతంగ్యై నమః | - | కళాపదే । |
| 9. | సృష్ట్యై మాతంగ్యై నమః | - | నిరోధికాయాం । |
| 10. | మోహిన్యై మాతంగ్యై నమః | - | అర్ధేందౌ । |
| 11. | ప్రమథాయై మాతంగ్యై నమః | - | నాదే । |
| 12. | శ్వాసిన్యై మాతంగ్యై నమః | - | నాదాంతే । |
| 13. | విద్యుల్లతాయై మాతంగ్యై నమః | - | ఉన్మన్యాం । |

**14.** చిచ్ఛక్త్యై మాతంగ్యై నమః - విష్ణువక్త్రే ।

**15.** సుందరానందాయై మాతంగ్యై నమః - ధ్రువమండలే ।

**16.** నందబుద్ధ్యై మాతంగ్యై నమః - శివే ।

పిమ్మట, మరల బీజత్రయములకు మాతంగ్యై నమః చేర్చి ఈ క్రింది స్థానములందు ఇలా న్యాసం చేయాలి.

ఐం హ్రీం శ్రీం మహామాతంగీ మాతంగ్యై నమః - శిరసి ।

ఐం హ్రీం శ్రీం మహాలక్ష్మీ మాతంగ్యై నమః - భాలే ।

ఐం హ్రీం శ్రీం సిద్ధలక్ష్మీ మాతంగ్యై నమః - హృదయే ।

మూలమంత్రముతో - మూలాధారే । ఇలా న్యాసమాచరించి, వ్యాపకన్యాసం (మస్తకా ద్యాపాదాంగుష్ఠాంతము) ఆచరించి, ఇలా ధ్యానించాలి.

శ్లో॥ ధ్యాయేయంరత్నపీఠే శుకకలపఠితం శృణ్వతీం శ్యామలాంగీం
న్యస్తైకాంఘ్రిం సరోజే శశిశకలధరాం వల్లకీంవాదయంతీమ్ ।
కహ్లారాబద్ధ మాలాం నియమిత విలసత్ చూలికాంరక్తవస్త్రాం
మాతంగీం శంఖపత్రాం మధుమదవివశాం చిత్రకోద్భాసిభాలామ్॥

ఈవిధంగా ధ్యానించినా నంతరం వీణాముద్ర - యోనిముద్రలు ప్రదర్శించాలి.

శ్లో॥ అయుతం ప్రజపేన్మంత్రీ తద్దశాంశం మధూకజైః
పుష్పైస్త్రిమధురోపేతైర్జుహుయా న్మంత్రసిద్ధయే ।
త్రికోణకర్ణికం పద్మం అష్టపత్రం ప్రకల్పయేత్
అష్టపత్రావృతం బాహ్యే వృత్తంషోడశభిర్దలైః ।
చతురస్ర సమాయుక్తం కాంత్యాదృష్టి మనోహరమ్
ఏతస్మిన్ పూజయేత్పీఠే నవశక్తీః క్రమాదిమాః ।

విభూతిరున్నతిః కాంతిః సృష్టిః కీర్తిశ్చ సన్నతిః
వృష్టిరుత్కృష్టి బుద్ధిశ్చ మాతంగీ పద పశ్చిమాః ।
సర్వాంతే శక్తి కమలాసనాయ నమ ఇత్యథ
వాక్శక్తి లక్ష్మీ బీజాద్యో మనురాసన సంజ్ఞకః ।
మూలేనమూర్తిం సంకల్ప్య తస్యామా వాహ్యదేవతాం
అర్చయేద్విథినాఽనేన వక్ష్యమాణేన మంత్రవిత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రమును పదివేలు జపించి, త్రిమధురమిశ్రిత ఇప్పపూలతో దశాంశహోమమాచరించాలి. త్రికోణమందు పైన వృత్తము లిఖించి అందుపై అష్టపద్మదళములను నిర్మించాలి. దానిబయట అష్టపత్రములు లిఖించి వేష్టితం చేయాలి.

మరల దానికిబయట 16 దళములు లిఖించి వృత్తం చుట్టాలి. నాలుగువైపులా చతురస్ర ద్వాము నిర్మించాలి. ఈ పీఠమునకు నవశక్తులను ఇలా ఆహ్వానించాలి.

1. విభూతిమాతంగ్యై నమః 2. ఉన్నతిమాతంగ్యై నమః 3. కాంతి మాతంగ్యై నమః 4. సృష్టిమాతంగ్యై నమః 5. కీర్తిమాతంగ్యై నమః 6. సన్నతి మాతంగ్యై నమః 7. వృష్టిమాతంగ్యై నమః 8. ఉత్కృష్టి మాతంగ్యై నమః 9. బుద్ధిమాతంగ్యై నమః ।

ఇలా అందరినీ పూజించి "ఐం హ్రీం శ్రీం సర్వశక్తి కమలాసనాయ నమః" అని దేవికి ఆసనం కల్పించాలి. మూలమంత్రముతో ఆమె స్వరూపమును సంకల్పించి, విగ్రహమునందు దేవతను ఆహ్వానించి ఇలా అర్చించాలి.

శ్లో॥ రత్యాద్యాస్త్రిషు కోణేషు పూజయేత్ పూర్వవత్ సుధీః
హృల్లేఖాద్యాః పంచపూజ్యామధ్యేదిక్షు చ మంత్రిణా ।

పాశాంకుశాభయాభీష్ట ధారిణ్యోభూత సప్రభాః
అంగాని పూజయేత్పశ్చాద్యథా పూర్వం విధానవిత్ ।
బాణానభ్యర్చయేద్దిక్షు పశ్చిమం పురతోయజేత్
దళమధ్యేషు సంపూజ్యా అనంగకుసుమాదయః ।
పాశాంకుశాభయాభీష్ట ధారిణ్యోఽరుణవిగ్రహాః
పత్రాగ్రేషు పునః పూజ్యా లక్ష్మ్యాద్యా వల్లకీకరాః ।
బహిరష్ట దళేష్వర్చ్యా మన్మథాద్యా మదోద్ధతాః
అపరాంగనిషంగాఢ్యాః పుష్పాస్త్రేక్షు ధనుర్ధరాః ।
పత్రస్థా మాతరః పూజ్యా బ్రాహ్మ్యాద్యాః ప్రోక్తలక్షణాః
తదగ్రేష్వర్చయేద్విద్వాన్ అసితాంగాది భైరవాన్ ।
పునఃషోడశపత్రేషు పూజ్యాః షోడశశక్తయః
వామాద్యాః కలవీణాభిర్గాయంత్యః శ్యామ విగ్రహాః ।
చతురస్ర చతుర్దిక్షు చతస్రః పూజయేత్ పునః
మాతంగ్యాద్యా మదోన్మత్తా వీణాలలితపాణయః ।
✡ ఆగ్నేయకోణే విఘ్నేశం దుర్గాంనైశాచరే యజేత్
వాయవ్యేవటుకం పశ్చాదైశాన్యే క్షేత్రపంయజేత్ ।
లోకపాలాః బహిః పూజ్యా వజ్రాద్యై రాయుధై స్సహ
మంత్రేఽస్మిన్ సాధితే మంత్రీ సాధయేదిష్టమాత్మనః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట మూడు కోణములందూ రతి – ప్రీతి – మనోభవలను, మధ్యలో మరియు నాలుగు వైపులా హృల్లేఖా - గగనా - రక్తా - కరాలికా - మహోచ్ఛుష్మాలను అర్చించాలి.

వీరంతా పాశాంకుశ వరదాభయముద్రలు ధరించియుంటారు. వీరి శరీరము క్రమముగా పంచభూతముల వర్ణమును పోలియుండును. పిమ్మట అంగపూజ చేయాలి.

నాలుగుదిశలందూ 4 కామ బాణములను (ద్రాం - ద్రీం - క్లీం - బ్లూం) పంచమ బాణమును (సః) తన ఎదుట పూజించాలి. వీరంతా పాశాంకుశ వరదాభయ ముద్రలు ధరించి యుందురు. ఎర్రని శరీరముతో నుందురు.

పత్రాగ్రభాగములందు వీణాధారిణులైన లక్ష్మ్మి మొదలగు వారిని 8మందిని అర్చించాలి. పిమ్మట అష్టదళమునకు బయట మన్మథాదులను 8మందిని పూజించాలి. వీరంతా చెరకువిల్లు పుష్పబాణములు ధరించి, వీపుపై అమ్ములపొది (నిషంగము) ధరించి యుందురు.

పత్రములందు బ్రాహ్మీ మొదలైన దేవతలను పూజించి మరల పత్రాగ్రభాగములందు అసితాంగాది 8మంది భైరవులనూ అర్చించాలి. మరల షోడశపత్రములందు వామాది షోడశశక్తులను పూజించాలి. (ముందు చెప్పబడినది) వీరంతా శ్యామలశరీరులు, వీరంతా మనోహరముగా వీణాగానము చేయుచుందురు.

ఆగ్నేయమందు గణపతిని, నైరుతియందు దుర్గను, వాయవ్యమందు బటుక భైరవుని, ఈశాన్యమందు క్షేత్రపాలకుని అర్చించాలి. పిమ్మట వజ్రాది ఆయుధములు ధరించిన లోకపాలురను పూజించాలి. ఈవిధంగా అర్చించి సిద్ధినిపొందిన సాధకుడు అభీష్టప్రయోగములను సాధించగలడు.

శ్లో॥ మల్లికాజాతి పున్నాగై ర్హోమాద్ భాగ్యాలయోభవేత్
ఫలైర్బిల్వసముద్భూతై స్తత్పత్రైర్వా హుతాద్భవేత్ ।
రాజపుత్రస్య రాజ్యాప్తిః పంకజైః శ్రియమాప్నుయాత్

ఉత్పలైర్వశయేద్విశ్వం లక్ష్మీపుష్పైస్తథా నరః ।
బంధూక పుష్పైర్బకులైర్జపోత్థై కింశుకోద్భవైః
వశ్యాయ జుహుయాన్మంత్రీ మధునా సర్వసిద్ధయే ।
లవణైర్మధురోపేతై ర్హుత్వా కర్షతిసుందరీం
వంజులస్య సమిద్ధోమో వృష్టిం వితనుతేఽచిరాత్ ।
క్షీరాక్తైరమృతాఖండై ర్హోమోనాశయతి జ్వరం
దూర్వాభిరాయురాప్నోతి కదంబైర్వశ మాప్నుయాత్ ।
అన్నవానన్నహోమేన తండులైర్ధ నవాన్భవేత్
సర్వంత్రిమధురోపేతం హోమద్రవ్యముదాహృతమ్ ।
నంద్యావర్తభవైః పుష్పైర్హోమో వాక్సిద్ధి దాయకః
నింబప్రసూనైర్జుహుయాదీప్సితాం శ్రియమశ్నుతే ।
పలాశకుసుమైర్హోమాత్తేజస్వీ జాయతే నరః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మల్లి - జాజి - పున్నాగ పూల హోమముచే సాధకుడు గొప్ప భాగ్యవంతుడగును. మారేడుపండ్లతో గాని, మారేడు ఆకులతోగాని హోమం చేసిన అధికారమును, పదవిని పొందును. కమలహోమముచే సంపద కలుగును. ఎర్రకలువ లేదా వకుళ పుష్పముల హోమము వలన వశీకరణము సిద్ధించును.

మందార - బంధూక - వకుళ - కలువ - మోగు పూలహోమము వలన కూడా వశ్యము సిద్ధించును. సర్వసిద్ధికొరకు తేనెతో హోమం చేయాలి. త్రిమధుర యుక్తలవణ హోమముచే సౌందర్యవతులను ఆకర్షించగలడు. వంజుల (        ) హోమముచే వర్షము కురియును.

పాలతో తడిపిన తిప్పతీగ సమిధలు హోమం చేయుటవలన జ్వరము నశించును. దూర్వాహోమము వలన ఆయుర్వృద్ధి కలుగును. కదంబ

(కడిమి) పూలహోమము వలన వశీకరణము సిద్ధించును. అన్నహోమముచే అన్నసమృద్ధి కలుగును.

నంద్యావర్త పూలహోమము వలన వాక్సిద్ధి కలుగును. నిమ్మపూలతో హోమమువలన వాంఛితధనము పొందును. మోదుగపూల హోమము వలన తేజస్సు కలుగును.

శ్లో॥ చందనాగురు కర్పూర రోచనా కుంకుమాదిభిః
వశ్యాయ జుహుయాన్మంత్రీ వశయేదఖిలం జగత్ ।
ఏతానిజప్త్వా తిలకం కుర్యాల్లోక ప్రియోభవేత్
నిర్గుండీ మూల హోమేన నిగడాన్ముచ్యతే నరః ।
నింబైలాన్వితైర్లోణైర్హోమః శత్రువినాశనః
హరిద్రా చూర్ణసంమిశ్రై ర్లవణైః స్తంభయేత్పరాన్ ।
రసవద్భిః ఫలైః పక్వైః పుష్పైః పరిమళాన్వితైః
హుత్వా సమ్యగవాప్నోతి సాధకః సర్వమీప్సితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నిమ్మనూనెతో లవణము కలిపి హోమము చేసినచో శత్రునాశనమగును. పసుపు - లవణము కలపి హోమమాచరించిన, వైరివర్గము స్తంభించును.

రసయుక్తములైన ఫలములు, సుగంధముతో కూడిన పుష్పములు హోమముచేయుటవలన మనోరథము సిద్ధించును. చందనం - అగురు - కర్పూరం - గోరోచనం - కుంకుమ మిశ్రిత పదార్థములతో హోమం చేయుటవలన వశీకరణము సిద్ధించును.

పైన చెప్పిన చందనాదులు సమభాగముగా గ్రహించి, వాటిని నూరి ఆ కర్దమమును తిలకముగా ధరించిన అందరికీ ఇష్టుడగును. నిర్గుండీ (          ) వేరు హోమము చేయుటవలన, కారాగార విముక్తుడగును. నిమ్మనూనె తయారుచేయువిధానము గ్రంథాంతరమందిట్లున్నది.

✡ బీజానిజలపిష్టాని కాంస్యపాత్రే ఖరాతపే
స్థాపయేత్తస్య తత్తైలం నిఃసరత్యేనాఽన్యథా ॥

ఇపుడు సకల కోరికలను ఇచ్చు "రాజమాతంగినీ" స్తవము చెప్పబడు చున్నది. ఇది తొమ్మిది శ్లోకములలో చెప్పినది "రత్నమాలా" అనే ప్రబంధ మనబడును. దీనినిగూర్చి "భామహుడు" ఇట్లు వివరించినాడు.

✡ నేతృప్రసిద్ధ నామాంకం శ్లోకయుగ్మం శుభావహం
కుర్యాదాద్యంతయోస్తస్య శిఖాబంధం సమాధినా ।
సుభంగిః శోభనా సాస్యాత్ రత్నమాలా నవాధికా
మాలాయాం నవరత్నాదౌ రచితాయామితి క్రమాత్ ।

నవాధికముగా చెప్పినను అది నవరత్నమాలగా చెప్పవచ్చును. ఇందు పదకొండు శ్లోకములున్నవి. దీని పారాయణమువలన అభీష్టసిద్ధి కలుగును.

## రాజమాతంగినీ స్తుతి

శ్లో॥ ఆరాధ్య మాత శ్చరణాంబుజంతే
బ్రహ్మాదయో విశ్రుతకీర్తిమాపుః ।
అన్యేపరం వాగ్విభవం మునీంద్రాః
పరాంశ్రియం భక్తిభరేణ చాఽన్యే ॥

2. నమామిదేవీం నవచంద్రమౌళే
ర్మాతంగినీం చంద్రకళావతంసామ్ ।
ఆమ్నాయవాగ్భిః ప్రతిపాదితార్థం
ప్రబోధయంతేం శుకమాదరేణ ॥

3. వినమ్ర దేవాసుర మౌళిరత్నైః
నీరాజితంతే చరణారవిందమ్ ।

భజంతి యే దేవి మహీపతీనాం
ప్రజంతి తే సంపదమాదరేణ ॥

4. మాతగంలీలాగమనే భవత్యాః
శింజానమంజీర మిషాద్ భజంతే ।
మాతస్త్వదీయం చరణారవిందం
అకృత్రిమాణాం వచసాం నిగుంఫాః ॥

5. పదాత్పదం శింజితనూపురాభ్యాం
కృతార్థయంతీ పదవీం పదాభ్యాం ।
ఆస్ఫాలయంతీ కలవల్లకీం తాం
మాతంగినీం మద్ ధృదయం ధినోతు ॥

6. నీలాంశుకాబద్ధ నితంబబింబాం
తాళీదళేనాఽర్పిత కర్ణభూషామ్ ।
మాధ్వీమదా ఘూర్ణిత నేత్ర పద్మాం
ఘనస్తనీం శంభువధూం నమామి ॥

7. తడిల్లతా కాంతమనర్ఘ్య భూషం
చిరేణ లక్ష్యం నవరోమరాజ్యా ।
స్మరామి భక్త్యా జగతామధీశే
వళిత్రయాంకం తవమధ్యబింబమ్ ॥

8. నీలోత్పలానాం శ్రియమాహరంతీం
కాంత్యాకటాక్షైః కమలాకరాణామ్ ।
కదంబమాలాంచిత కేశపాశాం
మాతంగ కన్యాం హృదిభావయామః ॥

9. ధ్యాయేయమారక్త కపోల కాంతం
బింబాధరన్యస్తలలామరమ్యం ।
ఆలోలనీలాలక మాయతాక్షం
మందస్మితంతే వదనం మహేః ॥

10. దేవతాం జగతామాద్యాం మాతంగీ మిష్టదాయినీమ్ ।
అవాప్తు మిష్టతాంవాచం భూషయేద్రత్నమాలయా ॥

11. స్తుత్వాఽనయా శంకర ధర్మపత్నీం
మాతంగినీం వాగధిదేవతాంతామ్
స్తువంతియే భక్తియుతా మనుష్యాః
పరాంశ్రియం నిత్యముపాశ్రయంతి ॥

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*ద్వాదశః పటలః సమాప్తః*

❖❖❖

## అథ త్రయోదశః పటలః

## అథ గణపతి ప్రకరణం

శ్లో॥ అధవక్ష్యే గణపతేర్మంత్రాన్ సర్వార్థ సిద్ధిదాన్
యాన్లబ్ధ్వా మానవా నిత్యం సాధయంతి మనోరథాన్ ।
పంచాంతకం శశిధరం బీజం గణపతే ర్విదుః
గణకః స్యాన్మునిశ్ఛందో నివృద్ విఘ్నోఽస్యదేవతా ।
షడ్ దీర్ఘభాజా బీజేన కుర్యాదంగక్రియామనోః
వేదలక్షం జపేన్మంత్రం దశాంశం జుహుయాత్తతః ।
మోదకైః పృథుకైర్లాజైః సక్తుభి శ్చేక్షు పర్వభిః

అష్టద్రవ్యాణి విఘ్నస్య కథితాని మనీషిభిః
తీవ్రాది శక్తిభిర్యుక్తే పీఠే విఘ్నేశ్వరం యజేత్ ।
తీవ్రాఖ్యా జ్వాలినీనందా భోగదా కామరూపిణీ
ఉగ్రాతేజోవతీ సత్యానవమీ విఘ్ననాశినీ ।
సర్వాదిశక్తి కమలాసనాయ హృదయావధిః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సంపూర్ణసిద్ధినిచ్చు 7 గణపతి మంత్రములు చెప్పబడుచున్నవి.

గణపతిబీజమంత్రము - గం, లేదా గః ।

గణకఋషిః । నివృత్ ఛందః । విఘ్నరాజోదేవతా । గంబీజం । బిందుఃశక్తిః । గం - గాం - గీం - గూం - ఇత్యాది షడ్బీజములతో షడంగ న్యాసము. ధ్యానము ఈ విధముగా చేయవలయును.

శ్లో॥ సింధూరాభాం త్రినేత్రం పృధుతర జఠరం హస్తపద్మైర్దధానం
దంతం పాశాంకుశేష్టాన్యురుకర విలసద్ బీజపూరాభిరామమ్ ।
బాలేందుద్యోతిమౌళిం కరిపతి వదనం దానపూరార్ద్ర గండం
భోగీంద్రాబద్ధ భూషం భజతగణపతిం రక్తవస్త్రాంగరాగమ్ ॥

పై మంత్రము నాలుగులక్షలు జపంచేసి, ఈ అష్టద్రవ్యములతో విడివిడిగా హోమం చేయాలి. 1. కుడుములు 2. అటుకులు 3. పేలాలు 4. పిండి 5. చెరకు ముక్కలు 6. కొబ్బరిముక్కలు 7. తిలలు 8. చక్కగా పండిన అరటిపళ్ళు.

హోమానంతరం తీవ్రాది 9 శక్తులను పూజించాలి. 1. తీవ్రా 2. జ్వాలినీ 3. నందా 4. భోగదా 5. కామరూపిణీ 6. ఉగ్రా 7. తేజోవతి 8. సత్యా 9. విఘ్ననాశినీ. వీరిని పూజించిన పిమ్మట "సర్వాదిశక్తి కమలాసనాయ నమః" అను పీఠమంత్రముతో ఆసనం కల్పించాలి.

శ్లో॥ మూలేన మూర్తిం సంకల్ప్య తస్యాం విఘ్నేశ్వరం యజేత్
కర్ణికాయాం చతుర్దిక్షు ప్రథమం పూజయేదిమాన్ ।
గణాధిపంగణేశానం తృతీయం గణనాయకం
గణక్రీడం పీతగౌర రక్తనీలరుచః క్రమాత్ ।
సర్వాన్నాగేంద్ర భూషాద్యాన్ భక్ష్యలక్షత పుష్కరాన్
యథాపూర్వం తతోఽభర్చ్య కేసరేష్వంగదేవతాః ।
పత్రమధ్యేషు విధివద్వ క్రతుండాదివాన్ యజేత్
వక్రతుండమేక దంష్ట్రం మహోదర గజాననౌ ।
లంబోదరాఖ్యం వికటం విఘ్నరాజమనంతరమ్
ధూమ్రవర్ణం దళాగ్రేషు బ్రాహ్మ్యాద్యాః పూజయేత్తతః ।
లోకపాలాంస్త దస్త్రాణి దేవమిత్థం సమర్చయేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట మూలమంత్రముతో విగ్రహమునందు, లేదా యంత్రమునందు ఆవాహనచేసి పూజించాలి. వృత్తమునకు నాలుగువైపులా 1. గనాధిప 2. గణేశాన 3. గణనాయక 4. గజక్రీడలను అర్చించాలి. వీరి వర్ణము క్రమముగా పసుపు – తెలుపు – ఎరుపు – నీలంగా యుండును.

వీరంతా సర్పభూషణులు, తమ తొండము చివర భక్ష్యమును గ్రహించుట కుద్యుక్తులై యుందురు. కేసరములందు అంగదేవతలను, పత్రమధ్యమందు వక్రతుండాదులను అర్చించాలి. 1. వక్రతుండ 2. ఏకదంష్ట్ర 3. మహోదర 4. గజానన 5. లంబోదర 6. వికట 7. విఘ్నరాజః 8. ధూమ్రవర్ణ.

వీరిని అర్చించిన పిమ్మట దళాగ్రములందు బ్రాహ్మీ మొదలగువారిని అర్చించాలి. తదుపరి లోకపాలురను, వారివారి ఆయుధములను పూజించాలి.

శ్లో॥ సిద్ధమంత్రః ప్రకుర్వీత ప్రయోగాన్ కల్పచోదితాన్
తర్పయేత్ సలిలైః శుద్ధైర్దినశో గణనాయకమ్ ।
చతుశ్చత్వారింశదాద్యం చతుశ్శత మతంద్రితః
ప్రాప్నుయాన్మండలాదర్వా గభీష్ట మధికం నరః ।
నారికేళైః కృతో హోమశ్చతుర్థ్యాం శ్రీప్రదోభవేత్
శుక్లపక్ష ప్రతిపదమారభ్య దినశః సుధీః ।
చతుర్థ్యంతం నారికేళ సక్తులాజతిలైః క్రమాత్
చతుఃశతం ప్రజుహుయా ద్వశ్యాః స్యుః సర్వజంతవః ।
సతిలైస్తండులై ర్హోమో లక్ష్మీ వశ్యప్రదోభవేత్
లాజైస్త్రిమధురో పేతైర్హోమః కన్యాం ప్రయచ్ఛతి ।
అనేనవిధినా కన్యా వరమాప్నోతి వాంఛితం
ఆజ్యాక్తహవిషాహోమః సాధయేదీప్సితం నృణామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సిద్ధి పొందిన సాధకుడు ప్రయోగముల నాచరించ సమర్థుడగును. ప్రతిదినము శుద్ధజలముతో గణపతికి తర్పణము నర్పించాలి. "గంగణేశంతర్పయామి" అను మంత్రముతో 444 సార్లు తర్పణము నివ్వాలి.

ద్రవ్యచతుష్టయముతో ప్రతిరోజూ 444సార్లు హోమం కూడా చేయాలి. ఈ విధముగా 49 రోజులు చేయాలి. (మండలం రోజులు అనగా 49 రోజులని వ్యాఖ్యానమునందు చెప్పబడినది) సాధకుడు అభీష్ట సిద్ధిని పొందగలడు.

చవితిరోజున కొబ్బరిముక్కలతో హోమము సంపదనిచ్చును. శుక్లపక్ష పాడ్యమి నుండి, చవితివరకు నాలుగురోజులు, 1. కొబ్బరి 2. పిండి 3. పేలాలు 4. తిలలతో 400 హోమమాచరించిన సర్వజనవశ్యము సిద్ధించును.

శుద్ధతిలలతో కలిపిన బియ్యపు హోమము వలన ధనము ప్రాప్తించును. త్రిమధురయుక్త పేలాలు హోమం చేసినచో ఉత్తమకన్య లభించును. ఇదే హోమమును కన్య చేసిన, గొప్ప వరుడు ప్రాప్తించును. నేతితో హవిర్హోమ మాచరించిన అభీష్టసిద్ధి కలుగును.

శ్లో॥ దధ్నా విలోలితై ర్లోణై ర్హోమో నిశిచతుర్దినం
సంవాదం కురుతే తద్వద్వశ్యం వితనుతే సదా ।
శ్వేతార్క భవమూలేన రక్త చందన దారుణా
ఇభభగ్నేన నింబేన దంతిదంతేన వాకృతమ్ ।
విఘ్నేశ్వరం సమభ్యర్చ్య శీతాంశుగ్రహణే జపేత్
స్పృష్ట్వామంత్రీ నిరాహారస్తం శిఖాయాం సముద్వహన్ ।
యుద్ధేషు వ్యవహారాదౌ విజయశ్రియ మాప్నుయాత్
మంత్రేణాఽనేన సంజప్తా రోచనామద సంయుజా ।
తిలకక్రియయా సర్వాన్ వశం నయతి మానవాన్
అనులోమ విలోమస్థ బీజే నామ సమాలిఖేత్ ।
నవనీతే సమభ్యర్చ్య స్పృష్ట్వాప్రాణమనుం జపేత్
అష్టోత్తర శతం భూయో మూలమంత్రం ప్రజప్యతత్ ।
భక్షయే న్మౌనమాస్థాయ యామిన్యాం సప్తవాసరం
సవశ్యోజాయతే శీఘ్రం సాధకస్య న సంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పాద్యమినుండి చవితి వరకు రాత్రియందు పెరుగు, లవణము కలిపి హోమమాచరించిన సాధ్యవ్యక్తి వశమగును. తెల్లజిల్లేడు వేరు, లేదా రక్తచందన కాష్ఠములు, లేదా గజముచేత పెకలింపబడిన నిమ్మచెట్టు సమిధలు, లేదా ఏనుగు దంతము స్పర్శ పొందినవి, లేదా గజ భక్ష్యశేషములు – చంద్ర గ్రహణ కాలమందు

వీటిని తాకుచూ కేవలం జపమాచరించి, వాటిని శిఖయందు లేదా శరీరము నందు ధరించిన, యుద్ధమునందు, వ్యవహారమునందు జయము ప్రాప్తించును.

గజమద జలముతో గోరోచనము కలిపి, అభిమంత్రించి, తిలకముగా ధరించిన సర్వజనానుకూలత సిద్ధించును. వెన్నయందు గణేశబీజ సహితముగా సాధ్యనామము, సాధ్యకర్మ, సాధకనామము లిఖించి, దానిని స్పృశించుచూ "ప్రాణాయస్వాహా" అను ప్రాణమంత్రమును 108 సార్లు జపించి, గణేశమూలమంత్రము 108సార్లు జపించి, ఆ వెన్నను సేవించాలి.

ఈ ప్రయోగము పాడ్యమినుండి సప్తమివరకూ 7 రోజులు, రాత్రియందు మౌనముగా అనుష్ఠించినచో, సాధ్యవ్యక్తి వశమగును. సాధ్యకర్మ ఏదైననూ సిద్ధించును. ఇందు ఏమియూ సందేహము లేదు. (అనులోమ విలోమం అని మూలమునందు చెప్పుటవలన బీజసంపుట మాత్రమేనని వ్యాఖ్యానమునందు చెప్పబడినది).

## 2. మహాగణపతి మంత్రము

శ్లో॥ శ్రీశక్తి స్మరభూవిఘ్న బీజాని ప్రథమం వదేత్
జేఽంతం గణపతిం పశ్చాద్వరాంతే వరదంపతేత్ ।
ఉక్త్వా సర్వజన మేతం వశమానయతద్వయం
అష్టావింశత్యక్షరోఽయం తారాద్యోమనురీరితః ।
గణకః స్యాదృషిః ఛందో గాయత్రీ నివృదన్వితా
మహాగణపతిః ప్రోక్తోదేవతా దేవవందితా ।
షడ్బీజస్థ స్వబీజేన దీర్ఘభాజా ప్రకల్పయేత్
షడంగాని మనోరస్య యదావిధి విధానవిత్ ।

ధ్యాయన్మంత్రం జపేన్మంత్రీ చతుర్లక్షం సమాహితః
చతుః సహస్రసంయుక్తం చత్వారింశత్సహస్రకమ్ ।
దశాంశం జుహుయాత్ ద్రవ్యైరష్టాభిర్మోదకాదిభిః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 28 అక్షరముల మహాగణపతయే వరవరద సర్వజనమేతం వశమానయ స్వాహా ।

గణకఋషిః । నివృద్యుక్త గాయత్రీఛందః । దేవగణవందిత మహాగణపతిర్దేవతా । గంబీజం స్వాహా శక్తిః । షడంగన్యాసం ఇలా చేయాలి.

**గాం హృదయాయ నమః ।**

**శ్రీం గీం శిరసే స్వాహా ।**

**హ్రీం గూం శిఖాయై వషట్ ।**

**క్లీం గైం కవచాయహుమ్ ।**

**గ్లౌం గౌం నేత్రద్వయాభ్యాం వౌషట్ ।**

**గం గః అస్త్రాయఫట్ ।**

పిమ్మట మహాగణపతి స్వరూపమును ఇలా ధ్యానించాలి.

శ్లో॥ నరత్నమయం ద్వీపం స్మరేదిక్షురసాంబుధౌ
తద్వీచిధౌతపర్యంతం మందమారుత సేవితమ్ ।
మందార పారిజాతాది కల్పవృక్ష లతాకులం
తదూత రత్నచ్ఛాయాభి రరుణీ కృత భూతలమ్ ।
ఉద్యద్దినకరేందుభ్యాముద్భాసిత దిగంతరం
తస్యమధ్యే పారిజాతం నవరత్నమయం స్మరేత్ ।
ఋతుభిః సేవితం షడ్భిరనిశం ప్రీతివర్ధనైః
తస్యాఽధస్తాన్మహాపీఠే రచితే మాతృకాంబుజే ।
షట్కోణాంతస్త్రికోణస్థం మహాగణపతిం స్మరేత్

✡ హస్తీంద్రాననమిందు చూడమరుణచ్ఛాయంత్రినేత్రం రసా
దాశ్లిష్టం ప్రియయా సపద్మకర యా స్వాంకస్థయా సంతతమ్
బీజాపూర గదాధనుస్త్రి శిఖయుక్ చక్రాబ్జపాశోత్పల
వ్రీహ్యగ్రస్వవిషాణ రత్నకలశాన్ హస్తైర్వహంతంభజే ॥
గండపాలీ గళద్దాన పూరలాలసమానసాన్
ద్విరేఫాన్ కర్ణతాలాభ్యాం వారయంతం ముహుర్ముహుః ।
కరాగ్రధృతమాణిక్య కుంభవక్త్ర వినిఃసృతైః
రత్నవర్షైః ప్రీణయంతం సాధకాన్ మదవిహ్వాతమ్ ॥
మాణిక్యముకుటోపేతం రత్నాభరణ భూషితం ।

పై మంత్రమును 4 లక్షలు జపించి, 44వేలు అష్టద్రవ్యము లతో హోమం ఆచరించాలి. (దశాంశం పుష్టిమంత్రం, జపించాలని, సంస్కృత వ్యాఖ్యానంలో చెప్పబడినది. అది గురుముఖంగా గ్రహించాలి).

ప్రతిదినము సాధకుడు తర్పణము నాచరించి, విధిపూర్వకముగా పీఠార్చన చేయాలి.

శ్లో॥ త్రికోణబాహ్యే పూర్వాది చతుర్దిక్షు సమర్చయేత్
అగ్రస్థ బిల్వవృక్షాథఃశ్రియం శ్రీపతిమర్చయేత్ ।
పద్మయుగ్మధరా పద్మా శంఖచక్రధరో హరిః
దక్షిణే వటవృక్షాధో గౌరీం గౌరీపతిం యజేత్ ।
పాశాంకుశధరా గౌరీ టంకశూలధరో హరః
పశ్చిమే పిప్పలస్యాఽధో రతిం రతిపతింయజేత్ ।
రతిరుత్పల హస్తాఢ్యా కోదండాస్త్రధరః స్మరః
సౌమ్యే ప్రియంగు వృక్షాథో మహీం పోత్రిణ మర్చయేత్ ।

శుక్రవ్రీహ్యగ్రహస్తా భూర్గదా చక్రధరః పతిః
దేవాగ్రే పూజయే లక్ష్మీసహితం గోపనాయకమ్ ।
షట్సు కోణేషు సంపూజ్యా ఆమోదాద్యాః ప్రియన్వితాః
ఆమోదం సిద్ధి సహితమగ్రకోణే సమర్చయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - త్రికోణ బాహ్యమందు పూర్వాది నాలుగుదిశలలో దేవీదేవతలను, అగ్రభాగమందున్న బిల్వవృక్షము క్రింద 1. శ్రీ సహిత శ్రీపతిని అర్చించాలి. లక్ష్మి తన రెండుచేతులతో రెండు కమలములు, విష్ణువు శంఖచక్రములు ధరించియుందురు.

త్రికోణము బయట కుండిప్రక్క బిల్వవృక్షము కింద 2. గౌరీ, గౌరీపతులనర్చించాలి. గౌరి తన చేతులందు పాశాంకుశములను, శివుడు టంక - శూలములను ధరించి యుండును. పశ్చిమ దిశయందు రావిచెట్టు కింద 3. రతిపతిని అర్చించాలి.

రతీదేవి చేతియందు కలువపూవు, మన్మథుని చేతులందు ధనుర్బాణములుండును. ఉత్తరదిశయందు ప్రియంగవృక్షము కింద 4. పృథ్వీ సహిత వరాహమును అర్చించాలి. పృథ్విచేతియందు తీక్ష్ణాగ్రభాగ యుక్త వ్రీహి, వరాహుని చేతియందు గదా-చక్రములూ ఉండును.

అనంతరం గణపతి ముందు భాగమున 5 లక్ష్మీ సహిత శ్రీకృష్ణుని అర్చించాలి. షట్కోణములందు ప్రియాయుక్తులయిన ఆమోదాది వినాయకులను అర్చించాలి. తూర్పున సిద్ధి సహిత ఆమోదగణపతిని, ఆగ్నేయమందు సమృద్ధి సహిత ప్రమోదుని ఈశాన్యమందు కాంతి సహిత సుముఖుని పూజించాలి. దీనినే పంచమిథున పూజ యందురు.

శ్లో॥ దుర్ముఖం మదనావత్యా యజేద్వరుణ కోణకే
విఘ్నం మదద్రవాయుక్తం కోణేనైశాచరే యజేత్ ।

వాయవ్యే విఘ్నహర్తారం ద్రావిణ్యా సహితంయజేత్
పాశాంకుశాభయా భీష్ట ధారిణోఽరుణ విగ్రహాః ।
గండభిత్తి గళద్దాన పూర ధౌత ముఖాంబుజాః
విఘ్నాస్తత్ ప్రమదాః సర్వామదాఘూర్ణితలోచనాః ।
ఏకహస్త ధృతాంభోజా ఇతరాలింగిత ప్రియాః
షట్కోణ పార్శ్వయోః పూజ్యౌ శంఖపద్మ నిధీక్రమాత్ ।
నిజప్రియాభ్యాం సహితౌ పూర్వోదీరిత లక్షణౌ
కేసరేష్వంగపూజాస్యాద్ బ్రాహ్మ్యాద్యాః పత్రమధ్యగాః ।
బహిర్లోకేశ్వరాః పూజ్యా వజ్రాదీని తతః పరం
ఇత్థంజపాదిభిః సిద్ధః ప్రయోగాన్ స్వమనీషితాన్ ।
సాధయేదష్టభిర్ద్రై్య రన్యైర్వా కల్పచోదితైః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పశ్చిమమందు మదనావతీ సహిత దుర్ముఖుని, నైరుతియందు మదద్రవాయుక్త విఘ్నుని పూజించాలి. వాయవ్యమందు ద్రావిణీసహిత విఘ్నేశ్వరుని అర్చించాలి. వీరంతా పాశాంకుశములు, వరదాభయముద్రలు ధరించి యుందురు. వీరి శరీర వర్ణము ఎర్రగా యుండును. మదజలముతో, మదోన్మత్తులై యుందురు.

ఈ వినాయకులందరూ ప్రియతమాలింగినులై యుందురు. షట్కోణమునకు రెండువైపులా శంఖనిధి, పద్మనిధి పూర్వోక్త (8వ పటలము నందు వివరించబడినది) లక్షణములతో నుందురు. కేసరములందు అంగపూజ, దళములందు మధ్య బ్రాహ్మీ మొదలైనవారిని పూజించాలి.

దళముల బయట లోకపాలురను, వారివారి ఆయుధములను అర్చించాలి. మంత్రము సిద్ధించిన సాధకుడు అభీష్టమును పొందగలడు. అష్టద్రవ్య హోమమువలన ఇష్టసిద్ధి కలుగును.

శ్లో॥ పద్మహోమేన భూపాలాంస్తత్పత్నీరుత్పలైః శుభైః ।
మంత్రిణః కుముదైః ఫుల్లైర్విప్రాన్ పిప్పలసంభవైః
సమిద్వరైరపతీ నుదుంబర సముద్భవైః ।
ప్లక్షైర్వైశ్యాన్ వటోద్భూతైః శూద్రాన్మంత్రీ వశంనయేత్
మధునా స్వర్ణ లాభఃస్యాత్ గోదుగ్ధేన లభేతగాః ।
ఆజ్యహోమేన మహతీం శ్రియమాప్నోతిమానవః
దధ్నాసర్వసమృద్ధిఃస్యాదన్నైరన్నపతిర్భవేత్ ।
వృష్టికామః ప్రజుహయాద్ వేతసానాం సమిద్వరైః
కుసుంభకుసుమైర్హుత్వా వాసాంసి లభతేఽ చిరాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పద్మహోమముచేత అధికారులు, కలువల హోమంచేత అధికారిణులు, వికసిత కలువపూల హోమంవలన మంత్రులు, రావి సమిధల హోమం వలన బ్రాహ్మణులు, విద్యావంతులు, మేడి సమిధల హోమం వలన క్షత్రియులు, అధికారులు వశమగుదురు.

ప్లక్ష (                ) సమిధల హోమంవలన వైశ్యులు, వ్యాపారులు, మర్రి సమిధల హోమంవలన లేదా మర్రి ఊడలహోమం వలన శూద్రులను, సేవకులను వశపరచుకొనవచ్చును.

తేనె హోమముచేయుటవలన స్వర్ణలాభము, ఆవుపాలు హోమము చేయుటవలన గోసమృద్ధి కలుగును. ఆజ్యహోమము వలన సంపద, పెరుగు హోమము చేయుటవలన సర్వసమృద్ధి, అన్నహోమమువలన అన్న సమృద్ధి కలుగును. వేతసీ (నీటిప్రబ్బలి) సమిధలు హోమము చేయుటవలన వర్షము కురియును.

కుసుంభకుసుమ హోమమువలన అనేకవిధ వస్త్రలాభము కలుగును.

# చతురావృత్తి తర్పణము

శ్లో॥ ప్రత్యేకమాదౌమూలేన చతుర్వారం ప్రతర్పయేత్
శ్రీశక్తిరతిభూలక్ష్మీః స్వబీజాద్యాః ప్రియన్వితాః ।
ఆమోదాదీన్ స్వబీజాద్యాన్ శక్తియుక్తాంశ్చ తర్పయేత్
చతుశ్చతుః పృథక్ మంత్రీ శంఖపద్మినిధీ తథా ।
నామాదిబీజ సహితౌ తర్పయేత్ స్వప్రియాన్వితౌ
తర్పణేనాఽమునా స్వీయ మిష్టమాప్నోతి మండలాత్ ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - మూలమంత్రముతో ముందుగా పిమ్మట శ్రీ - శక్తి - రతి - భూ - లక్ష్మీ ఈ అయిదుగురికీ ప్రత్యేకముగా సమస్త మరియు వ్యస్తక్రమములో నాలుగేసిసార్లు తర్పణం ఇవ్వాలి.

**ఉదా - మూలమంత్రము + శ్రీం శ్రీం శ్రీం మహాగణపతిం తర్పయామి।**

**మూలమంత్రము + శ్రీం శ్రీపతి సహితాం శ్రియం తర్పయామి।**

ఈ విధముగా 49 రోజులు 444 సార్లు తర్పణం చేయాలి.

**తర్పణ క్రమం :-** ముందుగా మూలమంత్రముతో 4సార్లు తర్పణం చేయాలి. పిమ్మట 1. శ్రీ 2. శ్రీపతి 3. గౌరీ 4. గౌరీపతి 5. రతి 6. రతిపతి 7. మహీ 8. వరాహ 9. లక్ష్మీ 10. కృష్ణ 11. ఆమోద 12. సిద్ధి 13. సమృద్ధి 14. ప్రమోద 15. సముఖ 16. కాంతి 17. దుర్ముఖ 18. మదనావతి, 19. విఘ్న 20. మదద్రవా 21. విఘ్నహర్తా 22. ద్రావిణీ 23. శంఖనిధి 24. శంఖనిధి ప్రియతమా 25. పద్మనిధి 26. పద్మనిధి ప్రియతమా, ఇలా 26 మందికీ నాలుగేసిసార్లు తర్పణం ఇవ్వాలి. 26 × 4 = 104 సార్లు అగును.

ఇదే ప్రకారము మూలమంత్రముతో కూడా తర్పణ మిచ్చిన 26 × 4 = 104 సార్లు అగును. ముందుగా ఇచ్చిన మూలమంత్రతర్పణము 4 సార్లు, చివరసారి ఇచ్చిన మూలమంత్ర తర్పణ నాలుగుసార్లు మొత్తం అన్నీ కలిపి **216** సార్లు అగును. ఇది మధ్యమపద్ధతి.

ఇపుడు 28 అక్షరముల మూలమంత్రములో ప్రత్యేక అక్షరముతో నాలుగేసార్లు తర్పణమిచ్చిన 28 × 4 = 112 అగును. మరల పూర్తి మూలమంత్రము చేర్చి నాలుగేసిసార్లు తర్పణమిచ్చిన 28 × 4 = 112 మొత్తం 224, ప్రారంభంలో మూలమంత్రముతో చేసిన 4 తర్పణములు కలిపి **228** సార్లు అగును. ఇది ఉత్తమపద్ధతి.

పైన చెప్పిన రెండు పద్ధతులూ కలిపిన, అనగా 216 + 228 = 444 సార్లు అగును. దీనినే చతురావృత్తి తర్పణ విధానం అంటారు. గణపతికి నాలుగు సంఖ్య ప్రీతికరము.

**రహస్యపటలం** మూలనారాయణీయమందిట్లున్నది.

వింశత్ సంఖ్యం తర్పయిత్వా తు పూర్వం
మాంత్రర్వ్యస్తైర్వేద వారం ద్విఠాంతైః ।
మధ్యేమధ్యే తర్పయేద్విఘ్నరాజం
లక్ష్మ్యా దీనాంతర్పణం చైవమేవ ॥

✡ తర్పణ విధానములో ఇతర గ్రంథములందు వివిధరకములుగా చెప్పబడియున్నది. మంత్రభేదముచేత కూడా విధాన భేదమున్నది.

## మహాగణపతి యంత్రము

శ్లో॥ బీజంషట్ కోణమధ్యేస్ఫురదనలపురే తారగం దిక్షులక్ష్మీం
మాయాకందర్పభూమీస్తదనురసపుటేష్వాలిఖేద్బీజషట్కమ్

తత్సంథిష్వంగ మంత్రాన్ వసుదళకమలే మూలమంత్రస్య వర్ణాన్
శిష్టాన్ పత్రేషు విద్వాన్ విలిఖితు గుణశశ్చాఽంత్యమంత్యే పలాశే॥
ఆవీతం లిపిభిః క్రమోత్క్రమవశాత్ పాశాంకుశాభ్యామపి
క్ష్మాగేహ ద్వితయేన వేష్టితమిదం యంత్రగణాధీశితుః ।
లాక్షాకుంకుమరోచనా మృగమదైర్భూర్జే వరేహేమ్నివా
సంలిఖ్యాఽభివహన్ లభేత సకలైః సంప్రార్థనీయాం శ్రియమ్ ॥
ఉక్తం మహాగణపతే ర్విధానం సురపూజితం
సర్వసిద్ధి కరంపుంసాం సమస్త పురుషార్థదమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మహాగణపతి యంత్రలేఖన విధానము వివరించబడుచున్నది. అష్టదళ పద్మము మధ్యలో షట్కోణము, దాని మధ్యలో త్రికోణము లిఖించాలి. ఆ త్రికోణమందు "ఓంగం" అని వ్రాయాలి.

త్రికోణము బయట నాలుగు దిశలయందు శ్రీం – హ్రీం – క్లీం – గ్లాం లిఖించాలి. పిమ్మట షట్కోణములందు ఓం – శ్రీం – హ్రీం – క్లీం – గ్లాం – గం లిఖించాలి. పిమ్మట వాటి సంధులందు షడంగమంత్రములు లిఖించాలి. అష్టపత్రములందు మూలమంత్రములోని మిగిలిన 22 అక్షరములు, మూడు వర్ణముల చొప్పున 7 పత్రములందు, మిగిలిన ఒక అక్షరము 8వ పత్రమునందు లిఖించాలి.

పిమ్మట దానికి బయట వృత్తము లిఖించి అనులోమ విలోమ క్రమములో మాతృకను లిఖించి వేష్టితం చేయాలి. భూపురమునందు ఆం – క్రోం లిఖించి వేష్టితం చేయాలి.

ఈ యంత్రము లాక్షా – కుంకుమ – గోరోచనం – కస్తూరి మిశ్రమంతో బంగారురేకుపైగాని, రాగిరేకుపైగాని లిఖించి ధరించిన సకల కార్యములు సిద్ధించును.

# 3. విరిగణపతి మంత్రము

శ్లో॥ మాయా విరిపదద్వంద్వం తతోగణపతింవదేత్
ఖడ్గీశపావకౌపశ్చాత్ వరదాంతే వదేత్ పునః ।
సర్వలోకం మే పదాంతే వశమానయ ఠ ద్వయం
షడ్వింశత్యక్షరోమంత్రో భజతాంసురపాదపః ।
గణకః స్యాదృషిశ్ఛందో గాయత్రందేవతా మనోః
విరి విఘ్నేశ్వరః ప్రోక్తో స్థానే మంత్రీ విచింతయేత్ ।
చతుర్లక్షం జపేన్మంత్రం తద్దశాంశం హుతక్రియా
ప్రాక్ప్రోక్తైరష్టభిర్ద్రవ్యై స్త్రిమధ్వక్తైః సమీరితా ।
పూర్వోక్తే పూజయేత్ పీఠే తీవ్రాదినవశక్తికే
మూలే నమూర్తిం సంకల్ప్య తత్రావాహ్యాఽర్చయేద్విభుమ్।
మిథునావృత్తి రాద్యా స్యాదామోదాద్యైర్దిగంబరైః
ద్వితీయాఽగ్రై స్తృతీయా స్యాచ్చతుర్థీ మాతృభిఃస్మృతా ।
ఇతి సిద్ధ మనుర్మంత్రీ ప్రఫుల్లైః సరసీరుహైః
జుహోయాద్వశగాః సర్వే తండులైస్తిల మిశ్రితైః ।
హుత్వా శ్రియమవాప్నోతి మోదకై రాజ్యలోలితైః ।
హుత్వా శ్రియమవాప్నోతి పార్థివో యుద్ధభూమిషు ।
మధుత్రయేణ హవనం వశం నయతి పార్థివాన్
భక్ష్య భోజ్యాదికం సర్వంహత్వాఽభీష్టానిసాధయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 26 అక్షరముల "విరిగణపతి" మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : హ్రీం విరి విరి గణపతి వర వరద సర్వలోకం మే వశమానయ స్వాహా।**

గణకఋషిః । గాయత్రీ ఛందః । హ్రీంబీజం । స్వాహా శక్తిః విరివిఘ్నేశ్వరో దేవతా । 4+4+5+5+5+3 అక్షరములుగా మూలమంత్రమును విభజించి షడంగన్యాసమాచరించాలి.

పిమ్మట ఇలా ధ్యానించాలి.

శ్లో॥ సింధూరా భమిభాననం త్రినయనం హస్తేషు పాశాంకుశౌ
బిభ్రాణాం మధుమత్కపాలమనిశం సార్ధేందు మౌళింభజే
పుష్ట్యాశ్లిష్టతనుం ధ్వజాగ్రకరయా పద్మోల్లసద్ధస్తయా
తద్యోన్యాహిత పాణిమత్తవసుమత్పాత్రోల్లసత్ పుష్కరమ్॥

పైమంత్రము నాలుగు లక్షలు జపించాలి. దశాంశహోమమును అష్టద్రవ్యములతో ఆచరించాలి. తీవ్రాదినవశక్తులను పీఠమందు అర్చించి యధావిధిగా పూజించాలి.

స్త్రీసహిత గణపతిని ప్రథమావరణమందు, దిగంబరులైన ఆమోదాదులను ద్వితీయావరణమందు, అంగములను తృతీయావరణము నందు, మాతృకలను చతుర్థావరణమందు అర్చించాలి.

లోకపాలురను పంచమావరణములనందు, వారివారి ఆయుధము లను షష్ఠావరణమునందు అర్చించాలి. మంత్రసిద్ధిని పొందిన సాధకుడు వికసితకమలములతో హోమమాచరించిన, సర్వజనవశ్యము సిద్ధించును.

తిలమిశ్రిత తండుల హోమంవలన సంపద కలుగును. ఆజ్యముతో కుడుములను హోమం చేసిన యుద్ధమునందు, విజయము కలుగును. మధుత్రయముచే హోమం ఆచరించిన, అధికారులు వశమగుదురు. భక్ష్య - భోజ్యహోమమువలన సమస్త సంకల్పములూ నెరవేరును.

భక్ష్యములలో **"రసాలా"** అనే మధుర వంటకమును గూర్చి "సూపశాస్త్రము" నందిట్లు చెప్పబడినది.

✡ అర్ధాఢకం సుచిరపర్యుషితస్య దధ్నః
ఖండస్య షోడశ పలానిశశిప్రభస్య ।
సర్పిః పలం మధుపలం మరిచం ద్వికర్షం
శుంఠీ పలార్ధమపి చార్ధపలం చతుర్ణామ్ ॥
శుక్లోపలే లలనయా మృదుపాణిఘృష్టా
కర్పూరపూరసురభీకృత భాండసంస్థా ।
ఏషావృకోదర కృతా సరసా "రసాలా"
యాస్వాదితా భగవతామధుసూదనేన ॥

ఈ శ్లోకమునందు "రసాలా" ఎలా వండాలో చెప్పబడినది. దీనిని చక్కగా భీమసేనుడు వండగా, భగవంతుడైన శ్రీకృష్ణుడు ఎంతో ప్రీతిగా ఆరగించాడట. అందుకే నలభీమపాకం అని ప్రసిద్ధి లోకంలో ఉన్నది.

## 4. శక్తి గణపతి మంత్రము

శ్లో॥ శక్తి రుద్ధం నిజం బీజం మహాగణపతింవదేత్
జేఽంతమగ్నివధూఃప్రోక్తో మంత్రోఽయం ద్వాదశాక్షరః।
గణకః స్యాదృషిశ్ఛందో గాయత్రీ నివృదాదికా
ఉదితా దేవతా తంత్రే నామ్నా శక్తి గణాధిపః ।
వ్యస్తైః సమస్తై ర్మంత్రస్య పదైరంగాని కల్పయేత్
లక్షమేకం జపేన్మంత్రమపూపై స్తద్దశాంశతః ।
జుహుయాదర్చితే వహ్నౌ దినశోదేవమర్చయేత్
ప్రాక్ప్రోక్తే పూజయేత్పీఠే ప్రాగుక్తేనైవ వర్త్మనా
హుత్వేక్షు ఖండైర్మతిమాన్ రాజ్యశ్రియ మవాప్నుయాత్ ।
నారికేళ ఫలైస్తద్వద్ రంభాపక్వఫలైస్తతః

వశయత్యఖిలంలోకం పృథుకైః శర్కరాన్వితైః ।
వశంనయతి రాజానం సక్తుభిర్ బ్రాహ్మణాన్ శుభైః
ఘృతహోమేన ధనవాన్ జాయతే నాత్ర సంశయః ।
శక్త్యోరుద్ధం నిజం బీజం వశమానయ ఠ ద్వయం
తారాద్యో మనురాఖ్యాతో రుద్రసంఖ్యాక్షరాన్వితైః ।
ఋష్యాద్యాః పూర్వముక్తాః స్యురంగం మంత్రపదైర్భవేత్
ఏకేనాదౌ త్రిభిర్ ద్వాభ్యాం త్రిభిర్ ద్వాభ్యామనంతరమ్ ।
సమస్తేఽ స్త్ర మాఖ్యాతం అంగక్లప్తిరియంమతా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 12 అక్షరముల "శక్తిగణపతి" మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా।**

ఋషిః గణకః। నివృత్ గాయత్రీ ఛందః। ఉదితాదేవతా। ఈయననే తంత్రశాస్త్రమందు "శక్తిగణపతి" అందురు. గంబీజం । స్వాహాశక్తిః । మంత్రము 5 పదములుగా విభజించి పంచాంగ న్యాసం చేయాలి.

## ధ్యానశ్లోకం

ముక్తాగౌరం మదగజముఖం చంద్రచూడం త్రినేత్రం
హస్తైః స్వైయై ర్దధతమరవిందాంకుశౌ రత్నకుంభమ్ ।
అంకస్థాయాః సిరసిజరుచః స్వధ్వజాలంబిపాణేః
దేవ్యాయోనౌ వినిహితకరం రత్నమౌళింభజామః ॥

పై మంత్రము లక్ష జపించి, అప్పములతో దశాంశహోమమాచ రించాలి. చెరకుముక్కలతో ప్రతి నిత్యమూ హోమం చేసిన అఖండ శ్రీమంతు డగును.

కొబ్బరి లేదా అరటిపళ్ళతో హోమం చేసినచో వశ్యసిద్ధి. అటుకులు – శర్కర హోమం చేయుటచేత అధికారులు వశమగుదురు. పిండి హోమం చేసినచో బ్రాహ్మణులు అనుకూలురగుదురు. ఘృతహోమమువలన పాడిపంటలు సంపద వృద్ధిచెందును.

## 5. హస్తిముఖ గణపతి

మరొక మంత్రము 11 అక్షరములతో కూడినది కలదు. దీనికి ఋష్యాదులు పూర్వమువలెనే యుండును.

**మనుః : ఓం హ్రీం గం హ్రీం వశమానయ స్వాహా।**

ఇందు ఓంతో హృదయమునందు, హ్రీం గం హ్రీంతో శిరస్సునందు, వశం – నేత్రత్రయం, ఆనయ – కవచం, స్వాహా – అస్త్రం సమస్త మంత్రముతో వ్యాపకన్యాసమూ ఆచరించాలి.

హస్తిముఖ గణపతి ధ్యానమిట్లు చేయవలెను.

శ్లో॥ హస్తైర్బిభ్రతమిక్షుదండవరదౌ పాశాంకుశౌపుష్కర
స్పృష్టస్వప్రమదావరాంగమనయాఽఽశ్లిష్టం ధ్వజాగ్రస్పృశా।
శ్యామాంగ్యా విధృతాబ్జయాత్రియనం చంద్రార్ధచూడంజపా
రక్తంహస్తిముఖం స్మరామి సతతం భోగాతిలోలం విభుమ్॥

పై మంత్రము మూడులక్షలు జపించి, చెరకుముక్కలతోగాని, నేతితో అప్పములుగాని దశాంశహోమం ఆచరించాలి. త్రిమధురమిశ్రిత అప్పములు హోమం చేయుటవలన ఉన్నతాధికారులు వశమగుదురు. చవితినాడు కొబ్బరిముక్కలలో హోమం చేసిన ధనవంతుడగును. తేనెతో లవణము కలిపి హోమం ఆచరించినచో స్త్రీవశ్యము సిద్ధించును.

## 6. క్షిప్రప్రసాద గణపతి

శ్లో॥ సంవర్తకోనేత్రయుతః పార్శ్వో వహ్న్యాసనస్థితః
ప్రసాదనాయహ్యన్మంత్రం స్వబీజాద్యో దశాక్షరః ।
గణకోమునిరస్యస్యాద్విరాట్ ఛంద ఉదాహృతం
క్షిప్రప్రసాదనో విఘ్నో దేవతాఽస్య సమీరితా ।
దీర్ఘయుక్తేన బీజేన షడంగాని ప్రకల్పయేత్
లక్షంజపేజ్జ పస్యాఽంతే జుహుయాదయుతంతిలైః ।
సమధుత్రితమైర్ద్రవ్యై రథవాఽష్టాభిరీరితైః
ఏకాక్షరోదితేపీఠే వక్ష్యమాణేన వర్త్మనా ।
పూజయేద్గంధ పుష్పాద్యైర్ధూపదీపైర్గజాననమ్
అంగాని పూర్వ మభ్యర్చ్య విఘ్నానష్టౌ యజేత్తతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - క్షిప్రప్రసాద గణపతి మంత్రము చెప్పబడుచున్నది. ఇది దశాక్షరీ మంత్రము.

**మనుః : గంక్షి ప్రప్రసాదనాయ స్వాహా ॥**

గణకఋషిః । విరాట్ ఛందః । గంబీజం - ఆయశక్తిః । గాంగం - గాంగం - గూంగం । ఇత్యాది దీర్ఘయుక్త గంబీజముతో షడంగన్యాస మాచరించాలి. పిమ్మట ధ్యానశ్లోకమిట్లుండును.

శ్లో॥ పాశాంకుశౌ కల్పలతాం విషాణం
దధత్ స్వశుండాహిత బీజపూరః
రక్తస్త్రినేత్రస్తరుణేందుమౌళిః
హారోజ్వలో హస్తిముఖోఽవతాద్వః ॥

పై మంత్రము ఒక లక్ష జపించి, తిలలతోగాని, త్రిమధుర యుక్త అష్టద్రవ్యములతోగాని దశాంశహోమము ఆచరించాలి.

పిమ్మట ఏకాక్షర నిర్మిత పీఠమందు పంచోపచారపూజ చేసి, అష్టవినాయకులనూ అర్చించాలి.

శ్లో॥ విఘ్నం వినాయకం వీరం శూరం వరదసంజ్ఞకం
ఇభవక్త్రం చైకదంతం లంబోదరమనంతరమ్ ।
పత్రాగే ష్వర్చయేత్పశ్చాత్ బ్రాహ్మ్యాద్యాస్తదనంతరం
లోకపాలాంస్తదస్త్రాణి విఘ్నపూజా సమిరితా ।
ఆజ్యాన్నై ర్జుహుయాన్ని త్యమన్నవాన్ వత్సరాద్భవేత్
పాయసాన్నేన మహతీం శ్రియమాప్నోతి మానవః ।
ఆజ్యహోమేన వశయేత్ ప్రాణినః సకలాన్సుధీః
నారికేళఫలం పక్వం లోష్ఠం చర్మ సమన్వితం ।
జుహుయాత్ ప్రత్యహం మంత్రీ మండలాత్ సిద్ధి మాప్నుయాత్
జుహుయాదష్ట భిర్ద్రవ్యైః మధురత్రయసంయుతైః ।
వశయేత్ పార్థివాన్ సర్వాన్ తత్పత్నీర్దిధినాఽమునా
దినాదిషు చతుశ్చత్వారింశద్వారైః శుభోదకైః ।
తర్పయేద్విఘ్న రాజస్య మస్తకే శ్రీప్రసిద్ధయే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట 8 మంది వినాయకులనూ, 1. విఘ్న 2. వినాయక 3. వీర 4. శూర 5. వరద 6. ఇభవక్త్ర 7. ఏకదంత 8. లంబోదరులను అర్చించి, పత్రాగ్రభాగములందు బ్రాహ్మీ మొదలగువారిరి పూజించాలి.

పిమ్మట లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి. ఆజ్యమిశ్రిత అన్నము హోమము ఆచరించాలి. సాధకుడు ఒక సంవత్సర

కాలములో గొప్ప ధనవంతుడగును. పాయసహోమముచేత అఖండ సంపద, కేవలం ఘృతహోమముచేత సమస్త ప్రాణివశ్యము సిద్ధించును.

పండిన కొబ్బరిబొండం, పీచు తీయకుండా పగలకొట్టకుండా కాయపళంగా 49 రోజులు హోమం ఆచరించిన ఇష్టసిద్ధి కలుగును. కొబ్బరిని 8 ముక్కలుగా చేయాలన్న నియమమునకు ఇది అపవాద శాస్త్రము, విశేషవిధి.

త్రిమధురయుక్త అష్టద్రవ్యములతో హోమం ఆచరించిన రాజవశ్యము కలుగును. సంపద ప్రాప్తికి ఈ మంత్రముతో ప్రాతః కాలమందు శుద్ధ జలముతో 44సార్లు గణేశుని శిరసుపై తర్పణం చేయాలి.

శ్లో॥ పాశాంకుశౌ కల్పలతాం స్వదంతం
కరైర్వహంతకం కనకాద్రికాంతమ్ ।
సోపాన పంక్త్యాదిననాథ బింబా
దాయాంత మంభోజగతం విచింత్య ॥

## 7. హేరంబ గణపతి

శ్లో॥ పంచాంతకో బిందుయుతో వామకర్ణ విభూషితః
తారాది హృదయాంతోఽయం హేరంబ మనురీరితః ।
చతుర్వర్ణాత్మకో నృణాం చతుర్వర్గ ఫలప్రదః
షడ్దీర్ఘభాజా బీజేన షడంగాని సమాచరేత్ ।
లక్షత్రయం జపేన్మంత్రం దశాంశం జుహుయాత్తిలైః
తీవ్రాది పూజితే పీఠే దేవం హేరంబ మర్చయేత్ ।
ప్రణవః కవచ ద్వంద్వం మహాసింహాయ గాంతతః
హేరంబేతి పదం పశ్చాదాసనాయ హృదన్వితః ।

అయమాసనమంత్రః స్యాత్ పదద్యాదమునాఽఽసనమ్
తారాది విగ్నబీజేన మూర్తింతస్య ప్రకల్పయేతతః ।
ఆవాహ్యాపూజయేత్ తస్యా మంగవారణ సంయుతం
బాహ్యే లోకేశ్వరాః పూజ్యా వజ్రాదీని తతః పరమ్ ।
ఏవమభ్యర్చయేన్నిత్యం సాధయేత్ స్వమనీషితాన్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – చతురక్షర హేరంబగణపతి మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః – ఓం గూం నమః।**

గణకఋషిః । గాయత్రీఛందః । హేరంబగణపతిర్దేవతా । గంబీజం । బిందుశక్తిః । గాం గీం ఇత్యాది షడ్ దీర్ఘబీజములతో షడంగన్యాస మాచరించి, ఇలా ధ్యానించాలి.

శ్లో॥ ముక్తాకాంచన నీలకుంద ఘుసృణ చ్ఛాయైస్త్రినేత్రాన్వితైః
నాగాస్యైర్హరివాహనం శశిధరం హేరంబమర్కప్రభమ్ ।
దృప్తందానమభీతి మోదకరదాన్ టంకం శిరోఽక్షాత్మికాం
మాలాం ముద్గర మంకుశం త్రిశిఖకం దోర్భిధానం భజే ॥

పై మంత్రమును మూడులక్షలు జపించి, తిలలతో హోమం చేయాలి. తీవ్రాదులను పూజించాలి. పీఠమంత్రము ఇట్లుండును.

☞ **ఓం హుం హుం మహాసింహాయ గాం హేరంబ ఆసనాయ నమః**

పిమ్మట "ఓంగూం" అను రెండు బీజములతో విగ్రహమును భావించాలి. అంగావరణ దేవతలను ఆవాహన చేయాలి. తదుపరి లోకపాలురను, వారి ఆయుధాలను అర్చించాలి.

శ్లో॥ మోదకైర్జుహుయాత్ షష్ఠ్యా మష్టమ్యాం కృశరైస్తథా
చతుర్దశీ దినేఽపూపై ర్జుహుయాద్వాంఛితాప్తయే ।

ఏభిర్ద్రవ్యైః ప్రజుహుయాన్మంత్రీ పర్వదినేష్వపి
సాధయేత్సకలాన్ కామాన్ ప్రయత్నేనైవ సాధకః ।
అంభోజం ప్రథమం లిఖేద్వసుదళం మధ్యే స్వబీజాంతరే
సాధ్యాఖ్యాం బహిరంగమంత్ర విలసత్కింజల్కసంశోభితమ్ ।
పత్రాణాముదరే విభజ్య మునిశో మాలామనుం శోషితాన్
షడ్వర్గాంశ్చరమే దళే పరవివృతం శక్త్యా శకారేణ చ ।
రోచనామద కాశ్మీరైర్భూర్జపత్రే విలిఖ్యతత్
వేష్టితం శ్వేతసూత్రేణ లోహైస్త్రిభిరపి క్రమాత్ ।
ధారయేద్బాహునా యంత్రం సర్వాన్ కామానవాప్నుయాత్॥

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - కామితార్థములు సిద్ధించుటకు షష్ఠితిథిరోజున కుడుములు, అష్టమిరోజున తిలసహిత కుడుములు హోమం చేయాలి. చతుర్దశినాడు అప్పములు హోమం చేయాలి. పున్నమి - అమావాస్యలయందు కూడా సాధకుడు హోమమాచరించవచ్చును.

అష్టదళపద్మము లిఖించి అందు మధ్యలో గంబీజసంపుటితముగా, సాధ్యనామము, కార్యమూ లిఖించాలి. దానిబయట అంగమంత్రములు లిఖించి, అష్టదళములందు 55 అక్షరముల మాలామంత్రము (ముందు చెప్పబడుచున్నది) 7 దళములందు 7 అక్షరముల చొప్పున లిఖించి, 8వ దళమునందు, చివరి 6 అక్షరములూ వ్రాయలి.

వీటిని హ్రీం బీజ పరివేష్టితం చేయాలి. దీనిని భూర్జపత్రముపై గోరోచనం - గజమదం - లేదా కుంకుమపువ్వులతో లిఖించి, తెల్లని దారముతో చుట్టాలి. దానిని త్రిలోహ నిర్మిత తావీదునందుంచి చేతిని ధరించిన సర్వకార్యములూ జయప్రదమగును.

## 55 అక్షరముల మాలామంత్రము

శ్లో॥ శక్త్యంకుశం ధ్రువాంతేస్యాత్ స్వబీజం హృదయం తతః
సర్వవిఘ్నాధిపాయాఽంతే జేంతం సర్వార్థ సిద్ధిదమ్ ।
ప్రవదేత్ సర్వదుఃఖ ప్రశమనాయపదం తతః
ఏహ్యేహి భగవన్ సర్వా ఆపదః స్తంభయద్వయమ్ ।
భువనేశం స్వబీజంగాం నతిః పావక వల్లభా
పునరంకుశ మాయాంతం పంచపంచాశదక్షరః ।
మాలామంత్రోఽయమునా ప్రయోగాన్ సాధయేత్సుధీః॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మాలామంత్రము ఈ విధముగా నుండును.

**మనుః - ఓం హ్రీం క్రోం గూం నమః సర్వవిఘ్నాధిపాయ సర్వార్థ సిద్ధిదాయ సర్వదుఃఖ ప్రశమనాయ ఏహ్యేహి భగవన్ సర్వా ఆపదః స్తంభయ స్తంభయ హ్రీం గూం గాం నమః స్వాహా క్రోం హ్రీం ॥**

## సుబ్రహ్మణ్య మంత్రము

శ్లో॥ తారంఖడ్గీశ్వరః కూర్మో నిఃస్వరోణాంత తరితః
భువేనతిః సప్తవర్ణః సుబ్రహ్మణ్యాత్మ కో మనుః ।
వహ్ని బీజేన షడ్దీర్ఘ ముక్తేనాంగక్రియామతా
లక్షమేకం జపేన్మంత్రం సాజ్యేన హవిషాతతః ।
దశాంశం జుహుయాదంతే బ్రాహ్మణానపి భోజయేత్
ధర్మాది కల్పితే పీటే వహ్నిమండల పశ్చిమే ।
పూజయేద్విధినా దేవ ముపచారైర్యథోదితైః

కేసరేష్వంగ పూజాస్యాత్పత్రమధ్యగతానిమాన్ ।
జయంతాఖ్యమగ్నివేశ్యం కృత్తికాపుత్ర సంజ్ఞకమ్ ।
అనంతరంభూతపతిం సేనాన్యంగుహ సంజ్ఞకమ్ ।
హేమశూలం విశాలాక్షం శక్తి శూలకరాన్ యజేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సప్తాక్షర సుబ్రహ్మణ్య మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం వచద్ భువే నమః।**

అగ్నిఋషిః । గాయత్రీ ఛందః । ఓం బీజం । వం శక్తిః । రాం - రీం - రూం - రైం - రోం - రౌం బీజములతో అంగన్యాసములాచరించి, ఇలా ధ్యానించాలి.

✡ సిందూరారుణ కాంతిమిందువదనం కేయూరహారాదిభిః
దివ్యై రాభరణై ర్విభూషితతనుం స్వర్గస్య సౌఖ్యప్రదమ్ ।
అంభోజాభయముపాస్మహే ప్రణమతాం భీతిప్రణాశోద్యతమ్ ॥

పై మంత్రమును లక్ష జపించి, దశాశం ఆజ్యయుక్త హవిస్సుతో హోమం చేయాలి. పిమ్మట అగ్నిమండలపూజ, (చతుర్థ పటలమునందు చెప్పబడినది, పీఠశక్తిపూజ చేయనవసరములేదు) ధర్మాదులను అర్చించాలి.

అనంతరము అష్టదళముల మధ్యలో, 1. జయంత 2. అగ్నివేశ్య 3. కృత్తికాపుత్ర 4. భూతపతి 5. సేనాపతి 6. గ్రహసంజ్ఞక 7. హేమశూల 8. విశాలాక్ష. వీరంతా శక్తి, వజ్రాయుధములు ధరించి యుందురు.

శ్లో॥ దిగ్దళాగ్రేషు పూర్వాది దేవసేనాపతిం పునః
విద్యాంమేధాం తతో వజ్రం కోణస్థాన్ శక్తికుక్కుటౌ ।
మయూరం ద్వీపమభ్యర్చేత్ బాహ్యే లోకేశ్వరాన్ పునః
అస్త్రాణి తేషా మంతేస్యుః సుబ్రహ్మణ్యార్చనేరితా ।

స్వాదుభిర్ భక్ష్య భోజ్యాద్యైః షష్ఠ్యాంసంప్రీణయే ద్విభుమ్
పూజయేద్దేవతాబుధ్యా కుమారాన్ బ్రహ్మచారిణః ।
సంతానం విజయం వీర్యం రక్షామాయుః శ్రియం యశః
ప్రదద్యాత్ సాధకస్యాశు సుబ్రహ్మణ్యః సురార్చితః ।
జపతర్పణ పూజాదౌ విఘ్నేశం సర్వసిద్ధిదం
ప్రీణయేదనయా స్తుత్యా ప్రాప్తయే సర్వసంపదామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నాలుగు దిశలందలి దళములలో దేవసేనాపతి - విద్యా - మేధా - పిమ్మట వజ్రములను అర్చించాలి. కోణములందు శక్తి - కుక్కుట - మయూర - ద్వీపములను పూజించాలి. బయట లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి.

షష్ఠితిథినాడు చక్కటి భోజనమును నైవేద్యము చేయవలయును. బ్రహ్మచారులను దేవతాబుద్ధితో పూజించి సత్కరించవలయును. సాధకుడు సంతానము, జయము, బలము, రక్షణ, ఆయువు, సంపద, కీర్తి పొందును.

జప - తర్పణ - పూజాదులందు గణపతి స్తవము తప్పక ఆచరించ వలయును. మహిమాన్వితమైన స్తోత్రము ఇపుడు చెప్పబడుచున్నది. దీనిని నిత్యమూ పఠించిన సమస్త కార్యములూ సిద్ధించును.

## గణేశ స్తుతి

శ్లో॥ ఓంకార మాద్యం ప్రవదంతి సంతో
వాచః శృతీనామపి యం గృణంతి ।
గజాననం దేవగణానతాంఘ్రిం
భజేఽహ మర్ధేందు కృతావతంసమ్ ॥

పాదారవిందార్చన తత్పరాణాం
సంసారదావానల భంగదక్షమ్ ॥
కృతాంగరాగం నవకుంకుమేన
మత్తాలిమాతాం మదపంకలగ్నామ్ ।
నివారయంతం నిజకర్ణతాళైః
కోవిస్మరేత్ పుత్రమనంగ శత్రోః ॥
శంభోర్జటాజూట నివాసగంగా
జలంసమాదాయ కరాంబుజేన ।
లీలాభిరారా చ్ఛివ మర్చయంతం
గజాననం భక్తియుతా భజంతి ॥
కుమార భక్తౌ పునరాత్మహేతోః
పయోధరౌ పర్వతరాజపుత్ర్యాః ।
ప్రక్షాలయంతం కరశీకరేణ
మౌగ్ధ్యేనతం నాగముఖం భజామి ॥
త్వయా సముద్ధృత్య గజాస్య హస్తం
యేశీకరాః పుష్కరరంధ్రముక్తాః ।
వ్యోమాంగణేతే విచరంతి తారాః
కాలాత్మనా మౌక్తికతుల్యభాసః ॥
క్రీడారతే వారినిధీ గజాస్యే
వేలామతిక్రామతి వారిపూరే ।
కల్పావసానం ప్రవిచింత్యదేవాః
కైలాసనాథం స్తుతిభిఃస్తువంతి ॥
నాగాననే నాగకృతోత్తరీయే
క్రీడారతే దేవకుమారసంఘైః ।

త్వయిక్షణం కాలగతిం విహాయ
తౌ[ప్రాపతుః కందుకాతాభనేందూ ॥
మదోల్లసత్ పంచముఖైరజస్రం
అధ్యాపయంతం సకలాగమార్థాన్ ।
దేవాన్ ఋషీన్ భక్తజనైక మిత్రం
హేరంబమర్కారుణ మాశ్రయామి ॥
పాదాంబుజాభ్యా మతి వామనాభ్యాం
కృతార్థయంతం కృపయాధరిత్రీమ్ ।
అకారణం కారణమాప్త వాచాం
తం నాగవక్త్రం నజహాతి చేతః ॥
తంచంద్రమౌళే స్తనయం తపోభిః
అవాప్య మానందఘనం భజామి ॥
పదంస్తుతీ నామపదం శృతీనాం
లీలావతారం పరమాత్మమూర్తేః ।
నాగాత్మకోవా పురుషాత్మకో వే
త్యభేద్యమాద్యం భజ విఘ్నరాజమ్ ॥
పాశాంకుశౌ భగ్నరదం త్వభీష్టం
కరైర్దధానం కరరంధ్రముక్తైః ।
ముక్తాఫలాభైః పృథుసీకరౌఘైః
సించతమంగం శివయోర్భజామి ॥
అనేకమేకం గజమేకదంతం
చైతన్యరూపం జగదాది బీజమ్ ।

బ్రహ్మేతి యంబ్రహ్మ విదోవదంతి
తంశంభు సూనుం శరణం భజామి ॥
స్వాంకస్థితాయా నిజవల్లభాయా
ముఖాంబుజాలోకనలోలనేత్రమ్ ।
స్మేరాననాబ్జం మదవైభవేన
రుద్ధంభజే విశ్వవిమోహనంతమ్ ॥
యే పూర్వమారాధ్య గజాననం త్వాం
శాస్త్రాణి సర్వాణి పఠంతి తేషామ్ ।
త్వత్తోనచాఽన్యత్ ప్రతిపాద్య మేతైః
తదస్తిచేత్ సర్వమసత్యకల్పమ్ ॥
హిరణ్యగర్భం జగదీశితారం
కవింపురాణం రవిమండలస్థమ్ ।
గజాననం యం ప్రవిశంతి సంతః
తత్కాలయోగైస్తమహం ప్రపద్యే ॥
వేదాంతగీతం పురుషం భజేఽహం
ఆత్మానమానందఘనం హృదిస్థమ్ ।
గజాననం యన్మహసాజనానాం
విఘ్నాంధకారో విలయంప్రయాతి ॥
శంభోః సమాలోక్య జటాకలాపే
శశాంఖఖండం నిజపుష్కరేణ ।
స్వభగ్నదంతం ప్రవిచింత్య మౌగ్ధ్యాత్
ఆకృష్టుకామః శ్రియమాతనోతు ॥

విఘ్నార్గళానాం వినిపాత నార్థం
యంనారికేళైః కదళీఫలాద్యైః ।
ప్రతారయంతో మదవారణాస్యం
ప్రాపుర్నరోఽభీష్ట మహం భజేతమ్ ॥
యజ్ఞైరనేకైర్బహుభిస్తపోభిః
ఆరాధ్యమాద్యం గజరాజవక్త్రమ్ ।
స్తుత్యాఽనయాయే విధినాస్తువంతి
తే సర్వలక్ష్మీ నిధయోభవంతి ॥

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*త్రయోదశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ చతుర్దశః పటలః

## అథ సౌర ప్రకరణమ్

శ్లో॥ అథోచ్యతే చంద్రమసో మనుః సర్వసమృద్ధిదః
ఖడ్గీశస్థో భృగుర్బిందు ర్మనుస్వరసమన్వితః ।
సోమాయ హృదయాంతోఽయం మంత్రప్రోక్తః షడక్షరః
ఋషిరుక్తో భృగుచ్ఛందః పంక్తిః సోమోఽస్యదేవతా ।
దీర్ఘ భాజా స్వబీజేన మనోరంగ క్రియామతా
రసలక్షం జపేన్మంత్రం సాధకో విజితేంద్రియః ।
షట్సహస్రం ప్రజుహుయాత్పాయసేన ససర్పిషా

సోమాంతం పూజితేపీఠే పూజయేద్రోహిణీ పతిమ్ ।
అంగాని కేసరేషు స్యు స్తద్దేవ్యః పత్రమధ్యగాః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - తేజోవంతములైన సోమ - సూర్య - అగ్నులలో మొదటిదైన సోముని మంత్రము వివరించబడుచున్నది.

**మనుః : స్వాం సోమాయ నమః ।**

భృగు ఋషిః । పంక్తి ఛందః । సోమోదేవతా । స్వాంబీజం । ఆయ శక్తిః । స్వాం - స్వీం - స్వూం ఇత్యాది దీర్ఘ బీజములతో షడంగ న్యాస మాచరించాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

☞ **కర్పూరస్ఫటికావ దాతమనిశం పూర్ణేందు బింబాననం**
**ముక్తాదామవిభూషితేన వపుషా నిర్మూలయంతం తమః ।**
**హస్తాభ్యాం కుముదం వరం చ దధతం నీలాలకోద్భాసితం**
**స్వస్యాఽంకస్థ మృగాంకమా శ్రయగుణం సోమంసుదాబ్ధింభజే॥**

పై మంత్రమును 6 లక్షలు జపించి, ఘృతయుక్త పాయసహోమం ఆచరించాలి. సూర్యాగ్ని మండలముల పూజానంతరం, సోమపీఠమునందు చంద్రుని అర్చించాలి. కేసరములందు అంగపూజ, పత్రమధ్యమునందు సోమపత్నులను పూజించాలి.

శ్లో॥ రోహిణీకృత్తికాభూయో రేవతీ భరణీ పునః
రాత్రిదార్ద్రాతతోజ్యోతిః కళాహారసమప్రభాః ।
సితమాల్యాంబరధరా ముక్తాహార విభూషణాః
పయోధరభరాక్రాంతా రచితాంజలయః శుభాః ।
వల్లభాసక్తమనసో మదవిభ్రమ మంథరాః
సమభ్యర్చ్యా సరోజాక్ష్య శ్చంద్రబింబనిభాననాః ।
ఆదిత్యమంగళబుధ మందవాక్పతి రాహవః

శుక్రకేతు యుతాః పూజ్యా దళాగ్రేషుగ్రహాఽఇమే ।
స్వస్వవర్ణాంబరోపేతాః స్వనామాద్యర్ణబీజకాః
రక్తారుణశ్వేతనీలపీతధూమ్ర సితాసితాః ।
వామోరున్యస్త తద్ధస్తా దక్షిణేన ధృతాభయాః
అంబుజాఢ్యకరోభానుః దంష్ట్రాభీమ ముఖః శనిః ।
రాహుర్వికృత వక్త్రః స్యాత్ కేతుఃస్యాద్విహి తాంజలిః
లోకపాలాః తతః పూజ్యాః వజ్రాద్యస్త్రైః సహక్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చంద్రుని శక్తులు 8. అవి. రోహిణి 2. కృత్తిక 3. రేవతి 4. భరణి 5. రాత్రిదా 6. ఆర్ద్రా 7. జ్యోతి 8. కళా. వీరంతా ఉజ్వలవర్ణులు. శ్వేతవర్ణ వస్త్రములు, శ్వేతమాలలు ధరించి యుందురు. ముత్యాలహారములు ధరించి పతిభక్తితో అంజలిబద్ధులై యుంటారు.

మద విభ్రమము కలిగి, సౌందర్యముతో అలరారుచుందురు. వీరినందరినీ అర్చించాలి. దళాగ్రభాగములందు రవి - చంద్ర - కుజ - బుధ - గురు - శుక్ర - శని - రాహు - కేతువులను అర్చించాలి.

రవి - బుధ - గురు - శుక్రులను తూర్పు మొదటగా నాలుగు దిశలందునూ, కుజ - శని - రాహు - కేతువులను ఆగ్నేయాది కోణము లందునూ అర్చించాలి. ఈ గ్రహములు వారి వారి స్వభావము ననుసరించి శరీరవర్ణము, వస్త్రధారణము కలిగియుందురు.

వీరి నామాద్యక్షరము వీరిబీజమంత్రమగును. రవి - ఎరుపు, కుజుడు - అరుణము, బుధుడు - తెలుపు, శని - నీలము, గురువు - పసుపు, రాహువు - ధూమ్రము (బూడిదరంగు, పొగరంగు) శుక్రుడు - స్వచ్ఛము, కేతువు - నలుపు.

వీరంతా ఎడమచేయిని తొడయందుంచుకొని కుడిచేతితో అభయ ముద్ర ధరించియుందురు. సూర్యుని చేతియందు కమలముండును. శని కోరలు కలిగి భయంకరముగా నుండును.

రాహువు వక్రముఖుడు, కేతువు దోసిలి పట్టుకొని యుండును. పిమ్మట లోకపాలురను, వారివారి ఆయుధములను, సాధకుడు అర్చించాలి.

శ్లో॥ ఏవంసిద్ధమనుర్మంత్రీ సంపదాం వసతిర్భవేత్
హృత్పుండరీక మధ్యస్థం తారహారవిభూషితమ్ ।
తారాపతిం స్మరన్ మంత్రీ త్రిసహస్రం మనుంజపేత్
రాజ్యైశ్వర్యం దరిద్రోఽపి ప్రాప్నుయాద్వత్సరాంతరే ।
పూర్వోక్తసంఖ్య ప్రజపేత్ శశినం మూర్ధ్ని చింతయన్
రోగాపమృత్యు దుఃఖాని జిత్వా వర్షశతం వసేత్ ।
బ్రహ్మచర్యరతః శుద్ధ శ్చతుర్లక్షమిమం జపేత్
నిధానంభూగతం సద్యః ప్రాప్నుయాద్యత్నవర్జితః ।
జితేంద్రియో జపేన్మంత్రం పౌర్ణమాస్యాం విశేషతః
భవేత్ సౌభాగ్యనిలయః సంపదామపరోనిధిః ।
ఘోరాన్ జ్వరాన్ శిరోరోగా నభిచారానుపద్రవాన్
విషాణామపి సంఘాతం నాశయేన్మనునాఽమునా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – హృదయకమల మధ్యమున, మౌక్తికహారశోభితుడైన చంద్రునిధ్యానించుచూ, మూడువేలు జపించిన, ఎంతటి దరిద్రుడైననూ ఒక సంవత్సర కాలములో గొప్ప ధనవంతుడు అగును. సహస్రారమందు చంద్రుని ధ్యానించుచూ, ప్రతీదినమూ మూడువేలు జపించిన, రోగ – అపమృత్యు దుఃఖములు నశించి, చిరకాలము జీవించును.

బ్రహ్మచర్యమును పాటించుచూ త్రికాలములందూ స్నానము చేయుచూ, కేవలం పాలు మాత్రమే ఆహారముగా స్వీకరించుచూ నాలుగు లక్షలు జపించిన, అనుకోని విధముగా నిధి లభించును.

జితేంద్రియుడై పున్నమినాడు రాత్రి మంత్రజపం చేసిన అపర కుబేరుడగును. జ్వర - శిరోరోగ - మారణాది ఉపద్రవములు, విష ప్రయోగములు నశించును.

శ్లో॥ పౌర్ణమాస్యాం నిరాహారో దద్యా దర్ఘం విధూదయే
ప్రాక్ప్రత్య గాయతం కుర్యాద్ భూతలే మండలత్రయమ్।
నిష్ణః పశ్చిమేమంత్రీ మండలే విహితాసనే
మధ్యస్థే స్థాపయేత్ పశ్చాత్ పూజాద్రవ్యాణ్య శేషతః ।
అన్యస్మిన్ మండలే సోమమర్చయిత్వాఽంబుజాన్వితే
రాజతం చషకంతత్ర స్థాపయేత్ పురతః సుధీః ।
గోదుగ్ధేన సమాపూర్య స్పృష్ట్వా తంప్రజపేన్మనుమ్
అష్టోత్తరశతం పశ్చాద్విద్యామంత్రేణ దేశికః ।
దద్యాదర్ఘం శశాంకాయ సర్వకార్యార్థ సిద్ధయే
అనేనవిధినా కుర్యాత్ ప్రతిమాసమతంద్రితః ।
షణ్మాసాభ్యంతరే సిద్ధిం సాధకేంద్రః సమశ్నుతే
శ్రియమపూర్వార్జితాన్ పుత్రాన్ సౌభాగ్యం పుష్కలం యశః।
కన్యామిష్టా మవాప్నోతి కన్యాఽపి వరమాప్నుయాత్
బహునాకిమిహోక్తేన సర్వందద్యాన్నిశాపతిః ।
విద్యేవిద్యామాలిని స్యాచ్చంద్రిణ్యంతే తతోభవేత్
పునశ్చంద్రముఖి స్వాహా విద్యామంత్ర ఉదాహృతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పున్నమియందునిరాహారుడై చంద్రోదయ సమయమున అర్ఘ్యమివ్వాలి. పశ్చిమదిశగా మూడు మండలముల నేర్పరచి, పశ్చిమమండలమందు కూర్చొని, మధ్య మండలములయందు పూజాద్రవ్యములుంచి, మూడవ మండలమందు కమలాసనములో కూర్చొని, చంద్రుని అర్చించి వెండిపాత్రను స్థాపించాలి.

ఆ పాత్రలో ఆవుపాలుపోసి దానిని తాకుచూ 108సార్లు మంత్రజపం చేసి, చెప్పబోవు విద్యామంత్రముచే చంద్రునికి అర్ఘ్యమివ్వాలి. ప్రతీపున్నమికీ ఇది ఆచరించాలి. ఇట్లు చేయుసాధకుడు 6 నెలలో మనోవాంఛ నెరవేరును. అభిలషితకన్యతో వివాహము జరుగును.

**విద్యామంత్రము : విద్యే విద్యామాలిని చంద్రిణి చంద్రముఖి స్వాహా।**

## సూర్యమంత్రము

శ్లో॥ తారోఘృణిర్భృగుః పశ్చాద్వామకర్ణ విభూషితః
వహ్న్యాసనో మరుచ్ఛేషః సనేత్రోఽత్రిత్య పశ్చిమః ।
అష్టాక్షరో మనుఃప్రోక్తో భానోరభిమత ప్రదః
దేవనాగో మునిఃప్రోక్తో గాయత్రీ ఛంద ఈరితమ్ ।
ఆదిత్యో దేవతా ప్రోక్తో దృష్టాదృష్టఫలప్రదః
సత్యాయ హృదయం ప్రోక్తం బ్రహ్మణే ద్విర ఈరితః ।
విష్ణవే స్యాచ్ఛిఖా వర్మ రుద్రాయ పరికీర్తితమ్
అగ్నయే నేత్రమాఖ్యాతం శర్వాయాఽస్త్రముదీరితం ।
తేజోజ్వాలామణి హుంఫట్ స్వాహాంతాః పృథగీరితాః
అంగమంత్రాన్ పునర్న్యస్యేత్ పంచమూర్తీర్యథాక్రమమ్।
ఆదిత్యం విన్యసేత్మూర్ధ్ని రవింముఖగతంన్యేసేత్
హృదయే భానునామానం భాస్కరం గుహ్యదేశతః ।

సూర్యం చరణయోర్న్యస్యేత్ హ్రస్వైః సద్యాదిపంచభిః
ప్రధానమూర్తి ప్రతిమాః సర్వాభరణ భూషితాః ।
మూర్ధాస్యకంఠహృదయం కుక్షినాభి ధ్వజాంఘ్రిషు
మంత్రవర్ణాన్ న్యసేదష్టౌ ప్రత్యేకం ప్రణవాదికాన్ ।
ఏవంన్యస్త శరీరోఽసౌ చింతయేత్తేజసా నిధిమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సూర్య అష్టాక్షరి మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం ఘృణి సూర్య ఆదిత్యః।**

దేవనాగ ఋషిః గాయత్రీఛందః । రంబీజం । యం శక్తిః । సమస్త దృష్టా దృష్ట ఫలప్రదో ఆదిత్యోదేవతా ।

**సత్యాయ హృదయాయ నమః।**

**బ్రహ్మణే శిరసే స్వాహా।**

**విష్ణవే శిఖాయై వషట్।**

**రుద్రాయ కవచాయహుమ్।**

**అగ్నయే నేత్రయోర్వషట్।**

**శర్వాయ అస్త్రాయ ఫట్।**

ఈవిధంగా అంగన్యాసమాచరించాలి.

సత్యాయ తేజోజ్వాలామణి హుంఫట్ - హృదయాయ నమః ।
బ్రహ్మణే తేజోజ్వాలామణిహుంఫట్ - శిరసే స్వాహా ।
విష్ణవే తేజోజ్వాలామణి హుంఫట్ స్వాహా - శిఖాయైవషట్ ।
రుద్రాయ తేజోజ్వాలామణి హుంఫట్స్వాహా - కవచాయహుమ్ ।
అగ్నయే తేజోజ్వాలా మణిహుంఫట్ స్వాహా - అస్త్రాయ ఫట్ ।
పిమ్మట, ఓం ఆదిత్యాయ నమః - మూర్ధ్ని, ఐం రవయే నమః -

ముఖే, ఉం భానవే నమః - హృదయే, ఇం భాస్కరాయ నమః గుహ్యే, ఓం అం సూర్యాయ నమః చరణయోః, అని సర్వాభరణభూషిత సూర్య మూర్తులను న్యాసం చేయాలి. పిమ్మట మంత్రములోని 8 అక్షరములనూ మూర్ధ - ముఖ - కంఠ - హృదయ - కుక్షి - నాభి - లింగ - చరణములందు న్యాసం చేయాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

☞ **రక్తాబ్జయుగ్మాభయ దాన హస్తం**
**కేయూరహారాంగద భూషణాఢ్యమ్ ।**
**మాణిక్యమౌళిం దిననాథమీడే**
**బంధూకకాంతిం విలసత్ త్రినేత్రమ్ ॥**

"నారాయణీయము" నందు బింబముద్రాలక్షణమిట్లు చెప్పబడినది.

**"పద్మాకారౌ కరౌకృత్వా అవిశ్లిష్టే తు మధ్యమే ।**
**అంగుళ్యౌ ధారయేత్తస్మిన్ బింబముద్రేతి సోచ్యతే ॥**

సౌరమంత్ర సాధనయందు సాధకుడు ఈ "బింబముద్ర"ను ప్రదర్శించవలయును.

శ్లో॥ వసులక్షం జపేన్మంత్రం సమిద్భిః క్షీరశాఖినాం
తత్సహస్రం ప్రజుహుయాత్ క్షీరాక్తాభిర్జితేంద్రియః ।
పీఠస్యక్లుప్తేః ప్రథమం దిక్షుమధ్యేచ సంయజేత్
ప్రభూతం విమలం సారం సమారాధ్యమనంతరమ్ ।
పరమాదిసుఖంపీఠం స్వబింబాంతం ప్రకల్పయేత్
దీప్తా సూక్ష్మా జయాభద్రా విభూతిర్విమలాపునః ।
అమోఘా విద్యుతా సర్వతోముఖీ పీఠశక్తయః
దీప్తదీప శిఖాకారా బీజాన్యాసాం విదుః క్రమాత్ ।
అక్లీబహ్రస్వత్రితయ స్వరాన్ బింద్వగ్ని సంయుతాన్
వదేత్ పదం చతుర్థ్యంతం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్ ।

సౌరాయ యోగపీఠాయ నమః పద మనంతరం
పీఠమంత్రోఽయ మాఖ్యాతో దినేశస్య జగత్పతేః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పై అష్టాక్షర మంత్రమును బ్రహ్మచర్యాది నియమములు పాటించుచూ 8 లక్షలు జపించి క్షీరసమిథలను, పాలతో తడిపి 8 వేలు హోమం చేయాలి.

పీఠపూజయందు ప్రభూత - విమల - సార - సామరథ్య - పరమాదిసుఖ, లను పిమ్మట దీప్తా - సూక్ష్మా - జయా - భద్రా - విభూతి - విమలా - అమోఘా - విద్యుతా - సర్వతో ముఖీ - అనే నవశక్తులను పూజించాలి. వీరి బీజమంత్రము రాం - రీం - రూం - రేం - రైం - రోం రౌం - రం - రః అనే అక్షరముతో ప్రారంభమగును. పిమ్మట పీఠమంత్రమిట్లుండును.

**ఉదా : రాంబ్రహ్మావిష్ణు శివాత్మకాయ సౌరాయ యోగపీఠాయ నమః।**

## మూర్తికల్పన మంత్రము

శ్లో॥ తారాది ఖం ఖఖోల్కాయ మనునామూర్తి కల్పనా
సాక్షిణం సర్వలోకానాం తస్యామావాహ్యపూజయేత్ ।
అంగాని పూజయేదాదౌ దిక్పత్రేష్వర్క మూర్తయః
ఆదిత్యాద్యాశ్చతస్రోఽర్చ్యాః శక్తయః కోణపత్రగాః ।
స్వస్వనామాదివర్ణాః స్యుస్తాసాం బీజాన్యనుక్రమాత్
ఉషాప్రజ్ఞాప్రభాసంధ్యా శక్తయః పరికీర్తితాః ।
పత్రాగ్రసంస్థా బ్రాహ్మ్యాద్యాః పురతోఽరుణ మర్చయేత్
చంద్రాదీనర్చయేత్ పశ్చాత్ గ్రహానష్టౌతతో బహిః ।
ఇంద్రాదీంశ్చ తదస్త్రాణి యథాపూర్వం సమర్చయేత్

ఏవం సంపూజ్య విధివత్ భాస్కరం భక్త వత్సలమ్ ।
దద్యాదర్ఘ్యం ప్రతిదినం వారే వాతస్యచోదితే
ప్రభాతే మండలంకృత్వా పూర్వవత్ పీఠమర్చయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మూర్తి కల్పనమంత్ర మిట్లుండును.

మనుః - **ఓం ఖం ఖం ఖఖోల్కాయ**। ఈ మంత్రముతో విగ్రహము నందు సూర్యుని ఆవాహన చేయాలి. పిమ్మట అంగపూజ చేయాలి.

ఆదిత్యాది సూర్యమూర్తులను పూజించాలి. ఉషా - ప్రజ్ఞా - ప్రభా - సంధ్యా అనే శక్తులను ఆరాధించాలి.

పత్రాగ్ర భాగములందు బ్రాహ్మీ మొదలైనవారిని, అరుణుని అర్చించాలి. పిమ్మట చంద్రాది గ్రహములను, లోకపాలురను వారి ఆయుధములను పూజించాలి. ఇట్టి పూజను ప్రతీరోజూ లేదా ఆదివారము నాడు ఆచరించాలి. ప్రాతఃకాలమున అర్ఘ్యం సమర్పించాలి.

## అర్ఘ్య విధి

శ్లో॥ పాత్రంతామ్రమయం ప్రస్థతోయగ్రాహి మనోహరం
నిధాయతత్రమనునా పూరయేత్తచ్ఛుభోదకైః ।
నిక్షిపేత్ సలిలే తస్మిన్నైక్యం సంచింత్య భానునా
సంగమభ్యర్చయేత్తస్మిన్ భాస్కరం ప్రోక్తలక్షణమ్
గంధపుష్పాది నైవేద్యైర్యథావిధి విధానవిత్
తత్పిధాయ జపేన్మంత్రం సమ్యగష్టోత్తరం శతమ్ ।
పునః సంపూజ్య గంధాద్యై ర్జానుభ్యామవనింగతః

ఆమస్తకం తదుద్ధృత్య వ్యోమ్ని సావరణే రవౌ ।
దృష్టింనిధాయ స్త్వైక్యేన మూలమంత్రంధియాజపన్
దద్యాదర్ఘ్యందినేశాయ ప్రసన్నేనాంతరాత్మనా ।
కృత్వాపుష్పాంజలింభూయో జపేదష్టోత్తరంశతం
యావదర్ఘ్యామృతం భానుః సమాదత్తే నిజైః కరైః ।
తేనతృప్తో దినమణి ర్దద్యాస్మై మనోరథాన్
అర్ఘ్యదానమిదం పుంసామాయురారోగ్యవర్ధనమ్ ।
ధనధాన్య పశుక్షేత్ర పుత్రమిత్ర కళత్రదం
తేజోవీర్యయశః కాంతి విద్యావిభవ భాగ్యదమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఓం ప్రస్థ జలము పట్టు రాగిపాత్రను తీసుకొని, సూర్యమంత్రము పఠించుచూ, పరిశుభ్రమైన జలము అందుపోసి, దానియందు గోరోచనం - కుంకుమ - రాజీ - రక్తచందనం - వెదురు బీజములు (వంశలోచనం?) గన్నేరు - జపాకుసుమం (మందార) కుశలు, బియ్యం, చామదుంప - ఎర్రఅక్షతలు వేయాలి.

పిమ్మట దానిని సూర్యుని ప్రతిరూపముగా భావించి అర్చించాలి. పంచోపచార పూజ చేసిన తరువాత, దానిపై చేతిని ఉంచి సూర్యమంత్రము 108 సార్లు జపించాలి. మరల పంచోపచార పూజ చేసి, మోకాలిపై కూర్చుండి, ఆ పాత్రను శిరసుపై భాగమునకు ఎత్తి సూర్యునికి చూపించి, మూలమంత్రము పఠించుచూ, భక్తితో అర్ఘ్యంగా ఆ నీటిని సమర్పించాలి.

పిమ్మట పుష్పాంజలి ధరించి మరల 108సార్లు మూలమంత్రము జపించి, సూర్యునకు సమర్పించాలి. ఈవిధముగా సూర్యునకు అర్ఘ్యమిచ్చు సాధకుడు ధన - ధాన్య - పశు - క్షేత్ర - పుత్ర - మిత్ర - కళత్ర - తేజో - వీర్య - కీర్తి - కాంతి - సంపద - విద్యా - ఆయు - ఆరోగ్యములను పొందును. ఇందు సందేహమేమీలేదు.

## ప్రయోజన తిలకమంత్రము

శ్లో॥ ఆకాశమగ్ని దీర్ఘేందు సంయుక్తం భువనేశ్వరీ
సర్గాన్వితో భృగుర్భానోస్త్ర్యక్షరో మనురీరితః ।
ఆధారాది పదాగ్రాంతం కంఠాదాధారకావధి
మూర్ధాది కంఠపర్యంతం క్రమాద్ బీజత్రయం న్యసేత్ ।
షడ్దీర్ఘ స్వరయుక్తేన మధ్యేనాంగాని కల్పయేత్
భానులక్షం జపేన్మంత్రం అన్నాజ్యేన దశాంశతః ।
తిలైర్వా మధురాసిక్తైర్జుహుయాద్విజితేంద్రియః
పూర్వోక్తే పూజయేత్పీఠే విధానేనాఽమునా రవిమ్ ।
ప్రథమావృత్తి రంగైః స్యాత్ పరా చంద్రాదిభిర్గ్రహైః
తృతీయా లోకపాలైః స్యాచ్చతుర్థీ స్యాత్త దాయుధైః ।
ఇతి సంపూజ్య నిర్మాల్యం తేజశ్చండాయ దీయతామ్
అర్ఘ్యం ప్రాగీరితం దద్యా ద్భానవే సంయతేంద్రియః ।
సోఽపి రత్నం ధనం ధాన్యం పుత్రపౌత్రాన్ పశూన్ యశః
వస్త్రాణి భూషణాదీని దద్యాదస్మై న సంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు మూడక్షరముల "ప్రయోజనతిలక" మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - హ్రాం హ్రీం సః ।**

బ్రహ్మాఋషిః । గాయత్రీఛందః । హ్రాంబీజం । హ్రీంశక్తిః । మూలాధారము నుండి పాదపర్యంతము, కంఠమునుండి ఆధార పర్యంతము, మూర్ధ స్థానమునుండి కంఠపర్యంతము మూడు బీజములను క్రమముగా న్యాసము చేయాలి.

**ఆం హ్రీం హృదయాయ నమః।**

**ఈం హ్రీం శిరసే స్వాహా।**

**ఊం హ్రీం శిఖాయైవషట్।**

**ఐం హ్రీం నేత్రత్రయాయ వౌషట్।**

**ఔం హ్రౌం కవచాయ హుమ్।**

**అం హ్రీం అస్త్రాయఫట్।**

పిమ్మట ఈ విధముగా ధ్యానం చేయాలి.

☞ **రక్తాంబుజాసన మశేషగుణైక సింధుం**
**భానుం సమస్త జగతామధి పంభజామి।**
**పద్మద్వయా భయవరాన్ దధతం కరాబ్జైః**
**మాణిక్యమౌళి మరుణాంగ రుచింత్రినేత్రమ్॥**

ఈ మూడక్షరముల మంత్రము 12 లక్షలు జపించి, ఆజ్యాన్న హోమము ఆచరించాలి. లేదా త్రిమధుర మిశ్రిత తిలలతో, బ్రహ్మచారిగా నియమనిష్ఠలతో హోమం ఆచరించాలి.

అనంతరం పీఠపూజాదులు నిర్వహించాలి. ప్రథమావరణమందు అంగపూజ, ద్వితీయావరణమందు చంద్రాది గ్రహములపూజ, తృతీయావరణమందు లోకపాలురను, చతుర్థావరణమందు వారి ఆయుధములను అర్చించాలి.

ఈవిధముగా ఆవరణార్చనచేసిన పిమ్మట, నిర్మాల్యమును తేజశ్చండునికి సమర్పించాలి. పిమ్మట అర్ఘ్యం సమర్పించాలి. ఇలా విధానము పాటించు సాధకుడు, రత్న – ధన – ధాన్య – పుత్ర – పౌత్ర – పశు – యశ – వస్త్రాభూషణములు పొందగలడు.

## మార్తండ భైరవ బీజము

శ్లో॥ ఆకాశమగ్ని పవన సద్యాంతర్ధీశ బిందుమత్
మార్తండ భైరవంనామ బీజమేత దుదాహృతమ్ ।
పుటితం బింబబీజేన సర్వకామఫలప్రదం
టాంతం దహనేత్రేందు సహితం తదుదీరితమ్ ।
పంచహ్రస్వాద్యబీజేన పంచమూర్తీః ప్రవిన్యసేత్
మధ్యమాది కనిష్ఠాంత మంగుళీషు క్రమాదిమాః ।
సూర్యాఖ్యో భాస్కరోభానుస్తతో రవిదివాకరౌ
శిరోవదన హృద్గుహ్యాపాదదేశే తు తాః పునః ।
దీర్ఘయుక్తేన బీజేన నేత్రాంతాంగాని విన్యసేత్
వ్యాపకం మూలబీజేన కుర్వీత తదనంతరమ్ ।
లక్షత్రయం జపేన్మంత్రీబీజం బింబపుటీకృతం
దశాంశం కమలైః ఫుల్లైః జుహుయాన్మధురో క్షితైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మార్తండ భైరవ బీజము చెప్పబడుచున్నది.

**మనుః : హ్రౌ ఉం**।

దీనిని బింబబీజము "త్రి" తో సంపుటితము చేసి జపించిన సకలకామనలు తీరును.

ఉం త్రిం - సూర్యాయ మధ్యమాభ్యాం నమః ।
ఐం త్రిం - భాస్కరాయ తర్జనీభ్యాం నమః ।
భానవే అంగుష్ఠాభ్యాం నమః ।
రవయే అనామికాభ్యాం నమః ।
దివాకరాయ కనిష్ఠికాభ్యాం నమః ।

మరల శిరో - వదన - హృదయ - గుహ్య - పాదములందు పంచమూర్తులను న్యాసం చేయాలి. పిమ్మట షడ్దీర్ఘయుక్త మార్తండ భైరవ బీజముతో హృదయ - శిరో - శిఖా - కవచ - అస్త్రన్యాసములు చేసి నేత్రన్యాసము, వ్యాపకన్యాసము మూలమంత్రముతో ఆచరించాలి. పిమ్మట ఇలా ధ్యానం చేయాలి.

☞ **హేమాంభోజ ప్రవాళప్రతిమ నిజరుచించారుఖట్వాంగ పద్మౌ**
**చక్రం శక్తిం సపాశం సృణిమతి రుచిరామక్షమాలాంకపాలమ్।**
**హస్తాంభోజైర్దధానం త్రినయనవిలసద్ వేదవక్త్రాభిరామం**
**మార్తండం వల్లభార్ధం మణిమయముకుటం హారదీప్తంభజామః**

సాధకుడు బింబమంత్రమును మార్తండబీజముతో పుటితము చేసి మూడులక్షలు జపించి త్రిమధురమిశ్రిత కమలములతో దశాంశ హోమం ఆచరించాలి.

శ్లో॥ పీఠే దీప్తాభిర్వ్యక్తే కర్ణికాయాముషాదికాః
పూర్వాదిదిక్షు సంపూజ్య మూర్తిం మూలేన కల్పయేత్ ।
ఆవాహ్యాపూజయేద్దేవం వక్ష్యమాణ విధానతః
సూర్యాదీంశ్చతురో దిక్షు విదిక్ష్వన్యం సమర్పయేత్ ।
అంగపూజా యథాపూర్వం నేత్రమీశాన దిగ్గతం
గ్రహానష్టౌ తతోబాహ్యే లోకపాలాంస్తతః పరమ్ ।
అర్ఘ్యప్రదానం ప్రయజేన్మంత్రీ మార్తండభైరవం
ఇతి సిద్ధ మనుర్మంత్రీ సాధయేదిష్ట మాత్మనః ।
శాల్యాజ్యతిల బిల్వానాం లక్షహోమాద్ భవేన్నిధిః
రాజవృక్షసముద్భూతైః పుష్పైర్వ్యోమో రమాకరః ।
జపాకుసుమహోమేన వశయత్య చిరాన్ నృపాన్

మాతులింగ ఫలైర్హుత్వాధనమిష్టం లభేత సః ।
ఇమంమంత్రజపన్ మర్త్యః కీర్తింపుత్రాన్ బలంద్యుతిం
వాక్సిద్ధి మమితాంలక్ష్మీం సౌభాగ్యమపిసాధయేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట సౌరపీఠమందు దీప్తాదిశక్తులను, మూలమంత్రముతో విగ్రహమందు ఆవాహనను ఆచరించాలి. నాలుగుదిశలందూ సూర్య - భాస్కర - భాను - రవులను అర్చించాలి. విదిక్కులందు దివాకరుని పూజించాలి. అంగపూజ ఆగ్నేయ కోణమునుండి ఈశాన్యకోణపర్యంతం నేత్ర - అస్త్రములను రెంటినీ పూజించాలి.

పిమ్మట 8 గ్రహములనూ, వాటికి బయట లోకపాలురను, వారి ఆయుధములనూ అర్చించాలి. పిమ్మట అర్ఘ్య ప్రదానముచేసి మార్తండ భైరవజపం ఆచరించాలి. మంత్రసిద్ధిని పొందిన సాధకుడు కామ్య ప్రయోగములను చేయ సమర్థుడగును.

రాజవృక్ష (                ) పుష్పములతో హోమం చేసిన సంపద కలుగును. బియ్యం - ఆజ్యం - తిలలు - మారేడు లక్ష సంఖ్యలో హోమం చేసిన నిధి లభించును.

మందారపుష్ప హోమం వలన అధికారవశ్యం, మాతులింగ (        ) ఫలహోమం వలన అభీష్టధనసిద్ధి కలుగును. మార్తండభైరవ మంత్రజపము వలన కీర్తి - పుత్ర - బల - తేజ - వాక్‌సిద్ధి - సంపత్ - సౌభాగ్యములు కలుగును.

## అజపామంత్రము

శ్లో॥ వియదర్ధేందు సహితం తదాదిః సర్గసంయుతః
అజపాఖ్యోమనుః ప్రోక్తో ద్వ్యక్షరః సురపాదపః ।

ఋషిర్ బ్రహ్మా స్మృతోదేవీ గాయత్రీ ఛంద ఈరితం
దేవతా జగతామాదిః సంప్రోక్తో గిరిజాపతిః ।
హసా షడ్ దీర్ఘయుక్తేన కుర్యాదంగ క్రియాంమనుః
భానులక్షం జపేన్మంత్రం పాయసేన ససర్పిషా ।
దశాంశం జుహుయాత్ సమ్యక్ తతఃసిద్ధో భవేన్మనుః
దీప్తాది పూజితేపీఠే ప్రాగుక్తే ప్రయజేద్విభుం ।
మూర్తింమూలేన సంకల్ప్య యజేదంగాదిభి స్సహ
ఋతంవసుం నరవరౌ దిగ్దలేషు విదిక్ష్వథ ।
అర్చయేద్భృత జాం గోజామబ్జాఖ్గామద్రిజాం పునః
లోకేశ్వరాంస్తదస్త్రాణి పూజయేత్ దేవమన్వహం ।
అర్ఘ్యంచ విధివత్ దద్యాత్ ప్రాక్ ప్రోక్తేనైవ వర్త్మనా
మంత్రాధ్యమాతృకాంభోజే పూర్ణకుంభం నిధాయతమ్ ।
పిధాయ **వామహస్తేన** న్యస్తమంత్రేణ సంయుతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – రెండక్షరముల అజపా మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః – హం సః।**

బ్రహ్మాఋషిః । గాయత్రీఛందః । హంబీజం । సఃశక్తిః । జగదాది గిరిజాపతిర్దేవతా । న్యాసమిట్లుండును.

అం హంసః హృదయాయ నమః ।

ఈం హంసః శిరసే స్వాహా ।

ఊం హంసః శిఖాయై వషట్ ।

ఐం హంసః కవచాయ హుమ్ ।

ఔం హంసః నేత్రద్వయాయ వౌషట్ ।

అం హంసః అస్త్రాయ ఫట్ ।

పిమ్మట ఈ విధంగా ధ్యానించాలి.

☞ **ఉద్యద్భాను స్ఫురితతడి దాకారమర్ధాంబికేశం**
**పాశాభీతీ వరదపరశూ సందధానం కరాగ్రైః ।**
**దివ్యాకల్పైర్నవమణిమయైః శోభితం విశ్వమూలం**
**సౌమ్యాగ్నేయం వపురవతువశ్చంద్ర చూడంత్రినేత్రమ్ ।**

అజపామంత్రము 12 లక్షలు జపించి, సఘృతపాయ హోమం ఆచరించాలి. దీప్తాదియుక్త పీఠమందు మూలమంత్రముతో, మూర్తికల్పన, అంగా సహిత సూర్యపూజ ఆచరించాలి.

అష్టపత్రములందలి నాలుగుదిశలలో ఋతు - వసు - నర - నరులను, కోణములందు ఋతజాగోజా - అజా - అద్రిజాలను అర్చించాలి. పిమ్మట లోకపాలురను వారి ఆయుధములను విధ్యుక్తముగా పూజించి, అర్ఘ్యం సమర్పించాలి.

మాతృకారూప కమలమండలమునందు, కుంభమును స్థాపించి దానిని ఎడమచేతితో మూసి 108సార్లు మూలమంత్రము జపించాలి.

శ్లో॥ స్మృత్వా తేనాఽభిషించేత్ యం సభవేద్విగతామయః
ఆయురారోగ్యవిభవా నమితాన్ లభతేనరః ।
అనేనైవ విధానేన విషార్తో నిర్విషోభవేత్
ఇందుభ్యాంవిగలత్ సుధాపరివృతం మంత్రాంత్యబీజం తతః
ప్రచ్యోతత్పరమామృతార్ద్ర శశినా సంసిక్తమాద్యం స్మరన్ ।
మంత్రీమంత్రమిమం జపేద్విషగదోన్మాదాప మృత్యుజ్వరాన్
జిత్వావర్షశతం విశిష్ట విభవో జీవేత్ సుఖం బంధుభిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అలా అభిమంత్రించిన జలమును, సూర్యస్మరణపూర్వకముగా, సాధ్యవ్యక్తి అభిషేకము చేసినచో సర్వరోగములూ తొలగును. స్త్రీలకు కూడా ఇలా చేయవచ్చు. విషబాధలు పొందు వ్యక్తి నిర్విషవంతుడై ఆరోగ్యముపొందును. ఆయురారోగ్య ఐశ్వర్యములు పొందును.

సాధకుడు మనోహరమైన ప్రాంతములో పద్మాసనములో కూర్చుండి సుషుమ్ణతో కలసిన అధోముఖ సహస్రదళపద్మము యొక్క కర్ణికామధ్యలో విసర్గను రెండు చంద్రమండలరూపముగా ధ్యానించి, వాటినుండి స్రవించు సుధాధారలతో తడుపబడుచున్న అనాహత కమల మధ్యమందు "స"కారమును ధ్యానించాలి.

పిమ్మట సుషుమ్ణామార్గమునుండి సకారము ద్వారా స్రవించు సుధారసముతో తడుపబడుచున్న పరిపూర్ణ అమృతమయ మణిపుర బిందువును ధ్యానించుచూ, దానినుండి మూలాధారము వద్దనుండు హకారమును అమృతప్లావితము చేయబడుచున్నట్లు భావించాలి.

మరల "హంసః" అను మంత్రాక్షరముతో తన ఆత్మ అమృత ప్లావితము చేయుచున్నట్లు ధ్యానించుచూ పరమానంద సందోహమందు నిమగ్నుడైనట్లు సాధకుడు తలచవలయును. ఇట్టి సాధకుడు సకల దోషములు తొలగి, చిరకాలము సుఖముగా జీవించును.

## అగ్నిమంత్రము

శ్లో॥ వ్యాహృతిత్రయమగ్నిః స్యాజ్జాతవేద ఇహావహ
సర్వకర్మాణి సంభాష్య సాధయాగ్ని ప్రియాతతః ।
తారాద్యోఽయం మనుః ప్రోక్తః పంచవింశతి వర్ణవాన్
ఋషిర్ భృగుర్ భవేచ్ఛందో గాయత్రం దేవతాఽనలః ।

విభక్తైఃపంచభిః షడ్భిః చతుర్భిః పంచభిస్త్రిభిః
ద్వాభ్యామంగక్రియాప్రోక్తా వర్ణైర్ మూలమనోఃక్రమాత్ ।
గురోర్లబ్ధమనుర్మంత్రీ చతుర్దశ్యాముపోషితః
జపేద్భాను సహస్రాణి శుద్ధాచారో జితేంద్రియః ।
అమావస్యదినే విప్రాన్ భోజయేన్మధురోత్తరైః
భక్ష్యభోజ్యైర్యథాశక్తి దద్యాత్తేభ్యోఽథ దక్షిణామ్ ।
ఇష్ట్వాస్వయం సమానీయ హోమద్రవ్యాణి శోధయేత్
అపరందినమారభ్య హోమం కుర్యాదతంద్రితః ।
క్రమాద్వట సమిద్వ్రీహి తిలరాజీహవిర్ ఘృతైః
ప్రత్యేకమష్టోత్తరశతం జుహుయాత్ దినశః సుధీః ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 25 అక్షరముల అగ్ని మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం భూర్భువః స్వః అగ్ని అగ్నిర్జాతవేద ఇహావహాసర్వ కర్మాణి సాధయస్వాహా।**

భృగుఋషిః । గాయత్రీఛందః । అగ్నిర్దేవతా । ఓం బీజం స్వాహా శక్తిః । 5+6+4+5+3+2 అక్షరములతో షడంగ న్యాసము ఆచరించాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

☞ **అంసాసక్తవర్ణ మాల్యమరుణ స్రక్చందనాలంకృతం**
**జ్వాలాపుంజజటాకలాప విలసన్మౌళిం సుశుక్లాంశుకమ్।**
**శక్తిస్వస్తిక దర్భముష్టిక జపస్రక్ స్రుక్స్రువాభవరాన్**
**దోర్భిర్ బిభ్రత మంచితత్రినయనం రక్తాభమగ్నింభజే॥**

ఈ అగ్నిమంత్రము చైత్రశుద్ధ చతుర్దశియందు, ఉపవాసాది నియమములు పాటించుచూ 12వేలు జపించాలి. పిమ్మట అమావాస్యనాడు,

మధుర భక్ష్యములతో బ్రాహ్మణ భోజనం జరపాలి. యథాశక్తి దక్షిణలిచ్చి సత్కరించాలి.

మరుసటి రోజునుండి హోమద్రవ్యములు సమకూర్చుకొని, ఏకాగ్రచిత్తముతో హోమం చేయాలి. మర్రిసమిధలు బియ్యము, తిలలు, రాజి, నేయితో విడివిడిగా 108 సార్లు ఆహుతులు సమర్పించాలి.

శ్లో॥ దశాహమేవం నిర్వర్త్య విధానేన విధానవిత్
దత్వాపూర్ణాహుతిం సమ్యగేకాదశ్యాం ద్విజోత్తమాన్ ।
సంపూజ్య తర్పయేద్విత్త్యైర్యథావిభవమాదరాత్
గురవేదక్షిణాం దద్యాదరుణాం గాం పయస్వినీమ్ ।
వాసాంసిధనదాన్యాని దత్వా సంప్రీణయేత్ పునః
స్వమండలాంతం ప్రయజేత్పీఠం సనవశక్తికమ్ ।
పీతాశ్వేతాఽరుణా కృష్ణా ధూమ్రాతీవ్రా స్ఫులింగినీ
రుచిరాజ్వాలినీ ప్రోక్తా కృశానోర్నవ శక్తయః ।
స్వబీజేనాసనం దద్యాన్మూర్తిం మూలేన కల్పయేత్
తత్ర సంపూజయేద్వహ్నిం విధినా ప్రోక్తలక్షణమ్ ।
అంగపూజాం పురాకృత్వా మూర్తిరష్టౌ దళే ష్విమాః
జాతవేదాః సప్తజిహ్వో హవ్యవాహనసంజ్ఞకః ।
అశ్వోదరజ సంజ్ఞోఽన్యః పునర్వై శ్వానరాహ్వయః
కౌమారతేజాః స్యాద్విశ్వముఖో దేవముఖోపరః ।
అర్చ్యాః స్వస్తికశక్తిభ్యాం విరాజిత కరాంబుజాః
లోకేశానర్చయేద్ బాహ్యే వజ్రాద్యాయుధ సంయుతాన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సాధకుడు ఈ విధముగా పదిరోజులు హోమం చేయాలి. పిమ్మట ఏకాదశినాడు పూర్ణాహుతి గావించి

బ్రాహ్మణులను సత్కరించాలి. యథాశక్తి దక్షిణలు సమర్పించాలి. పిమ్మట గురువునకు కపిలగోవును (చక్కగా పాలిచ్చుచూ దూడ కలిగినది) సమర్పించాలి.

ఇదేగాక వస్త్రాభరణ ధనధాన్యములు ఇచ్చి గురు అనుగ్రహమునకు పాత్రుడు కావలయును. పిమ్మట నవశక్తి యుక్త పీఠమందు వహ్నిమండలాంతపూజ చేయవలయును.

అగ్నియొక్క నవశక్తుల పేర్లు ఇట్లుండును. **1.** పీతా **2.** శ్వేతా **3.** అరుణా **4.** కృష్ణా **5.** ధూమ్రా **6.** తీవ్రా **7.** స్ఫులింగినీ **8.** రుచిరా **9.** జ్వాలినీ.

"రం వహ్నియోగపీఠాయ నమః" అను మంత్రముతో ఆసనము కల్పించి, మూలమంత్రముతో మూర్తికల్పన, ధ్యానము, షోడశోపచారపూజ చేయాలి.

అంగపూజయందు అగ్నియొక్క అష్టమూర్తులనూ అర్చించాలి. **1.** జాతవేద **2.** సప్తజిహ్వ **3.** హవ్యవాహన **4.** అశ్వోదరజ **5.** వైశ్వానర **6.** కౌమారతేజ **7.** విశ్వముఖ **8.** దేవముఖ. వీరంతా స్వస్తిక – శక్తి, ధారులై యుందురు. పిమ్మట లోకపాలురను, వారి ఆయుధములనూ అర్చించాలి.

శ్లో॥ ఇతి సంపూజయేన్నిత్యం జపేత్ సాగ్రం సహస్రకం
జాయతే వత్సరాదర్వాగ్ధన ధాన్య సమృద్ధిమాన్ ।
సాజ్యమన్నం ప్రజుహుయా ద్వత్సరాల్లభతే శ్రియం
కుసుమైర్ బ్రహ్మవృక్షస్య దధిక్షౌద్రఘృతాప్లుతైః ।
కరవీర ప్రసూనైర్వా మండలాత్ స్యాత్ సమృద్ధిమాన్
షణ్మాసం కపిలాజ్యేన జుహుయాద్వత్స రాంతరే ।
తస్య సంజాయతే లక్ష్మీః కీర్తిస్త్రైలోక్యవందితా

శాలిభిర్జుహుయాన్నిత్యం విధినాష్టోతరం శతం ।
వ్రీహిగో మహిషాన్నాద్యైః భవనం తస్యపూర్యతే
తిలహోమేన మహతీం లక్ష్మీమాప్నోతి మానవః ।
పలాశబిల్వ ఖదిర శమీదుగ్ధ మహీరుహామ్
వితంత తారగ్వధయోః సమిద్భిర్నిత్య మష్టోత్తరంశతమ్ ।
ఏకేన జుహుయాన్మంత్రీ ప్రతిపత్ స్వథవా సుధీః
సాధయేదఖిలాన్ కామాన్ షణ్మాసాన్నాత్రసంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ విధముగా సాధకుడు ప్రతిదినమూ అగ్నిదేవుని పూజించుచూ 1008 సార్లు అగ్నిమంత్రమును జపించిన, ఒక సంవత్సరములో అధిక ధనవంతుడగును. నేతితో పాయసము హోమము చేసినచో, ఒక సంవత్సరములో గొప్ప ధనము ప్రాప్తించును.

పెరుగు - నెయ్యి - తేనె వీటితో మోదుగ సమిధలు విడివిడిగా తడిపి నిత్యమూ 108సార్లు హోమం చేసిన లేదా వీటితో గన్నేరుపూలు విడివిడిగా 108సార్లు హోమమాచరించిన అష్టైశ్వర్యములూ కలుగును.

కపిల గోఘృతముతో నిత్యమూ 108సార్లు 6 నెలలు హోమము చేసిన ఒక సంవత్సరములో సాధకుడు సంపద పొందును. గొప్ప కీర్తి మంతుడగును. శాలి ధాన్యముతో 108 సార్లు హోమము చేసిన సాధకుని ఇల్లు ధాన్య - పశు - సంపదలతో నిండును.

తిలలతో హోమం చేసిన ధనవృద్ధి - 1. మోదు 2. మారేడు 3. చంద్ర 4. జమ్మి 5. క్షీరవృక్ష 6. వికంక 7. అరగ్వధ (  ) 8. గన్నేరు 9. కలువ 10. కమలములు 11. నల్లకలువ 12. ఎర్రకమలములు 13. కహ్లారములు (తెల్లకమలములు) 14. జాజి 15. దూర్వ, ఈ 15

ద్రవ్యములతో పాడ్యమినుండి పూర్ణిమవరకు హోమం చేసినచో, సాధకుడు సమస్త కోరికలను 6 నెలలో సిద్ధింపచేసుకొనును.

ఈ 15 ద్రవ్యములలో 7 సమిధలు 7 పుష్పములు 1 దూర్వ కలవు. వీటిని 15 రోజులలోగాని, పాడ్యమినాడే ఈ 15 ద్రవ్యములతో హోమం చేయవచ్చును. విడివిడిగా 108 సార్లు హోమం చేయాలి.

## తురగాగ్నిమంత్రము

శ్లో॥ ఉత్తిష్ఠ పురుష బ్రూయాద్ధరిపింగళ తత్పరం
లోహితాక్ష పదం దేహిమే దదాపయతద్వయమ్ ।
చతుర్వింశత్యక్షరాత్మా సమృద్ధి మనురీరితః
ఋష్యాదయః పురాప్రోక్తాః షడ్భూతకరణైస్త్రిభిః ।
చతుర్భిర్యుగలేనాఽర్ణై ర్మూలమంత్ర సముద్భవైః
విదధీత షడంగాని జాతియుక్తానిమంత్రవిత్ ।
లక్షమనుం జపేదేనం పయోఽన్నేన ససర్పిషా
దశాంశంజుహుయాద్వహ్నౌ తురగాగ్నిమనుం స్మరన్ ।
పీఠేప్రాగీరితేఽభ్యర్చ్యేత్ తదంగైర్మూర్తి భిస్సహ
ఆశాపాలైస్తదీయాస్త్రైః అర్చయేద్ధవ్యవాహనమ్ ।
ప్రాతః స్నానరతోమంత్రీ సహస్రం యోజపేన్మనుం
జిత్వారోగాన్ సుఖంజీవేత్ శ్రియా వర్ష శతం నరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 24 అక్షరముల తురగాగ్ని మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఉత్తిష్ఠ పురుష హరిపింగళ లోహితాక్ష దేహిమే దదాపయ స్వాహా ।**

ఋష్యాదులు పూర్వమువలెనే మంత్రములోని హల్లులు బీజములు, అచ్చులు శక్తులు 6+5+4+4+4+3+3+4+7 అక్షరములతో హృదయ, శిర మొదలగు స్థానములందు న్యాసం చేయాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

☞ **స్వర్ణాశ్వత్థం వినిర్గతం హుతవహం సింధూరపుంజప్రభం**
**జ్వాలాభిర్నిచితాంగ రోమని చయం కాంత్యాజగన్మోహనం।**
**అశ్వాకార మనర్ఘ రత్నవిలసద్ భూషాలసత్ కంధరం**
**రత్నైరింద్రియ నిర్గతైర్వసుమతీ మాచ్ఛాదయంతం స్మరేత్।**

పై మంత్రము లక్ష జపించి, పాలు, నేయి, పాయసం దశాంశ హోమం ఆచరించిన సిద్ధించును. పీఠ పూజాదులు ఆపై ఆచరించాలి. ప్రతిదినము స్నానాంతరం సహస్రజపం చేసిన, సర్వరోగముక్తుడై, సుఖముగా దీర్ఘాయువుగా జీవించును.

శ్లో॥ హృత్ప్రమాణే జలేస్థిత్వా భానుమాలోక్య సంయతః
చతుః సహస్రం ప్రజపేన్నిత్యం సంవత్సరావధి ।
అపమృత్యుభయంరోగ కృత్యాదారిద్ర సంభవాన్
క్లేశాన్నిర్జిత్య తేజస్వీ జీవేద్వర్ష శతం సుధీః ।
కృత్తికాయాం ప్రతిపది శాలిహోమో ధనప్రదః
దధ్నాశమీ సమిద్భిర్వా ప్రతివత్సు భవేద్ధనమ్ ।
ఇష్టావాప్తిర్భవేదాజ్యైః పద్మైః గ్రామమవాప్నుయాత్
తిలైర్జ్యోతిష్మతీ భూతై రిపురాజ్యం జయేన్నృపః ।
అశ్వత్థ సమిధో మేషీ ఘృతాక్తా జుహుయాన్నరః
కన్యామిష్టా మవాప్నోతి సాపి తం ప్రాప్నుయాత్ పతిమ్ ।
శుద్ధాజ్యేన కృతోహోమో జ్వరనాశకరః స్మృతః
సప్తాహం జుహుయాన్మంత్రీ బంధూక కుసుమైః శుభైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – హృదయ పర్యంతము నీళ్లలో నిలబడి, సూర్యుని చూచుచూ నిత్యమూ 4వేలు జపం, ఒక సంవత్సర పర్యంతం చేసిన అపమృత్యు – రోగ – కృత్యా – దారిద్ర్య బాధలు తొలగును. చిరకాలము జీవించును.

కృత్తికా నక్షత్రయుక్త పాడ్యమినాడు, ధాన్యముతో హోమము చేసిన, లేదా పాడ్యమినాడు జమ్మిసమిధలు పెరుగుతో తడిపి హోమం చేసిన ధనప్రాప్తి కలుగును. ఆజ్యహోమము వలన ఇష్టసిద్ధి, పద్మహోమము వలన అధికారప్రాప్తి, జ్యోతిష్మతీ (మానేరు) తైలహోమమువలన, శత్రుధనప్రాప్తి, (రాజ్యసిద్ధి) కలుగును.

రావి సమిధలు నేతితో హోమం చేయుటవలన, ఇష్టస్త్రీతో వివాహము జరుగును. స్త్రీ హోమం చేసిన ఇష్టవరుని పొందును. శుద్ధ ఘృత హోమము జ్వరనాశకమగును. బంధూక పుష్పహోమము ఏడురోజులు ఒక వెయ్యి చొప్పున హోమం చేసిన గొప్ప ధనవంతుడగును.

శ్లో॥ సాగ్రం సహస్రమచిరాన్మహతీం శ్రియమశ్నుతే
మాసం క్షీరేణ గవ్యేన క్షీరాహారో జితేంద్రియః ।
సహస్రంజుహు యాన్మంత్రీ సంపదామధిపోభవేత్
ఆజ్యాక్త దూర్వా హోమేన జీవేద్వర్ష శతం నరః ।
అష్టోత్తర శతంనిత్యం హవిషామృగముద్రయా
జుహ్వతో జాయతే లక్ష్మీ ర్ధనధాన్య సమృద్ధిదా ।
ప్రతిమాసం ప్రతిపది జుహుయాదయుతం ఘృతైః
శ్రీర్భవేన్మహతీ తస్య షణ్మాసాదనపాయినీ ।
అరుణైరుత్పలైః ఫుల్లైర్మధు రత్రయ సంయుతైః
జుహుయాద్వత్సరార్థం యః సభవేదిందిరాపతిః ।

అరుణాజ్యై స్త్రి మధ్వక్తై ర్జుహుయా దన్వహం సుధీః
సహస్రం వత్సరార్ధేన భవేత్ భూమిపురందరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - గోక్షీరముతో, ఒక నెల పర్యంతం జితేంద్రియుడై హోమం చేసిన ధనప్రాప్తి, నేతితో తడిపిన దూర్వాహోమం చేసిన దీర్ఘాయువు సిద్ధించును. మృగముద్రతో హవిస్సు గ్రహించుచూ 108 సార్లు హోమం చేసిన అఖండ సంపదలు కలుగును.

(మృగముద్ర అనగా చిటికెనవ్రేలు, చూపుడువ్రేలు పైకి చాపి, అనామిక - అంగుష్ఠ - మధ్యమాగ్రములు కలిపిన లేడిముఖాకారముగా ఏర్పడును).

నెలలోని రెండు పాడ్యమి తిథులందు, నేతితో పదివేలు హోమం చేయుచుండినచో 6 నెలలో స్థిరమైన సంపద కలుగును. వికసించిన కమలములను త్రిమధురములతో (వెయ్యి - పాలు - తేనె) కలిపి, చరుద్రవ్యమును వెయ్యిసార్లు హోమంచేసిన 6 నెలలో అధికారము సిద్ధించును.

శ్లో॥ వత్సంజుహ్వాతస్తస్య లక్ష్మీరింద్రేణ వాంఛితా
జుహుయాదమృతాఖండైః పయోஉక్తైః సప్తవాసరమ్ ।
త్రిసహస్రం ప్రతిదినం మంత్రవిద్ విజితేంద్రియః
కృత్యాద్రోహజ్వరోన్మాద రోగాన్ జిత్వా నిరంతరమ్ ।
జీవేద్వర్ష శతం భూత్వా తేజసా భాస్కరప్రభః
కరవీర జపాబిల్వ పలాశనృప భూరుహామ్ ।
ప్రసూనైః కుముదైః ఫుల్లైః కురంటైర్జాతిసంభవైః
పుష్పైర్హుత్వా త్రిమధ్వక్తైర్మంత్రీ ప్రతిపదంప్రతి ।
ప్రాప్నుయాన్మహతీం లక్ష్మీం వత్సరాద్వాంఛితాధికామ్

ఆదాయతండుల ప్రస్థం నిర్మలం సాధుశోధితమ్ ।
గోదుగ్ధేన హవిఃకృత్వా కేవలంతేన కల్పయేత్
ఆజ్యాక్తం తత్సమాదాయ పూజితే హవ్యవాహనే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ విధముగా ఒక సంవత్సరము **108 సార్లుగా** హోమం చేసిన సకలాభీష్టములూ నెరవేరును. నిత్యమూ మూడువేలు హోమం చేసిన, అభిచారప్రయోగములు, శారీరక – మానసిక రుగ్మతలు తొలగి దీర్ఘాయువు పొందును.

గన్నేరు – మందార – మారేడు – మోదుగ – రాజవృక్షం ( ) పూలతో, కలువ – గోరింట – జాజిపూలతో త్రిమధుర మిశ్రితముగా, ప్రత్యేకముగా హోమం చేసిన ఒక సంవత్సరకాలములో మనోవాంఛ నెరవేరును.

ఒక ప్రస్థ ప్రమాణము బియ్యమును తీసుకొని శుభ్రముగా కడిగి గోక్షీరముతో వండి, హవిస్సుగా తయారుచేసి, మరల దానిని నేతితో కలిపి ముద్దలుగా చేయాలి. పిమ్మట

శ్లో॥ గంధపుష్పాదిభిః సమ్యక్ జపిత్వాఽష్టోత్తరంశతం
జుహుయాత్ ప్రతిపద్యగ్నిం ధ్యాత్వా తురగ విగ్రహమ్ ।
జాయతేవత్సరాదర్వాగ్ లక్ష్మీఃత్రైలోక్య మోహినీ
మంత్రేణాఽనేన సంజప్తాం వచాం ఖాదేద్దినాగమే ।
భారతీ నివసేత్తస్య ముఖాంభోజే వినిశ్చలా
అష్టోత్తరశతం జప్తంజలం ప్రాతః పిబేన్నరః ।
జఠరాగ్నిర్ జ్వలేత్తస్య హవిషేవ హుతాశనః ।
కృత్వానవపదాత్మానం మండలం ప్రాగుదీరితం
కలశాన్నవకల్యాణాన్ స్థాపయేత్ప్రోక్త వర్త్మనా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అగ్నిదేవుని గంధ పుష్పాదులతో అర్చించి, అశ్వశరీరునిగా భావించి - ధ్యానించి పై మంత్రమును 108 సార్లు జపించుచూ హోమం చేసిన సాధకుడు ఒక సంవత్సరకాలములో ఆకర్షణశక్తిని, అఖండసంపదను పొందును.

ప్రాతఃకాలమున ఈ మంత్రముతో "వస"ను అభిమంత్రించి, భక్షించినచో గొప్ప వాక్ పటుత్వము కలుగును. అదేవిధముగా 108 సార్లు అభిమంత్రించి జలము సేవించిన జఠరాగ్ని వృద్ధి చెందును.

నవపద మండలము నిర్మాణము చేసి, అందు తొమ్మిది కలశములు స్థాపించి, పిమ్మట -

శ్లో॥ క్షీరవృక్ష త్వగుద్ భూతైః క్వాథైస్తాన్ పూరయేత్ క్రమాత్
వస్త్రాదిభిరలంకృత్య నవరత్నాని నిక్షిపేత్ ।
మధ్యేసంపూజయేదగ్ని మూర్తీరష్టౌ దిశాంక్రమాత్
కుంభేషు గంధపుష్పాద్యై ర్ధూపదీపైర్మనోహరైః ।
స్పృష్ట్వా జపేత్తతః కుంభాన్ మంత్రమష్టోత్తరం శతమ్
అభిషించేత్తతః సాధ్యం వినీతం దత్త దక్షిణమ్ ।
జ్వరగ్రహమహారోగ దారిద్ర్యాదీన్ విజిత్యసః
జీవేద్వర్ష శతం సమ్యగభిషిక్తః శ్రియాసహ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - క్షీరవృక్ష బెరడుతో చేసిన కషాయమును వాటియందు నింపాలి. అందు నవరత్నములుంచి వస్త్రముతో ఆచ్ఛాదన చేయాలి. మధ్య కలశమందు అగ్నిదేవుని, మిగిలిన వాటియందు పూర్వాది దిశక్రమముగా అగ్నియొక్క అష్టమూర్తులనూ ఆవాహనచేసి పంచోపచార పూజ చేయాలి.

మరల ఆ కుంభములు తాకుతూ 108 సార్లు మూలమంత్రం జపించాలి. పిమ్మట గురుదక్షిణ సమర్పించి, ఆ కుంభములలోని జలముతో సాధ్యవ్యక్తి అభిషేకించిన గ్రహబాధలు, రోగబాధలు, దరిద్రము తొలగి ధనవంతుడై దీర్ఘాయువు పొందును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*చతుర్ధః పటలః సమాప్తః*

❖❖❖

# అథ పంచదశః పటలః

## అథవిష్ణు ప్రకరణమ్

శ్లో॥ అథ వక్ష్యే మహామంత్రాన్ విష్ణోః సర్వార్థసాధకాన్
యస్య సంస్మరణాత్ సంతోభవాబ్ధేః పారమాశ్రితాః ।
తారం నమః పదం పశ్చాన్నరౌ దీర్ఘ సమన్వితౌ
పవనోణాయ మంత్రోఽయం ప్రోక్తో వస్వక్షరాన్వితః ।
సాధ్యనారాయణః ప్రోక్తో మునిశ్ఛంద ఉదాహృతం
మంత్రస్యదేవీ గాయత్రీ దేవతా విష్ణురవ్యయః ।
క్రుద్ధోల్కాయ హృదాఖ్యాతం మహోల్కాయ శిరఃస్మృతః
సాధ్యనారాయణః ప్రోక్తో మునిశ్ఛంద ఉదాహృతం
మంత్రస్యదేవీ గాయత్రీ దేవతా విష్ణురవ్యయః ।
క్రుద్ధోల్కాయ హృదాఖ్యాతం మహోల్కాయ శిరః స్మృతం
వీరోల్కాయ శిఖాప్రోక్తా ద్యూల్కాయం కవచంస్మృతం
వీరోల్కాయ శిఖాప్రోక్తా ద్యూల్కాయ కవచంస్మృతమ్ ।
సహస్రోల్కాయాఽస్త్రముక్త మంగక్లప్తిరియం మతా

భూయోవర్ణైర్మనోః షడ్భిః షడంగాని సమాచరేత్ ।
అవశిష్టౌ పునర్వ్వర్ణౌ విశ్యసేత్ కుక్షిపృష్ఠయోః
బద్ధదిక్ చక్రమంత్రేణ మంత్రవర్ణాంస్తనౌన్యసేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సార్వర్థ సిద్ధినిచ్చు విష్ణు మహామంత్రములు చెప్పబడుచున్నవి. స్మరణ మాత్రముచేతనే సంసార సాగరమును తరింపచేయును. విష్ణు అష్టాక్షరి ఇట్లుండును.

**మనుః : ఓం నమో నారాయణాయ ।**

నారాయణముని ఋసిః । గాయత్రీఛందః । నిర్వికార విష్ణుర్దేవతా । ఓం బీజం ఆయశక్తిః ।

**"మంత్రతంత్రప్రకాశ"** గ్రంధమందు అంతర్యామీ ఋషిః । గాయత్రీ ఛందః । అని చెప్పబడినది.

పంచాంగ వ్యాసమిట్లుండును.

క్రుద్ధోల్కాయ హృదయాయ నమః ।

మహోల్కాయ శిరసే స్వాహా ।

వీరోల్కాయ శిఖాయై వషట్ ।

ద్యూల్కాయ కవచాయహుమ్ ।

సహస్రోల్కాయ అస్త్రాయఫట్ ।

పిమ్మట మంత్రములోని మొదటి ఆరు అక్షరములతో (ఒక్కొక్క అక్షరముతో) షడంగన్యాసము, మిగిలిన రెండు అక్షరములతో, కుక్షి, పృష్ఠము (వీపు)లందు న్యాసము చేయాలి.

పిమ్మట చక్రమంత్రముతో (చక్రాయస్వాహా) అని చిటికవేసి దిగ్బంధనం చేయాలి.

## విభూతి పంజరన్యాసం

శ్లో॥ ఆధారే హృదయే వక్త్రే దోః పన్మేలేషు నాసికే
కంఠేనాభౌ హృదికూర్చే పార్శ్వపృష్ఠేషు తత్పరమ్ ।
మూర్ధాస్య నేత్రశ్రవణఘ్రాణేషు తదనంతరం
దోఃపాద సంధ్యంగుళిషు ధాతుప్రాణేషు హృత్స్థలే ।
మూర్ధేక్షణాస్య హృత్ కుక్షి సోరుజంఘాపదద్వయే
ఏకైకశోన్యసేద్వర్ణాన్ గండాంసోరు పదేషు చ ।
చక్రశంఖ గదాంభోజం పదేష్వవహితోన్యసేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట అష్టాక్షరి మంత్రములోని వర్ణములతో ఆధార - హృదయ - ముఖ - కర - పాదముల - నాసిక - కంఠ - నాభి - హృదయ - కుచ - పార్శ్వ - పృష్ఠములందు న్యాసము చేయాలి.

మరల శిర - ముఖ - నేత్ర - శ్రవణ - ఘ్రాణములందు, కర - పాదాంగుళి సంధులు - సప్తధాతువులు - పంచప్రాణులు - శిర - నేత్ర - ముఖ - హృదయ - కుక్షి - ఊరు - జంఘాద్వయ - పదద్వయ - గండస్థల - భుజ - ఊరు - పాదములందు ఒక్కొక్క అక్షరము న్యాసము చేయాలి. మిగిలిన 4 అక్షరములతో చక్ర - శంఖ - గదా - పద్మస్థానము లందు న్యాసం చేయాలి.

## మూర్తి పంజర న్యాసము

శ్లో॥ అష్టార్ణోఽష్ట ప్రకృత్యాత్మా జ్ఞేయోఽసౌ చతురాత్మనాం
సంయోగాత్ సూరిభిఃప్రోక్తో విశిష్టో ద్వాదశాక్షరః ।

అతస్తన్మంత్ర వర్ణాద్యా ద్వాదశస్వర సంయుతాః
ద్వాదశాదిత్య సహితా మూర్తీర్ ద్వాదశ విన్యసేత్ ।
కేశవాద్యాః క్రమాద్దేహే వక్ష్యమాణ విదానతః
లలాటంకేశవం ధాత్రా కుక్షౌ నారాయణంపునః ।
అర్యమ్ణా హృది మిత్రేణ మాధవం కంఠ దేశతః
వరుణేన చగోవిందం పునర్దక్షిణపార్శ్వకే ।
అంశునావిష్ణు మంసస్థం భగేన మధుసూదనం
గలే వివస్వతా యుక్తం త్రివిక్రమమనంతరమ్ ।
వామపార్శ్వస్థ మింద్రేణ వామనాఖ్య మథాంసకే
పూష్ణాశ్రీధరనామానం గలేపర్జన్య సంయుతమ్ ।
హృషీకేశాహ్వాయం పృష్ఠే పద్మనాభంతతః పరం
త్వష్ట్రా దామోదరం పశ్చాద్విష్ణునా కకుదిన్యసేత్ ।
ద్వాదశార్ణం మహామంత్రం తతోమూర్ధ్ని ప్రవిన్యసేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట పృథ్వి - జల - తేజ - వాయు - ఆకాశ - అహంకార - మహతత్వ - ప్రకృతి వీటితో క్రమముగా పాద - లింగ - హృదయముఖ - మూర్ధా - హృదయ - అంతఃకరణ - సర్వశరీరములందు సృష్టి, మరియు సంహారన్యాసము లాచరించాలి.

(సృష్టిన్యాసమునందు మంత్రము విలోమముగా చెప్పవలయును. సంహారన్యాసమునందు అనులోమముగా చెప్పవలయును. సృష్టియందు తత్వములు అనులోమముగాను, సంహారమందు తత్వములు ప్రతిలోమముగాను జరుగును).

పిమ్మట బిందు - నాద - శక్తి - శాంతస్వరూపములను ఆత్మ యందు న్యాసము చేయాలి.

ఇపుడు ద్వాదశాక్షర మంత్రము చెప్పబడుచున్నది. అష్టప్రకృత్యాత్మక మైన అష్టాక్షరమంత్రముతో - ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మల బీజములు, ఆం - అం - పం - హ్రీంలు చేర్చిన విశిష్టమైన ద్వాదశాక్షర మంత్రమేర్పడును.

పిమ్మట 16 అచ్చులలోని నపుంసక వర్ణములు నాలుగు (ఋ-ౠ-ఌ-ౡ) విడిచిపెట్టి మిగిలిన 12 అక్షరములతో 12 ఆదిత్యులపేర్ల సంపుటముచేసి, కేశవాది 12 మూర్తులను, లలాటాదులయందు ఇలా న్యాసం చేయాలి.

1. లలాటే అం కేశవధాతృభ్యాం నమః - లలాటే ।
2. ఓం ఆం నారాయణార్యమభ్యాం నమః - కుక్షౌ ।
3. ఓం ఇం మాధవమిత్రాభ్యాం నమః - హృదయే ।
4. ఓం ఈం గోవిందవరుణాభ్యాం నమః - కంఠదేశే ।
5. ఓం ఉం విష్ణ్వంశుభ్యాం నమః - దక్షిణపార్శ్వే ।
6. ఓం ఊం మధుసూదనభగాభ్యాం నమః - దక్షిణాంసకే ।
7. ఓం ఏం త్రివిక్రమ వివస్వద్భ్యాం నమః - గళేదక్షిణభాగే ।
8. ఓం ఐం వామనఇంద్రాభ్యాం నమః - వామపార్శ్వే ।
9. ఓం ఓం శ్రీధర పూష్ణాభ్యాం నమః - వామాంసకే ।
10. ఓం ఔం హృషీకేశ పర్జన్యాభ్యాం నమః - వామగళే ।
11. ఓం అం పద్మనాభత్వష్ట్రభ్యాం నమః - పృష్ఠే ।
12. ఓం అః దామోదర విష్ణుభ్యాం నమః - కకుది ।

ఓం నమో నారాయణాయ అం అం పం హ్రీం - శిరసి - న్యాస మాచరించాలి.

## కిరీట మంత్రము

శ్లో॥ పునః కిరీట మంత్రేణ వ్యాపకం విన్యసేత్తతః
బ్రూయాత్కిరీట కేయూరహారం మకరకుండలమ్ ।
శంఖచక్ర గదాంభోజ హస్తం పీతాంబరం ధరం
శ్రీవత్సాంకిత వక్షోఽతే స్థలశబ్దముదీరయేత్ ।
శ్రీభూమిసహిత స్వాత్మజ్యోతిర్ ద్వయ ముదాహృతం
పశ్చాద్దీప్తి కరాయేతి సహస్రాదిత్య తేజసే ।
నమోఽంతః ప్రణవాద్యోఽయం కిరీటమనురీరితః
ఏవం న్యాసంతనౌ కృత్యా ధ్యాయేన్నారాయణంపరమ్ ।
వికారలక్షం ప్రజపేన్మనుమేనం సమాహితః
తద్దశాంశం సరసిజైర్జుహుయాన్మధురాప్లుతైః ।
పీఠేసంపూజయేద్దేవం విమలాది సమన్వితే
విమలోత్కర్షిణీ జ్ఞానా క్రియాయోగా తతః పరమ్ ।
ప్రహ్వీసత్యాతథేశానాఽనుగ్రహా నవమీతథా
నమోభగవతే బ్రూయాద్విష్ణవే చ పదం వదేత్ ।
సర్వభూతాత్మనే వాసుదేవాయేతి వదేత్తతః
సర్వాత్మసంయోగ పదాద్యోగ పద్మపదం పునః ।
పీఠాత్మనే హృదంతోఽయం మంత్రాస్త్రాది రీరితః
దత్వాఽనేనాసనం మంత్రీ మూర్తిం మూలేన కల్పయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు కిరీటమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం కిరీట కేయూరహార మకరకుండల శంఖచక్ర గదాంభోజ హస్త, పీతాంబరధర, శ్రీవత్సాంకిత వక్షః స్థల, శ్రీభూమి సహిత స్వాత్మజ్యోతిః దీప్తికరాయ, సహస్రాదిత్య తేజసే నమః ।**

ఈ కిరీట మంత్రముతో సాధకుడు సర్వాంగ న్యాసమాచరించాలి. పిమ్మట **విష్ణుధ్యానం** ఇలా చేయాలి.

☞ **ఉద్యత్కోటి దివాకరాభమనిశం శంఖం గదాంపకంజం**
**చక్రం బిభ్రత మిందిరా వసుమతీ సంశోభిపార్శ్వద్వయమ్ ।**
**కోటీరాంగద హారకుండలధరం పీతాంబరం కౌస్తుభో**
**ద్దీప్తం విశ్వధరం స్వవక్షసి లసచ్ఛ్రీవత్సచిహ్నాంభజే ॥**

ధ్యానానంతరం శ్రీవత్స - కౌస్తుభ - వనమాలా - అంజలి, గరుడముద్రలు ప్రదర్శించాలి.

కిరీటమంత్రము 16 లక్షలు జపించి, త్రిమధురయుక్త కమలములతో దశాంశహోమం ఆచరించాలి. పిమ్మట పీఠమందు నవశక్తులను ఆరాధించాలి.

1. విమలా 2. ఉత్కర్షిణీ 3. జ్ఞానా 4. క్రియా 5. యోగా 6. ప్రహ్వీ 7. సత్యా 8. ఈశానా 9. అనుగ్రహా.

పిమ్మట - **ఓం నమోభగవతే విష్ణవే సర్వభూతాత్మనే వాసుదేవాయ సర్వాత్మసంయోగ యోగపద్మ పీఠాత్మనే నమః ।** అను పీఠమంత్రముతో ఆసనం సమర్పించాలి. పిమ్మట మూలమంత్రముతో మూర్తికల్పన చేయాలి.

శ్లో॥ ఆవాహ్య పూజయేద్దేవం సుగంధి కుసుమాదిభిః
అంగాన్యభ్యర్చ్య మంత్రార్ణాన్ కేసరేషు సమర్చయేత్ ।
దళేషు వాసుదేవాద్యా మూర్తీః శక్తిసమన్వితాః
వాసుదేవం సంకర్షణం ప్రద్యుమ్న మనిరుద్ధకమ్ ।
హిమపీత తమాలేంద్ర నీలాభాః పీతవాససః
శంఖంచక్రగదాంభోజ ధరా ఏతే చతుర్భుజాః ।
శాంతిం శ్రియం సరస్వత్యా రతిం కోణదళేషుతాః
శ్వేత కాంచ గోదుగ్ధ దూర్వావర్ణాః సంభూషితాః ।
హేతీనర్చే ద్దళాగ్రేషు శంఖంచక్రం గదాంబుజే
రక్తాచ్ఛపీత కనక శ్యామకృష్ణాసి పాండురాన్ ।
బహిరగ్రే సమభ్యర్చేత్ గరుడం కుంకుమప్రభం
ముక్తామాణిక్యసంకాశౌ దక్షిణోత్తరతో నిధీ ।
ధ్వజం వరుణదిగ్భాగే శ్యామలం పూజయేత్తతః
అరుణం విఘ్నమాగ్నేక్ష్మేఏ శ్యామమార్యం నిశాచరే ।
శ్యామాందుర్గాం వాయుకోణే సేనాన్యంపీత మీశ్వరే
ఇంద్రాదీన్ పూజయేత్పశ్చాద్ వజ్రాద్యాయుధ సంయుతాన్।
ఇతి సంపూజయేద్విష్ణుం ప్రోక్తైరావరణైః సహ
ధర్మార్థకామాన్ లబ్ధ్వాంతే విష్ణోః సాయుజ్యమాప్నుయాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట అష్టదళ పద్మమందు నాలుగు దిశల 1. వాసుదేవ 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధులను శక్తిసహితముగా అర్చించాలి. వీరి వర్ణములు క్రమముగా హిమ - పీత - తమాల - ఇంద్ర నీలములుగా యుండును. తమ చేతులందు శంఖ - చక్ర - గదా - కమలములు ధరించి యుందురు.

ఆగ్నేయాది కోణములందు శాంతి - శ్రీ సరస్వతి - రతులను అర్చించాలి. వీరి వర్ణములు క్రమముగా శ్వేత -కాంచ - గోదుగ్ధ - దూర్వా వర్ణములో నుందురు. ఉత్తమ భూషణములు ధరించి యుందురు.

పిమ్మట పత్రాగ్రభాగములందు ఈ ఆయుధములను, శంఖ - చక్ర - గద - కమల - కౌస్తుభ - ముసల - ఖడ్గ - వనమాలలను అర్చించాలి. ఈ ఆయుధముల వర్ణములు క్రమముగా, రక్తస్వచ్ఛ - పీత - కనక - శ్యామ - కృష్ణ - అసి - పాండువర్ణములుగా యుండును.

మరల అష్టదళముయొక్క దక్షిణభాగమున ముక్తాకార శంఖనిధి, ఉత్తరభాగమున మాణిక్యాకార పద్మనిధులను అర్చించాలి. అటు పిమ్మట బయట ముందు భాగమునందు, కుంకుమవర్ణములో గరుడుని పూజించాలి.

పశ్చిమదిశయందు శ్యామవర్ణ ధ్వజమును, ఆగ్నేయమందు అరుణవర్ణ విఘ్నుని, నైరుతియందు శ్యామవర్ణ ఆర్యుని వాయవ్యమందు కాలవర్ణదుర్గను, ఈశాన్యమందు పీతవర్ణ కార్తికేయుని అర్చించాలి.

పిమ్మట వజ్రాది ఆయుధసహిత, ఇంద్రాదిలోకపాలురను అర్చించాలి. ఇట్టి సాధన కొనసాగించిన, సాధకుడు ధర్మార్థ కామములను ఆపై విష్ణు సాయుజ్యమును పొందును.

## ద్వాదశాక్షర మంత్రము

శ్లో॥ ప్రణవో హృద్భగవతే వాసుదేవాయ కీర్తితః
ప్రధానో వైష్ణవే తంత్రే మంత్రోఽయం ద్వాదశాక్షరః ।
ఋషిః ప్రజాపతిశ్ఛందో గాయత్రీ పరికీర్తితం
దేవతాఽస్య మనోఃప్రోక్తా వాసుదేవో మనీషిభిః ।
తారేణ హృదయం ప్రోక్తం పంచార్ణైః కవచంమతం

నమస్తేన భవేదస్త్ర మంగ కల్పన మీరితమ్ ।
మూర్ధ్నిభాలే దృశోరాస్యే గలే దోర్ హృదయాంబుజే
కుక్షౌనాభౌ ధ్వజే జానుద్వయే పాదద్వయేన్యసేత్ ।
వర్ణలక్షం జపేన్మంత్రం దీక్షితో విజితేంద్రియః
తత్సహస్రం ప్రజుహుయాత్త్రివైరాజ్య పరిప్లుతైః ।
పీఠేప్రాగీరితే మూర్తిం మూలమంత్రేణ కల్పయేత్
పూజయేద్విధినాఽనేన వాసుదేవం విధానవిత్ ।
ప్రథమావృత్తి రంగైౖ అస్యాత్ వాసుదేవాదిభిఃపరా
శాంత్యాదిశక్తిసహితైః పరా ద్వాదశమూర్తిభిః ।
చతుర్థీ సురనాథాద్యైః వజ్రాద్యైః పంచమీమతా
ఏవంసంపూజితో విష్ణుః ప్రదద్యాదిష్టమాత్మనః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు ద్వాదశాక్షర విష్ణు మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం నమో భగవతే వాసుదేవాయ ।**

ప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః । వాసుదేవోదేవతా । ఓం బీజం నమః శక్తిః ।

ఓం హృదయాయ నమః ।

నమః శిరసే స్వాహా ।

భగవతే శిఖాయై వషట్ ।

వాసుదేవాయ కవచాయహుమ్ ।

ఓం నమో భగవతే వాసుదేవాయ అస్త్రాయఫట్ ।

పిమ్మట మంత్రములోని 12 అక్షరములతో క్రమముగా, శిర - లలాట - నేత్రద్వయ - ముఖ - కంఠ - కరద్వయ - హృదయ - కుక్షి

– నాభి లింగ జానుద్వయ – పాదద్వయములందు న్యాసము చేయాలి. పిమ్మట విష్ణు ధ్యానము చేయవలయును.

☞ **విష్ణుం శారదచంద్రకోటి సదృశం శంఖం రథాంగం గదా**
**మంభోజం దధతం సితాబ్జ నిలయం కాంత్యా జగన్మోహనమ్ ।**
**ఆబద్ధాంగద హారకుండలమహా మౌళిం స్ఫురత్ కంకణం**
**శ్రీవత్సాంక ముదారకౌస్తుభధరం వందేమునీంద్రైః స్తుతమ్ ॥**

ధ్యానానంతరం శ్రీవత్సాది ముద్రలు ప్రదర్శించాలి. సాధకుడు నియమనిష్ఠలతో 12 లక్షలు మంత్రజపంచేసి, ఘృతమిశ్రిత తిలలతో 12వేలు హోమం చేయాలి.

పిమ్మట పీఠపూజ – మూర్తి కల్పన అర్చన ఆచరించాలి. ప్రథమా వరణమందు అంగపూజ – ద్వితీయావరణమందు వాసుదేవాదిపూజ – తృతీయావరణమందు ద్వాదశమూర్తిపూజ – చతుర్థావరణమందు లోకపాలురను – పంచమావరణమందు వారి ఆయుధములను అర్చించిన – సాధకుని సమస్త అభీష్టములనూ విష్ణుభగవానుడు నెరవేర్చును.

శ్లో॥ పాయసేనఘృతాక్తేన మంత్రవర్ణ సహస్రకం
జుహుయాన్మనసః శుద్ధ్యై సమిద్భిః క్షీరభూరుహామ్ ।
తత్సంఖ్యయా పయోఽక్తాభిః సర్వపాపవిముక్తయే

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఘృతయుక్త పాయస హోమమువలన, చిత్తశుద్ధి కలుగును. క్షీరవృక్ష సమిధలు, పాలతో తడిపి హోమం చేయుటవలన సమస్త పాపములు తొలగును.

## లక్ష్మీ వాసుదేవ మంత్రము

శ్లో॥ హృల్లేఖా బీజయుగళం రమాబీజయుగం పునః
లక్ష్మ్యంతే వాసుదేవాయ హృదంతః ప్రణవాదికః ।

చతుర్దశాక్షరోమంత్రః ప్రోక్తోఽయం సురపాదపః
హృదయం శక్తిబీజాభ్యాం రమాభ్యాం శిరఈరితమ్ ।
లక్ష్మైప్రోక్తా శిఖవార్మ వాసుదేవాయ కీర్తితం
నమసాఽస్త్రం సముద్దిష్టం సర్వం తారాదికల్పయేత్ ।
హోమంకుర్యాద్వికసితై ర్మధురత్రయ సంయుతైః ।
పూజాస్యాత్ వైష్ణవేపీటే ద్వాదశాక్షర వర్త్మనా
పాయసేనకృతో హోమో లక్ష్మీవశ్య ప్రదాయకః ।
మధురాక్తైస్తిలైర్హుత్వా సర్వకార్యాణి సాధయేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు చతుర్దశాక్షర "లక్ష్మీ వాసుదేవ" మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం లక్ష్మీవాసుదేవాయ నమః।**

ఇది కల్పవృక్షము వంటిది.

ఋష్యాదులు పూర్వమువలె నుండును. ఓం బీజం – హ్రీం శక్తిః

హ్రీం హ్రీం హృదయాయ నమః ।

శ్రీం శ్రీం శిరసే స్వాహా ।

లక్ష్మ్యై శిఖాయై వషట్ ।

వాసుదేవాయ కవచాయ హుమ్ ।

నమః అస్త్రాయ ఫట్ ।

పూర్తి మూలమంత్రముతో సర్వాంగన్యాసమూ ఆచరించాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

☞ **విద్యుచ్చంద్రనిభం వపుః కమలజావైకుంఠయోరేకతాం**
**ప్రాప్తుంస్నేహవశేన రత్నవిలసద్ భూషాభరాలంకృతామ్।**

**విద్యా పంకజదర్పణం మణిమయం కుంభం సరోజంగదా**
**శంఖం పంకజ దర్పణం మణిమయం కుంభం సరోజం గదా**
**శంఖం చక్రమమూని బిభ్రదమితాం దిశ్యాచ్ఛ్రియంవః సదా ॥**

ఈ మంత్రము 14 లక్షలు జపించి, మధురత్రయ యుక్త కమలములతో దశాంశహోమమాచరించాలి. ద్వాదశాక్షరి మంత్రవిధానము వలెనే పీఠాది అర్చన చేయవలయును.

పాయస హోమమువలన సంపద, త్రిమధుర మిశ్రిత తిలహోమము వలన ఇష్టకార్యసిద్ధి కలుగును.

## దధివామన మంత్రము

శ్లో॥ తారో హృద్విష్ణవే పశ్చాత్ జేఽంతః సురపతిర్భవేత్
మహాబలాయ ఠ ద్వంద్వం మనురష్టాదశాక్షరః ।
ఋషిరిందు ర్విరాట్ ఛందో దేవతా దధి వామనః
హృదేకేన శిరోద్వాభ్యాం శిఖాత్రిభిరుదీరితా ।
కవచం పంచభిః ప్రోక్తం నేత్రం తావద్భి రక్షరైః
ద్వాభ్యామస్త్రమితి ప్రోక్తః ప్రకారోంగస్య సూరిభిః ।
మూర్ధ్నిభాలే దృశోర్యుగ్మే కర్ణ నాసౌష్ఠతాలుషు
కంఠేబాహుద్వయే పృష్ఠే హృదయోదర నాభిషు ।
గుహ్యోరుజాను యుగ్మేషు జంఘయోః పదయోర్న్యసేత్
అష్టాదశ మనోర్వర్ణాన్ పశ్చాద్దేవం విచింతయేత్ ।
గుణలక్షం జపేన్మంత్రం తద్దశాంశం ఘృతప్లుతైః
పాయసాన్నైః ప్రజుహుయాద్దధ్యన్నై ర్వా యధావిధి ।
చంద్రాంతం కల్పితే పీఠే ప్రాగుక్తే తం సమర్చయేత్
మూర్తిమూలేన సంకల్ప్య వక్ష్యమాణ విధానతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు అష్టాదశాక్ష "దధివామన" మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం నమః విష్ణవే సురపతయే మహాబలాయ స్వాహా।**

ఇంద్రఋషిః । విరాట్ ఛందః । ఓం బీజం । స్వాహా శక్తిః

1+2+3+5+5+2 మంత్రాక్షరములతో షడంగన్యాసము. మంత్రములోని ఏకైక అక్షరముతో ఈ 18 స్థానములందు న్యాసము ఆచరించాలి.

1. శిరస్సు 2. లలాటము 3. నేత్రములు 4. చెవులు 5. నాసిక 6. పెదవులు 7. దవుడలు 8. కంఠము 9. చేతులు 10. వీపు 11. హృదయము 12. ఉదరము 13. బొడ్డు 14. గుహ్యము 15. తొడలు 16. మోకాళ్లు 17. పిక్కలు 18. పాదములు.

పిమ్మట ఈ విధముగా ధ్యానించాలి.

☞ **ముక్తాగౌరం నవమణిలసద్ భూషణం చంద్రసంస్థం**
**భృంగాకారైరలకనికరైః శోభి వక్త్రారవిందమ్।**
**హస్తాబ్జాభ్యాం కనక కలశం శుద్ధతోయాభిపూర్ణం**
**దధ్యన్నాఢ్యం కనకచషకం ధారయంతం భజామః॥**

పై మంత్రమును మూడు లక్షలు జపించి, ఘృతమిశ్రిత పాయస హోమంగాని, లేదా పెరుగన్నంగాని హోమం (దశాంశహోమం) చేయాలి.

పిమ్మట సూర్యుని, అగ్నిని, చంద్రుని పూజించి, పీఠపూజ, మూలమంత్రముతో మూర్తికల్పన చేయాలి.

శ్లో॥ షడంగాని సమభ్యర్చ్య కేసరేషు యథా పురా
అభ్యర్చ్య వాసుదేవాదీన్ ధ్వజాదీనర్చయేత్తతః ।
కేశవాద్యాఃదళాగ్రేషు సురేంద్రాదీననంతరం

వజ్రాదీని గజానష్టౌ సప్తావరణ మీరితిమ్ ।
విధానమేత ద్దేవస్య కీర్తితం సురపూజితమ్
పాయసాజ్యేన జుహుయాత్సహస్రం శ్రియమాప్నుయత్ ।
ధాన్యహోమేన ధాన్యాప్తిః శతపుష్పీ సముద్భవైః
బీజైః సహస్రసంఖ్యాతో హోమో భయవినాశనః ।
దధ్యోదనేన శుద్ధేన హుత్వా ముచ్యేత దుర్గతేః
దధ్యోదనేన శుద్ధేన హుత్వా ముచ్యేత దుర్గతేః
స్మృత్వాత్రై విక్రమం రూపం జపేన్మంత్రమనన్యధీః ।
యుక్తోబంధాత్ భవేత్సద్యో నాత్రకార్యా విచారణా
పట్టే సంపాద్యదేవేశం భిత్తౌవాపూజయేత్సుధీః ।
సుగంధి కుసుమైర్నిత్యం మహతీం శ్రియమాప్నుయాత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట షడంగపూజ, శక్తి సహిత వాసుదేవాదిపూజ, ధ్వజాదిపూజ చేయాలి. మరల అష్టదళముల బయట, ద్వాదశదళములందు కేశవాదులను, లోకపాలురను, వారి ఆయుధములను, అష్టగజములను అర్చించాలి. ఈ విధంగా సప్తావరణార్చన చేయాలి.

దేవతలు కూడా విష్ణువును ఇలాగే ఆరాధించారు. పాయసము – ఆజ్యముతో సహస్రం హోమం చేయాలి. ధనప్రాప్తి కలుగును. ధాన్య హోమమువలన ధాన్యప్రాప్తి, శతపుష్పి బీజహోమమువలన భయనాశనము, శుద్ధ దధ్యోదనం (పెరుగన్నం) – హోమం వలన కష్టములు, దరిద్రము తొలగును.

త్రివిక్రమ వామనుని స్మరించుచూ, ఏకాగ్ర చిత్తముతో దధివామన మంత్రజపము చేసిన బంధముక్తుడగును. ఇందేమియూ సందేహములేదు.

పటముగాని, గోడపైగాని వామనుని చిత్రము లిఖించి సుగంధపుష్పములచే నిత్యమూ అర్చించిన మహత్ సంపద, సుఖములు కలుగును.

## దధివామన యంత్రము

శ్లో॥ ససాధ్య తారోజ్వల కర్ణికాబ్జ
మష్టాక్షరైరుజ్వల కేశరాఢ్యమ్।
మన్త్రాక్షర ద్వంద్వయుతాష్ట పత్రం
శిష్టార్ణయుగ్మోలసితాంత్య పత్రమ్ ॥
ద్వాదశాక్షర సంవీతం తద్బహిర్ మాతృకాక్షరైః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కర్ణిక (వృత్తమధ్యము) యందు సాధ్య - సాధక - కర్మలను ప్రణవసహితముగా లిఖించాలి. 8 కేసరములందు నారాయణాష్టాక్షరి లిఖించి అష్టపత్రములందు 7 పత్రములలో దధివామన అష్టాదశాక్షర మంత్రములోని రెండు - రెండు అక్షరములు (14) లిఖించాలి.

మిగిలిన 4 అక్షరములు 8వ పత్రమునందు లిఖించాలి. మరల నాలుగువైపుల 51 అక్షరములను మాతృకను వృత్తాకారముగా లిఖించి వేష్టితం చేయాలి. ఇట్టి యంత్రారాధనవలన సమస్త సంపదలూ కలుగును.

ఈ యంత్రమును గూర్చి **"బ్రహ్మయామళము"** నందిట్లున్నది.

☞ **వృత్తాకారమథోకృత్వా చంద్రమండలమధ్యతః**
**సమ్యక్ చ విలిఖేత్తారం సాధ్యనామ సమన్వితమ్।**
**వారుణార్ణాన్ లిఖిత్వా చ సాగ్నిమాయా సబిందుకం**
**దళైశ్చ సప్తదశభిః కృత్వాపద్మం సకర్ణికమ్।**
**నాదివ్యోమాంత మంత్రంవై పద్మస్యైవ దళేషు చ**

**కృత్వా యంత్రం మహాభాగ సమాలభ్య జపేన్మనుమ్ ।**
**మహారక్షా సమాఖ్యాతా ధారణాచ్చ శ్రియావహామ్ ॥**

**"నారదకల్పము"** నందిట్లున్నది.

☞ **దళైః షోడశభిర్యుక్తం సతారం కర్ణికోజ్వలం**
**కాలరూఢ దళంబాహ్యే పద్మహస్టదళం లిఖేత్ ।**
**తేష్వష్టాక్షరమాలిఖ్య తదగ్రే వృత్త మాలిఖేత్**
**అష్టాదశదళం బాహ్యే తేష్వష్టాదశాక్షరమ్ ।**
**ఆలిఖ్యాంతే చ భూగేహ మష్టశూల సమన్వితం**
**కోణేష్వక్షర మాలిఖ్య వహ్న్యదిషు యథాక్రమమ్ ।**
**శూలాక్షి రోగ గుల్మాది గర్భస్ఫోటాదికానపి**
**విషాదికాన్నరః సమ్యక్ మంత్రీ యంత్రేణ నాశయేత్ ।**

## హయగ్రీవ మంత్రము

శ్లో॥ ఉద్గిర త్ప్రదమాభాష్య ప్రణవోద్గీథ శబ్దతః
సర్వవాగీశ్వరేత్యంతే ప్రవదేదీశ్వరేత్యథ ।
సర్వదేవమయాచింత్య పదాంతే సర్వముచ్చరేత్
బోధయద్వితయాంతోఽయం మంత్రస్తారాదిరీరితః ।
ఋషిర్బ్రహ్మాస్య సందిష్టశ్ఛందోఽనుష్టు బుదాహృతమ్ ।
దేవతాస్యాద్ధ యగ్రీవో వాగైశ్వర్యప్రదో విభుః ॥
తారేణపాదైర్మంత్రస్య పంచాంగాని ప్రకల్పయేత్ ।
వర్ణలక్షం జపేన్మంత్రం కుందపుష్పైర్మధుప్లుతైః ॥
దశాంశం వైష్ణవే వహ్నౌ జుహుయాన్మంత్ర సిద్ధయే ।
అష్టాక్షరో దితేపీఠే హయగ్రీవం ప్రపూజయేత్ ।
బీజేనమూర్తిం సంకల్ప్య బీజముద్ధ్రియతే యథా ॥

వియద్భృగుస్థ మర్ధీశబిందు మద్బీజమీరితం
కేసరేషు చతుర్వేదాం శ్చతుర్దిక్షు సమర్చయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – హయగ్రీవ అనుష్టుబ్ శ్లోక మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం ఉద్గిరత్ ప్రణవోద్గీథ, సర్వావాగీశ్వరేశ్వర**
**సర్వవేద మయాచింత్య సర్వంబోధయ బోధయ ।**

బ్రహ్మఋషిః । అనుష్టుబ్ ఛందః । మంత్రస్థ హలోబీజాని, స్వరాః శక్తయః । వాగైశ్వర్యప్రదో హయగ్రీవో దేవతా ।

ప్రణవముతో – 8+8+8+8, మొత్తం మంత్రముతో షడంగన్యాస మాచరించి ఇలా ధ్యానించాలి.

☞ **శరచ్ఛశాంక ప్రభమశ్వ వక్త్రం ముక్తామయైరాభరణైరుపేతమ్ ।**
**రథాంగ శంకాంకిత బాహుయుగ్మం జానుద్వయన్యస్తకరం భజామః ॥**

పైమంత్రమును 32 లక్షలు జపించి, త్రిమధురమిశ్రిత మల్లెపూలతో హోమమాచరించాలి. పిమ్మట పూర్వోక్త అష్టాక్షరయుక్త పీఠమందు హయగ్రీవుని ఆరాధించాలి.

హయగ్రీవబీజ మంత్రముతో మూర్తి కల్పన చేయాలి. అది ఇట్లుండును.

**మనుః : హ్సూం ।**

నాలుగు దిశల కేసరములందూ, చతుర్వేదముల నర్చించాలి. **"శంకరకల్పము"** నందిట్లు చెప్పబడినది.

☞ **శూన్యం శూన్యసమాయుక్తం జీవస్యోపరిసంస్థితం**
**అనుగ్రహయుతం కృత్వా వాగీశం సర్వకామదమ్ ॥**

శ్లో॥ విదిక్ష్వంగ స్మృతిన్యాయ సర్వశాస్త్రాణి పూజయేత్
అర్చయేత్పత్రమధ్యేషు విధానేనాంగదేవతాః ।
బాహ్యేలోకేశ్వరాంస్తేషాం వజ్రాద్యస్త్రాణి సంయజేత్
ఏవంయోభజతే దేవం సాక్షాద్వాగీశ్వరో భవేత్ ।
బిల్వైః ఫలైః కృతోహోమః శ్రీకరః పరిగీయతే
కుందపుష్పాణి జుహుయాదిచ్ఛన్ వాక్శ్రియమవ్యయమ్।
మనునాऽనేన సంజప్తం ఘృతం బ్రాహ్మీరసైః స్మృతం
కవితామావహేత్ పుంసామనర్గళ విజృంభణామ్ -
వచామనేన సంజప్తాం భక్షయేత్ ప్రాతర్వహమ్
సర్వవేదాగమాదీనాం వ్యాఖ్యాతా జాయతేऽచిరాత్ ।
మనోరస్య సమోనాస్తి జ్ఞానైశ్వర్య ప్రదోऽపరః ॥

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - నాలుగు కేసరకోణములందు వేదాంగములు - ధర్మశాస్త్రము - తర్కశాస్త్రము - సర్వశాస్త్రము అర్చించాలి. (వేదాంగములు - 6, శీక్షా - వ్యాకరణం - కల్పం - నిరుక్తం - జ్యోతిషం - ఛందములు)

పత్రములబయట లోకపాలురను, వారి ఆయుధములను పూజించాలి. ఈవిధముగా అర్చించు సాధకుడు సాక్షాత్తు వాగీశ్వరడు అగును.

బిల్వఫలములతో హోమం చేసిన సంపద, మల్లెపూలు హోమం చేసిన వాక్సిద్ధి, నేతికి నాలుగురెట్లు బ్రాహ్మీరసం కలిపి వండి నిత్యమూ సేవించిన గొప్పకవిత్వసిద్ధి కలుగును. అభిమంత్రిత వస తినినచో (నిత్యమూ ఉదయమునందు) సమస్త విద్యావ్యాఖ్యాన చాతుర్యము కలిగి జ్ఞానైశ్వర్యము నందు సమానుడగును.

# రామ మంత్రము

శ్లో॥ అనంతోఽగ్న్యాసనః సేందుర్బీజం రామాయహృన్మనుః
షడక్షరోఽయ మాదిష్టో భజతాం కామదో మణిః ।
బ్రహ్మప్రోక్తో మునిశ్ఛందో గాయత్రం దేవతా మనోః
దేశికేంద్రైః సమాఖ్యాతో రామోరాక్షస మర్దనః ।
దీర్ఘభాజా స్వబీజేన కుర్యాదంగాని షట్క్రమాత్
బ్రహ్మరంధ్రే భ్రువోర్మధ్యే హృన్నాభ్యం ధుషు పాదయోః ।
షడక్షరాణి వినస్యే న్మంత్రస్య మనువిత్తమః
వర్ణలక్షం జపేన్మంత్రం దశాంశం కమలైః శుభైః ।
జుహుయాదర్చితే వహ్నౌ బ్రాహ్మణాన్ భోజయేత్తతః ।
పూజయేద్వైష్ణవేపీఠే మూర్తిం మూలేన కల్పయేత్
శ్రీంసీతాయై ద్విఠాంతేన సీతాం పార్శ్వగతాం యజేత్ ।
అగ్రేపార్శ్వద్వయే శార్ఙ్గం శరానంగాని తద్బహిః
హనూమంతంససుగ్రీవం భరతం సవిభీషణమ్ ।
లక్ష్మణాంగద శత్రుఘ్నాన్ జాంబువంతం దళేష్వమాన్
వాచయంతం హనూమంతమగ్రతో ధృతపుస్తకమ్ ।
యజేర్భరత శత్రుఘ్నౌ పార్శ్వయోర్ ధృత చామరౌ
ధృతాతపత్రం హస్తాభ్యాం లక్ష్మణం పశ్చిమే యజేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – షష్ఠాక్షర రామమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : రాం రామాయ నమః।**

బ్రహ్మఋషిః । గాయత్రీ ఛందః । రాక్షసమర్దనరామోదేవతా । రాంబీజం । నమః శక్తిః ।

ఆం రాం హృదయాయ నమః ।

ఈం రాం శిరసే స్వాహా ।

ఊం రాం శిఖాయై వషట్ ।

ఐం రాం కవచాయహుమ్ ।

ఔం రాం నేత్రద్వయాయ వౌషట్ ।

అః రాం అస్త్రాయఫట్ ।

ఆంరాం, ఇత్యాదులతో బ్రహ్మంధ్ర – భ్రూమధ్య – కంఠ – హృదయ – నాభి – గుహ్య – పాదద్వయములందు షడంగన్యాసమాచరించాలి.

☞ **రేఫోఽగ్ని రహమేవోక్తో విష్ణుః సోమో ఉచ్యతే**
**మధ్యగ స్త్వ వయోర్బ్రహ్మ రవిరాకార ఉచ్యతే ।**
**జ్యోతీంషి కవలీకృత్య త్రీణ్యాకాశో విభుః స్వయమ్**
**నాదోఽభిధత్తే సన్మాత్రం త్వమేవ పరమేశ్వరమ్ ॥**

(బీజం" అని మూల శ్లోకములో నుండుటచే, ఏకాక్షర మంత్రము (రాం) అనునది కూడా సూచింపబడుచున్నదని, రాఘవభట్టు "పదార్థా దర్శ" వ్యాఖ్యానమునందు ఉల్లేఖించినాడు.

**స్కందయామళము**నందే నిర్వాణఖండమందు రామమంత్ర మహిమ ఇట్లు చెప్పబడినది.

☞ **విశ్వరూపస్యతేనామ విశ్వే శబ్దాదివాచకాః**
**తథాపిమూలమంత్రస్తే విశ్వేషాం బీజమక్షయమ్ ।**
**ముక్తయే ప్రణవాద్యోయం రామాదిరపిభుక్తయే**
**వాగ్భవాదిస్తు వాక్సిద్ధ్యై మాయాది రఖిలేష్టదః ।**
**అఖిలోఽయం మహాశక్తి ర్మంత్ర చింతామణిర్విభో ॥**

పిమ్మట సాధకుడు ఇట్లు ధ్యానించవలయును.

శ్లో॥ కాలాంభోధర కాంతికాంతమనిశం వీరాసనాధ్యాసితం
ముద్రాం జ్ఞానమయీం దధానమపరంహస్తాంబుజంజానుని।
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతీం ముకుటాంగదాది వివిధా కల్పోజ్వలాంగంభజే ॥

పై మంత్రము 6 లక్షలు జపించి, కమలములతో దశాంశహోమం ఆచరించాలి. పిమ్మట బ్రాహ్మణభోజనం నిర్వహించాలి.

వైష్ణవపీఠమందు మూలమంత్రముతో మూర్తికల్పనచేసి రామభద్రుని అర్చించాలి. "శ్రీసీతాయై స్వాహా" అను మంత్రముతో రామచంద్రుని ప్రక్కన ఉన్న సీతాదేవిని పూజించాలి. రాముని ముందు రెండుప్రక్కల శార్ఙ్గధనువు, బాణములను అర్చించాలి.

పిమ్మట సుగ్రీవ సహిత హనుమంతుని, విభీషణ సహిత భరతుని పూజించాలి. 4 దళములందు లక్ష్మణ - అంగద - శత్రుఘ్న - జాంబ వంతులను, ముందు భాగమున పుస్తకము ధరించి చదువుచున్న హనుమంతుని పూజించాలి.

రెండువైపులా చారములు ధరించిన భరత శత్రుఘ్నులను, పశ్చిమ దిశలో రెండు చేతులతో ఛత్రము పట్టుకొన్న లక్ష్మణుని భావించి పూజించాలి.

శ్లో॥ సృష్టింజయంతం విజయం సురాష్ట్రం రాష్ట్ర వర్ధనం
అకోపం ధర్మపాలాఖ్యం సుమంత్రం చ దళాగ్రతః ।
సర్వాభరణ సంపన్నాన్ లోకేశానర్చయేత్తతః
తదస్త్రాణి తతోబాహ్యే వజ్రాదీని ప్రపూజయేత్ ।
ఏవం పూజాదిభిః సిద్ధే మనౌకర్మాణి సాదయేత్
జాతీప్రసూనైర్జుహుయాచ్ఛంద నాంభః సముక్షితైః ।

రాజవశ్యాయ కమలైః ధనధాన్యాది సంపదే
నీలోత్పలానాం హోమేన వశయేదఖిలం జగత్ ।
బిల్వప్రసూనైర్జుహుయా దిందిరావాప్తయేనరః
దూర్వాహోమేన దీర్ఘాయుర్భవేన్మంత్రీ నిరామయః ।
రక్తోత్పల హుతాన్మంత్రీ ధనమాప్నోతి వాంఛితం
మేధాకామేన హోతవ్యం పలాశకుసుమైర్నవైః ।
తజ్జప్తామంభః ప్రబిపేత్కవిర్భవతి వత్సరాత్
తన్మంత్రితాన్నం భుజీత మహదారోగ్యమాప్నుయాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట పత్రాగ్రభాగము లందు 1. సృష్టి 2. జయంత 3. విజయ 4. సురాష్ట్ర 5. రాష్ట్రవర్ధన 6. అకోప 7. ధర్మపాల 8. సుమంత ఈ ఎనిమిది ప్రధానమంత్రులను అర్చించాలి.

పిమ్మట సర్వాభరణ భూషితులైన లోకపాలురను, దానికి బయట వజ్రాది ఆయుధములను అర్చించాలి. ఈ విధంగా అర్చించి సిద్ధిని పొందిన సాధకుడు అభీష్ట ప్రయోగములు సాదించగలడు.

చందన గంధముతో తడిపిన జాజిపుష్పహోమము వలన రాజవశ్యము, కమలహోమమువలన ధనధాన్య సంపద, నీలోత్పల హోమము వలన జగద్వశీకరణమూ సిద్ధించును.

బిల్వపుష్ప హోమముచే ధనప్రాప్తి, దూర్వాహోమమువలన రోగ నాశనము, దీర్ఘాయువూ కలుగును. ఎర్రని తామరపూలచే హోమము చేసిన వాంఛిత ధనప్రాప్తి, నూతనమోదుగ పూలహోమమువలన మేధ పెరుగును.

అభిమంత్రిత జలపానముచేత కవియగును. అభిమంత్రించిన అన్నము భుజించుటచే ఆరోగ్యము సిద్ధించును.

# ధారణ యంత్రము

శ్లో॥ తారంమధ్యే విలిఖతు మనుంషట్సు కోణేషు సంధి
ష్వంగం మాయాంస్మరమపి లిఖేత్కోణగండేషు పశ్చాత్ ।
కింజల్కేషు స్వరగణమథో పత్రమధ్యేషుమాలా
మంత్రోత్థార్ణాన్ గుహముఖ మితానష్టమే పంచవర్ణాన్ ।
దశాక్షరేణ సంవేష్ట్య కాదివర్ణైశ్చ భూపురే
దిగ్విదిక్షు లిఖేద్బీజే నరసింహ వరాహయోః ।
నమోభగవతే బ్రూయా చ్చతుర్థ్యా రగునందనం
రక్షోఘ్న విషదాయాంతే మధురాదిసమీరయేత్ ।
ప్రసన్నవదనాయేతి పశ్చాదమిత తేజసే
బాలాయ పశ్చాద్రామాయ విష్ణవే తదనంతరమ్ ।
ప్రణవాది నమోఽంతోఽయం మాలామనురుదీరితః
జానకీవల్లభాయాఽథ భవేత్ పావక వల్లభా ।
హుమాదిరేషః కథితో రామమంత్రోదశాక్షరః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – షట్కోణ యంత్రము లిఖించి, మధ్యలో సాధ్య – సాధక – కర్మ ఓం సహితంగా లిఖించాలి. ఆరు కోణములందు రామమంత్రములోని ఆరు అక్షరములూ లిఖించి, సంధులందు షడంగమంత్రములు లిఖించాలి. కోణముల ప్రక్కల ఒకవైపు హ్రీం మరొకవైపు క్లీం లిఖించాలి.

**మాలామంత్రం : ఓం నమో భగవతే రఘునందనాయ రక్షోఘ్న విషదాయ మధురప్రసన్న వదనాయ అమితతేజసే బాలాయ రామాయ విష్ణవే నమః ।**

ఈ మంత్రమును 7 దళములలో 6 చొప్పున 42 అక్షరములు లిఖించి, 8వ దళమునందు మిగిలిన 5 అక్షరములూ లిఖించాలి. పిమ్మట ఈ క్రింది దశాక్షర మంత్రముతో దానిని వేష్టించి వృత్తవేష్టనం చేయాలి.

**దశాక్షర మంత్రము : హుం జానకీవల్లభాయ స్వాహా।**

భూపురమునందు కాదివర్ణములను, దిశలయందు, కోణములందు క్రమముగా నరసింహ బీజము (క్ష్రౌం), వరాహబీజము (హూం) లిఖించాలి.

స్వర్ణ - రజిత - తామ్ర పత్రములందుకాని, భూర్జపత్రముపైగాని పై యంత్రమును లిఖించి, జపాదులను ఆచరించి, చేతికి ధరించిన జయము కలుగును.

## వరాహ మంత్రము

శ్లో॥ తారంనమో భగవతే వరాహ పదమీరయేత్
రూపాయ భూర్భువః స్వః స్యాత్ పతయే తదనంతరమ్ ।
భూపతిత్వం మే పదాంతే దేహ్యంతే చదదాపయ
వహ్నిజాయా విధిర్మంత్రః స్యాత్ త్రయస్త్రిం దశక్షరః
భార్గవో మునిరాఖ్యాతశ్ఛందోఽనుష్టుబుదాహృతమ్ ।
దేవతాదివరాహోఽస్య మంత్రస్య కథితో బుధైః
ఏకదంష్ట్రాయ హృదయం వ్యోమోల్కాయ శిరఃస్మృతమ్ ।
శిఖాతేజోఽధిపతయే విశ్వరూపాయ వర్మ చ
మహాదంష్ట్రాయ శస్త్రంస్యాత్ పంచాంగమితి కల్పయేత్ ।
లక్షమేకం జపేన్మంత్రం మధురాక్తైః సరోరుహైః
జుహుయాత్తద్దశాంశేన పీఠే విష్ణోః ప్రపూజయేత్ ।
మూర్తింమూలేన సంకల్ప్య వక్ష్యమాణ విధానతః

పూర్వాదిషు చతుర్దిక్షు హృదాద్యంగాని పూజయేత్ ।
అస్త్రం కోణేష్వథశ్చోర్ధం చక్రాద్యస్త్రాణి తద్బహిః
చక్రం శఖమసింఖేటం గదాంశక్తిం వరాభయే ।
సంపూజ్య బాహ్యే లోకేశాన్ బహిరస్త్రాణి సంయజేత్
ధ్యానాద్దేవో ధనందద్యాజ్జపాత్ దద్యాద్యసుంధరామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 33 అక్షరముల వరాహమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం నమో భగవతే వరాహరూపాయ భూర్భువః స్వః పతయే భూపతిత్వం మే దేహి దదాపయ స్వాహా।**

భార్గవఋషిః । అనుష్టుబ్ ఛందః । ఆదివరాహో దేవతా । హుం బీజం । స్వాహాశక్తిః ।

ఏకదంష్ట్రాయ హృదయాయ నమః ।
వ్యోమోల్కాయ శిరసే స్వాహా ।
తేజోஉధిపతయే శిఖాయై వషట్ ।
విశ్వరూపాయ - కవచాయహుమ్ ।
మహాదంష్ట్రాయ అస్త్రాయ ఫట్ ।

ఈ విధంగా పంచాంగన్యాసం చేసి ఇలా ధ్యానించాలి.

☞ **ఆపాదం జానుదేశాద్వర కనకనిభం నాభిదేశాదధస్తాత్**
**ముక్తాభాం కంఠదేశాత్తరుణరవినిభం మస్తకాన్నీలభాసమ్।**
**ఈడే హస్తైర్దధానం రథ చరణదరౌ ఖడ్గఖేటౌ గదాఖ్యాం**
**శక్తిం దానాభయే చ క్షితిచరణ లసద్ దంష్ట్రమాద్యం వరాహమ్॥**

పై మంత్రమును ఒక లక్ష జపించి, త్రిమధుర మిశ్రిత కమలహోమం దశాంశం ఆచరించాలి. పిమ్మట విష్ణుపీఠమునందు ఆది వరాహభగవానుని ఆరాధించాలి.

ముందుగా మూలమంత్రముతో మూర్తికల్పనచేసి, నాలుగు దిశలందూ హృదయ - శిరో - శిఖా - కవచములను పూజించాలి. పిమ్మట అంగపూజ, నాలుగుకోణములందు పైన, కింద చక్ర - శంఖ - అసి - ఖేట గద - శక్తి - వర - అభయములను పూజించి అటుపై లోకపాలురను, వజ్రాది ఆయుధములను అర్చించాలి.

వరాహదేవత ధ్యానమువలన ధనమును, మంత్రజపమువలన అధికారప్రాప్తి, ఉద్యోగమును ఇచ్చును.

శ్లో॥ రవౌ సింహగతేఽష్టమ్యా శుక్లపక్షే సితాం శిలామ్
పంచగవ్యేషు నిక్షిప్య స్పృష్ట్వా తమయుతం జపేత్ ।
ఉత్తరాభిముఖో భూత్వా తాంశిలాం నిఖనేద్భువి
శత్రుచౌరమహాభూతైః కృతాంబాధాం ప్రణాశయేత్ ।
భానూదయే భౌమవారే సాధ్యక్షేత్రాత్స మాహరేత్
మృత్తికాం సంజపన్మంత్రీ తాం పునర్విభజేత్త్రిధా ।
చూల్యామేకాం సమారోప్య పాకపాత్రే తథాపరం
గోదుగ్ధే పరమాలోడ్య శోధితాంస్తండులాన్ క్షిపేత్ ।
సంస్కృతేఽగ్నౌ పచేత్యమ్యక్ చరుంమంత్రీ జపన్మనుం
అవతార్య చరుంపశ్చాదగ్నౌ దేవం యథావిధి ।
ధూపదీపాదికైరిష్ట్వా పునరాజ్యప్లుతం చరుం
జుహుయాదేధితే వహ్నౌ యావదష్టోత్తరం శతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - రవి సింహరాశిలో సంచరించునపుడు, శుక్లపక్ష ఆదివారమునాడు తెల్లనిగులకరాయిని పంచ గవ్యములందుంచి, దానిని స్పృశించుచూ పదివేలు వరాహమంత్రం జపించాలి. మరల ఉత్తరాభిముఖముగా ఆశిలను భూబీజసహిత వరాహమంత్రము పఠించుచూ భూమిలో పాతిపెట్టాలి.

ఇట్లు చేయుటవలన శత్రు - చోర - మహాభూతముల వలన కలిగిన బాధలు నశించును. మంగళవారమునాడు సూర్యోదయకాలమున సాధకుడు, సాధ్యవ్యక్తియొక్క పొలములోని, మట్టిని గ్రహించి వరాహ మంత్రము జపించుచూ దానిని 3 భాగములు చేయాలి.

ఒక భాగమును యందు వేయాలి. రెండవ భాగమును వంటపాత్ర యందుంచాలి. మిగిలిన భాగమును ఆవుపాలతో నూరి అందు బియ్యము కలిపి పాయసంగా వండాలి.

సాధకుడు మంత్రజపము చేయుచూ పరిశుద్ధ అగ్నియందు పాయసం వండి, ఆ అగ్నియందు వరాహదేవుని ధూపదీపములతో అర్చించి, ఆ చరు ద్రవ్యమును 108 సార్లు హోమం చేయాలి.

శ్లో॥ ఏవంసప్తారవారేషు జుహుయాత్ క్షేత్రసిద్ధయే
ప్రాతఃకాలే భృగోర్వారే మృదం సాధ్యమహీతలాత్ ।
ఆదాయ హవిరాపాద్య పూర్వవజ్జుహుయాత్ సుధీః
విరోధో నశ్యతి క్షేత్రే సహ చౌరాద్యుపద్రవైః ।
రాజవృక్షసముత్థాభిః సమిద్భిర్మనునాఽమునా
త్రిసహస్రం ప్రజుహుయాత్తస్య స్యుః సర్వసంపదః ।
శాలిభిర్జుహుయాన్మంత్రీ నిత్యమష్టోత్తరంశతం
సమృద్ధైర్ధాన్య సంఘాతైః శోభతే తస్యమందిరమ్ ।
తావదాజ్యేన జుహుయాత్ మండలాత్ స్వర్ణమాప్నుయాత్
లాజైః కన్యామవాప్నోతి మధ్వక్తై ర్నిజవాంఛితమ్ ।
మధురత్రయ సంయుక్తై ర్జుహుయాదుత్పలైర్నవైః
మహతీం శ్రియ మాప్నోతి మండలా త్పూర్వ సంఖ్యయా॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ విధముగా క్షేత్రప్రాప్తి కోరువాడు 7 మంగళవారములు ఆచరించాలి. ఇపుడు శుక్రవారప్రయోగము చెప్పబడుచున్నది. శుక్రవారమునాడు ప్రాతఃకాలమున సాధ్యవ్యక్తి క్షేత్రమునుండి మట్టిని తెచ్చి పైన చెప్పిన విధముగా హవిర్నిర్మాణముచేసి, సుసంస్కృత అగ్నియందు హోమంచేసిన కోర్టుతగాదాలయందు విజయము సాధించును. చోరాది ఉపద్రవములు కలుగవు.

రాజవృక్ష సమిధలతో మూడువేలు హోమం చేసిన సకలవిధ సంపదలు కలుగును. ధాన్యహోమము నిత్యమూ 108 సార్లు చేసిన ధాన్యవృద్ధి, ఘృతహోమము 49 రోజులు చేసిన స్వర్ణప్రాప్తి, త్రిమధురయుక్త పేలాలు హోమం ఏసిన మనోవాంఛిత కన్య లభించును. త్రిమధురయుక్త కమలహోమము నిత్యమూ మూడువేలు చేసిన 49 రోజులలో గొప్ప ధనప్రాప్తి కలుగును.

## వరాహ యంత్రం

శ్లో॥ మధ్యేబీజం సతారం దహనపురయుగే చక్రవర్ణాన్ షడస్రే
ష్వాలిఖ్యాంగాని సంధిష్వథ కరణదళైరంబుజం కేసరేషు
అష్టార్ణాన్ పత్రమధ్యే లిఖతువసుమితాన్ మంత్రవర్ణాంశ్చతుర్థే
శిష్టంపత్రే పురస్తాద్వ సుదళకమలే కౌసరస్థ స్వరాఢ్యే ।
మంత్రార్ణాన్ దేవసంఖ్యాన్ దలమనువిలిఖేదంత్య మనేఽథ బాహ్యే
కింజల్కైః కాదిర్ణై ర్వికసితమకమలే షోడశారేయథావత్ ।
మంత్రార్ణాన్ యుగ్మశస్తచ్చరమ దళగతం శిష్టవర్ణంలిఖిత్వా
తారక్ష్మాకోలబీజైస్తదను పరివృతం సాధ్యనామార్ణ మధ్యైః ॥
దర్భితైః సాధ్యనామార్ణైర్మంత్ర వర్ణైర్వృతం బహిః

భూబింబేనాఽస్య కోణేషు భూబీజం సాధ్యసంయుతమ్ ।
అష్టశూలేషు వారాహం భూబీజసహితం లిఖేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణము లిఖించి మధ్యలో సాధ్య - సాధక - కర్మ **వరాహబీజముతో** (హూం) లిఖించాలి. షట్కోణములందు ప్రణవ రహిత సుదర్శనమంత్రము (సహస్రార హుంఫట్) లిఖించి, సంధులందు గతంలో చెప్పి ఏకదంష్ట్రాయ - వ్యోమోల్కాయ ఇత్యాది పంచాంగములు లిఖించాలి.

ఆపై చతుర్దళ కమల పత్రములు లిఖించి, అందు ప్రతీ దళ కేసరములందు నారాయణ అష్టాక్షరిలోని రెండేసి అక్షరములు లిఖించాలి. మరల మూడు దళములందు 8 అక్షరముల చొప్పున వరాహమంత్రము లిఖించి, మిగిలిన అక్షరములను 9 నాల్గవ దళమందు లిఖించాలి.

ఆపై అష్టదళ పద్మము లిఖించి అందు కేసరములందు రెండేసి అచ్చులను (16) లిఖించాలి. అష్టదళములందు 7 దళములలో వరాహ మంత్రము 4 అక్షరముల చొప్పున లిఖించి, ఎనిమిదవ దళమునందు మిగిలిన 5 అక్షరములూ లిఖించాలి.

పిమ్మట షోడశదళ పద్మము దానిపై లిఖించి దళకేసరములందు కకారాది - క్షకారాంత వర్ణములను లిఖించాలి. మరల 16 దళములందు వరాహ మంత్రములోని రెండేసి అక్షరములు లిఖించి చివరి దళములో మూడక్షరములు లిఖించాలి.

ఓం గ్లౌం హూంలతో సాధనామం సంపుటితము చేసి వేష్టితం చేయాలి. పిమ్మట వరాహ మంత్రములోని రెండేసి అక్షరములతో సాధ్యనామం దర్భితము చేసి వేష్టితం చేయాలి. బయట భూబింబముతో

ఆవేష్టితం చేయాలి. కోణములందు సాధ్యసంయుత భూబీజము (గ్లాం) వ్రాసి, పొడిగించిన ఎనిమిది త్రిశూల రేఖల మధ్య రేఖకు కుడివైపు వరాహ బీజము, ఎడమవైపు భూబీజము లిఖించాలి.

శ్లో॥ సార్ధీశబిందుగగనం బీజం వారాహ మీరితం
రోచనాగురు సింపిష్టై ర్లిఖేద్యంత్రం శుభేదినే
లేఖిన్యా హేమయా చ సర్వకామప్రసిద్ధయే ।
స్వర్ణపట్టే లిఖేద్యంత్రం రాజ్యశ్రీ సమవాప్తయే
గ్రామసిద్ధ్యైచ రజతే తామ్రపట్టే ధనాప్తయే ।
భూర్జపత్రే నిజేష్టాప్త్యై క్షౌమే భూసిద్ధేలిఖేత్
జపపూజాదిభిః సిద్ధం యంత్రం కుర్యాన్నిజేప్సితమ్ ।
గ్రామపట్టణరాష్ట్రేషు యంత్రమేతత్ సుసాధితం
నిఖనేచ్ఛుభ వరాదౌ సాంగం దిక్షు సమర్చయేత్ ।
క్షుద్రాపమృత్యు చౌరాది భూతవ్యాళమహోభయైః
నశక్యతే పరం ద్రష్టుం తందేశం దేవతాబలాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఏకాక్షర వరాహ మంత్రము “హూం” అనబడును. పైన చెప్పిన యంత్రము గోమయజలములో గోరోచనం – అగురు – కర్పూరం – లాక్షా – కుంకుమ – చందనం కలిపి నూరి, శుభదినమునందు, బంగారులేఖినితో, భూర్జపత్రముపైగాని, స్వర్ణపటముపై గాని లిఖించిన రాజ్యక్షేమము, రాజ్యప్రాప్తి కలుగును.

వెండిరేకుపై లిఖించిన గ్రామక్షేమము, ప్రాప్తి, రాగిరేకుపై లిఖించిన ధనప్రాప్తి, భూర్జపత్రముపై లిఖించిన ఇష్టసిద్ధి, పట్టువస్త్రముపై లిఖించిన భూప్రాప్తి కలుగును. జపపూజాదులచే సిద్ధి పొందిన సాధకుడు సమస్త కామ్యములను సాధించగలడు.

పై యంత్రమును గ్రామ - నాగర - రాష్ట్ర రాజధానియందు, శుభ దినమున స్థాపించి పూజించిన, చోర - క్షుద్ర - అపమృత్యుసాంక్రామిక వ్యాధి (అంటువ్యాధులు), భూతబాధలు కలుగవు. ప్రజలంతా సుఖసంతోష ములతో నుందురు.

## ధరణీమంత్రము

శ్లో॥ హృదయం భగవత్యై స్యాద్ధరణ్యై తదనంతరం
ధరణ్యంతే ధరేద్వంద్వే ద్విఠాంతోఽయం ధృవాదికః ।
ఏకోనవింశత్యర్ణాఢ్యం ధరాహృదయమీరితమ్
వరాహోఽస్యమునిః ప్రోక్తోఛందో నివృదుదాహృతమ్ ।
దేవతా సర్వభూతానాం ప్రకృతిర్వసుధామతా
హృదయంత్రిభిరాఖ్యాతం చతుర్భిః శిరఈరితమ్ ।
త్రిభిఃశిఖా సముద్దిష్టా కవచం పంచభిర్మతం
ద్వాభ్యాంనేత్రం సమాఖ్యాతం ద్వాభ్యామస్త్రం పునర్భవేత్ ।
మంత్రవర్ణైఃషడంగాని కుర్యాదేవం విధానవిత్
లక్షమేకం జపేన్మంత్రీ ధరాహృదయమాదరాత్ ।
ససర్పిషా పాయసేన జుహుయాత్తద్దశాంశతః
తం విష్ణోః పూజయేత్పీఠే వక్ష్యమాణ విధానతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 19 అక్షరముల ధరణీమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః :ఓం నమో భగవత్యై ధరణ్యై ధరణిధరే ధరే స్వాహా।**

వరాహఋషిః । నివృత్ఛందః । ఓంబీజం - స్వాహాశక్తిః । సమస్త భూతప్రకృతిర్వసుధాదేవతా ।

మూలమంత్రములోని 3+4+3+5+2+2 అక్షరములతో షడంగన్యాస మాచరించి ఇలా ధ్యానించాలి.

☞ **శ్యామాం విచిత్రాంశుకరత్నభూషణాం**
**పద్మాసనాం తుంగపయోధరానతామ్ ।**
**ఇందీవరే ద్వే నవశాలిమంజరీం**
**శుకందధానాం వసుధాం భజామహే ॥**

పై మంత్రమును ఒక లక్ష జపించి, ఘృతం, పాయసం హోమం చేయాలి. పిమ్మట "గ్లాం వసుంధరా యోగపీఠాయ నమః" అని ఆసనమిచ్చి మూర్తికల్పనచేసి, చెప్పబోవు విధానములో అర్చించాలి.

శ్లో॥ అంగానిపూజయేదాదౌ భూవహ్ని జలమారుతాన్
దిక్పత్రేషు సభ్యర్చ్య కోణపత్రేషు తత్కలాః ।
ఆశాపాలాః పునః పూజ్యా వజ్రాద్యస్త్ర సమన్వితాః
ఏవంసిద్ధ మనుర్మంత్రీ సాధయేత్ స్వమనోరథాన్ ।
మధురత్రయ సంయుక్తైర్జుహుయాదరుణోత్పలైః ।
సహస్రం భూసమృద్ధిః స్యాత్తథా నీలోత్పలైః శుభైః ।
ప్రియంగుపుష్పైర్మధ్వక్తైర్ధనధాన్య మహిశ్రియః
మంజరీం శాలిసంభూతాం మధురత్రయ లోలితామ్ ।
జుహుయాత్సాధితే వహ్నౌ మండలాత్ స్యాద్ధరాపతిః
శుక్రవారే దినముఖే గృహీత్వా సాధ్యబూమృదమ్ ।
తామంభసి వినిక్షిప్య శోధితేఽత్ర చరుంపచేత్
పయోఘృతాభ్యాం సహితం జుహుయాత్తం హుతాశనే ।
షణ్మాసంశుక్రవారేషు హుత్వైవం ప్రాప్నుయాన్మహీం

**ధరామేవంభజన్మంత్రీ పశురత్నధనాదిభిః ।**
**ధరాయాః వల్లభః సస్యాన్నాత్రకార్యా విచారణా ॥**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అంగపూజయందు 4 దిశల పత్రములందు పృథ్వి - జల - అగ్ని - వాయువులను అర్చించాలి. ఆగ్నేయాది కోణములందు నివృత్తి - ప్రతిష్ఠా - విద్యా - శాంతి అనేక కళలను, పిమ్మట వజ్రాది ఆయుధయుక్త లోకపాలురను అర్చించాలి.

పిమ్మట మధురత్రయయుక్త కమలములతో హోమం ఆచరించాలి. నీలోత్పలములు వెయ్యిసార్లు హోమం చేసిన క్షేత్రవృద్ధి త్రిమధురయుక్త ప్రియంగుపుష్ప హోమం వలన ధనధాన్యవృద్ధి కలుగును.

పృథ్వీప్రాప్తికి భూబీజసంపుటమును, సంపదప్రాప్తికి శ్రీబీజ సంపుటము, కీర్తికొరకు శక్తిబీజ సంపుటము చేయాలి. త్రిమధుర మిశ్రిత శ్రేష్ఠ ధాన్యముల కంకులు, షోడశసంస్కారములు చేసిన అగ్నియందు హోమం చేసిన 49 రోజులలో అధికారము ప్రాప్తించును.

శుక్రవారమునాడు ప్రాతఃకాలముననే సాధ్యవ్యక్తి క్షేత్రమునుండి మట్టిని తెచ్చి ఒక భాగము యందు, ఒక భాగము నీటయందుంచి పిండి ముద్దవలె చేయాలి. మరల దానిని నేయి, పాలతో కలిపి శుక్రవారము నాడు హోమం చేయాలి. ఇలా 6 నెలలు చేసిన భూలాభము కలుగును.

ఈ ప్రకారము సాధకుడు ధరామంత్రమును ఉపాసించినచో సంపదలు - అధికారము - భూలాభముపొందును. ఇందు సందేహము లేదు.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*పంచదశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ షోడశః పటలః

## అథ నృసింహ ప్రకరణమ్

శ్లో॥ అథాఽభిధాస్యే విధి వన్నారసింహ మహామనుం
ఉగ్రంవీరం వదేత్పూర్వం మహావిష్ణు మనంతరం ।
జ్వలంతం పదమాభాష్య సర్వతోముఖమీరయేత్
నృసింహం భీషణంభద్రం మృత్యుర్ మృత్యుంవదేత్తతః ।
నమామ్యహమయం ప్రోక్తో మంత్రరాజః సురద్రుమః
ఋషిర్ బ్రహ్మ సముద్దిష్టశ్ఛందోఽనుష్టుబుదాహృతమ్ ।
దేవతానరసింహోఽస్య సురాసుర నమస్కృతః
చతుర్భిర్హృదయం వర్ణైః శిరస్తావద్భిరీరితమ్ ।
శిఖాఽష్టాభిః సముద్దిష్టా షడ్భిః కవచమీరితం
తావద్భిర్నయనం ప్రోక్తమస్త్రం స్యాత్కారణాక్షరైః ।
శిరోలలాట నేత్రేషు ముఖబాహ్వంఘ్రి సంధిషు
సాగ్రేషు కుక్షౌ హృదయే గలే పార్శ్వద్వయేపునః ।
అపరాంగే కకుదిచ న్యసేద్వర్ణాన్ యథాక్రమం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు శ్లోకమంత్రము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉగ్రంవీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతో ముఖం ।
నృసింహంభీషణంరుద్రం మృత్యుర్మృత్యుం నమామ్యహమ్॥

బ్రహ్మఋషిః । అనుష్టుప్ ఛందః । సురాసుర నమస్కృత నృసింహోదేవతా । హంబీజం - ఈం శక్తిః ।

శ్లోకములోని 4+4+8+6+6+4 అక్షరములతో షడంగన్యాసం ఆచరించి, శిరో - లలాట - నేత్ర - ముఖ - బాహు - పాదాగ్ర సంధి - కుక్షి - హృదయ - కంఠ - 2 ప్రక్కలు - వీపు - కకుద్ స్థానములందు మంత్రాక్షరములు న్యాసం చేసి ఇలా ధ్యానించాలి.

☞ **మాణిక్యాద్రి సమప్రభం నిజరుచా సంత్రస్త రక్షోగణం**
**జానున్యస్త కరాంబుజం త్రినయనం రక్తోల్లసద్భూషణమ్ ।**
**బాహుభ్యాం ధృతచక్రశంఖ మనిశం దంష్ట్రాగ్రవక్త్రోల్లస**
**జ్వాలాజిహ్వా ముదగ్రకేశనిచయం వందే నృసింహం విభుమ్ ॥**

# పురశ్చరణ విధానము

శ్లో॥ వర్ణలక్షం జపేన్మంత్ర తత్సహస్రం ఘృతప్లుతైః
పాయసాన్నైః ప్రజుహుయాద్విథివత్ పూజితేఽనలే ।
ఏవం కృతేభవేన్మంత్రీ సిద్ధమంత్రః ప్రతాపవాన్
పూజాప్రాగీరితే పీఠే మూర్తిం మూలేన కల్పయేత్ ।
పూజయేద్విథివత్తస్యాం దైత్యశత్రు మనన్యధీః
అంగాన్యాదౌ సమారాధ్య దిగ్దలేషు యజేత్ పునః ।
పక్షీంద్రం శంకరం శేష మబ్జయోనిం యథాక్రమం
శ్రియంహ్రియం ధృతిం పుష్టిమగ్న్యాదిషు యజేత్ పునః ।
లోకపాలాః పమభ్యర్చ్యాస్త్ర దస్త్రాణి తతః పరం
ఇత్థం జపాదిభిః సిద్ధే మనౌ కామ్యాని సాధయేత్ ।
సౌమ్యే సౌమ్యం స్మరేత్కార్యే క్రూరే క్రూరమిమం భజేత్
శ్రీపుష్పైర్భుహుయాన్మంత్రో బిల్వకాష్ఠైధితేఽనలే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పై మంత్రము 32 లక్షలు జపించి, 32వేలు ఘృతయుక్త పాయసహోమం ఆచరించాలి. పిమ్మట పీఠార్చన, మూలమంత్రముతో మూర్తికల్పన యథావిధిగా చేయాలి.

అదే మంత్రమునకు మరొక ధ్యానశ్లోకము కూడా కలదు.

✡ ఉద్యత్కోటిరవిప్రభం నరహరిం కోటీర హారోజ్వలం
దంష్ట్రా భీమముఖం లసన్నఖముఖైర్దీర్ఘై రనేకైర్భుజైః ।
నిర్భిన్నాసురనాథ మగ్నిశశభృత్ సూర్యాత్మ నేత్రత్రయం
విద్యుత్పుంజ సటాకలాప భయదం వహ్నింవమంతం భజే ॥

అంగపూజ - నాలుగుదిశలందూ, గరుడ - శంకర - శేష - బ్రహ్మ దేవులను, అటుపై ఆగ్నేయాది కోణములందు శ్రీ - హ్రీ - ధృతి - పుష్టి శక్తులను అర్చించాలి.

ఆపై లోకపాలురను, వారి ఆయుధములను అర్చించి, జపాదులను యధావిధిగా ఆచరించి సిద్ధిపొందాలి. సౌమ్య కార్యములందు, సౌమ్యరూప నృసింహుని ధ్యానించాలి. క్రూర కర్మలందు ఉగ్రనరసింహుని ధ్యానించాలి.

శ్లో॥ సహస్రం శ్రియమాప్నోతి పత్రైర్వా బిల్వసంభవైః
ప్రసూనైర్వాఫలైస్తద్వత్ దూర్వాహోమాదరోగతాం ।
మంత్రజప్తాం వచాం శ్వేతాం భక్షయేత్ ప్రాతరన్వహం
వాక్సిద్ధిం లభతే మంత్రీ వాచస్పతిరివాపరః ।
సలిలేదేవమభ్యర్చ్య గంధపుష్పాదిభిః శుభైః
దూర్వాభిస్తత్ర జుహుయాన్నిత్యమష్టోత్తరంశతమ్ ।
ఉపసర్గా వినశ్యంతి క్షుద్రభూతజ్వరాదిభిః
దుఃస్వప్నే నిశిసంజాతే స్నాత్వామంత్రమముంజపేత్ ।
అనిద్రోమంత్రవిత్ పశ్చాత్ సుస్వప్నస్తస్యజాయతే
వ్యాఘ్ర చేరమృగావిభ్యో మహారణ్యే భయాకులే ।
రక్షేన్మనురయంజప్తో భయేష్వన్యేషు మంత్రిణం

అనేనమంత్రితంభస్మ విషగ్రహ మహామయాన్ ।
నాశయేదచిరాదేవ మంత్రస్యాఽస్య ప్రభావతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సాధకుడు బిల్వసమిధలతో, లేదా పుష్పములతో, ఫలములతో కమలములతో హోమం చేసిన సంపద కలుగును. వెయ్యిసార్లు హోమం చేయవలయును. అభిమంత్రిత వసను ప్రాతఃకాలమున భక్షించిన వాక్సిద్ధి, మేధ కలుగును.

గంధ పుష్పాదులతో జలమునందు నృసింహుని అర్చించి 108 సార్లు హోమంచేసిన క్షుద్రభూతభయము, జ్వరాది ఉపద్రవ రోగములు తొలగును. దుఃస్వప్నము కలిగినపుడు స్నానమాచరించి, ఈ మంత్ర జపము చేసిన సుస్వప్నము కలుగును.

భయంకరమైన సంకటములందు, మృగ – చోర దుష్టుల హింసనుండి రక్షణ కలుగును. అభిమంత్రిత భస్మము ధరించిన విష – గ్రహ – బాధలనుండి విముక్తుడగును.

శ్లో॥ ఘోరేఽభిచారే సోన్మాదే మహోత్పాతే మహాభయే
జపేన్మంత్రం స్మరేద్దేవం దుఃఖాన్ముక్తో భవేన్నరః ।
సింహరూపం మహాభీమం నఖదంష్ట్రాతిభీషణమ్
స్మృత్వా ఽత్మానం రిపుంపశ్చాద్ ధ్యాయేన్మృగశిశుంపురా।
గృహీత్వా గలదేశే తంపునర్దిక్షు క్షిపేద్ధృతం
పుత్రమిత్ర కళత్రాద్యై రుచ్చాటో జాయతేరిపోః ।
పూర్వమత్యు పదే సాధ్యనామ కృత్వాస్వయం హరిః
నిశితైర్నఖదంష్ట్రాగ్రైః ఖండ్యమానం రిపుంస్మరేత్ ।
నిత్యమష్టోత్తరశతం జపేన్మంత్ర మతంద్రితః
జాయతేమండలారద్వాక్ శత్రుర్వైవస్వతప్రియః ।

యత్నంకుర్వీత విధివత్ శత్రుసేనా నివారణే
బిభీతకాష్ఠైర్జ్వలితే పావకేరిపుమర్దనమ్ ।
విచింత్యదేవం నృహరిం సంపూజ్య కుసుమాదిభిః
సమూల తూలైర్ జుహుయాచ్ఛరైర్దశశతం పృథక్ ।
రిపుంఖాదన్నివ జపే న్నిర్భిందన్నివ తాన్ క్షిపేత్ః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – భయంకరములైన అరణ్యము లందు ఈ మంత్రజపమువలన ఏబాధ, భయము కలుగవు. ఘోర అభిచార ప్రయోగములు, ఉన్మాదము ఉత్పాతములు మొదలగు దుఃఖములనుండి రక్షణ కలుగును. సాధకుడు తనయందు ఉగ్రనరసింహుని భావించి, శత్రువును ఒక మృగశిశువుగా భావించి, అతని కంఠము పట్టుకొని దూరముగా విసిరివేసినట్లు భావించిన శత్రూచ్చాటనమగును.

మంత్రములో 2 మృత్యుపదములలో, మొదటి మృత్యుపదస్థానములో శత్రునామము చేర్చి జపించిన, శత్రుబాధ నివారణమగును. నృసింహుడు తన గోళ్లతో శత్రువును చీల్చుచున్నట్లు భావించుచూ 108 సార్లు నిత్యమూ జపించిన, 49 రోజులలో శత్రుపీడ తొలగును.

విభీతక సమిధలతో హోమం చేయుచూ శత్రుమర్దనుడుగా నృసింహు నిధ్యానించి, కుసుమాదులతో అర్చించిన అభయము కలుగును. సమూలముగా రెల్లు పూలను 1000సార్లు హోమం చేయుచూ, నృసింహుని శత్రు భక్షకునిగా భావించిన, క్రోధముతో హవిస్సును ఆహుతిలిచ్చిన శత్రుపీడ నివారణమగును.

శ్లో॥ హుత్వాసప్తదినంమంత్రీ సేనామిష్టాంమహీపతేః
ప్రస్థాపయేచ్ఛుభే లగ్నే పరరాజ్యజయేచ్ఛయా ।
తస్యాః పురస్తాన్నృహరిం నిఘ్నంతం రిపుమండలం

స్మృత్వా ప్రయోగంకుర్వీత యావదాయాతి సాపునః ।
విజిత్య నిఖిలాన్ శత్రూన్ సహవీరశ్రియా సుఖమ్
ఆగత్యవిజయీరాజా గ్రామక్షేత్ర ధనాదిభిః ।
ప్రణయేన్మంత్రిణం సమ్యగ్విభవైః ప్రీతమానసః
మంత్రీయది న సంతుష్యేదనర్థః స్యాన్మహీపతేః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఈ ప్రకారము 7 రోజులు హోమం చేసిన 8వ రోజు కార్యసిద్ధి కలుగును. శతృసైన్యముపై విజయము సాధించుటకు ఇది ప్రయోగించవచ్చును. (ఉద్యోగముకొరకు జరుగు పోటీ పరీక్షలందు ఇది ఆచరించిన తప్పక జయము కలుగును).

ఇట్టి సాధకుడు సమస్త సుఖములను పొందును. సాధకుడు గురువును, దక్షిణాదులతో సంతృప్తి పరచవలచును. లేనిచో అనర్థము జరుగును. విజయము పొందిన రాజు, మంత్రిని గౌరవించి సత్కరించ వలయును.

## నృసింహ యంత్రము

శ్లో॥ బీజం సాధ్యసమన్వితం ప్రవిలిఖేన్మధ్యేఽష్టపత్రేష్వథో
మంత్రార్ణాన్ శృతిశో విభజ్యవిలిఖేత్ లిప్యా బహిర్వేష్టయేత్।
బాహ్యే కోణగ బీజబద్ధ వసుధా గేహద్వయే నావృతం
యంత్రం క్షుద్రవిషగ్రహామయ రిపుప్రధ్వంసనం శ్రీప్రదమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అష్టదళ పద్మము లిఖించి, మధ్యలో నృసింహబీజము (క్ష్రౌం) సాధ్యనామ సహితముగా లిఖించాలి. పిమ్మట అష్టదళములందు నాలుగేసి అక్షరముల చొప్పున నృసింహుని శ్లోకమంత్రము లిఖించాలి.

బయట మాతృకును లిఖించి వేష్టనం చేయాలి. బయట కోణములందు నృసింహబీజము లిఖించి, పరస్పర భిన్నముగా 2 భూబింబములతో వేష్టితం చేయాలి. ఇట్టి యంత్రము క్షుద్ర - రోగ - విష - గ్రహ బాధలను తొలగించి, సంపదనిచ్చును.

## రిపు ధ్వంసన యంత్రము

శ్లో॥ కృత్వా నవపదాత్మానం మండలం యంత్ర సంయుతం
అస్మిన్ సంస్థాపయేన్మంత్రీ కలశాన్నవ శోభనాన్ ।
కషాయతోయ సంపూర్ణాన్ వస్త్రరత్నాది సంయుతాన్
మధ్యే సంపూజయేద్దేవం నృసింహం శాంతవిగ్రహమః ।
తార్క్ష్యాదీన పూజయేన్మంత్రీ పూర్వాదిషు యథాక్రమమ్
ఇతి సంసాధితైస్తోయైరభిషించేత్ ప్రియంనరమ్ ।
అభిచారగ్రహోన్మాద వినశ్యంత్యరిభిస్సహ
అభిషిక్తస్తదావిప్రాన్ భోజయేద్దే వతాధియా ।
యథావత్ పూజయేత్పశ్చాత్ భక్త్యా గురుమవంచయన్
రాజవిజయమాప్నోతి యుద్ధేషు విధినాఽమునా ।

✡ బీజాంకం ఫణకంచకం ప్రవిలిఖేచ్ఛేషస్య భోగే పున
ర్ద్వాత్రింశత్పదసంయుతే పరిలిఖేన్మంత్రాక్షరాణి క్రమాత్।
పుచ్ఛేనామ జపాదిసాధితమిదం హోమేన సంపాతితం
భూతాపస్మృతి దుఃఖరోగశమనం యంత్రం రిపుధ్వంసనమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నవనాభ మండలమేర్పరచి, అందు 9 కలశములు స్థాపించి యంత్రమునుంచి, కలశములను క్షీరవృక్ష బెరడు కషాయముతో నింపాలి. అందు రత్నములుంచి, వస్త్రముతో

అలంకరించాలి. మధ్య కలశమునందు శాంతవిగ్రహుడైన శ్రీనృసింహుని అర్చించాలి.

పిమ్మట పూర్వాది దిశలందు గరుడాదులను పూజించి, ఆ కలశ జలములో సాధ్యవ్యక్తిని అభిషేకించిన, సమస్త అభిచార - గ్రహదోష - ఉన్మాద - రోగాది బాధలు తొలగును. బ్రాహ్మణులకు దక్షిణలిచ్చి, భోజనాదులు కాలింపచేసి సత్కరించాలి.

| | | | |
|---|---|---|---|
| ఉ | గ్రం | వీ | రం |
| మ | హా | వి | ష్ణుం |
| జ్వ | లం | తం | స |
| ర్వ | తో | ము | ఖం |
| నృ | సిం | హం | భీ |
| ష | ణం | రు | ద్రం |
| మృ | త్యుర్ | మృ | త్యుం |
| న | మా | మ్య | హం |
| సా | ధ్య | నా | మ |

ఈ విధంగా "రిపుధ్వంసన" యంత్రం లిఖించి, దీనిపై జపజలమును, హోమములోని ఘృతశేషమును చల్లి, దానిని ధరించిన సమస్త ఆపదలు తొలగును.

## జ్వాలానృసింహ మంత్రం

శ్లో॥ క్షకారో వహ్నిమారూఢో మనుస్వరసమన్వితః
బిందునాదలసన్మూర్ధా బీజం నరహరేర్మతమ్ ।

బీజం నమోభగవతే నరసింహాయ తత్పరం
స్యాజ్జ్వాలా మాలినే పశ్చాద్దీప దంష్ట్రాయతత్పరమ్ ।
అగ్నినేత్రాయ సర్వాది రక్షోఘ్నాయ పదం వదేత్
సర్వభూత వినాశాంతం నకారోదీర్ఘవాన్ మరుత్ ।
సర్వజ్వరవినాశాంతే నాయార్ణౌ దహయుగ్మకం
పచద్వయం రక్షయుగ్మం హుంఫట్స్వాహా ధ్రువాదికః ।
సప్త షష్ట్యక్షరైః ప్రోక్తో జ్వాలామాలీ మహామనుః
హృత్త్రయోదశభిఃప్రోక్తం శిరోదశభిరీతమ్ ।
శిఖైకాదశభిః ప్రోక్తా వర్మాఽష్టాదశభిర్మతం
వర్ణైర్ ద్వాదశభిర్నేత్రమస్త్రం స్యాత్కరణాక్షరైః ।
ఏవమంగాని విన్యస్య చింతయేన్మంత్రదేవతామ్
లక్షమేకం జపేన్మంత్రం తద్దశాంశం సమాహితః ।
కపిలాజ్యేనజుహుయాత్ సమిద్ధే హవ్యవాహనే

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – నృసింహుని ఏకాక్షర బీజము – క్ష్రౌం ।

ఇపుడు 67 అక్షరముల జ్వాలామాలీ నృసింహమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం క్ష్రౌం నమోభగవతే నరసింహాయ జ్వాలామాలినే దీప్త దంష్ట్రాయ అగ్నినేత్రాయ, సర్వరక్షోఘ్నాయ, సర్వభూతవినాశనాయ, సర్వజ్వర వినాశనాయ, దహదహ, పచపచ, రక్ష రక్ష, హుంఫట్ స్వాహా।**

మూలమంత్రములోని 13+10+11+18+12+4 అక్షరములతో షడంగన్యాసమాచరించి, పిమ్మట ఇలా ధ్యానించాలి.

ఉజ్వలత్ ప్రలయానలాభమయుగ్మనేత్ర మనారతం
భాసుర శిఖినః శిఖాభిరుదగ్ర దంష్ట్ర ముఖాంబుజమ్ ।
రక్షసాంభయదం వికీర్ణసటా కలాప విభీషణం
శంఖచక్ర కృపాణఖేటకధారిణం నృహరిం భజే ॥

ఈ మంత్రమును ఒక లక్ష జపించి, కపిలగోఘృతముతో దశాంశ హోమమాచరించాలి. పిమ్మట పూర్వోక్త పీఠమునందర్చించాలి. సిద్ధి పొందిన సాధకుడు క్షుద్ర - రోగ - గ్రహబాధలను పోగొట్టగలడు.

## లక్ష్మీ నృసింహ మంత్రము

శ్లో॥ పాశఃశక్తి ర్నరహరి రంకుశో వర్మఫట్ పునః
షడక్షరో నరహరేః కథితః సర్వకామదః ।
ఋషిర్బ్రహ్మా సముద్దిష్టః పంక్తిశ్ఛంద ఉదాహృతం
దేవతా నరసింహోఽస్య షడ్బీజైరంగ కల్పనా ।
ఋతులక్షం జపేదేనం ఘృతేనజుహుయాత్తతః
తత్సహస్రం సమిద్ధేఽగ్నౌ తోషయేద్ ద్రవిణైర్గురుమ్ ।
అర్చాప్రాగీరితే పీఠే మూర్తిం మూలేన కల్పయేత్
అంగావృతే ర్బహిశ్చక్రం శంఖం పాశాంకుశౌ పునః ।
వజ్రం కౌమోదకీం ఖడ్గఖేటే పత్రేషు పూజయేత్
ఇంద్రాద్యానేత దస్త్రాణి పూజయేద్ బాహ్యతః సుధీః ।
ఏవంకృత్వా పురశ్చర్యాం మంత్రేణాఽనేన మంత్రవిత్
ప్రయోగాన్ కల్పనిర్దిష్టాన్ కుర్యాత్ స్వస్యపరస్య చ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు లక్ష్మీనృసింహుని షడక్షరమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఆం హ్రీం క్ష్రౌం క్రోం హుం ఫట్।**

బ్రహ్మ ఋషిః । పంక్తి ఛందః । క్ష్రౌం బీజం – మాయాశక్తిః ।

ఆరు బీజాక్షరములతో షడంగన్యాస మాచరించి ఆలా ధ్యానించాలి.

కోపాదాలోల జిహ్వం వివృతనిజముఖం సోమసూర్యాగ్ని నేత్రం
పాదాదానాభిరక్తప్రభముపరి సితం భిన్నదైత్యేంద్రగాత్రం ।
చక్రం శంఖం సపాశాంకుశ కులిశగదాదారణాన్యుద్వహంతం
భీమంతీక్ష్ణోగ్రదంష్ట్రం మణిమయ వివిధా కల్పమీడే నృసింహమ్॥

పై మంత్రము ఆరు లక్షలు జపించి, దశాంశహోమమాచరించి, గురుదక్షిణతో ఆచార్యుని సత్కరించాలి.

పిమట పీఠపూజ – మూర్తికల్పన – అంగావరణార్చన, అష్టపత్రము లందు బయట చక్ర – శంఖ – పాశ – అంకుశ – వజ్ర – కౌమోదకీ – ఖడ్గ – ఖేటములను పూజించాలి. ఆపై లోకపాలురను, వారి ఆయుధయులను అర్చించాలి. సిద్ధి పొందిన సాధకుడు ప్రయోగములు చేయ సమర్థుడగును.

పురశ్చరణగూర్చి <u>**"వైశంపాయన సంహిత"**</u> యందిట్లున్నది.

✡ పురశ్చరణ సంపన్నో మంత్రోహి ఫలదాయకః
కింహోమైః కింజపైశ్చైవ కింమంత్రన్యాస విస్తరైః ।
రహస్యానాం చ మంత్రాణాం యదినస్యాత్ పురస్క్రియా
పురస్క్రియాతు మంత్రాణాం ప్రధానం బీజముచ్యతే ।
వ్యాథిగ్రస్తో యధాదేహీ సర్వకర్మసు న క్షమః
పురశ్చరణ హీనోఽయం తథా మంత్రోఽపి కీర్తితః
యేషాం జపే చ హోమేచ సంఖ్యానోక్తా మనీషిభిః
తేషామష్టసహస్రాణి సంఖ్యోక్తా జపహోమయోః ।

"**<u>పద్మనాభీయము</u>**" నందిట్లున్నది.

☞ **యావంతః కర్మయజ్ఞాః స్యుః ప్రదీప్తాని తపాంసిచ**
**సర్వే తే జపయజ్ఞస్య కలాంనాఽర్హంతి షోడశీమ్ ।**

"**<u>భృగు సంహిత</u>**" యందిట్లున్నది.

☞ **యేపాకయజ్ఞాశ్చత్వారో విధియజ్ఞసమన్వితాః**
**సర్వేతే జపయజ్ఞస్య కలాం నాఽర్హంతిషోడశీమ్ ॥**

## హోమ ఫలము

శ్లో॥ రక్తోత్పలైస్త్రిమధ్వక్తైః సహస్రం జుహుయాన్నవైః
నిత్యం మాసాద్ భవేదిష్టం వత్సరాద్ధనధాన్యవాన్ ।
రక్తై స్త్రిమధురోపేతైః పద్మైర్భాను సహస్రకం
జుహుయాన్మహతీం లక్ష్మీమాయుర్వశ్యమవాప్నుయాత్ ।
లాజాం స్త్రిమధురో పేతాన్ ప్రాతః కాలేషు జుహ్వతః
కన్యాసిద్ధిర్భవేత్ పక్షాత్ కన్యాయాః సద్వరోభవేత్ ।
దూర్వాః పయోఘృతాభ్యక్తా దశోత్తశతంసుధీః
అన్వహం జుహుయాత్ సమ్యగ్దీర్ఘ మాయురవాప్నుయాత్ ।
తస్య రోగాః ప్రణశ్యంతి కృత్యా ద్రోహాదిభిః సహ
సపంచగవ్యం జుహుయాదపామార్గస్య మంజరీమ్ ।
నిత్యం సహస్రమానేన సప్తాహం విజితేంద్రియః
హోమోఽయం సర్వధా భూతకృత్యారోగాన్ ప్రణాశయేత్।
సతిలై రాజ్యాపామార్గ హిరాజ్యై ర్యథాక్రమమ్
ద్విసహస్రం ప్రజుహుయాత్ క్షుద్రరోగగ్రహాన్ జయేత్ ।
పయోక్తై రమృతాఖండైస్త్రిహసస్రం చతుర్దిం

అనేన విహితో హోమో గ్రహజ్వర వినాశనః ।
నృసింహ శక్తి బీజేద్వే శూలే తారగతే లిఖేత్
తత్రగ్రహార్తం సంస్థాప్య జపేన్మంత్రం షడక్షరమ్ ।
ఆవిశ్యసద్యస్తం ముంచేద్ గ్రహః క్రందన్ భయాకులః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – నిత్యమూ ప్రాతఃకాలమందు త్రిమధుర మిశ్రిత కమల హోమమువలన, ఒక నెలలో ఇష్టసిద్ధి కలుగును. ఒక సంవత్సరములో విపుల ధనధాన్యములు ప్రాప్తించును.

త్రిమధురమిశ్రిత లాజహోమము వలన 15 రోజులలో ఇష్టకన్యాప్రాప్తి కలుగును. పాలు – నేయితో దూర్వా కలిపి వెయ్యిసార్లు నిత్యమూ హోమం చేసిన దీర్ఘాయువు ప్రాప్తించును. కృత్యా – రోగ – శోకములు నశించును.

పంచగవ్య మిశ్రిత అపామార్గ గుత్తులు (మంజరి) నిత్యమూ వెయ్యిసార్లు, 7 రోజులు హోమం చేసిన సకల కష్టములూ నశించును. తిల మిశ్రిత ఘృతము, అపామార్గ సమిధలు, ప్రత్యేకముగా 2వేలు హోమం చేసిన క్షుద్రరోగములు – గ్రహబాధలు నశించును.

పాలతో కలిపి తిప్పతీగ సమిధలు మూడువేలు చొప్పున 4 రోజులు హోమం చేసిన గ్రహ – రోగ బాధలు నశించును. ప్రణవముయొక్క శూలాకార భాగమునందు నృసింహబీజమును లిఖించి, బాధితవ్యక్తిని స్పృశించుచూ, షడక్షర మంత్రజపము చేసిన, భూతావేశము తొలగిపోవును.

## నృసింహ యంత్రము

శ్లో॥ ఆలిఖ్యాఽగ్నిపురద్వయం తదుదరే శక్తిం ససాధ్యాం లిఖేత్
షట్కోణేషు షడక్షరాణ్యథ మనోః కింజల్కసంస్థాన్ స్వరాన్।
పత్రేష్వష్టసు మంత్రరాజవిహితాన్ వర్ణాన్ క్రమాద్వేదశః
కాద్యర్ణైః పునరావృతం క్షితిపురే కోణేషు చింతామణిమ్ ॥

నృసింహమిదం యంత్రం విఖితం భూర్జపత్రకే
విధృతం శిరసా శీర్షరోగభూత జ్వారాన్ హారేత్ ।
బహునాఽత్ర కిముక్తేన మంత్రైరేతైరుదీరితైః
సమోనాస్తిమనుః కశ్చిచ్ఛాపానుగ్రహకారకః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - రెండు పరస్పర భిన్న షట్ కోణములు నిర్మించి, మధ్యలో సాధ్యనామయుక్త హ్రీం మంత్రము లిఖించి, షట్కోణములందు షడక్షర మంత్రము లిఖించాలి. కేసరములందు 16 అచ్చులు, అష్టపత్రములందు నృసింహాశ్లోకమంత్రమును నాలుగేసి అక్షరముల చొప్పున వ్రాయవలయును.

భూపురమునందు కకారాది క్షకారాంత వర్ణములను లిఖించి వేష్టితం చేయాలి. కోణములందు నృసింహ చింతామణి మంత్రము (క్ష్రౌం) లిఖించాలి.

భూర్జపత్రముపై లిఖించిన ఈ నృసింహయంత్రము శిరముపై ధరించిన సకల శిరోవ్యాధులు నశించును. శాపానుగ్రహ సమర్థతలో ఈ మంత్రమును మించినది లేదు.

## సుదర్శన మంత్రము

శ్లో॥ తారోభృగుర్వియద్భూయస్తదాద్యం వహ్నిదీర్ఘయుక్
పావకః కవచాస్త్రాంతో మనుః సప్తాక్షరః స్మృతః ।
అహిర్ బుధ్న్యో మునిఃప్రోక్తశ్ఛందోఽనుష్టుబుదాహృతం
దేవతామునిభిః ప్రోక్తా చక్రరూపో హరిః స్వయమ్
ఆచక్రాయ హృధాఖ్యాతం విచక్రాయ శిరః స్మృతం
సుచక్రాయ శిఖాప్రోక్తా ధీచక్రాయ తనుచ్ఛదమ్ ।

సంచక్రాయ స్మృతం నేత్రం జ్వాలాచక్రాయ తత్పరం
షడంగమంత్రాః ప్రత్యేకం ద్విఠాంతా జాతిసంయుతాః ।
ఐంద్రీచక్రేణ బధ్నామి నమశ్చక్రాయ ఠ ద్వయమ్
మంత్రేణానేన కుర్వీత దిశాంప్రాగాది బంధనం ।
త్రైలోక్యాంతే రక్షయుగ్మం హుంఫట్ స్వాహాధ్రువాదికః
అగ్నిప్రాకార మంత్రోఽయం రక్షార్థం పునరాత్మనః ।
ప్రాకారంతేన కుర్వీత మంత్రేణ మనువిత్తమః
సితరక్తాంజనప్రఖ్యం తారంమూర్ధని విన్యసేత్ ।
అన్యానగ్నినిభాన్వర్ణాన్ భ్రువోర్మధ్యే ముఖేహృది
గుహ్యజాను పదద్వంద్వసంధిషు క్రమశో న్యసేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సప్తాక్షర సుదర్శనమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం సహస్రార హుంఫట్।**

అహిర్బుధ్న్య ఋషిః । అనుష్టుప్ ఛందః । సంబీజం – హుంశక్తిః చక్రరూపధారీ విష్ణుర్దేవతా ।

ఆచక్రాయ స్వాహా – హృదయాయ నమః ।
విచక్రాయ స్వాహా – శిరసే స్వాహా ।
సుచక్రాయ స్వాహా – శిఖాయై వషట్ ।
ధీచక్రాయ స్వాహా – కవచాయహుం ।
సంచక్రాయ స్వాహా – నేత్రద్వయాయ వౌషట్ ।
జ్వాలాచక్రాయ స్వాహా – అస్త్రాయ ఫట్ ।

అని షడంగన్యాసం చేసి, ఐంద్రీచక్రేణ బధ్నామి నమశ్చక్రాయ స్వాహా అని నాలుగుదిశలా, పైన క్రింద దిగ్బంధనం చేయాలి.

**"ఓం త్రైలోక్యం రక్ష రక్ష హుంఫట్ స్వాహా"** అను అగ్ని ప్రాకార మంత్రముతో, సాధకుడు రక్ష చేసుకోవాలి. మరియు తనచుట్టూ అగ్ని తన జ్వాలలతో రక్షగా యున్నట్లు భావించి, పై రక్షామంత్రముతో - భ్రూమధ్య - ముఖ - హృదయ - గుహ్య - జాను స్థానములందు న్యాసం చేయాలి.

పిమ్మట ఇలా ధ్యానించాలి.

కల్పాంతార్క ప్రకాశం త్రిభువనమఖిలం తేజసా పూరయంతం
రక్తాక్షం పింగకేశం రిపుకులభయదం భీమదంష్ట్రాట్టహాసమ్ ।
చక్రంశంఖం గదాబ్జే పృథుతర ముషలం చాపపాశాంకుశాన్ స్వైః
బిభ్రాణాం దోర్భిరాద్యం మనసి మురరిపుం భావయేచ్చక్ర సంజ్ఞమ్॥

## విధానము

శ్లో॥ అర్కలక్షం జపేన్మంత్రం జుహుయాత్తత్సహస్రకం
తిలైః ససర్షపైః పద్మైః బిల్వై ర్దు గ్ధోదనైః క్రమాత్ ।
విష్ణోః సంపూజయేత్ పీఠే మూర్తిం మూలేన కల్పయేత్
అంగాని పూర్వమభ్యర్చ్య చక్రాద్యస్త్రాణి తద్బహిః ।
చక్రంశంఖం గదాంపద్మం ముషలం సశరం ధనుః
పాశాంకుశౌదలాగ్రేషు లక్ష్మ్యాద్యాః పూజయేత్తతః ।
లక్ష్మీం సరస్వతీ పశ్చాద్రతిం ప్రీతిం తతః పరం
కీర్తికాంతీ తుష్టిపుష్టీ సర్వాఏతాః స్మృతాద్విశః ।
పీతరక్త సితశ్యామా ఇంద్రాద్యస్త్రాణి తద్బహిః
ఇతి సిద్ధే మనౌప్రోక్త ప్రయోగాన్ కర్తుమర్హతి ।
ఆత్మనో వాపరర్థం వా దృష్టాదృష్ట ఫలప్రదాన్
దూర్వాహోమో విధాతవ్యో దీర్ఘమాయురభీప్సతా ।

శ్రీకామోజుహుయాత్పద్మైః ఫుల్లైరాజ్య పరిప్లుతైః
మేధాకామేన హోతవ్యం ప్రసూనైర్ బ్రహ్మవృక్షజైః ।
దినత్రయం యోజుహోతి గులికాః పురునిర్మితాః
అష్టోత్తర సహస్రేణ స జయేన్నిఖిలాపదః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పై మంత్రము 12 లక్షలు జపించి, ఘృతయుక్త తిల, కమల, బిల్వ, క్షీరములు, ఆజ్యాన్నము ప్రత్యేకముగా 2400 హోమం ఆచరించాలి. విష్ణుపీఠమునందు మూర్తి కల్పన, చక్రావాహన చేయాలి.

పిమ్మట కేసరములందు అంగములను, దాని బయట పత్రమధ్యములందు చక్ర - శంఖ - గదా - పద్మ - ముసల - బాణ యుక్త ధనుస్సు - పాశ - అంకుశములను అర్చించాలి. పిమ్మట పత్రాగ్ర భాగములందు లక్ష్మీ - సరస్వతి - రతి - ప్రీతి - కీర్తి - కాంతి - తుష్టి - పుష్టి - శక్తులను క్రమముగా పీత - రక్త - సిత - శ్యామవర్ణ ధారుణులుగా భావించి అర్చించాలి.

ఆపై లోకపాలురను, వారి ఆయుధములను పూజించాలి. మంత్రసిద్ధిని పొందిన సాధకుడు వివిధ ప్రయోగములను నిర్వహించ సమర్థుడగును. దీర్ఘాయువు కోరువారు దూర్వాహోమము ఆచరించాలి. సంపదకొరకు ఘృతయుక్త కమలములు - మేధ కోరువారు ఘృతయుక్త మోదుగుపూలు హోమం చేయాలి.

గుగ్గులు ముక్కలను చిన్నచిన్న ముక్కలుగా చేసి మూడురోజులు 108 సార్లు చొప్పున హోమం చేసిన, సకల ఆపదలు తొలగును.

శ్లో॥ గవ్యే నాజ్యేన గోసిద్ధ్యై జుహుయాద్దివసత్రయం
ఉదుంబర సమిద్ధోమః పుత్రదాయీ భవేత్నృణామ్ ।

ప్రళయాగ్ని సమంచక్రం యస్యమూర్ధ నిచింతయేత్
సప్తాహాజ్వరమూర్చార్తో మండలాన్ మృతిమేతి సః ।
అకారాది స్వరావీతం యాహి యాహి పదావృతం
సకారంచింతయే చ్ఛత్రోర్ మూర్ధన్యుచ్చాటమావహేత్ ।
అనేనవిధినా శత్రు ర్మండలాన్ మృత్యు భాగ్భవేత్
శరచ్చంద్ర నిభం సార్ణం సుధాధారాభి వర్షిణమ్ ।
స్మరేన్మూర్ధని యస్యాఽసౌ స జీవేద్విగతామయః
ఆత్మానం చక్రనాభిస్తుం ధ్యాత్వా మంత్రమముం జపేత్।
ఏకోపి రణభూమిస్థో జయేత్ ప్రత్యర్థినో బహూన్
అపామార్గస్య సమిధో జుహుయాదయుతావధి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - గోసమృద్ధికొరకు, గో ఘృతముతో మూడురోజులపాటు 108 సార్లు హోమం చేయాలి. మేడి సమిధలతో హోమం చేసిన, సంతానము కలుగును. సాధకుడు ఎవని శిరస్సుపై ప్రళయాగ్ని సదృశ సుదర్శన చక్రమును ధ్యానించునో, ఒక వారములో అతడు జ్వరపీడితుడగును. 49 రోజులు ఆచరించిన -

అకారాది అచ్చులతో (యం యాం ఇత్యాది) శత్రుశిరస్సుపై ధ్యానించిన 10 రోజులలో ఉచ్చాటనమగును.

**ఉదా - యం యాం యాహి యాహి, యం యాం సః యం యాం యాహి యాహి।** ఇదే 49 రోజులు చేసిన శత్రువు -

అమృతధారలతో శరత్కాచంద్ర సమానముగా సకారబీజమును, ఎవని శిరసుపై ధ్యానించునో అతడు రోగరహితుడై దీర్ఘాయువు పొందును.

నాభియందు చక్రధ్యానముచేసి, మంత్రజపము చేసిన, రణభూమియందు ఒక్కడైననూ అనేకమందిని జయించగలడు. అపామార్గ

సమిధలతో 10 వేలు హోమం చేసిన, రాక్షసభూత - పిశాచ - శత్రు బాధలు తొలగును.

శ్లో॥ నిర్గుండీ సర్జకనక శ్వేత కింశుక సంభవైః
సమిద్వరైః కృతోహోమః క్షుద్రరోగ గ్రహాపహః ।
అపామార్గస్య సమిధః సర్పిమధ్యే శృతశ్చరుః
సాజ్యమేతాని జుహుయాదష్టోత్తరశతం పృథక్ ।
సాధకాయ పునర్దద్యా చ్చరుంసంపాత సాధితం
అభిచారకృతాద్రోహా స్తస్యనశ్యంతి సర్వథా ।
అపామార్గస్య సమిధః పంచగవ్య పరిప్లుతాః
జుహుయాదమృతం మంత్రీ దిశాసు బలిమాహరేత్ ।
దధ్యోదనేన మనునా క్షుద్రరోగాదిశాంతయే
క్షీరవృక్షసమిత్ క్షీర హవిరాజ్యైః పృథక్ పృథక్ ।
చతుః సహస్రం హోతవ్యం శాంతిః స్యాత్ సర్వతోముఖీ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అపామార్గ సమిధలతో హోమం కష్టనివారణం, నిర్గుండీ - టేకు - ఉమ్మెత్త - తెల్ల జిల్లేడు - మోదుగ సమిధల హోమం వలన గ్రహబాధలు తొలగును. నేతిపాయసం - అపామార్గ సమిధలు ఆజ్యంతో హోమం చేసిన (108 సార్లు), శేషఘృతమును, ఒక పాత్రలో విడిగా తీయాలి.

ఇట్టి దానిని నిత్యమూ సేవించిన అభిచారప్రయోగములు నశించును. పంచగవ్యములతో అపామార్గ సమిధలు, పదివేలు హోమం చేసిన పిమ్మట దిశలయందు పెరుగన్నం బలిని సమర్పించిన క్షుద్రరోగములు నశించును.

క్షీరవృక్ష సమిధలు, క్షీరము, హవిరాజ్యములతో 4 వేలు హోమం చేసిన సర్వతోముఖాభివృద్ధి శాంతి కలుగును.

# చక్రరచనా ప్రకారము

శ్లో॥ దక్షిణోత్తరగం మంత్రీ చక్రయుగ్మం సమాలిఖేత్
వేదాది విలిఖేన్మధ్యే మంత్రవర్ణాన్ షడస్త్రిషు ।
మధ్యంపీతం కోణషట్కం రక్తం శ్యామలమంతరం
నేమిం శ్వేతాం లసద్వహ్ని శిఖాభిరుప శోభితామ్ ।
పార్థివం మండలం బాహ్యే కుర్యాదేవం యథావిధి
రక్తతోయేన సంపూర్ణం కుంభం సౌమ్యే ప్రవిన్యసేత్ ।
ఆవాహ్య పూజయేత్త స్మింశ్చక్రా త్మానం జనార్దనం
దక్షిణే మండలే కుర్యా ద్ధోమకర్మ విధానవిత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం -**




ఇందు మధ్యభాగములో పీతవర్ణము, 6 కోణములందు రక్తవర్ణము, శ్యామవర్ణము, పరిధిరేఖలందు శ్వేతవర్ణముతో ఏర్పరచాలి.

చక్రబాహ్యమునందు కాలవర్ణము ఏర్పరచాలి. ఉత్తదిశలో ఒక స్థానమునందు ఎర్రని జలముతో నిండిన ఘటస్థాపనచేసి, అందు జనార్దనుని పూజించి, దక్షిణస్థానమున హోమకర్మ ఆచరించాలి.

## బలిదాన విధి

శ్లో॥ క్రమాత్ సర్పిరపామార్గై స్తందులైః సర్షపై స్తిలైః
పాయసై ర్గవ్యసర్పిర్భ్యాం షడ్వింశత్యధికం శతమ్ ।
జుహుయాదేధితే వహ్నౌ ప్రతిద్రవ్యం విధానవిత్
సంపాతయేత్ కుంభతోయే పూజితే సౌమ్యమండలే ।
ప్రస్థార్థం చరుణాపిండం కృత్వా తస్మిన్ వినిక్షిపేత్
బాహ్యే బలిప్రదానార్థం తదర్థ మవశేషయేత్ ।
స్నాతం విశుద్ధ వస్త్రాఢ్యై సాధ్యమానీయతం పునః
దక్షిణే స్థాపయేన్మంత్రీ కుంభాగ్ని భ్యామనంతరమ్ ।
నీరాజ్యతౌ నయేద్బాహ్యే గ్రామాదష్టమరాశికే
రథాపయేత్తౌ యథా పూర్వం సపరిస్తరణౌ క్రమాత్ ।
హుత్వా వహ్నౌ యథాపూర్వం శిష్టాన్నేన బలింహరేత్
మనునా వక్ష్యమాణేన దశదిక్షు యధావిథి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అటు పిమ్మట క్రమముగా నెయ్యి, అపామార్గ, బియ్యం, ఆవాలు, తిలలు, పాయసం, గోఘృతములతో 124 సార్లు ప్రత్యేక ద్రవ్యముతో హోమంచేసి, శేషమును ఉత్తరదిశలోని ఘటమందు ఉంచాలి. హోమానంతరం అర్థప్రస్థ పరిమాణములో చరుద్రవ్యమును కూడా ఘటమందుంచి, మిగిలిన అర్థభాగమును బయట బలిద్రవ్యముగా ఉంచుకోవాలి.

పిమ్మట మరల స్నానమాచరించి, శుభ్ర వస్త్రములు ధరించి, సాధ్యవ్యక్తిని చక్ర దక్షిణభాగమున కూర్చుండబెట్టి, ఆఘటజలముతో సకలీకరణం చేయాలి. పిమ్మట ఆ ఘటమును గ్రామపొలిమేరలో అష్టమరాశి దిశయందు పరిస్తరణ మేర్పరిచి పాతిపెట్టాలి.

## రాశుల దిశలు

మేషం - తూర్పు, వృషభం - తూర్పు, మిథునం - ఆగ్నేయము, కర్కాటక సింహములు - దక్షిణము, కన్య - నైరుతి, తులావృశ్చికములు - పశ్చిమము, ధనుస్సు - వాయవ్యం, మకర కుంభములు - ఉత్తరము, మీనము - ఈశాన్యము.

"**కాదిమతము**"నందు రాశులను గూర్చి ఇట్లు కలదు.

☞ **ప్రాచ్యాం మేషవృషౌ వహ్నౌ మిథునం దక్షిణే తథా**
**కుళీర సింహమథ తన్నైరుత్యాం కన్యకా స్థితా।**
**తులాకీటౌ పశ్చిమతో ధనుర్వాయౌతు సంస్థితం**
**నక్రకుంభావుత్తరతో మీనమైశేతు సంస్థితమ్।**

పిమ్మట హోమమాచరించి, శేషపాయసము, ముందు చెప్పబోవు, బలి మంత్రముతో దశదిశలయందర్పించాలి.

## బలి మంత్రము

శ్లో॥ సహ్యాద్విష్ణు గణేభ్యోంతే సర్వశాంతికరే పునః
భ్యోబలిం ప్రతిగృహ్ణంతు శాంతయే హృదయం తతః।
బ్రాహ్మణాన్ భోజయేత్ సమ్యక్ మధురోత్తర మాదరాత్
గురవే దక్షిణాం దద్యాదస్త్ర భూషణ సంయుతామ్।
హన్యాదయం విధిః పుంసాం కృత్యారోగ గ్రహజ్వరాన్
రక్షః పిశాచ మార్యాదిక్లేశాన్ శీఘ్రంన సంశయః।
విధాయ పంజరంమంత్రీ ఫలకైః క్షీరశాఖినాం
పంచగవ్యేన సంపూర్య తస్మిన్ సాధ్యం నివేశయేత్।

ధౌతవస్త్రం విశుద్ధాంగం స్పృష్ట్వా సమ్యగ్జపేన్మనుం
పూర్వాదిదిక్షు సంస్థాప్య వహ్నిం బ్రాహ్మణ సత్తమైః ।
కారయేత్ పూర్వసందిష్టైః ద్రవ్యైర్హోమం విధానవిత్
తోషయేద్దక్షిణాభిస్తాన్ యజమానః స్వశక్తితః ।
గురుంచధనధాన్యాద్యై ర్వత్వా సంప్రీణయేత్తదా

**సంపత్కుమార్ తెలుగు వ్యాఖ్యానం** - బలిమంత్రము చెప్పబడు ఉన్నది.

**మనుః : నమోవిష్ణు గణేభ్యో సర్వశాంతి కరేభ్యో బలిం ప్రతిగృహ్ణాంతు శాంతయే నమః।**

పిమ్మట బ్రాహ్మణ భోజనం, గురుసత్కారం చేయాలి. ఈ విధి రీత్యా ఆచరించిన, సమస్త బాధలు నివారణమగును.

క్షీరవృక్ష బెరడుతో ఒక పాత్రవలె చేసి, దానిని పంచగవ్యములతో నింపి, సాధ్యవ్యక్తి స్నాతుడై శుద్ధవస్త్రము ధరించి, ఆ పాత్రను స్పృశించు చుండగా, గురువు మంత్రజపం చేయాలి. పిమ్మట పూర్వోక్త అష్టద్రవ్యములతో హోమం ఆచరించాలి.

శ్లో॥ అభిషించేద్ గ్రహవిష్టమభిచారాతురం నరం
సుస్థో భవతి శీఘ్రేణ విధానేనామునా నరః ।
భానువారేఽభిషేకస్య విధానేనసుసాధితైః
సలిలైః స్నాపయేన్నారీం సుఖప్రసవ కాంక్షిణీమ్ ।
సప్తవారాభిషేకేణ సర్వే నశ్యంత్యుపద్రవాః
పంచగవ్యైశ్శృతం సర్పిర్మంత్రితం మనునాఽమునా ।
గర్భిణీనాం గ్రహార్తానాం సేవితం తచ్ఛుభావహం
ఉచ్చస్థానగతే శుక్రే మనునా సాధు సాధితా ।

త్రిలోకే ముద్రికా హన్యాత్ క్షుద్రభూతగ్రహాన్ జ్వరాన్
తద్వర్ణ సంఖ్యయా సూత్రే గ్రంథీన్ కృత్వా జపాదిభిః ।
సాథితం కల్పయేద్ధస్తే కంఠే వా దుఃఖశాంతయే
పంచగవ్యం జపేత్ స్పృష్ట్వా మంత్రం దశశతావధి ।
న్యస్తం తత్ పద్మపత్రాదౌ పత్రేవా బ్రహ్మవృక్షజే
ఫలేబిల్వస్య వా మంత్రీ గృహే స్వస్య పరస్య చ ।
నిఖనేద్ సర్వరక్షా స్యాద్వర్ధతే సర్వసంపదః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - గ్రహపీడితులను, భూతావేశము కలిగిన వారికి, ఇట్టి అభిషేకమువలన స్వస్థులగుదురు. అపమృత్యువు కూడా తొలగును. ఆదివారమునాడు దీని నాచరించిన, గర్భిణీస్త్రీకి సుఖప్రసవమగును. 7 రోజులు ఇట్టి అభిషేకము చేసిన, శత్రుబాధ తొలగును.

శుక్రగ్రహము మీనరాశిలో ఉచ్చగతుడైనపుడు త్రిలోహముద్రికను తయారుచేసి, ధరించిన సకలగ్రహబాధలూ తొలగిపోవును.

అక్షరసహస్రము మంత్రజపంచేసి, అభిమంత్రించిన సూత్రము (7 దారములు) ధరించిన, దుఃఖములు తొలగును. పంచగవ్యములను తాకుతూ జపంచేసి, దానిని తామరాకుపైగాని, మోదుగ పత్రముపైగాని, మారేదుఫలముపైగాని విడచిపెట్టి, దానిని ఇంటిలో పాతిపెట్టిన, సర్వరక్షగా యుండును.

పంచగవ్యములతో, ఘృతమునువండి, దానిని అభిమంత్రించి, గ్రహపీడితులకుగాని, గర్భిణికిగాని కించిత్ సేవింపచేసిన, శాంతికరముగా శుభప్రదముగా నుండును.

# పంచగవ్య ఘృతపాకవిధి

శ్లో॥ పలాశక్షీర వృక్షాణాం త్వ చో మలయజంపురుం
కుంకుమం యామినీం కుష్ఠం బిల్వాపామార్గసర్షపాన్ ।
తిలదూర్వాయవాన్ దేవీం తులసీయుగళంకుశం
లక్ష్మీం గోరోచనాం పద్మం వచాంగోమయ సంయుతామ్।
విష్ణుక్రాంతామర్కయుతాంజపన్మంత్రం వినిక్షిపేత్
పంచగవ్యేన సంపూర్ణే పాత్రేతత్ సంస్కృతేఽనలే ।
సంస్థాప్యక్వాథయేత్ సమ్యగ్యావద్ భస్మభవిష్యతి
తదాదాయ జపేద్భూయః ప్రయుతం దేవతాధియా ।
లిపేత్ సర్వాంగమేతేన కించిచ్ఛిరసి నిక్షిపేత్
కృత్యాద్రోహ గ్రహోన్మాద వ్యాధిదుఃఖనివారణమ్ ।
సర్వశత్రుప్రశమనం సర్వపాపహరంపరం
శుభదం వశ్యదం పుంసాం సమస్తాపన్నివారణమ్ ।
గర్భిణీ బాలరుగ్ణానాం విశేషేణ ప్రశస్యతే
అస్మాత్పరతరారక్షా నాస్తిలోకే ప్రకీర్తితా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మోదుగ – క్షీరవృక్ష బెరడులు, చందనం, గుగ్గులు, కేసరి – పసుపు – కుష్ఠం – బిల్వపంచాంగములు – అపామార్గ – ఆవాలు, తిలలు, దూర్వ – యవ – సహదేవి, శ్యామ, 2 రకముల తులసి, కుశలు, గోరోచనం, కమలము, గోమయం, వచ, విష్ణుక్రాంత, మందార బెరడు,

ఈ ఔషధములన్నీ మంత్రమును పఠించుచూ, ఒక పంచగవ్యయుక్త పాత్రయందుంచాలి. సుసంస్కృతాగ్నియందు వీటి కషాయము

తయారుచేయాలి. దానిని మరిగించి భస్మం చేయాలి. దానిని మరల అభిమంత్రించాలి.

ఈ భస్మమును శిరసుపై జల్లి, సర్వాంగమూ లేపనముచేసిన, సమస్త అభిచారములు, గ్రహదోషములు, రోగములు తొలగిపోవును. శత్రుబాధ కూడా తొలగును.

గర్భిణులకు - బాలురకు - రోగులకు ఇది ఎంతో ఉపశాంతిని, రక్షణను ఇచ్చి కాపాడును. దీనిని మించినదిలేదు.

శ్లో॥ ముస్తాశుంఠీ నిశావహ్నీ రేలాయష్టిర్వచా వృషా
పాఠావిడంగం మంజిష్ఠా ద్రాక్షా దార్వీ సరోహిణీ ।
ఫలత్రయం చ తైః కల్కైః పంచగవ్యేషు సర్పిషాం
ప్రస్థం పచేద్యథాన్యాయం మంత్రేణాఽనేన సాధితమ్ ।
కాంతిదంసుతదం స్త్రీణాం భూతప్రేత భయాపహం
గర్భరక్షాకరం శుద్ధం పంచగవ్య ఘృతం విదుః ।
టాంతాన్‌సప్త లిఖేన్మధ్యే షట్సు కోణేషు తేష్వథ
మంత్రవర్ణాన్ లిఖేదేతచ్చక్ర మాపన్నివారణమ్ ।
షట్కోణమధ్యే విలిఖేత్ ససాధ్యం తారం షడస్త్రిష్వ వశిష్ట వర్ణాన్
అంగాని తత్ సంధిషు యంత్రమేతత్ కరోతిరక్షాం విధివ్ ప్రజస్తమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నాగరముస్తలు, శొంఠి, పసుపు, చిత్రకం, ఏలకులు, పాఠ, వచ, విడంగం, మంజిష్ఠ, ద్రాక్ష, మానిపసుపు, కటుక రోహిణి, త్రిఫల, అరుష - వీటినన్నిటినీ వైద్య శాస్త్రోక్త పరిమాణములుగా గ్రహించి చూర్ణము చేయాలి.

పిమ్మట ఘృతముతో కలసిన పంచగవ్యమందు వండుతూ, మంత్ర పఠనము చేయుచూ ఘృతము మిగులువరకు కలయ తిప్పుతుండాలి.

దీనిని పంచగవ్యఘృతము అంటారు. ఇది సంతానము కలిగించును. గర్భవతులకు రక్ష కలిగించును.

షట్కోణము లిఖించి, అందు చక్రమంత్రములోని అక్షరములు, 7 రకారములు లిఖించాలి. మధ్యలో సాధ్య - సాధక - కర్మలు లిఖించాలి. ఈ యంత్రధారణవలన రోగ ఉపద్రవములు, కష్టములు తొలగును.

**మరొక యంత్రము** - షట్కోణము లిఖించి, మధ్యలో సాధ్యసహిత ప్రణవము లిఖించాలి. ఆరుకోణములందు 'సహస్రార హుం ఫట్' అను మంత్రము లోని ఒక్కొక్క అక్షరమూ లిఖించాలి. సంధులందు అంగ మంత్రము లిఖించి 108 సార్లు మంత్రము జపించి అర్చించాలి. ఈ యంత్రము ధరించినవారికి సర్వరక్ష కలుగును.

## షోడశార యంత్రము

శ్లో॥ తారం లిఖేత్ రాంతగతం ససాధ్యం
కోణేషు శిష్టం మనువర్ణషట్కమ్ ।
అంగాని సంధిష్వథ షోడశారం
సషోడశార్ణం వసుధా పురస్థమ్ ॥
జపిత్వాకృత సంపాతం గర్భిణీనాం హితంపురం
అభిచార గ్రహోన్మాదాన్ యంత్రమేతద్వినాశయేత్।
మధ్యేతారం ససాధ్యం మనుమథ విలిఖేత్ షట్సు కోణేషుసంధి
ష్వంగాన్యంతే కలానాం యుగయుగవిలసత్ కేశరాష్టార్ణపత్రమ్
కింజల్కాన్ కాదివర్ణైర్ద్వివసుదళలసత్ షోడశార్ణం స్వనామ్నా
హాక్షాభ్యాం త్రిఃప్రవీతం లిఖతుపరివృతం తత్ త్రిపాశాంకుశాభ్యామ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మరొకయంత్రము వివరింప బడుచున్నది. షట్కోణ యంత్రము లిఖించి, మధ్యలో ఓం ఠాం (సాధ్యం) లిఖించాలి.

ఉదా – ఓం ఠాం మమాముకం శత్రుం వినాశయ ।

మిగిలిన ఆరుకోణములందు "సహస్రార హుంఫట్"లోని ఒక్కొక్క అక్షరమూ లిఖించాలి. సంధులందు అంగమంత్రము ఆపై షోడశదశ పత్రము లిఖించి" చెప్పబోవు చక్రమంత్రములోని ఒక్కొక్క అక్షరము అందు లిఖించాలి.

దానిబయట వృత్తము లిఖించి, మరల చక్రమంత్రము వ్రాసి వేష్టితం చేయాలి. ఈ యంత్రము చేతియందుంచుకొని జపం చేయాలి. పిమ్మట హోమం చేసి, శేషఘృతమును యంత్రముపై చల్లుచూ, ఆ యంత్రమును గర్భిణులకు ధరింపచేసిన, రక్షాకరముగా నుండును.

మరొక యంత్రము చెప్పబడుచున్నది. షట్కోణము లిఖించి, మధ్యలో సాధ్యసహిత ప్రణవము లిఖించి, ఆరుదళములందు శేషసుదర్శన మంత్రములోని 6 అక్షరములూ లిఖించాలి.

సంధిస్థానములో అంగమంత్రము, నాలుగుకేశరములందు – ఓం నమోనారాయణాయలోని రెండేసి అక్షరములు వ్రాసి, కింజల్కములందు కకాది క్షకారాంతవర్ణములను, పిమ్మట తన పేరును, సాధ్య – కర్మలను మూడు ఆవృత్తములుగా లిఖించి వేష్టితం చేయాలి.

ఉదా – హ లిఖించి సాధ్యనామ స్వనామ – కార్యము లిఖించి క్ష వర్ణము లిఖించినచో, ప్రధమావృత్తి పూర్తి యగును. మరల ఆం లిఖించి సాధ్యనామ – స్వనామ – కార్యము లిఖించాలి. మరల క్రోం లిఖించి సాధ్యనామ – స్వనామ – కార్యము లిఖించాలి ఇది మూడవ ఆవృత్తి యగును.

# చక్రమంత్రము

శ్లో॥ తారం నమో భగవతే మహా సుదర్శనాయ చ
వర్మాస్త్రాంతశ్చక్రమంత్రః షోడశాక్షర ఈరితః ।
చక్రమంత్రమిదం ప్రోక్తం సర్వభీతి నివారణం
క్షుద్రాపమృత్యుశమనం రాజ్ఞాం విజయవర్ధనమ్ ।
రేఖా విలిఖ్యాఽష్ట శిరాంసి తాసా
- మాబధ్యబాహ్యే శృతిశః క్రమేణ ।
స్థానేహృషీ కేశమనుం విభజ్య
పాదాన్లిఖేత్ కోష్ఠ చతుష్టయస్థాన్ ॥
అష్టాక్షరార్ణైః ప్రవిదర్భితాంస్తాన్
కోష్ఠద్వయే చక్రమనుం యథావత్ ।
మధ్యస్థకోష్ఠే విలిఖేత్ ససాధ్యం
స్యాత్ సప్తకోష్ఠాహ్వాయ యంత్రమేతత్ ॥
స్థానేహృషీకేశ తవప్రకీర్త్యా
జగత్ ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశోద్రవంతి
సర్వేనమస్యంతి చ సిద్ధ సంఘాః ॥
ధారితం సప్తకోష్ఠంతత్ త్రాయతే మహతోభయాత్
దుఃస్వప్నదుర్నిమిత్తాది శమనం కీర్తితం బుధైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చక్రమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఓం నమో భగవతే మహాసుదర్శనాయ హుంఫట్।**

పైన చెప్పిన షోడశాక్షర సుదర్శనమంత్రము, క్షుద్రబాధలను - రోగ - పైన చెప్పిన షోడశాక్షర సుదర్శనమంత్రము, క్షుద్రబాధలను - రోగ - గ్రహబాధలను నివారించును. సర్వకార్యసిద్ధిని కలుగజేయును. ఈ క్రింది యంత్రము భూర్జపత్రముపై లిఖించి లేదా రాగిరేకుపై లిఖించి ధరించిన, సమస్త భయములు తొలగిపోవును.




*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*షోడశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ సప్తదశః పటలః

## అథ పురుషోత్తమ ప్రకరణం

శ్లో॥ అథవక్ష్యే జగన్మూలం మంత్రం శ్రీ పురుషోత్తమం
గోపి తంవైష్ణవేతంత్రే భుక్తిముక్తి ఫలప్రదమ్ ।
తారమారరమాబీజం నత్యంతే పురుషోత్తమం
సకలాంతే జగత్ పూర్వం క్షోభణేతి పదం పునః ।

సర్వస్త్రీ హృదయోపేతం విదారణ పదం పునః
తతః పరం త్రిభువన మదోన్మాదకరం తతః ।
సురాసురాంతే మనుజ సుందరీజన శబ్దతః
మనాంసి తాపయద్వంద్వం దీపయ ద్వితయం పునః ।
శోషయద్వితయం భూయో మారయద్వితయం పునః
స్తంభయద్వితయం పశ్చాన్మోహయ ద్వితయం పునః ।
ద్రావయద్వితయం పశ్చాదాకర్షయ యుగంతతః
సమస్త పరమోపేత సుభగేన చ సంయుతమ్ ।
సర్వసౌభాగ్యశబ్దాంతే కరేతి పద సంయుతం
సర్వకామప్రదపదముక్తం హనయుగ్మకమ్ ।
చక్రేణ గదయా పశ్చాత్ ఖడ్గేన తదనంతరం
సర్వబాణైర్భిందయుగం పాశేనేతి పదంతతః ।
కట్టద్వయాంతేఽంకుశేన తాడయద్వితయంపునః
కురుశబ్దద్వయమథో కిం తిష్ఠసి పదం పునః
తావద్యావత్పదస్యాంతే సమీహితమనంతరమ్ ।
తతోమే సిద్ధమాభాష్య భవత్యంతే సవర్మఫట్
నమోఽంతోఽయం మనుః ప్రోక్తో ద్విశతాక్షర సంయుతః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వైష్ణవమంత్రము రహస్యమగుటచే, పురుషోత్తమాది మంత్రములు చెప్పబడుచున్నవి. ఇది జగత్ మూలకారణమైనది. భోగమోక్షములను రెండింటినీ ఇచ్చును. ఇది 200 అక్షరముల మంత్రము.

**మనుః : ఓం క్లీం శ్రీం నమః పురుషోత్తమ అప్రతిరూప లక్ష్మీనివాస సకల జగత్ క్షోభణ సర్వస్త్రీ హృదయ విదారణ త్రిభువన మదోన్మాదకర,**

**సురాసురమనుజ సుందరీ జనమనాంసి, తాపయ తాపయ, దీపయ దీపయ, శోషయ శోషయ, మారయ మారయ, స్తంభయ స్తంభయ, మోహాయ మోహాయ, ద్రావయ ద్రావయ, ఆకర్షయ ఆకర్షయ, సమస్త పరమ సుభగ సర్వసౌభాగ్యకర సర్వకామప్రద అముకం హన హన, చక్రేణ గదయా ఖడ్గేన, సర్వబాణైర్భింద భింద, పాశేన కట్ట కట్టాం కుశేన, తాడయ తాడయ, కురుకురు కిం తిష్ఠసి తావద్ యావత్సమీహితం తతోమే సిద్ధం భవతి హుంఫట్ నమః ॥**

శ్లో॥ జైమినిర్మ్మని రాఖ్యాత శ్ఛందోఽస్యాఽమిత మీరితం
సమస్త జగతామాదిర్ద్దేవతా మాదిర్ద్దేవతా పురుషోత్తమః ।
పురుషోత్తమ శబ్దాంతే వదేత్ త్రిభువనం తతః
మదోన్మాద కరాంతే హుం హృదయం సకలం తతః ।
జగత్ క్షభణ శబ్దాంతే హుం హృదయం సకలం తతః ।
జగత్ క్షోభణ శబ్దాంతే లక్ష్మీదయిత హుం శిరః
మన్మథోత్తమ సంయుక్త మంగజే కామదాయిని ।
హుంశిఖా పరమోపేత సుభగాక్షర సంయుతం
సర్వసౌభాగ్యకర హుం కవచం పరికీర్తితమ్ ।
తతఃపరస్తాద్ హృదయవిదారణ పదం వదేత్ ।
సర్వప్రహరణధర సర్వకామిక తత్పరమ్
హనద్వయం చ హృదయం బంధనాని తతః పరమ్ ।
ఆకర్షయ పదద్వంద్వం మహాబల హమస్త్రకం
త్రిభువనేశ్వరపదం తతః సర్వజనాంతతః ।
మనాంసి హనయుగ్మాంతే దారయద్వితయంచమే
వశమానయ హుంనేత్రం తారాద్యాః ఫట్ నమోఽంతికాః
షడంగమంత్రాః సందిష్టాః నేత్రాంతాస్తంత్రవేదిభిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - జైమిని ఋషిః । అమిత ఛందః । ఓంబీజం - హుం శక్తిః । సమస్త జగదాది కారణపురుషోత్తమో దేవతా ।

షడంగన్యాసమిట్లాచరించవలయును.

1. ఓం పురుషోత్తమ త్రిభువనమనోన్మాదకర హుం- హృదయాయ నమః
2. ఓం సకల జగత్క్షోభణ లక్ష్మీదయితహుం - శిరసే స్వాహా ।
3. ఓం మన్మథోత్తమ అంగజే కామదాయినిహుం - శిఖాయైవషట్ ।
4. ఓం పరమసుభగాక్షర సర్వసౌభాగ్యకరహుం - కవచాయహుమ్ ।
5. ఓం సురాసుర మనోజ సుందరీ హృదయ బంధనాని
ఆకర్షయ ఆకర్షయ మహాబల హాం - అస్త్రాయ ఫట్ ।
6. ఓం త్రిభువనేశ్వర సర్వజనమనాంసి హనహన దారయ
దారయ వశమానయ హుంఫట్ నమః - నేత్ర ద్వయాయ వౌషట్ ।

ఈ షడంగన్యాసము "నేత్రాంతన్యాసము"గా చేయవలెనని తంత్ర వేత్తలు శాసించినారు.

శ్లో॥ త్రైలోక్య మోహనార్ణాంతే హృషీకేశ పదంపునః
పశ్చాదప్రతిరూపాది మన్మథానంతరం వదేత్ ।
సర్వాదిస్త్రీపదం పశ్చాద్ హృదయాకర్షణం తతః
ఆగచ్ఛాఽగచ్ఛమంత్రోఽయం తారాద్యో నమసాఽన్వితః
అనేన మనవా కృత్వా వ్యాపకం న్యస్య బాహుషు
అష్టాయుధాని ముద్రాభిర్మంత్రైః సార్థం విచింతయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు వ్యాపక ముద్రా మంత్రము చెప్పబడుచున్నది. దీనిని పఠించుచూ, అష్టాయుధములను - అష్టముద్రలను ధ్యానించాలి.

**మనుః - ఓం త్రైలోక్యమోహన హృషీకేశాప్రతిరూప మన్మథ, సర్వ స్త్రీ హృదయాకర్షణ ఆగచ్ఛ ఆగచ్ఛ।**

పిమ్మట వ్యాపకముద్రతో బాహువులందు న్యాసము చేసి ఈ క్రింది ధ్యానము చేయాలి.

## జగన్నాథ ధ్యానము

శ్లో॥ క్షీరాంభోనిధిమధ్యస్థం నిరంతరసుమద్రుమం
ఉద్యదర్కేందు కిరణ దూరీకృతతమోభరమ్ ।
కాలమేఘసమాలోక నృత్యద్బర్హి కదంబకం
ఉత్ఫుల్లకుసుమామోద ప్రహృష్యద్ భృంగసంకులమ్ ।
కూజత్ కోకిల సంఘేన వాచాలిత దిగంతరం
నానా కుసుమ సౌరభ్య వాహిదంధ వహాన్వితమ్ ।
కల్పవల్లీనికుంజేషు క్రీడత్ సిద్ధకదంబకం
దేవ గంధర్వ కన్యాభిర్గాయంతీ భిరలంకృతమ్ ।
అనేక దీర్ఘి కాయుక్తముద్యానం మహదద్భుతం
తస్యమధ్యేమణిమయే మండపేతోరణాన్వితే ।
ఋతుభిః షడ్భిరనిశం సేవితస్య మహీయసః
సురద్రుమస్య మూలస్థే మహాసింహాసనే శుభే ।
రక్తారవిందమధ్యస్థ గరుడోపరి సంస్థితం
ధ్యాయేద్వల్లభయాసార్థం జగన్నాథం జగన్మయమ్ ।

☞ **దేవం శ్రీపురుషోత్తమం కమలయా స్వాంకస్థయా పంకజం
బిభ్రత్యా పరిరబ్ధమంబుజరుచా తస్యాం నిబద్ధేక్షణమ్।
ధ్యాయేచ్ఛేతసి శంఖపాశము సలాంశ్చాపేషు ఖడ్గాన్ గదాం
హస్తై రంకుశ ముద్వహంతమరుణం స్మేరారవిందాననమ్॥**

200 అక్షరముల మంత్రమును నాలుగు లక్షలు జపించి, అర్థచంద్ర కుండమునందు, జాజి, కమల, యవలతో దశాంశ హోమమాచరించి బ్రాహ్మణ భోజనం జరపాలి. ఈ క్రింది వైష్ణవ గాయత్రీ మంత్రముతో, తనను, యజ్ఞసామగ్రిని శుద్ధిచేయాలి.

**త్రైలోక్య మోహనాయ విద్మహే స్మరాయ ధీమహి తన్నోవిష్ణుః ప్రచోదయాత్ ॥**

**"పక్షిరాజాయ స్వాహా" అను మంత్రముతో ఆసనం కల్పించాలి.**

## లక్ష్మ్యాది మంత్రములు

శ్లో॥ భృగుర్లాంత యుతః సేందుర్బీజం దేవ్యాః ప్రకీర్తితం
కర్ణికాయాం యజేదాదౌ విధానేనాంగదేవతాః ।
దళేషు పూజయేద్ పశ్చాల్లక్ష్మ్యాద్యాధృతచామరాః
ముక్తాహారలసచ్చారు పయోధర భరానతాః ।
జపాకుసుమసంకాశా మదవిభ్రమ మంథరాః
హ్రస్వత్రయ క్లీబసర్గ రహితస్వర శోభితమ్ ।
దేవీ బీజం క్రమాదాసాం మంత్రమాహుర్మనీషిణః
దళాగ్రేషు యజేచ్ఛంఖం శార్ంగం చక్రమసింగదామ్ ।
అంకుశం ముసలం పాశమేతాన్యస్త్రాణి శార్ంగిణః
స్వముద్రాభిః మనుభిః కథ్యంతే మనవఃక్రమాత్ ।
ఆద్యోజలచరాయాంతే ఠద్వయ మనురీరితః
శార్ంగాయ సశరాయాంతే స్వాహాంతోఽనంతరోమనుః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట మూలమంత్రముతో మూర్తికల్పనచేసి, వ్యాపకమంత్రముతో ఆవాహనచేసి, "వ్యం" అను లక్ష్మీ

దేవి బీజమంత్రముతో, మహావిష్ణువు అంకమందున్న లక్ష్మీదేవిని అర్చించాలి.

పిమ్మట నాలుగుదిశల అంగదేవతలను, పత్రములందు లక్ష్మీ మొదలగు శక్తులను, చామరధారిణులను అర్చించాలి. వీరు ముత్యాల హారములతో, జపాపుష్పమువంటి ఎర్రని దేహకాంతితో మదవిభ్రములై, పీనపయోధరములతో అందముగా నుందురు.

ఆ – ఈ – ఊ – ఏ – ఐ – ఓ – ఔ – అం – అను ఎనిమిది అక్షరములు, 8 దేవీశక్తుల బీజమంత్రములగుచున్నవి.

ఇపుడు పత్రాగ్రభాగములందు, శంఖ – శార్ంగధను – చక్ర – ఖడ్గ – గదా – అంకుశ – ముసల – పాశములను పూజించాలి. వీటిని ఆయా ముద్రలతో, ఆయా మంత్రములతో అర్చించాలి.

శంఖమంత్రము – జలచరాయ స్వాహా ।

ధనుర్మంత్రము – శార్ంగాయ సశరాయ స్వాహా ।

చక్ర మంత్రము – సుదర్శన మహాచక్ర దహ దహ సర్వదుష్ట భయం కురుకురు, ఛింది ఛింది, విదారయ విదారయ, పరమంత్రాన్గ్రసగ్రస – భక్షయ భక్షయ, త్రాసయ త్రాసయ హుంఫట్ చక్రాయ నమః ।

ఖడ్గమంత్రము – హుంఖడ్గ తీక్షణ ఛిందఛింద

గదామంత్రము – కౌమోదకి మహాబలే సర్వసురాంతకి ప్రసీద ప్రసీద హుంఫట్ స్వాహా ।

అంకుశమంత్రము – అంకుశ కట్ట కట్ట హుం ।

ముసలమంత్రము – సంవర్తక ముసల పోథయ పోథయ హుం ఫట్ స్వాహా ।

పాశమంత్రము – పాశైర్బంధబంధ ఆకర్షయ ఆకర్షయ స్వాహా।

శ్లో॥ హయారి కుసుమైర్దేవ మర్చయిత్వా యథావిధి
శశిప్రసూనైర్జుహుయా దష్టోత్తర సహస్రకమ్ ।
మాసమాత్రేణ వశగాస్తస్యస్యుః సకలాన్నృపాః
హుత్వాబిల్వఫలైః పక్వైః శ్రియం విందే దనిందితామ్ ।
ప్రఫుల్లైరరుణాంభోజైస్తామేవ లభతే పునః
హుత్వాజ్యోతిష్మతీతైలం సహస్రం వసుసంఖ్యకమ్ ।
సుభగో జాయతే సమ్యక్ సర్వేషాం నాత్రసంశయః
విధానేనాఽమునా మంత్రీ మహారోగాత్ ప్రముచ్యతే ।
అశ్వత్థసమిధాం హోమః పరాహృత ధనప్రదః
ఆజ్యాక్త దూర్వాహోమేన ముచ్యతే మహతో భయాత్ ।
యస్య నామయుతం మంత్రం జపేదయుత సంఖ్యయా
సభవేద్దాసవత్ తస్య నాత్ర కార్యావిచారణా ।
బహునాకిమిహోక్తేన మనునాసాధకోత్తమః
సాధయేత్ సకలాన్ కామాన్ సాక్షాద్విష్ణురివాపరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – గన్నేరు పూలతో, కుముదములతో 1008 సార్లు హోమం ఒక నెల ఆచరించిన, సమస్త రాజగణము (అధికారులు) వశమగుదురు. బిల్వహోమమువలన కీర్తి లభించును. జ్యోతిష్మతీ తైలముతో 1008 సార్లు హోమం చేసిన, సౌభాగ్యము సిద్ధించును. రోగబాధ నివర్తించును.

రావి సమిధల హోమంవలన సంపద, దూర్వాహోమం వలన భయనివారణము కలుగును. మంత్రము సాధ్యవ్యక్తి నామము సంపుటము చేసి 10వేలు జపించిన, అతడు దాసుడగును. ఇందు సంశయము లేదు. సాధకుడు సమస్త సిద్ధులూ పొందును.

# శ్రీకర మంత్రము

శ్లో॥ ఉత్తిష్ఠ పదమాభాష్య శ్రీక్రోధీశహుతాశనౌ
వహ్నిజాయా వథిర్మంత్రో వస్వక్షర సమన్వితః ।
ఋషిరస్య భవేద్వామః పంక్తి శ్ఛంద ఉదాహృతం
శ్రీకరాఖ్యో హరిః ప్రోక్తో దేవతాఽస్య మనీషిభిః ।
హృదయం భీషయ ద్వంద్వం త్రాసయ ద్వితయం శిరః
శిఖాప్రమర్దయయుగం వర్మ ప్రధ్వంసయ ద్వయమ్ ।
అస్త్రం రక్షయుగం సర్వే హుమంతాః సముదీరితాః
మూర్ధ్ని నేత్రద్వయే కంఠ హృదయోదరయోః పునః ।
ఊరు జంఘా పదద్వంద్వే మంత్రవర్ణాన్ ప్రవిన్యసేత్
ముఖేన్యసేద్ బ్రాహ్మణోఽస్య ముఖమాసీ దిమంమనుమ్
బాహూరాజన్యః కృతోఽయం న్యస్తవ్యోబాహుయుగ్మకే
పాదద్వయే న్యసేన్మంత్రం పద్భ్యాం శూద్రో న్యసేత్ ।
పాదద్వయే న్యసేన్మంత్రం పద్భ్యాం శూద్రో న్యసేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు అష్టాక్షర శ్రీకరమంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : ఉత్తిష్ఠ శ్రీకర స్వాహా।**

వామదేవ ఋషిః । పంక్తి ఛందః । విష్ణుర్దేవతా । ఓం బీజం - స్వాహా శక్తిః ।

భీషయ భీషయ హుం - హృదయాయ నమః ।
త్రాసయ త్రాసయ హుం - శిరసే స్వాహా ।
ప్రమర్దయ ప్రమర్దయ హుం - శిఖాయై వషట్ ।

ప్రధ్వంసయ ప్రధ్వంసయ హుం - కవచాయ హుమ్ ।

రక్ష రక్ష హుం - అస్త్రాయ ఫట్ ।

అని పంచాంగన్యాసము చేసి, మంత్రములోని 8 అక్షరములనూ, శిరో - 2 నేత్ర - కంఠ - హృదయ - ఉదర - ఊరు - 2 జంఘలయందు న్యాసం ఆచరించాలి. పిమ్మట

బ్రాహ్మణోఽస్యముఖమాసీత్ - ముఖమునందు,

బాహూరాజన్యః కృతః - 2 బాహువులందు,

ఊరూతదస్య యద్వైశ్యః - 2 తొండలయందు,

పద్భ్యాంశూద్రో అజాయత - 2 పాదములందు,

చక్ర - శంఖ - గదా - పద్మముద్ర, మంత్రములతో చేతి అగ్రభాగమునందు న్యాసమాచరించాలి. పిమ్మట గరుడారూఢుడైన విష్ణువును, ఇలా ధ్యానించాలి.

## పురశ్చరణ విధానము

శ్లో॥ అష్టలక్షం జపేన్మంత్రీ మంత్రమేనం దశాంశతః
బిల్వక్షీరద్రుమోత్థాభిః సమిద్భిరరుణాంబుజైః ।
పయోఽన్నైః సర్పిషాహుత్వా గురుంసంతోషయేద్ధనైః
మూర్త్తౌమూలేన క్లప్తాయాం పూజయేద్దేవమన్వహమ్ ।
అంగాన్యాదౌ కేసరేషు దిక్ పత్రేషు సమర్చయేద్
శ్రియం రతిం ధృతిం కాంతిం లీలాపంకజ ధారిణీః ।
పీతారుణాశ్యామనీలా విదిక్ పత్రేషు పూజయేత్
వాసుదేవాదికాః మూర్త్తిః పార్శ్వయోర్నిధియుగ్మకమ్ ।
విష్వక్సేనం యజేదీశే లోకపాలానవంతరం
ఏవం సంపూజ యేద్దేవం సాధయేదిష్ట మాత్మనః ।

దూర్వాచరుభ్యాం సాజ్యాభ్యాం జహుయాదయుతంబుధః
సంపాతితం చరోంపశ్చాత్సాధ్యో భుంజీత సాధితమ్ ।
బిల్వవృక్ష సమిద్ధోమాత్ సాక్షాద్ధనపతిర్భవేత్
పూగపుష్పసమయుక్తై స్తండులై ర్మధురోక్షితైః ।
జుహుయాదచిరాదేవ సంపదాం జాయతే నిధిః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పై అష్టాక్షర మంత్రమును 8 లక్షలు జపించి, బిల్వక్షీరవృక్ష (రావి - మేడి - మర్రి) సమిధలతో, కమలములతో దశాంశ హోమం ఆచరించాలి. లేదా ఘృతమిశ్రిత పాయసం హోమం చేసి, గురుసత్కారం చేయాలి.

పిమ్మట మూలమంత్రముతో మూర్తికల్పన - కేసరములందు అంగపూజ - నాలుగుదిశలందు కమలములు ధరించిన, శ్రీరతి - ధృతి - కాంతి శక్తులను అర్చించాలి.

ఈశాన్య కోణమందు విష్వక్సేనుని పూజించి, లోకపాలురను, వారి ఆయుధములను పూజించాలి. ఆజ్యయుక్త దూర్వా, మరియు పాయస హోమము 10 వేలు ఆచరించి, హుతశేషము ప్రత్యేకముగా ఒక పాత్రలో వేయుచూ, హోమానంతరం దానిని సాధకుడు సేవించాలి.

ఇట్లు ఆచరించిన అపమృత్యుదోషము తొలగును. మారేడు సమిధల హోమంవలన ధనవృద్ధి - త్రిమధుర మిశ్రిత పూగ పుష్ప (వక్క), తండుల హోమం వలన అష్టైశ్వర్యములూ కలుగును.

శ్లో॥ ఆజ్యేన జుహుయాల్లక్షం పరాన్ జయతిపార్థివః
అబ్జసూత్రం భుజేబద్ధం మధునాఽనేన సాధితమ్ ।
రోగామృత్యుదుఃఖాని నాశయేన్మాత్ర సంశయః
జలాంజలిభిరాత్మాన మభిషించే ద్దినేదినే ।

స్నానకాలేషు సభవేత్ సౌభాగ్యశ్రీసమృద్ధిమాన్
ఊర్ధ్వబాహుద్వమో మంత్రీ పశ్యన్నాదిత్య మండలం ।
సహస్రమానం ప్రజపేన్నిత్యం నిశితధీర్మనుమ్
సర్వేమనో రథాస్తస్య సిద్ధేయుర్నాత్ర సంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – నేతితో ఒక లక్ష హోమము చేసిన యుద్ధమునందు విజయము లభించును. అభిమంత్రిత కమల సూత్రమును చేతికి ధరించిన రోగ – అపమృత్యు – దుఃఖములు నశించును.

స్నానము చేయునపుడు, ఈ మంత్రమును పఠించినచో, అజలి యందు నీటిని ధరించి మంత్రించి తనపై పోసుకొనుచుండినచో సకలవిధ శుభములూ కలుగును.

రెండు చేతులూ పైకెత్తి, సూర్యబింబమును చూచుచూ, ఈ మంత్రము పఠించుచూ నమస్కారము చేయుచూ సహస్రజపము చేసిన, సమస్త మనోరథములూ సిద్ధించును.

## గోపాల మంత్రము

శ్లో॥ కృష్ణాయ పదమాభాష్య గోవిందాయ తతః పరం
గోపీజనం పదస్యాంతే వల్లభాయ ద్విఠావధిః ।
కామబీజాది రాఖ్యాతో మనురష్టా దశాక్షరః
నారదోఽస్యమునిః ప్రోక్తో గాయత్రం ఛంద ఉచ్యతే ।
దేవతా కథితః కృష్ణః సర్వకామఫలప్రదః
చతుఃకరణవేదాబ్ధి నేత్ర సంఖ్యాక్షరైః క్రమాత్ ।
పంచాంగాని మనోః కుర్యాన్మంత్ర విజ్ఞాతి సంయుతైః
మంత్రమేనం యథాన్యాయ మయుతద్వితయం జపేత్ ।

జుహుయాదరుణాంభోజై స్తద్దశాంశసమాహితః
వైష్ణవే పూజయేత్పీఠే యథావత్ దేవకీ సుతం ।
అంగావరణమారాధ్య పత్రేషు ప్రయజేత్ ప్రియాః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు అష్టాదశాక్షర గోపాల మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః : క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా।**

నారద ఋషిః । గాయత్రీ ఛందః । క్లీంబీజం – స్వాహా శక్తిః । మంత్రములోని 4+4+4+4+2 అక్షరములతో పంచాంగ న్యాసమాచరించి ఇలా ధ్యానించాలి.

☞ **స్మరేద్ వృందావనే రమ్యే మోహయంతం మనోరమం**
**గోవిందం పుండరీకాక్షం గోపకన్యాః సహస్రశః।**
**ఆత్మనో వదనాంభోజ ప్రేషితాక్షి మధువ్రతాః**
**పీడితాః కామబాణేన చిరమాశ్లేషణోత్సుకాః।**
**ముక్తాహార లసత్పీత తుంగస్తన భరానతాః**
**స్రస్తధమ్మిల్లవసనా మదస్ఖలిత భాషణాః।**
**దంతపంక్తి ప్రభోద్భాసి స్పందమానాధరాంచితాః**
**విలోభయంతీర్వి విధైర్విభ్రమై ర్భావగర్భితైః।**

☞ **ఫుల్లేందీవరకాంతి మిందువదనం బర్హావతంసప్రియం**
**శ్రీవత్సాంక ముదారకౌస్తుభధరం పీతాంబరం సుందరమ్।**
**గోపీనాం నయనోత్పలార్చిత తనుం గోగోపసంఘావృతం**
**గోవిందంకలవేణు వాదనపరం దివ్యాంగ భూషంభజే॥**

పై మంత్రమును, 20 వేలు జపించి, కమలములతో దశాంశ హోమ మాచరించాలి. వైష్ణవపీఠమందు అంగపూజ ఆచరించాలి.

శ్లో॥ కాళిందీ నగజిత్యాఖ్యా మిత్రవిందా తతఃపరం
చారుహాసిన్యథ పరా రోహిణీ జాంబవత్యథ ।
రుక్మిణీ సత్యభామేతి కథితాశ్చాయరు భూషణాః
పీతాంబరధరాః సౌమ్యాః కరాంబుజ ధృతాంబుజాః ।
ఐరావతాదీనభ్యర్చ్యేత్ గజానష్టౌ తతోబహిః
లోకపాలాన్ యజేన్మంత్రీ వజ్రాద్యస్త్రాణి తద్బహిః ।
ఇతి సంపూజయేద్దేవం గోవిందం జగతాం పతిమ్
లక్ష్మీప్రసూనైర్జుహుయాత్ శ్రియమిచ్ఛన్న నిందితామ్ ।
సాజ్యేనాఽన్నేన జుహుయా దాజ్యాన్నస్య సమృద్ధయే
ఆరణ్యైః కుసుమైర్విప్రాన్ జాతిభిః పృథివీపతీన్ ।
ప్రసూనైరసితైర్వైశ్యాన్ శూద్రాన్నీలోత్పలైర్నవైః
వశయేల్లవణైః సర్వాన్ పంకజైర్వనితాజనాన్ ।
గోశాలాసుకృతో హోమః పాయసేన ససర్పిషా
గవాంశాంతిం కరోత్యాశు గోవిందో గోకుల ప్రియః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శ్రీకృష్ణుని అష్టభార్యలను, అష్టదళములందు అర్చించాలి. 1. కాళింది 2. నాగ్నజితి 3. మిత్రవింద 4. చారుహాసినీ 5. రోహిణి 6. జాంబవతి 7. రుక్మిణి 8. సత్యబామ. వీరంతా ఉత్తమాభరణములు, పట్టుబట్టలు ధరించి - చేతులందు కమలములు ధరించి యుందురు.

పిమ్మట దళములబయట ఐరావతాది 8 గజములను (8 పటలము నందు చెప్పబడినది) పూజించాలి. పిమ్మట లోకపాలురను - వారి ఆయుధములను అర్చించాలి. కురకవృక్ష పుష్పములతోను, ఆజ్యాన్నము తోను హోమమాచరించిన, సంపదవృద్ధి చెందును.

అరణ్యమునందలి పూలతో హోమం చేసిన బ్రాహ్మణవశ్యము జాజిపూల హోమమువలన రాజవశ్యము - హోమం వలన వైశ్యవశ్యము - నీలోత్పలహోమం వలన శూద్రవశ్యము సిద్ధించును. లవణహోమంచేత సర్వవశ్యము, పంకజ హోమమువలన స్త్రీవశ్యము సిద్ధించును.

ఘృతయుక్త పాయసము గోశాలయందు హోమము చేసిన, గోశాంతి జరుగును. గోపాలుని అనుగ్రహము కలుగును.

## గోపాల యంత్రము

శ్లో॥ పిండంమూలేనవీతం దహన పురయుగే కోణరాజద్రసార్ణే
కుర్యాత్ పద్మం దశార్ణ స్ఫురిత దశదలం కామబీజేన వీతమ్
పద్మం కింజల్క సంస్థం స్వరవికృతి దలంప్రోల్లసత్ షోడశార్ణం
కింజల్కం వ్యంజనాఢ్యం వికృతియుగదలే ష్వర్పితానుష్టుబర్ణమ్॥
పాశాంకుశాభ్యామావీతం క్షౌణీపురయుగస్త్రిషు
అష్టాక్షరేణలసితం యంత్రం గోవిందదైవతమ్ ।
ధర్మార్థకామఫలదం సర్వరక్షాకరం స్మృతం
పంచాంతకో ధరేరస్థో మనుబిందు విభూషితః ।
పిండ బీజమిదం ప్రోక్తం సర్వసిద్ధి కరం పరమ్ ॥
స్మరః కృష్ణాయ తద్వంద్వం షడర్ణోమనురీరితః
గోపీజనాంతే ప్రవదేత్ వల్లభాయాఽగ్నిజుందరీ ।
అయందశాక్షరో మంత్రో దృష్టాదృష్టఫలప్రదః
ప్రణవం హృదయం కృష్ణం జేంతముక్త్వాతతఃపరం ।
తాదృశం దేవకీపుత్రం హుంఫట్ స్వాహా సమన్వితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణము లిఖించి - దానిపై దశదళ పద్మము - దానిపై వృత్తముపై షోడశదళపద్మము -

దానిపై 32 దళముల పద్మము దానిపై భూపురము నిర్మించాలి. షట్కోణ మధ్యమందు మూలమంత్రముతో సంపుటితము చేసిన పిండమంత్రము (గ్లౌం) లిఖించాలి.

షట్దళములందు ఈ షడక్షరమంత్రము లిఖించాలి. **క్లీం కృష్ణాయ స్వాహా**। దళములందు ఈ దశాక్షరమంత్రము లిఖించాలి - గోపీజన వల్లభాయ స్వాహా । షోడశ దళములందు కేసరములలో 16 అచ్చులు, దళములందు ఈ క్రింది మంత్రమును లిఖించాలి. **ఓం నమో కృష్ణాయ దేవకీపుత్రాయ హుంఫట్ స్వాహా** ।

పిమ్మట 32 దళములందు 32 హల్లులను ఈ క్రింది అనుష్టుప్ మంత్రమును లిఖించాలి.

**గ్లౌం క్లీం నమోభగవతే నందపుత్రాయ**
**బాలాది వపుషే శ్యామలాయ గోపీజనవల్లభాయ స్వాహా** ॥

పిమ్మట భూపురమందు రెండు కోణములలో "ఆం క్రోం క్లీం కృష్ణాయ గోవిందాయ" అని లిఖించాలి.

ఈ యంత్రము ధర్మార్థ కామముల మూడింటినీ సిద్ధింప చేయును.

## కామలింగ యంత్రము

శ్లో॥ ప్రాక్ప్రత్యగ్ దక్షిణోదగ్విథివదభిలిఖేత్ స్పష్టరేఖాచతుష్కం
కోణోద్యచ్ఛూలయుక్తం వలయయుగయుతం మధ్యపూర్వం తదంతమ్।
శ్లోకస్యాఽర్ణాన్ పరస్తాద్వసుపద వివరేష్వష్టవర్ణాన్ లిఖిత్వా
తద్బాహ్యే ద్వాదశార్ణైస్తదను పరివృతం దేవకీపుత్ర యంత్రమ్॥
తంసుకీదేవదేవే తంతందేవే వరతో రతం
తంరతో రుటతో ఖ్యాతం తంఖ్యాతం దేవకీసుతమ్ ।

లిఖితం భూర్జపత్రాదౌ యంత్రమేతద్యథావిధి
విధృతం బాహు నా నిత్యం సర్వకామ ఫలప్రదమ్ ।
పలాశ వృక్షఫలకే లిఖితం సాధు సాధితం
గోష్ఠానే నిఖనేదేతత్ గవాంవృద్ధిర్భవేత్ సదా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ యంత్రము భూర్జపత్రముపై లిఖించి పూజించి, చేతికి ధరించిన అభీష్టము సిద్ధించును. మోదుగ బెరడుపై ఈ యంత్రము లిఖించి గోశాలలో పాతిపెట్టిన, గోసమృద్ధి జరుగును.

యంత్రము ఈ విధముగా నుండును.




# సర్వతోభద్ర యంత్రం

శ్లో॥ శ్లోకం చతుష్షష్టి పదేషు భూర్జే
శివాది దైత్యాది లిఖేత్క్రమేణ ।
తత్సర్వతో భద్రమితి ప్రసిద్ధం
యంత్రంయశః శ్రీవిజయ ప్రదాయి ॥
ఫలకే ఖాదిరే క్లప్తం గవాం గోష్ఠే నివేశితం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - భూర్జపత్రముపై తొమ్మిది నిలువు రేఖలు, తొమ్మిది అడ్డరేఖలు లిఖించి, 64 గడులు ఏర్పరచాలి. అన్నిటికీ చివర త్రిశూల రేఖ లేర్పరచాలి. ఈశాన్య కోణగడినుండి ఈ క్రింది 32 అక్షరముల ఈ శ్లోకం లిఖించాలి.

క్షీరగోపయగోరక్షీరక్షమా క్షక్షక్షమాక్షర
గోమానోగ గనోమాగో పక్ష గక్ష క్షగక్షప ॥

మరల నైఋతి కోణమునుండి నైరుతి పర్యంతము ఇదే శ్లోకము లిఖించాలి. ఈ యంత్రము కీర్తిని, కార్యసిద్ధిని కలిగించును.

చంద్రచెక్కపై ఈ యంత్రము లిఖించి, గోశాలయందు పాతిపెట్టినచో గోవులకు - పశువులకు రక్షగా యుండును. గోసమృద్ధి జరుగును.

## ఏకాక్షర కామమంత్రము

శ్లో॥ బ్రహ్మ భూమ్యం సమాసీనః శాంతిబిందు సమన్వితః
బీజం మనోభువఃప్రోక్తం జగత్త్రితయమోహనమ్ ।
ఋషిః సమ్మోహనః ప్రోక్తో గాయత్రం ఛంద ఈరితం
సర్వసమ్మోహనః సాక్షాద్ దేవతా మకర ధ్వజః ।
బీజేన దీర్ఘయుక్తేన షడంగవిధి రీరితః
లక్షత్రయం జపేన్మంత్రం మధురత్రయ సంయుతైః ।
పుష్పైః కింపుకజైః ఫుల్లైర్జుహుయాత్తద్దశాంశతః
వక్ష్యమాణే యజేత్ పీఠే విధినామకరధ్వజమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు ఏకాక్షర మన్మథ బీజము చెప్పబడుచున్నది.

**మనుః** : క్లీం।

సమ్మోహనఋషిః। గాయత్రీ ఛందః। మకరధ్వజో దేవతా। కంబీజం, ఈంశక్తిః। క్లాం – క్లీం – క్లూం – క్లేం – క్లైం – క్లోం – క్లౌం బీజములతో షడంగన్యాసములు సర్వాంగన్యాసం చేయాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

☞ **జపారుణం రత్నవిభూషణాఢ్యం**

**మీనధ్వజం చారుకృతాంగరాగమ్।**

**కరాంబుజైరంకుశమిక్షు చాపం**

**పుష్పాస్త్రపాశౌ దధతంభజామి॥**

పై ఏకాక్షర మంత్రము మూడులక్షలు జపించి, మధురత్రయయుక్త మోదుగ పుష్పములతో, దశాంశహోమం ఆచరించాలి. పిమ్మట పీఠపూజలో ఈ అంగశక్తుల నారాధించాలి.

శ్లో॥ మోహినీ క్షోభిణీ త్రాసా స్తంభిన్యాకర్షిణీ పునః
ద్రావిణ్యున్మాదినీ క్లిన్నాక్లేదిన్యః పీఠశక్తయః।
బీజాద్యమాసనం దత్వా మూర్తింమూలేన కల్పయేత్
ఇష్ట్వాంగా వరణంపూర్వం మధ్యేదిక్షుయజేచ్ఛరాన్।
ద్రామాద్యంశోషణం పూర్వం ద్రీమాద్యం మోహనంతతః
సందీపనాఖ్యం క్లీమాద్యం బ్లూమాద్యం తాపనంతతః।
సర్గాంతభృగుణా భూయో మాదనంపంచమంతతః

.................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మన్మథుని 9 శక్తులను పీఠమందర్చించాలి. 1. మోహిని 2. క్షోభిణి 3. త్రాసా 4. స్తంభినీ 5. ఆకర్షిణి 6. ద్రావిణీ 7. ఉన్మాదినీ 8. క్లినా 9. క్లేదినీ.

"క్లీం కామయోగపీఠాయ నమః" అను మంత్రముతో ఆసనపూజ చేయాలి. పిమ్మట మూలమంత్రముతో మూర్తి కల్పన చేయాలి. కర్ణికల

యందు అంగావరణ పూజచేసి 4 దిశలందు, మధ్యలో కామదేవుని పంచబాణ దేవతలను అర్చించాలి.

తూర్పుదిశలో ద్రాం శోషణాయ నమః, దక్షిణమున ద్రీం మోహనాయ నమః, పశ్చిమమున క్లీం సందీపనాయ నమః, ఉత్తరమున బ్లూం తాపనాయ నమః, మధ్యలో సః మాదనాయ నమః అని బాణ దేవతలనర్చించాలి. వీరంతా ఒక చేతితో ప్రణామము చేయుచూ మరొక చేతిలో బాణము ధరించి యుందురు.

పిమ్మట, మన్మధుని 8 శక్తులను మధ్యయందర్చించాలి. క్లీం బీజం చేర్చాలి. 1. అనంగరూపా 2. అనంగ మదనా 3. అనంగ మన్మథా 4. అనంగ కుసుమా 5. అనంగమదనాతురా 6. అనంగ శిశిరా 7. అనంగ మేఖలా 8. అనంగ దీపికా.

వీరంతా ఎర్రని కమలములు ధరించి, మందస్మిత వదనులై యుందురు. ఆపై షోడశదళ పద్మమునందు మన్మధుని ఈ క్రింది 16 శక్తులను అర్చించాలి.

1. యువతి 2. విప్రలంభ 3. జ్యోత్స్న 4. సుభ్రూ 5. మదద్రవా 6. సురతా 7. వారుణీ 8. లీలా 9. కాంతి 10. సౌదామిని 11. కామఛత్రా 12. చంద్రరేఖా 13. శుక్లీ 14. మదనా 15. జ్యోతి 16. మాయావతీ వీరంతా కల్హారములు ధరించి యుందురు.

ఆపై షోడశదళ అగ్రభాగమునందు మన్మథుని పరిచారకుల నర్చించాలి. 1. శోక 2. మోహన 3. విలాస 4. విభ్రమ 5. మదనాతుర 6. అపత్రప 7. యువ 8. కామీ 9. చూతపుష్ప 10. రతిప్రియ 11. గ్రీష్మ 12. తపాంత 13. ఊర్జ 14. హేమంత 15. శిశిర 16. మద. వీరంతా ధనుర్బాణములు ధరించి ఆభరణములతో అలంకరించుకొని యుందురు.

పిమ్మట 8 దిశలందు 8 రతిప్రియులను అర్చించాలి. 1. పరభృత (కోకిల) 2. సారస 3. శుక్ర 4. మేఘ 5. అపాంగ 6. భ్రూవిలాస 7. హావ 8. భావములు.

పిమ్మట 4 కోణములందు మాధవి - మాలతి - హరిణాక్షి - మదోత్కటలనే రతీదేవి పరిచారికలనర్చించాలి. వీరు తెల్లని చామరములు ధరించి, అలంకారవతులై యుందురు. చివరగా లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి.

దధితో తడిపిన అశోక పుష్పములను 3 రోజులు 1008 సార్లు చొప్పున హోమమాచరించిన జగద్ వశ్యము సిద్ధించును. గోఘృతముతో 108 సార్లు హోమం చేయుచూ, శేషఘృతమును, ఒకపాత్రలో వేయుచూ దానిని, సేవించిన సాధ్యవ్యక్తి దాంపత్యము అనురాగవంతముగా యుండును.

దధి సహిత పేలాలు 1008 సార్లు హోమం చేసిన ఇష్టపడిన కన్యతో వివాహమగును.

## జగన్మోహన యంత్రము

శ్లో॥ కామోల్లాసిత మధ్యమంగవిలసత్ షట్కోణమేతద్బహిః
గాయత్ర గుణవర్ణ వద్వసుదళం మాలామనోరక్షరైః ।
షట్సంఖ్యైః సహితాష్ట పత్ర సహితం క్షౌణీపురేణావృతం
కోణన్యస్త మనోభవేన కథితం యంత్రం జగన్మోహనమ్ ॥
కామదేవాయ శబ్దాంతే విద్మహే జేంతమీరయేత్
పుష్పబాణం ధీమహిస్యాత్ తన్నోఽనంగః ప్రచోదయాత్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణము లిఖించి, మధ్యలో క్లీం సహిత, సాధ్యసాధక, కర్మ లిఖించాలి. షట్ కోణములందు క్లాం - క్లీం - ఇత్యాది లిఖించి, బయట నున్న అష్టదళమందు ఈ కామగాయత్రిలోని మూడేసి అక్షరములు లిఖించాలి.

## కామ గాయత్రి

**కామదేవాయ విద్మహే పుష్పబాణాయ ధీమహి**

**తన్నో౽నంగః ప్రచోదయాత్** ॥

పిమ్మట ఈ క్రింది మాలామంత్రములోని ఆరేసి అక్షరములు పత్రాగ్ర భాగములందు లిఖించాలి.

**మూలామంత్రము : నమః కామదేవాయ, సర్వజన ప్రియాయ, సర్వజన సంమోహనాయ జ్వల జ్వల, ప్రజ్వల సర్వజనస్యహృదయం మమ వశ్యం కురు కురు స్వాహా**।

పిమ్మట భూపురమునందు కోణములలో క్లీం బీజము లిఖించాలి.

## వశ్యకర యంత్రము

శ్లో॥ సాధ్యాఖ్యా పుటితైః స్మరైః పరివృతం కామంలిఖేన్మధ్యతః
పశ్చాత్తార వికారపక్షకపరాన్నాసార్ధి క్షింటీశఘూన్ ।
శూలాధ్యాష్టదళేషు సాధువిలిఖేత్తాంబూల పత్రోదరే
యంత్రంయాంనిశి ఖాదయేత్ కృతజపం వశ్యాభవేత్తస్యసా॥
కథితం పుష్పబాణస్య సాంగోపాంగ సమర్చనం
సౌభాగ్యకాంతి విభవ దార పుత్ర సమృద్ధిదమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మరొక వశ్యప్రయోగము చెప్పబడుచున్నది. అష్టదళపద్మము **తమలపాకు**పై లిఖించి మధ్యలో క్లీం

బీజసహిత సాధ్య సాధకకర్మలు లిఖించాలి. శూలయుక్త అష్టదళములందు ఇ – అః – ఆ – య – జ – ఉ – ఐం – ఘ అక్షరములు లిఖించాలి. ఈ తమలపాకును తాంబూలముగా చేసి సాధ్యవ్యక్తికి, రాత్రి సమయము నందు సేవింపచేసిన అనుకూలమగును.

# దశావతార స్తోత్రము

## 1. మత్స్యావతారము

శ్లో॥ ఆదాయవేదాః సకలాః సముద్రాన్
నిహత్య శంఖాసుర మత్స్యదగ్రం ।
దత్త్వాఃపురా యేన పితామహాయ
విష్ణుం తమాద్యం భజ మత్స్యరూపమ్ ॥

## 2. కూర్మావతారము

శ్లో॥ దివ్యామృతార్థం మథితే మహాబ్ధౌ
దేవాసురాభ్యాం వాసుకి మందరాభ్యామ్ ।
భూమేర్మహావేగ విఘూర్ణితాయాః
తం కూర్మ మాధరగతం స్మరామి ॥

## 3. వరాహావతారం

శ్లో॥ సముద్రకాంచీ సరిదుత్తరీయా
వసుంధరా మేరుకిరీట భారా ।
దంష్ట్రాగ్రతో యేనసముద్ధృతా భూ
స్తమాదికోలం శరణం ప్రపద్యే ॥

## 4. నృసింహావతారం

భక్తార్తిభంగక్షమయా ధియాయః
స్తంభాంతరాళాదుదితో నృసింహః ।
రిపుంసురాణాం నిశితైర్నఖాగ్రైః
విదారయంతం న చ విస్మరామి ॥

## 5. వామనావతారం

శ్లో॥ చతుః సముద్రాభరణా ధరిత్రీ
న్యాసాయనాఽలం చరణస్య యస్య ।
ఏకస్యనాఽన్యస్య పదంసురాణాం
త్రివిక్రమం సర్వగతం స్మరామి ॥

## 6. పరశురామావతారం

శ్లో॥ త్రిఃసప్త వారం నృపతీన్ నిహ్యత
యస్తర్పణం రక్తమయం పితృభ్యః ।
చకారదోర్దండ బలేన సమ్యక్
తమాదిశూరం ప్రణమామి భక్త్యా ॥

## 7. శ్రీరామావతారం

శ్లో॥ కులేరఘూణాం సమవాప్య జన్మ
విధాయసేతుం జలధే ర్జలాంతః ।
లంకేశ్వరం యః శమయాం చకార
సీతాపతిం తం ప్రణమామి భక్త్యా ॥

## 8. బలభద్ర రామావతారం

శ్లో॥ హలేన సర్వానసురాన్ వికృష్య
చకార చూర్ణం ముసలప్రహారైః ।
యః కృష్ణ మాసాద్య బలంబలీయాన్
భక్త్యా భజే తం బలభద్రరామమ్ ॥

## 9. బుద్ధావతారం

శ్లో॥ పురాపురాణామసురాన్ విజేతుం
సంభావయన్ చీవర చిహ్నవేషమ్ ।
చకారయః శాస్త్ర మమోఘకల్పం
తం మూలభూతం ప్రణతోఽస్మి బుద్ధమ్ ॥

## 10. హయగ్రీవావతారం

శ్లో॥ కల్పావసానే నిఖిలైః ఖురైః స్వైః
సంఘట్టయామాస నిమేషమాత్రాత్ ।
యస్తేజసా నిర్దహతీతి భీమో
విశ్వాత్మకం తం తురగం భజామః ॥
శంఖం సుచక్రం సుగదాం సరోజం
దోర్భిర్దధానం గరుడాధిరూఢం ।
శ్రీవత్సచిహ్నం జగదాదిమూలం
తమాలనీలం హృది విష్ణుమీడే ॥
క్షీరాంబుధౌ శేషవిశేష తల్పే
శయానమంతః స్మితశోభివక్త్రమ్

ఉత్ఫుల్ల నేత్రాంబుజ మంబుజాభమాద్యం
శృతీనామసకృత్ స్మరామి
ప్రీణయేదనయా స్తుత్యా జగన్నాథం జగన్మయమ్ ।
ధర్మార్థకామమోక్షాణామాస్తయే పురుషోత్తమమ్ ॥

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే
సప్తదశః పటలః సమాప్తః*

❖❖❖

# అథాష్టదశః పటలః

## అథ శివ ప్రకరణమ్

శ్లో॥ అథ వక్ష్యే మహేశస్య మంత్రాన్ సర్వసమృద్ధిదాన్
యైః పూర్వమృషయః ప్రాప్తాః శివసాయుజ్యమంజసా ।
హృదయం వపరం సాక్షి లాంతోఽనంతాన్వితో మరుత్
పంచాక్షరో మనుః ప్రోక్తస్తారోద్యాఽయం షడక్షరః ।
వామదేవో మునిశ్ఛందః పంక్తిరీశోఽస్య దేవతా
షడ్భిర్వర్ణైః షడంగాని కుర్యాన్మంత్రస్య దేశికః ।
మంత్రవర్ణాదికాన్యస్యేత్ పంచమూర్తీర్యథాక్రమం
తర్జనీమధ్యయోరంత్యానామికాంగుష్ఠకే పునః ।
తాః స్యుస్తత్పురుషాఘోర సద్యోవామేశ సంజ్ఞకాః
వక్త్ర హృత్పాద గుహ్యేషు నిజమూర్ధని తాఃపునః ।
ప్రాగ్యామ్య వారుణోదీచ్య మధ్యవక్త్రేషు పంచసు
మంత్రాగాని న్యసేద్ పశ్చాజ్జాతి యుక్తాని షట్క్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సమస్త సిద్ధులను ఇచ్చు శివమంత్రము చెప్పబడుచున్నది. పూర్వము ఋషులు ఈ మంత్రముపాసించి శివసాయుజ్యము పొందారు.

**మనుః : ఓం నమః శివాయ ।**

వామదేవఋషిః । పంక్తి ఛందః । ఈశ్వరోదేవతా ।

మంత్రములోని ఆరు అక్షరములతో షడంగన్యాసం చేయాలి. మరల, మంత్రములోని మొదటి అయిదు అక్షరములతో, శివుని పంచమూర్తులను, తర్జని - మధ్యమ - కనిష్ఠ - అనామిక - అంగుష్ఠములందు న్యాసము చేయాలి.

ఈ పంచమూర్తులూ క్రమముగా 1 - తత్పురుష 2. అఘోర 3. సద్యోజాత 4. వామదేవ 5. ఈశానులు. పిమ్మట పంచాక్షరములతో పంచమూర్తులను, ముఖ - హృదయ - పాద - గుహ్య - శిరోప్రదేశములందు న్యాసం చేయాలి.

పిమ్మట సాధకుడు తన శిరోభాగముపై పంచవక్త్రత్వ భావన చేయుచూ పూర్వాది నాలుగు దిశలూ, మధ్యన - పంచముఖములను న్యాసం చేయాలి.

## గోళకన్యాసము

శ్లో॥ కుర్వీత గోళక న్యాసం రక్షాయై తదనంతరం
హృదివక్త్రేంఽర్వోః కంఠే నాభౌ ద్విపార్శ్వయోః ।
పృష్ఠేహృది తతోమూర్ధ్ని వదనే నేత్రయోర్నసోః
దోః పత్సంధిషు సాగ్రేషు విన్యసేత్తదనంతరమ్ ।
శిరోవదనహృత్ కుక్షి సోరు పాదద్వయే పునః
హృది వక్త్రాంబుజే టంకే మృగాభయ వరేష్వథ ।

వక్త్రాంస హృత్సపాదోరు జఠరేషు క్రమాన్ న్యసేత్
మూలమంత్రస్య షడ్వర్ణాన్ యథావద్ దేశికోత్తమః ।
మూర్ధ్ని భాలోదరాంసేషు హృదయే తాః పునర్న్యసేత్
పశ్చాదనేన మంత్రేణ కుర్వీత వ్యాపకం సుధీః ।

..............................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు దశావృత్తి రూపమైన గోళకన్యాసము చెప్పబడుచున్నది. హృదయ – ముఖ – 2 భుజ – 2 ఊరు – స్థానములందు ప్రథమావృత్తి కంఠ – నాభి – 2 పార్శ్వ – పృష్ఠ – హృదయములందు ద్వితీయావృత్తి మూర్ధ – ముఖ – 2 నేత్ర – 2 నాసికారంధ్ర – తృతీయావృత్తి బాహు – పాదములందు చతుర్థావృత్తి.

వాటి సంధులందు పంచమావృత్తి. అంగుళములయొక్క మధ్య సంధులందు షష్ఠావృత్తి. వాటి అగ్రభాగములందు సప్తమావృత్తి. మరల శిర – ముఖ – హృదయ – కుక్షి – ఊరు – ఈ పాదస్థానములందు అష్టమావృత్తి, హృదయ – ముఖ – పరశు – మృగ – వర – అభయములందు నవమావృత్తి. ముఖ – భుజ – హృదయ – పాద – ఊరు – జఠరములందు దశమావృత్తి న్యాసము లాచరించాలి.

పిమ్మట, శిరో – భాల – ఉదర – 2 భుజ – హృదయ స్థానములందు, ఇలా వ్యాపక న్యాసం ఆచరించాలి.

## వ్యాపకన్యాస మంత్రము

**నమోఽస్తు స్థాణురూపాయ జ్యోతిర్లింగాత్మనే,**

**చతుర్మూర్తి వపుచ్ఛాయా భాసితాంగాయ శంభవే"**

పిమ్మట పంచముఖ శివధ్యానం ఇలా చేయాలి.

శ్లో॥ ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారు చంద్రా వతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశుమృగవరాభీతి హస్తం ప్రసన్నమ్ ।
పద్మాసీనం సమంతాత్ స్తుతమమరగణైర్వ్యాఘ్రకృత్తింవసానం
విశ్వాద్యంవిశ్వ రూపం నిఖిల మభయహరం పంచవక్త్రం త్రినేత్రమ్॥

మూలమంత్రమును, శైవమార్గములో దీక్ష పొంది 24 లక్షలు జపించి, 24వేలు పాయసహోమం ఆచరించిన మంత్రము సిద్ధించును.

పిమ్మట వామాది నవ శక్తియుక్త, పీఠమందు, సదాశివుని అర్చించాలి. 1. వామా 2. జ్యేష్ఠా 3. రౌద్రీ 4. కలపదా, 5. వికరిణీ 6. బలవికరిణీ 7. బలప్రమథనీ 8. సర్వభూత దమనీ 9. మనోన్మనీ

## పీఠమంత్రము

**ఓం నమోభగవతే సకల గుణాత్మ శక్తియుక్తాయ**
**అనంతాయ, యోగపీఠాత్మనే నమః।**

అని ఆసనం కల్పించి, మూలమంత్రముతో మూర్తి కల్పనచేసి, శివుని ఆవాహన చేసి పూజించాలి.

## ఆవరణ దేవతార్చన

శ్లో॥ కర్ణికాయాం యజేన్మూర్తీ రశమీశాన దిగ్గతం
శుద్ధస్ఫటిక సంకాశం దిక్షు తత్పురుషాది కాః ।
పీతాంజన శ్వేతరక్తాః ప్రధాన సదృశాయుధాః
చతుర్వక్త్ర సమాయుక్తా యధావత్ సంప్రపూజయేత్ ।
కోణేష్వర్చ్యాః నివృత్యాద్యాస్తేజోరూపాః కళాఃక్రమాత్
అంగాని కేసరస్థాని విద్యేశాన్ పత్రగాన్ యజేత్ ।

అనంతం సూక్ష్మనామానం శివోత్తమ మనంతరం
ఏకనేత్ర మేకరుద్రం త్రినేత్రం తదనంతరమ్ ।
పశ్చాచ్ఛ్రీకంఠ నామానం శిఖండినమనంతరం
రక్తపీత సితారక్త కృష్ణ రక్తాం జనాసితాన్ ।
కిరీటార్పిత బాలేందూన్ పద్మస్థాన్ భూషణాన్వితాన్
త్రినేత్రాన్ శూలవజ్రాస్త్ర చాపహస్తన్ మనోహరాన్ ।
ఉత్తరాది యజేత్ పశ్చాదుమాం చండేశ్వరం పునః
తతోనందిమహాకాలౌ గణేశవృషభౌ పునః ।
అథ భృంగరీటిం స్కందమేతాన్ పద్మాసనస్థితాన్
స్వర్ణతోయారుణశ్యామ ముక్తేందు సితపాటలాన్ ।
ఇంద్రాదయస్తతః పూజ్యా వజ్రాద్యాయుధ సంయుతాః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నాలుగుదిశల తత్పురుష - అఘోర - సద్యోజాత - వామదేవులను, ఈశాన్యమందు శుద్ధస్ఫటిక సమానుడైన ఈశానమూర్తిని పూజించాలి. తత్పురుషాది నలుగురూ క్రమముగా పసుపు - నలుపు - తెలుపు - ఎరుపు వర్ణములో నుందురు.

వీరంతా చతుర్ముఖములతో యుందురు. పిమ్మట నాలుగు కోణములందు, నివృత్తి - ప్రతిష్ఠ - విద్యా - శాంతి, కళలను పూజించి, ఈశాన్యమందు శాంత్యతీతకళను పూజించాలి. కేసరములందు అంగదేవతలను, పత్రములందు విద్యేశ్వరులను అర్చించాలి.

విద్యేశ్వరులపేర్లు, అనంత - సూక్ష్మ - శివోత్తమ - ఏకనేత్ర - ఏకరుద్ర - త్రినేత్ర - శ్రీకంఠ - శిఖండి. వీరి వర్ణములు క్రమముగా రక్త - పీత - సిత - రక్త - కృష్ణ - రక్త - అంజన - శ్వేత వర్ణములు.

వీరందరి కిరీటములందు బాలేందు రేఖ యుండును. పద్మాసీనులై భూషణములు ధరించి, చేతులందు శూల - వజ్ర - బాణ ధనుస్సులు ధరించి యుందురు. పిమ్మట ఉత్తరక్రమముగా ఉమ - చండేశ్వర - నంది - మహాకాల - గణేశ - వృషభ - భృంగరీటి - స్కందులను 8 విద్యేశ్వరులను 8 దిశలందు పూజించాలి.

వీరంతా పద్మాసనులై, క్రమముగా సువర్ణ - జల - అరుణ - శ్యామ - ముక్తా - చంద్రమా - శ్వేత - పాటల వర్ణములో నుందురు. పిమ్మట లోకపాలురను, వారి ఆయుధములను పూజించి, జపం ఆచరించాలి.

ఇట్లు ఆచరించిన, సాధకుడు తన పాపములను పోగొట్టుకొని, అభీష్టసిద్ధిని పొందగలవాడగును. 2 వేలు నిత్యజపం చేసిన రోగనివారణమగును. 3 వేలు జపించిన ఆయుర్వృద్ధి, నిత్యమూ సహస్రాధికముగా జపించిన సర్వకార్యసిద్ధి.

ఒక లక్ష ఆజ్యాన్విత తిలలహోమంచే, సకల కష్టములూ తొలగును. కోటి మంత్రజపం వలన సాక్షాత్ శివరూపుడగును.

## అష్టాక్షర మంత్రము

శ్లో॥ షడక్షరః శక్తి రుద్ధః కథితోఽష్టాక్షరో మనుః
ఋషిశ్ఛందః పురాప్రోక్తో దేవతాస్యాదుమాపతిః ।
అంగాని పూర్వముక్తాని సోమమీశం విచింత యేత్
మనులక్షం జపేన్మంత్రం తత్సహస్రం యథావిధి ।
జుహుయాన్మధు రాసిక్తై రారగ్వధ సమిద్వరైః
ప్రాక్‌ప్రోక్తే పూజయేత్ పీఠే గంధపుష్పైరుమాపతిమ్ ।
అంగావృతీర్భహిః పూజ్యా హృల్లేఖాద్యాయథాపురా

మధ్య ప్రాగ్దక్షిణోదచ్య పశ్చిమేషు విధానతః ।
హృల్లేఖా గగనారక్తా చతుర్థంతు కరాళికా
మహోచ్ఛుష్మా క్రమాదేతాః పంచభూతసమప్రభాః ।
పాశాంకుశ వరాభీతి ధారిణ్యోఽమిత భూషణాః
యజేత్ పూర్వాది పత్రేషు వృషభాద్యా ననుక్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – శివుని అష్టాక్షర మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - హ్రీం ఓం నమశ్శివాయ హ్రీం।**

**వామదేవఋషిః। పంక్తిశ్ఛందః। ఓం బీజం హ్రీంశక్తిః। ఉమాపతి ర్దేవతా। షడంగన్యాసము** పూర్వమంత్రమునకు వలెనె.

☞ **బంధూకాభం త్రినేత్రం శశి శకలధరం స్మేరవక్త్రం వహంతం**
**హస్తైఃశూల కపాలం వరదమభయదం చారుహాసం నమామి।**
**వామోరుస్తంభగాయాః కరతలవిలస చ్చారు రక్తోత్పలాయా**
**హస్తేనాఽఽశ్లిష్టదేహ మణిమయవిలసద్ భూషణాయాః ప్రియాయాః**

పై మంత్రమును 14 లక్షలు జపించి, 14వేలు హోమం ఆచరించాలి. త్రిమధురమిశ్రిత ఆరగ్వధ సమిధలతో హోమం చేయాలి. పిమ్మట పీఠపూజ, అంగదేవతలను బయట 9వ పటలములో చెప్పినట్లు బీజాక్షరయుక్త హోం – హ్రీం – హ్రం – హ్రిం – హ్రాంలను అర్చించాలి.

వృత్తమధ్యమందు, తూర్పుదక్షిణ ఉత్తరపడమరలందు క్రమముగా, హృల్లేఖ – గగనా – రక్తా – కరాళికా – మహోచ్ఛుష్మా – లను పూజించాలి. వీరి వర్ణము పృథివ్యాది పంచభూతవర్ణములవలె నుండును.

వీరంతా పాశాంకుశ, వరాభయ ముద్రలు ధరించి, అలంకారవతులై యుందురు. పిమ్మట పూర్వాది పత్రములందు వృషభాదులను ఇలా ధ్యానించాలి.

## వృషభ ధ్యానము

శ్లో॥ హిమాలయాభం వృషభం తీక్ష్ణశృంగం త్రిలోచనం
సర్వాభరణ సందీప్తం సాక్షాచ్ఛందః స్వరూపిణమ్ ।

## క్షేత్రపాల ధ్యానము

శ్లో॥ కపాలశూల విలసత్కరం కాలఘనప్రభమ్
క్షేత్రపాలం త్రినయనం దిగంబరమధార్చయేత్ ।

## చండేశధ్యానము

శ్లో॥ శూలటంకాక్షవలయం కమండులులసత్కరం
రక్తాకారం త్రినయనం చండేశ మథపూజయేత్ ।

## దుర్గాధ్యానము

శ్లో॥ చక్రశంఖ భయాభీష్టకరాం మరకతప్రభాం
దుర్గాం ప్రపూజయేత్ సౌమ్యాం త్రినేత్రాంచారు భూషణామ్।

## షణ్ముఖ ధ్యానము

శ్లో॥ కల్పశాఖాం రత్నఘంటాం దధానం ద్వాద శేక్షణం
బాలార్కాభం శిశుంకాంతం షణ్ముఖం పూజయేత్తతః ।

## నందిధ్యానము

శ్లో॥ నందినం పూజయేత్సౌమ్యం రక్తభూషణమండితం
పరశ్వేణ వరాభీతి ధారిణం శ్యామ విగ్రహమ్ ।

## విఘ్ననాయక ధ్యానము

శ్లో॥ పాశాంకుశ వరాభీష్ట ధారిణం కుంకుమప్రభం
విఘ్ననాయక మభ్యర్చేచ్ఛంద్రార్థకృతశేఖరమ్ ।

## సేనాపతి ధ్యానము

శ్లో॥ శ్యామం రక్తోత్పలకరం వామాంకన్యస్తతత్కరం
త్రినేత్రం రక్తవస్త్రాఢ్యం సేనాపతి మథార్చయేత్ ।

పిమ్మట, అష్టమాతృకలను, లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి. సాధకుడు సర్వసంపత్ – సౌభాగ్యములను పొందును.

## శివుని ప్రాసాద మంత్రము

శ్లో॥ సాంతః సద్యాంతసంయుక్తో బిందుభూషితమస్తకః
ప్రాసాదాఖ్యోమనుః ప్రోక్తో భజతాంసర్వసిద్ధిదః ।
వామదేవో మునిశ్ఛందః పంక్తిర్దేవః సదాశివః
షడ్దీర్ఘయుక్త బీజేన షడంగవిథిరీరితః ।
ఈశానాదీన్ న్యసేన్ మూర్తీరంగుష్ఠాదిషు దేశికః
ఈశానాఖ్యం తత్పురుష మఘోరం తదనంతరమ్ ।
వామదేవా హ్వాయం సద్యఆసాం బీజంక్రమాద్విదుః
ఓకారాద్యైః పంచహ్రస్వైర్విలోమాత్ సంయుతం వియత్ ।
తత్తదంగుళిభిర్ధ్యాయ స్తత్తద్బీజాదికాన్యసేత్
శిరోవదనహృద్గుహ్య పాదదేశే యథాక్రమాత్ ।
ఊర్ధ్వప్రాగ్దక్షిణోదీచ్య పశ్చిమేషు ముఖేషుతాః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – శివుని ప్రాసాద మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః – హౌం।**

**వామదేవఋుషిః। పంక్తి ఛందః। హాంబీజం – ఔంశక్తిః। సదాశివో దేవతా। హ్రాం హ్రీం – హూం – హేం – హోం – హౌం – అను బీజములతో** షడంగన్యాసమాచరించాలి.

పిమ్మట అంగుష్ఠాది అంగుళులందు, ఈశానాది పంచమూర్తులను, ఈ బీజములతో (హోం - హీం - హుం - హింహం) న్యాసం చేయాలి. పిమ్మట శిరో - వదన - హృదయ - గుహ్య - పాదస్థానములందు న్యాసం చేయాలి.

## అష్టత్రింశత్ కళాన్యాసము

శ్లో॥ తతః ప్రవిన్యసే ద్విద్వా నష్టత్రింశత్కళాస్తనౌ
ఈశానాద్యాఋచః సమ్యగంగుళీషు యథాక్రమమ్ ।
అంగుష్ఠాదిక నిష్ఠాంతం న్యసేద్దేశిక సత్తమః
మూర్ధాస్యహృదయాంభోజ గుహ్యాపాదేషు తాఃపునః ।
వక్త్రే ఘూర్ధ్వాది విన్యస్యేద్ భూయోఽగాని ప్రకల్పయేత్
తారపంచక ముచ్చార్య సర్వజ్ఞాయ హృదీరితమ్ ।
అమృతతేజోమాలిని తృప్తాయేతి పదం పునః
తదంతే బ్రహ్మశిరసే శిరోంగ జ్వలితం తతః ।
శిఖిశిఖాయ పరతోఽనాబోధాయ తచ్ఛిఖా
వజ్రిణే వజ్రహస్తాయ స్వతంత్రాయ తనుచ్ఛదమ్ ।
సౌంవౌంహౌమితి సంభాష్య పురతో లుప్తశక్తయే
నేత్రముక్తం శ్లీం పశుం హుం ఫడంతేఽనంత శక్తయే ।
అస్త్రముక్త షడంగాని కుర్యాద్దేశికసత్తమః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట ఈశానాది అయిదు మంత్రములతో, అంగుళందు శిరో - ముఖ - హృదయ - గుహ్య - పాదములందు ఊర్ధ్వ - పూర్వ - దక్షిణ - పశ్చిమ - ఉత్తర దిశలందు న్యాసము చేయాలి.

పంచప్రణవములతో (ఐం క్లీం - బ్లూం - స్త్రీం - సః) కలసిన సర్వజ్ఞాయ హృదయాయ నమః అని,

**అమృతతేజోమాలిని నిత్యతృప్తాయ బ్రహ్మా శిరసే స్వాహా।**

**జ్వలితశిఖశిఖాయ అనాదిబోధాయ శిఖాయై వషట్।**

**వజ్రిణేవజ్రహస్తాయ స్వతంత్రాయ కవచాయహుం।**

**సౌంవౌంహౌం పురతోలుప్త శక్తయే నేత్రద్వయాయ వౌషట్।**

**శ్లీంపశుం హుంఫట్ అనంతశక్తయే అస్త్రాయఫట్** అని షడంగ న్యాసమాచరించాలి.

శ్లో॥ పూర్వదక్షిణ పాశ్చాత్య సౌమ్యమధ్యేషు పంచసు
వక్త్రేషు పంచ విన్యస్యేదశానస్య కలాఃక్రమాత్ ।
ఈశానః సర్వవిద్యానాం శశినీప్రథమాకళా
ఈశ్వరః సర్వభూతానాం అంగదాతదనంతరం ।
బ్రహ్మాధిపతి శబ్దాంతే బ్రహ్మణోఽధిపతిః పునః
బ్రహ్మేష్టదా తృతీయాస్యా చ్ఛివోమేఽస్తు తతఃపరా ।
మరీచీ కథితాతంత్రే చతుర్థీచ సదాశివోమ్
అంశుమావిన్యథ పరాప్రణవాద్యానమోఽన్వితాః ।
పూర్వపశ్చిమ యామ్యోదగ్యక్త్రేషు తదనంతరం
చతస్రోవిన్యసేన్మంత్రీ పురుషస్యకళాఃక్రమాత్ ।

.................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సాధకుడు పూర్వాది దిశలందు ఇలా న్యాసం చేయాలి.

ఓం ఈశానః సర్వవిద్యానాం శశిన్యై నమః - పూర్వే।

ఓం ఈశ్వరః సర్వభూతానాం అంగదాయై నమః - దక్షిణే।

ఓం బ్రహ్మాధిపతిర్ బ్రహ్మణోఽధిపతి బ్రహ్మేష్టదాయై నమః – పశ్చిమే
ఓం శివోమేఽస్తు మరీచ్యై నమః ఉత్తరే ।
ఓం సదాశివోం నమః అంశుమాలిన్యై నమః మధ్యే ।

పిమ్మట, తత్పురుషుని నాలుగు కళలూ ఇలా న్యాసం చేయాలి.

1. ఓం తత్పురుషా విద్మహే శాంత్యై నమః – పూర్వే ।
2. ఓం తత్పురుషాయ విద్మహే విద్యాయై నమః – పశ్చిమే ।
3. ఓం తన్నోరుద్ర ప్రతిష్ఠాయై నమః – దక్షిణే ।
4. ఓం ప్రచోదయాత్ నివృత్యై నమః – ఉత్తరే ।

పిమ్మట – హృదయ – కంఠ – 2భుజ – నాభి – కుక్షి – పృష్ఠ – వక్షః స్థలములందు, అఘోరుని 8 కళలను, అంగుళులతో న్యాసం చేయాలి.

1. ఓం అఘోరేభ్యోఽ ఈరితాయై నమః – హృదయే ।
2. ఓం అథ ఘోరేభ్యః మోహాయై నమః – కంఠే ।
3. ఓం ఘోరేభ్యో క్షమాయై నమః – దక్షిణభుజే ।
4. ఓం ఘోరతరేభ్యో నిద్రాయై నమః – వామస్కంధే ।
5. ఓం సర్వతః సర్వేభ్యో వాధ్యై నమః – నాభౌ ।
6. ఓం శర్వేభ్యో మత్యవే నమః – కుక్షౌ ।
7. ఓం నమస్తేఽస్తు క్షుథాయై నమః – పృష్ఠే ।
8. ఓం రుద్రరూపేభ్యో తృషాయై నమః – వక్షఃస్థలే ।

పిమ్మట, వామదేవ మంత్రముతో 13 కళలను ఇలా న్యాసం చేయాలి.

1. ఓం వామదేవాయ నమః ఓం వజ్రాయై నమః – గుహ్యే ।
2. ఓం జ్యేష్ఠాయ నమః ఓం రక్షాయై నమః – దక్షిణాండకోశే ।
3. ఓం రుద్రాయ నమః ఓం రత్యై నమః – వామాండకోశే ।
4. ఓం కాలాయ నమః ఓం పాలిన్యై నమః – దక్షిణోరౌ ।
5. ఓం కలాయ నమః ఓం కామాయై నమః – వామోరౌ ।
6. ఓం వికరణాయ నమః ఓం సంయమిన్యై నమః – దక్షిణజానౌ ।

7. ఓం బలాయ నమః ఓం క్రియాయై నమః - వామ జానౌ ।
8. ఓం బలవికరణాయ నమః ఓం పృధ్యై నమః - దక్షిణజంఘాయ।
9. ఓం బలాయ నమః ఓం స్థిరాయై నమః - వామజంఘాయాం ।
10. ఓం ప్రమథనాయ నమః ఓం రాత్ర్యై నమః - నితంబే ।
11. ఓం సర్వభూతదమనాయ నమః ఓం భ్రామణ్యై నమః - కట్యాం ।
12. ఓం మనసే నమః ఓం జరాయై నమః - వామపార్శ్వే ।
13. ఓం ఉన్మనాయ నమః ఓం జరాయై నమః - వామపార్శ్వే ।

పిమ్మట - సద్యోజాతుని 8 కళలనూ ఇలా న్యాసం చేయాలి.

1. ఓం సద్యోజాతాయవై నమః పృధ్యై నమః - వామపాదతలే ।
2. ఓం సద్యోజాతాయవై నమః పృధ్యై నమః - వామపాదతలే ।
3. ఓం భవే నమః ద్యుత్యై నమః - దక్షిణహస్తతలే ।
4. ఓం అభవే నమః లక్ష్మ్యై నమః - వామహస్తతలే ।
5. ఓం నాతిభవే నమః మేధాయైఐ నమః - నాసికాయాం ।
6. ఓం భజస్వమాం నమః ప్రజ్ఞాయై నమః - శిరసి ।
7. ఓం భవః నమః ప్రభాయై నమః - దక్షిణ బాహౌ
8. ఓం ఉద్భవాయ నమః - స్వధాయై నమః - వామ బాహౌ ॥

ఈవిధముగా మొత్తం 38 కళాన్యాసము చేయవలయును. పిమ్మట ఇలా ధ్యానించాలి.

శ్లో॥ ముక్తాపీత పయోదమౌక్తిక జపావర్ణై ర్ముఖైః పంచభిః
త్ర్యక్షైరంచిత మీశమిందుముకుటం పూర్ణేందుకోటిప్రభమ్।
శూలంటంక కృపాణ వజ్రదహనాన్నాగేంద్ర ఘంటాంకుశాన్
పాశంభీతిహరం దధానమమితా కల్పోజ్వలం చింతయేత్॥

శివప్రాసాద మంత్రమును 5 లక్షలు జపించి, త్రిమధురయుక్త గన్నేరు పూలతో దశాంశ హోమమాచరించాలి.

పిమ్మట పీఠపూజ – ఆవరణార్చన చేయాలి. పంచముఖములనూ ఇలా స్తుతించాలి.

**ఈశాన –** శక్తిం దమరుకాభీతి వరాన్ సందధతం కరైః
ఈశానం త్రీక్షణం శుభ్రమైశాన్యాందిశి పూజయేత్ ।

**తత్పురుష –** ఏరశ్వేణపరాభీతిర్దధానం విద్యుదుజ్వలం
చతుర్ముఖంతత్పురుషం త్రినేత్రం పూర్వతోఽ ర్చయేత్ ।

**అఘోర –** అక్షస్రజం మృగపాశౌ సృణిందమరుకం తతః
ఖట్వాంగం నిశితం శూలం కపాలం బిభ్రతంకరైః
అంజనాభం చతుర్వక్త్రం భీమదంష్ట్రం భయావహం
అఘోరంత్రీక్షణం యామ్యే పూజయేన్మంత్రవిత్తమః ।

**వామదేవ –** కుంకుమాభం చతుర్వక్త్రం వామదేవం త్రిలోచనం
వరాభయాక్షవలయ కుఠారందధతం కరైః ।
విలాసినంస్మేరవక్త్రం సౌమ్యేసమ్యక్ సమర్చయేత్ ॥

**సద్యోజాత –** కర్పూరేందునిభం సౌమ్యం సద్యోజాతం త్రిలోచనం
హరిణాక్షగుణాభీతి వరహస్తం చతుర్ముఖం ।
బాలేందుశేఖరోల్లాసిముకుటం పశ్చిమేయజేత్ ॥

పిమ్మట, నాలుగు కోణములందు నివృత్తి – ప్రతిష్ఠా – విద్యా – శాంతి రూప కళలను పూజించాలి. పత్రములందు అనంతాది విద్యేశ్వరులను ఉమాది శక్తులను పూజించి, లోకపాలురను, వారి ఆయుధములను అర్చించాలి.

చివరిగా నృత్య గీతాదులతో సదాశివుని స్తుతించాలి.

## అష్టాక్షరప్రాసాద మంత్రము

శ్లో॥ తారోమాయా వియద్ బిందు మనుస్వరసమన్వితం
పంచాక్షర సమాయుక్తో వసువర్ణో మనుర్మతః ।

పంచాక్షరోక్తవత్ కుర్యాదంగన్యాసాదికం బుధః
అష్టలక్షం జపేదేనం మనుం మనువిదాంవరః ।
తత్సహస్రం ప్రజుహుయాత్ పాయసాన్నైర్ ఘృతప్లుతైః
ప్రాక్పీఠే మూలమంత్రేణ మూర్తింసకంకల్ప్య పూజయేత్।
అంగైరావరణం పూర్వం అనంతాద్యైరనంతరం ।
ఉమాదిభిః సముద్దిష్టం తృతీయం లోక నాయకైః
చతుర్థం పంచమం తేషా మాయుధైః పరికీర్తితమ్ ।
ఏవం ప్రతిదినందేవం పూజయేత్ సాధకోత్తమః
పుత్రమిత్రాది సహితాం శ్రియ ప్రాప్య ప్రమదతే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శివుని అష్టాక్షర ప్రాసాద మంత్రము చెప్పబడుచున్నది.

మనుః - ఓం హ్రీం హౌం నమః శివాయ ।

ఋషి - ఛందో - న్యాసాదులు పూర్వమంత్రము వలెనే చేయవలయును. ఈ విధముగా ధ్యానించాలి.

☞ **వందేసింధూరవర్ణం మణిముకుటలసచ్చారు చంద్రావతంసం**
**భాలోద్యన్నేత్రమీశం స్మితముఖ కమలం దివ్యభూషాంగరాగమ్ ।**
**వామోరున్యస్తపాణేరరుణకువలయం సందధాత్యా ప్రియాయా**
**వృత్తోత్తుంగస్తనాగ్రే నిహిత కరతలం వేదటంకేష్ట హస్తమ్ ॥**

పై అష్టాక్షర మంత్రము, 8 లక్షలు జపించి, ఘృతయుక్త పాయసముతో 8 వేలు హోమం చేయాలి.

పీఠపూజ - అంగావరణార్చన, యధావిధిగా పూర్వమువలె చేయాలి. సాధకుడు శివానుగ్రహము వలన పుత్ర మిత్ర కళత్ర - సంపదలను పొందును.

# మృత్యుంజయ మంత్రము

శ్లో॥ తారంస్థిరా సకర్ణేందుః భృగుః సర్గ విభూషితః
త్ర్యక్షరాత్మా నిగదితో మనుర్మృత్యుం జయాదికః ।
ఋషిః కోహలోదేవ్యాది గాయత్రీ ఛంద ఈరితం
మృత్యుంజయో మహాదేవో దేవతాఽస్య సమీరితః ।
భృగుణా దీర్ఘయుక్తేన షడంగాని సమాచరేత్
గుణలక్షం జపేన్మంత్రం తద్దశాంశం విశాలధీః ।
జుహుయాద మృతాఖండైః శుద్ధ దుగ్ధాజ్యలోలితైః
శైవేసంపూజయేత్ పీఠే మూర్తింమూలేన కల్పయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మూడక్షరముల మృత్యుంజయ మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం జూం సః ।**

**కోహల్యషిః । గాయత్రీ ఛందః । ఓం బీజం సః శక్తిః ।**

**(జూం బీజమని పద్మపాదాచార్యుల అభిప్రాయము) మృత్యుంజయ మహాదేవో దేవతా ।**

సాం – సీం సూం ఇత్యాది బీజములతో షడంగన్యాసం చేసి ఇలా ధ్యానించాలి.

☞ **చంద్రార్కాగ్ని విలోచనం స్మితముఖం పద్మద్వయాంతఃస్థితం**
**ముద్రాపాశ మృగాక్షసూత్రవిలసత్ పాణిం హిమాంశుప్రభమ్ ।**
**కోటీరేందు గలత్ సుధాప్లుతతనుం హారాది భూషోజ్వలం**
**కాంత్యా విశ్వవిమోహనం పశుపతిం మృత్యుంజయం భావయేత్॥**

పై మంత్రమును 3 లక్షలు జపించి, పాలు, ఆజ్యయుక్త తిప్పతీగ సమిధలతో 30 వేలు హోమం చేయాలి.

శైవపీఠమందు మూలమంత్రముతో మూర్తికల్పన, ఆవాహన, అంగావరణార్చన చేయాలి. పాలతో తిప్పతీగ సమిధలను, రోజూ ఒక సహస్రం చొప్పున, ఒక నెల హోమం చేసిన, ఆయురారోగ్య సంపత్ - యశ - పుత్ర వృద్ధి కలుగును.

తిప్పతీగ - మర్రి - తిలలు - దూర్వ - పాలు - నెయ్యి - పాయసం, ఈ 7 పదార్థములతో విడివిడిగా 7 రోజులు, 108 చొప్పున హోమం చేసి, 8మంది బ్రాహ్మణులకు నిత్యమూ భోజనము పెట్టిన, సమస్త రోగ అపమృత్యు బాధలు నివారణమగును. ఇలాగే 7-14-21 వరకూ కూడా చేయవచ్చును. భయంకరమైన పాపములు నశించును.

హోమానంతరం కపిల గోదానం చేయాలి. సాధకుడు త్రిజన్మ నక్షత్రములందు 10 - 21వ నక్షత్రములందు, హోమం, బ్రాహ్మణ భోజనం ఆచరించిన, దీర్ఘాయువు - అభీష్టసిద్ధి కలుగును.

## మహామృత్యుంజయ యంత్రము

శ్లో॥ ప్రణవరచిత నాలం మంత్రమధ్యార్ణ పత్రం
భృగువిలసిత మధ్యం పద్మయుగ్మం తదంతః ।
కృతవసతిముమేశం వర్ణనిర్యత్ సుధార్ద్రం
కలయతుహృది నిత్యం సర్వదుఃఖ ప్రశాంత్యై ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - రెండు అష్టదళ పద్మములు లిఖించాలి. నాళములందు ఓం, రెండు అష్టపత్రములందు జూం, మధ్యలో సః, లిఖించాలి. ఇందు సుధాప్లావితుడైన శివుని ధ్యానించాలి.

ఈ యంత్రమందు కలశస్థాపన చేసి, షోడశోపచారపూజ చేసి, సాధ్యవ్యక్తిని అభిషేకించిన, అపమృత్యు దోషము తొలగును.

మరొక విధానములో అష్టదళ కమలము లిఖించి, మధ్యలో ప్రణవసహిత సాధ్యనామము లిఖించాలి. 4 దిశల పత్రములందు, జూం, 4 కోణముల పత్రములందు సః లిఖించాలి. భూపురములోని 4 దిశలు - 4 కోణములందు ఠం లిఖించి, పూజచేసి ధరించిన సర్వదుఃఖములు, అపమృత్యుదోషము తొలగును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*అష్టాదశః పటలః సమాప్తః*

❖❖❖

# అథైకోన వింశః పటలః

## అథ దక్షిణామూర్తి ప్రకరణమ్

శ్లో॥ అథ వక్ష్యే మంత్రరత్నం సమస్త పురుషార్థదం
అవాపుర్యేన జప్తేన దివ్యం జ్ఞానమునీశ్వరాః ।
దక్షిణామూర్తయే పూర్వం తుభ్యంపదమనంతరం
వటమూల పదస్యాంతే పదంఎఏశ్చాన్నివాసినే ।
ధ్యానైకనిరతాంగాయ పశ్చాత్ బ్రూయాన్నమః పదం
రుద్రాయ శంభవే తారశక్తి రుద్ధోఽయ మీరితః ।
షట్త్రింశ దక్షరో మంత్రః సర్వకామ ఫలప్రదః
మునిః శుకః సముద్దిష్టశ్ఛందోఽనుష్టుప్ సమీరితమ్ ।
దక్షిణామూర్తి నామాస్య దేవతాశంభు రీరితః
షడ్భిర్ వర్ణైర్ హృదాఖ్యాతం ద్వాభ్యాం శిర ఉదీరితమ్ ।
శిఖాఽష్టభిః సముద్దిష్టా వస్వర్ణైః కవచంమతం
పంచభిర్నేత్ర మాఖ్యాతం త్రిభిరస్త్రముదాహృతమ్ ।

**షడేతే తారశక్త్యాద్యా హ్రౌజాద్యంతాః సజాతయః**
**అంగమంత్రాః సముద్దిష్టా యథావద్దేశికోత్తమైః ।**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 18వ పటలమనంద సదాశివుని ఊర్ధ్వవక్త్రము యొక్క ప్రధాన మంత్రములు చెప్పబడినవి. ఇపుడు దక్షిణవక్త్రముయొక్క ప్రధానమైన, సౌమ్యాత్మక మంత్రములు చెప్పబడు చున్నవి.

దివ్యజ్ఞానము ననుగ్రహించు దక్షిణామూర్తి మంత్రములు చెప్పబడు చున్నవి. ఇది 36 అక్షరములు కలది.

**మనుః - ఓం హ్రీం దక్షిణామూర్తయే తుభ్యం, వటమూల నివాసినే, ధ్యానైక నిరతాంగాయ నమో రుద్రాయ శంభవే హ్రీం ఓం।**

**శుక ఋషిః। అనుష్టుప్ ఛందః। ఓం బీజం - హ్రీం శక్తిః। దక్షిణామూర్తి రూప శంభుర్దేవతా।**

మూలమంత్రములోని 6 + 2 + 8 + 8 + 5 + 3 అక్షరములతో అంగన్యాసమాచరించాలి. ఆద్యంతములందు ఓం హ్రిం – హ్రౌం చేర్చాలి.

**ఉదా - ఓం హ్రీం దక్షిణామూర్తయే హ్రాం హృదయాయ నమః।**

మరియు మంత్రములోని 34 అక్షరములను, ఒక్కొక్క దానిని శిరో – లలాట – 2 నేత్ర – 2 శ్రోత్ర – 2 గండస్థల – 2 నాసికారంధ్ర – ముఖ – కరసంధి – కంఠ – 2స్తన – హృదయ – నాభి – కటి – గుహ్య – పాదసంధులందు 34 అక్షరములనుంచి, ఓం హ్రీంతో సమస్త మంత్రమును శరీరమునందు వ్యాపకన్యాసం చేయాలి. అటు పిమ్మట ఇలా ధ్యానించాలి. ఉదా – "ఓం హ్రీం దం నమః – శిరసి"

# దక్షిణా ధ్యానము

శ్లో॥ హేమాచల తటేరమ్యే సిద్ధకిన్నసేవితే
వివిధద్రుమ శాఖాభిః సర్వతో వారితాతపే ।
సుపుష్పితై ర్లతాజాలై రాశ్లిష్ట కుసుమద్రుమైః
శిలావివర నిర్గచ్ఛ న్నిర్ఘరా నిల సేవితే ।
గాయద్ భృంగాంగనాసంఘే నృత్యద్ బర్హి కదంబకే
కూజత్కోకిల సంఘేన ముఖరీకృత దింగ్ముఖే ।
పరస్పర వినిర్ముక్త మాత్సర్యమృగసేవితే
ఆద్యైః శుకాద్యై ర్మునిభిరజస్రం సముపస్థితే ।
పురందరముఖైర్దేవైః సేవాయాతై ర్విలోకితం
వటవృక్షం మహోచ్ఛాయం పద్మరాగఫలోజ్వలమ్ ।
గారుత్మతమయైః పత్రైర్నిబిడై రుపశోభితం
నవరత్న మయాకల్పైర్లంబమానై రలంకృతమ్ ।
శృణ్వద్భిర్వేదశాస్త్రాణి శుకవృందై ర్నిషేవితం
సంసారతామ విచ్ఛేద కుశల చ్ఛాయ మద్భుతమ్ ।
విచింత్య తస్యమూలస్థే రత్నసింహాసనేశుభే
ఆసీనమమితాకల్పం శరచ్చంద్ర నిభాననమ్ ।
స్తూయమానం మునిగణైర్ దివ్యజ్ఞానాభిలాషిభిః
సంస్మరేజ్జగతామాద్యం దక్షిణామూర్తి మవ్యయమ్ ।

శ్లో॥ కైలాసాద్రినిభం శశాంకశకల స్ఫూర్జజ్జటామండితం
నాసాలోకన తత్పరం త్రినయనయం వీరాసనాధ్యాసితమ్।
ముద్రాటంక కురంగజానువిలసత్పాణిం ప్రసన్నాననం
కక్షాబద్ధ భుజంగమం మునివృతంవందే మహేశంపరమ్॥

పైమంత్రమును 3 లక్షల 20 వేలు జపించి, క్షీరమిశ్రిత తిలలతో దశాంశహోమం ఆచరించాలి. పిమ్మట పంచాక్షర విధానములో చెప్పినట్లుగా పాద్యాది ఉపచారపూజ చేయాలి.

మంత్రసిద్ధిని పొందిన పిమ్మట, సాధకుడు, భిక్షాటనచే జీవించుచూ ఒక నెలవరకూ రోజూ 1008 సార్లు, మంత్రజపం చేయాలి. సాధకుడు సర్వశాస్త్ర వ్యాఖ్యాన సమర్థుడూ, జ్ఞాని యగును.

బ్రాహ్మి - సైంధవలవణం - తెల్లావాలు - వస - కుష్ఠం - మిరియాలు - నాగరముస్తెలు - ఏలకులు - కేసరములు చూర్ణముచేసి, 24 పలముల బ్రాహ్మీరసముతో, నెయ్యితో కలిపి వండి ఘృతశేషముగా దానిని దించాలి.

దానిని స్పృశించుచూ 10వేలు జపించాలి. దీనిని రోజూ, కొద్ది కొద్దిగా సేవించినచో, శరీరమునకు తేజస్సు, మనసునకు ఏకాగ్రత, ఆయువు వృద్ధి పొందును.

## మరొక దక్షిణామూర్తి మంత్రము

శ్లో॥ ప్రణవోహృదయం పశ్చాత్ తతోభగవతే పదం
జేయుతం దక్షిణామూర్తిం మహ్యం మేధాముదీరయేత్ ।
ప్రయచ్ఛఠద్వయాంతోఽయం ద్వావింశత్యక్షరోమనుః
మునిశ్చతుర్ముఖశ్ఛందో గాయత్రీ దేవతామనోః ।
దక్షిణామూర్తిరాఖ్యాతో వేదవ్యాఖ్యాన తత్పరః
తారరుద్రైః స్వరైర్ దీర్ఘైః షడ్భిరంగాని కల్పయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 22 అక్షరముల, మరొక దక్షిణామూర్తి మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం నమోభగవతే దక్షిణామూర్తయే మహ్యం మేథాం ప్రయచ్ఛస్వాహా।**

బ్రహ్మఋషిః। గాయత్రీఛందః। దక్షిణామూర్తిర్దేవతా। ఓం బీజం - స్వాహాశక్తిః। ఓం ఆం ఓం - ఓం ఈం ఓం ఇత్యాది ప్రణవపుటిత దీర్ఘస్వరములతో షడంగన్యాసం చేసి, ఇలా ధ్యానించాలి.

శ్లో॥ స్ఫటికరజత వర్ణం మౌక్తికీమక్ష మాలాం
అమృతకలశవిద్యా జ్ఞానముద్రాః కరాగ్రైః।
విధృతవివిధభూషం దక్షిణామూర్తిమీడే ॥

పైమంత్రమును ఒక లక్ష జపంచేసి, బ్రహ్మచర్య నియమముతో ఘృతసహిత పద్మములను దశాంశహోమం చేయాలి.

తరువాత పీఠార్చన ఆచరించాలి.

శ్లో॥ సరస్వతీం వాచయంతీం పుస్తకం సస్మితాననం
బ్రహ్మాణం సనకం పశ్చాత్ సనందనమతః పరమ్।
సనత్ కుమార నామానం శుకం వ్యాసం గణేశ్వరం
సిద్ధగంధర్వయోగీంద్ర విద్యాధరగణాన్ బహిః।
బాహ్యే లోకేశ్వరానర్చేత్ వజ్రాద్యాయుధ సంయుతాన్
ఇత్థం పూజాదిభిః సిద్ధే మంత్రేఽస్మిన్ సాధకోత్తమః।

....................................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నాలుగుదిశలందూ అంగపూజ చేయాలి. అష్టదళ పత్రములందు, మందస్మితయై పుస్తకము చదువుచున్న సరస్వతిని, బ్రహ్మ - సనక - సనందన - సనత్ కుమార - శుక - వ్యాస - గణేశులను అర్చించాలి. పత్రముల బయట సిద్ధ - గంధర్వ - యోగీంద్ర - విద్యాధర గణములను పూజించాలి.

పిమ్మట వజ్రాది ఆయుధములు ధరించిన లోకపాలురను అర్చించాలి. సిద్ధిపొందిన సాధకుడు, అభిమంత్రిత జలముతో సాధ్యవ్యక్తిని అభిషేకించిన, సంపద - విద్య - కీర్తి - ఆరోగ్యములను పొందును. కంఠమువరకు నీళ్లలో నిలబడి 49 రోజులు, రోజూ సహస్రజపము చేసిన గొప్ప కవిత్వ శక్తి సిద్ధించును.

గౌరీపార్శ్వ స్థిత దక్షిణామూర్తిని భావించుచూ, శ్రీబీజ సంపుటితముగా, మంత్రజపము చేసిన (రోజూ 10 వేలు) అధిక సంపద ప్రాప్తించును.

భిక్షాన్నము భుజించుచూ, 20వేలు జపించిన శాస్త్రవ్యాఖ్యాన సమర్థ డగును.

## నీలకంఠ మంత్రము

శ్లో॥ లోహితోఽగ్న్యాసనః సద్యోబిందుమాన్ ప్రథమంతతః
ద్వితీయం వహ్నిబీజస్థా దీర్ఘా శాంతీందు భూషితః ।
తృతీయం లాంగల్ సర్గీ మంత్రో బీజత్రయాన్వితః
నీలకంఠాత్మకః ప్రోక్తో విషద్వయ హరః పరః ।
హరద్వయం వహ్నిజాయా హృదయం పరికీర్తితం
కపర్దినే ఠయుగళం శిరోమంత్ర ఉదాహృతః ।
నీలకంఠాయ ఠ ద్వంద్వం శిఖామంత్ర ఉదాహృతః
కాలకూట పదస్యాంతే విషభక్షణ జేయుతమ్ ।
హుంఫట్ కవచమాదిష్టం విద్వద్భిర్నీల కంఠినే
స్వాహాంత మస్త్రమేతాని పంచాంగాని మనోర్విదుః ।
మూర్ధ్ని కంఠే హృదంభోజే క్రమాద్బీజత్రయం న్యసేత్

తతః సమాహితో భూత్వా నీలకంఠం విచింతయేత్ ।
లక్షత్రయం జపేన్మంత్రం తద్దశాంశం ససర్పిషా
హవిషాజుహుయాత్ సమ్యక్ సంస్కృతే హవ్యవాహనే ।
శైవేపీఠే యజేదేనం మృత్యుంజయ విధానతః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు మూడక్షరముల నీలకంఠ మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ప్రోం నీం ఠః ।**

ఋష్యాదులు పూర్వమువలెనే చెప్పవలయును.

| | | |
|---|---|---|
| హరస్వాహా | - | హృదయాయు నమః । |
| కపర్దినేస్వాహా | - | శిరసేస్వాహా |
| నీలకంఠాయస్వాహా | - | శిఖాయైవషట్ । |
| కాలకూటవిషభక్షణాయ స్వాహా | - | కవచాయ హుం । |
| నీలకంఠినే స్వాహా | - | అస్త్రాయఫట్ |

ఈ విధముగా పంచాంగ న్యాసము చేసి, మంత్రములోని మూడు అక్షరములను, శిరో - కంఠ - హృదయములందు న్యాసం చేసి నీలకంఠుని ఇలా ధ్యానించాలి.

☞ **బాలార్కాయుత తేజసం ధృత జటాజూటేందు ఖండోజ్వలం**
**నాగేంద్రైః కృత భూషణం జపవటీం శూలం కపాలంకరైః ।**
**ఖట్వాంగందధతం త్రినేత్ర విలసత్ పంచాననం సుందరం**
**వ్యాఘ్రుత్వక్ పరిధాన మబ్జనిలయం శ్రీ నీలకంఠం భజే ॥**

పై మంత్రమును, 3 లక్షలు జపించి, ఘృతమిశ్రిత హవిస్సుతో దశాంశ హోమం ఆచరించాలి.

పిమ్మట శైవపీఠమందు శివార్చన చేయాలి. సిద్ధి పొందిన సాధకుడు విషహరణసమర్ధుడగును. అభిమంత్రిత జలముతో సాధ్యవ్యక్తిని

అభిషేకించిన, విషవిముక్తుడగును. ఈ మంత్రము కాలకూట విషమును కూడా అమృతమువలె చేయగలుగును.

## శివచింతామణి మంత్రము

శ్లో॥ అగ్నిః సంవర్త కాదిత్య రానిలౌష్ఠ బిందుమత్
చింతామణి రితిఖ్యాతం బీజం సర్వసమృద్ధిదమ్ ।
కాశ్యపో మునిరాఖ్యాతశ్ఛందోఽనుష్టు బుదాహృతం
అర్ధనారీశ్వరః ప్రోక్తో దేవతాం జగతాం పతిః ।
రేఫాదివ్యంజనైః షడ్భిః కుర్యాదంగాని షట్ క్రమాత్
ఏకలక్షం జపేద్బీజమిత్థం మంత్రీ విచింతయేత్ ।
అయుతం మధునా సిక్తై ర్జుహుయాత్తిలతండులైః
శైవోదితే యజేత్ పీఠే ప్రాగంగైః షడ్భిరీరితైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు ఉత్తరవక్త్ర ప్రధానమైన శివచింతామణి మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - క్ష్మ్ర్వ్ర్యౌం । (క్షమవరయయూం) (ఒకే అక్షరంగా పలకాలి)**

**కాశ్యపఋషిః । అనుష్టుప్ ఛందః । అర్ధనారీశ్వరో దేవతా । రేఫోబీజం - ఊకారః శక్తిః ।**

మంత్రములోని ర - క - ష - ర - య - మ, బీజములతో షడంగ న్యాసమాచరించి, ఇలా ధ్యానించాలి.

శ్లో॥ నీలప్రవాళ రుచిరం విలసత్ త్రినేత్రం
పాశారుణోత్పల కపాల త్రిశూల హస్తమ్ ।
అర్ధాంబికేశమనిశం ప్రవిభక్త భూషం
బాలేందు బద్ధముకుటం ప్రణమామిరూపమ్ ॥

పై మంత్రమును, ఒక లక్ష జపించి, మధుమిశ్రిత తిలతండులములతో, పదివేలు హోమం చేయాలి.

పిమ్మట శైవపీఠమందు, అంగాదులను ప్రథమావరణమందు, ర - ల - వ - శ - ష - స - హ - క్ష వర్ణములను ద్వితీయావరణము నందును, అష్టమాతృకలను తృతీయావరణమునందును, వజ్రాది ఆయుధ సహిత దిక్పాలురను చతుర్థావరణమునందున అర్చించాలి.

ఈ మంత్రము తేజస్సు - యశము - విద్యా - సంపదలను అనుగ్రహించును. త్రికోణ ఊర్ధ్వ భాగమందు ప్రతిలోమ స్వరములతో సంపుటితము చేసిన చింతామణి బీజము లిఖించాలి. దాని బయట వేష్టితముచేసి, ఆపై షట్కోణములందు ర - క - ష - మ - ర - య, వర్ణములు లిఖించాలి.

పిమ్మట మంత్రజపము చేయుచూ, భూతావేశము పొందిన వాని శిరస్సుపై ఈ యంత్రమునుంచిన, ఆవేశము తొలగి స్వస్థుడగును.

16 అచ్చులతో సంపుటితము చేసిన ఠ వర్ణము నుండి, అమృతము స్రవించుచున్నట్లు ధ్యానించిన, విషార్తునికి విషము తొలగును.

త్రికోణమధ్యమందు సాధ్యనామము, కర్మ లిఖించి పైన రేఫ లిఖించాలి. దానిపై షట్కోణముతో ఆవేష్టితము చేసి కోణములందు “రం” లిఖించాలి. మరల ప్రతిలోమముగా దానిపై 16 అచ్చులు లిఖించి వేష్టితం చేయాలి దీనిని ----- యందు పాతిపెట్టిన, సాధ్యవ్యక్తి వశవర్తిగా నుండును.

## పుత్తలీ ప్రయోగము

శ్లో॥ మధురత్రయ యుక్తేన శాలిపిష్టేన పుత్తలీం
కృత్వా ప్రతిష్ఠిత ప్రాణాం విభజ్యాజుహుయాద్వశీ ।

త్రివాసరమనేనైవ సాధ్యస్తస్య వశీభవేత్
మకారగత సాధ్యాఖ్య మనలస్థ గదాహ్వాయమ్ ।
త్రివాసరమనేనైవ సాధ్యస్తస్య వశీ భవేత్
మకారగత సాధ్యాఖ్య మనలస్థ గదాహ్వాయమ్ ।
చంద్రగం చతురస్త్రేణ టాంతకోణేన వేష్టితం
బీజంతాంబూల పత్రస్థం ప్రజప్తం మనునాఽమునా ।
భక్షితం నాశయేత్సమ్యక్ శిరోరోగం న సంశయః
లిఖిత్వాబంధు జీవేన త్రికోణం బీజ గర్భితమ్ ।
అత్ర వహ్నింసమాధాయ సమ్యగారాధ్య దేవతామ్
జుహుయాత్ కృతసంపాతం సర్పిషాష్టోత్తరం శతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - బియ్యపు పిండిలో త్రిమధురములు కలిపి, బొమ్మగా చేయాలి. సాధ్యవ్యక్తి నామముతో దానియందు ప్రాణప్రతిష్ఠ చేయాలి. దానిని విభజించి మూడురోజులు ఈ మంత్రముతో హోమం చేయాలి. సాధ్యవ్యక్తి వశమగును.

తమలపాకుపై రెండు మకారములమధ్య ఈ మంత్రము లిఖించి సాధ్యనామం చేర్చాలి. పిమ్మట రోగంపేరు దానిపై రేఫ చేర్చాలి. దానికి 4 కోణములందు ఠంఠం లిఖించి, మధ్యలో ఠంతో వేష్టితం చేయాలి. దీనిని సాధ్యవ్యక్తికి, తినిపించిన రోగ నివారణమగును.

మందారపుష్పరసముతో త్రికోణము లిఖించి, మధ్యలో చింతామణి బీజము లిఖించి, అర్ధనారీశ్వరుని ధ్యానించి, నేతితో 108సార్లు హోమం చేయుచూ, శేషఘృతమును ఒక పాత్రలో చల్లుతూ, చివరగా ఆ ఘృతముతో త్రిలోహ ఉంగరమును తడిపి, దానిని ధరించి, కృత్యాది ప్రయోగములు నశించును.

# చింతామణి యంత్రం

శ్లో॥ ఊర్ధ్వ వహ్ని రహితం మనుమేనం వహ్నిగేహయుగళే పరిలేఖ్య
అగ్నిమస్త్రిషు మహీపురవీతం యంత్రమేత దుదితం గ్రహవైరి ।
అగ్నిబీజ లసత్కోణ త్రికోణలిఖితే ధృవే
శరావే కపిలాజ్యాబ్జ సూత్రదీపం ప్రవిన్యసేత్ ।
షుటేనైనం పిధాయాஉస్య పృష్ఠే యంత్ర మిదంలిఖేత్
భూతార్త మత్ర సంస్థాప్య చింతామణి మనుం జపేత్ ।
తమా విశ్య క్షణాన్ ముంచేద్ గ్రహః క్రూరోஉపి సర్వథా

**సంపత్కరి తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణము లిఖించి ఊర్ధ్వరేఫ రహిత చింతామణి బీజము ఆరుకోణములందు లిఖించాలి. పిమ్మట దానికి భూపురము లిఖించి ధరించిన గ్రహబాధలను నివారించును. (క్షమలవయయూం)

భూర్జపత్రముపైగాని, బంగారు – వెండిరేకుపై గాని, ఎరుపురంగుతో త్రికోణములో మంత్రము లిఖించి మధ్యలో ప్రణవం లిఖించాలి. పిమ్మట కపిలాజ్యమందు తామర వత్తిని వేసి దీపం వెలిగించి దానిపై మూకుడు మూత వేయాలి.

ఆ మూకుడుపై మంత్రము లిఖించి, సాధ్యవ్యక్తి దానిని తాకుతూ మంత్రజపము చేసిన భూతావేశము, భూతబాధ తొలగును.

# మనోరథ ప్రద యంత్రము

శ్లో॥ కృశానుభువనద్వయే మనోమిమంలిఖిత్వా
పునస్త దస్త్రిషు హలోలిఖేత్ స్వరయుగంతతః సంధిషు।
ధృవేణ పరివేష్టితం ధరణిగేహ మధ్యస్థితం
మనోరథ ఫలప్రదం భవతియంత్ర మేతన్నృణామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణము లిఖించి, మధ్యలో చింతామణి బీజము లిఖించాలి. ఆరుకోణములందు ర - క - ష - మ - ర - య అక్షరములు లిఖించి, 8 సంధులందు రెండేసి అచ్చులను (మొత్తం 16) లిఖించాలి. ఆపై 4 దిశల ప్రణవం లిఖించి, వేష్టితం చేయాలి. పిమ్మత భూపురం లిఖించాలి. ఈ యంత్రారాధన, ధారణ వలన సమస్త మనోరథములు నెరవేరును.

## ఆపద గ్రహఘ్న యంత్రము

శ్లో॥ షట్కోణాంతస్త్రికోణే లిఖతు మనోమిమం సాధ్య నామాక్షరాఢ్యం
షట్కోణేష్వంగమంత్రాన్ వసుదళ వివరేష్ట మంత్రాక్షరాణి ।
వీతంబాహ్యే కలాభిస్తదను పరివృతం కాదిభిర్యాదిభి
స్తత్ క్షౌణీబింబేన యుక్తం నృహరిమనుయుతం యంత్రమాపద్గ్రహఘ్నమ్॥
స్వరావృతమముంమనుం లిఖతుటాంత మధ్యేతతః
షడస్త్రిషు హుతాశనం తదను కాది వర్ణైర్ వృతమ్ ।
ధరాపురయుగేన తన్ నృహరి బీజయుక్తాస్త్రిణా
ప్రవేష్టితముదాహృతం దురిత రోగకృత్యాపహమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణ పద్మము లిఖించి మధ్యలో మరొక త్రికోణము లిఖించాలి. త్రికోణమందు సాధ్యనామముతో మంత్రము లిఖించాలి. షట్కోణములందు అంగమంత్రములు, షట్కోణము బయట అష్టదళములందు, ర - క - ష - మ - ర - య - ఔ - ఉ లిఖించాలి.

ఆపై దానిబయట 16 అచ్చులను వ్రాసి, దానిని వేష్టితం చేయాలి. మరల, క నుండి మ వరకు, య నుండి క్ష వరకు రెండు వృత్తములలో

లిఖించి వేష్టితం చేయాలి. ఆపై భూపురం లిఖించి నాలుగు కోణములందు నృసింహబీజము (క్ష్రౌం) లిఖించాలి. ఈ యంత్రము సకల ఆపదలను, గ్రహబాధలను తొలగించును.

ఈ యంత్రముపై కలశస్థాపన చేసి, అర్చించి, ఆ కుంభజలముతో, రోగిని అభిషేకించిన, కృత్యాదిబాధలు, అభిచార ప్రయోగములు నశించును.

షట్కోణ మధ్యమందు ర వర్ణముతో, మంత్రము సంపుటితము చేసి లిఖించాలి. ఆరుకోణములందు రేఫ లిఖించాలి. దానిపై క నుండి క్ష వరకు వృత్తముగా లిఖించి దానిని వేష్టితం చేయాలి. ఈ యంత్రము కూడా గ్రహబాధలను, ప్రయోగములను నివారించును.

## శివ తుంబురు బీజము

శ్లో॥ క్షకారో మాగ్నిపవన వామకర్ణార్థ చంద్రవాన్
ఉక్తం తుంబురు బీజం తుయేన సిధ్యంతి సాధకాః ।
షడ్దీర్ఘ భాజా బీజేన షడంగాని కల్పయేత్
క్షకార రహితంబీజం క్రమాజ్జభసహాన్వితమ్ ।
చత్వారి దేవీ బీజాని దేవ్యో జ్ఞేయా ఇమాః క్రమాత్
జయాఖ్యా విజయా పశ్చాదజితా చాఽపరాజితా ।
బీజమంగుళిషున్యస్య కరమోర్ వ్యాపకం తతః
కనిష్ఠాదిషు విన్యస్యేత్ షడంగాని తలావధి ।
దేవందేవీః స్వబీజాది కనిష్ఠాదిషు విన్యసేత్
పాదాన్ మూర్ధావధి న్యస్యేత్ ముష్టినాఽ వయవేషు తత్।
తాలాభ్యాం వ్యాపకం మర్యాన్ మూర్ధా ది చరణావధి
షడంగాని తతో న్యస్యేద్యథా స్థానం విశాలధీః ।
దేవందే వీర్యథా పూర్వం మూర్ధా స్వహృదయాంబుజే

**నాభౌ గుహ్యే క్రమాన్ న్యస్యేత్ పశ్చాద్దేవం విచింతయేత్।**
**లక్షమానం జపేన్మంత్రం జుహుయాత్సర్పిషాఽన్వితం**
**వక్ష్యమాణే యజేత్ పీఠే దేవమావరణైః సహ ।**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు శివుని తుంబురు బీజము చెప్పబడుచున్నది.

**మనుః - క్ష్మ్ర్యూమ్ (క్షమరయఊం)**

ఋష్యాదులు పూర్వమువలెను, తుంబురునికి 4 దేవీశక్తులు కలవు. 1. జయా 2. విజయా 3. అజితా 4. అపరాజితా, వీరికి జ - భ - స - హ అనే అక్షరములు క్రమముగా మ - ర - య - మ్ - అనే వర్ణములు చేర్చిన, దేవీ బీజములగును.

క - ష - మ - ర - యూం అనే బీజములతో పంచాంగులీ న్యాసము, మూలమంత్రముతో వ్యాపకన్యాసమూ ఆచరించాలి. మరల మూలమంత్రముతో పాదాది - శిరోఽంతం (పాద - జాను - గుహ్య - నాభి - హృదయ - కంఠ - ముఖ - శిరస్సు) న్యాసం చేయాలి.

మరల దేవ - దేవీ బీజములతో శిరస్సు నుండి శిరో - ముఖ - హృదయ - నాభి - గుహ్యస్థానములందు న్యాసముచేసి, తుంబురుని ఇలా ధ్యానించాలి.

☞ **రక్తా భ మిందు శకలా భరణం త్రినేత్రం**
**ఖట్వాంగపాశ సృణిశుభ్ర కపాలహస్తమ్ ।**
**వేదాననం చిపిటినా సమనర్ఘ భూషం**
**రక్తాంగరాగ కుసుమాంశుక మీశమీడే ॥**

పై మంత్రమును ఒక లక్ష జపించి, ఆజ్యహోమం, హవిస్సుతో చేయాలి. పిమ్మట ఆవరణార్చన ఆచరించాలి.

# స్వదేహమందు పీఠ కల్పన

శ్లో॥ నపుంసక స్వరైర్ విద్వాన్ స్వరాద్యంతద్వయేన చ
ధర్మాదికాన ధర్మాద్యాన్ పాదాన్ గాత్రాణి విన్యసేత్ ।
ఇకారేణ న్యసేత్ పశ్చాత్తను రూపాన్ గుణానథ
శాంత్యాతత్పర వర్ణేన మాయావిద్యామయేక్రమాత్ ।
అథ ఊర్ధ్వచ్ఛ దేవ్యస్యే దర్ధీ శేన తతోఽంబుజమ్
సంధ్యక్షరైర్యజేన్మంత్రీ శక్తీర్వామాదికాః క్రమాత్ ।
వామాం జ్యేష్ఠాం తథారౌద్రీ మిచ్ఛాం జ్వాలాస్వరూపిణీః
ఏవం ప్రకల్పితేపీఠే మూర్తింమూలేన కల్పయేత్ ।
ఆవాహ్యాపూజయేద్దేవం తస్యామా వరణై స్సహ
అంగావృతే బహిర్దేవీర్ దిక్ పత్రేషు సమర్చయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సాధకుడు నాలుగు నపుంసక వర్ణములతో (ఋ, ౠ, ఌ, ౡ), క్రమముగా ధర్మ – జ్ఞాన – వైరాగ్య – ఐశ్వర్యములను, అ – ఆ – అం – అః అను వర్ణములతో అధర్మ – అజ్ఞాన – అవైరాగ్య – అనైశ్వర్యములను శరీరమునందు న్యాసం చేయాలి.

ఉదా : అ – ఆ – అం – అః – ఋ – అధర్మాయ నమః ।
ఇ – ఈ – ఓ – ఔ – ౠ – అజ్ఞానాయ నమః ।
ఉ – ఊ – ఏ – ఐ – ఌ – అవైర్యాగాయ నమః ।
ఋ – ౠ – ఌ ౡ – అనైశ్వర్యాయ నమః ।

మరొక విధానములో

ఋం ధర్మాయ నమః ।

ౠం జ్ఞానాయ నమః ।

ఌం వైరాగ్యాయ నమః ।

ౡం ఐశ్వర్యాయ నమః । అని న్యాసం చేయాలి.

పిమ్మట, శరీరమును పీటముగా భావించి సత్వాది గుణములను న్యాసం చేయాలి. ఈ – ఉ – ఊ వర్ణములతో విద్యాన్యాసము చేయాలి. (రెండవ పటం చూడండి) సంధ్యక్షరములు ఏ – ఐ – ఓ – ఔ లతో వామ – జ్యేష్ఠ – రౌద్రి – ఇచ్ఛా శక్తులను న్యాసం చేయాలి. వీరంతా జ్వాలా రూపిణులు.

'తుంబురు యోగపీఠాయ నమః" అని శరీరమునందు పీఠపూజ గావించి మూలమంత్రముతో విగ్రహ కల్పన చేయాలి. పిమ్మట ఆవాహన – అంగావరణ – దిక్ పత్రములందు జయాదులను ఆయా బీజాక్షరములతో అర్చించాలి.

వీరంతా ఎర్రనిదేహముతో, రక్తగంధాను లేపినులై, ఎర్రవస్త్రములు పుష్పములు ధరించి, తాంబూలము వేసుకొని యుందురు. అంతా వీణావాదన చేయుచుందురు. కామపీడితులై గర్వితులై యుందురు. ఈశాన్యకోణమునుండి ప్రదక్షిణాక్రమముగా ఆగ్నేయ కోణమువరకు 4 దూతికలను పూజించాలి.

దుర్భగా – సుభగా – కరాళీ – మోహినీ వీరంతా దోసిలి యొగ్గి యుందురు. ఈశాన్యకోణమునుండి ప్రదక్షిణా క్రమముగా ఆగ్నేయ కోణమువరకు 4 దూతికలను పూజించాలి.

దుర్భగా – సుభగా – కరాళీ – మోహినీ, వీరంతా దోసిలి యొగ్గి యుందురు. ముఖము కిందికి వంచి వినమ్రముగా యుందురు. వీరి

వస్త్రాభరణములు జయాదుల వలెనే యుండును. వీరి బీజములు క్రమముగా శం - షం - సం - హం.

పిమ్మట వజ్రాది ఆయుధములు ధరించిన, లోకపాలురను అర్చించాలి. ఇట్టి సాధకులకు మూడు లోకములందు ఎదురులేదు.

వాయుమండలంలో అగ్నిపురము, దానిలోపల ఈ బీజము సాధ్యవ్యక్తి శిరముపై నున్నట్లు స్మరణ చేయుచూ జపించిన, సమస్త భూత బాధలూ నివారణమగును. (ప్రథమ పటలం చూడండి)

హృదయమునందు తుంబుర శివుడు క్రోధముగా నున్నట్లు భావించుచూ క్లీం సహిత తుంబురు బీజమును జపించిన, సాధ్యవ్యక్తి వెంటనే వశడగును.

హృద్రోగము - శ్వాసరోగము - నివారణ కొరకు నృసింహ బీజ (క్షౌం) సహితముగా, తుంబుర బీజముతో అభిమంత్రించిన జలము, ప్రాతః కాలమున సేవించిన రోగము నివారణమగును. ఆరోగ్యము సిద్ధించును.

శ్లో॥ కృత్వానవపదాత్మానం మండలం తత్రశోభనాన్
కలశాన్ స్థాపయేన్మంత్రీ నవ పూర్వోక్త లక్షణాన్ ।
మధ్యే దేవం యజేత్ సమ్యక్ దేవీః పూర్వోక్త కుంభగాః
ఇష్ట్వా కోణస్థితా దూతీ రభిషించేత్ పతివ్రతామ్ ।
నారీసాలభతే పుత్రం వంధ్యాఽపి కిముతాఽపరా
భూతకృత్యా గ్రహద్రోహ శాంతిదః సంపదావహః ।
అభిషేకోఽయ మాఖ్యాతో రాజ్ఞాం విజయవర్ధనః
అంతర్బీజం స్వరగణ లసత్కేసరం తస్య బాహ్యే
దేవీ దూతీ మనుయుతదళం దిగ్విదిక్షు క్రమేణ ।

కాద్యైర్ వర్ణైర్వృత మథ బహిర్భూ మిగేహేన వీతం
యంత్రం ప్రోక్తం సకల సుఖదం రోగకృత్యాగ్రహఘ్నమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నవపద మండలం నిర్మించాలి. పూర్వోక్త విధానములో కొత్త కలశమును స్థాపించి, మధ్యలో దేవాధిదేవుని అర్చించాలి. పూర్వాది దిశలందు జయాదులను, కోణము లందు కరాళి మొదలైన వారిని దూతికలను అర్చించాలి. ఆ కుంభ జలముతో యజమానురాలిని అభిషేకించిన ఆమె సంతావంతురాలగును.

ఇట్టి అభిషేకమువలన భూతబాధ – అభిచార ప్రయోగములు, గ్రహబాధలు, శతృద్రోహములు, ఇతర ఉపద్రవములూ నివారణ మగును. ఇదే అభిషేకమును పాలకునికి ఆచరించిన సర్వత్ర విజయమును, జనాదరణను పొందును.

## తుంబురు యంత్రము

ముందుగా అష్టదళ పద్మం నిర్మించాలి. (కర్ణికలో) మూలమంత్రం లిఖించాలి. కేసరములందు అచ్చులు రెండేసి లిఖించాలి. దిగ్దళములందు, దేవీ బీజములను కోణములందు, దూతీ బీజములను లిఖించాలి.

ఆపై వృత్తము లిఖించి కకారాది క్షకారాంత వర్ణములు లిఖించి వేష్టితం చేయాలి. పిమ్మట భూపురము లిఖించాలి. ఇట్టి యంత్రము సర్వవిధ కామనలను నెరవేర్చును. రోగ – కృత్యాది బాధలను నివారించును.

## ఖడ్గరావణ మంత్రము

శ్లో॥ ప్రణవో హృదయం పశ్చాత్ జేఽంతం పశుపతింపునః
తారోనమోభూతపదం తతోఽధిపతయే ధృవమ్ ।
నమోరుద్రాయ యుగళం ఖడ్గరావణ శబ్దతః

విహర ద్వితయం పశ్చాత్ సరనృత్యయుగం పృథక్ ।
శ్మశాన భస్మార్చితాంతే శరీరాయ తతఃపరమ్
ఘంటా కపాలమాలాది ధరాయేతి పదం పునః ।
వ్యాఘ్ర చర్మ పదస్యాంతే పరిధానాయ తత్పరం
శశాంక కృత శబ్దాంతే శేఖరాయ తతః పరమ్ ।
కృష్ణ సర్పపదం పశ్చాత్తతో యజ్ఞోపవీతినే
చలయుగ్మం వల్గయుగమని వర్తకపాలినే ।
హనయుగ్మం తతో భూతాన్ త్రాసయద్వితయం పునః
భూయో మండలమధ్యే స్యాత్ కటయుగ్మం తతః పరమ్।
రుద్రాంకుశేన శమయ ప్రవేశయయుగంతతః
ఆవేశయయుగం పశ్చాచ్చండాసి పదమీరయేత్ ।
ధరాధిపతి రుద్రోఽథ జ్ఞాపయేత్యగ్ని సుందరీ
ఖడ్గరావణ మంత్రోఽయం సప్తత్యూర్ధ్వ శతాక్షరః ।
భూతాధి పతయే స్వాహా పూజా మంత్రోఽయమీరితః
సద్యాది పంచ హ్రస్వాధ్యకాంత బీజాదికాన్ న్యసేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 170 అక్షరముల ఖడ్గరావణ మంత్రము చెప్పబడుచున్నది. ఈ మంత్రము జపించి, భూతావేశము పట్టిన వారి శిరసు తాకిన స్వస్థత కలుగును. ఇది పూజా మంత్రము. ఈ మంత్రముతో శివుని పూజించి సద్యాది పంచబీజములను, సబిందువుతో కూడిన ఖ బీజముతో (ఖం) పంచాంగ న్యాసమాచరించాలి.

**సద్యాది పంచబీజములతో - ఖోం - ఖైం - ఖుం - ఖిం - ఖం - ఖడ్గరావణమనుః - ఓం నమః పశుపతయే ఓం నమో భూత అదిపతయే ఓం నమో రుద్రాయ ఖడ్గరావణ విహర విహర, సర సర, నృత్యనృత్య,**

**శ్మశాన భస్మార్చిత శరీరాయ, ఘంటా కపాల మాలాదిధారాయ, వ్యాఘ్రచర్మ పరిధానాయ, శశాంకకృతశేఖరాయ, కృష్ణ సర్ప యజ్ఞోప వీతినే, చలచల, వల్గువల్గు, అనివర్తకపాలినే, హనహన, భూతాన్ త్రాసయత్రాసయ, మండల మధ్యే కట కట, రుద్రాంకుశేన శమయ, ప్రవేశ ప్రవేశయ, ఆవేశయ ఆవేశయ, చండాసి, ధరాధిపతి రుద్ర జ్ఞాపయ స్వాహా ॥**

## ఈశానాది పంచమూర్తి న్యాసం

శ్లో॥ ఈశానాద్యాః పంచమూర్తీ ర్దేహి వక్త్రేషు చక్రమాత్
షడ్ దీర్ఘ బిందుయుక్తేన కాంతే నాంగక్రియా మతా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈశానాది పంచమూర్తులనూ, శిరో - ముఖ - హృదయ - గుహ్య - పాదములందు, నాలుగు దిశలూ + ఊర్ధ్వమునందూ, (ముఖమునందు) ఆచరించాలి. పిమ్మట ఖాం - ఖీం - ఖూం - ఖైం - ఖౌం - ఖః అని షడంగన్యాసమాచరించాలి. పిమ్మట సదాశివుని ఇలా ధ్యానించాలి.

☞ **ఘంటాకపాలసృణి ముండకృపాణఖేట**
**ఖట్వాంగశూల డమరూనభయం దధానమ్ ।**
**రక్తాంగమిందు శకలాభరణం త్రినేత్రం**
**పంచాననాబ్జమరుణాం శుకమీశమీడే ॥**

ఖడ్గరావణ మంత్రము 20 వేలు జపించి, ఘృతమిశ్రిత పాయసము దశాంశ హోమము చేసి పురశ్చరణ చేయాలి.

శ్లో॥ పంచాక్షరోదితే పీఠే పూజయేత్ ఖడ్గరావణం
బీజేనమూర్తిక్లుప్తిః స్యాత్ తత్కాంతం మనుబిందుమ్ ।
అంగాని దళమూలేషు దూతీః పత్రేషు సంయజేత్

చులుకుండాం ప్రస్థలినీం తృతీయాం కృష్ణ పింగళామ్ ।
ఫల్గునీం టిరిటిల్లీం చ పంచమీం మంత్రమూలికాం
సప్తమీంశంఖినీం పశ్చా చ్చంద్రాంకిత జటామిమాః ।
పూర్వపత్రాది సవ్యేన ఖడ్గరావణ వల్లభాః
ఐంద్రీం కౌమారికీం బ్రాహ్మీం వారాహీం వైష్ణవీం పునః ।
వైనాయకీంచ చాముండాం మాహేశీం దిక్షుపూజయేత్
ద్వారపాలాన్ యజేద్దిక్షు ద్వ్యాద్వ్యాప్రాగాది దేశికః ।
రౌద్ర పింగళ నామానౌ ద్వౌశ్మశాన విభీషణౌ
దృఢవర్ణం భృంగిరీటి ముదీచ్యామర్చయేత్ పునః ।
ఆమర్దక మహాకాళౌ కోణపాలాన్ యజేత్పునః
కుంభకర్ణమశోకాఖ్యం భల్లాటం జాతహారకమ్ ।
ఇంద్రాదికాన్ లోకపాలాన్ సాయుధాన్ పూజయేత్తతః
ధూపదీపాదిభిర్దేవం ప్రీణయిత్వామహేశ్వరమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పంచాక్షర మంత్ర విధానములో చెప్పినట్లుగా, శివ పీఠమునందు, ఖడ్గరావణుని పూజించాలి. ఖౌం బీజముతో విగ్రహ కల్పనచేసి, అష్టదళముల మూలమునందు (కేసరములందు) అంగావరణపూజ, పిమ్మట పత్రమధ్యన దూతీపూజ చేయాలి. వీరు 8గురు దూతికలు. వీరి పేర్లు

**1.**చులుకుండా **2.**ప్రస్థలినీ **3.**కృష్ణపింగళా **4.**ఫల్గునీ **5.**టిరిటిల్లీ **6.**మంత్రమాలికా **7.**శంఖినీ **8.**చంద్రాంకిత జటా

పిమ్మట 8మంది ఖడ్గరావణుని భార్యలను దిగ్దలములనుండి ప్రదక్షిణ క్రమములో అర్చించాలి. **1.**ఐంద్రీ **2.**కౌమారకీ **3.**బ్రాహ్మీ **4.**వారాహీ

**5.**వైష్ణవీ **6.**వైనాయకీ **7.**చాముండా **8.**మాహేశీ. పిమ్మట పూర్వాది దిశాక్రమముగా ఇద్దరేసి ద్వారపాలకుల నర్చించాలి.

| | | |
|---|---|---|
| తూర్పున | - | రౌద్ర, పింగళులనే ద్వారపాలకులు |
| దక్షిణమున | - | శ్మశాన, విభీషణులు |
| పశ్చిమమున | - | దృఢకర్ణ, భృంగిరీటులు |
| ఉత్తరమున | - | ఆమర్దక, మహాకాళులు |

పిమ్మట ఆగ్నేయాది కోణములందు

| | | |
|---|---|---|
| ఆగ్నేయం | - | కుంభకర్ణ |
| నైఋతి | - | అశోక |
| వాయవ్యం | - | భల్లాట |
| ఈశాన్యం | - | జాతహారకుల నర్చించాలి. |

పిమ్మట వజ్రాది ఆయుధములు ధరించిన, ఇంద్రాదిలోకపాలకులను, వజ్రాది ఆయుధములు ధరించిన, ఇంద్రాది లోకపాలకులను, శివుని ధూప దీపాది ఉపచారములతోను అర్చించాలి.

శ్లో॥ పంచక్రూరాంధసా బాహ్యే తతోభూతబలిం హరేత్
ఏవం పూజాదిభిః సిద్ధే మంత్రే మంత్రవిదాం వరః ।
నాశయేత్ సకలాన్ భూతాన్ కృత్యాగ్రహ మహాభయాన్
ఆదేశం తస్యకుర్వంతి భూతా భీతా మహాత్మనః ।
బహునాకిమిహోక్తేన మంత్రేణా నేన భూతలే
సదృశో నాస్తి మంత్రోఽన్యో భూతనిగ్రహసాధనే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చివరిగా పంచ క్రూరాన్నము లను (**1.** పెరుగన్నం, **2.** సత్తుపిండి **3.** పసుపు **4.** పేలాలు **5.** తిలలు)

భూతబలిగా సమర్పించాలి. ఈ ప్రకారము ఖడ్గరావణ మంత్రోపాసన చేసిన సాధకుడు, సమస్త భూత - కృత్యా - గ్రహ బాధలను తొలగించ సమర్థుడు అగును. భూత గణములు సాధకుని వశవర్తులై యుందురు.

ఇంకా ప్రత్యేకముగా చెప్పి ఏమి ఫలము? ఈ మంత్రముతో సమానమైనది, భూతనిగ్రహము సాధించుటలో మరొకటి లేదు.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*ఊనవింశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ వింశః పటలః

## అథ అఘోర ప్రకరణం

శ్లో॥ అథాఽభిధాస్యేఽ విధివదఘోరాస్త్రమనుత్తమం
యస్యసంస్మరణాదేవ సర్వేనశ్యంత్యుపద్రవాః ।
మాయా స్ఫుర ద్వయం భూయః ప్రస్ఫుర ద్వితయం తతః
ఘోరఘోర రతరేత్యంతే తనురూప పదం పునః ।
చట యుగ్మం తదంతే స్యాత్ ప్రచట ద్వితయం తతః
కహయుగ్మం వమద్వంద్వం తతో బంధ యుగం పునః ।
ఘాతయద్వితయం వర్మ ఫడంతః సముదాహృతః
ఏకపంచాశర్ణోఽయము ఘోరాస్త్ర మహామనుః ।
అఘోరోఽస్యమునిః ప్రోక్తో చ్ఛందాంత్రిష్టు బుదాహృతం
అఘోరరుద్ర సందిష్టో దేవతా మంత్ర విత్తమైః ।
హృదయం పంచభిఃప్రోక్తం శిరః షడ్భిరుదాహృతం
శిఖా దశ ఖిరాఖ్యాతా తావద్భిః కవచం మతమ్ ।

వసువర్ణైః స్మృతంనేత్రం మాసార్ణైరస్త్ర మీరితం
మూర్ధనేత్రాస్య కంఠేషు హృన్నాభ్యం ధూరుషు క్రమాత్ ।
జానుజంఘా పదద్వంద్వే రుద్రభిన్నాక్షరైర్ న్యసేత్
పంచభిశ్చపునః షడ్భిర్ ద్వాభ్యామష్ట భిరక్షరైః ।
చతుర్వర్ణైః షడర్ణైశ్చ కరణైః కరణైః పునః
చతుర్భిః షడర్ణైశ్చ కరణైః కరణైః పునః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు సర్వశ్రేష్ఠమైన "అఘోరాస్త్ర" మంత్రము చెప్పబడుచున్నది. దీని స్మరణ మాత్రముచేతనే సకల ఉపద్రవములూ తొలగును. ఇది 51 అక్షరముల మంత్రము.

**మనుః -హ్రీం స్ఫురస్ఫుర, ప్రస్ఫుర ప్రస్ఫుర, ఘోరఘోరతర, తనురూప, చట చట, ప్రచట ప్రచట, కహ కహ, వమవమ, బంధ బంధ, ఘాతయ ఘాతయ, హుంఫట్ ॥**

**అఘోరఋషిః । త్రిష్టుప్ ఛందః । అఘోరరుద్రోదేవతా । హాలోబీజాని - స్వరాః శక్తయః । (హుంబీజం - హ్రోం శక్తిః అని పద్మపాదాచార్యులు)**

మంత్రములోని మొదటి 5 అక్షరములతో హృదయన్యాసము, తరువాతి 6 అక్షరములతో శిరోన్యాసము, 10తో శిఖ, 10తో కవచము, 8తో నేత్రన్యాసము, 12తో అస్త్రన్యాసము ఆచరించాలి. పిమ్మట శిరో - నేత్ర - ముఖ - కంఠ - హృదయ - నాభి - లింగ - ఊరు - 2 జాను - 2 జంఘా - 2 పాదములందు, మూలమంత్రమును 11 భాగములు చేసి, పై 11 స్థానములందూ న్యాసము చేయాలి.

11 భాగములు - 5 - 6 - 2 - 4 - 6 - 4 - 4 - 4 - 6 - 2 పిమ్మట, అఘోరరుద్రుని ఇలా ధ్యానించాలి.

☞ **సజలఘున సమాభం భీమదంష్ట్రం త్రినేత్రం**
**భుజగధరమఘోరం రక్తవస్త్రాంగ రాగమ్ ।**
**పరశుడమరు ఖడ్గాన్ ఖేటకం బాణచాపౌ**
**త్రిశిఖ నరకపాలే బిభ్రతం భావయామి ॥**

అయితే అఘోరరుద్రుని, భావించునపుడు, మారణం, గ్రహబాధా వినాశన కాలమందు నల్లని వర్ణముగాను, వశ్యకార్యమందు ఎరుపు వర్ణునిగాను, ముక్తి కొరకు తెల్లని రూపునిగాను ధ్యానించాలి.

## పురశ్చరణ

శ్లో॥ లక్షమేకం జపేన్మంత్రం ఘృత సిక్తై సిలైః శుభైః
తద్దశాంశం ప్రజుహుయాన్మంత్రీ మంత్రస్య సిద్ధయే ।
శైవేసంపూజయేత్ పీటే, షట్కోణాంతస్థ పంకజే
అంగపూజాంకేసరేషు కృత్వాపత్రేషు తత్పరమ్ ।
పరశుండమరుం ఖడ్గం ఖేటం బాణం చ కార్ముకం
శూలం కపాలం ప్రయజేదష్టాస్త్రాణ్యస్య దేశికః ।
దళాగ్రేషు తతః పూజ్యా బ్రాహ్మ్యాద్యాః ప్రోక్తలక్షణాః
లోకేశాన్ పూజయేత్ పశ్చాదాయుధైః స్వైః సమన్వితాన్ ।
ఇతి పూజాది భిఃసిద్ధే మంత్రేణాஉనేన సాదకః
ఇష్టాన్ ప్రయోగాన్ కుర్వీత సిధ్యంతే నాత్ర సంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పై మంత్రమును, లక్ష జపించి ఆజ్యసహిత తిలలతో, దశాంశహోమం ఆచరించాలి. పిమ్మట శైవపీఠమునందు ముందుగా అష్టదళ పద్మము, దానిపై షట్ కోణము, దానిపై నాలుగు ద్వారముల చతురస్రము నిర్మించాలి.

కేసరములందు అంగపూజ, పత్రములందు పరశు - డమరు - ఖడ్గ - ఖేటక - బాణ - ధనుస్ - శూల - కపాలములను పూజించాలి. దళాగ్రభాగములందు బ్రాహ్మీ మొదలగు వారిని పిమ్మట వజ్రాది ఆయుధములను ధరించిన లోకపాలురను, అర్చించాలి. ఇలా పూజించిన సాధకుడు మంత్రసిద్ధిని పొంది అభీష్ట ప్రయోగములను సాధించగలడు.

శ్లో॥ క్రమాత్ సర్పిరసామార్గ తిల సర్ష ప పాయసైః
సాజ్యైః సహస్రం ప్రత్యేకం యామిన్యాం జుహుయాత్ సుధీః।
హోమోఽయం నావయేత్ సద్యోభూత కృత్యాద్యుపద్రువాన్
సిత కింశుక నిర్గుండీ హోమాపా మార్గసంభవైః ।
సమిద్వరైః కృతోహోమః పూర్వవద్ భూతశాంతిదః
అపామార్గారగ్వధయోః పంచగవ్యసమిక్షితాః ।
సమిధో జుహుయాత్ కృష్ణపంచమ్యాం నిశిసంయతః
పృథక్ సహస్రహ హోమేన భూతానాం నిగ్రహో భవేత్ ।
క్రమాత్ సర్పిరపామార్గ పంచగవ్యహవిర్ ఘృతైః
హుత్వా సహస్రం ప్రత్యేకం పాత్రే సంపాతయేత్ సుధీః
సంపాత సర్పిషా సాధ్యం భావయేత్ భూత శాంతయే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - నెయ్యి - ఉత్తరేణి - తిలలు - తెల్లావాలు - పాయసము వీటిని ఒకొక్కదానితో నేయి కలిపి, రాత్రియందు ఒక్కొక్కటీ వెయ్యిసార్లు హోమం చేయాలి. అందువలన భూత బాధ - కృత్యాప్రయోగములూ నశించును.

తెల్లమోదుగ - వావిలి - ఉమ్మెత్త - ఉత్తరేణి సమిదలతో హోమం చేసిననూ భూతాది ఉపద్రవములు తొలగును. ఉత్తరేణి - అరగ్వధ ( ) సమిధలతో, పంచగవ్యముతో ప్రక్షాళన చేసి, కృష్ణపక్ష పంచమితిధి రాత్రి,

వెయ్యేసిసార్లు ప్రత్యేకముగా హోమం చేసిన సకల ప్రయోగములూ అభిచార క్రియలూ నశించును.

క్రమముగా నెయ్యి - ఉత్తరేణి - పంచగవ్యములతో వండి, దానియందు నెయ్యి కలిపి, వెయ్యేసిసార్లు హోమం చేసి ఆహుతి శేషఘృతమును, మరొక పాత్రయందు చిలికించుచూ హోమానంతరం దానిని సాధ్యవ్యక్తికి ఇచ్చిన భూతబాధ శాంతించును.

## యంత్ర కథనం

శ్లో॥ మధ్యేశక్తిం ససాధ్యాం స్వరగణ సహితాంకేసరేష్వష్టవర్గాన్
పత్రాంతర్మంత్ర వర్ణాన్ లిఖతు గుణమితానగ్ర దేశేషు తద్వత్।
వర్మాస్త్రోల్లాసి కోణే దహనపురయుగే కల్పితే భూపురస్థే
యంత్రేఽస్మిన్ ప్రాగ్విధానాత్ కృతకలశవిధిః సర్వదుఃఖాపహారీ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అఘోరయంత్రము వివరించబడు చున్నది. ముందుగా అష్టదళ పద్మము లిఖించాలి. దాని కర్ణిక (మధ్య) యందు సాధ్య - సాధక - కర్మలు లిఖించాలి. పిమ్మట కర్మసహిత శక్తి బీజము షోడశస్వర (16 అచ్చులు)ములతో ఆవృతం చేయాలి. కేసరములందు - క - చ - ట - త - ప - య - శ - ల వర్గులు లిఖించాలి.

అష్టపత్రముల మధ్యలో మంత్రముయొక్క స్ఫుర స్ఫురనుండి - చట చట పర్యంతము, 24 అక్షరములలో మూడేసి అక్షరములు క్రమము 8 దళములందూ లిఖించాలి. పిమ్మట పత్రాగ్ర భాగములందు మంత్ర శేషము ప్రచట ప్రచట నుండి - ఘతయ ఘాతయ వరకు 24 అక్షరములలో మూడేసి అక్షరములు లిఖించాలి.

పిమ్మట అష్టదళపద్మముపై వ్యతిభిన్న షట్కోణము లిఖించి, హుంఫట్ లిఖించాలి. పిమ్మట దానిపై భూపురము నిర్మించాలి. ఈ యంత్రమును కలశమునందు స్థాపించి, పూజాదులు నిర్వహించిన సకల ఆపదలు - బాధలు తొలగును.

## మరొక అఘోర యంత్రము

శ్లో॥ షట్కోణే శక్తిరంతః స్ఫురయుగళవృతా ప్రస్ఫుర ద్వంద్వకోణే
శ్లిష్టై ర్మంత్రస్య వర్ణైః రసకణ చతుఃషట్ చతుర్వేదవేదైః
షడ్భిఃక్లప్తాష్టపత్రం దహనపురయుగే నావృతం వర్మఫడ్ భ్యాం
రాజత్ కోణేన వీతం ధరణి పురయుగం యంత్రమాఘోరమే తత్ ॥
క్షుద్రచౌరగ్రహ వ్యాళ భూతాపస్మార నాశనం
యంత్రమేతత్ సమాఖ్యాతం సర్వసంపత్ ప్రదాయకమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ముందుగా షట్కోణ చక్రము లిఖించి, ప్రస్ఫుర అను దానిలోని ఒక్కొక్క అక్షరము రెండేసిసార్లు లిఖించాలి. మధ్యలో స్ఫుర శబ్దముతో సాధ్య - సాధనకర్మ - సాధక నామములు హ్రీం బీజసహితముగా సంపుటము చేసి లిఖించాలి.

దానిపై అష్టదళకమలము లిఖించి, మిగిలిన మంత్రములోని, అనగా ఘోర శబ్దమునుండి ఘాతయ పర్యంతము 38 అక్షరములలో 6 - 4 - 4 - 6 - 44 - 6 - 6 అక్షరములు 8 భాగములుగా లిఖించాలి. ఆపై షట్కోణము లిఖించి, ప్రతీ కోణమునందు "హుంఫట్" లిఖించి, ఆవృతం చేయాలి. దపై నాలుగుప్రక్కలా రెండు భూపురములు లిఖించాలి.

ఈ అఘోరయంత్రము క్షుద్ర - రోగ - చోర - గ్రహ - సర్ప - భూత - అపస్మార జన్య బాధలను నివారించి, సకలవిధమైన సంపదలను ఇచ్చును.

# పాశుపతాస్త్ర మంత్రము

శ్లో॥ తారో వాంతో ధరాసంస్థో వామనేత్రేందు భూషితః
పార్శ్వో వకః కర్ణయుతో వర్మాస్త్రాంతః షడక్షరః ।
మనుః పాశుపతాస్త్రాఖ్యో గ్రహక్షుద్రనివారణః
షడ్భిర్వర్ణైః షడంగాని హుంఫడంతైః సజాతిభిః ।
వర్ణ లక్షం జపేన్మంత్రం జుహుయాత్త ద్దశాంశతః
గవ్యేన సర్పిషా మంత్రీ సంస్కృతే హవ్యవాహనే ।
శైవేపీఠే యజేద్దేవం ప్రాగంగైరష్ట మాతృభిః
ఇంద్రాదిభిర్లోపాలైః వజ్రాద్యైరాయుధైస్తతః ।
అనేనమంత్రితం తోయం గ్రస్తస్య వదనేక్షిపేత్
అమునా మంత్రితాన్ బాణాన్ విసృజేత్ యుధిభూపతిః ।
జయేత్ క్షణేన నిఖిలాన్ శత్రూన్ పార్థఇవాపరః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 6 అక్షరముల పాశుపతాస్త్ర మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం శ్లీం పశుః హుంఫట్।**

**బ్రహ్మఋషిః। గాయత్రీ ఛందః। శ్రీంబీజం। హుంశక్తిః।**

**గ్రహ రోగాదిబాధా నివారణే వినియోగః।**

మంత్రములోని ఒక్కొక్క అక్షరముతో షడంగన్యాసమాచరించి ఇలా ధ్యానించాలి.

☞ **మధ్యాహ్నార్క సమప్రభం శశిధరం భీమాట్టహాసోజ్వలం**
**త్ర్యక్షం పన్నగభూషణం శిఖిశిఖాశ్మశ్రూ స్ఫురన్మూర్ధజమ్।**
**హస్తాబ్జైః త్రిశిఖం సముద్గరమసిం శక్తిం దధానం విభుం**
**దంష్ట్రా భీమచతుర్ముఖం పశుపతిం దివ్యాస్త్రరూపం స్మరేత్॥**

పై మంత్రమును 6 లక్షలు జపించి, సంస్కృతాగ్నియందు, దశాంశ హోమము నేతితో ఆచరించాలి. పిమ్మట పూర్వోక్త శైవపీఠమునందు పశుపతిని అర్చించాలి. అంగములు – అష్టమాతృకలు – లోకపాలురను పూజించాలి.

పై మంత్రముతో మంత్రించిన జలమును గ్రహపీడిత, భూతపీడిత వ్యక్తియొక్క ముఖముపై చల్లిన, ఆ భూతావేశము తొలగి బాధ నివారణ మగును.

అభిమంత్రించిన బాణమును, శత్రుసైన్యముపై ప్రయోగించిన, అపర అర్జునివలె సాధకుడు విజయము పొందును.

## క్షేత్రపాల మంత్రము

శ్లో॥ వర్ణాంత్యమౌ బిందుయుక్తం క్షేత్రపాలాయ హృన్మనుః
తారాద్యో వసువర్ణోఽయం క్షేత్రపాలస్యకీర్తితః ।
షడ్దీర్ఘ భాజా బీజేన షడంగాన్యస్య యోజయేత్
ఋషిర్ బ్రహ్మభవేదస్య గాయత్రం ఛంద ఈరితమ్ ।
క్షేత్రపాలో దేవతా పాలయేతి శక్తిరీరితా
లక్షమేకం జపేన్మంత్రం జుహుయాత్తద్దశాంశతః ।
చరుణాఘృత సిక్తేన తతః క్షేత్రేశమర్చయేత్
ధర్మాదికల్పితేపీఠే పూర్వమంగాని పూజయేత్ ।
అనలాఖ్యమగ్నికోశం కరాళం తదనంతరం
ఘంటారావం మహాకోపం పిశితాశయ సంజ్ఞకమ్ ।
పింగళాక్ష మూర్ధ్వకేశం పత్రేషుపరితో యజేత్

ప్రధానమూర్తి ప్రతిమా స్నానాలంకారబంధురాన్ ।
లోకపాలాంస్తదస్త్రాణి యథాపూర్వం ప్రపూజయేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 8 అక్షరముల క్షేత్రపాల మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఓం క్షౌం క్షేత్రపాలాయ నమః**

**బ్రహ్మఋషిః । గాయత్రీఛందః । క్షేత్రపాలోదేవతా । పాలయుశక్తిః । క్షాం - క్షీం - క్షూం - క్షైం - క్షౌం - క్షః,** అను ఆరుబీజములతో షడంగన్యా మాచరించి ఇలా ధ్యానించాలి.

☞ **నీలాంజనాద్రి నిభమూర్ధ్వ పిశంగకేశం**
**వృత్తోగ్రలోచన ముపాత్త గదాకలాపమ్ ।**
**ఆశాంబరం భుజగభూషణముగ్ర దంష్ట్రం**
**క్షేత్రేశమద్భుతతనుం ప్రణమామి దేవమ్ ॥**

పై మంత్రమును లక్ష జపించి, ఘృత సహిత పాయసముతో దశాంశ హోమమాచరించాలి.

శైవపీఠమందు అంగపూజ – దిశల పత్రములందు, కోణములందు, పూర్వాదిక్రమముగా, 1. అనల 2. అగ్నికేశ 3. కరాళ 4. ఘంటారవ 5. మహాకోశ 6. పిశితాశయ 7. పింగలాక్ష 8. ఊర్ధ్వకేశులను అర్చించాలి.

వీరంతా క్షేత్రపాలునితో సమానమైన రూపవర్ణములు కలవారై అనేక అలంకరాములు ధరించి యుందురు. పిమ్మట లోకపాలురను ఆయుధ సహితముగా అర్చించాలి.

## క్షేత్రపాల బలిమంత్రము

శ్లో॥ తస్మై సపరివారాయ బలిమేతేన నిర్హరేత్
పూర్వమేహి ద్వయం పశ్చాద్విదుషి స్యాత్ పురద్వయమ్ ।

భంజయ ద్వితయం భూయో నర్తయ ద్వితయంపునః
తతో విఘ్నపదద్వంద్వం మహాభైరవ తత్పరమ్ ।
క్షేత్రపాల బలింగృహ్ణ ద్వయం పావక సుందరీ
బలిమంత్రోఽయ మాఖ్యాతః సర్వకామఫల ప్రదః ।
సోపదంశం బృహత్పిండం కృత్వా రాత్రిషు సాధకః
స్మృత్వాయధోక్తం క్షేత్రేశం తస్యహస్తే బలింహరేత్ ।
బలినాఽనేన సంతుష్టః క్షేత్రపాలః ప్రయచ్ఛతి
కాంతిం మేధా బలారోగ్యతేజః పుష్టియశః శ్రియః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట పరివార సహిత క్షేత్రపాలునికి, ఈ క్రింది మంత్రముతో బలి సమర్పించాలి.

**మనుః – ఏహిఏహి విదుషి పురుపురు, భంజయ, భంజయ, నర్తయ నర్తయ, విఘ్న విఘ్న, మహాభైరవ క్షేత్రపాల బలిం గృహ్ణ గృహ్ణ ॥**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – బలి సమర్పించిన సాధకునికి సర్వ విధమైన మనో వాంఛలూ నెరవేరును. మరియు వ్యంజనం (పచ్చడి)తో కూడి భోజనము (అన్నము)తో ఒక పెద్ద పిండముచేసి, రాత్రియందు, నల్లకుక్క నధిరోహించిన క్షేత్రపాలుని ధ్యానించుచూ, అతని ఎడమచేతిలోని కపాలములో వేయుచున్నట్లు భావించి, ఏకాంత నిర్జన స్థలంలో విడిచిపెట్టాలి. ఈ బలిచే సంతుష్టుడైన, క్షేత్రపాలుని అనుగ్రహము వలన తేజస్సు – మేథ – బలము – ఆరోగ్యము – పుష్టి – యశము – సంపద కలుగును.

## బటుక భైరవ మంత్రము

శ్లో॥ ఉద్ధరేత్ బటుకం జేంతం ఆపదుద్ధారణం తథా
కురుద్వయం పుర్ణేంతం వటుకం తం సముద్ధరేత్ ।

ఏకవింశత్యక్షరాత్మా శక్తిరుద్ధో మహామనుః
అభీష్ట ఫలసంసిద్ధ్యై కీర&ఇతతః సురపాదపః ।
బృహదారణ్యక ఋషిశ్ఛందోఽనుష్టు బుదాహృతం
ఆపదుద్ధారణో దేవో భైరవో దేవతా బుధైః ।
అంగుళీదేహ వక్త్రేషు మూర్తీన్యస్యేద్యథా పురా
సద్యాది పంచహ్రస్వాఢ్య శక్తి బీజపురః సరమ్ ।
వకారం పంచహ్రసాఢ్య మీశానాదిషు యోజయేత్
షడ్దీర్ఘ యుక్త్యా శక్త్యా వకారేణ చ తద్వృతా ।
అంగాని జాతియుక్తాని ప్రణవాద్యాని కల్పయేత్
తస్యధ్యానం త్రధాప్రోక్తం సాత్వికాదివిభేదతః ।
వర్ణలక్షం జపేన్మంత్రం హవిష్యాశీ జితేంద్రియః
తద్దశాంశం ప్రజుహుయాత్తిలై ర్మధుర సంయుతైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 21 అక్షరములుగల, బటుక భైరవమంత్రము చెప్పబడుచున్నది. ఇది సర్వ విదముల కల్పవృక్షము వంటిది. (కాళీ ఉపాసన శీఘ్రముగా సిద్ధించవలెనన్న, ముందుగా బటుక భైరవ జపము తప్పనిసరిగా చేయవలయును - మేడవరపు సంపత్ కుమార్)

**మనుః - హ్రీం బటుకాయ ఆపదుద్ధారణాయ కురు కురు, బటుకాయ హ్రీం।**

**బృహదారణ్యకఋషిః। అనుష్టుప్ ఛందః। వంబీజం। హ్రీంశక్తిః।**

పిమ్మట 5 అంగుళులయందు, శిర - ముఖ - హృదయ - గుహ్య - పాదములందు, అలాగే ఊర్ధ్వ - పూర్వ - దక్షిణ - ఉత్తర - పశ్చిమము లందు మూర్తిన్యాసము పంచహ్రస్వములతో (ఓ - ఐ - ఉ - ఇ - అ) చేయవలయును.

**ఉదా - ప్రోం హోం ఈశానాయ నమః - అంగుష్ఠే**

**ఉదా : ప్రోం హోం ఈశానాయ నమః - శిరసి**

మరల, షడ్ దీర్ఘ వర్ణములతో (ఆ - ఈ - ఊ - ఐ - ఔ - అః) వ బీజం చేర్చి ప్రణవ సహితంగా హృదయాది న్యాసం చేయాలి.

**ఉదా - ఓం ప్రాం వాం హృదయాయ నమః।**

**ఓం ప్రీం వీం శిరసే స్వాహా।**

**పిమ్మట, బటుకభైరవుని ధ్యానించాలి. ఈ ధ్యానము మూడు విధములుగా - సాత్విక - రాజస - తామస భేదములతో నున్నది.**

## సాత్విక ధ్యానము

శ్లో॥ వందే బాలం స్ఫటిక సదృశం కుంతలోల్లాసి వక్త్రం
దివ్యాకల్పై ర్నవమణిమయైః కింకిణీ నూపురాద్యైః ।
దీప్తాకారం విశదవసనం సుప్రసన్నంత్రినేత్రం
హస్తాబ్జాభ్యాం వటుకమానిశం కాలదండోదధానమ్ ॥

ఈ సాత్విక ధ్యానము వలన అపమృత్యు దోషము నివారణమగును. ఆయు - ఆరోగ్యములు సిద్ధించును.

## రాజసధ్యానము

శ్లో॥ ఉద్యద్ భాస్కర సన్నిభం త్రినయనం రక్తాంగరాగస్రజం
స్మేరాస్యం వరదం కపాల మభయం శూలందధానం కరైః ।
నీలగ్రీవముదార భూషణ శతం శీతాంశు చూడోజ్వలం
బంధూకారుణ వాససం భయహరం దేవం సదాభావయే॥

## తామసధ్యానం

శ్లో॥ ధ్యాయేన్నీలాద్రికాంతం శశిశకలధరం ముండమాలం మహేశం
దిగ్వస్త్రంపింగకేశం డమరుమత సృణిం ఖడ్గ పాశాభయాని।

నాగం ఘంటాం కపాలం కరసరసిరుహైర్ బిభ్రతం భీమదంష్ట్రం
సర్పాకల్పం త్రినేత్రం మణిమయ విలసత్ కింకిణీనూపురాఢ్యమ్॥

రాజస ధ్యానము వలన ధర్మకామార్థములు సిద్ధించును. తామస ధ్యానము వలన శతృబాధ, గ్రహబాధలు తొలగును. బటుక భైరవమంత్రము, నియమనిష్ఠలతో 21 లక్షలు జపించి, పాలు - తేనె - శర్కరాయుక్త తిలలు - హవిస్సుతో, దశాంశహోమం ఆచరించాలి.

శ్లో॥ ధర్మాధర్మాదిబిః క్లప్తేపీఠే పంకజశోభితే
షట్కోణాంత స్త్రికోణస్థ వ్యోమపంకజ సంయుతే ।
వటుకం పూజయేద్దేవం మూర్తిమూలేన కల్పయేత్
మూలాది సద్యోజాతేన దేవమావాహయేత్తతః ।
వామదేవేన మంత్రేణ స్తాపయేత్ పరమేశ్వరం
మూలమంత్రేణ కర్తవ్యం సాన్నిధ్యం తదనంతరమ్ ।
అఘోరేణ సుధీః కుర్యాత్ సన్నిరోధన మనంతరం
పురుషాఖ్యేనమనునా యోనిముద్రాం ప్రదర్శయేత్ ।
దేవాయ వందనం కుర్యా దీశానేన సమాహితః
ఏతత్ సర్వం విధాతవ్యం తత్తన్ ముద్రాభిరాదరాత్ ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - సాధకుడు అష్టదళ కమలము లిఖించి, దానిలో షట్కోణము, దానిలో త్రికోణము దానిలో అష్టమాతృకా మయ కమలము లిఖించాలి. అన్నిటికీ బయట చతురస్ర భూపురం నిర్మించాలి.

మూలమంత్రముతో - విగ్రహభావన '
సద్యోజాత మంత్రముతో - బటుకభైరవుని ఆవాహన ।
వామదేవ మంత్రముతో - స్థాపన

మూలమంత్రముతో - సాన్నిధ్య స్థాపన
అఘోరమంత్రముతో - సన్నిరోధము
తత్పురుష మంత్రముతో - యోనిముద్రా ప్రదర్శన

దేవవందనంచేసి, ఈశాన మంత్రముతో - నమస్కారం చేయాలి. అన్ని ముద్రలు కూడా చూపిస్తూ, మంత్రం జపించాలి.

శ్లో॥ ఈశానాదీన్ యజేద్దేవాన్ న్యాసమార్గేణ దేశికః
సకలీ కరణం కృత్వా యజేన్ మూర్తీర్యథా పురా ।
వ్యోమ పద్మ దళేష్వర్చే దసితాంగాది భైరవాన్
అసితాంగం రురుంచండం క్రోధమున్మత్త భైరవమ్ ।
కపాలినం భీషణాఖ్యం సంహారం చక్రమాదమూన్
షట్కోణేషు షడంగాని క్రమేణాஉభ్యర్చయేత్ సుధీః ।
పూర్వాదీశాన పర్యంతం తద్బహిః పూజయేదిమాన్
డాకినీ పుత్రకాన్ పూర్వం రాకిణీ పుత్రకాంస్తతః ।
లాకినీ పుత్రకాన్ భూయో హాకినీ పుత్రకాన్ పునః ।
మాలినీ పుత్రకాన్ పశ్చాద్దేవీ పుత్రాం స్తతః పరం
అథోమారుద్ర మాతౄణాం పుత్రాన్ దక్షిణతో యజేత్ ।
ఊర్ధ్వముఖ్యాః సుతానూర్ధ్వే మథోముఖ్యాః సుతానధః
ఇతి సంపూజయేన్మంత్రీ పుత్రవర్గాం స్త్రయోదశ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట న్యాసక్రమాను సారముగా సకలీకరణము చేసి, ఈశానాది మూర్తులను పూజించాలి.

**ఉదా - హ్రీం వోం ఈశానాయ నమః**

**హ్రీం వేం తత్పురుషాయ నమః - ఇత్యాది**

అష్టమాతృకాయుక్త పద్మమునందు అసితాంగాది అష్టభైరవులను అర్చించాలి. **1.** అసితాంగ **2.** రురు **3.** చండ **4.** క్రోధ **5.** ఉన్మత్త **6.** కపాలీ **7.** భీషణ **8.** సంహార షట్కోణమునందు షడంగములను పూజించాలి.

అష్టదళకమలము బయట తూర్పునుండి ఈశాన పర్యంతము **1.** డాకినీ పుత్ర **2.** రాకిణీపుత్ర **3.** లాకినీ పుత్ర **4.** కాకినీపుత్ర **5.** శాకినీ పుత్ర **6.** హాకినీ పుత్ర **7.** మాలినీపుత్ర **8.** దేవీ పుత్రుల నర్చించాలి.

దక్షిణదిశయందు ఉమాపుత్ర - రుద్రపుత్ర - మాతృకాపుత్రుల నర్చించాలి. మొత్తం **11**మంది పుత్రులను అర్చించాలి. పైన ఊర్ధ్వముఖీ పుత్రులను, కింద అధోముఖీ పుత్రులను కూడా పూజించగా, మొత్తం **13**మంది అవుతారు.

శ్లో॥ తద్బహిః పద్మపత్రేషు లోకేశవటుకాన్ యజేత్
బ్రహ్మాణీ పుత్రకం పూర్వే మాహేశీ పుత్రమైశ్వరే ।
వైష్ణవీపుత్రకం సౌమ్యే కౌమారీ పుత్రమానిలే
ఇంద్రాణీ పుత్రకం భూయః పూజయేత్ పశ్చిమేతతః ।
మహాలక్ష్మీసుతం పశ్చాద్రక్షోదిశి సమర్చయేత్
వారాహీ పుత్రకం యామ్యే చాముండా సుతమానలే ।
వటుకాన్ దశదిక్ష్వర్చే ద్ధేనుకం త్రిపురాంతకం
భేతాళం వహ్నిజిహ్వాఖ్యం కాలాంతాఖ్యం కరాళకమ్ ।
ఏకపాదం భీమదంష్ట్రమచలం హాటకేశ్వరం
దిగ్ విదిక్ష్వంత రాళేషు శ్రీకంఠాదీన్యజేత్ పునః ।
క్రోధీశ్వరాది భృగ్వంతాన్ తద్వద్బాహ్యే సమర్చయేత్
తతస్త్రీన్నకులీ శాద్యాన్ దక్షిణే పూజయేత్ సుధీః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పిమ్మట అష్టదళ పద్మమందు లోకేశ్వరరూపులైన వటుకభైరవులను పూర్వదిశయందు బ్రహ్మాణీపుత్ర – ఈశాన్యమందు మాహేశీపుత్ర – ఉత్తరమందు వైష్ణవీపుత్ర – ఆగ్నేయ కోణమందు కౌమారీపుత్ర – పశ్చిమమందు ఇంద్రాగ్ని పుత్ర – నైఋతియందు లక్ష్మీపుత్ర – దక్షిణమందు వారాహీ పుత్రులను – వాయవ్యమందు చాముండా పుత్రులను అర్చించాలి.

దశదిశలందు 1. ధేనుక 2. త్రిపురాంతక, 3. భేతాళ, 4. వహ్నిజిహ్వ 5. కాలాంత 6. కరాళక 7. ఏకపాద 8. భీమ దంష్ట్ర 9. అచల 10. హాటకేశ్వరుల నర్చించాలి.

నాలుగు దిశలూ, నాలుగు విదిశలందు 8 అంతరాళములందు 16 స్థానములలో శ్రీకంఠాదులను (2వ పటలములో చెప్పబడినది) మరల 8 దిశలూ 8 విదిశలూ, ఆ రెండింటి అంతరాళములూ మొత్తం 32 స్థానములందుక్రోధీశ్వరాది – భృగుపర్యంతము (2వ పటలములో చెప్పబడినారు) పూజించాలి. దక్షిణదిశన నకులీశాది ముగ్గురినీ అర్చించాలి.

శ్లో॥ దివ్యాంతరిక్ష భూమిష్ఠాన్ యోగీశాన్ శక్తిసంయుతాన్
యోగినీభిః సహోஉభ్యర్చే దీశానాగ్ని నిరృతిష్ఠితాన్ ।
ఇతి సంపూజయేద్దేవం వటుకం ప్రోక్త వర్త్మనా
ధర్మార్థ కామమోక్షాణాం పతిర్భవతి మానవః ।
విఘ్నందుర్గం సమారాధ్య బలిందత్వా విధానతః
కామ్యానిసాధయేన్మంత్రీ యథోక్తా సిద్ధిమాప్నుయాత్ ।
కామ్యాని సాధయేన్మంత్రీ యథోక్తాం సిద్ధిమాప్నుయాత్ ।
శాల్యన్నంపలలం సర్పిర్లాజాచూర్ణాని శర్కరా
గుడమిక్షురసాపూపైః మధ్వక్తైః పరిమిశ్రితైః ।

కృత్వా కవళ మారాధ్య దేవం ప్రాగుక్త వర్త్మనా
రక్తచందన పుష్పాద్యై ర్నిశి తస్మై బలింహరేత్ ।
తతః సిధ్యంతి కార్యాణి బలినాఽనేన మంత్రిణః
జుహుయాత్ సర్పిషామంత్రీ యథోక్తాం సిద్ధిమాప్నుయాత్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట స్వర్లోక - అంతరిక్ష - భూలోక మండలి యోగేశ్వరులను, యోగేశ్వరీలను శక్తిసహితముగా అర్చించాలి. వీరు ఈశాన - ఆగ్నేయ - నైరుతి కోణములందుందురు. ఇట్టి పూజ చేయు సాధకుడు చతుర్వర్గములను పొందురు.

చివరిగా విఘ్నేశ్వరుని - దుర్గను పూజించి బలి సమర్పించాలి. అన్నం - మాంసం - నెయ్యి - పేలాలు - సత్తుపిండి - శర్కర - బెల్లం చెరకురసం - అప్పాలు - తేనెతో కబళము చేసి రాత్రియందు రక్తచందన - పుష్పాదులతో పూజించి బలిప్రదానము చేయాలి.

ఈ విధముగా బలి సమర్పించిన సాధకుడు సమస్త కార్యములను సాధించగలడు. నేతితో హోమం చేయాలి.

శ్లో॥ వశ్యాయ జుహుయాద్దిక్షు శకలైర్వశయే జ్జనాన్
జుహుయాత్ పుత్రలాభాయ ప్రఫుల్లైః కైరవైః సుధీః ।
ధనధాన్యాది సంపత్త్యై జుహుయాత్తి లతండులైః
బిల్వప్రసూనైర్జుహుయాన్మహతీం విందతిశ్రియమ్ ।
లోణైర్మధురసంంమిశ్రై ర్వశయేద్ వనితాజనాన్
వృష్టికామేన హోతవ్యం వేతసానాం సమిద్వరైః ।
అన్నేన జుహుయాన్నిత్యం ధనధాన్యాది సంపదే
వశ్యాయ జుహుయాన్మంత్రీ మధునా దివసత్రయమ్ ।
రోగోక్తౌ షధహోమేన రోగా నశ్యంతి తత్ క్షణాత్

కృత్యాద్రోహే గ్రహద్రోహే భూతాపస్మార సంభవే ।
వ్యాఘ్రాజినే సమాసీనో జుహుయాదయుతంతిలైః
భూతాదయః పలాయంతే నేక్షంతే తాందిశం భయాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ధనధాన్యాది సంపదల కొరకు తిలలు – భియ్యంతో హోమం చేయాలి. మారేడు ఫలములతో (పూలతో) హోమం చేసిన సంపద కలుగును. త్రిమధుర మిశ్రిత లవణముతో హోమం ఆచరించిన, స్త్రీలు వశమగుదురు.

వర్ణముకోరువారు నీటిప్రబ్బలి సమిధలతో హోమం చేయాలి. అన్నహోమం చేసిన ధనధాన్యవృద్ధి, తేనెతో మూడు రోజులు చేసిన వశీకరణము సిద్ధించును.

వైద్యశాస్త్రమునందు ఏ రోగములకు, ఏ మూలికలు చెప్పబడినవో, వాటిని హోమం చేసిన ఆ రోగము నివారణ అగును. కృత్యాది అభిచారములందు, శతృద్రోహములందు, భూతావేశమునందు పులిచర్మముపై కూర్చుని 10 వేలు మంత్రజపం చేసిన, తిలలతో హోమం చేసిన అన్ని బాధలు తొలగును.

శ్లో॥ కృష్ణాష్టమీం సమారభ్య యావత్ స్యాత్తచ్చతుర్దశీ
తిలైస్తండులసమ్మిశ్రైః మధురత్రయ లోలితైః ।
త్రిసహస్రం ప్రతిదినం జుహుయాత్ సంస్కృతేఽనలే
వటుకేశ్వర మభ్యర్చ్య భక్ష్యభోజ్య ఫలాన్వితమ్ ।
నిత్యం నివేద్య నైవేద్యం మధ్యరాత్రే బలింహరేత్
ఏవం పిత్వా ప్రయతః సహస్రాణ్యే కవింశతిః ।
సమాప్తి దినసే రాత్రావజం హత్వా బలిం హరేత్
తతః కారయితా రాజా తోషయేత్సాధకం ధనైః ।

సమాప్తి దినసే రాత్రావజం హత్వా బలింహరేత్
తతః కారయితా రాజా తోష యేత్సాధకం ధనైః ।
విధినానేన సంతుష్టో వటుకేశః ప్రయచ్ఛతి
తేజోబలం యశః పుత్రాన్ కాంతిలక్ష్మీ మరోగతాం
నశ్యంతి శత్రవః సర్వే వర్ధంతే బంధు బాంధవాః
అవగ్రహో న జాయేత విషయే తస్యభూపతేః ।
జుహుయాత్ కేవలై ర్లోణై రయుతంస్తంభనేచ్ఛయా
నిగడాది విమోక్షాయ ప్రయోగోఽయ ముదాహృతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - కృష్ణపక్ష అష్టమి నుండి చతుర్దశివరకు 7రోజులు పాటు, త్రిమధురయుక్త తండుల మిశ్రిత తిలలతో ప్రతిరోజు మూడువేలు హోమం చేసి, భక్ష్యభోజ్యములు - ఫలాదులు బటుకేశ్వరునకు నైవేద్యంచేసి, అర్ధరాత్రిముందు బలిగా ఇవ్వాలి. పిమ్మట 21వేలు మంత్రజపం చేసి, సమాప్తి దినమున రాత్రియందు మేకను ఇవ్వాలి. పిమ్మట యజమాని ఆ కార్యక్రమము నిర్వహించినవానిని బహుధనముతో సంతుష్టుని చేయాలి.

ఈ విధానముచే సంతుష్టుడైన బటుకభైరవుడు తేజో - బల - యశ - పుత్ర - సంపద - ఆయుర్భాగ్యములను అనుగ్రహించును. శతృనాశనమగును. బంధువృద్ధి కలుగును. ఆ ప్రాంతమునందు చక్కగా వర్షము పడి పంటలు సమృద్ధిగా పండును.

స్తంభన ప్రయోగమునందు లవణమును 10వేలు హోమం చేయవలయును. కారాగారమునుండి విడుదలకు కూడా ఇదే విధంగా ప్రయోగము చేయవలయును.

శ్లో॥ వచాచూర్ణపలం జప్తం గవ్యేనా జ్యేనలోలితం
విభజ్య భక్షయేద్ వంధ్యా మండలాత్ పుత్రకాంక్షిణీ ।
వినీతం పుత్రమాప్నోతి మేధారోగ్య బలాన్వితం
ఆదావంతే ప్రయోగస్య వటుకస్యబలింహరేత్ ।
ద్వివిధో బలిరాఖ్యాతో రాజసః సాత్వికో బుధైః
రాజసో మాంసరక్తాఢ్యః ఫలత్రయ సమన్వితః ।
ముద్గపాయస సంయుక్తో మధురత్రయ లోలితః
సాత్వికో మాంసరహితః శేషమన్యత్ పురోక్తవత్ ।
బ్రాహ్మణో నియతః శుద్ధః సాత్వికం బలిమాహరేత్
సాధయేన్మనునాఽనేన భస్మ సర్వార్థ సిద్ధిదమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – గోఘృతముతో ఒక పలమెత్తు వచాచూర్ణము, అభిమంత్రించి, ప్రతిదినము 7 రత్తల చొప్పున, వంధ్యాస్త్రీ సేవించిన 49 రోజులలో గర్భము ధరించును. మేధావి – బలవంతుడు – వినయవంతుడు అయిన పుత్రుని పొందును.

## బలి రెండు విధములు

బటుకభైరవునకు రెండు విధములైన బలి విధానము కలదు. 1. రాజసబలి – భూచర – ఖేచర – జలచర – జంతువుల మాంసము, రక్తమిశ్రితమైనది, అన్నసహితముగా సమర్పించిన దానిని రాజసబలి అందురు. 2. సాత్వికబలి – పెసరపప్పు, పాయసము, త్రిమధుర మిశ్రితముగా సమర్పించిన సాత్వికబలి అందురు. క్షేత్రపాల బలి మంత్రములో క్షేత్రపాలపదస్థానము నందు బటుక భైరవ పదమునుంచి ఆ మంత్రము పఠించవలయును.

బ్రాహ్మణులు కేవలం సాత్విక బలినే సమర్పించవలయును. రాజసబలిని సమర్పించరాదు.

# మంత్రభస్మము

శ్లో॥ ఉశీరం చందనం కుష్ఠం ఘనసారం సకుంకుమం
శ్వేతార్కమూలం వారాహీం లక్ష్మీం క్షీర మహీరుహామ్ ।
త్వచోబిల్వ తరోర్మూలం శోషయిత్వా సచూర్ణయేత్
చూర్ణం వ్యోమ్ని గృహీతేన గోమయేన విమిశ్రితం ।
కృత్వాపిండాని సంశోష్య సంభృతే హవ్యవాహనే
మూలేన దగ్ధ్వా తద్భస్మ శుద్ధపాత్రే వినిఃక్షిపేత్ ।
కేతకీ మాలతీ పుష్పై ర్వాసయేద్ భస్మశోధితం
అయుతం ప్రజపేన్మంత్రం స్పృష్ట్వా భస్మసుపూజితమ్ ।
ఏతదాదాయ దినశః ప్రాతః పుండ్రం కరోతియః
తస్యరోగాః ప్రణశ్యంతి కృత్యాద్రోహా మహాగ్రహాః ।
రిపుచౌర మృగాదిభ్యో భయమస్య న జాయతే
వర్ధంతే సంపదః సర్వాః పూజ్యతే సకలై ర్జనైః ।
రాజావశ్యో భవేత్తస్య సామాత్యః సపరిచ్ఛదః
అభిషేకంప్రకుర్వీత రాజ్ఞో విజయ కాంక్షిణః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - భస్మము తయారుచేయు విధానము చెప్పబడుచున్నది. వట్టివేళ్ళు – చందనం – కుష్ఠం – కర్పూరం – కుంకుమపువ్వు – తెల్లజిల్లేడువేళ్ళు – వారాహి (దుంపరాష్ట్రం) – జమ్మి – క్షీరవృక్ష బెరడు – మారేడువేళ్లు, వీటిని నీడలో ఎండించి చూర్ణము చేయాలి.

పిమ్మట కింద పడకుండా ఆవుపేడను గ్రహించి, అందు పై చూర్ణమును కలిపి దానితో పిడకలను చేసి ఎండించాలి. వాటిని చక్కటి

సంస్కరింపబడిన అగ్నియందు శంఖపాత్రయందుంచి మొగలి - జాజిపూలతో సువాసితం చేయాలి.

పిమ్మట ఆ భస్మమును చేతియందుంచుకొని 10వేలు మంత్రజపం చేయాలి. ఇట్టి భస్మమును స్నానానంతరం ప్రాతఃకాలమున త్రిపుండ్రముగా లలాటముపై ధరించిన, అభిచార ప్రయోగములు - గ్రహబాధలు - రోగబాధలు - చోర - వ్యాఘ్ర - సర్పాది బాధలు కలుగవు.

ఇట్టి భస్మమును ధరించిన సాధకుడు సకల సంపదలను - శుభములను పొంది, సర్వజనులచే పూజింపబడును. పాలకుడు సపరివారముగా అతనికి అనుకూలముగా నుండును.

జయము కోరు రాజు ఈ మంత్రముతో 5 లేదా 7 రోజులు ఈ క్రింది విధానములో అభిషేకము చేయించుకొనిన, సర్వత్ర విజయమును పొందును.

## మంత్రాభిషేకము

శ్లో॥ పూర్వోక్త మండపే క్లుప్తే వితానధ్వజ శోభితే
సర్వతో భద్రమాలిఖ్య కర్ణికాంతస్యపూరయేత్ ।
అష్టద్రోణ ప్రమాణేన శాలిభిః శోధితైః శుభైః
తదర్ధాం స్తండులాంస్త స్మిన్ న్యస్య దూర్వాక్షతాన్వితాన్ ।
హేమాది విహితంకుంభం నవరత్న సమన్వితం
సంస్థాప్య విమలై స్తోయైరాపూర్యాఽస్మిన్విని క్షిపేత్ ।
క్షీరద్రుమప్రబాలాని లక్ష్మీం దూర్వాం సహాంపునః
కర్పూరం చందనం బిల్వముశీరం కుంకుమం పునః ।
కంకోలమగురుం జాతిం మల్లికాం చంపకోత్పలైః

గోమేదం దాడిమం పశ్చాత్ పట్టయుగ్మేన వేష్టయేత్ ।
తస్మిన్నావాహ్య వటుకం రాజసంసంప్రపూజయేత్
బహిరష్టసుకుంభేషు భైరవానష్ట పూజయేత్ ।
త్రయోదశసు కుంభేషు త్రయోదశ గణాన్ యజేత్ ।
బాహ్యదశసుకుంభేషు లోకేశానర్చయేత్ సుధీః ।
తద్బహిర్ద్వ్యాష్ట కుంభేషు శ్రీకంఠాదీన్ సురేశ్వరాన్
పంచత్రింశత్ ఘటేష్వర్చేతా కాదివర్ణేశ్వరాన్ క్రమాత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - 3వ పటలములో చెప్పిన రీతిగా, పందిరి పతాకతో కూడిన మండపమునందు - సర్వతోభద్ర మండలము నిర్మించాలి. అందు మధ్యలో 8 ద్రోణముల శుభ్రమైన బియ్యముతో నింపాలి. పిమ్మట అష్టదళ కమలమునందు 4 ద్రోణముల బియ్యము నుంచి దూర్వాక్షలతో కలసిన స్వర్ణము లేదా వెండి, లేదా రాగితో లేదా మట్టితో నిర్మించిన కలశమునుంచి, అందు నవరత్నములుంచాలి.

అందు జలమును నింపి, క్షీరవృక్షపు పత్రములు, జమ్మి - దూర్వా - సహదేవి - కర్పూరం - చందనం - బిల్వం - వట్టివేళ్లు - కుంకుమపువ్వు - కంకోలము - అగురు - జాజి - మల్లిక - ంసపెంగ - కమల - గోమేద - దానిమ్మలను కలశములోవేసి, రెండు వస్త్రములతో గట్టిగా చుట్టాలి.

అటు పిమ్మట, రాజస ధ్యానమునందు చెప్పబడిన, వటుకభైరవ మూర్తిని ఆవాహనచేసి పూజించాలి. దాని బయట 8 కుంభములులుంచి 8 భైరవులను అర్చించాలి. ఆపై 13 కుంభములుంచి ముందు చెప్పిన 13 గణముల నర్చించాలి.

తరువాత 16 కుంభములందు శ్రీకంఠాది 16 సర్వదేవతలను, ఆపై 35 కుంభములందు 35 కాదిహకారాంత వ్యంజన దేవతలను గంధాదులతో పూజించాలి. పిమ్మట కుశలతో ఆ ఘటములను స్పృశించి మూలమంత్రమును పదివేలు జపించాలి.

శ్లో॥ ఇతి గంధా దిభిః సమ్యక్ పంచావరణ మర్చయేత్
అయుతం ప్రజపేత్ స్పృష్ట్వా తాన్ ఘటాన్ దేశికోత్తమః।
పాయసైః సర్పిషా శుద్ధైస్తిలైర్దశశతం పృథక్
జుహుయాత్తాన్ ఘటాన్ స్పృష్ట్వా ప్రత్యహం దేశికసత్తమః।
సుదినే శోభనేలగ్నే వాచయిత్వా ద్విజన్మభిః ।
స్వస్తిమంగళవాక్యాని విశుద్ధై ర్వేదపారగైః
నదత్సుపంచ వాద్యేషు ప్రణమ్య వటుకేశ్వరమ్ ।
జితేంద్రియం శుద్ధకాయం రాజానంబ్రాహ్మణ ప్రియం
ఆస్తికం సత్యవచన మభిషించేత్ ప్రసన్నధీః ।
అభిషిక్తో నరపతిః ప్రణిపత్య గురుంపరం
భూయసీం దక్షిణాందద్యాత్ ప్రసీదతి తథా గురుః ।
రాజాఽభిషిక్తో భవతి సాక్షాద్ భూమిపురందరః
పరాన్ విభజతే భూపాన్ స్తూయతే సకలైర్జనైః ।
కృతాభిషేకః షణ్మాసం ప్రతిమాసం మహీపతిః
చతురంభోధి వలయాం శాస్తి సర్వాంవసుంధరామ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ ప్రకారము పంచావరణ పూజ గంధాదులతో జరిపి మూలమంత్రమును 10వేలు జపించి, పాయసం - నెయ్యి - తిలలు - వెయ్యి చొప్పున హోమం చేయాలి. ఇలా ప్రతీ దినమూ మూడువేలు ఆ ఘటములను స్పృశించుచూ హోమం చేయాలి. నిత్యమూ రాజసవిధితో రాత్రియందు బలి సమర్పించాలి.

పిమ్మట ఒక శుభముహూర్తమున బ్రాహ్మణుల ఆశీర్వాదము పొంది, పంచవాద్య ఘోష జరుగుచుండగా యజమాని అయిన రాజును ఆ ఘటములలోని జలముతో అభిషేకించాలి. అపుడు రాజు గురువులను, బ్రాహ్మణులను దక్షిణ తాంబూలములతో సత్కరించాలి.

ఇలా అభిషిక్తుడైన రాజు, ఇంద్రతుల్యుడై శతృబాధ లేకుండా చిరకాలము రాజ్యమును పాలించును. ఇట్టి అభిషేకము **6** నెలలకొకసారి ఒక నెలలో **6**సార్లు జరిపినచో, సమస్త భూమండలమును పాలించ సమర్థుడగును.

## గజాశ్వాది శాంతివిధి

శ్లో॥ గజాశ్వశాంతివిధయే తేషాంశాలాసు సాధకః
కుండంకృత్వా విధానేన హోమంకుర్యాద్యధావిధి ।
పాయసాజ్య తిలైర్విద్వాన్ అయుత త్రితయావధి
బ్రాహ్మణాన్ భోజయేన్నిత్యం భక్ష్యభోజ్య ఫలాదిభిః ।
ప్రాక్ప్రోక్త విధినా కుంభాన్ స్థాపయిత్వాఽత్రదేశికః
అభ్యర్చ్యగంధ పుష్పాద్యైస్తజ్జలైః ప్రోక్షమద్గజాన్ ।
అశ్వశాలా మనేనైవ వర్ధంతే తే దినే దినే
యుద్ధేషు మహతీ శక్తిర్జాయతే పూర్వతోఽధికా ।
సర్వరోగాః ప్రణశ్యంతి కృత్యాద్రోహాః పరైః కృతాః
అస్మాత్పరతరారక్షా నాస్తితేషాం మహీతలే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - గజశాంతి, అశ్వశాంతి కొరకు లేదా పశుశాంతి కొరకు, పశువుల కొట్టమునందు, పూర్వోక్త విధానములో కుండనిర్మాణముచేసి యధావిధిగా జప-హోమము లాచరించాలి.

ఆ కుంభ జలములతో పశువులను సంప్రోక్షించిన, పశువులు దినదినాభి వృద్ధి చెందును. యుద్ధమునందు, ఆ గజములు - అశ్వములు మరింత శక్తివంతములై అనారోగ్యము లేకుండా, ఇతరాభిచారములకు గురికాకుండా క్షేమముగా నుండును.

## రాజస బలిదానవిధి

శ్లో॥ అభిషచ్య మహీపాలం పరేషాం విజయోద్యతాం
ఉక్తేన విధినా మంత్రీ యామిన్యాం బలిమాహరేత్ ।
అన్యూనాంగ మజం హత్వా రాజసం ప్రాగుదాహృతం
బలిప్రదానసమయే రిపూణాం సర్వసైన్యకమ్ ।
నివేదయేద్ బలిత్వేన వటుకాయ విశిష్టధీః
విదర్భయేచ్ఛత్రు నామ్నా బలిమంత్రం తథాసుధీః ।
అనేనబలినా హృష్టో బటుకః పరసైన్యకమ్
సర్వంగణేభ్యో విభజేదామిషం క్రుద్ధమానసః ।
ఏవంకృతే పరబలం క్షీయతే నాఽత్ర సంశయః
విజయశ్రియమేతేన రాజాప్రాప్నోత్యయత్నతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పాలకుని అభిషేకించిన అనంతరం, ఆ రోజు రాత్రి రాజస బలి సమర్పించాలి. అవయవలోపము - అధికాంగమూ లేని మేకను - ఇవ్వాలి. దానితోబాటు శత్రునామ సహితముగా ఈ క్రింది మంత్రముతో నివేదన చేయాలి.

### బలి సంకల్ప మంత్రము

☞ **శతృపక్షస్యరుధిరం పిశితం చ దినే దినే**
**భక్షయస్వగణైః సార్ధం సారమేయ సమన్వితః ।**

ఈ ప్రకారము బలి సమర్పించిన, బటుకభైరవుడు సంతుష్టిచెంది అనుగ్రహించును. శత్రుపక్షము క్షీణించును. స్వజనమువృద్ధిచెంది విజయము పొందును.

## ఆపదుద్ధరణ యంత్రము

శ్లో॥ శ్రీమాయా స్మరకూటమత్ర విలిఖేన్మధ్యే దళేష్వష్టసు
ద్విఃప్రోక్త వటుకాయ శబ్దమపరాన్ మంత్రస్య వర్ణాన్ బహిః
అష్టద్వంద్వదళేషు తద్బహిరతస్తత్ సంఖ్య పత్రేష్వథ
ద్వాత్రింశద్దళకాది సాంతసహితం యంత్రంలిఖేద్ భూపురే॥
ఆపదుద్ధరణం యంత్రమపమృత్యు భయాపహం
సర్వసంపత్ ప్రదం నిత్యం సర్వసౌభాగ్య దాయకమ్ ।
రక్షాకరంగ్రహార్తానాం రాజ్ఞాం విజయ వర్ధనం
ఆపదుద్ధరణా దస్మాదుపదుద్ధరణ క్షమః ।
తంత్రేషు నాస్తి మంత్రోఽన్య ఇత్యాహుర్మంత్ర వేదినః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అష్టదళ పద్మము లిఖించి, దానిపై షోడశ దళపద్మము లిఖించాలి. మరల దానిపై మరొక షోడశదళ పద్మము నిర్మించాలి. మళ్ళీ దానిపై మరొక షోడశదళ పద్మము మూడవది లిఖించాలి. మరల దానిపై 32 దళముల పద్మమును లిఖించాలి. దానిపై ఒక వృత్తమును ఆవేష్టితం చేయాలి. దానిని చతురస్రకోణయుక్త భూపురమును లిఖించాలి.

అష్టదళ పద్మముయొక్క మధ్యలో "శ్రీం హ్రీం క్లీం" లిఖించాలి. అష్టదళములందు "బటుకాయ॥ అను పదములోని ఒక్కొక్క అక్షరమును క్రమముగా 2 సార్లు లిఖించాలి. మొదటి షోడశదళములందు

"ఆపదుద్ధరణాయ కురుకురు బటుకాయ హ్రీం॥ అను 16 అక్షరములూ ఒక్కొక్కటిగా లిఖించాలి.

రెండవ షోడశదళములందు 16 అచ్చులను లిఖించాలి. మూడవ 32 దళములందు క కారమునుండి సకారమువరకు, ఒక్కొక్క వ్యంజనాక్షర ములను లిఖించాలి.

ఇదియే ఆపదుద్ధారక బటుక భైరవయంత్రము ఇది సకల అపమృత్యువులను, భయములను తొలగించును. గ్రహబాధలను నివారించును. తంత్రశాస్త్రమునందు దీనిని మించిన యంత్రము లేదని మంత్రవేత్తలు ప్రశంసించి యున్నారు.

## చండేశ్వర మంత్రము

శ్లో॥ అర్ఘీశోవహ్ని శిఖరో లాంతస్థో దాంత ఈరితః
షడంతశ్చండమంత్రోఽయం త్రివర్ణాత్మా సమీరితః ।
అస్యత్రికో మునిఃప్రోక్తశ్ఛందోఽనుష్టు బుదాహృతం
చండేశో దేవతాప్రోక్తా కుర్యాదంగ విధింపునః ।
హృదయం దీప్త ఫట్ ప్రోక్తం జ్వలఫట్ శిర ఈరితం
శాఖా జ్వాలామాలినీ ఫట్ జ్ఞేయా ఫట్ కవచంమతమ్ ।
హనఫట్ నేత్రమాఖ్యాతం సర్వజ్వాలిని ఫట్పరమ్
విన్యస్యైవంషడంగాని తతోదేవం విచింతయేత్ ।
వర్ణలక్షం జపేన్మంత్రం హోమంకుర్యాద్దశాంశతః
మధురత్రయ సంయుక్తై ర్విశుద్ధై స్తిలతండులైః ।
పంచాక్షరోదితేపీఠే చండేశం సాధు పూజయేత్
మూర్త్యా బీజేనక్లప్తాయాం తత్ కర్మోబిందుసంయుతః ।

**చండేశ్వరాయ హృద్బీజపూర్వః పూజామనుర్మతః**
**అంగైర్మాతృభిః ఆశేషైర్ వ్రజ్యాద్యైరాయుధైర్యజేత్ ।**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మూడక్షరముల చండీశ్వర మంత్రము చెప్పబడుచున్నది.

**మనుః - ఊర్ధ్వఫట్।**

**త్రికృషిః। అనుష్టుబ్ ఛందః। చండీశ్వరో దేవతా। ఊం బీజం। ఫట్ శక్తిః।** షడంగ న్యాసమిట్లు చేయవలయును.

| | | |
|---|---|---|
| దీప్తఫట్ | - | హృదయాయ నమః। |
| జ్వలఫట్ | - | శిరసే స్వాహా। |
| జ్వాలామాలినీఫట్ | - | శిరసే స్వాహా। |
| ఫట్ | - | కవచాయ హుం। |
| హనఫట్ | - | నేత్రత్రయాయ వౌషట్ |
| సర్వజ్వాలినీ ఫట్ | - | అస్త్రాయఫట్ |

పిమ్మట చండేశ్వరుని ఇలా ధ్యానించాలి.

☞ **చండేశ్వరం రక్త తనుంత్రినేత్రం**
**రక్తాంశుకాఢ్యం హృదిభావయామి।**
**టంకం త్రిశూలం స్ఫటికాక్షమాలాం**
**కమండులుంబిభ్రత మిందుచూడమ్॥**

మూడు లక్షలు మంత్రము జపించి, పాలు - తేనె - నెయ్యి కలిపిన తిల - తండులములతో దశాంశ హోమమాచరించాలి. పిమ్మట పూర్వోక్త పంచాక్షర శైవపీఠమునందు చండీశ్వరుని పూజించాలి.

బీజమంత్రముతో రూపకల్పన "చం చండేశ్వరాయ నమః" అను దానికి ఊర్ధ్వఫట్ ముందుచేర్చి, అర్చించాలి. పిమ్మట అంగపూజ,

మాతృకలు, లోకపాలురను అర్చించాలి. నాలుగు ఆవరణములతో చండేశ్వరుని పూజించిన సాధకుడు సకల సంపదలను, ఇష్టసిద్ధిని పొందును.

శ్లో॥ తర్పయేన్మనునాఽనేన నిత్యమష్టోత్తరం శతం
శ్రియమాప్నోతి మహతీం పుత్రమిత్ర సమన్వితః ।
ప్రియంగుకుసుమైః ఫుల్లైః తత్కాష్ఠ జ్వలితేఽనలే
జుహుయాదయుతం మంత్రీ పురః క్షోభో ప్రజాయతే ।
సాధ్యవృక్షత్వచో లోణం పిష్ట్వా పిష్ట సమన్వితం
పుత్తలీం రుచిరాంకృత్వా ప్రతిష్ఠాప్య సమీరణమ్ ।
ఛిత్వాఛిత్వా ప్రజుహుయాదష్టోత్తర శతం నిశి
సప్తాహమేవం కుర్వీత సాధ్యో దాసో భవేత్ స్వధమ్ ।
శైవమంత్రేషు నిష్ణాతశ్చండేశ్వర మనుంభజేత్
జర్వాన్ కామానవాప్నోతి పరత్రేహ చ నందతి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - చండేశ్వర మంత్రముతో నిత్యమూ 108సార్లు తర్పణమిచ్చిన పుత్ర - మిత్ర - సంపదలు కలుగును. ప్రియంగు (          ) పుష్పములతో, ప్రియంగు సమిధలతో, 10వేలు హోమమాచరించిన, నగరమంతయూ క్షోభ చెందును.

సాధ్యవ్యక్తియొక్క నక్షత్ర వృక్షముయొక్క లవణమును నూరి, బియ్యపు పిండితో కలిపి, బొమ్మనుచేసి అందు శత్రుప్రాణప్రతిష్ఠచేసి, రాత్రియందు, ముందు 22వ పటలములో చెప్పబోవు విధానములో, బొమ్మయొక్క అంగములు ఛేదించి 108 సార్లు హోమం చేసిన, అతడు దాసుడగును. ఈ ప్రయోగము 7 రోజులు చేయవలయును.

శైవమంత్రములో దీక్షితుడైన సాధకుడు చండేశ్వర మంత్రము జపించాలి. శివమంత్రము, ఎన్నిసార్లు జపించితురో అన్నిసార్లూ చండేశ్వర మంత్రము జపించిన, సమస్త కోరికలు నెరవేరును.

# శివస్తుతి

శ్లో॥ ధరాపోఽగ్నిమరుద్ వ్యోమ మఖేశేంద్వర్కమూర్తయే
సర్వభూతాంతరస్థాయ శంకరాయ నమోనమః ।
శృత్యంత కృతవాసాయ శ్రుతయే శృతిజన్మనే
అతీంద్రియాయ మహసే శాశ్వతాయ నమో నమః ।
స్థూలసూక్ష్మ విభాగాభ్యా మనిర్దేశ్యాయ శంభవే
భవాయ భవసంభూత దుఃఖహంత్రే నమోఽస్తుతే ।
తర్కమార్గాతి దూరాయ తపసాంఫలదాయినే
చతుర్వర్గ వదాన్యాయ సర్వజ్ఞాయ నమోనమః ।
ఆదిమధ్యాంత శూన్యాయ నిరస్త శేషభీతయే
యోగిధ్యేయాయ మహతే నిర్గుణాయ నమోనమః ।
విశ్వాత్మనేఽ విచింత్యాయ విలసచ్చంద్రమౌళినే
కందర్ప దర్పకాలాయ కాలహంత్రే నమో నమః ।
విషాశనాయ విహరద్ వృషస్కంధ ముపేయుషే
సరిద్దామ సమాబద్ధ కపర్దాయ నమోనమః ।
శుద్ధాయ శుద్ధ భావాయ శుద్ధానామంతరాత్మనే
పురంతకాయ పూర్ణాయ పుణ్యానామ్నే నమోనమః ।
భక్తాయ నిజభక్తానాం భుక్తిముక్తి ప్రదాయినే
వివాసనే వివాసాయ విశ్వేశాయ నమోనమః ।
త్రిమూర్తి మూలభూతాయ త్రినేత్రాయ నమోనమః
త్రిధామ్నా ధామరూపాయ జన్మఘ్నాయ నమో నమః ।

దేవాసురశిరోరత్న కిరణారుణితాంఘ్రయే
కాంతాయనిజకాంతాయై దత్తార్ధాయ నమోనమః ।

ఈ స్తోత్రమును పూజయందు పఠించిన, పరమేశ్వరానుగ్రహము కలిగి భుక్తి - ముక్తులు సిద్ధించును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*వింశ పటలః సమాప్తః*

❖❖❖

## అథైకవింశః పటలః

## అథ గాయత్రీ ప్రకరణమ్

శ్లో॥ అథోవక్ష్యామి గాయత్రీం తత్వరూపాం త్రయీమయీం
యయా ప్రకాశ్యతే బ్రహ్మ సచ్చిదానంద లక్షణమ్ ।
ప్రణవాద్యా వ్యాహృతయః సప్తస్యుః తత్పదాత్మికా
చతుర్వింశత్యక్షరాత్మా గాయత్రీ శిరసాన్వితా ।
సర్వవేదో ద్ధృతః సారో మంత్రోఽయం సముదాహృతః
బ్రహ్మోదేవ్యాది గాయత్రీ పరమాత్మా సమీరితాః ।
ఋష్యాద్యాః ప్రణవస్యైతే మునిభిః పరికీర్తితాః
జమదగ్ని భరద్వాజ భృగుగౌతమ కశ్యపాన్ ।
విశ్వామిత్ర వశిష్ఠాఖ్యౌ వ్యాహృతీ నామృషీన్విదుః
గాయత్ర్యుష్ణి గథాఽనుష్టుబ్ బృహతీ పంక్తయః పునః ।
త్రిష్టుబ్ జగత్యౌఛందాంసి కథితాని మనీషిభిః
సప్తర్చిరనిలః సూర్యోవాక్పతి ర్వరుణో వృషః ।
విశ్వేదేవాః క్రమాదాసాం దేవతాః పరికీర్తితాః

గాయత్ర్యా మునిరాఖ్యాతో విశ్వామిత్రో మహోద్యుతిః ।
గాయత్రీ ఛంద ఇత్యుక్తం దేవతా సవితాస్మృతా ।
గాయత్రీ పరమాత్మాఽస్య దేవతా కథితా బుధైః ॥

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - ఇప్పటివరకు తాంత్రిక మంత్రములు చెప్పబడినవి. ఇపుడు వైదికమంత్రము చెప్పబడుచున్నది. వేదస్వరూపిణి, 24 తత్వాత్మకమైన, గాయత్రీ మంత్రము వివరింపబడు చున్నది.

## శిఖాగాయత్రీ మంత్రము

**ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం, తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ । ఓం ఆపోజ్యోతిరసోఽమృతం భూర్భువః స్వరోమ్ ।**

ఈ గాయత్రీ మంత్రము వేదములన్నిటినీ మథించి సారరూపముగా "విశ్వామిత్రమహర్షి"చే దర్శించబడినది.

సప్తవ్యాహృతులకు క్రమముగా, జమదగ్ని, భరద్వాజ, భృగు – గౌతమ – కశ్యప – విశ్వామిత్ర – వశిష్ఠులు, ఋషులు । గాయత్రీ – ఉష్ణిక్ – అనుష్టుప్ – బృహతీ – పంక్తి – త్రిష్టుప్ – జగతీ ఛందస్సులు – । అగ్ని – వాయు – సూర్య – బృహస్పతి – వరుణ – ధర్మ విశ్వేదేవతలు, దేవతలు ।

ఇపుడు "తత్సవితు" నుండి "ప్రచోదయాత్ వరకు గల గాయత్రీ మంత్రమునకు, ఋష్యాదులు చెప్పబడుచున్నవి. ఇది 24 అక్షరముల మంత్రము.

అస్యశ్రీ గాయత్రీ మహామంత్రస్య, మహాన్ తేజస్వీ "విశ్వామిత్ర" ఋషిః । గాయత్రీ ఛందః । సవితా దేవతా । రేబీజం । యం శక్తిః । ణిత్ కీలకం ।

శిఖాగాయత్రికి బ్రహ్మేఋషిః । గాయత్రీ ఛందః । పరమాత్మా దేవతా।

## అక్షర న్యాసము

శ్లో॥ వ్యాహృతీః సప్త భూరాద్యా హృన్ ముఖాంసోరు యుగ్మకే
జఠరే న్యస్య మంత్రజ్ఞా గాయత్ర్యా ర్ణాస్తనౌ న్యస్యేత్ ।
పత్ సంధిషు ధ్వజే నాభౌ హృత్ కంఠ భుజ సంధిషు
ఆస్యనాస కపోలాక్షి కర్ణ భ్రూ మస్తకే పునః ।
పాశ్చాత్యోత్తర యామ్య ప్రాగూర్ధ్వ వక్త్రేషు సాధకః
పదానిదశ విన్యస్యేదేషు స్థానేషు మంత్రవిత్ ।
శిరోభ్రమూమధ్య హృద్వక్త్రే కంఠహృన్నాభి గుహ్యకే
జానునోః పాదయోర్ యుగ్మేతచ్ఛిరః శిరసిన్యసేత్ ।
బ్రహ్మణే హృదయంప్రోక్తం విష్ణవే శిరఈరితం
శిఖా రుద్రాయ కవచ మీశ్వరాయ సమీరితమ్ ।
నేత్రం సదాశివాయోక్తమస్త్రం సర్వాత్మనే స్మృతం
షడంగాన్యేవముక్తాని యథాస్థానం ప్రవిన్యసేత్ ।
ప్రాణాయామాన్ పురాకృత్వా గాయత్రీం సంధ్యయోర్జపేత్
సప్తవ్యాహృతి సంయుక్తాం గాయత్రీం శిరసాఽన్వితామ్ ।
త్రిరుచ్చరన్ ధియాప్రాణాన్ ధారయేద్యతమానసః
ప్రాణాయామోఽయ మాఖ్యాతః సమస్త దురితాపహః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు అక్షరన్యాసము చెప్పబడుచున్నది. 7 వ్యాహృతులను, హృదయ - ముఖ - 2స్కంధ - 2 ఊరు - జఠరములందు న్యాసం చేయాలి. పాదముయెుక్క 4

సంధులయందు, 4 అక్షరములు - లింగ - నాభి - హృదయ - కంఠములందు, ఒక్కొక్క అక్షరము, చేతియొక్క 4 సంధులందు 4 అక్షరములు, పిమ్మట ముఖ - నాసిక - కపోల - నేత్ర - శ్రవణ - భ్రూ - మస్తకములందు ఒక్కొక్క అక్షరము న్యాసం చేయాలి.

పిమ్మట పశ్చిమ - ఉత్తర - దక్షిణ - పూర్వ ఊర్ధ్వ ముఖములందు ఒక్కొక్కటి 5 అక్షరములు, ఇలా మొత్తం 24 అక్షరములూ న్యాసం చేయాలి. న్యాసకాలమునందు అక్షరమునకు ముందు ప్రణవము, చివర నమః శబ్దములు చేర్చాలి.

**విశేషము** - (మంత్రము తత్సవితు నుండి ప్రచోదయాత్ వరకు 23 అక్షరములే యగుచున్నవని, ణ్యమ్ అక్షరమును, ణియమ్ అని విడివిడిగా ఉచ్చరించిన 24 అక్షరములూ పూర్తియగునని "రాఘవభట్టు" పదార్థాదర్శ సంస్కృత వ్యాఖ్యానమునందు వివరించినారు, కాశ్మీరు దేశమునందు ఇలాగే విడిగా "వరేణియం" అనే ఉచ్ఛరిస్తారు. అయితే, ఓం చేర్చిన 24 అక్షకరములు అగుచున్నవి. -మేడవరపు సంపత్‌కుమార్)

## గాయత్రీ పదన్యాసము

గాయత్రీ మంత్రమును పదిభాగములు చేసి, ఈ క్రింది పదిస్థానములందు న్యాసము చేయాలి.

| | | |
|---|---|---|
| శిరస్సు | - | తత్ |
| భ్రూమధ్యం | - | సవితుః |
| హృదయం | - | వరేణ్యం |
| ముఖం | - | భర్గో |
| కంఠం | - | దేవస్య |

| | | |
|---|---|---|
| హృదయ | - | ధీమహి |
| నాభి | - | ధియో |
| గుహ్య | - | యో |
| 2 జాను | - | నః |
| 2 పాద | - | ప్రచోదయాత్ |

## గాయత్రీ షడంగన్యాసం

| | | |
|---|---|---|
| బ్రహ్మణే నమః | - | హృదయాయ నమః । |
| విష్ణవే నమః | - | శిరసే స్వాహా । |
| రుద్రాయ నమః | - | శిఖాయై వషట్ । |
| ఈశ్వరాయ నమః | - | కవచాయహుమ్ |
| సదాశివాయ నమః | - | నేత్రత్రయాయ వౌషట్ । |
| సర్వాత్మనే నమః | - | అస్త్రాయ ఫట్ । |

పిమ్మట సాధకుడు ఇలా ధ్యానించాలి.

☞ **ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైర్ముఖైః తీక్షణైః**
**యుక్తామిందు నిబద్ధరత్నమకుటాం తత్వాత్మ వర్ణాత్మికామ్ ।**
**సావిత్రీ వరదా భయాంకుశ కశాః శుభ్రం కపాలం గుణం**
**శంఖంచక్రమ థాఽర విందయుగళం హస్తైర్ వహంతీంభజే ॥**

ధ్యానానంతరం, జపానికిముందు ప్రాణాయామం ఆచరించాలి. రెండు సంధ్యాకాలములందు గాయత్రీ జపం చేయాలి.

సప్తవ్యాహృతి సహితంగా - చివర ఆపోజ్యోతి రసోఽమృతం ఓం భూర్భువః స్వరోమ్, వరకు, శిరస్సునందు మూడు ఉచ్చరించి ప్రాణాయామం ఆచరించాలి. ఇందుచేత సమస్త దోషములు పాపములు నశించును.

శ్లో॥ వ్యాహృతి త్రితయ సంయుక్తా గాయత్రీం దక్షతో జపేత్
తత్వలక్షం విధానేన భిక్షాశీ విజితేంద్రియః ।
క్షీరౌదన తిలాన్ దూర్వా క్షీరద్రుమ సమిద్వరాన్
పృథక్ సాహస్ర త్రితయం జుహుయాన్మంత్రసిద్ధయే ।
విధాయ మండలం విద్వాన్ త్రికోణోజ్వల కర్ణికామ్
సౌరంపీఠం యజేత్తత్ర దీప్తాదినవశక్తిభిః ।
మూలమంత్రేణ క్లప్తాయాం మూర్తౌ దేవీంప్రపూజయేత్
కోణేషు త్రిషు సంపూజ్యా బ్రహ్మాద్యాః శక్తయోబహిః ।
ఆదిత్యాద్యాస్తతః పూజ్యా ఉషాదిసహితాః క్రమాత్
తతః షడంగానభ్యర్చేత్ కేసరేషు యథావిధి ।

..............................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వ్యాహృతి సహిత గాయత్రీ మంత్రమును 24 లక్షలు జపించి, భిక్షాన్నభోజన విధి పాటించుచూ, అశ్వత్థ - మేడి - మర్రి సమిధలతోను, క్షీర - ఓదన (అన్నం) తిల - దూర్వా - ప్లక్ష (          ) సమిధలతో, ఒక్కొక్క దానితో మూడేసివేలు 8 × 3 = 24వేలు హోమం ఆచరించాలి.

## దశావరణార్చన

సర్వతో భద్రమండలము లిఖించి కర్ణిక యందు, త్రిగుణిత యంత్ర (9వ పటలంలో చెప్పబడినది) సౌరపీఠము నందు (14వ పటలములో చెప్పబడినది) దీప్తాది నవశక్తులను మూల మంత్రముతో ఆవాహన చేసిన గాయత్రిని భావించి పూజించాలి.

**1. ప్రథమావరణార్చన** త్రికోణమునందు ఆగ్నేయ భాగములో బ్రహ్మను, పశ్చిమకోణమందు విష్ణువును, ఈశాన్యకోణమునందు రుద్రుని పూజించాలి. తూర్పున గాయత్రిని, నైరుతిలో సావిత్రిని, వాయవ్యమున సరస్వతీ రూపశక్తుల నారాధించాలి.

(ఇచట బ్రహ్మాదుల పూజ ముందుగా చెప్పబడినది, అయితే గురు సంప్రదాయములో కొన్నిచోట్ల ముందుగా గాయత్రీ మొదలగు శక్తుల నర్చించాలని, ఆపై బ్రహ్మాదుల నర్చించాలని తెలియుచున్నది. ఈ విధానము గురుప్రోక్త సంప్రదాయము ననుసరించి ఆచరించాలని తెలియజేస్తున్నాను.
– మేడవరపు సంపత్ కుమార్)

**2) ద్వితీయావరణార్చన** – ఇందు ఉషాసహిత ఆదిత్యాది దేవతలను (14వ పటలములో చెప్పబడినది) అర్చించాలి.

**3) తృతీయావరణార్చన** – కేసరములందు షడంగపూజ చేయాలి. ఇది 4వ పటలములో చెప్పబడినది.

**4) చతుర్థావరణార్చన** – ఇందు ప్రహ్లాదినీ – ప్రభా – నిత్యా – విశ్వంభరా – విలాసినీ – ప్రభావతీ – జయా – శాంతిలను అర్చించాలి.

**5) పంచమావరణార్చన** – ఇందు, కాంతి – దుర్గా – సరస్వతీ – విశ్వరూపా – విశాలా – ఈశా – వ్యాపినీ – విమలా, వీరిని పూజించాలి.

**6) షష్ఠావరణార్చన** – తమోపహారిణీ – సూక్ష్మావిశ్వయోని – జయావహా – పద్మాలయా – పరాశోభా – పద్మరూపా, వీరిని అర్చించాలి.

**7) సప్తమావరణార్చన** – బ్రాహ్మీ మొదలుకొని మహాలక్ష్మి వరకు మాతృకల నర్చించాలి (6వ పటలము నందు చెప్పబడినది) ఇచట మహాలక్ష్మి స్థానములో అరుణను పూజించాలని పద్మపాదాచార్యులు చెప్పినట్లు సంస్కృత వ్యాఖ్యానములో రాఘవభట్టు పేర్కొన్నారు.

**8) అష్టమావరణార్చన** – నవగ్రహముల నర్చించాలి.

**9) నవమావరణార్చన** – ఇంద్రాది లోకపాలురను, అర్చించాలి.

**10) దశమావరణార్చన** – ఇందు, లోకపాలుర, వజ్రాది ఆయుధముల నర్చించాలి.

ఈ విధముగా "దశావరణార్చన" చేయు సాధకుడు, ధర్మార్థ కామమోక్షములను పొందును.

గాయత్రీ మంత్రముతో 24 వేలు, తిలహోమం చేసినచో, సర్వపాపములూ తొలగి, దీర్ఘాయువు కలుగఉరిను.

## వివిధ ద్రవ్యహోమ ఫలితము

శ్లో॥ ఆయుషే సాజ్యహవిషా కేవలేనాఽథ సర్పిషా
దూర్వాత్రికైస్తిలైర్ మంత్రీ జుహుయాత్ త్రిసహస్రకమ్ ।
అరుణాబ్జైస్త్రి మధ్వక్తైర్ జుహుయాదయుతంతతః
మహాలక్ష్మీర్భవేత్తస్య షణ్మాసాన్నాత్ర సంశయః ।
బ్రహ్మశ్రియే ప్రజుహుయాత్ ప్రసూనైర్ బ్రహ్మవృక్షజైః
బహునా కిమిహోక్తేన యథావత్ సాధుసాధితా ।
ద్విజన్మనా మియం విద్యా సిద్ధాకామదుఘా మతా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – వివిద ద్రవ్యములతో హోమము చేయుట వలన కలుగు ఫలితములు వివరించబడుచున్నవి.

| | | |
|---|---|---|
| నేతితో హవిస్సుహోమం | – | ఆయుర్వృద్ధి । |
| కేవలం నేతి హోమం | – | దీర్ఘాయువు । |
| తిలలు, దూర్వాత్రిక 3 వేల హోమం | – | ఆయుర్వృద్ధి । |

ఎర్ర కమలములు త్రిమధుర10 వేలు హోమం - సంపదప్రాప్తి ।

మోదుగపూల హోమం - బ్రహ్మవర్చస్ ప్రాప్తి

అధికముగా చెప్పుట ఏల? ద్విజాతికి - అనగా బ్రాహ్మణాది వర్ణములకు 'బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్యులు మొదలగు ఉపనయనార్హత గలవారికి) గాయత్రీ మహావిద్య కామధేనువు వంటిది.

## ఆగ్నేయ మంత్రవిద్య

శ్లో॥ ఆగ్నేయ మభిధాస్యామి మంత్రం సర్వార్థ సాధకం
మారీచః కాశ్యపః ప్రోక్తో మునిరస్య మహామనోః ।
త్రిష్టుప్ ఛందో దేవతాఽత్ర జాతవేదోగ్నిరీరితః
నవభిఃసప్తభిఃషడ్భిః సప్తభిః పునరష్టభిః ।
సప్తభిః మూలమంత్రార్ణైః షడంగ విధిరీరితః
అంగుష్ఠ గుల్ఫ జంఘాసు జానునోరురు యుగ్మకే ।
కట్యంధు నాభిషు హృది స్తనయోః పార్శ్వయోర్ద్వయోః
పృష్ఠతః స్కంధయోర్మధ్యే బాహుమూలోపబాహుషు ।
ప్రకూర్పర ప్రకోష్ఠేషు మణిబంధతలేషుచ
ముఖనాసాక్షి కర్ణేషు మస్తమస్తిష్క మూర్ధసు ।
క్రమేణ విన్యసేద్ వర్ణాన్మంత్రీ మంత్రసముద్భవాన్
శిఖాలలాట నయన కర్ణౌష్ఠ రసనాస్వథ ।
సకంఠ బాహు హృత్ కుక్షి కటిగుహ్యోరుజానుషు
జంఘయోః పాదయోర్న్యస్యే త్పదాన్యస్య మనోఃసుధీః ।
మంత్రవర్ణ సహస్రాణి జపేన్మంత్రం విశాలధీః
తదంతే తిలసిద్ధార్థ చిత్రమూలైః సమిద్వరైః ।

క్షీరద్రుమాణామాజ్యేన హవిషాఽన్నైర్ఘృతాన్వితైః
చతుశ్చత్వారింశ దాఢ్యం చతుఃశత సమన్వితమ్ ।
చతుః సహస్రం జుహుయాదర్చితే హవ్యవాహనే

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 44 అక్షరముల ఆగ్నేయ మంత్రము చెప్పబడుచున్నది. ఇది ఋగ్వేదమునందు ప్రసిద్ధము. దీనిని హ్రీం బీజము చేర్చి జపించిన శీఘ్రసిద్ధి.

మనుః : ఓం జాతవేదసే సునవామసోపమరాతీయతో నిదహాతివేదః । సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేన సింధుందురి తాత్యగ్నిః ।

మరీచి పుత్రో కశ్యపఋషిః । త్రిష్టుప్ఛందః । హలాంశోబీజం । సర్వాంశో శక్తిః । జాతవేద అగ్నిర్దేవతా ।

మూలమంత్రములోని 9 + 7 + 6 + 7 + 8 + 7 అక్షరములతో షడంగ న్యాసమాచరించాలి.

## వర్ణన్యాసము

మూలమంత్రములోని 44 అక్షరములను, శరీరములోని 44 స్థానములందు న్యాసం చేయాలి.

**2 కాలి బొటనవేళ్లు - 2 చీలమండలు - 2 పిక్కలు - 2 మోకాళ్లు - 2 తొడలు - కటి - లింగము - నాభి - 2 స్తనములు - 2 ప్రక్కలు - ఈ వెనుకభాగములు - 2 భుజములు - మెడ - 2 చంకలు - 2 దండలు - 2 నాసికారంధ్రములు - 2 నేత్రములు - 2 చెవులు - లలాటము - నుదుటి ముందుభాగము - శిరోమధ్యము అనే 44 స్థానములందు మంత్రాక్షర న్యాసం చేయాలి.**

# పదన్యాసము

మూలమంత్రములోని 18 పదములను, శరీరములోని 18 స్థానములందు న్యాసము చేయాలి. 1. శిఖ - 2. లలాట 3,4. నేత్రం 5,6. కర్ణ(2) 7. ఓష్ఠ 8. నాలుక 9. కంఠము 10. బాహు 11. హృదయము 12. కుక్షి 13. కటి 14. గుహ్య 15. ఊరు 16. జాను 17. జంఘ (కాలిపిక్కలు) 18. పాదములు స్థానములందు పదన్యాసం చేయాలి.

పిమ్మట అగ్నిరూపమున దుర్గాదేవిని ఇలా ధ్యానించాలి

☞ **విద్యుద్దామసమప్రభాం మృగపతి స్కంధస్థితాం భీషణాం**
**కన్యాభిః కరవాల ఖేట విలసద్ హస్తాభిరాసేవితామ్ ।**
**హస్తైశ్చక్రదరాసిఖేట విశిఖం చాపం గుణం తర్జనీం**
**బిభ్రాణా మనలాత్మికాంశశిధరాం దుర్గాంత్రినేత్రాం స్మరేత్ ॥**

పిమ్మట, మూలమంత్రమును 44వేలు జపించి, తిలలు - తెల్లావాలు, చిత్రమూలము - క్షీరవృక్ష సమిధలు - నెయ్యి - పాయసములలో 4444 సార్లు హోమం చేయాలి. పైన చెప్పిన 5 ద్రవ్యములు + 4 రకముల క్షీరవృక్ష సమిధలు (రావి - మర్రి - మేడి - మోదుగ) మొత్తం 9 ద్రవ్యములతో ఒక్కొక్క దానితో 490 సార్లు ఆహుతులతో హోమం చేయాలని "సంస్కృత వ్యాఖ్యానములో విశేషముగా వ్రాయబడినది.

శ్లో॥ మండలే సర్వతోభద్రే షట్కోణాం కిత కర్ణికే
విధినా వక్ష్యమాణేన పీఠం దేవ్యాః ప్రపూజయేత్ ।
జయాఖ్యాం విజయాం భద్రాం భద్రకాళీ మనంతరం
సుముఖీందుర్ముఖీ సంజ్ఞాం పశ్చాద్ వ్యాఘ్రముఖీం పునః ।
అథ సింహముఖీం దుర్గాం నవశక్తీః ప్రపూజయేత్

ఆసనం సింహమంత్రేణ దద్యాదుక్తేన దేశికః ।
మూర్తిం సంకల్ప్య మూలేన తస్యామావాహ్య పూజయేత్
షడంగాని యథాపూర్వం కేసరేష్వర్చయేత్ సుధీః ।
అగ్న్యాది పాదాష్టకోపన్నామూర్తయోర్చ్యా బహిః పునః

...........................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సర్వతో భద్రమండలము లిఖించి, దానిపై షట్కోణము లిఖించి, కర్ణికయందు, షడ్గుణిత యంత్రరూప (9వ పటలంలో చెప్పబడినది) దేవీపీఠమునందు 9 శక్తులను ఆరాధించాలి. 1. జయా 2. విజయా 3. భద్రా 4. భద్రకాళీ 5. సుముఖీ 6. దుర్ముఖీ 7. వ్యాఘ్రముఖీ 8. సింహముఖీ 9. దుర్గా.

11వ పటలమునందు చెప్పిన సింహమంత్రముతో సింహాసనము సమర్పించాలి. కేసరములందు షడంగపూజ చేయాలి. మూలమంత్రముతో విగ్రహమును భావించి, 8 అగ్నిమూర్తులను, 1. జాతవేద 2. సప్తజిహ్వ 3. హవ్యవాహన 4. అశ్వోదరజ 5. వైశ్వానర 6. కౌమారతేజ 7. విశ్వముఖ 8. దేవముఖలను అర్చించాలి.

నాలుగు దిశలందు తూర్పున – భూతత్వాత్మనే నమః, దక్షిణమున – సలిలతత్వాత్మనే నమః, పశ్చిమమున అగ్ని తత్వాత్మనే నమః, ఉత్తరమున – వాయుతత్వాత్మనే నమః, అని అర్చించాలి. నాలుగుకోణములందు – నివృత్తి – ప్రతిష్ఠా – విద్యా – శాంతిలను అర్చించాలి. వారి పేర్లు

1. జాగ్రత 2. తపని 3. వేదగర్భ 4. దహన రూపిణి 5. సేందుఖండా 6. శుంభహంత్రీ 7. నభశ్చారిణీ 8. వాగీశ్వరి 9. మదవహా 10. సోమరుపా 11. మనోజవా 12. మరుద్వేగా 13. రాత్రి 14. తీవ్రకోపా 15. యశోవతీ 16. తోయాత్మికా 17. నిత్యా 18. దయావతీ 19. హారిణీ 20. తిరస్క్రియా 21. వేదమాతా 22. దమనప్రియా

**23.** సమారాధ్యా **24.** నందినీ **25.** పరా **26.** రిపువిమర్దినీ **27.** షష్ఠీ **28.** దండినీ **29.** తిగ్మా **30.** దుర్గా **31.** గాయత్రీ **32.** నిరవద్యా **33.** విశాలాక్షీ **34.** శ్వాసోద్వాహా **35.** నాదినీ **36.** వేదనా **37.** వహ్నిగర్భా **38.** సింహవాహా **39.** ధుర్యా **40.** దుర్విషహా **41.** రిరంసా **42.** తాపహారిణీ, **43.** త్యక్తదోషా **44.** నిఃసపత్నా.

నాలుగు దిశలందు 11 పేర్ల చొప్పున 4 × 11 = 44 శక్తుల పూజ చేయవలయును. పిమ్మట వజ్రాది ఆయుధ సహిత లోకపాలురను అర్చించాలి. మంత్రమును విలోమముగా జపించిన ఆగ్నేయాస్త్ర మనబడును. ఋషిఛందోసులు పూర్వమువలెనె, న్యాసము మాత్రము ప్రతిలోమముగా చేయవలయును.

వర్ణన్యాస - పదన్యాసములు ప్రతిలోమముగా చేయవలయును. ధ్యానము మాత్రము గురుముఖముగా తెలుసుకొనవలయును. ఆగ్నేయాస్త్ర మంత్రజపహోమములు పూర్వోక్తవిధిగానే చేయవలయును.

మంత్రసిద్ధికొరకు పంచగవ్యమునందు వండిన చరుద్రవ్యమును హోమము చేయవలయును. ఈ ఆగ్నేయాస్త్ర ప్రయోగమునందు, గాయత్రి మంత్రమును, ద్విగుణము (రెండునుట్లు) చేయవలయును.

ఆగ్నేయాస్త్రము విలోమముగా 8 పదములలో విభజించి, ఇలా భావించ వలయును.

1. గిఃత్యతారిదు - ఘ్రాణ - రసనా - శ్రోత్రా - చక్షుః - త్యక్ అనే జ్ఞానేంద్రియాత్మకములు

2. ధుం సిం వవేనా - వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థలనే కర్మేంద్రియములు.

| | | | |
|---|---|---|---|
| 3. | శ్వావిణర్గాదు | - | పృథివి - అప్ - తేజో - వాయు - ఆకాశములనే, పంచభూతములు. |
| 4. | తిదషరుపనఃస | - | త్వక్ - అసృక్ - మాంస - మేద - అస్థి - మజ్జా - శుక్రములు |
| 5. | దఃవేతిహాదని | - | బుభుక్షా - పిపాసా - శోక - మోహ జరా - మృత్యువులు. |
| 6. | తోయతీరామమ | - | స్నాయు - అస్థి - మజ్జా - త్వక్ - మాంస - ఆంత్రములు. |
| 7. | సోమవానసు | - | శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ స్వరూపములు. |
| 8. | సేదవేతజా | - | వచన - ఆదాన - గతి - విసర్గ - ఆనంద స్వరూపములు. |

ఈ 8 పదములనుంచి 8 అగ్ని దేవతలుత్పన్నమగుదురు. వీరంతా ప్రధాన దేవత అయిన అగ్నివలెనే, తేజోవంతులూ, సార్థకనామధేయులూ అగుచున్నారు.

ఇంద్రియములనుండి ఉత్పన్నములైన దేవతలు (1 - 2 పాదములు) ఊర్ధ్వ దృష్టి కలవారు. పంచ మహాభూతములనుండి ఉద్భవించినవారు (3వ పదము) తిర్యగ్ దృష్టి కలవారు. ధాతు రూపములైన చతుర్థ పదమునుండువారు రెండు ముఖములు కలిగి, ఒకటిపైకి, మరొకటి క్రిందకు దృష్టి గలవారు.

ఊర్మిరూప 5వ పదమునుండి పుట్టినవారు, ఊర్ధ్వముఖులు. షాట్ కౌశిక రూప 6వ పదములోనివారు తిర్యక్ దృష్టి (వెనకకు చూచువారు) గలవారు. ఈ దేవతలందరూ నపుంసక స్వభావులు.

వీరు సౌమ్యకర్మయందు అభిముఖులుగాను, ఇతర కర్మలందు పరాంగ్ముఖులుగాను యుందురు. ఈ ఆగ్నేయాస్త్ర సిద్ధి పొందిన సాధకుడు వన - పర్వతయుక్త సమస్త రాజ్యమును భస్మము చేయగలడు.

## సాధన విషయము

శ్లో॥ అస్త్రం మనుష్య నక్షత్రేష్వారభేత విచక్షణః
ఆసురేషు ప్రయుంజీత దేవతారాసు సంహరేత్ ।
పూర్వోత్తరత్రయం పశ్చాద్ భరణ్యార్ద్రాఽథరోహిణీ
ఇమాని మనుష్యాణ్యాహుః నక్షత్రాణి మనీషిణః ।
జ్యేష్ఠా శతభిషామూల ధనిష్ఠా శ్లేష కృత్తికాః
చిత్రా మఖా విశాఖాః స్యుస్తారా రాక్షస దేవతాః ।
అశ్వినీ రేవతీ పుష్యః స్వాతీ హస్తా పునర్వసుః
అనూరాధా మృగశిరః శ్రవణా దేవతా రకాః ।
ఉపక్రమేత నందాసు రిక్తాస్వస్త్రం విసర్జయేత్
భద్రాస్వాహరణం కుర్యాజ్జయా స్వత్యంతముత్తమమ్ ।
ఉపక్రమోభౌమవారే శనివారే విసర్జనం
ప్రతిసంహరణం వారే గురోః శుక్రస్య వాభవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఆగ్నేయాస్త్రమును, మనుష్య నక్షత్రములలో ప్రయోగించడం ప్రారంభించి, రాక్షస నక్షత్రములలో ప్రయోగించి, దేవతా నక్షత్రములందు సమాప్తి చేయాలి. ఇలా ప్రారంభము - ప్రయోగము - ఉపసంహారము అను మూడు క్రియలు కలవు.

సామగ్రీ సంపాదన పూర్వక సంకల్పము ప్రారంభము, ఆహుతి మొదలగు ప్రయోగము, ఫలించిన పిమ్మట విసర్జనము ఉపసంహారము అనబడును.

పుబ్బ - పూర్వాషాఢ - పూర్వాభాద్ర - ఉత్తర - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర - భరణి - ఆర్ద్ర - రోహిణి - ఈ తొమ్మిదీ మనుష్య నక్షత్రములు.

జ్యేష్ఠ - శతభిషం - మూల - ధనిష్ఠ - ఆశ్లేష - కృత్తిక - చిత్ర - మఖ - విశాఖా - ఈ 9 రాక్షస నక్షత్రములు.

అశ్విని - రేవతి - పుష్యమి - స్వాతి - హస్త - పునర్వసు - అనూరాధ - మృగశిర - శ్రవణం ఈ తొమ్మిదీ దేవతా నక్షత్రములు.

ఆగ్నేయాస్త్ర మంత్ర ఉపక్రమము నందాతిధి రోజున (పాడ్యమి - షష్ఠి - ఏకాదశి) చేయాలి. చతుర్ధి - నవమి - చతుర్ధశి - అనే రిక్త తిధులందు విసర్జన చేయాలి. విదియ - సప్తమి - ద్వాదశి అనే భద్రా తిధులందు ప్రయోగించాలి. కాని తదియ - అష్టమి - త్రయోదశి తిధులు కూడా ఆ హరణమునకు అత్యంత శ్రేష్ఠము.

మంగళవారంనాడు ఆరంభించి, శనివారంనాడు విడచిపెట్టి, గురు లేదా శుక్రవారంనాడు ఉపసంహరించాలి.

శ్లో॥ స్థిరేషు రాశిష్వారంభశ్చరేషు స్యాద్విసర్జనం
అస్త్రసంహరణం కుర్యాదుభయేషు విచక్షణః ।
కృష్ణపక్షేఽనలే నాఽస్త్రం విసృజేచ్ఛశినాపునః
శుక్లపక్షే క్రమాదస్త్రం పునరాత్మని సంహరేత్ ।
భానునామోక్ష సంహారౌ కుర్యాత్ పక్షద్వయే సుధీః
పశ్చిమాభిముఖో భూత్వా కర్మ సర్వత్ర సాధయేత్ ।
నక్షత్ర వృక్ష శకలాన్ సాధ్యాఖ్యా కర్మసంయుతాన్
తత్తన్మంత్రాక్షరోపేతాన్ మంత్రీ మంత్రార్ణ సంఖ్యయా ।
జుహుయాదేధితే వహ్నౌ మారయేద్ రిపుమాత్మనః

కృష్ణాష్టమీం సమారభ్య యావత్ కృష్ణ చతుర్దశీ ।
ధత్తూరవిషవృక్షాక్ష భూరుహోత్థాన్ సమిద్వరాన్
రాజీతైలేన సంలిప్తాన్ పృథక్ సప్తసహస్రకమ్ ।
జుహుయాత్ సంయుతో భూత్వా రిపుర్యమపురం వ్రజేత్
సప్తరాత్రం ప్రజుహుయాత్ సిద్ధార్థస్నేహలోలితైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు రాశులను గూర్చి చెప్పబడుచున్నది. స్థిరరాశులందు (వృషభ - సింహ - వృశ్చిక - కుంభములు) ఆగ్నేయాస్త్రమును ప్రారంభించాలి. చరరాశులందు (మేష - కర్కట - తుల - మకరములు) వదలిపెట్టాలి. ద్విస్వభావ రాశులందు (మిథున - కన్య - ధను - మీనములు) ఉపసంహరించాలి.

కృష్ణపక్షమునందు కృత్తికా నక్షత్రమురోజున, అస్త్రమంత్రము ప్రారంభించి, శుక్లపక్షములో సౌమ్య నక్షత్రమున ప్రయోగించాలి. మరల కృత్తికా నక్షత్రమునాడు ఉపసంహరించాలి. తన ఆత్మయందు సూర్యరూపము ధ్యానించి, లేదా తానే సూర్యునిగా భావించి ఆగ్నేయాస్త్ర, ప్రారంభ ఉపసంహారమలు చేయాలి.

అస్త్రకర్మ సిద్ధించుటకు, ఆరంభ - ప్రయోగ - ఉపసంహారములు. పశ్చిమాభిముఖముగా చేయాలి. సాధ్య నక్షత్రముయొక్క వృక్షసమిదలు (22వ పటలములో ముందు చెప్పబడును) ప్రాదేశ మాత్రముగా గ్రహించి, సాధ్యనామ, కర్మలతో మంత్రముయొక్క ఒక్కొక్క అక్షరముతో జోడించి, 44 సార్లు హోమం చేసిన శత్రు..........మగును.

కృష్ణాష్టమి నుండి కృష్ణ చతుర్దశి వరకు ఉమ్మెత్త - విషవృక్ష - విభీతక (            ) సమిధలతో రాజీతైలము లేపనముచేసి ఏడువేలు హోమం చేసిన శత్రువు నశించును. సాధనలో బ్రహ్మచర్యము - ఏకభుక్తము, సత్యసంభాషణ మొదలగు నియమములు పాటించవలయును.

శ్లో॥ ఆర్ద్రవస్త్రో విష్టికాలో మరీచైర్మనునాఽమునా
నిగృహ్యతే జ్వరేణాఽరిః ప్రళయాగ్ని సమేనసః ।
తాళపత్రే సమాలిఖ్య శతృనామయధావిధి
ఆగ్నేయాస్త్రేణ సంవేష్ట్య కుండమధ్యే నిధాపయేత్ ।
జుహుయాన్మరిచైః క్రుద్ధో జ్వరాక్రాంతః సజాయతే
తదాదాయక్షిపేత్తోయే శీతలే సవ శోభవేత్ ।
పిష్ట్వాఽపామార్గ బీజాని మరీచం మధుసంయుతం
అత్యుష్ణే లవణేతోయే నిక్షిప్యక్వాథ యేత్తతః ।
ఋక్ష వృక్ష ప్రతికృతేర్ హృదయే వదనే నసి
కించిత్ కించిత్ క్షిపేత్తో యందర్ వ్యాకారస్కరోత్థయా ।
ఆగ్నేయముచ్చరన్ మంత్రీ సోఽచిరాత్ జ్వరితోభవేత్
క్వథితేఽంభసి తాంక్షిప్త్వా హన్యాచ్ఛత్రుమయత్నతః ।
తీక్ష్ణస్నేహేన సంలిప్తాం శతృప్రతి కృతిం నిశి
తాపయేదేధితే వహ్నౌ ప్రతిలోమ మనుంజపన్ ।
జ్వరేణ బాధితో సద్యో హోమాదస్యమృతిర్ భవేత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - తెల్లావాల తైలముతో మిరియములు మరగబెట్టి, తడిబట్ట కట్టుకొని, విష్టికరణమురోజున 7 రోజులు హోమం చేసిన, శతృవు అత్యంత జ్వరపీడితుడగును.

తాళపత్రముపై శతృనామము లిఖించి, కర్మ లిఖించి, ఆగ్నేయాస్త్ర మంత్రముతో దానిని సంవేష్టితముచేసి, కుండ మధ్యము నందుంచి, మిరియాలతో హోమం క్రోధంతో చేసిన శతృవు వ్యాధి పీడితుడగును. దానిని బయటకు తీసి చల్లని జలమునందుంచిన, శతృవు వశమగును.

అపామార్గ బీజములు చూర్ణముచేసి, దానియందు తగినన్ని తేనెతో కలసిన మిరియములు వేసి నూరి కలపాలి. పిమ్మట సముద్ర జలమును మరగబెట్టి అందు పైన చేసిన లేహ్యమును వేసి మళ్ళీ మరగబెట్టాలి. దానిని కారస్కర దర్వితో (గరిటె) కలియబెట్టి, శతృవృక్షముయొక్క కర్రతో చేసిన శతృప్రతిమ యొక్క హృదయ – ముఖ – నాసికలందు, మంత్రము చదువుచూ కొంచెం కొంచెం – ముఖ – నాసికలందు, మంత్రము చదువుచూ కొంచెం కొంచెం వేసిన, శత్రువు శీఘ్రముగా వ్యాధి పీడితు డగును. లేదా మరుగుతున్న ఆ కషాయమునందు, శతృప్రతిమను పడవేసిన శతృనాశనమగును.

ఆవతైలముతో తడిపిన శతృప్రతిమను, రాత్రియందు, జ్వలించుచున్న అగ్నియందు, ఆగ్నేయాస్త్రమంత్రము ప్రతిలోమముగా పఠించుచూ పడవేసిన వ్యాధిపీడితుడగును. ఆ ప్రతిమను హోమంచేసిన శతృవు –

శ్లో॥ సముద్రసలిలే హింగు విష జీరక లోలితే
క్వథితే పుత్తలిం సాధ్యనక్షత్ర తరు నిర్మితామ్ ।
అథోవక్త్ర్యాం వినిక్షిప్య యష్ట్యా విషతరూత్థయా
తచ్ఛిరస్తాడనం కుర్వన్ జపేదస్త్రం విలోమతః ।
సప్తాహాన్మరణం యాతి శత్రుర్ జ్వరవిమోహితః
ఆదిత్యరథ నాగేంద్రగ్రస్తాంఘ్రిం తద్విషాహతమ్ ।
నగ్నం తైలేన విప్తాంగం దగ్ధంభాను మరీచిభిః
అధోముఖం నిజరిపుం ధ్యాత్వా క్వథిత వారిణా ।
తర్పయేద్భాను మాలోక్య శత్రుర్మృత్యుప్రియోభవేత్
బిభ్రతీం ముశలం శూలం ధ్యాయన్ కాలఘనప్రభామ్ ।
కార్పాసబీజైర్ నింబస్య పత్రైర్మేషీఘృత ప్లుతైః

హుత్వా విద్వేషయేచ్ఛత్రూన్ అస్త్రేణాఽనేనదేశికః ।
బిభ్రాణాం తర్జనీం శూల ధ్యాత్వాదుర్గాం భయంకరీం
మహిషీ ఘృత సంసిక్తైః పల్లవై ర్విషవృక్షజైః ।
హుత్వా రిపోః క్షణాత్సేనాముచ్చాటయతి మంత్రవిత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సాధ్యనక్షత్రవృక్ష కలపతో, ప్రతిమచేసి, దానిని తలకిందులుగా ఉంచి పైన చెప్పిన కషాయమును దానిపై పోసి, విషవృక్ష దర్వితో, ఆ ప్రతిమపై (శిరసుపై) మంత్రపఠనము చేయుచూ తాడనముచేసిన శత్రువు రోగగ్రస్తుడై..........

ఇపుడు ధ్యానము ద్వారా ప్రయోగము చెప్పబడుచున్నది. సూర్య రథము కింద పడిన లేదా శత్రువు కాలికి సర్పముచుట్టుకొన్నట్లు, లేదా శత్రువు సర్ప విషముచే మరనించినట్లు, లేదా నగ్నముగా తైలలిప్తాంగుడైన శత్రువును, లేదా సూర్యకిరణములలో శత్రువు అధోముఖము తాపము చెందుచున్నట్లు ధ్యానించుచూ, సూర్యాభిముఖుడై, వేడినీరుతో దుర్గాదేవికి తర్పణమిచ్చిన శత్రువు..........

నల్లని మబ్బువంటి రంగుకలిగిన కాళి, ముశల – శూలములు ధరించినట్లు ధ్యానించి, పత్తిగింజలు – నిమ్మఆకులు, గేదె నెయ్యితో కలిపి, ఆగ్నేయాస్త్ర మంత్రముతో హోమంచేసిన, శత్రువు ఆపదలలో చిక్కుకొనును.

శూలము – తర్జనీముద్ర ధరించిన దుర్గను భయంకర రూపము ధరించినట్లు భావించుచూ, నేతియందు తడిపిన విషవృక్ష పత్రములతో హోమం చేసిన, శత్రూచ్చాటనమగును. శతృసేన (శతృవర్గము) ఉచ్చాటన పొందెదరు.

శ్లో॥ ధ్యాత్వాదేవీం పురాప్రోక్తాం చతుర్భిర్మరిచాన్వితైః
అజారుధిర సంసెక్తైర్జుహుయాద్దివసత్రయమ్ ।
రిపోరుచ్చాటనం కుర్యాత్ సేనాయా నాఽత్ర సంశయః

అగ్నిశూలకరాందుర్గాం జ్వలంతీం ప్రళయాగ్నివత్ ।
ధ్యాత్వా సర్షపతైలాక్తైర్ బీజైర్ ధత్తూర సంభవైః
హుత్వా విమోహయేచ్ఛత్రూన్ మరిచైర్వ్యాససర్షపైః ।
కాలాంజన నిభాందుర్గాం శూల ఖడ్గ ధరాం స్మరన్
నక్షత్రవృక్ష సంభూతైర్ వ్రణకృత్ స్నేహసంయుతైః ।
సమిద్వరైః ప్రజుహుయాద్ధన్యాన్మాసేన వైరిణం
సింహాధిరూఢాం ధావంతీం ధావమానం రిపుంప్రతి ।
శరాన్ కార్ముక నిర్ముక్తాన్ వహ్నిజ్వాలా ముఖాకులాన్
ముంచంతీం సంస్మరన్ దుర్గాం తర్పయేదుష్టవారిణా ।
భానుబింబం సమాలోక్య రిపోరుచ్చాటనం భవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ముందు చెప్పిన రూపములో దుర్గాదేవిని ధ్యానించుచూ, మేకరక్తముతో తడిపిన నాలుగేసి మిరియాలు, హవిస్సుతో సహా మూడు రోజులు హోమం చేసిన శత్రుసేన ఉచ్చాటన మగును.

చేతులందు అగ్ని – త్రిశూలము ధరించిన దుర్గను ధ్యానించుచూ, ఆవతైలముతో తడిపిన ఉమ్మెత్త బీజములను హోమం చేసిన, లేదా ఆవాలు, మిరియాలు హోమం చేసిన శత్రువు మూర్ఛితుడగును.

నల్లనిరూపముతో, చేతులందు ఖడ్గ – శూలములు ధరించిన, దుర్గను ధ్యానించుచూ, సాధ్యనక్షత్ర వృక్ష సమిధలు భల్లాత (జీడి) తైలముతో తడిపి, హోమం చేసిన, నెలరోజులలో శత్రుబాధ నివారణమగును.

పారిపోవుచున్న శత్రువును, సింహాధిరూఢ అయిన దుర్గాదేవి తరుముతూ బాణములు వేయుచున్నట్లు ధ్యానించుచూ, సూర్యాభిముఖముగా వేడినీరు తర్పణమిచ్చిన శత్రూచ్చాటనమగును.

# పంచ దుర్గలు

1. అతిదుర్గ 2. గణిదుర్గ 3. విశ్వదుర్గ 4. సింధుదుర్గ 5. అగ్ని దుర్గ : ఈ మంత్రములు వివరింపబడుచున్నవి.

**1. అతిదుర్గామంత్రము** - దుర్గాణి విశ్వానావేవ సిందు దురితాత్యగ్నిః జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః సనః పర్షదతి ।

**2. గణిదుర్గ** - గాణి విశ్వానావేన సింధుం దురితాత్యగ్నిః, జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతివేదః సనః పర్షదతి దుర్ ।

**3. విశ్వదుర్గ** - విశ్వానావేవ సిందుం దురితాత్యగ్నిః, జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః సనః పర్షదతి దుర్గాణి.

**4. సింధుదుర్గ** - సింధు దురితాత్యగ్నిః, జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతివేదః సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ ।

**5. అగ్నిదుర్గ** - అగ్నిః, జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతివేదః సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సిందుం దురితాత్ ।

# పంచదుర్గా ప్రయోగములు

శ్లో॥ అతిదుర్గా మయోముష్టి గదాహస్తాం విచింతయేత్
విద్యుద్దామ సమానాభాం మహిషీఘ్నృత సంప్లుతైః ।

పులాకైర్బుహుయాన్నింబ  బిభీతకసమిద్వరైః
కోద్రవైరథ శత్రోశ్చ సేనాయాః స్తంభనం భవేత్ ।
ఆత్తపాశాంకుశాం రక్తాం **గణిదుర్గా** మనుస్మరేత్
లోణైః సుమధురైః సాధ్య వృక్షకాష్ఠైధితేఽనలే ।
జుహుయాన్నిశి సప్తాహాన్నిశి మంత్రవిద్వశయేన్ నృపాన్
పాశాంకుశ ధరాం రక్తాం **విశ్వదుర్గాం** విచంతయేత్ ।
ఫలినీ కుసుమైః ఫుల్లైశ్చందనాంభః సముక్షితైః
జుహుయాన్నిశియోమంత్రీ తస్యవిశ్వం వశం భవేత్ ।
శరచ్చంద్రనిభాందేవీం విగళత్ పరమామృతాం
పాశాంకుశ ధరాంధ్యాయన్ **సింధుదుర్గాం** సమిద్వరైః ।
వేతసైర్మధురాసిక్తైర్జుహుయాత్ వృష్టి సిద్ధయే
కపాలంత్రిశిఖం పాశమంకుశం బిభ్రతీం కరైః ।
జపాకుసుమ సంకాశా **మగ్నిదుర్గాం** విచింతయన్
హుత్వాలవణ పుత్తల్యా మధురత్రయయుక్తయా ।
ఆకర్షేద్వాంఛితాన్ సాధ్యాన్మంత్ర విన్నాఽత్ర సంశయః
అతిదుర్గేయ మత్యాద్యా షదంతాత్రిష్టుబీరితా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - వజ్రసమానమైన పిడికిలితో, మరొక చేతిలో గదను ధరించిన **అతిదుర్గను** ధ్యానించుచూ, ఆ మంత్రముతో గేదె నెయ్యితో తడిపిన తుచ్ఛధాన్యము, నిమ్మ - జీడి సమిధలతో హోమం చేసిన, లేదా గేదె నెయ్యితో తడిపిన కోద్రవ (     )ములను హోమంచేసిన, శతృస్తంభనమగును.

పాశాంకుశములు చేతిలో ధరించి, రక్తవర్ణరూపిణి అయిన **గణిదుర్గను** స్మరించుచూ, ఆ మంత్రముతో, మధురత్రయ మిశ్రిత లవణము

+ శత్రునక్షత్ర వృక్షసమిధలతో రాత్రియందు హోమం చేసిన, ఏడు రోజులలో వశీకరణము సిద్ధించును.

పాశాంకుశములు ధరించి, రక్తవర్ణ రూపిణి అయిన **విశ్వదుర్గను** ధ్యానించుచూ, ఆ మంత్రముతో - చందన గంధజలముతో కడిగిన ప్రియంగు పుష్పములను రాత్రియందు, హోమంచేసిన జగద్ వశ్యము సిద్ధించును.

శరత్ కాల పూర్ణిమతో సమానమైన, అమృత రసస్రావము చేయుచూ, పాశాంకుశములు ధరించిన **సింధుదుర్గను**, ధ్యానించుచూ త్రిమధురము లతో తడిపిన, ప్రబ్బలి సమిధలతో, హోమమాచరించిన, వర్షము కురియును.

చేతులందు - కపాల, త్రిశూల, పాశాంకుశములు ధరించిన, ఎర్రని శరీరము కలిగిన **అగ్నిదుర్గను** ధ్యానించుచూ - మధురత్రయమిశ్రిత లవణముతో చేసిన - ప్రతిమను అగ్నిదుర్గామంత్రముతో హోమంచేసిన, సాధ్యవ్యక్తి అనుకూలుడగును.

శ్లో॥ అంగణే స్థండిలంకృత్వా సుగంధి కుసుమాదిభిః
దేవీ మభ్యర్చ్యయేన్నిత్యం ప్రాగుక్తేనైవ వర్త్మనా ।
ఆహరేద్రాత్రిషు బలిం చరుణా సర్వసిద్ధిదం
కృత్యారోగ భయద్రోహ భూతాదీన్నాత్ర సంశయః ।
యధావదగ్ని మారాధ్య గంధైః పుష్పైర్మనోరమైః
స్థిత్వా తస్యాఽగ్రతో మంత్రీ జపేన్మంత్ర మనన్యధీః ।
జపోఽయం సర్వసిద్ధ్యై స్యాన్నాఽత్ర కార్యావిచారణా
లవణైర్మధురాసిక్తైర్ జుహుయాత్ పశ్చిమాముఖః ।
మంత్రార్ణ సంఖ్యయామంత్రీ రిపుమాత్మవశం నయేత్

శాలీన్ ప్రక్షాళ్య సంశోష్య శుద్ధాన్ కుర్వీత తండులాన్ ।
జపిత్వా పంచగవ్యేషు సంస్కృతే హవ్యవాహనే
చరుంపచేజ్జపన్మంత్ర మవతార్య పునః సుధీః ।
అర్చయిత్వా విశదధీర్దేవీమగ్నౌ యథా పురా
జుహుయా చ్చరుణానేన సాజ్యేనాஉష్ట సహస్రకమ్ ।
పాత్రేసంపాతనం కర్వన్ సాధ్యంతత్ ప్రాశయేత్ సుధీః
శేషంతంనిఖనేద్ వారి సంపాతం ప్రాంగణాంతరే ।
కృత్యారోగా వినశ్యంతి సహ భూతగ్రహా మయైః
పరైరుత్పాదితా కృత్యా పునస్తానేవ భక్షయేత్ ।
వ్రీహిభిర్ హవిషా క్షీరైః పయోవృక్ష సమిద్వరైః
ఆజ్యైర్మధుత్రయోపేతైర్ దశశతం పృథక్ ।
జుహుయాత్ సంపదాంభూమిః సాధకో భవతి ధృవమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ప్రాంగణమునందు, ఒక చతురస్ర స్థండిలము (వేదిక) నిర్మించి, పుష్పాదులతో నిత్యార్చన చేసి, రాత్రియందు చరుద్రవ్యముతో, బలిసమర్పణ చేయాలి. కృత్యా - రోగ - గ్రహ - భయ - ద్రోహ - భూత బాధలు తొలగును.

సుగంధ పుష్పములతో అగ్నిని అర్చించి, మంత్రం జపించాలి. త్రిమధురమిశ్రిత లవణముతో, పశ్చిమాభిముఖముగా, మంత్రవర్ణ సంఖ్యాను సారము జపించుటవలన, సర్వులూ అనుకూలురగుదురు. బియ్యము శుభ్రముగా కడిగి, నీడలో ఎండించి ధూపముతో శుద్ధిచేసి, చరుద్రవ్యముతో అగ్నియందు హోమం ఆచరించాలి.

దుర్గాదేవిని పూజించి, అగ్నియందు, నేతితో చరుద్రవ్యమును మూల మంత్రముతో 8వేలు హోమము చేయుచూ, హుతశేషమును, మరొక

పాత్రలో చిలికించుతూ, దానిని – హోమానంతరం సాధ్యవ్యక్తికి సేవింప చేసిన, మరికొంత మిగిలిన దానిని, నీటిలో కలిపి మరొకచోట భూమిలో పాటిపెట్టిన సమస్త భూత – గ్రహబాధలు తొలగిపోవును.

ఇట్లు ఆచరించిన, శత్రువులు చేసి ప్రయోగములు, తిరిగి వారికే వెనుకకు వెళ్లి వారినే బాధించును. ధాన్యము, పాలు, క్షీరవృక్ష సమిధలు, మధురత్రయము కలిపి ఒక్కొక్కటి వెయ్యేసి సార్లు హోమం చేసిన, సంపదలు కలుగును.

## సికతా ప్రయోగము

శ్లో॥ బాస్కరే మేషరాశిస్థే మంత్రజ్ఞోఽనుగుణేదినే
నద్యాంసాగర గామిన్యాం సతతం పుష్కలాంభసి ।
ఉద్ధృత్యాదాయ సికతాః సంశోష్య పరిశోధయేత్
న్యస్యతాః పంచగవ్యేషు సంస్కృతే హవ్యవాహనే ।
భర్జయేన్మనునా సిద్ధ్యై దర్వ్యా బ్రహ్మరుహోత్థయా
సింహమేష ధనుస్థేర్కే కృష్ణపక్షేఽష్టమీ తిథౌ ।
విశాఖా కృత్తికా మూల హస్తోత్తర మఘాస్వథ
రోహిణ్యాం శ్రవణే వారౌ మంద వాక్పతి దేవతౌ ।
విహాయాఽన్యేషు కుర్వీత సికతాస్థాపనం సుధీః
గృహగ్రామాదిరాష్ట్రాణాం రక్షార్థంసికతాః శుభాః ।
ప్రస్థాధక ఘటోన్మానా మధ్యాదిష్వ వటేష్విమాః
నవసుప్రక్షిపేజ్జప్తాస్తేషు సంపూజయేత్ క్రమాత్ ।
మధ్యాదిదేవీ శాస్త్రాణి కపాలాంతానిదేశికః

**చక్రం శంఖమసింఖేటం బాణం చాపం త్రిశూలకమ్ ।**
**కపాలం స్వస్వమంత్రేణ సంపూజ్యాంఽతే బలింహరేత్ ॥**

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మేషరాశియందు సూర్యుడు సంచరించునపుడు (ఏప్రియల్ 14 నుండి మే 15 వరకు, సుమారుగా) శుభ ముహూర్తమున సాగరమునందు కలియు నదీ ప్రాంతమునుండి, కొంత ఇసుకను తీసుకు రావలయును. దానిని శుభ్రముచేసి ఎండించ వలయును. దానిని పంచగవ్యమునందు కలిపి, మంత్రపూర్వకముగా, సుసంస్కృత అగ్నియందు ఒక పాత్రలో పోసి, వేడి చేయుచూ, మోదుగ గరిటెతో బాగా కలియబెట్టి, అభిమంత్రించవలయును.

మరల, మేష - సింహ - ధనురావులందు సూర్యుడు సంచరించు నపుడు, బహుళాష్టమినాడు - విశాఖ, కృత్తిక - మూల - హస్త - 3 ఉత్తరా నక్షత్రములు - మఖ - రోహిణి - శ్రవణము నక్షత్రములలో ఏదో ఒకటి, కలసిననాడు, గురు - శనివారములు విడిచిపెట్టి మిగిలిన వారమునందు, ఆ శుభ్రపరచిన మంత్రపు ఇసుకను స్థాపించాలి. ఇట్టి ప్రక్రియ చేసిన గృహము - గ్రామము - రాష్ట్రము, రక్షాకరముగా నుండి, సర్వశుభములతో దినదినాభివృద్ధి చెందును. వాటి పరిమాణము చెప్పబడు చున్నది.

గృహమునందు స్థాపించవలెనన్న ఒక ప్రస్థ పరిమాణము ఇసుక ఉండవలయును. గ్రామ - నగరములందు స్థాపించవలెనన్న, ఆఢక ప్రమాణము ఇసుక ఉండవలయును. రాష్ట్రము కొరకైనచో పెద్ద ఘటప్రమాణములో ఉండవలెను.

మధ్యయందు ఒకటి - నాలుగు దిశలందు నాలుగు - నాలుగు కోణములందు మరో నాలుగు - మొత్తం 9 గోతులు త్రవ్వి పైన పేర్కొన్న

ప్రమాణములో స్థాపించవలయును. మధ్యలో 8 అస్త్రములను పూజించి, చుట్టూ 8 దిశలందు ఒక్కొక్క అస్త్రమును (చక్ర - శంఖ - అసి - ఖేట - బాణ - చాప - త్రిశూల - కపాలములు) పూజించి, చివరగా బలి ప్రదానము చేయువలయును. శస్త్రమంత్ర పూజావిధానము 17వ పటలములో కలదు.

శ్లో॥ నక్షత్ర గ్రహరాశీనాం లోకేశానాంబలింహరేత్
విహితాయత్ర రక్షేయం వర్ధంతే తత్ర సంపదః ।
క్షుద్రగ్రహమహారోగ సౌరభూత సరీసృపాః
అమునావిలయం యాంతి విధినానాఽత్ర సంశయః ।
సికతానాం విశుద్ధానాం వికారకుడవంసుధీః
పంచగవ్యయుతే పాత్రే బ్రహ్మ వృక్షేణ నిర్మితే ।
నిక్షిప్య విధినాయత్ర స్థాపయేత్తత్ర సంపదః
దినే దినే ప్రవర్ధంతే కాలవృద్ధ్యాందిభిస్సహ ।
మహోత్పాతాః వినశ్యంతి కృత్యాద్రోహ మహాగ్రహాః
చరుగవ్యా శ్మనాంకుర్యాత్ స్థాపనం విధి నాఽమునా ।
గోమూత్రం ప్రస్థమానం స్యాత్ గోమయాంభస్తదర్ధకం
ఆజ్యాత్ సప్తగుణం క్షీరం గోమూత్రాత్ త్రిగుణం దధి ।
గోమూత్రేణ సమంసర్పిః సర్వం వా సమముచ్యతే
గావః స్యుః కపిలాశ్వేత హిమధూమ్రా రుణప్రభాః ।
అభావేగదితాః సర్వాః సర్వధా కపిలోద్భవం
ఏకోనపంచాశత్ కోష్ఠే ఫలకే బ్రహ్మశాఖినః ।
విహాయకోణ కోష్ఠాని శక్త్యాద్యంజాత వేదసమ్
లిఖిత్వా మధ్యకోష్ఠాది పూజయేత్తత్రదేవతామ్ ।

కృత్వా హోమం ససంపాతం నిఖనేత్తద్యథా పురా
దద్యాంత్ బలిం యథా పూర్వమస్యపూర్వోదితం ఫలమ్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శస్త్రపూజానంతరం, నక్షత్రము, నక్షత్రదేవత, గ్రహములు, రాశులు, రాశ్యాధిపతులు, లోకపాలురకు బలిప్రదానము చేయాలి. ఇట్లు చేయుటవలన సమస్త ఉపద్రవములు తొలగి, సకల శుభములు, శ్రేయస్సు కలుగును.

సముద్రగామిని అయిన నదీతీరమునుండి, 16 కుండలముల ఇసుక తెచ్చి, మోదుగ కర్రతో చేసిన ప్రస్థ పరిమాణ పాత్రతో పంచగవ్యము సేకరించి, అందు ఇసుకనుంచి పూర్వోక్త విధానములో పాతిపెట్టవలయును.

నగరమునకు ఇట్టి విధానము ప్రయోగించిటు వలన, ఆ నగరమునకు, ప్రకృతి వైపరిత్యములు, వరదలు - కరవు - ఉల్కాపాతములు - పిడుగుపాటు - భూకంపములు మొదలగు ప్రమాదములు కలుగవు. భూతబాధలు కూడా బాధించవు.

## పంచగవ్య పరిమాణవిధి

ఒక ప్రస్థ మాత్రము గోమూత్రము - ఇందులో సగభాగముతో ఆవుపేడ - గోమూత్రము సమముగా ఉండవలెను. ఇందులో సగభాగము ఆవునేయి - దీనిని ఏడురెట్లు ఆవుపాలు - గోమూత్రమునకు మూడు రెట్లు పెరుగు ఉండవలయును.

గోమూత్రముతో సమానముగా ఆవునేయి ఉండవలయును. లేదా అన్నీ సమానముగా కూడా సేకరించవచ్చును. వీటిలో 1. కపిలగోవు యొక్క మూత్రము 2. తెల్లని ఆవుయొక్క పేడ, పాలు 3. బూడిదరంగు గోవు యొక్క పాలతో చేసిన పెరుగు 4. ఎర్రనిగోవుయొక్క నెయ్యి ఉండాలి. ఒకవేళ ఇన్ని రంగుల గోవులు లభించనియెడల, అన్నీ ఒక్క కపిలగోవువే అయి వుండవలయును.

మరొక ప్రయోగము - నిలువు గళ్ళు - 7 అడ్డగళ్ళతో 49 గడులు గల కోష్ఠము లిఖించి, అందు నాలుగు కోణములు విడిచి, మిగిలిన 45 గడులలో మధ్య గడియందు హ్రీంలిఖించి, తూర్పుగడినుండి "జాతవేదసే" అను మంత్రములోని 44 అక్షరములూ వ్రాయలి. మరల మధ్య గడినుండి ఇదే పటలములో చెప్పిన జాగ్రత - తపనీ మొదలగు 44 దేవతలను పూజించాలి. పిమ్మట హోమము చేసి, హుత శేష సంపాతమును వెనుకటి వలెనే పాతిపెట్టవలయును. పిమ్మట బలిప్రదానము చేసిన సకల శుభములూ కలుగును. భూత - గ్రహ - కృత్యా దోషములు తొలగును.

## ఏకోన పంచాశత్ యంత్రము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ☒ | హా | తి | జా | త్య | వే | ☒ |
| ద | నా | వే | వే | నః | స | ద |
| ని | శ్వా | గ్నిః | న | సిం | నః | సే |
| తో | వి | త్యం | హ్రీం | ధుం | ప | సు |
| య | ణి | తా | రి | దు | రు | న |
| తీ | ర్గా | దు | తి | ద | ష | వా |
| ☒ | రా | మ | మ | సో | మ | ☒ |

## ఆగ్నేయాస్త్ర యంత్రము

శ్లో॥ మధ్యే మాయా మష్ట కోష్ఠేషు పాదా -
నష్టౌ కృత్వా మాతృకార్ణైః ప్రవీతమ్ ।
భూబింబస్థం సర్వభూతామయఘ్నం
రక్షయుః శ్రీ కీర్తిదం యంత్రమేతత్ ॥

ఆగ్నేయాస్త్రస్య జ్ఞానాని విసర్గా దాన కర్మణి
యః పుమాన్ గురుణా శిష్టస్తస్యాఽధీనం జగత్త్రయమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – తొమ్మిది గదుల యంత్రము లిఖించి, మధ్యలో హ్రీం బీజము వ్రాయవలయును. మిగిలిన 8 గదులందు అగ్ని మంత్రముయొక్క 8 పదములు వ్రాయవలయును. దానిపై మాతృకాక్షరములు లిఖించి, వేష్టితం చేయాలి. దానికి చతురస్ర భూపురం నిర్మించాలి. ఇదియే ఆగ్నేయాస్త్ర యంత్రమనబడును.

ఇది సమస్త రోగములను హరించును. రక్ష – ఆయువు – సంపద – కీర్తి ప్రతిష్టలను కలుగజేయును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలకతంత్రే*
*ఏకవింశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ ద్వావింశః పటలః

## అథ దినాస్త్ర – కృత్యాస్త్ర ప్రకరణమ్

శ్లో॥ అథో దినాస్త్రం కృత్యాస్త్రం వక్ష్యేశత్రువిమర్దనం
అతిదుర్గామనుం ప్రాహుర్దినాస్త్రం మంత్రవిత్తమాః ।
ప్రతిలోమ మిమం మంత్రం కృత్యాస్త్రం పరిచక్ష్యతే
దినాస్త్రస్య షడంగాదీన్ ప్రతిలోమోదితాన్ విదుః ।
భానుబింబగతం శత్రు మేథోవక్త్రం విషాహతం
మూలాదుత్థిత యాగ్రస్తం కుండల్యా భావయేత్ సుధీః ।
మూలాధారే క్షిపేత్సద్యః ప్రస్ఫురత్ కాలపావకే
దినత్రయాత్ జ్వరాక్రాంతో రిపుః ప్రాణాన్ విముంచతి ।

దినాస్త్రేణ ప్రవిద్ధాంగం స్వాధిష్ఠానగతం రిపుం
పంచవాయు సమిద్ధేన వహ్ని నా దగ్ధ విగ్రహమ్ ।
ధ్యాయన్మనుంజపేత్సద్యః సభవేద్యమ వల్లభః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు శత్రునాశము చేయు 2 అస్త్రములను చెప్పుచున్నాడు. 1. దినాస్త్రము 2. కృత్యాస్త్రము. అతిదుర్గా మంత్రమునే మంత్రవేత్తలు దినాస్త్ర మంత్రమందురు. దీనిని ప్రతిలోమముగా జపించిన కృత్యాస్త్ర మంత్రమగును.

దినాస్త్రమంత్రమునకు షడంగన్యాస – అక్షరన్యాస – పదన్యాసములు, ఆగ్నేయాస్త్ర విధానములో చెప్పినట్లుగా, ప్రతిలోమ పద్ధతిలోనే చేయవలయును.

సాధకుడు, సూర్యరథ చక్రముకింద పడిన శత్రువుపై – రథమందలి సర్పవిషముచే గ్రస్తుడై అధోముఖుడైన శత్రువు మూలాధారమునుండి లేచిన కుండలిని ద్వారా జాజ్వాల్యమాన కాలాగ్నిరూప మూలాధారమును ప్రక్షిప్తముచేసి ధ్యానించి, దినాస్త్రమంత్రము జపించినచో, శత్రువు మూడు రోజులలో జ్వరగ్రస్తుడగును.

దినాస్త్రమంత్రముచే కొట్టబడిన శత్రువును, స్వాధిష్ఠానమును చేరి పంచ వాయు ప్రదీప్త అగ్నిచే దహించబడుచున్నట్లు, భావించి, దినాస్త్ర మంత్రము జపించిన బాధ ఉండదు.

శ్లో॥ మణిపూరగతం శత్రుం అగ్నినా దీప్త విగ్రహం
ధ్యాయన్ దినాస్త్రం ప్రజపేత్ సమృత్యువవతాం వ్రజేత్ ।
అనాహతాహితః శత్రుర్నిర్దగ్ధో మంత్రవహ్నినా
పాశేనబధ్వా శీఘ్రేణ నీయతే యమ కింకరైః ।
విశుద్ధ బధ్వా శీఘ్రేణ నీయతే యమ కింకరైః ।

విశుద్ధ స్థానగోవైరీ దినబాణేన పీడితః
అధోముఖః స్మృత స్తూర్ణం ఇరాయుః స్యాద్దినత్రయాత్ ।
ఆజ్ఞాయాం నిహితం శత్రుం దహేత్ జ్ఞానాగ్నినాధియా
పుత్రమిత్ర కళత్రాదీన్ హిత్వామృత్యు ముపాశ్రియేత్ ।
నాభి మాత్రో దకే స్థిత్వా ధ్యాయన్ బింబే దినేశితుః
వైరిణం దగ్ధ సర్వాంగం మంత్రమష్టోత్తరం శతమ్ ।
జపేద్ సప్త దినాదర్వాగ్యమలోకం సగచ్ఛతి
వ్యారవారం సమారభ్య సప్తాహం ప్రజపేన్మనుం ।
సూర్యోదయం సమారభ్య యావదస్తమయోభవేత్
సన్నిపాత జ్వరావిష్టో యనుగ్రస్తో భవేదరిః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మణిపుర చక్రమందు శత్రువును అగ్నిజ్వాలలు దహించుచున్నట్లు ధ్యానించుచూ, దినాస్త్ర మంత్రము జపించిన శత్రుబాధ నివారణమగును. అదేవిధముగా అనాహత చక్రమందును భావించవలెను. విశుద్ధ చక్రమందు శత్రువు దినాస్త్ర పీడితుడై అధోముఖుడై యున్నట్లు భావించి, మంత్రజపం చేసిన మూడు రోజులలో శత్రుబాధ ఉండదు.

ఆజ్ఞాచక్రమందు శత్రువు జ్ఞానాగ్ని దగ్ధుడైనట్లు భావించి మంత్రజపం చేసిన నశించును. బొడ్డులోతు నీళ్ళలో నిలబడి, సూర్యుని బింబములో శత్రువు జ్వలించుచున్నట్లు భావించి, **108** సార్లు జపించిన **7** రోజులలో శత్రువు నశించును.

మంగళవారము సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు రోజూ, ఒక వారంరోజులపాటు జపంచేసిన, శత్రువు సన్నిపాత జ్వరగ్రస్తు డగును. దుర్గామందిరమందు మూడురోజులు నిరాహారుడై, శత్రువు

దినాస్త్రముచే కొట్టబడినట్లు భావించి, మంత్రజపం చేసిన శత్రు బాధా నివారణమగును.

దుర్గామూర్తిని స్పృశించుచూ 3 రోజుల పర్యంతము నిరాహారుడై, శూలారోహణ పీడితుడైన శతృవునును భావించి, జపించిన శతృవు రోగ గ్రస్తుడగును. రాహుగ్రస్త సూర్యబింబములో, దినాస్త్ర మంత్రబాణములచే శతృవు బంధితుడైనట్లు భావించి, 10వేలు జపించిన శతృబాధ నివారణ మగును.

## దుర్గా ధ్యానము

శ్లో॥ ప్రళయానలసంకాశాం కాళరాత్రిమివాఽపరాం
శూలపాశధరాం ఘోరాం సింహస్కంధ నిషేదుషీమ్ ।
సవితుర్మండలాంతస్థాం రక్తనేత్రత్రయోద్గతైః
విస్ఫులింగైర్నిర్దహంతీం రిపుమాకుల విగ్రహమ్ ।
స్పష్టదంష్ట్రాధరాం నృత్యద్ భృకుటీ భీషణాననామ్
తర్జయంతీం నిజంశత్రుం తర్జన్యాభీమరూపయా ।
దంష్ట్రామయూఖ జాలేన ద్యోతయంతీం దిగంతరం
శూలేన వైరిణో వక్షే దారయంతీం భయంకరీమ్ ।
అస్త్రమంత్ర కృతన్యాసః ప్రళయాగ్ని సమప్రభాం
రక్త వస్త్ర ధరాంక్రుద్ధాం రక్తనేత్రత్రయాన్వితామ్ ।
సింహాధిరూఢాం ధావంతీం ధావమానం రిపుంప్రతి
ఖడ్గేన తచ్ఛిరఃఛిత్వా క్షణాద్ హ్యామస్థలీంగతామ్ ।

ఈ విధముగా దుర్గాదేవిని ధ్యానించి, మూడురోజులు నిరాహారుడై, దినాస్త్ర మంత్రమును జపించిన, శతృవు నాశనమగును.

శ్లో॥ కర్మాణ్యేతాని కుర్వీత దివసే నతు రాత్రిషు
పశ్చిమాముఖ లింగస్య సజీవం మహిషంపురః ।
నిధాయ తస్య శిరసి కుండంకృత్వాత్రికోణకం
తస్మిన్ సమేథితే వహ్నాయధావద్దే శికోత్తమః ।
సత్రికోణాన్ సమంత్రార్ణాన్ సాధ్యనామ సమన్వితాన్
అజారక్తేన సంసిక్తాన్ కారస్కరసమిద్వరాన్ ।
సహస్రం జుహుయాద్దేవీం ధ్యాత్వా సవితృమండలే

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పైన చెప్పిన మారణ ప్రయోగములు పగటియందే, చేయవలయును. రాత్రియందు కాదు. పశ్చిమాభిముఖ శివాలయమునందు, ఒక గేదె మందిరమునకు ఎదురుగా ఉన్నచోట, ఒక త్రికోణకుండము నిర్మించాలి. అందు మేకరక్తముతో తడిసిన కారస్కర (            ) సమిధలు, సాధ్యనామ సహితముగా త్రికోణము మంత్రాక్షరములు, పత్రములపై వ్రాసి, దుర్గను ఈ క్రింద రూపములో ధ్యానించి హోమం చేయవలయును. అట్లు చేసిన శత్రువు సకుటుంబముగా నశించును.

☞ **ప్రళయాగ్ని సమాంఘోరాం ద్వాత్రింశద్ భుజశోభితాం**
**ఉద్యదాయుధ సందీప్తాం నృత్యంతీం సింహమస్తకే।**
**మహాదంష్ట్రాం మహాభీమాం జ్వలత్ కేశీం నదన్ముఖీం**
**రక్తార్ద్రమాంసవదనాం ఘూర్ణితోగ్రత్రిలోచనామ్ ।**

మరియు, సూర్యబింబమునందు సహస్ర సూర్య తేజస్సుతో వెలుగొందు, సహస్రకర - చరణ - అక్షి - శిరో - ముఖి అయిన దుర్గను ధ్యానించుచూ, వేడినీటిపాత్రపై వేలాడుచున్న నల్లని సర్పముయొక్క నోటిలో వేడి నీటితో కారస్కర దర్వితో తర్పణచేసిన శత్రుబాధ నివర్తించును.

(ఇచట సంస్కృత వ్యాఖ్యానములో, జీవించియున్న సర్పమును తలకిందులుగా వేలాడదీసి, దానిని బంధించి - దాని నోటిలో తర్పణము చేయవలెనని స్పష్టముగా పేర్కొనబడినది)

శ్లో॥ ఋక్ష వృక్ష ప్రతికృతిం ప్రతిష్ఠిత సమీరణాం
ఉష్ణోదకే వినిక్షిప్య విషాఢ్యేవిధి నాత తః ।
ఖడ్గకృత్తి హితాంధ్యాయన్ ప్రజపేదయుతం మనుం
విధానేనాఽమునా శత్రుర్గ్రస్తో భవతి మృత్యునా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శతృనక్షత్ర వృక్ష కలపతో ప్రతిమచేసి, అందు ప్రాణప్రతిష్ఠచేసి, విషమిశ్రిత వేడినీరు యందు ఆ ప్రతిమను ముంచుతూ మంత్రజపం చేసిన శతృపీడ నివారణమగును. ఆ సమయమున దుర్గను ఇలా ధ్యానించవలయును.

☞ **అర్కేంద్వనల సంకాశాం ఖడ్గఖేటక ధారిణీం**
**నయనత్రయ నిర్గచ్ఛద్ విస్ఫులింగ శతాకులాం।**
**సింహస్థాం సర్వభూషాఢ్యాం త్రైలోక్య భయదాయినీం**
**ఖడ్గకృత్తాహితాం ధ్యాయన్ ప్రజపేదయుతం మనుమ్।**

## పుత్తలీ ప్రయోగం

శ్లో॥ ప్రకల్ప్య దుర్గాయతనే త్రికోణం కుండయుత్తమం
తత్ర సంజ్వలితే వహ్నౌ మహిషీశ కృతా కృతీమ్ ।
పుత్తలీమజరక్తాక్తాం ప్రతిష్ఠిత సమీరణాం
ఛిత్వా ఛిత్వా ప్రజుహుయా దజారక్తాన్వితాం నిశి ।
ధ్యాత్వాదుర్గాం ప్రనృత్యంతీం మహిషోరః స్థలాంతరే
శూలేన మహిషస్యాంఽగం భిందంతీం ఘోర దర్శనామ్ ।

అట్టహాసైరజస్రోత్థైర్ భీషితాసురసైనికాన్
ప్రళయానల సంకాశాం భ్రమన్నేత్రత్రయాన్వితామ్ ।
సందష్టాధరసంభిన్నాం దంష్ట్రాభీమ ముఖాంబుజామ్
ఖడ్గఖేటకయుక్తాభిః కన్యకాభిః సమావృతాం ।
అనేనవిధినా శత్రుః ప్రయాతి యమ సన్నిధిమ్
దినాస్త్ర మేవం కథితం శత్రునిగ్రహకారకమ్ ।
కృత్యాస్త్రదేశితాన్ కుర్మాత్ ప్రయోగాన్ మంత్రవిత్తమః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – పుత్తలీ (బొమ్మ) ప్రయోగము చెప్పబడుచున్నది. శత్రునక్షత్ర వృక్షకలపతో ప్రతిమను చేసి, దానియందు శత్రునామముతో సగోత్రముగా ప్రాణప్రతిష్ఠ చేయవలయును. పిమ్మట విషమిశ్రిత జలమునందు సమంత్రకముగా ముంచవలయును.

తరువాత సింహారూఢ అయి, భయంకరరూపముతో శత్రువును ఖడ్గముతో సంహరించు దుర్గాదేవిని భావించుచూ, మంత్రమును పదివేలు జపించిన శత్రునాశనమగును.

దుర్గామందిరమునందు త్రికోణకుండమును నిర్మించి, సుసంస్కృతం అగ్నియందు, పూర్వోక్తకృత ప్రతిమను, మేక రక్తముతో తడిపి, రాత్రివేళ ముక్క ముక్కలుగా నరికి, సమంత్రకముగా హోమం చేయవలయును. ఆ సమయమున మహిషాసురుని త్రిశూలముతో సంహరించుచూ ప్రళయకాల భయంకర రూపములో నున్న దుర్గాదేవిని ఖడ్గ – ఖేటకములు ధరించిన కన్యలతో పరివేష్టించిన దుర్గను ధ్యానించుచూ సమంత్రకముగా హోమం చేయవలయును.

# కృత్యాస్త్ర మంత్రప్రయోగము

శ్లో॥ ఆధారాదుద్గతాందేవీం కుండలీం సర్పరూపిణీం
తాంబ్రహ్మరంధ్రమార్గేణ యాతాంవ్యోమస్థలీం తతః ।
ముఖేన శత్రుమాదాయ నివృతాం స్వగృహం ప్రతి
జ్వలత్ కాలానలోద్దీప్తాం విచింత్య ప్రజపేన్మనుమ్ ।
సప్తభిర్వాసరైః శత్రుర్ మృత్యుంప్రాప్నోతి మోహితః
అంగారవారే చిత్యగ్నౌ సర్షపస్నేహలోలితమ్ ।
సిద్ధార్థకుడవంజప్తం జుహుయాత్పక్ష మాత్రతః
కృత్యాస్త్ర జ్వాలయాదగ్ధో రిపుర్యమపురం వ్రజేత్ ।
చతుర్దశ్యామర్థ రాత్రే చితాస్థీన్యస్త్ర సాధకః
వ్రణతైల విలిప్తాని చితాగ్నౌ జుహుయాత్తతః ।
అనేన విధినా శత్రుర్ మృత్యుమేష్యతి జుహుయాత్తతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మూలాధారమునుండి సర్పరూపిణి అయిన కుండలినీ శక్తిపై బ్రహ్మరంధ్రమునకు గమనము చేయుచూ, ఆకాశములోనికి ప్రవేశించి, అటునుండి శత్రుముఖమున ప్రవేశించి, తిరిగి తన మూలాధారము చేరి కాలాగ్నిరూపముగా జ్వలించు చున్నట్లు ధ్యానించి, కృత్యాస్త్ర మంత్రమును జపించిన, శత్రువు మూర్ఛితుడై వారం రోజులలో శత్రుబాధ నివారణమగును.

మంగళవారమునాడు హోమకుండమేర్పరచి, చితాగ్నితో సంస్కరించి, ఆవనూనెతో తడిపిన మూకుడు తెల్లావాలు అభిమంత్రించి, 15 రోజులు హోమం చేసిన, శత్రువు కృత్యాస్త్ర జ్వాలలకు గురియగును.

కృత్యాస్త్ర సిద్ధిని పొందిన సాధకుడు, బహుళ చతుర్దశి (మాసశివరాత్రి)నాడు, రాత్రి చితిలోని అస్థులను గ్రహించి, జీడితైలముతో

తడిపి, చితాగ్నియందు, సమంత్రకముగా హోమమాచరించిన, శత్రువు దీనావస్థ పొందును.

శ్లో॥ తుషాస్థి నిర్మితాం శత్రోర్ వ్రణతైల పరిప్లుతాం
ప్రతిమాం స్థాపిత ప్రాణాం జుహుయాన్నిశి సాధకః ।
ఛిత్వాఛిత్వాజరక్తేన సప్తాహాన్ మ్రియతేరిపుః
శ్మశానవాలు కాః స్పృష్ట్వా సాక్షతా నియుతం జపేత్ ।
వికిరేత్తాస్తదాగాదౌ కృత్యాస్త్ర క్వథితం జలం
తదీయం పీతమచిరాన్నిహంతి సకలాన్ జనాన్ ।
కృష్ణాంగార చతుర్దశ్యాం ప్రజప్తైః ప్రేతభస్మభిః
మాహిషాజ్యేన లులితాః తన్మంత్రాక్షర సంఖ్యయా ।
నిర్మాయగుటికా ఏతాః సమ్యగ్ జప్తసమీరణాః
చితికాష్ఠైధితే వహ్నౌ జుహుయాద్ దృఢ మానసః ।
చతుర్దశీ త్రయాదర్వాక్ శతృర్మృత్యు వశోభవేత్

ఇదేగాక, మహిష పంచగవ్య ప్రయోగము, కుళికాయోగ ప్రయోగము, షడ్బిందు కీటక ప్రయోగము, కపాలఖంగ ప్రయోగము మొదలగు మారణ ప్రయోగములు చెప్పబడినవి. అవి వ్రాయుట లేదు.

## లవణ మంత్రము

శ్లో॥ అథో లవణమంత్రస్య విధాన మభిధీయతే
ఋగాద్యాకథితా పూర్వం లవణాంభసి పూర్వికా ।
లవణాంభసి తీక్ష్ణోసి ఉగ్రోసి హృదయంతవ
లవణస్యపృథ్వీమాతా మంత్రస్యవరుణఃపితా ।
లవణే హూయమానేతు కుతోనిద్రాకుతో రతిః

**లవణం దహతి పచతి పాచయతిలవణంఛిందతి భిందతి।**

..........................................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఇపుడు 5 విధముల "లవణ" ఋగ్వేదమంత్రములు చెప్పబడుచున్నవి.

1. **లవణాంభసి తీక్ష్ణోఽసి ఉగ్రోసి హృదయం తవ**
**లవణస్యపృథ్విమాతా లవణస్య వరుణః పితా ॥**
2. **లవణే హుూయమానేతు కుతో నిద్రా కుతో రతిః**
**లవణందహతి పచతి పాచయతి లవణం ఛిందతి ఛిందతి**
**అముకస్య దహగాత్రాణి దహమాంసం దహత్వచమ్ ॥**
3. **దహ త్వగస్థిమజ్జాని అస్థిభ్యోమజ్జికాందహ**
**యది వసతియోజనశతే నదీనాం వా శతాంతరే।**
**నగరేలోహప్రాకారే కృష్ణ సర్పశతార్గళే ॥**
4. **తందగ్ధ్వా నయమేశీఘ్ర మగ్రే లోణస్య తేజసా**
**తత్రైవంవశమాయాతు లవణమంత్రపరాక్రమః ॥**
5. **యాతేరాత్రిః శల్య విద్ధస్య శూలాగ్రారోపితస్యచ**
**యాతే రాత్రిర్మహారాత్రిః సాతే రాత్రిర్మహానిశా ॥**

ఈ లవణమంత్రమునకు అంగిరాఋషిః। అనుష్టుప్ ఛందః। హ్రీం బీజం। క్రోం శక్తిః। అగ్ని - రాత్రి - దుర్గా - భద్రకాళీర్దేవతాః।

ఈ క్రింది చిటిమంత్రముతో షడంగన్యాసమాచరించాలి. ఇది 24 అక్షరముల మంత్రము.

## చిటిమంత్రము

**ఓం చిటి చిటి చండాలి మహాచండాలే అముకం మే వశమానయ స్వాహా।**

ఈ మంత్రములోని 5 + 3 + 5 + 4 + 5 + 2 అక్షరములతో క్రమముగా హృదయాది షడంగన్యాసమాచరించి, నలుగురు దేవతలనూ ఇలా ధ్యానించాలి.

**అగ్నిధ్యానం** - నవకుంకుమ సంభిన్నం రుచిరాకల్ప
శతంభజామి వహిమ్ ।
స్రువశక్తివరాభయాని దోర్భిర్దధతం
రక్త సరోరుహే నిషణ్ణమ్ ॥

**రాత్రి ధ్యానం** - కాలాంబువాహ ద్యుతిమిందు వక్త్రాం
హారావళీ శోభి పయోధరాఢ్యమ్ ।
కపాల పాశాంకుశ శూల హస్తాం
నీలాంబరాం యామవతీం నమామి ।

**దుర్గా ధ్యానం** - కాలాంబుదాభామరిశంఖశూల
ఖడ్గాఢ్య హస్తాం తరుణేందు చూడామ్ ।
భీమాంత్రినేత్రాం జితశత్రువర్గాం
దేవీం స్మరేత్ దుర్గతి భంగహస్తామ్ ॥

**భద్రకాళీ ధ్యానం** - టంకం కపాలం డమరుం త్రిశూలం
సంబిభ్రతీ చంద్రకళావతంసా ।
పింగోర్ధ్వ కేశీం సితభీమదంష్ట్రాం
భూయాద్విభూత్యై మమ భద్రకాళీ ॥

## పురశ్చరణాది కథనము

శ్లో॥ ఋుక్ పంచకం జపేత్సమ్యగయుతం తద్దశాంశతః
హవిషా ఘృతసిక్తేన జుహుయాదర్చితేఽనలే ।
ఏవంకృత పురశ్చర్యః ప్రయోగేకుశలో భవేత్

అగ్నిర్యామవతీ ధ్యేయౌ వశ్యాకర్షణ కర్మణోః ।
స్మరేద్ దుర్గాంభద్రకాళీం మంత్రీ మారణ కర్మణి
జానుప్రమాణే సలిలే స్థిత్వానిశి జపేన్మనుమ్ ।
అనేనవాంఛితః సాధ్యః కింకరోజాయతే క్షణాత్
నాభిమాత్రోదకేస్థిత్వా జపేన్మంత్ర మిమంసుధీః ।
అష్టోత్తరసహస్రంయస్తస్య సాధ్యోవశోభవేత్
ఋుక్పంచకం జపేత్ సమ్యక్కంఠ మాత్రాంభసిస్థితః ।
సప్తభిర్దివసైర్భూపాన్ వశయేద్విధినాఽమునా
విలిఖ్యతాళ పత్రే తం సాధ్యనామ్నా విదర్భితమ్ ।
నిఃక్షిప్యక్షీరసంమిశ్రే జలేతత్ క్వాథయేన్నిశి
వశ్యోభవతి సాధ్యోఽస్య నాత్ర కార్యావిచారణా ।
తాళపత్రే లిఖిత్వైవం భద్రకాళీ గృహేఖనేత్
వశ్యాయ సర్వజంతూనాం ప్రయోగోఽయముదాహృతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - లవణసూక్తము సిద్ధించవలెనన్న, 10వేలు జపించి ఘృతమిశ్రిత హవిస్సుతో దశాంశ హోమమాచరించాలి. సిద్ధి పొందిన సాధకుడు, వశ్యాకర్షణములందు అగ్ని – రాత్రి దేవతలను ధ్యానించాలి.

మారణకర్మయందు దుర్గ – భద్రకాళిని స్మరించి, మోకాలు లోతు నీటిలో నిలబడి రాత్రియందు వీరి జపం చేయాలి. ఇట్లు చేయుటవలన సాధ్యవ్యక్తి అనుకూలుడగును. నాభివరకు నీళ్లలో నిలబడి, 1008సార్లు మంత్రం జపించిన సాధ్యవ్యక్తి వశుడగును.

కంఠమువరకు నీళ్ళలో నిలబడి, 5 ఋుక్కులను జపించిన వారం రోజులలో పాలకుడు వశమగును. తాళపత్రముపై సాధ్యనామము విదర్భితం

చేసి (విదర్భ అనగా రెండేసి మంత్రాక్షరముల మధ్య సాధ్యనామము యొక్క ఒక్కొక్క అక్షరము లిఖించుట) పాలు కలిపిన నీళ్లలో దానిని వేసి, రాత్రియందు దానిని మరగపెట్టిన, సాధ్యవ్యక్తి వశుడగును. ఈ మంత్రమును తాళపత్రముపై వ్రాసి, భద్రకాళీమందిరమున పాతిపెట్టిన, అనుకూలు రగుదురు.

లవణమంత్ర శక్తులను గూర్చి "రామకంఠుడు" ఇట్లు పేర్కొనెను. పంచావరణార్చననూ పేర్కొనెను.

భీషణీబహురూపా చ తీక్షణ దంష్ట్రా మదోత్కటా
మారణీమోహినీ కాంతా కమండలు ధరా అపి ।
అభిచారకరీ చేతి లోణమంత్రస్య శక్తయః
పాశాంకుశపుటాశక్తిః సర్వ శక్తిపదంకరీ ।
లాసనాయ నమోఽంతఃస్యాత్ పీఠమంత్రో ధృవాదికః
మూర్తావావాహ్య గంధాద్యైర్దేవతాః సంప్రపూజయేత్ ।
అంగైరావరణం పూర్వం ద్వితీయం వహ్నిమూర్తిభిః
తద్బహిః శూలహస్తాది శక్తిభిశ్చ సమీరితా ।
ఉత్కటాద్యైశ్చతుర్థీ తు పంచమావృతిరీరితా
లోకేశైర్లోణ మంత్రస్య విధానమితికీర్తితమ్ ।
శూలహస్తా - వికేశీ - చ -, దారుణా - లవణప్రియా
వరా - కరాళీ - చాత్యుగ్రా తామస్య స్యాఽష్టశక్తయది ।
ఉత్కటో వికటాక్షశ్చ శూలహస్తో మహాబలః
అగ్నిజిహ్వః ఖడ్గధరః కపాలీ తారణప్రియః ॥

**సంపత్కురీ తెలుగు వ్యాఖ్యానం** - రాగిరేకుపై మంత్రము లిఖించి, సాద్యనామ విదర్భితముచేసి, చంద్రనిప్పులలో కాల్చిన, ఒక నెలలో ఆ వ్యక్తి అనుకూలుడగును. త్రికోణ కుండమునందు, ఆవుపాలతో కడిగి

శుభ్రపరచి, నీడలో ఎండించిన లవణమును - చూర్ణముచేసి, హోమము చేసిన, వారంరోజులలో సాధ్యవ్యక్తి అనుకూలుడగును.

త్రిమధుర మిశ్రిత సైంధవలవణమును, హోమముచేసిన, సమస్త దేవతలు వశమగుదురు.

శ్లో॥ విశుద్ధం లవణంప్రస్థం విబక్తం పంచధా పృథక్
ఏకైకధా ప్రజుహుయాదృచా పంచాహమాదరాత్ ।
యస్యనామ్నా సవశ్యః స్యాదనేన విధినాఽచిరాత్
శుద్ధం లవణమాదాయ జుహుయాన్మధు రాన్వితామ్ ।
ఊనపంచావదాహుత్యా వశంనయతి వాంఛితం
నిత్యంశుద్ధేన లోణేన హుత్వాశత్రూన్ వశంనయేత్ ।
మధురత్రయ సంయుక్తైర్లవణైః సాధుచూర్ణితైః
జుహుయాద్వశయేన్నారీన్ నరాన్ నరపతీనపి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పూర్వోక్త విధానములో శుద్ధిచేసిన, ఒక ప్రస్థప్రమాణములో లవణమును గ్రహించి, దానిని అయిదు భాగములు చేసి, ఒక్కొక్క భాగమును 5 రోజులు శ్రద్ధగా హోమం చేయవలయును. సాధ్యవ్యక్తి అనుకూలుడగును.

అట్టి శుద్ధ లవణచూర్ణము, త్రిమధురములతో కలిపి ప్రతిరోజూ 49 ఆహుతులిచ్చిన, 5 రోజులలో అనుకూలుడగును. నిత్యమూ శుద్ధ లవణము హోమము చేయుటవలన, శత్రువు కూడా అనుకూలుడగును.

## పంచపుత్తలీ ప్రయోగము

శ్లో॥ మంత్రం కృష్ణ తృతీయాది ప్రజపేద్యావదష్టమీ
పుత్తలీః పంచ కుర్వీత సాంగోపాంగాః సమాః శుభాః ।

ఏకా సాధ్యద్రుమేణ స్యాదన్యాపిష్టమయీ మతా
చక్రిహస్తామృదాఽన్యాస్యాదన్యా సిక్థమయీస్మృతా ।
లోణం పోతసంబూతం చూర్ణితం పరిశోధితం
కుడవం ప్రోక్షయేత్ క్షీర దధ్యాజ్యమధుభిః క్రమాత్ ।
గుడాజ్యమధుభిః సమ్యక్ మిశ్రితే నాఽమునా తతః
కుర్వీత పుత్తలీం సౌమ్యాం సర్వావయవ శోభితామ్ ।
ప్రాణమంత్ర కృతం యంత్ర మాసాం హృదివినిః క్షిపేత్
ఆసుప్రాణాన్ ప్రతిష్ఠాప్య పూజయేత్ కుసుమాదిభిః ।
పశ్చాత్ కృష్ణాష్టమీ రాత్రౌ యామమాత్రే గతేసతి
విధాయ మాతృకాన్యాసం మంత్రన్యాసమనంతరమ్ ।
చిటెమంత్ర సముద్భూతాన్ చతుర్వింశతి సంఖ్యకాన్
తారాద్యాన్విన్యసే ద్వర్ణాన్ స్థానేష్వేషు సమాహితః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సాదకుడు బహుళ తదియ నుండి - బహుళాష్టమి వరకు జపంచేయాలి. అష్టమిరోజున సాంగోపాంగమూ, సుందరమూ అయిన 12 అంగుళముల 5 బొమ్మలు చేయాలి. 1. సాధ్య నక్షత్రవృక్ష కలపతోను, 2. బియ్యపుపిండితో 3. కుమ్మరిచక్రం నుండి తెచ్చిన మట్టితో 4.మైనంతోనూ 5. పూర్వోక్త శోధిత సైంధవ లవణముతోనూ అయిదు బొమ్మలు చేయాలి. (వీటికి ఉండవలసిన, అంగ ఉపాంగములు, సంస్కృత వ్యాఖ్యానములో, రాఘవభట్టు కొన్ని శ్లోకములనుద్ధరించెను. సాధకుల సౌకర్యార్థము, వీటిని ఇచట వ్రాయుచున్నాము.)

☞ **త్వక్ హస్తహృత్ పార్శ్వకటీ పత్స్కంధౌ కంధరాభుజౌ**
**పృష్ఠం తథోదరం తూరూ జంఘే ఇత్యంగ సంగ్రహః।**

**ఉపాంగాని భ్రూపుటీ చ తారాగండౌ చ నాసికా**

**ఓష్ఠౌతు దశనా జిహ్వా చిబుకాస్యం సనాభిచ ।**

**జఘనం యోనిగుహ్యేచ జానునీ మణిబంధకౌ**

**పార్ష్ణి గుల్ఫౌ తథాంగుళ్యః కరయోః పాదయోస్తలే ।**

పిమ్మట అయిదు బొమ్మలనూ పాలు, పెరుగు, నేయి, తేనెల మిశ్రమంతో లేపనము చేయవలయును. బొమ్మలు చాలా అందముగా, సర్వావయవ శోభితముగా నుండవలయును.

ఆ బొమ్మల హృదయమునందు 23వ పటలములో చెప్పబోవు మంత్రముతో ప్రాణప్రతిష్ఠ చేయువలయును. ఆపై వాటిని పంచోపచారములతో పూజించి, బహుళాష్టమి రాత్రి ఒక జాము దాటిన తరువాత (రాత్రి 9.30 తరువాత) మాతృకాన్యాసం చేయాలి.

పిమ్మట పంచబుక్కులతోనూ, పంచాంగ న్యాసం ఆచరించాలి. చిటిమంత్రములోని 24 అక్షరములను, ప్రతీ దానికీ ఓం చేర్చి, ఈ క్రింది 24 స్థానములందు, న్యాసం ఆచరించాలి.

1. మస్తకం 2. లలాటం 3-4. నేత్రములు 5-6. చెవులు 7. నాసిక 8. ముఖము 9-10. గడ్డం ఇరుప్రక్కలు 11. కంఠము 12. హృదయము 13-14. రెండుస్తనములు 15. కుక్షి 16. నాభి 17-18. రెండు కటి ప్రక్కలు 19. లింగము 20. చేతులు 21. రెండు తొడలు 22. రెండు మోకాళ్ళు 23. రెండు కాలిపిక్కలు 24. రెండు పాదములు, న్యాసం చేయాలి.

ఈ ప్రకారము సర్వాంగమునందు న్యాసము చేసి, ఎర్రని మాలలు, ఎర్రని గంధము, ఎర్రని వస్త్రములు ధరించి శుచిగా, సాధ్యనక్షత్ర వృక్ష కలపతో చేసిన బొమ్మను, కుండమునందు తలకిందులుగా పాతిపెట్టాలి.

బియ్యపుపిండితో చేసిన బొమ్మను తన ఆసనముకింద, మట్టిబొమ్మను కాళ్ళకింద, మైనం బొమ్మను హోమకుండమునకు పై తలకిందులుగా త్రాడుతో కట్టి వేలాడదీయాలి. పిమ్మట లవణముతో చేసిన బొమ్మను స్పృశించుచూ జపం చేయాలి.

తరువాత ఆ బొమ్మయందు, తన శరీరమునందు, షడంగన్యాసముచేసి చిటిమంత్ర సహితముగా లవణమంత్రమును 1008 సార్లు జపించాలి. ఆ తరువాత చిటిమంత్రమును విలోమముగా తన శరీరముపైన, బొమ్మపైన ప్రత్యేకాక్షరము ఈ క్రింది 24 స్థానములందున్యాసం ఆచరించాలి.

1. పాదాంగుష్ఠములు 2. వాటిసంధులు 3. కాలివేళ్ల చివర 4. మోకాళ్లు 5. కాలిపిక్కలు 6. తొడలు 7. గుదము 8. లింగము 9. నాభి 10. జఠరము 11. హృదయము 12-13. రెండు స్తనములు 14. కంధర (కంఠముల) 15. చిబుకము 16. ముఖము 17-18. రెండు ముక్కు రంధ్రములు 19-20. రెండు చెవులు 22. నేత్రమలు 23. నుదురు 24. మూర్ధ, స్థానములందు న్యాసం ఆచరించాలి.

ఆ తరువాత అగ్నితో సాధ్య నక్షత్రవృక్ష కలపతో చేసిన బొమ్మను మండించి, ఆ జ్వాలయందు మంత్రముయొక్క 4గురు దేవతలను ఆవాహన చేసి అర్చించాలి. ఎర్రచందనం రాజీపుష్పం - నీరు కలిపి ఒక పాత్రలో నింపి ఆయా దేవతలనర్చించి, 4గురు దేవతలకు ఈ క్రింది మంత్రము లతో, పైపాత్రలోని నీటితో అర్ఘ్యం సమర్పించాలి.

**అగ్నిమంత్రము** - త్వమాననమమిత్రఘ్న నిశాయాహవ్యవాహన
హవిషామంత్రజప్తేన తృప్తోభవతయా సహ ।
జాతవేదో మహాదేవ తప్తజాంబూనదప్రభ
స్వాహాపతే విశ్వభక్ష లవణం దహ శత్రుహన్॥

**రాత్రి మంత్రము** - ఈశేశర్వరి శర్వాణి గ్రస్తంముక్తం త్వయాజగత్
మహాదేవినమస్తుభ్యం వందే కామదాభవ ।
తమోమయి మహాదేవి మహాదేవస్యసువ్రతే
త్రియామే పురుషం హత్వా వశమానయదేవిమే ॥

**దుర్గా మంత్రము**- దుర్గేదు (స)ర్గా దిరహితే దుర్గ సంరోధనార్గళే
చక్రశంఖధరేదేవి దుష్టశతృభయంకరి ।
నమస్తే దహశతృాన్ మే వశమానయ చండికే
శాకంభరి మహాదేవి శరణం మే భవాఽనఘే

**భద్రకాళీమంత్రము**- భద్రకాళి భవాభీష్టే భద్రసిద్ధి ప్రదాయిని
సపత్నాన్ మే హనహన దహశోషయతాపయ ।
శూలాసిశక్తి వజ్రాద్యైరుత్కృత్యోత్ కృత్యమారయ
మహాదేవి మహాకాళి రక్షాఽస్మానక్షతాత్మికే ॥

ఈ ప్రకారము 4గురు దేవతలను అర్చించి, అర్ఘ్యమిచ్చిన పిమ్మట, శతృవును భావించి, అయిదు ఋక్కులను పఠించుచూ, లవణపు బొమ్మను 7 భాగములు చేసి, అగ్నియందు ఇలా హోమం చేయాలి.

ముందుగా కుడికాలి భాగమును హోమం చేయాలి. తరువాత చేయి, శిరస్సు - ఎడమచేయి - మధ్యభాగములోని పైభాగము - మధ్యభాగము - ఎడమకాలి భాగము క్రమముగా మొత్తం అంతటినీ హోమం చేయాలి.

లేదా, మరొక విధానములో పై ఏడు భాగములను, ఒక్కొక్క దానిని ఏడేసి భాగములుగా చేసి 49 ఆహుతులుగా కూడా హోమం చేయవచ్చును. పిమ్మట అగ్నిని అర్చించి నమస్కరించాలి.

చివరిగా గురువును దన - ధాన్య - వస్త్ర - ఆభరణములతో సత్కరించాలి. ఇట్టి ప్రయోగమువలన దేవ - రాక్షస - రా - ఆమాత్య - స్త్రీ మొదలగు వారందరూ వశ్యులగుదురు.

ఇదే విధములో మారణప్రయోగము చెప్పబడినది. అది వ్రాయుటలేదు.

# నక్షత్ర వృక్షములు

శ్లో॥ కారస్కరోఽథ ధాత్రీ స్యాదుదుంబర తరుః పునః
జంబుః ఖదిర కృష్ణాఖ్యౌ వంశపిప్పల సంజ్ఞకౌ ।
నాగరోహిణ నామానౌ పలాశప్లక్ష జంజ్ఞకౌ
అంబష్ఠ బిల్వార్జునాఖ్యా వికంకత మహీరుహాః ।
వకుళః సరళః సర్జో వంజుళః పనసార్కకౌ
శమీకదంబ నింబామ్ర మధూకాబుుక్ష శాఖినః ।
ఆత్మరక్షాది కంసర్వం కుర్యాన్మంత్రీ యధాపురా
అమునామను నా సమ్య గభీష్టఫలసాధనే ।
సదృశో నాస్తి మంత్రోఽన్యః సత్యమేతన్నచాన్యధా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు 27 నక్షత్రములకు సంబంధించిన వృక్షములు చెప్పబడుచున్నవి. తంత్రసాధనలో వీటికి ఎంతో ప్రాధాన్యమున్నది.

| | **నక్షత్రము** | **వృక్షము** |
|---|---|---|
| 1. | అశ్విని | |
| 2. | భరణి | ఉసిరి |
| 3. | కృత్తిక | మేడి |
| 4. | రోహిణి | నేరేడు |
| 5. | మృగశిర | తెల్లచంద్ర |
| 6. | ఆర్ద్ర | నల్లచంద్ర |
| 7. | పునర్వసు | వెదురు |
| 8. | పుష్యమి | రావి |
| 9. | ఆశ్లేష | నాగకేసరము |
| 10. | మఖ | మర్రి |

| | | |
|---|---|---|
| 11. | పుబ్బ | మోదుగ |
| 12. | హస్త | |
| 14. | చిత్త | మారేడు |
| 15. | స్వాతి | మద్ది |
| 16. | విశాఖ | |
| 17. | అనూరాధ | వకుళం |
| 18. | జ్యేష్ఠ | |
| 19. | మూల | |
| 20. | పూర్వాషాఢ | అశోకం |
| 21. | ఉత్తరాషాఢ | అశోకం |
| 22. | శ్రవణం | జిల్లేడు |
| 23. | ధనిష్ఠ | జమ్మి |
| 24. | శతభిషం | కదంబం |
| 25. | పూర్వాభాద్ర | నిమ్మ |
| 26. | ఉత్తరాభాద్ర | మామిడి |
| 27. | రేవతి | మోదుగ |

ఆయా నక్షత్రమునందు జన్మించినవారు, వారి వారి జన్మనక్షత్ర వృక్షములను ఛేదించరాదు. వాటిని తమ ప్రాంగణములో పెంచి, చక్కగా పోషించినచో ఆయురారోగ్యములు కలుగును.

**"ఆయుష్కామః స్వర్క్ష వృక్షం ఛేదయేన్న కదాచన"**

లవణమంత్రములు సర్వాభీష్టసాధకములు. ఇందు సంశయమేమీ లేదు.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*ద్వావింశః పటలః సమాప్తః*

❖❖❖

# అథత్రయోవింశః పటలః

## అథత్ర్యంబక ప్రకరణమ్

శ్లో॥ అథత్రైయంబకం మంత్ర మభిధాస్యామ్యనుష్టుభం
యంభజంతం నరం కాలః స్వయం వీక్షితు మక్షమః ।
వశిష్ఠోఽస్య మునిః ప్రోక్తశ్ఛందోఽనుష్టుబుదాహృతం
దేవతాఽస్యసముద్దిష్టః త్ర్యంబకః పరమేశ్వరః ।
విభక్తై ర్మంత్ర వర్ణైఃస్యాత్ షడంగానాంప్రకల్పనా
హృదయం త్రిభిరాఖ్యాతం చతుర్భిః శిరఈరితమ్ ।
శిఖాఽష్టభిః సముద్దిష్టా నవభిః కవచంమతం
పంచభిర్నేత్రమాఖ్యాతం అస్త్రత్రిభిరుదాహృతమ్ ।
పూర్వపశ్చిమయామ్యేందు వక్త్రేషు తదనంతరం
ఉరోగళాస్యేషు పునర్నాభిహృత్ పృష్ఠ కుక్షిషు ।
లింగపాయూరు మూలాంత జానుయుగ్మేషు తత్పరం
తద్వృత్త యుగ్మే స్తనయోః పార్శ్వయోః పాదయోః పునః
పాణ్యోర్నాసికయోః శీర్షే మంత్రవర్ణాన్ న్యసేత్క్రమాత్
పదాన్యేకాదశ న్యస్యే చిబుకభ్రూయుగళాక్షిషు ।
వక్త్రే గండయుగేభూయో హృదయే జఠరేపునః
గుహ్యోరుజాను పాదేషు న్యాసమేవం సమాచరేత్ ।
జపేన్మంత్రమిమం లక్షం ఏవం ధ్యాయన్ జితేంద్రియః
జుహుయాద్దశభిర్ద్రవ్యైరయుతం ఘృతసంప్లుతైః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు త్ర్యంబక మంత్రము చెప్పబడుచున్నది. దీని ప్రభావము వలన సాధకునకు అపమృత్యువు కలుగదు. కొందరు దీనిని మృత్యుంజయ మంత్రమందురు.

**మనుః - త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం।**

**ఉర్వారుకమివ బంధవాన్ మృత్యోర్ముక్షీయమామృతాత్॥**

**వశిష్ఠ ఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీంబీజం। హ్రీం శక్తిః। త్ర్యంబకః పార్వతీ పతిర్దేవతా।**

మూలమంత్రములోని 3 + 4 + 8 + 9 + 5 + 3 అక్షరములతో, షడంగన్యాసమాచరించి, మంత్రములోని 32 అక్షరములనూ ఈ క్రింది పేర్కొన్న 32 స్థానములందు న్యాసం చేయాలి

1. ముఖమునందు పూర్వభాగము 2. పశ్చిమ భాగము 3. దక్షిణ భాగము 4. ఉత్తర భాగము 5. కంఠము 6. ముఖము (నోరు) 7. నాభి 8. హృదయము 9. వీపు 10. కుక్షి 11. లింగము 12. గుదము 13-14. రెండు తొడలమూలములు 15-16. రెండు మోకాళ్ల లోపలి భాగములు 17-18. రెండు మోకాళ్లు 19-20 మోకాలిపైవృత్త భాగములు 21-22. రెండు స్తనములు 23-24. రెండు ప్రక్కలు 25-26. రెండు కాళ్లు 27-28. రెండు చేతులు 29-30. రెండు నాసికా రంధ్రములు 31. మూర్ధ 32. శీర్ష మధ్యము లందు న్యాసమాచరించాలి.

పిమ్మట మంత్రములోని 11 పదములను ఈ క్రింది 11 స్థానములందు "పదన్యాసము" చేయాలి. 1. శిరసు 2. రెండు భ్రూస్థానములు 3. రెండు నేత్రములు 4. రెండు చెక్కిళ్లు 5. ముఖము 6. హృదయము 7. కుక్షి 8. గుహ్యము 9. రెండు తొడలు 10. రెండు మోకాళ్లు 11. రెండు పాదములు.

పిమ్మట శివుని ఇలా ధ్యానించాలి.

☞ **హస్తాభ్యాం కలశ ద్వయామృతరసై రాప్లావయంతం శిరో**
**ద్వాభ్యాంతౌ దధతం మృగాక్షవలయే ద్వాభ్యాం వహంతంపరమ్।**
**అంకన్యస్తకరద్వయామృత ఘటం కైలాసకాంతం శివం**
**స్వచ్ఛాంభోజ గతం నవేందు ముకుటం దేవంత్రినేత్రం భజే॥**

మూలమంత్రమును 1 లక్ష సార్లు జపించి, ఈ క్రింద చెప్పబడిన దశద్రవ్యములతో పదివేలు హోమం చేయాలి.

శ్లో॥ బిల్వంపలాశం ఖదిరం వటం చ తిల సర్షపౌ
దౌగ్ధం దుగ్ధందధి పునర్ దూర్వాంతాని విదుర్బుధాః ।
పంచాక్షరోదితే పీఠే పూజయేత్ వృషభ ధ్వజం
మూర్తిం మూలేన సంకల్ప్య వక్ష్యమాగేన వర్త్మనా ।
పూర్వమంగాని సంపూజ్య పశ్చాన్మూర్తీః ప్రపూజయేత్
అర్కేందు వసుధాతోయ వహ్నీరవియదాత్మనః ।
ద్వితీయావరస్త్ర పూజ్యా మూర్తయోఽష్టౌక్రమాదథ

..............................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పది హోమద్రవ్యములు 1. మారేడు పలము 2. మోదుగ 3. ండ్ర 4. మర్రి 5. తిలలు 6. తెల్లావాలు 7. నెయ్యి 8. పాలు 9. పెరుగు 10. దూర్వా

పిమ్మట పంచాక్షర ప్రకరణమున చెప్పిన శైవపీఠమందు, మహా మృత్యుంజయుని పూజించాలి. మూలమంత్రముతో విగ్రహమును భావించి షష్ఠావరణములను అర్చించాలి. ప్రధమావరణమునందు మహామృత్యుంజ యుని ధ్యానశ్లోకములో చెప్పిన విధముగా భావించి పూజించాలి.

2. ద్వితీయావరణమునందు – సూర్య – చంద్ర – పృథ్వి – జల – అగ్ని – వాయు – ఆకాశ – ఆత్మ (యజమానమూర్తి) అనే శివుని అష్టమూర్తులను అర్చించాలి.

3. తృతీయావరణమునందు – రామా – రాకా – ప్రభా – జ్యోత్స్నా – పూర్ణా – ఉషా – పూరణీ – సుధా, అనే అష్టశక్తులను అర్చించాలి.

4. చతుర్థావరణమునందు - విశ్వా - విద్యా - సితా - ప్రహ్వా - సారా - సంధ్యా - శివా - నిశా అనే 8 శక్తులను అర్చించాలి.

5. పంచమావరణమునందు - ఆర్యా - ప్రజ్ఞా - ప్రభా - మేధా - శాంతి - ధృతి - మతి - అనే దేవతలను ఈ ఆవరణమునందర్చించాలి.

6. షష్ఠావరణమునందు - ధరా - మాయా - అవనీ - పద్మా - శాంతా - అమోఘా - జయా - అమలా, అనే శక్తులను అర్చించాలి.

పిమ్మట లోకపాలురను, వజ్రాది ఆయుధ సహితముగా పూజించాలి. ఇలా ఆచరించి మంత్రసిద్ధిని పొందిన సాధకుడు, ప్రయోగములు చేయుటకు సమర్థుడగును.

## వివిధ సాధనలు

శ్లో॥ అయుతం జుహుయాద్ బిల్వ సమిద్భిః సంపదే సుధీః
జుహుయాత్ బ్రహ్మవృక్షస్య సమిద్భిర్ బ్రహ్మతేజసే ।
ఖాదిరైరయుతం హుత్వా కాంతిపుష్టి మవాప్నుయాత్
వట వృక్షస్య సమిధో జుహుయాదయుతావధి ।
ధనధాన్య సమృద్ధః స్యాదచిరేణైవ సాదకః
తిలైస్తత్ సంఖ్యయాహుత్వా సర్వపాపైః ప్రముచ్యతే ।
సిద్ధార్థైరయుతం హుత్వా శత్రూన్ విజయతే నృపః
అనేనైవ విధానేన నశ్యేన్ మృత్యురకాలజః ।
పాయసేనకృతోహోమో రక్షాశ్రీ కీర్తికాంతిదః
పశుదుగ్ధేన సిద్ధాన్నం హుత్వా కృత్యాంవినాశయేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - సంపద సమృద్ధికై సాధకుడు బిల్వ సమిధలతో పదివేలు హోమం చేయాలి. బ్రహ్మవర్చస్సు కోరువారు,

మోదుగ సమిధలతో పదివేలు హోమం చేయాలి. చంద్ర సమిధలతో హోమం చేసిన కాంతి, పుష్టి - మర్రి సమిధల హోమం వలన ధనధాన్యవృద్ధి, తిలల హోమముచే సర్వపాపములు నశించును.

తెల్లావాలతో హోమం చేసిన శత్రువులపై విజయం సాధించును. అకాలమృత్యువు తొలగును. పాయస హోమముచే, రక్షణ - కీర్తి కలుగును. ఆవుపాలు, అన్న హోమముచే కృత్యాప్రయోగము నాశనమగును.

శ్లో॥ అయమేవ మతో హోమః శాంతి శ్రీ సంపదావహః
దధిహోమేన సంపాతం కుర్యాద్విద్వేషణోర్మిథః ।
ప్రత్యహం జుహుయాన్మంత్రీ దూర్వామష్టోత్తరం శతం
ఆమయాన్నిఖిలాన్ జిత్వా దీర్ఘమాయు రవాప్నుయాత్ ।
జుహుయాజ్జన్మదివసే పాయసాన్నైర్ ఘృతాన్వితైః
ఇచ్ఛన్న నిందితాం లక్ష్మీమారోగ్యమతులం యశః ।
గవ్యదుగ్ధ ఘృతాక్తాభిర్ స్వజన్మదివసే సుధీః ।
ఆమయైః సకలైర్ముక్తో జీవేద్వర్ష శతం సుధీః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అన్నము, ఆవుపాల హోమముచే, శాంతి - సంపద - కూడా కలుగజేయును. పెరుగు హోమము చేసిన, విద్వేషణ సిద్ధించును. నిత్యమూ 108 దూర్వాహోమము చేయుటవలన, అనారోగ్యము తొలగి దీర్ఘాయువు కలుగును.

ఆవుపాలు - ఆవునెయ్యి మిశ్రిత దూర్వా హోమము వలన, సంపద - ఆరోగ్యము - కీర్తి కలుగును. పుట్టినరోజునాడు ఈ హోమము 120సార్లు చేసిన సమస్త వ్యాధులు తొలగి నూరు సంవత్సరములు జీవించును.

శ్లో॥ కాశ్మీరీ సమిధస్తిస్రః పయోఽన్నం త్రిశతంపృథక్
జుహుయాద్ బ్రాహ్మణానంతే భోజయేన్మధురాన్వితమ్ ।

ప్రణయేద్ధన ధాన్యాద్యై రాత్మనో గురుమాదరాత్
అనామయమవాప్నోతి దీర్ఘమాయుః శ్రియాసహ ।
సఘృతేన పయోన్నేన హుత్వా పర్వణి పర్వణి
రాజ్యశ్రియ మవాప్నోతి షణ్మాసాన్నాత్ర సంశయః ।
లాజై ర్విశుద్ధైర్ జుహుయాత్ కాంత్యాప్త్యై సావరాప్తయే
క్షీరద్రుమ సమిద్ధోమాత్ బ్రాహ్మణాదీన్ వశంనయేత్ ।
స్నాత్వా సహస్రం ప్రజపేదాదిత్యాభి ముఖోమనుమ్
ఆధివ్యాధి వినిర్ముక్తో దీర్ఘమాయు రవాప్నుయాత్ ।
అనేన మనునా సర్వం సాధయేదిష్టమాత్మనః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శ్రీపర్ణీ సమిధలు మూడేసి చొప్పున, పాయసంతోనూ 300 హోమంచేసిన సంపదలు - ఆరోగ్యము కలుగును. హోమాంతమున బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును.

పర్వ తిధులందు ఘృతయుక్త పాయసహోమం చేసిన 6 నెలలో అధికారము, ఉద్యోగము పొందును. స్వచ్ఛమైన పేలాలు హోమం చేసిన కన్యకు ఉత్తమ వరుడు లభించును. క్షీరవృక్ష సమిధలతో 'అశ్వత్థ - ఉదుంబర - ప్లక్ష - వట) హోమం చేసిన బ్రాహ్మణాది సమస్త వర్ణములూ అనుకూలమగును.

స్నానానంతరం సూర్యాభిముఖముగా నిలచి, ఒక వెయ్యి జపించిన, శారీరక - మానసిక వ్యాధులు తొలగి దీర్ఘాయువు పొందును. ఈ మంత్రముతో సమస్తమూ సాధించవచ్చును.

## శతాక్షరమంత్రము

శ్లో॥ గాయత్రీ త్రిష్టు బనుష్టుబ్ వర్ణైః ప్రోక్తః శతాక్షరః
పూర్వోక్తా ఏవ మున్యాద్యాః పరంతేజోఽస్యదేవతా ।

హృత్త్రయోద శభిః ప్రోక్తం రుద్రార్ణైః శిరఈరితం
ద్వావింశత్యా శిఖాప్రోక్తా తావద్భిః కవచం మతమ్ ।
స్యాత్ పంచదశభిర్నేత్ర మస్త్రం సప్తదశాక్షరైః
వర్ణన్యా సాదికం సర్వం కుర్యాత్ పూర్వోక్త వర్త్మనా ।
లక్షమానం జపేదేన మయుతం పాయసాంధసా
జుహుయాత్ ఘృతసిక్తేన మంత్రవిద్విజితేంద్రియః ।
సౌరేపీఠే యజేత్సమ్యక్ వక్ష్యమాణ విధానతః
ఆద్యామావృతిమభ్యర్చేత్ షడంగైర్దేశికోత్తమః ।
గాయత్రీ శక్తిభిస్తిస్రః పూజయేదావృతీః క్రమాత్
ఆవృతిః పంచమీప్రోక్తా త్రిష్టుబుద్భూత శక్తిభిః ।
అనుష్టుబ్ శక్తిభిః ప్రోక్త మావృతీనాం చతుష్టయం
ఇంద్రాద్యైర్దశమీ ప్రోక్తా వజ్రాద్యైస్తత్పరామతా ।
ఏవంసిద్ధే మనౌమంత్రీ భవేద్భాస్కర సన్నిభః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శతాక్షరీవిద్య చెప్పబడుచున్నది. ఇందు గాయత్రీ మంత్రము + త్రిష్టుబ్ (జాతవేదమంత్రము) + అనుష్టుబ్ (మృత్యుంజయ మంత్రము) కలిపి 24 + 44 + 32 = 100, శతాక్షరీ మంత్రమగును. దీనికి ఋష్యాదులు ముందు చెప్పినట్లుగానే యుండును.

మంత్రములోని మొదటి 13 అక్షరములతో హృదయన్యాసము, 11 అక్షరములతో శిరోన్యాసము, 22 . శిఖ, 22తో కవచము, 15తో నేత్ర, 17తో, అస్త్రన్యాసము ఆచరించాలి. వర్ణన్యాసము – పదన్యాసము చేయాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

శ్లో॥ సత్యం మానవివర్జితం శృతిగిరామాద్యం జగత్కారణం
వ్యాప్తం స్థావర జంగమం మునివరైర్ ధ్యాతం నిరుద్ధేంద్రియః
అర్కాగ్నీందుమయం శతాక్షర వపుస్తారాత్మకం సంతతం
నిత్యానంద గుణాలయం గుణపరం వందామహే తన్మహః

పై మంత్రమును, ఒక లక్ష జపించి, దశాంశహోమం నెయ్యి పాయసముతో ఆచరించాలి. సౌరపీఠమందు అర్చన చేయాలి. ప్రధమావరణమందు షడంగముల పూజ - 1.2- - 3 గాయత్రియొక్క 8 - 8 శక్తులు మూడు ఆవృత్తులలో (21వ పటలమునందు చెప్పబడినది) అర్చించాలి. పిమ్మట (5 - 6) త్రిష్టుబ్ మంత్రముతో జాగ్రతాది 11 - 11 - 11 శక్తులను (21వ పటలమునందు చెప్పబడినది) నాలుగు దజవలందు పంచమ ఆవృతియందు పూజించాలి. పిమ్మట 7 - రమా - రాకా ప్రభా - జ్యోత్స్నా - పూర్ణా - ఉషా - పూరణీ - సుధా లను అర్చించాలి. పిమ్మట 8 విశ్వా - విద్యా - సితా - ప్రహ్వా - సారా - సంధ్యా - శివా - నిత్యాలను అర్చించాలి.

పిమ్మట 9 ఆర్యా - ప్రజ్ఞా - ప్రభా - మేధా - శాంతి - కాంతి - ధృతి - మతిలను అర్చించాలి. పిమ్మట 10 ఆవరణమందు ఇంద్రాది దిక్పాలకులను, 11 ఆవరణమందు ఇంద్రాదుల ఆయుధములను అర్చించాలి. ఇలా అర్చించి, జపించి - మంత్రసిద్ధి పొందిన సాధకుడు సూర్యసమాన తేజస్సుతో వెలుగొందును.

శ్లో॥ సుధాలతో ద్భవైః ఖండైర్ జుహుయాత్ క్షీరసంయుతైః
దీర్ఘమాయు రవాప్నోతి నిరాధిర్ వ్యాధి వర్జితః ।
దూర్వాభిర్ ఘృతసిక్తాభిస్తదేవ ఫలమాప్నుయాత్
మధురత్రయ సంసిక్తైర్జు హుయా దరుణాంబుజైః ।

మహాలక్ష్మీ మవాప్నోతి షడ్భిర్ మాసైర్ విధానవిత్
రక్తోత్పలైస్త్రిమధ్వక్తైర్జుహుయాత్ సర్వసంపదే ।
శ్రీప్రసూనైః ప్రజుహుయాద్రమాయా వసతిర్భవేత్
సహస్రం జుహుయాన్నిత్యం మాసమేకం తిలై శ్శుభైః ।
భానుసంఖ్యాన్ ద్విజాన్నిత్యం భోజయేన్మధురాన్వితైః
సర్వపాపై ర్వినిర్ముక్తః సర్వరోగ వివర్జితః ।
కృత్యాద్రోహ గ్రహద్రోహాన్ జిత్వా దీర్ఘం సజీవతి
ప్రాతః స్నాన రతోమంత్రీ జపేన్నిత్యం శతం శతం ।
భానుమాలోకయన్ సమ్యక్ సజీవేచ్ఛరదాంశతమ్
తారవ్యాహృతి సంరుద్ధం జపేన్మంత్రం శతాక్షరం ।
నిత్యమష్టోత్తర శతం నిఃశ్రేయ సఫలాప్తయే
గాయత్ర్యాద్యం జపేన్మంత్రం సర్వపాప విముక్తయే ।
సర్వశత్రువినాశాయ త్రిష్టుబాద్యమిమంజపేత్
అనుష్టుబాద్యం ప్రజాపేదాయురారోగ్య సిద్ధయే ।
శతాక్షరో మనుః ప్రోక్తః సమస్త పురుషార్థదః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - పిమ్మట పాలతో తిప్పతీగ సమిధలు, తడిపి హోమం చేయాలి. అందువలన ఆధి - వ్యాధులు తొలగి దీర్ఘాయువు కలుగును. ఘృతమిశ్రిత దూర్వా హోమమువలన కూడా ఇదే ఫలితము కలుగును. మధురత్రయముతో ఎర్రకమలములు హోమం చేసిన, ఆరు నెలలో మహాభాగ్యవంతుడగును.

కురవక పుష్ప హోమము వలన కూడా సంపద సిద్ధించును. తిలలతో ప్రతినిత్యం వెయ్యిసార్లు ఒక నెవలరకు హోమం చేసిన, (రోజూ 12 మంది బ్రాహ్మణులకు భోజనం పెడుతూ) సర్వపాపములూ తొలగును. వ్యాధి

బాధలు తొలగును. కృత్యా - గ్రహ - ద్రోహ బాధలు తొలగి, జయము కలిగి - చిరకాలము జీవించును.

ప్రాతఃకాలమున స్నానముచేసి, సూర్యుని చూచుచూ నిత్యమూ 100 సార్లు "శతాక్షరి" జపించినచో నూరు సం॥లు జీవించును. ప్రణవము - వ్యాహృతులు సంపుటము చేసి నిత్యము 1008 జపించిన మోక్షము కలుగును.

ముందు గాయత్రి, పిమ్మట త్రిష్టుబ్, అటుపై అనుష్టుబ్‌లను శతాక్షరిగా జపించాలి. ఆదియందు త్రిష్టుబ్ పిమ్మట అనుష్టుబ్, అటుపై గాయత్రిని జపించిన శతృవిజయము ప్రాప్తించును. ముందు అనుష్టుబ్ - పిమ్మట గాయత్రి, అటుపై త్రిష్టుబ్ జపించిన, ఆయురారోగ్యములు కలుగును. ఈ "శతాక్షర" మంత్రము సమస్త పురుషార్థములనూ ఇచ్చును.

## అథ వరుణ ప్రకరణం

శ్లో॥ ఋచో విధానం వారుణ్యా యథావదభిదీయతే
ఋగ్వేదే సా సముద్దిష్టా ధ్రువాస్యాద్యా మనీషిభిః ।
వశిష్ఠోమునిరాఖ్యాతః ఛందః త్రిష్టు బుదాహృతం
వరుణో దేవతాప్రోక్తః తద్వర్ణై రంగకల్పనా ।
అష్టభిర్ హృదయం ప్రోక్తం సప్తభిః శిర ఈరితం
శింఖా షడ్వర్ణైరాఖ్యాతా వస్వర్ణైః కవచం మతమ్ ।
సప్తభిర్నేత్ర మాఖ్యాతమస్త్రం షడ్భిరుదీరితమ్ ।
సాగ్రేషు సంధిషు పదోర్గుదాంధ్వా ధార నాభిషు
కుక్షౌ పృష్ఠే హృదికుచే గళేబాహ్వాగ్రసంధిషు ।
వక్త్రే కపోలనాసాక్షి కర్ణభ్రూమధ్యమస్తకే

శిరః సర్వాంగయోర్ న్యస్యే న్మంత్రవర్ణాన్ యథావిధి ।
లక్షమేకం జపేన్మంత్రం పాయసేన దశాంశతః
సర్పిః సిక్తేనజుహు యాన్మంత్రీ మంత్రస్య సిద్ధయే ।
ధర్మాది కల్పితేపీఠే వరుణం సమ్యగర్చయేత్
కృత్వాఽంగ పూజనం శేషం వాసుకింతక్ష కింపునః ।
కర్కోటకం తతః పద్మం మహాపద్మమనంతరం
శంఖపాలాఖ్య కుళికౌ సమ్యక్ పత్రేషు పూజయేత్ ।
ఇంద్రాద్యా నాయుధాన్యేషా మర్చయేత్త దనంతరమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ వరుణ ఋక్, ఋగ్వేదము నందున్నది. **ఈ మంత్రజపమువలన కారాగార విముక్తి కలుగును.** దీనిని రాత్రివేళ నిలబడి జపించాలి. ఈ మంత్ర జాపకుల చెంతకు, పిశాచములు చేరవు.

ఋక్ - ధ్రువాసు త్వాసుక్షితిషు, క్షియంతో వ్యస్మత్ పాశం వరుణోము మోచత్ । అవోవన్వానా అదితేరుపస్థాద్యూయం పాత స్వస్తిభిః సదానః ॥

ఈ మంత్రమునకు వశిష్ఠ ఋషిః । త్రిష్టుబ్ ఛందః । వరుణో దేవతా । మంత్రములోని 8 + 7 + 6 + 8 + 7 + 6 అక్షరములతో షడంగ న్యాస మాచరించాలి.

పిమ్మట మంత్రములోని 42 అక్షరములను ఈ క్రింది స్థానములలో **"అక్షరన్యాసం"** చేయాలి.

రెండు పాదముల అగ్ర భాగముల దశ సంధులయందు మొదటి పది అక్షరములు, పిమ్మట, గుద - లింగ - ఆధార - నాభి - కుక్షి - పృష్ఠ - హృదయ - కుచ - కంఠములందు 9 అక్షరములు, రెండు చేతివేళ్ల అగ్రములందు 10, అటుపై రెండు చెక్కిళ్ళు, రెండు నేత్రములు,

2 – చెవులు, భ్రూమధ్యము, లలాటము, శిరస్సు – సర్వాంగములందు మొత్తం 42 అక్షరములూ న్యాసం చేసి ఇలా ధ్యానించాలి.

శ్లో॥ చంద్రప్రభం పంకజసన్నిషణ్ణం
పాశాంకుశాభీతి వరందధానమ్ ।
ముక్తా విభూషాంచిత సర్వగాత్రం
ధ్యాయేత్ ప్రసన్నం వరుణం విభూత్యై ॥

ఋక్ మంత్రము లక్ష జపించి, దశాంశం పాయసహోమం చేయాలి. ధర్మాది కల్పిత పీఠమందు వరుణుని అర్చించాలి. కేసరములందు అంగపూజచేసి, పిమ్మట శేష – వాసుఇ – తక్షక – కర్కోటక – పద్మ – మహాపద్మ – శంఖపాల – కుళికులను, అష్టదళములందు ఆరాధించాలి.

పిమ్మట ఇంద్రాది దిక్పాలురను, వారి ఆయుధములను పూజించాలి. శేషాది అష్టనాగుల ధ్యానము త్వరితా పటలమునందున్నది. దానిని పఠించాలి.

శ్లో॥ ఋణముక్త్యై జపేన్మంత్రం ప్రత్యహం సాష్టకంశతం
జపేనాఽనేనలభతే మహతీమవ్యయాంశ్రియమ్ ।
సితేక్షుశకలైర్మంత్రీ జుహుయాత్ ఘృతసంప్లుతైః
చతుర్దినం దశశతం ఋణముక్త్యై మహాశ్రియే ।
సమిద్భిర్వేత సోత్థాభిః క్షీరాక్తాభిర్దినత్రయం
జుహుయాత్ వృష్టి సంసిద్ధ్యై మంత్రవిద్విజితేంద్రియః ।
అనేన విధినా మంత్రీ సూర్యే శతభిషంగతే
చతుః శతం ఘృతయుతం పాయసం జుహుయాద్వశీ ।
ఋణనాశాయ సంపత్యై వశ్యారోగ్యాభివృద్ధయే
భృగువారే కృతోహోమః పాయసేన ససర్పిషా ।

మహతీం సంమదం కుర్యాన్నాశయేత్ సకలాపదః
శాలిభిర్ ఘృతసంసిక్తైః సరిదంతరితః సుధీః ।
త్ర్యహం చతుః శతం హుత్వాస్తంభయేత్పరసైన్యకం
సాయంప్రత్యంగ్ముఖో వహ్నిమారాధ్య ప్రజపేన్మనుమ్ ।
చతుః శతం విముచ్యేత మంత్రీసర్వైరుపద్రవైః
మత్రీప్రత్యంగ్ముఖో భూత్వా తర్పయేద్విమలైర్జలైః ।
సర్వోపద్రవనాశాయ సమస్తాభ్యుదయాప్తయే
బహునాకిమివోక్తేన మంత్రేణా నేన సాధకః ।
సాధయేత్ సకలాన్ కామాన్ జపహోమాదితత్పరః ॥

**సంపత్కరి తెలుగు వ్యాఖ్యానం** - ఋణవివెూచనము జరుగుటకు, వారుణ మంత్రము ప్రతినిత్యమూ 108సార్లు జపించాలి. ఋణబాధలు తొలగి, ధనము ప్రాప్తించును. మరింత శీఘ్రసిద్ధికి తెల్ల చెరకు ముక్కలతో నెయ్యి కలిపి, 1000 సార్లు 4 రోజులు హోమం చేయవలయును.

జితేంద్రియుడైన సాధకుడు, వర్షము కొరకు పాలతో తడిపిన వేతసీ సమిధలు మూడురోజులు హోమంచేసిన వర్షము కురియును. సూర్యుడు శతభిషా నక్షత్రంలో సంచరించునపుడు (సుమారు ప్రతీ సంవత్సరము ఫిబ్రవరి 21 నుంచి మార్చి 6 వరకు) ఘృతము, పాయసము 400 సార్లు హోమంచేసిన, ఋణబాధ తొలగి సంపద – ఆరోగ్యము కలుగును.

శుక్రవారమునాడు, ఘృతమిశ్రిత పాయసము హోమంచేసిన ధనప్రాప్తి సిద్ధించును. ఘృతమిశ్రిత ధాన్యము దీపమందుంచి మూడురోజులపాటు ప్రతీ దినమూ 400 చొప్పున హోమంచేసిన, శత్రుసేన స్తంభితమగును.

సాయంకాలము, పశ్చిమాభిముఖముగా – అగ్నిని పూజించి, వరుణ మంత్రము 400సార్లు జపించిన, సమస్త బాధలు తొలగును. ఏ కష్టము ప్రాప్తించిననూ, వరుణ మంత్రముతో పశ్చిమాభిముఖముగా, శుద్ధజలముతో తర్పణ మిచ్చినచో బాధలు తొలగును. ఈ మంత్ర జపార్చన హోమము వలన సాధకుడు సమస్త అభీష్టములూ సిద్ధించుకొనవచ్చును.

## ప్రాణప్రతిష్ఠామంత్రము

సాధకుడు తన ఉపాస్యదైవమును, విగ్రహమునందు కాని, యంత్రమునందు కాని, అర్చించదలచిన, ముందు – అచట ప్రాణప్రతిష్ఠ చేయవలయును. ఇట్టి ముఖ్యమైన 66 అక్షరముల మంత్రము చెప్పబడు చున్నది.

**మనుః - ఆంహ్రీంక్రోం యంరంలంవం శంషంసం, హాం, సోఽహం అముష్యప్రాణా ఇహప్రాణాః, అముష్యజీవ ఇహ చ స్థితః, అముష్య సర్వేంద్రియాణి, వాంగ్మనః చక్షుః శ్రోత్రఘ్రాణ పాదప్రాణాః, ఇహాగత్య సుఖంచిరం తిష్ఠంతు స్వాహా ॥**

**అముష్య** అనుచోట, సాధ్యవ్యక్తి నామమును షష్ఠీవిభక్తిలో ప్రయోగించవలయును.

ప్రాణప్రతిష్ఠామంత్రస్య బ్రహ్మావిష్ణుశివో ఋషయః । ఋగ్యజుస్సామాని ఛందాంసి । చైతన్య స్వరూపో ప్రాణోదేవతా । ఆత్మా శక్తిః ।

## షడంగ న్యాసము

1. ఙం కం ఖం గం ఘం – ఆకాశవాయు వహ్నిసలిల భూమ్యాత్మనే నమః – హృదయాయ నమః
2. ఞంచంఛంజంఝం శబ్దస్పర్శ రూపరసగంధాత్మనే నమః – శిరసే స్వాహా
3. ణం టం ఠం డం ఢం శ్రోత్ర త్వక్ చక్షుర్ జిహ్వా ఘ్రాణాత్మనే నమః – శిఖాయైవషట్ ।

4. నం తం థం దం ధం వాక్పాణి పాదాపాయూపస్థాత్మనే నమః –
నేత్రత్రయాయ వౌషట్ ।

6. శం యం రం లం వం హం షం క్షం సం,
బుద్ధిమనోహంకార చిత్త జ్ఞానాత్మనే నమః – అస్త్రాయ ఫట్ ।

పిమ్మట, నాభినుండి పాదపర్యంతం ఆం బీజమును, హృదయము నుండి నాభిపర్యంతం హ్రీంబీజమును, శిరస్సునుండి హృదయ పర్యంతం క్రోం బీజమును న్యాసం చేయాలి.

హృదయము, మరియు ధాతువునందు యరలవశషస బీజములను న్యాసం చేయాలి. ప్రాణ జీవములను, హృదయమునందు న్యాసముచేసి, ప్రాణ జీవములందు హం సమంత్రము న్యాసం చేయాలి. పిమ్మట మూలమంత్రముతో వ్యాపకం చేయాలి. పిమ్మట ఇలా ధ్యానించాలి.

శ్లో॥ రక్తాబ్ధిపోతారుణ మధ్యసంస్థాం
పాశాంకుశా విక్షుశరాస బాణాన్ ।
శూలంకపాలం దధతీం కరాబ్జైః
రక్తాంత్రినేత్రాం ప్రణమామి దేవీమ్ ॥

ఈ ప్రకారము, ధ్యానించి, ఒక లక్ష జపంచేసి, ఘృతమిశ్రిత పాయసంతో ధ్యానించి, ఒక లక్ష జపంచేసి, ఘృతమిశ్రిత పాయసంతో దశాంశహోమం ఆచరించాలి.

షట్కోణయుక్త శక్తిపీఠమునందు పీఠార్చన చేయాలి.

శ్లో॥ అర్చయేత్ షట్సుకోణేషు బ్రహ్మాణం విష్ణుమీశ్వరం
వాణీం లక్ష్మీముమాంపశ్చాత్ షడంగాని ప్రపూజయేత్ ।
దళేషు మాతరః పూజ్యాస్తద్బాహ్యే లోకపాలకాః
ఏవం ప్రపూజయేద్దేవీం సుగంధికుసుమాదిభిః ।
ఇతి సంసాధితో మంత్రః షట్కర్మ ఫలదోభవేత్

స్థాపయేన్మనునాఽనేన ప్రాణాన్ సర్వత్ర దేశికః ।
బీజాంతేఽముష్య వబ్దానామాదౌ దూతీః ప్రపూజయేత్
మృతావైవస్వతో భూయో జీవహాప్రాణ హాతతః ।
ఆకృష్యాగ్రథనీ పశ్చాత్ ప్రమాదా విస్ఫులింగినీ
క్షేత్రజ్ఞ ప్రతి హార్యేతాః ప్రాణదూత్యో నవస్మృతాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - ఈ విధంగా సిద్ధిపొందిన సాధకుడు, ప్రాణప్రతిష్ఠను నిర్వహించుటకు సమర్ధుడగును. అముష్య శబ్దమున్నచోట ఆత్మయందును, యంత్రమునందు, మరియు పుత్తలీ ప్రయోగములో పుత్తలియందును ప్రాణప్రతిష్ఠ సమయములో దూతీ మంత్రము ప్రయోగించి, పిమ్మట ప్రాణప్రతిష్ఠ చేయాలి.

9మంది ప్రాణదూతికలు కలరు. 1. మృతా 2. వైవస్వతా 3. జీవహా 4. ప్రాణహా 4. ఆకృష్యా 6. గ్రథనీ 7. ప్రమాదా 8. విస్ఫులింగినీ 9. క్షేత్రజ్ఞ ప్రతిహారీ ।

ఈ దూతికలు శతృవును పాశముతో బంధించి వారిచేష్టలను స్తంభింప చేయును. పుత్తలీ ప్రయోగములో మృతాది నవదూతికలను పుత్తలి హృదయ కమలములో 8 దళములందు, యం రం లం శం షం సం హౌం అను బీజములతో, భృంగాకార రూపముతో, సాధ్య హృదయ కమల మధ్యమందును మొత్తం 9 దూతికలనూ, తన హృదయమందునూ ధ్యానించాలి.

అనగా తన హృదయమందు, సాధ్యహృదయమందు, పుత్తలీ హృదయమందు దూతికలను ధ్యానించాలి.

ఈ ప్రయోగవివరములు మూలమునందు చెప్పబడలేదు. సంస్కృత వ్యాఖ్యానములో "రాఘవభట్టు" వివరించెను. దానిని, సాధకుల సౌకర్యార్థము యధాతధముగా వ్రాయబడుచున్నది.

## తత్రప్రకారః

సాధ్యస్యశక్తిం పాశశక్తి తేజోంకుశ మహాభ్రమరకాల దండరూపేణ పంచధా నిస్సార్య, పాశబీజముచ్చరన్ సాధ్యంపాశేన గలే బధ్వా, శక్తిబీజ తేజసా తం స్వవశే, కృత్వాఽంకుశేనాఽకృష్య, అగ్రతః సంస్థాప్య, యాద్యష్టకముచ్చరన్, సాధ్యస్యత్వగాదీన్ వ్యాప్యాపక్రమ్య మహాభృంగేణ సాధ్యం కవలీకృత్య కాలదండ తాడనేన సుప్తంతం సంబోధ్య **క్షమితి** సపరివారమున్మీలీకృత్య **సమితి** స్వప్రాణశక్తిరూప మహాభ్రమరేణ, మేలయిత్వా – హంస ఇతి స్యైక్యం సంభావ్య హ్రీం – ఈం ఇతి వశ్యాదౌ జీవనాయ ప్లావనం కృత్వా, యం మృతే ఇత్యాదినా స్వమృతాం సంబోధ్య అముష్యమృతాత్మకాః ఇహప్రాణాః ఇత్యాదినా స్వమృతా ప్రాణానితరప్రాణైః సంయోజ్య **రమితి** సాధ్యమృతాతంతు ఛేదం విధాయ సకీటహృదయాయాం పుత్తల్యామాత్మనివా సాధ్యమృతప్రాణాన్ సంస్థాప్య **గ్లామితి** సంస్తభ్య తస్య మృతాజీవాదికమప్లేవమాన్యేత్ ।

యుగపదేవవా మృతాప్రాణాదీన్ స్థాపయేత్ । తతః స్వహృది చేత్– ఆంహ్రీం ఇత్యాది మయిప్రాణా ఇహ ప్రాణా, మయిజీవ ఇహస్థిత ఇత్యాదిరూపం । పుత్తల్యాంచేత్ – పుత్తల్యాం ప్రాణా ఇహప్రాణా, పుత్తల్యాం జీవ ఇహస్థిత ఇతి జపేత్ । ఇత్థంమృతాప్రతిష్ఠాక్రమః । ఏవం వైవస్వతాదిప్రాణా అపి స్థాపనీయాః । తతో యాదీన్ హోమాంతానుక్త్వా సాధ్యస్య ధాతూన్ జీవం చ సపరికరంపునః స్వమండలే, సంకోచితం కవలీకృత్య యాదీన్ దూతీంశ్చ స్వస్యసంబుధ్యంతాన్, సాధ్యస్య చాముష్య ప్రాణానిహాహర అముష్యప్రాణా ఇహ ప్రాణా ఇతి చోక్త్వా పునరపి అముష్య ధాతూనిహా హరేత్యాది వదేత్ । ఏవం జీవేఽపి । అయమేవ ప్రకారః పుత్తల్లామపి ।

ఆకృష్టానాం సాధ్య దేశాదసూనాం పుత్తల్యాదావపి అయంస్యాత్ ప్రకారః । పూర్వోక్తం కర్మ ఏకాదశావృత్తిం కుర్యాత్ ।

# మృతాది శక్తుల స్థానములు

సాధకుడు తన హృదయమందును, సాధ్య హృదయ మందును, పుత్తలి (బొమ్మ) హృదయమందునూ మృతాది 9 శక్తులను ఇలా ఆయా స్థానములలో న్యాసం చేయాలి.

హృదయకమలము యొక్క దళములందు వాయు – అగ్ని – ఇంద్ర – వరుణ దేవతలను (యం – రం – లం – వం) పిమ్మట ఈశ్వర – రాక్షస – చంద్ర – యములను (శం – షం – సం – హం) "సోఽహం" మంత్రముతో జోడించి, హృదయకమల మధ్యమ స్థానములో యం రం లం వం శం షం సం – హం – హోమ్ అని భృంగ రూపముగా ధ్యానించాలి.

ఇలా తన హృదయమందు యకారాది బీజమంత్రములను శిరస్సు నందుండు బిందువుతో కలిపి తంతువులతో (దారములతో) కట్టిన భృంగమును భావించాలి. పిమ్మట తన హృదయ కమలమందుండు భృంగములను, ఒక్కొక్క దానినీ, శ్వాసమార్గముచే బయటకు తీసుకొనివచ్చి, శతృహృదయ కమలమునందున్న భృంగమును కూడా బయటకు తీసుకువచ్చి, పుత్తలియందు స్థాపించినట్లు భావించి ఆచరించాలి. లేదా తన చిత్తమునందునూ స్థాపించవచ్చు.

పిమ్మట రం బీజముచ్చరించుచూ, తంతువులను దహించాలి. సాధ్య హృదయమునుండి బయటకు వచ్చిన భృంగములను గ్లౌం బీజముతో స్తంభనం చేయాలి. ఇలా 11 సార్లు ఆచరించాలి.

వశ్యాకర్షణములందు, యకారాదివర్ణములను ఎర్రని రంగులో నున్నట్లు భావించాలి. మోహన – విద్వేషణ కర్మలందు ధూమ్రవర్ణముగాను

(బూడిదరంగు) మారణకర్మలో నల్లరంగుగాను, స్తంభనకర్మలో పసుపు రంగుగాను ఆ బీజములను ధ్యానించాలి.

సాధ్యవ్యక్తి ప్రాణాకర్షణ చేయునపుడు అతని హృదయ కమలము నుండి తీసిన ప్రాణములను, తన హృదయమందు స్థాపించాలి. మారణ కర్మ చేయునపుడు మాత్రము, అతని ప్రాణములు పుత్తలియందు స్థాపించాలి.

క్రూరకర్మయందు తంత్రసాధకుడు, సాధ్యప్రాణములను కప్ప రూపముగాను, తన ప్రాణములను సర్పరూపముగాను భావించాలి.

## ప్రాణప్రతిష్ఠా యంత్రము

శ్లో॥ వాయ్వగ్ని శక్ర వరుణేశ్వర రాక్షసేందు
ప్రేతేశపత్ర లిఖితైరథ యాదివర్ణైః ।
బింద్వంతికైః క్షగతహంస సమేత సాధ్యం
ప్రాణాత్మయంత్రమథ వర్ణవృతం ధరాస్థమ్ ॥
ఇత్థం ప్రయోగ కుశలో మనునాఽనేన మంత్రవిత్
వశయేత్సకలాన్ దేవాన్ కింపునః పార్థివాన్ జనాన్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అష్టదళ పద్మము లిఖించాలి. ఆ దళములందు క్రమముగా వాయు – అగ్ని – ఇంద్ర – వరుణ – ఈశ్వర – రాక్షస – చంద్ర – యములను వారివారి బీజాక్షరములతో లిఖించాలి. మధ్యలో "క్షం సోఽహం"ను సాధ్య నామముతో లిఖించాలి. పిమ్మట భూపురము లిఖించాలి. ఇదే ప్రాణాత్మ యంత్రము. ఈ మంత్రముచే సమస్త దేవతలూ వశమగుదురు. ఇక మహారాజుల గూర్చి చెప్పవలసిన దేమున్నది.

# ముద్రాప్రకరణం

శ్లో॥ ఆవాహన్యాదికా ముద్రాః ప్రవక్ష్యామి యథాక్రమం
యాభిర్వీర చితాభిస్తు మోదంతే సర్వ దేవతాః ।
సమ్యక్ సంపూరితః పుష్పైః కరాభ్యాంకల్పితోంజలిః
ఆవాహినీ సమాఖ్యాతా ముద్రాదేశిక సత్తమైః ।
అధోముగ కృతాసైవ ప్రోక్తా స్థాపన కర్మణి
ఆశ్లిష్టముష్టిఉగళా ప్రోన్నతాంగుష్టయుగ్మకా ।
సన్నిధానే సముద్దిష్టా ముద్రేయం తంత్రవేదిభిః
అంగుష్ఠ గర్భిణీసైవ సన్నిరోధే సమీరితా ।
ఉత్తానౌ ద్వౌ కృతా ముష్టీ సమ్ముఖీ కరణౌ స్మృతా
దేవతాంగే షండంగానాం న్యాసఃస్యాత్ సకలీకృతః ।
సవ్యహస్త కృతా ముష్టిర్ దీర్ఘాధోముఖతర్జనీ
అవగుంఠన ముద్రేయమభితో భ్రామితా సతీ ।
అన్యోన్యా భి ముఖాశ్లిష్టా కనిష్ఠానామికాపునః
తథా చ తర్జనీ మధ్యా ధేనుముద్రా సమీరితా ।
అమృతీకరణం కుర్యాత్త యాదేశిక సత్తమః ॥

**సంపత్కారి తెలుగు వ్యాఖ్యానం** - ఈ ఆవాహనాది ఆరు ముద్రలచే, దేవత శీఘ్రముగా ప్రసన్నమగును. ఆవాహనాముద్రలో అంజలి నిండుగా పూలు ధరించి ముద్ర ప్రదర్శించవలయును. శూన్యాంజలి ప్రదర్శించరాదు. దేవతయొక్క అంగమునందు షడంగన్యాసము చేయుటయే సకలీకరణమనబడును.

రెండు చేతులూ జోడించి పరస్పరం కుడికనిష్ఠికతో ఎడమ అనామిక, ఎడమకనిష్ఠికతో కూడి అనామిక అలాగే కుడి తర్జనీతో ఎడమ ధ్యమం

ఎడమ తర్జనితో కుడి మధ్యమం స్పృశించుచూ, అంగుష్ఠములు రెండూ తాకుటయే "ధేనుముద్ర" అనబడును.

ఈ ముద్రలచే నైవేద్యము చేయు పదార్థము, అమృతీకరణము చేయబడును.



ఆవాహనీ ముద్ర

**1. ఆవాహనీ ముద్ర** – రెండు అరచేతులూ ప్రక్క ప్రక్కనుంచి, అంగుష్ఠముల కొనను అరచేతిమధ్యలో నుంచిన ఆవాహన ముద్ర ఏర్పడును. ఇది దేవతను ఆహ్వానించునపుడు ముందుగా ప్రదర్శించ వలయును.

**2. సంస్థాపినీ ముద్ర** – రెండు చేతులూ పిడికిలి బిగించి ప్రక్క ప్రక్కనే నుంచి, రెండు అంగుష్ఠములను నిలువుగా పైకి చాపవలయును. దీనినే 'సన్నిధాపనీ ముద్ర' అందురు. ఇది దేవతా ప్రతిష్ఠా సూచకము.



సంస్థాపినీ ముద్ర



సన్నిధాపనీ ముద్ర

**3. సన్నిధాపనీ ముద్ర** – రెండు చేతులూ పిడికి బిగించి ప్రక్క ప్రక్కనే నుంచి, రెండు అంగుష్ఠములను నిలువుగా పైకి చాపవలయును. దీనినే 'సన్నిధాపనీ ముద్ర" అందురు ఇది దేవతా ప్రతిష్ఠా సూచకము


సన్నిరోధినీ ముద్ర

**4. సన్నిరోధినీ ముద్ర** - రెండు చేతులూ పిడికిలి బిగించి, ప్రక్క ప్రక్కనే యుంచి, రెండు అంగుష్ఠములను లోపలికి మడచవలెను. ఇది ఏకాగ్రత సూచకమగును.

**5. సమ్ముఖీకరణ ముద్ర** - సన్నిరోధినీ ముద్రవలె పట్టి పిడికిళ్లను ఎదురుగా అభిముఖముగా చూపవలయును. ఇది దేవతా సాన్నిధ్యమును దృఢపరచును.


సమ్ముఖీకరణ ముద్ర


అవగుంఠనీ ముద్ర

**6. అవగుంఠనీ ముద్ర** - నమస్కార ముద్రవలె చేతులు జోడించి రెండు కనిష్ఠిక - అనామిక - మధ్య వేళ్లను లోపలికి మడచవలయును.

## అర్థమాలా ప్రకరణమ్

శ్లో॥ ఆదిక్షాంతార్ణ యోగిత్వా దక్ష మాలేతి కీర్తితా
తద్వర్ణసంఖ్యై ర్మణి భిర్జపమాలాం ప్రకల్పయేత్ ।
రుద్రాక్షమాలికాసూతే జపేన్ స్వమనోరథాన్
పద్మాక్షై ర్విహితామాలా శత్రూణాం నాశినీ మతా ।
కుశగ్రంథి మయీమాలా సర్వపాప వినాశినీ
పుత్రజీవఫలైః క్లుప్తా కురుతే పుత్ర సంపదమ్ ।

నిర్మితా రౌప్యమణి భిర్జపమాలేప్సిత ప్రదా
హిరణ్మయైర్విరచితా మాలా కామాన్ ప్రయచ్ఛతి ।
ప్రవాళై ర్విహితామాలా ప్రయచ్ఛేత్ పుష్కలంధనం
సౌభాగ్యం స్ఫాటికీమాలా మౌక్తికైర్విహితాశ్రియమ్ ।
నిర్మితా శంఖ మణిభిః కురుతే కీర్తిమవ్యయాం
సర్వై రేతైర్విరచితా మాలాస్యాన్ముక్తయేనృణామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - అకారాది క్షకారాంత వర్ణముల యోగము (కలయిక)చే "అక్షమాల" అనబడుచున్నది. మాల అనగా సమూహమని అర్థము. అక్షరములెన్నియో, అన్ని పూసలతో జపమాల యుండవలయును. అనగా 50 పూసలు జపమాలలో ఉండ వలయును. ఒకటి "మేరుపూస" పెద్దదిగా యుండవలయును.

రుద్రాక్షమాలతో జపము చేసిన సర్వసిద్ధులూ కలుగును. తామరపూసల మాల - శత్రునాశనం, కుశగ్రంధిమాల - పాపనాశనం, పుత్రజీవ మాల - సంతానప్రాప్తి, వెండిపూసలమాల - ఇష్టసిద్ధి, బంగారుపూసలమాల - ఇష్టసిద్ధి, పగడమాల - సంపదప్రాప్తి, స్ఫటికమాల - సౌభాగ్యసిద్ధి, ముత్యాలమాల - శ్రేయస్సు, సంపద, శంఖమణిమాల - కీర్తిప్రదం, అన్ని రకముల పూసలతో చేసిన మాల ముక్తినిచ్చును.

## అథ షట్కర్మ ప్రకరణం

శ్లో॥ అథాఽభిధాస్యే తంత్రేఽస్మిన్ సమ్యక్ షట్ కర్మ లక్షణం
సర్వతంత్రానుసారేణ ప్రయోగ ఫలసిద్ధిదమ్ ।
శాంతివశ్య స్తంభనాని విద్వేషోచ్చాటనే తతః

మారణాంతానిశంసంతి షట్కర్మాణి మనీషిణః ।
రోగకృత్యాగ్రహాదీనాం నిరాసః శాంతిరీరితా
వశ్యంజనానాం సర్వేషాం విధేయత్వముదీరితమ్ ।
ప్రవృత్తిరోధః సర్వేషాం విధేయత్వముదీరితమ్ ।
ప్రవృత్తిరోధః సర్వేషాం స్తంభనం సముదాహృతం
స్నిగ్ధానాం ద్వేషజననం మిథో విద్వేషణం మతమ్ ।
ఉచ్చాటనం స్వదేశాదేర్ భ్రంశనం పరికీర్తితం
ప్రాణినాం ప్రాణహరణం మారణం సముదాహృతమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కర్మల లక్షణములు చెప్పబడుచున్నవి. 1. శాంతి - రోగబాధ, గ్రహబాధ, ఇతరులు చేసిన ప్రయోగములు త్రిప్పి కొట్టుట శాంతికర్మ అనబడును. 2. తాను చెప్పినట్లు ఎదుటివ్యక్తి వినునట్లు చేయుట వశ్యకర్మ అనబడును.

3. అన్నిరకముల ప్రవృత్తులను నిరోధించుట స్తంభనమనబడును. 4. ఇద్దరిమధ్యనున్న స్నేహమును, ప్రేమభావమును చెడకొట్టుట విద్వేషణ కర్మ 5. తానున్న ఊరు వదలి వెళ్ళిపోవునట్లు చేయుట ఉచ్చాటన కర్మ 6. ప్రాణము పోవునట్లు చేయుట మారణ కర్మ.

శ్లో॥ స్వదేవతాది కాలాదీన్ జ్ఞాత్వాకర్మాణి సాధయేత్
రతిర్వాణీ రమాజ్యేష్ఠా దుర్గాకాళీ యథాక్రమమ్ ।
షట్కర్మదేవతాః ప్రోక్తాః కర్మాదాతాః ప్రపూజయేత్
ఈశ చంద్రేంద్ర నిఋతి వాయ్వగ్నీనాం దిశోమతాః ।
సూర్యోదయం సమారభ్య ఘటికాదశకం క్రమాత్
ఋతవఃస్యుర్వసంతా ద్యా అహోరాత్రం దినే దినే ।
వసంత గ్రీష్మ వర్షాఖ్య శరద్ధేమంత శైశిరాః

హేమంతః శాంతికే ప్రోక్తో వసంతో వశ్యకర్మణి ।
శిశిరః స్తంభనేజ్ఞేయో విద్వేషే గ్రీష్మ ఈరితః
ప్రావృడు చ్చాటనే జ్ఞేయో శరన్మారణ కర్మణి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - మంత్రదేవత - కాలము - బాగుగా తెలుసుకొని కర్మ ప్రారంభించవలయును. శాంతికర్మకు దేవత రతి - వశ్యకర్మకు వాణి - స్తంభనకు రమ - విద్వేషణకు జ్యేష్ఠా - ఉచ్ఛాటనకు దుర్గ - మారణమునకు మహాకాళి దేవతలు. వీరిని ఆయా పనులకు ముందుగా పూజించాలి.

షటకర్మలకు వరుసగా ఈ దిశలు శ్రేష్ఠము. ఈశాన్యము - ఉత్తరము - తూర్పు - నైఋతి - వాయవ్యము - ఆగ్నేయము సూర్యోదయమునుండి పదేసి ఘడియలకాలము (4 గంటలు) శాంత్యాది కర్మలు ఆచరించుటకు తగిన కాలము.

ఇక ఋతువులలో శాంతికర్మకు హేమంత ఋతువు - వశీకరణమునకు వసంతము - స్తంభనకు శిశిరము - విద్వేషణకు గ్రీష్మము - ఉచ్చాటనకు వర్షఋతువు - మారణమునకు శరద్ ఋతువు శ్రేష్ఠములు.

## ఆసనములు

శ్లో॥ పద్మాఖ్యం స్వస్తికంభూయో వికటంకుక్కుటం పునః
వజ్రం భద్రకమిత్యాహు రాసనాని మనీషిణః ।
షణ్ముద్రాః క్రమతో జ్ఞేయాః పద్మపాశగదాహ్వయాః
ముసలాశని ఖడ్గాఖ్యాః శాంతికాదిషు కర్మసు ।
జలంశాంతి విధౌ శస్తం వశ్యేవహ్ని రుదాహృతః
స్తంభనే పృథివీ శస్తా విద్వేషే వ్యోమకీర్తితమ్ ।
ఉచ్చాటనే స్మృతో వాయుర్భూయాஉగ్నిర్మారణే మతః

తత్తద్ భూతోదయే సమ్యక్ తత్తన్మండలసంయుతమ్
తత్తత్కర్మ విధాతవ్యం మంత్రిణా నిశితాత్మనా
శీతాంశు సలిలక్షోణీ వ్యోమవాయు హవిర్భుజామ్ ।
వర్ణాస్యుర్మంత్ర బీజాని షట్ కర్మసుయథాక్రమమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - శాంత్యాది షట్‌కర్మలూ క్రమముగా, ఈ ఆసనములో కూర్చుండి సాధించవలయును. పద్మ - స్వస్తిక - వికట - కక్కుట - వజ్ర - భద్రక ఆసనములు.

శాంత్యాది షట్‌కర్మలకూ క్రమముగా ఈ హస్తముద్ర ధరించ వలయును. పద్మ - పాశ - గదా - ముసల - వజ్ర - ఖడ్గ ముద్రలు. శాంతికర్మయందు జలము ఉపయోగించుట ప్రశస్తము. వశ్యమందు అగ్ని - స్తంభనయందు మట్టి - విద్వేషణయందు ఆకాశము - ఉచ్చాటనయందు వాయువు - మారణమందు అగ్నిమండలము ప్రశస్తములు.

ఆయా భూతోదయ కాలములందు, ఆయా మండలములందు వాటిని ఆచరించాలి. 16 అచ్చులు "స" కారము ఠకారము చంద్రుని వర్ణములు ఇవి శాంతి కర్మకు ఉపయోగపడును. వశ్యమునకు వం, స్తంభనకు లం, విద్వేషణకు, హం - ఉచ్చాటనకు యం, మారణమునకు 'రం' ఉపయోగపడును.

**"కులప్రకాశ తంత్రము"** నందు, ముద్రలను గూర్చి ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ తిస్రోముద్రాః స్మృతాహోమే మృగహంసీ చ శూకరీ
శూకరీ కరసంకోచీ హంసీముక్త కనిష్ఠికా ।
మృగీ కనిష్ఠ తర్జన్యౌ ముక్తౌ ముద్రాత్రయం మతం
యజ్ఞే శాంతిక కార్యేషు మృగీ హంసీప్రకీర్తితా ।

అభిచారక కార్యేషు శూకరీతు ప్రకీర్తితా

ఆసనములను గూర్చి **మరొక** తంత్రములో ఇట్లున్నది.

☞ **స్తంభనే గజచర్మస్యాత్ మారణే మాహిషం తథా**
**మేష చర్మ తథోచ్చాటే ఖడ్గజం వశ్యకర్మణి ।**
**విద్వేషే జంబుక స్యోక్తం గోచర్మ శాంతికేతథా**
**వ్యాఘ్రు చర్మాసనం ప్రోక్తం సర్వసిద్ధి ప్రవర్తకమ్ ॥**

హోమద్రవ్య విశేషములను గూర్చి **"మహాశూరోత్తరము"** నందు ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ దూర్వా భవ్యాశ్చ సమిధో గోఘృతేన సమన్వితాః
హోతవ్యాః శాంతికేదేవి శాంతిర్యేన భవేత్ స్ఫుటమ్ ।
సమిధో రాజవృక్షోత్థా హోతవ్యాః స్తంభకర్మణి
మేషీఘృతేన సంయుక్తాః స్తంభసిద్ధిర్భవేత్ ధృవమ్ ।
ఖాదిరామరణే ప్రోక్తాః కటుతైలేన సంయుతాః
హోతవ్యాః సాధకేంద్రేణ మారణం యేన సిధ్యతి ।
ఉచ్చాటనే చూతజాతాః కటుతైలేన సంయుతాః
ఉచ్చాటయే న్మహీం సర్వం సశైలవనకాననమ్ ।
వశ్యేచైవ సదాహోమః కుసుమైర్ద్రాడిమోద్భవైః
అజాఘృతేన దేవేశి వశయేత్ సచరాచరమ్ ।
విద్యేషే చైవ హోతవ్యా ఉన్మత్త సమిధో మతాః
అతసీతైల సంయుక్తా విద్వేషణ కరంపరమ్ ।

**"సోమశంభు పద్ధతి"** అను గ్రంథమునందు, అగ్నిముఖములు, దిశావైశిష్ట్యము ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ కుండంభాను ముఖం ధ్యాత్వా హృదాహుతిభిరీప్సితం
పశ్చిమే శిష్య సంస్కార నిత్య హోమౌ సమాచరేత్ ।

వశ్యాకర్షణ సౌభాగ్య పుష్టి భాగ్యాధిరోపణే
శాంతికేపాప శుద్ధే చ వామే హోమః ప్రశస్యతే ।
గుటికాంజన నిస్త్రింశ పాదలేప జిగీషయా
శోష్య సంజననార్థంచ ప్రాచీన వదనే యజేత్ ।
మారణోచ్చాటన ద్వేష స్తంభనార్థం చ దక్షిణే
ప్రాయశ్చిత్తంతు తత్రైవ పశ్చిమేతు విముక్తయే ॥

బ్రాహ్మణభోజనం గూర్చి హోమాంతమునందు చేయు విధిని ప్రత్యేకముగా ఇట్లు తెలుపబడినది.

శ్లో॥ శాంతికే పౌష్టికేవాపి వశీకరణ కర్మణి
హుతసంఖ్యా దశాంశం స్యాదుత్తమం ద్విజభోజనమ్ ।
తత్వసంఖ్యం మతం మధ్యం శతాంశ మధమం మతం
ఉక్త ద్విగుణ మానంస్యాత్ స్తంభనే విప్రభోజనమ్ ।
త్రిగుణం సాదనోచ్చాటే ద్వేషణేతు ప్రకీర్తితం
హుతసంఖ్యా సమానం స్యా దపి మారణ కర్మణి ।
హుతావసానే విప్రేంద్రా నతి శుద్ధ కులోద్భవాన్
భోజయేత్ సాంగవేదజ్ఞాన్ స్వాదుభిర్భోజ్యవస్తుభిః ।
వితంతం చ యధాశీభిర భీష్ట ఫలదం భవేత్ ।

ప్రయోగములు ఆచరించినపుడు, ఇవ్వవలసిన బ్రాహ్మణ దక్షిణలను గూర్చి, ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ పంచవింశ సువర్ణాని దద్యాత్ వశ్యేవిచక్షణః
స్తంభనేత్రింశన్మానం స్యాదుచ్చాటేషష్టిహాటకమ్ ।
విద్వేషే పంచపంచాశన్మారణే తు శతాధికం
అష్టౌ దద్యాత్ ద్విజేంద్రాణాం క్షేత్రాదీనాం విశేషతః ।

# షట్కర్మ విన్యాసములు

శ్లో॥ గ్రథనం చ విదర్భ శ్చ సంపుటో రోధనం తథా
యోగః పల్లన ఇత్యేతే విన్యాసాః షట్సు కర్మసు ।
మంత్రార్ణాంతరితాన్ కుర్యాన్నామ వర్ణాన్ యథావిధి
గ్రథనం తద్విజానీయాత్ ప్రశస్తం శాంతి కర్మణి ।
మంత్రార్ణ ద్వంద్వ మధ్యస్థం సాధ్యనామాక్షరం లిఖేత్
విదర్భ ఏష విజ్ఞేయో మంత్రిభిర్వశ్యకర్మణి ।
ఆదావంతే చ మంత్రః స్యా న్నామ్నోఽసౌ సంపుటంమతం
ఏష సంస్తంభనే శస్త ఇత్యుక్తో మంత్రవేదిభిః ।
నామ్న ఆద్యంత మధ్యేషు మంత్రఃస్యాద్రోధనం మతమ్
విద్వేషణ విధానేషు ప్రశస్తమిద మీరితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కర్మలయందు, మంత్రముతో చేయవలసిన విన్యాసములు వివరింపబడుచున్నవి. 1. శాంతికర్మ యందు గ్రథనం చేయవలయును. అనగా మూలమంత్రములోని ఒక్కొక్క అక్షరము పిమ్మట, సాధ్యవ్యక్తి యొక్క పేరులోని ఒక్కొక్క అక్షరము ఉంచి, పిమ్మట మొత్తం మంత్రము, ఆపై సాధ్యవ్యక్తి పేరు వ్రాయుట, లేదా జపించుట "గ్రథన" మనబడును.

2. వశ్యకర్మయందు "విదర్భ" చేయవలయును. అనగా రెండేసి మంత్రాక్షరముల మధ్య, సాధ్యవ్యక్తి యొక్క ఒక్కొక్క అక్షరము చేర్చుట 3. స్తంభన కర్మయందు సంపుటము చేయవలయును, అనగా - సాధ్యవ్యక్తి నామమునకు ముందు - వెనుకలందు మొత్తం మంత్రమును చేర్చుట, 4. విద్వేషణ కర్మయందు "రోధన" చేయవలయును. అనగా, సాధ్యనామమునకు, ఆది - మధ్య - అంతములందు మంత్రమును చేర్చుట,

శ్లో॥ మంత్రస్యాంఽతే భవేన్నామ యోగః ప్రోచ్చాటనే మతః
అంతే నామ్నో భవేన్మంత్రః పల్లవో మారణేమతః ।
సితరక్త పీత మిశ్రకృష్ణ ధూమ్రాః ప్రకీర్తితాః
వర్ణతో మంత్రసంప్రోక్తా దేవతాః షట్సు కర్మసు ।
మంత్రాణాం లేఖన ద్రవ్యం చందనం రోచనా నిశా
గృహధూమ చింతాగారౌ మారణేఽష్ట విషాణి చ ।
శ్యేనాగ్నిలోణ పిండాని ధత్తూరక రసంతతః
గృహధూమస్త్రి కటుకం విషాష్టక ముదాహృతమ్ ।
దేవతా కాలముద్రాదీన్ సమ్యక్ జ్ఞాత్వా విచక్షణః
షట్కర్మాణి ప్రయుంజీత యథోక్త ఫలసిద్ధయే ।

**సంపత్కారీ తెలుగు వ్యాఖ్యానం** - 5. ఉచ్చాటన కర్మయందు, "విన్యాసము" చేయవలయును. అనగా, మంత్రము చివర సాధ్యానామము చేర్చుట, 6. మారణకర్మయందు "పల్లవ" విన్యాసము చేయవలయును. అనగా - సాధ్యానామము చివర మంత్రము చేర్చుట. మంత్ర దేవతలు షట్ కర్మలయందు క్రమముగా, శ్వేత - రక్త - పీత - మిశ్రిత - నలుపు (కృష్ణ) - ధూమ్ర వర్ణములుగా ధ్యానించవలయును.

యంత్రలేఖణమందు - చందనం, గోరోచనం, పసుపు, పొయ్యినుసి, చిత్రాంగారము, విషాష్టకము ఉపయోగించవలయును. **విషాష్టక**మనగా **1.**గ్రద్ధమలము **2.**చిత్రమూలము **3.**లవణము **4.**ఉమ్మెత్త రసము **5.**ఇంటి పొయ్యిలోని నుసి **6.** శొంఠి **7.**మిరియాలు **8.**పిప్పళ్లు.

సాధకుడు షట్కర్మలు సాధించునపుడు, దేవతా - కాలము - ముద్ర - ద్రవ్యము మొదలగు బాగుగా, తెలుసుకొని, పైన చెప్పినవి సరిచూచుకొని ప్రయోగించవలయును.

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*త్రయోవింశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ చతుర్వింశః పటలః

## అథ యంత్ర ప్రకరణం

శ్లో॥ అథ వక్ష్యామి యంత్రాణాం భేదాం స్తంత్రేషుగోపితాన్
యైః సాధయంతి సతతం మంత్రిణో నిజవాంఛితమ్ ।
మార్ణేలిఖస్త్రుత్ సార్ణయుతం స్వసాధ్యం
వర్గాఢ్యపత్రే స్వరకేశరేఽబ్జే
బహిఃసదీర్ఘైర్గగనైః ప్రవీతం
రక్షాకరం యంత్రమిదం ప్రశస్తమ్ ॥
పుటీకృతే భూమిపురస్యయుగ్మే
మాయాం లిఖేత్ మధ్యగ సాధ్యయుక్తామ్ ।
వకారకోణేన మహీపురేణ
సంవేష్టితం వశ్యకరం తదుచ్చైః ॥
మధ్యేసార్ణవిదర్భితం ప్రపుటితం మృత్యుంజయం త్రక్షరైః
క్షాంతః స్థం నిజసాధ్యనామ విలిఖేత్ కింజల్క సంస్థాన్ స్వరాన్ ।
పత్రేష్వష్టసు నామ మంత్రపుటితం వర్గాన్ తదగ్రేష్వధో
యంత్ర పద్మ పుటీకృతం నిగదితం మృత్యుంజయాఖ్యంపరమ్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - తంత్రశాస్త్రమునందు గుప్తముగా నున్న, కొన్ని యంత్రములు చెప్పబడుచున్నవి. రక్షాయంత్రము వివరింపబడుచున్నది. అష్టదళ కమలము లిఖించి, మధ్యలో రెండు మకారముల మధ్య "సం" బీజముతో కూడిన సాధ్యనామ, కర్మ ద్వితీయా

విభక్తితోనూ, సాధకుని పేరు షష్ఠీవిభక్తితోనూ, వ్రాసి - కురుశబ్దము లిఖించాలి.

అష్టదళములందు క - చ - ట - త - ప - య - శ - ల వర్గులు (లవర్గు అనగా ల - హ - క్ష - త్ర - జ్ఞ) లిఖించాలి. కేసరము లందు రెండేసి అచ్చులను, దానికి బయట నాలుగు దిశల "హోం" అని లిఖించి వేష్టితం చేయాలి.

పిమ్మట, దీనికి ప్రాణప్రతిష్ఠ చేసి - పూజచేసి ధరించిన - సర్వరక్షాకరముగా నుండును.

## వశ్యయంత్రము

ముందుగా ఒక చతురస్రము లిఖించి, దానిలో ఆ రేఖలను తాకుతూ మరొక చతురస్రము, దాని మధ్య అలాగే మరొక చతురస్రమూ లిఖించాలి. మధ్యలో "సం" బీజముతో - ద్వితీయాయుక్త సాధ్యనామము, సాధ్యకర్మ, షష్ఠ్యంత సాధకనామమూ, చివరగా "కురుహ్రీం" లిఖించాలి. సమస్త కోణములందూ "వ" లిఖించి వేష్టితం చేయాలి. ప్రాణప్రతిష్ఠ - పూజ పూర్వమువలెనే, ఆచరించి ధరించవలయును.



## మృత్యుంజయ యంత్రము

అష్టదళ కమలము లిఖించి, మధ్యలో రెండు క్షకారముల మధ్య సకారముతో "విదర్భితం" చేసిన మృత్యుంజయ మంత్రములోని మూడేసి అక్షరములతో పుటితం చేసిన సాధ్యనామ - కర్మ - సాధక నామములు - **కురు** లిఖించాలి.

కేశరములందు రెండేసి అచ్చులు, అష్టదళములందు మృత్యుంజయ మంత్రముతో సంపుటతము చేసిన సాధ్యనామమును మరల లిఖించాలి. అష్టదళ అగ్రభాగమునందు, క - చ - ట - త - ప - య - శ - హ వర్గలు లిఖించాలి.

ఈ యంత్రము, రోగబాధలను, అపమృత్యు భయమును తొలగించి సుఖము నిచ్చును. వశీకరణమునకు కూడా ప్రయోగించవచ్చును.

## గ్రహజ్వర యంత్రం

శ్లో॥ సాధ్యాధ్య చింతామణి మగ్నిగేహే
విలిఖ్యబాహ్యేఽనలగేహవీతమ్ ।
ప్రవేష్టయేత్ తత్ బహిరష్ట వర్ణ
మంత్రేణ యంత్రం జ్వరశాంతిదం స్యాత్
సంప్లవసః ప్లావయసో మంత్రోఽష్టాక్షర ఈరితః ।
ఏషఏవ భవేద్దక్షో గ్రహజ్వర వినాశనే ॥
తారఠ ద్వయపుటం కురుకుల్లే యంత్ర యత్ర హుభుగ్ గృహయుగ్మే
మధ్యకోణ వివరేషు లిఖేత్ తద్యంత్ర మాశు వినిహంతి భుజంగాన్।
ఓంకార మాయాదికమేఖలేఽగ్ని వధూమనుం వహ్ని గృహస్యయుగ్మే

మధ్యాది కోణేషు విలిఖ్య భూర్జేయంత్రం విదధ్యాత్‌రి పునాగహారి॥
శూలాంకితే వహ్నిగృహస్య యుగ్మే ధూమావతీమంత్రం లిఖేత్ క్రమేణ
మధ్యాదికోణేషు కురుద్ గృహస్థం యంత్రహుతాశానలవర్ణలీతమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఇపుడు త్రికోణము లిఖించి మధ్యలో, సాధ్యనామ, కర్మ, సాధక నామంతో బాటు "శివ చింతామణి" బీజ లిఖించాలి. పిమ్మట ఆ త్రికోణముపై మరొక త్రికోణము లిఖించి దానికి వెలుపల ఈ అష్టాక్షరమంత్రం లిఖించి వేషిటతం చేయాలి.

అష్టాక్షర మంత్రము – సంప్లవః ప్లావయసో ।

## సర్పనాశన యంత్రము

షట్‌కోణమధ్యమందు ఓం లిఖించి, ఆరు కోణములందూ 'కురుకుళ్లే స్వాహా" లిఖించి, దానిని అర్చించి ధరించిన సర్పబాధ నివారణమగును. దీనిఇ పాముల బోరియలలో నుంచిన పాములు అచటనుండి వెడలిపోవును.

భూర్జపత్రమునందు షట్‌కోణము లిఖించి, మధ్యలో ఓం లిఖించి, ఆరుకోణములందూ "హ్రీం మేఖలే స్వాహా" అని పసుపు – గోరోచనంతో లిఖించి, అర్చనానంతరం ధరించిన శతృబాధ – సర్పబాధ నివారణ మగును. పాములుండుచోట ఇది ఉంచిన, అవి అచటినుండి వెడలిపోవును.

## ఉచ్చాటన యంత్రము

త్రిశూలయుక్త షట్కోణ మధ్యలో 'ధూంధూం' లిఖించి, ఆరుకోణము లందూ ఊర్ధ్వాగ్రక్రమముగా "ధూమావత్యై స్వాహా" అని లిఖించి, ఆపై వృత్తము లిఖించి, రూం రం బీజములు లిఖించి వేష్టితం చేయాలి.

అయితే ఈ యంత్రమును, ప్రేతవస్త్రముపై, ఉమ్మెత్తరసముతో లిఖించి, శ్మశానమునందు పాతిపెట్టిన శీఘ్రమే సాధ్యవ్యక్తికి ఉచ్చాటన మగును.

<u>**"ధూమావతీ కల్పము"**</u> నందు, ధూమావతీ ధ్యానము ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ కాకారూఢాఽతి కృష్ణా ప్రవిరళదశనా ముక్తకేశీ విరక్తా
ధూమ్రాక్షీ క్షుత్ తృషార్తా ప్రతిభట చకితా చంచలాకామలోలా ।
హృష్టా పుష్టాలసాంగీ శ్రమ జలమలినా వ్యక్తదర్వా విరూపా
భూతింధూమావతీ వః ప్రదిశతు విపులాం ధూతసూర్పాగ్ర హస్తా॥

**మనుః – ధూ ధూం ధూమావతీ స్వాహా**

అస్యశ్రీ ధూమావతీ మంత్రస్య పిప్పలాదో ఋషిః । నివృచ్ఛందః । జ్యేష్ఠాదేవతా । శతృనిగ్రహే వినియోగః । ధూమావతీ స్వాహా అను ఆరు అక్షరములతో షడంగన్యాసమాచరించాలి.

## భూతఘ్న యంత్రము

శ్లో॥ హుతాశ గేహ ద్వితయం లిఖిత్వా
వైవస్వతాయ ద్విఠవర్ణమంత్రమ్ ।
మధ్యాంత మాకల్పిత మిందు బింబే
యంత్రం మహాభూత పిశాచవైరి ॥
నామాలిఖ్య మకారకోష్ఠయుగళే
కోణేషు తస్యా లిఖేత్ ।
మంత్రజ్ఞో ఙఞణాన్నకార
సహితాన్ ధూమావతీ మంత్రగాన్ ।

పీతం ఘుర్మ్రటికాదినా పరమిదం వాయుత్రిగేహావృతం
యంత్రం ప్రాణంపరేతభూమి నిహితం విద్వేషణం స్యాద్ ద్విషామ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - షట్కోణము లిఖించి, మధ్యలో "వై"ని ఆరుకోణములందూ "వస్వాతాయ స్వాహా" అని లిఖించి దానిపై వృత్తము లిఖించాలి. దీనిని అర్చించి ధరించిన భూత - ప్రేత - - పిశాచములు తొలగిపోవును.

## విద్వేషణ యంత్రము

వృత్తము, చతురస్రము లిఖించి, ఒకదానిలో సాధ్యనామ - రెండవ దానిలో సాధకనామం లిఖించాలి. చతురస్రకోణములందు ఈశాన్య కోణారంభముగా నాలుగు కోణములందూ "జం - ఞం - ణం - నం" అను అక్షరములు ధూమావతీ మంత్రముతో లిఖించాలి. ఆపై అష్టదళ పద్మం లిఖించి, మధ్యలో 'య' కారము లిఖించాలి.

అష్టదళములందూ ధూమావతీ యొక్క ఎనిమిది అక్షరములూ ఒక్కొక్కటి లిఖించాలి. ఆపై ఈ క్రింది ఘుర్మ్రటికా మంత్రము లిఖించి, వేష్టితం చేయాలి. ఆపై మూడు షట్కోణములు లిఖించి, అర్పించి, శ్మశానంలో పాతిపెట్టిన "విద్వేషణ" సిద్ధించును.

**ఘుర్మ్రటికా మనుః - ఘుర్మ్రటికే ఘుర్మ్రటికే, మర్కటికే మర్కటికే, ఘోరే విద్వేష కారిణి, విద్వేషో ద్వేగకారిణి, ఘోరా ఘోరయోః, అముకాముక్యోః** (సాధ్యవ్యక్తుల పేర్లు వ్రాయలి). **విద్వేషయ విద్వేషయ హుంఫట్।**

✠ (16 శ్లోకములలో "మారణ యంత్రములు" రెండు చెప్పబడినవి. అవి వ్రాయుటలేదు - మేడవరపు సంపత్‌కుమార్)

# గారుడ యంత్రం

శ్లో॥ మధ్యే శ్రీనరసింహబీజమథ తద్బాహ్యే స్వరాన్కేసరే
వారీట్ చంద్ర యమేంద్రదిక్షు విలిఖేన్ మధ్యేమనుంగారుడమ్ ।
అంతస్థాన్ మరుదగ్ని నిరృతి శివేష్వాలిఖ్య వర్ణావృతం
యంత్రం సర్గి భిరష్టభిః పరివృతం సంవర్తకైర్గారుడమ్ ॥
సంవర్తకో నేత్రయుతః పార్శ్వస్తారోఽగ్నిసుందరీ
గారుడో మనురాఖ్యాతో విషద్వయ వినాశనః ।
స్మరన్ గరుడమాత్మానం మంత్రమేన జపేన్నరః
విషమాలోనైవ హన్యాత్ నాగకులోద్భవమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – స్థావర – జంగమ, రెండు విధముల విషములను హరించు గారుడ విద్య, యంత్రము చెప్పబడు చున్నవి. అష్టదళకమలము లిఖించి మధ్యలో "రం క్షౌమ్" లిఖించాలి. దళకేసరములందు 16 అచ్చులు లిఖించాలి. (ఒక్కొక్క దళములో రెండేసి కేసరములుండును.)

పశ్చిమ – ఉత్తర – దక్షిణ – తూర్పు దిశల మధ్యలో ఈ క్రింది "గారుడ" మంత్రము లిఖించాలి. పిమ్మట, వాయవ్య – ఆగ్నేయ – నైఋతి – ఈశాన కోణములందు, క్రమముగా 'య – ర – ల – వ" లిఖించాలి.

మరల ఎనిమిది 'క్షః'లు లిఖించి వేష్టితం చేయాలి. న్యాసధ్యానాదులు "సంస్కృత వ్యాఖ్యానము"లో ఇట్లు వివరించబడియున్నవి.

**గారుడ మనుః – క్షిప ఓం స్వాహా।**

**రుద్రఋషిః। పంక్తి ఛందః। గరుడోదేవతా।**

1. జ్వల జ్వల మహామతి - హృదయాయ నమః ।
2. గరుడం చూడాననం - శిరసే స్వాహా ।
3. గరుడశిఖి - శిఖాయై వషట్ ।
4. హుం గరుడాన్ ప్రభంజన ప్రభంజన, ప్రభేద ప్రభేద,
విత్రాసయ విత్రాసయ, విమర్దయ విమర్దయ
- కవచాయ హుం ।
5. ఉగ్రరూపధర సర్వవిషంహర భీషయ భీషయ,
సర్వందహదహ బస్మీకురు భస్మీకురు - నేత్రత్రయాయ వౌషట్
6. అప్రతి హతబల, అప్రతిహత శాసన హుంఫట్ స్వాహా -
- అస్త్రాయఫట్ ।

నేత్రాంత - పాద - కటి - హృద్ - వక్త్ర - మూర్ధ - అంగుష్ఠాది అంగుళులందు కూడా న్యాసంచేసి, గరుడుని ఇలా ధ్యానించాలి.

శ్లో॥ వర్మాంతర్వహ్నియుగ్మాక్షర కమలగతం పంచభూతాద్యవర్ణం
క్లప్తాకల్పం ఫణీంద్రై రభయవరకరం పద్మనేత్రం సువక్త్రం ।
దుష్టాహిచ్ఛేదతుండం స్మరదఖిల విష ప్రోషణం ప్రాణభూతం
ప్రాణి శ్రేణ్యాస్త్రివేదీ తనుమమృత మయం పక్షిరాజం భజేఽహమ్ ॥

5 లక్షలు మంత్రం జపించి పురశ్చరణ చేయాలి. ధ్యానానంతరం "గరుడముద్ర" ప్రదర్శించాలి. గరుడముద్రాలక్షణం -

☞ **హస్తావభిముఖౌ కృత్వా రచయిత్వా కనిష్ఠికే**
**మిథస్తర్జనికే శ్లిష్టే, శ్లిష్టావంగుష్ఠ కౌతథా ।**
**మధ్యమానామికే ద్వేతు ద్వౌ పక్షావితి కుంచయేత్**
**ఏషా గరుడముద్రాస్యాదశేష విష నాశినీ ।**

గరుడమంత్ర జాపకుని దర్శనమాత్రముచేతనే, విషము హరించును. అట్టి విశేష మహిమ గలదీ మంత్రము.

## సంజీవన యంత్రము

శ్లో॥ మధ్యేవార్ణం భృగుస్థం విలిఖతు విధివత్సాధ్య నామ్నాసమేతం
కింజల్కేష స్వరాః స్యుర్వసుదళ వివరేష్వాలిఖే న్మధ్యబీజమ్।
కాద్యర్ణాన్ కేసరేషు ద్విగుణవసుదళేష్వర్పయేత్ మధ్యబీజం
యంత్రం సంజీవనాఖ్యం సవిలపురగతం క్షుద్రరోగాపహారి॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అష్టదళ కమలము లిఖించి మధ్యలో, సాధ్యనామ సహితముగా "స్వం" లిఖించాలి. కేసరములందు 16 అచ్చులు, రెండేసి చొప్పున లిఖించాలి. అష్టదళములందు 'స్వం' లిఖించాలి. అష్టదళములందు 'స్వం' లిఖించాలి. అష్టదళ పద్మము బయట, షోడశదళ కమలము లిఖించి, వాటి కేసరములందు క కారమునుండి సకారము వరకు గల అక్షరములు 32, రెండేసి చొప్పున లిఖించాలి.

షోడశదళములందు తెలుపువర్ణముతో "స్వం" బీజము లిఖించాలి. ఈ యంత్రమును అర్చించి, ధరించిన, సర్వక్షుద్రబాధలూ, ప్రయోగములూ నివారణమగును.

## పిండయంత్రము

శ్లో॥ మధ్యే పిండమచో దళాదిషు లిఖే ద్వారీశ తారాధిప
ప్రేతాధీశ్వర శక్రదిక్షు వియతే ర్మధ్యే చ వర్ణాన్ లిఖేత్ ।
యాదీన్మారుత వహ్నిరాక్షస శివేష్వర్ణాన్ బహిర్వేష్టయేత్
కాద్యైర్వామవిలోచనేన కలితం పిండాఖ్య యంత్రంపరమ్॥
మనుస్వరన్ ధ్వజే శాగ్ని సంయుతశ్చతురాననః
పిండబీజమిదం ప్రోక్తం పుంసాం సర్వార్థ సాధకమ్ ।
బీజేనాఽనేన సంజప్తం యంత్రం రక్షాకరం పరం
ఆయురారోగ్యజననం లక్ష్మీ సౌభాగ్యవశ్యదమ్ ।

చేరసర్పమృగవ్యాళ భూతామయ నికృంతనం
గర్భా రక్షా కరం స్త్రీణాం పుత్రదంక్షుద్ర నాశనమ్ ।
ధృతం మూర్ధ్నిం కరోత్యేతత్ లోకవశ్యమనుత్తమం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – సర్వరక్షాకర పిండయంత్రము వివరింపబడుచున్నది. అష్టదళకమలములిఖించి, మధ్యలో "ఔం ఝః - రః – జః" అను మంత్ర మధ్యంలో, షట్కర్మానుసార బీజాక్షరములు విన్యాసం చేసి, సాధ్యనామ - కర్మ - సాధక నామములు లిఖించాలి.

వశ్యమందు అం – వాంతి కర్మలో వం ఉచ్చాటనయందు – క్షౌం, లిఖించాలి. దళములందు రెండేసి అచ్చులు, మొత్తం 16 లిఖించాలి. పిమ్మట పడమర – ఉత్తర – దక్షిణ – తూర్పు దిశలందు గరుడమంత్రము యొక్క నాలుగు అక్షరములూ లిఖించాలి. మిగిలిన 5వ అక్షరమును, మధ్యలో లిఖించాలి.

పిమ్మట కకారాది సహిత, య - ర - ల - వ వర్ణములను, వాయవ్య – ఆగ్నేయ – నైరుతి – ఈశాన్య కోణములందు లిఖించాలి. పిమ్మట బయట ఈం లిఖించి వేష్టితం చేయాలి. ఇది పూజించి – ధరించిన సకల విధమైన రక్షణ కలుగును. ఆయురారోగ్యముల నిచ్చును. **"ఔం ఝః – రః జః"** అను పిండమంత్ర జపముచే, సమస్త వాంఛలూ నెరవేరును.

ఈ మంత్రజపముచే - చోర, సర్ప, వ్యాఘ్ర, దుష్టజంతు, భూత, రోగ బాధలు తొలగును. స్త్రీలకు గర్భ రక్షణ కలిగించును. సంతానప్రదము. శిరస్సుపై ఈయంత్ర ధారణచే అందరూ అనుకూలముగా నుందురు.

## వశ్యకర యంత్రము

శ్లో॥ ఈకారామధ్యే విలిఖేత్ స్వసాధ్యం
తమష్టపత్రేషు పునర్విలిఖ్య ।

సంవేష్టయేత్ తేన ధరాపురస్థం
యంత్రంభవేత్ వశ్యకరం నరాణామ్ ॥
తామ్రపత్రే సమాలిఖ్య యంత్రమేతత్ ప్రపూజయేత్ ।
వశయేత్ సకలాన్మర్త్యాన్ నాత్ర కార్యా విచారణా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అష్టదళ కమలము లిఖించి మధ్యలో, రెండు ఈకారములమధ్య సాధ్యనామ – కర్మ – సాధక నామములు లిఖించాలి. అష్టదళములందును ఇదేవిధముగా వ్రాసి వేష్టితం చేయాలి. భూపురం నిర్మించి అర్చన చేయాలి.

దీనిని రాగిరేకుపై లిఖించి నిత్యార్చన చేసినచో, సాధ్యవ్యక్తి అనుకూల మగును. ఇందు సందేహము లేదు.

## స్తంభన యంత్రము

శ్లో॥ గ్లౌం రుద్ధం ప్రణవద్వయం ప్రవిలిఖేత్ సాధ్యస్య నామాన్వితం
బాహ్యేభూపురమష్ట వజ్ర విలసత్తారం లిఖిత్వా పునః ।
క్షంకోణేషు దిశాసు లంప్రవిలిఖేత్ పాశాంకుశత్ర్యక్షరీ
వీతంస్తంభనయంత్ర మావృతిలసజ్జంబాది విద్యాష్టకమ్ ॥
జంభే వహ్ని వధూః పూర్వం పశ్చా జ్జంభినిఠద్వయం
మోహే పావకజాయా స్యాత్తతో మోహినిఠద్వయమ్ ।
అంధే హుత భుజోజాయా తతోఽంధిని ఠయుగ్మకం
రుంధే కృశానుపత్నీస్యాత్ రుంధిని ద్విఠసంయుతమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – వృత్తాకార కమలము లిఖించి, మధ్యలో – సాధ్యనామ సహిత గ్లౌం బీజ సంపుటిత, రెండు ప్రణవములు లిఖించాలి. బయట భూపురము నిర్మించి, వాటి వజ్రములందు

ప్రణవం లిఖించాలి. భూపురకోణములందు "క్ష"కారము, నాలుగు దిశలందూ "లం" బీజము లిఖించాలి.

మరల "ఆంక్రోం ఓం జూం సః"తో, పరివేష్టితం చేయాలి. ఆపై వృత్తమునకు నాలుగు ప్రక్కలా ఈ క్రింది జంభాది అష్టవిద్యామంత్రము లిఖించాలి.

1. జంభే స్వాహా 2. జంభిని స్వాహా 3. మోహే స్వాహా 4. ఓహిని స్వాహా 5. అంధే స్వాహా 6. అంధిని స్వాహా 7. రుంధే స్వాహా 8. రుంధిని స్వాహా ।

ఈ యంత్రము నర్చించిన స్తంభనం సిద్ధించును.

## వాక్‌స్తంభన యంత్రము

శ్లో॥ లాంతేనామ విలిఖ్య దిక్షు విలిఖేత్ భూయస్తమేవాఽష్టసు
క్షోణీబింబమథో నరేంద్రభుజగావన్యోన్య బద్ధా లిఖేత్ ।
ఆఖ్యాం తన్ముఖయోర్బి భీతఫలకే యంత్రం సమాపాదితం
నిర్మాల్యే నిహితం సదా వితనుతే వాచాంద్విషాం స్తంభనమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అష్టదల పద్మం లిఖించాలి. మధ్యలో లకారముతో సాధ్యనామం – రెండేసి లకారముల మధ్య సాద్యనామం ఒక్కొక్క అక్షరం లిఖించాలి. ఎనిమిది దిశలందు కేవలం లకారం లిఖించాలి. పిమ్మట భూపురం రచించి, వాసుకి – శంఖపాల – ఆకృతి సహితముగా గైరిక వర్ణముతో పరస్పర సంబద్ధంగా లిఖించాలి.

దీనిని విభీతక బెరడుపై లిఖించాలి. వాసుకి – శంఖపాల సర్పముఖములందు సాధ్యనామం వ్రాయలి. దానిని శివ నిర్మాల్యము నందుంచిన, శత్రుముఖ స్తంభనమగును.

# శిశురోదన రక్షా యంత్రము

శ్లో॥ తారాదిలుద్వయ జలద్వి ఠ వర్ణవీతా
టాంతాంతరే విలిఖితా విధినైవ మాయా ।
సాధ్యావృతా బహిరధో వదనార్ధ చంద్రైః
యంత్రం శిశో<u>రురుదిషాం</u> వినిహంతి సంద్యః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – ఈ యంత్రము చిన్నపిల్లల లోని, ఏడవాలనే కోరికను పోగొడుతుంది. మూడు వృత్తములు లిఖించి, మధ్యలో, సాధ్య శిశునామము లిఖించి, పిమ్మట "ఓంలులు వం స్వాహా" అను మంత్రముతో పుటితముచేసి, హ్రీం బీజము లిఖించాలి. పిమ్మట బయట రెండు వృత్తములను, అర్ధ చంద్రాకార అధోముఖ రెండు వృత్తములతో వేష్టితం చేయాలి.

దీనిని పూజించి, పిల్లవానికి ధరింపచేసిన ఏడ్పుట మానును.



## స్త్రీ వశ్య యంత్రము

శ్లో॥ సస్వస్తికే దహన గేహయుగే ససాధ్యాం
మాయాం లిఖేత్ లలితనాగ లతాదళాంతః ।
పాశాంకుశావృతమిదం నిశితాపయేత్‌యో
మంత్రం జపన్ వ్రజతితం స్వయమేవ సాధ్యా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – చక్కని తమలపాకు గ్రహించి, దానిపై షట్ కోణములిఖించి, మధ్యలో స్వస్తిక గుర్తు ఇలా 卐 లిఖించి, దానిని ఆం – క్రోం బీజములతో వేష్టితం చేయాలి. దీనిని దీపశిఖపై, వేడిచేయాలి. వేడి చేయు సమయమునందు ఆం క్రోం హ్రీం జపించాలి. అభిలషిత స్త్రీ స్వయముగా ఆకర్షితురాలగును.

## మన్మద యంత్రము

శ్లో॥ కామం లిఖేత్సాధ్యయుతం సరోజే
స్వరోల్లాస సత్‌కేసర వర్గపత్రే ।
ఉదీరితం మన్మథ యంత్రమేతత్
సౌభాగ్యలక్ష్మీ విజయప్రదాయి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – అష్టదళ కమలము లిఖించి, మధ్యలో "క్లీం" లిఖించాలి. పిమ్మట కేసరములందు రెండేసి అచ్చులు లిఖించాలి. ఇదే మన్మథ యంత్రము. ఇది సౌభాగ్యప్రదము. విజయము నిచ్చును.

## యంత్రలేఖన ద్రవ్యములు

శ్లో॥ కాశ్మీరరోచనాలాక్షా మృగేభ మదచందనైః
విలిఖేత్ హేమలేఖన్యా యంత్రాణ్యేతాని దేశికః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – యంత్రములు లిఖించుటకు, కుంకుమపువ్వు – గోరోచనం – యావకం – కస్తూరి – గజ మదజలము – రక్తచందన గంధములను ఉపయోగించవలయును. శుభకర్మలందు బంగారు శలాకతో లిఖించవలయును.

వెండి – రాగి – భూర్జపత్రములపై, యంత్రములు లిఖించాలి. అశుభకర్మలందు రక్తమును, లేఖినిగా 'కాకి ఈక' ఉపయోగించాలి.

నేలపైబడిన యంత్రములు, శవముతాకినవి, కాలినవి, ఛిద్రమైనవి, నిర్మాల్య మిశ్రితములు, కాలిచే దాటబడినవి – ధరించరాదు.

☞ **భూమిస్పృష్టం శవస్పృష్టం దగ్ధం నిర్మాల్య సంగతం ।**
**విశీర్ణం లంఘితం మంత్రీ యంత్రంజాతు నధారయేత్ ॥**

**"హిరణ్యగర్భ సంహిత"** యందు, యంత్రములు ఎవరికి ఇవ్వకూడదో, ఇలా వివరించబడినది.

శ్లో॥ త్వయాపుత్ర నదాతవ్యం యంత్రమేతన్మహోదయం
నాఽశిష్యాయ న పాపాయ నాఽశాంతాయఽ (ప్రియాయచ)
శిష్యాయ మంత్రనిష్ఠాయ శుభభక్తి యుతాయచ
వసుప్రదాయ దాతవ్యమన్యథా నరకం వ్రజేత్ ॥

ఇపుడు దేవీస్తుతి వివరింపబడుచున్నది.

## దేవీస్తుతి

శ్లో॥ ఆద్యామశేష జననీ మరవింద యోనేః
విష్ణోః శివస్యచ వపుః ప్రతిపాదయంతీం ।
సృష్టిస్థితిక్షయకరీం జగతాంత్రయాణాం
స్తుత్వాగిరం విమలయామ్యహమంబికే త్వామ్ ॥

పృధ్వ్యా జలేన శిఖినా మరుతాంబరేణ
హోత్రేందునా దినకరేణ చ మూర్తి భాజః ।
దేవస్య మన్మథరిపోరపి శక్తిమత్తా
హేతుస్త్వ మేవఖలు పర్వతరాజప్రత్రి ॥
త్రిస్రోత సః సకలలోక సమర్చితాయా
వైశిష్ట్య కారణమవైమి తదేవ మాతః
త్వత్పాదపంకజ పరాగ విచిత్రి తాసు
శంభోర్జటాసు సతతం పరివర్తనంయత్ ॥
ఆనందయేత్ కుముదినీ మథిపః కళానాం
నాఽభ్యర్చయంతి జగతాం జనయిత్రి ఏత్వాం
నిఃశ్రేణికా గ్రమథిరుహ్య పునః పతంతి ॥
కర్పూరచూర్ణ హిమ వారి విలోవితేన
యే చందనేన కుసుమైశ్చ సుజాతగంధైః ।
ఆరాధయంతిహి భవాని సముత్సుకాస్త్వం
తేఖల్వశేష భువనాధిభువః ప్రథంతే ॥
ఆవిశ్వమధ్యపదవీం ప్రథమే సరోజే
సుప్తాహిరాజసదృశీ విరచయ్య విశ్వమ్ ।
విద్యుల్లతావలయ విభ్రమ ముద్యహంతీ
పద్మానిపంచ విదలయ ఖమశ్నువానా ॥
తన్నిర్గతామృత రసై రభిషిక్త గాత్రీ
మార్గేణ తేన నిలయం పునరప్యవాప్తా ।
యేషాం హృది స్ఫురసి జాతు నతే భవేయుః
మాతర్మహేశ్వర కుటుంబిని గర్భభాజః ॥

శ్లో॥ ఆలంబికుంతల భరామభిరామ వక్త్రా
మాపీవరస్తనతటీం తను వృత్తమధ్యామ్ ।
చింతాక్ష సూత్ర కలశాలిఖితాఢ్య హస్తా
మావర్తయామి మనసా తవ గౌరి మూర్తిమ్ ॥
ఆస్థాయ యోగమావిజిత్య చ వైరి షట్క
మాబధ్య చేంద్రియగణం మనసి ప్రసన్నే ।
పాశాంకుశాభయ వరాఢ్యకరాం సురక్తా
మాలోకయంతి భువనేశ్వరి యోగినస్త్వామ్ ॥
ఉత్తప్తహాటకనిభా కరిభి శ్చతుర్భి
రావర్తితామృత ఘటైరభిషి చ్యమానా ।
హస్తద్వయేన రుచిరే నలినే వహంతీ
పద్మాఽపి సాభయవరా భవసి త్వమేవ ॥
అష్టాభిరుగ్ర వివిధాయుధ వాహినీ భి
ర్దోర్వల్లరీ భిరధిరుహ్య మృగాధి రాజమ్ ।
దూర్వాదళద్యుతి రమర్త్య విపక్ష పక్షాన్
న్యక్కుర్వతీ త్వమసిదేవి భవాని దుర్గా ॥
ఆవిర్నిదాఘజల శీకర శోభి వక్త్రాం
శోభాభుజౌ నిజరిపో ర్మకరధ్వజేన ।
కంఠగ్రహాయ రచితౌ కిల దీర్ఘపాశౌ
మాతర్మమ స్మృతిపథం న విలంఘయేథాః ॥
హంసైర్గతిక్వణిత నూపుర దూర కృష్టైః
మూర్తైరివాధ్య వచనై రనుగమ్యమానౌ ।

పద్మావివోర్ధ్వముఖ రూఢ సుజాత నాలౌ
శ్రీకంఠ పత్ని శిరసైవ దధే తవాంఘ్రీ ॥
ద్వాభ్యాం సమీక్షితు మతృప్తి మతేవ దృగ్భ్యా
ముత్పాద్య భాలనయనం వృషకేతనేన ।
సాంద్రానురాగతరళేన నిరీక్షమాణే
జంఘే ఉభే అపి భవాని తవానతోఽస్మి ॥
ఊరూస్మరామి జితహస్తి కరావలేపౌ
శ్రోణీభరస్య సహనౌ పరికల్ప్య దత్తౌ
స్తంభావివాంబ వయసా తవ మధ్యమేన ॥
శ్రోణ్యౌ స్తనౌ చ యుగపత్ ప్రథయిష్యతోచ్చై
ర్బాల్యాత్పరేణ వయసా పరికృష్టసారః ।
రోమావళీ విలసేతేన విభావ్యమూర్తి
ర్మధ్యస్తవ స్ఫురతు మే హృదయస్య మధ్యే ॥
సఖ్యుః స్మరస్య హరనేత్ర హుతాశభీరోః
లావర్ణ్యవారి భరితం నవయౌవనేన ।
ఆపాద్య దత్తమివ పల్వలమప్రధృష్యం
నాభిం కదాపి తవదేవి న విస్మరేయమ్ ॥
ఈశోపగూహ పిశునం భసితం దధానే
కాశ్మీర కర్దమమను స్తనపంకజేతే ।
స్నానోత్థితస్య కరిణః క్షణలబ్ధఫేనౌ
సిందూరితౌ స్మరయతః సమదస్య కుంభౌ ॥
కంఠాతిరిక్త గళదుజ్వల కాంతి ధారా
శోభే భుజౌ నిజరిపోర్మకరధ్వజేన ।

శ్లో॥ కంఠగ్రహాయ రచితౌ కిల దీర్ఘ పాశౌ
మాతర్మమ స్మృతిపథం న విలంఘయేథాః ॥
నాత్యాయతం రుచిరకంబు విలాస చౌర్యం
భూషాభరేణ వివిధేన విరాజమానాం ।
కంఠం మనోహరగుణం గిరిరాజకన్యే
సంచింత్య తృప్తిముపయామి కదాపి నాఽహమ్ ॥
అత్యాయతాక్షమభిజాత లలాట పట్టం
మందస్మితేన దరఫుల్లకపోలరేఖం ।
బింబాధరం వదనమున్నత దీర్ఘనాసం
యస్తే స్మరత్యసకృదేవ స ఏవజాతః ॥
ఆవిస్తుషార కరలేఖ మనల్పగంధం
పుష్పోపరి భ్రమదళిప్రజ నిర్విశేషమ్ ।
యశ్చేతసా కలయతే తవ కేశపాశం
తస్యస్వయం గలతిదేవి పురాణ పాశః ॥

## ఫలశృతి

శృతిసుచరిత పాకం ధీమతాం స్తోత్రమేతత్
పఠతి య ఇహ మర్త్యోః నిత్యమార్ద్రాంతరాత్మా ।
సభవతి పదముచ్చైః సంపదాం పాదనమ్ర
క్షితిపముకుట లక్ష్మి లక్షణానాం చిరాయ ।

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*చతుర్వింశః పటలః సమాప్తః*

❖❖❖

# అథ పంచవింశః పటలః

## అథయోగ ప్రకరణమ్

శ్లో॥ అథయోగం ప్రవక్ష్యామి సాంగం సంవిత్ ప్రదాయకం
ఐక్యం జీవాత్మనోరాహుర్యోగం యోగవిశారదాః ।
శివాత్మనో రభేదేన ప్రతిపత్తిః పరే విదుః
శివశక్త్యాత్మకం జ్ఞానం జగురాగమ వేదినః ।
పురాణ పురుషస్యాన్యే జ్ఞానమాహుర్వి శారదాః
జిత్వాదౌ ఆత్మనః శత్రూన్ కామాదీన్ యోగమభ్యసేత్ ।
యోగాష్టాంగైరిమాన్ జిత్వా యోగినోయోగమాప్నుయుః
యమనియమావాసన ప్రాణాయామౌ తతః పరమ్ ।
ప్రత్యాహారం ధారణాఖ్యం ధ్యానం సార్థం సమాథినా
అష్టాంగాన్యాహురేతాని యోగినోయోగసాధనే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** - జీవాత్మ - పరమాత్మల కలయికయే యోగమనబడును. కొందరు శివునికీ, జీవునకు గల అభేద జ్ఞానమే యోగమందురు. ఆగమవేత్తలు శివశక్త్యాత్మక జ్ఞానమే, యోగ మందురు. సాంఖ్యులు పురుషుడని, ప్రకృతియని చెప్పుదురు.

నైయాయికులు ఈశ్వరుడని, వైష్ణవులు నారాయణుడని చెప్పుదురు. యోగాభ్యాసము చేయుదురు ముందుగా కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్స్యర్యములనే ఆరు శత్రువులను జయించాలి.

### యోగము 8 విధములు

**1.** యయము **2.** నియమము **3.** ఆసనము **4.** ప్రాణాయామము **5.** ప్రత్యాహారము **6.** ధారణ **7.** ధ్యానము **8.** సమాధి. వీటిని ఆచరించిన సాధకుడు యోగ సిద్ధుడగును.

యోగవిషయమై శివ-శక్తులగూర్చి "శివసూత్రవృత్తి" యందిట్లున్నది.

☞ **ధీః సాత్త్వికీ విమర్థేన జాయతే నియతాత్మనః ।**
**చంక్రమంతీ శివంప్రాప్య లీయతే చేంద్రియైస్సహా ॥**

**"త్రికభేదము"** నందిట్లున్నది.

☞ **సత్త్వ స్థశ్చ తమః స్థో గుణభేదకః ।**
**ఏవం పర్యటతేదేహీ స్థానాత్ స్థానాంతరం వ్రజన్ ॥**
**తన్మంత్రోదయరూపేణ మనోఽ హం బుద్ధివర్త్మనా**
**పుర్యష్టకేన సంరుద్ధో దుఃఖంతత ప్రత్యయోద్భవమ్ ।**
**భుంక్తే పరవశో భోగం తత్రస్థంసంహరేచ్ఛివః ॥**

**"స్వచ్ఛంద భైరవము"** నందిట్లు చెప్పబడినది.

☞ **అణుమాత్రం శివానందస్ఫురణం సర్వదోషహృత్**
**మలత్రయ వినాశాచ్చ మాయాగచ్ఛేత్ సమూలతః ॥**

**"ఆనందభైరవము"** నందిట్లు చెప్పబడినది.

☞ **ప్రాణాదిభావనం త్యక్త్వా తథా తద్ దృశ్య సంపదః**
**స్వాత్మభావేన చిత్తేన విశేత్ శివపదం శనైః ॥**

## 1. యమములు పది

అహింస - సత్యం - దొంగతనము చేయకుండుట - బ్రహ్మచర్యం కృప - ఎవరియందూ ద్వేషము లేకుండుట (ఆర్జవం) - క్షమ - ధైర్యం - పరిమిత ఆహారసేవనం - శౌచము.

## 2. నియమములు - పది

తపస్సు - సంతోషము - ఆస్తిక్య బుద్ధి - దానము - దేవపూజ - సిద్ధాంత శ్రవణము - లజ్జ - మతి - జపము - హోమము

## 3. ఆసనములు - అయిదు

పద్మాసనం – స్వస్తికాసనం – వజ్రాసనం – భద్రాసనం – వీరాసనం

## 4. ప్రాణాయామము

ముక్కు రంధ్రములో సంచరించు వాయువు ఇడ, ఎడమ ముక్కులో సంచరించునది పింగళ, సాధకుడు ఇడానాడిచే 16 మాత్రల కాలము లోపలికి ఉచ్ఛ్వాసం చేసిన అది పూరక ప్రాణాయామం అనబడును. 64 మాత్రల కాలం అచటనే నిలిపిన అది – కుంభకప్రాణా యామం అనబడును.

పిమ్మట దానిని 32 మాత్రలకాలమునందు నిశ్వాసం చేసిన రేచక ప్రాణాయామం అనబడును. (తన చేతిలోని, మోకాలి చుట్టూ ఒకసారి త్రిప్పిన కాలమును "మాత్ర" కాలముగా పరిగణించవలయును. లేదా ఒక శ్వాస తీయునంత కాలముగా కూడ తెలుసుకోవచ్చును.)

ఈ ప్రాణాయామ విధానము గురుముఖముగా అభ్యసించవలయును. గ్రంథములు చూచి అభ్యసించరాదు. దుష్పరిణామములు సంభవించును.

## 5. ప్రత్యాహారము

ఇంద్రియములు అనేక విషయములపై పరుగులు తీయును. మనసును, వాటిపై లగ్నము చేయకుండుట – ప్రత్యాహారము అనబడును.

## 6. ధారణ

అంగుష్ఠ – గుల్ఫ – జాను – ఊరు – గుదం మరియు లింగముల మధ్య ప్రదేశమునందు గల ఊర్ధ్వరేఖ సీవని అనబడును – లింగ – నాభి – హృదయ – గ్రీవం – కంఠ – లంబిక – నాసిక – భ్రూమధ్యం – మస్తకం – బ్రహ్మరంధ్ర స్థానములందు ప్రాణవాయువును నిలుపుట, ధారణ అనబడును.

## 7. ధ్యానం

మనలోనున్న చైతన్యయుక్త చిత్తమును, మనసుతో కలిపి, ఆత్మయందు అభీష్ట దేవతను భావించుట, ధ్యానమనబడును.

## 8. సమాధి

జీవాత్మ – పరమాత్మల సమత్వభావన పొంది యుండుట సమాధి అనబడును.

శ్లో॥ షణ్ణవత్యం గులాయామం శరీరముభయాత్మకం
గుదధ్వజాంతరే కందముత్సేధాత్ ద్వయంగుళంవిదుః ।

.......................................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** – మానవదేహము 96 అంగుళ ప్రమాణముగా శాస్త్రము నిర్ణయించబడినది. గుద – లింగ మధ్య స్థానములో శరీరములోపల "కంద" అను మాంసపిండమున్నది. ఇది రెండంగుళముల ఎత్తు ఉండును. ఇచట నుండి అనేక నాడులు శరీరమంతా వ్యాపించి యుండును. వీటిలో ముఖ్యమైనవి మూడు కలవు. కందయొక్క ఎడమ భాగము నుండి ఇ కుడిభాగము నుండి పింగళ – వీటి మధ్యనుండి సుషుమ్ణ అనే నాడులుండును.

ఇవి వెన్ను పూస ద్వారా శిరస్సువరకు వ్యాపించియుండును. సుషుమ్ణా నాడి మూలాధారము (కంద) నుండి రెండుకాళ్లయొక్క బొటనవ్రేలి వరకు వ్యాపించి యుండును. మరల అదే నాడి శిరస్సులో నున్న బ్రహ్మ రంధ్రము వరకు వ్యాపించి యుండును. ఇది సోమసూర్య అగ్నిస్వరూపాత్మక మైనది.

వీటి మధ్యలో "చిత్ర" అను మరొక నాడి కలదు. ఇది యోగులకు అత్యంత ప్రియమైనది. తామర దారమువలె అత్యంత సూక్ష్మముగా నుండును.

ఆధారకందమునందు ఒక త్రికోణమున్నది. దీని మధ్యలో విద్యుల్లతాకారములో, పరదేవతా స్వరూపమైన, "కుండలినీశక్తి" కలదు. ఇది నిద్రించుచున్న సర్పమువలె యుండును. ఇది జీవ అధిష్ఠాన స్థానము.

జీవమునకు ఆశ్రయము ప్రాణవాయువు. దీన్ని నియమించుటకు, దీనిపై పట్టు సాధించుటకు ప్రాణాయామమొక్కటే సాదనము. ఇందు సిద్ధి పొందిన వివిధరకములైన అతీంద్రియ శక్తులు కలుగును.

సాధనసమయములో, సాధకునకు దవవిధనాదములు వినబడును. అవి – చిణి – చిణిచిణి – ఘంటానాదం – శంఖనాదం – తంత్రీనాదం – తాలనాదం – వేణునాదం – భేరనాదం – మృదంగనాదం – మేఘనాదం

"**ప్రయోగసారం**" అనే గ్రంథమునందు, యోగులకు సిద్ధి సూచకమగు 10 అవస్థలు ఇట్లు చెప్పబడినవి.

☞ **కంపరోమోద్గమానందం వైమల్యస్థైర్యలాఘువం**
**ప్రకాశ జ్ఞానవైదుష్యం భావోఽద్వైతాత్మ సంచయః।**
**సంభవంతి దశాఽవస్థా యోగినః సిద్ధి సూచకాః।**

## కుండలినీ ధ్యానం

శ్లో॥ మూలోన్నిద్రభుజంగరాజ మహిషీం యాంతీం సుషుమ్ణాంతరం
భిత్వాఽఽధార సమూహమాశు విలసత్సౌదామినీ సన్నిభామ్ ।
వ్యోమాంభోజగతేందు మండలగలద్దివ్యా మృతౌఘప్లుతం
సంభావ్య స్వగృహం గతాంపునరిమాం సంచింతయేత్ కుండలీమ్॥
హంసం నిత్యమనంతమవ్యయగుణం స్వాధారతో నిర్గతా
శక్తిః కుండలినీ సమస్త జననీ హస్తే గృహీత్వాచతామ్ ।
యాతాశంభునికేతనం పరసుఖం తే నాఽనుభూయస్వయం
యాంతీ స్వాశ్రయమర్కకోటి రుచిరా ధ్యేయాజగన్మోహినీ ॥

శ్లో॥ అవ్యక్తం పరబిందు మంచిత రుచిం నీత్వా శివస్యాలయం
శక్తిః కుండలినీ గుణత్రయ వపుర్విద్యుల్లతాసన్నిభా ।
ఆనందామృత మధ్యగం పురమిదం చంద్రార్క్యకోటి
సంవీక్ష్యస్యపురంగతా భగవతీ ధ్యేయా నవేద్యాగుణైః ॥
మధ్యే వర్త్మ సమీరణద్వయమిథః సంఘట్టసంక్షోభజం
శబ్దస్తోమ మతీత్యతేజసి తడిత్కోటి ప్రభాభాసురే ।
ఉద్యంతీం సముపాస్మహే నవజపా సింధూర సంధ్యారుణాం
సాంద్రానంద సుధామయీం పరశివం ప్రాప్తం పరాందేవతామ్॥
గమనాగమనేషు లాంగికీ సా
తనుయాద్యోగ ఫలాని కుండలీ ।
ముదితా కులకామధేనురేషా
భజతాం కాంక్షిత కల్పవల్లరీ ॥
ఆధారస్థిత శక్తిబిందు నిలయాం నీవార శూకోపమాం
నిత్యానందమయీం గలత్పర సుధావర్షైః ప్రబోధప్రదైః ।
సిక్త్వాషట్ సరసీరుహాణి విథివత్ కోదండమధ్యోదితాం
ధ్యాయేత్ భాస్వర బంధు జీవరుచిరాం సంవిన్మయీం దేవతామ్ ॥
హృత్పంకేరుహభాను బింబనిలయాం విద్యుల్లతామత్సరాం
బాలార్క్యారుణ తేజసా భగవతీం నిర్భత్సయంతీంతమః ।
నాదాఖ్యంపదమర్ధ చంద్రకుటిలం సంవిన్మయం శాశ్వతం
యాంతీమక్షర రూపిణీం విమల ధీర్ ధ్యాయేత్ విభుంతేజసామ్
భాలే పూర్ణనిశాపతి ప్రతిజటాం నీహారహారత్విషా
సించంతీమమృతేన దేవమమితే నానందయంతీం తనుమ్
వర్ణానాంజననీం తదీయవపుషా సంప్రాప్య విశ్వం స్థితాం

శ్లో॥ ధ్యాయేత్ సమ్యగనా కులేన మనసా సంవిన్మయీ మంబికామ్॥
మూలేభాలే హృదిచవిలసత్ వర్ణరూపాసవిత్రీ
పీనోత్తుంగస్తనభర లసన్మధ్యదేశా మహేశీ ।
చక్రే చక్రే గలితసుధయా సిక్తగాత్రా ప్రకామం
దద్యాదాద్యా శ్రియమవికలాం వాంగ్మయీదేవతావః ॥

## కుండలినీ స్తుతి

శ్లో॥ నిజభవన నివాసా దుచ్చరంతీ విలాసైః
పథిపథి కమలానాం చారుహాసం విధాయ ।
తరుణ తరణకాంతిః కుండలీ దేవతాసా
శివసదనసుధాభిర్దీపయే దాత్మతేజః ॥
ఆధారబంధ ప్రముఖ క్రియాభిః
సముత్థితా కుండలినీ సుధాభిః ।
త్రిధామ బీజం శివమర్చయంతీ
శివాంగనా వః శివమాతనోతు ॥
సింధూరపూజ నిభమిందు కళావతంస
మానంద పూర్ణ నయనత్రయ శోభివక్త్రమ్ ।
ఆపీనతుంగ కుచనమ్ర మనంగతంత్రం
శంభోః కళత్రమమితాం శ్రియమాతనోతు ॥
నయనకమలై ర్దీర్ఘై రలంకృత దింగ్ముఖం
వినతమరుతాం కోటీరాగ్రైనిర్ఘృష్టపదాంబుజమ్ ।
తరుణ చాంద్రం బిభ్రద్ ఘటస్తనమండలం
స్ఫురతు హృదయే బంధూకాభం కళత్రముమాపతేః ॥

శ్లో॥ వర్ణైరర్ణవషడ్ దిశారవికలా చక్షుర్విభక్తైః క్రమా
దాద్యైః సాదిభిరావృతాన్ క్షహయుతైః షట్చక్రమధ్యానిమాన్
డాకిన్యాదిభిరాశ్రితాన పరిచితాన్ బ్రహ్మాదిభిర్దేవతై
ర్భిందానా పరదేవతా త్రిజగతాం చిత్తే విధత్తాంముదామ్ ॥
ఆధారాత్ గుణవృత్త శోభితతనుం లింగత్రయం సత్వరం
భిందంతీం కమలాని చిన్మయఘనానంద ప్రచోధోత్తరామ్।
సంక్షుబ్ధ ధృవమండలామృత కరప్రస్యంద మానామృత
స్రోతః కందలితా మమంద తడితాకారాంశివాం భావయేత్॥
ఆనందమౌళిమనిశం శృతిమౌళిమృగ్య -
మర్ధేందు భూషణ మధిష్ఠిత సర్వలోకమ్ ।
భక్తార్తి భంజనపరం పదమీశ్వరస్య
దద్యాచ్ఛుభాని నియతం వపురంబికాయాః ॥
మంజుసింజితమంజీరం వామమర్ధం మహేశితుః ।
ఆశ్రయామి గజన్మూలం యన్మూలం వచసామపి ॥
స్థూలేంద్ర నీలరుచిరం కుచ భారనమ్రం
భాస్వత్ సుభూషణగణైః ప్రవిభక్త శోభమ్ ।
విశ్వైకమూల మనిశం శృతిమౌళి మృగ్య -
మర్ధం మహేశితు రఖండిత మాశ్రయామః ॥
దిక్కాలాది వివర్జితే పరశివే చైతన్యమాత్రాత్మకే
శూన్యే కారణ పంచకస్య విలయం నీతే నిరాలంబనే ।
ఆత్మానం వినివేశ్య నిశ్చలధియా నిర్లీన సర్వేంద్రియో
యోగీయోగఫలం ప్రయాతి సులభం నిత్యోదితం నిష్క్రియమ్॥

❖❖❖

# గ్రంధకృత్ పరిచయం

శ్లో॥ మహాబలాయ ప్రణతోఽస్మి తస్మై
సంవిల్లతాలింగన శీతలాయ ।
యేనాఽర్పితం ముక్తిఫలం విపక్వ
మామ్నాయ శాఖాభి రుపాశ్రితేభ్యః ॥
తస్మాదభూదఖిల దేశిక వారణేంద్రః
షట్కర్మసాగర విహారవినోదశీలః ।
యస్యత్రిలోక వితతం విజయాభిధాన
మాచార్య పండిత ఇతి ప్రథయంతి సంతః ॥
తన్నందనో దేశిక దేశికోఽభూ
చ్ఛ్రీకృష్ణ ఇత్యభ్యుదిత ప్రభావః ।
యత్పాదకారుణ్య సుధాభిషేకా
ల్లక్ష్మీంపరామ శ్నువతే కృతార్థాః ॥
ఆచార్య విద్యావిభవస్యతస్య
జాతః ప్రభోర్లక్ష్మణ దేశికేంద్రః ।
విద్యాస్వశేషాసు కళాసు సర్వా
స్వపి ప్రథాం యోమహతీం ప్రపేదే ॥

# గ్రంధ పరిచయం

శ్లో॥ ఆదాయ సారమఖిలం నిఖిలాగ మేభ్యః
శ్రీశారదా తిలకనామ చకార తంత్రమ్ ।

శ్లో॥ ప్రాజ్ఞః స ఏష పటలైరిహ తత్త్వ సంఖ్యైః
ప్రీతి ప్రధానవిధయే విదుషాంచిరాయ ॥
అనాద్యంతాత్ శంభోర్వపుషి కలితార్ధేన వపుషా
జగద్రూపం శశ్వత్ సృజతి మహనీయామపి గిరమ్ ।
సదర్థా శబ్దార్థ స్తనభరనతా శంకరవధూ
ర్భవేత్ భూత్యై భూయాద్భవ జనిత దుఃఖౌఘశమనీమ్ ॥
సుఖదాదాతృసుభగా శంకరార్ధ శరీరిణీ ।
గ్రంధపుష్పోపహారేణ ప్రీతానః పార్వతీ సదా ॥

*ఇతి శ్రీలక్ష్మణ దేశికేంద్ర విరచితే శారదా తిలక తంత్రే*
*పంచవింశః పటలః సమాప్తః*

❖❖❖

ఉచితం జ్ఞానదక్షిణ ఉచితం

## "కాశ్మీర్ సిరీస్ ఆఫ్ టెక్స్ట్స్ అండ్ స్టడీస్"

(KSTS) 1911 నుండి 1963 వరకు కాశ్మీర్ మహారాజు ఆధ్వర్యంలో అనేక అద్భుత గ్రంధాలు సంస్కృత భాషలో ప్రచురించారు. అవన్నీ పి.డి.యఫ్ లో సంపత్‌కుమార్ సేకరించియున్నారు. ఆ సిరీస్ నెంబర్లు ఇలా క్రమ సంఖ్యలో ముద్రించబడ్డాయి. జిజ్ఞాసువుల అధ్యయనము కొరకు ఇవి ఉచితముగా ఇవ్వబడును. కావలసినవారు ఈ క్రింద అడ్రసులో సంప్రదించండి.

మేడవరపు సంపత్‌కుమార్, Sampath 2016 @ yahoo.com

1. శివసూత్ర విమర్శిని - 1911
2. స్పందకారిక (కల్లట) - 1914
3. ప్రత్యభిజ్ఞా హృదయం
4. శివసూత్ర వార్తికం
5. భాస్కరుని వృత్తి - 1916
6. స్పందకారిక వివృతి రామకంఠ - 1913
7. పరమార్థసార - 1916
8. విజ్ఞానభైరవం కౌముదీవ్యాఖ్య - 1918
9. విజ్ఞానభైరవం కౌముదీవ్యాఖ్య - 1916
10. స్తవచింతామణి - 1918
12. కామకళా విలాసం - 1918
13. షట్ త్రింశత్ తత్త్వ సందోహము - 1918
14. భావోపహారం అనుత్తరప్రకాశిక - 1918
15. పరాప్రవేశిక - 1918
16. స్పందసందోహం - 1917
17. తంత్రసారం - 1818

18. పరాత్రింశిక - 1918
19. జన్మమరణ విచారం - 1918
20. అమరౌఘ శాసనం - 1918
21. మహానయప్రకాశ - 1918
22. ఈశ్వరప్రత్యభిజ్ఞా విమర్శిని I - 1918
23. తంత్రాలోకం I - 1918
24. తంత్రవటధానిక - 1918
25. ఈ నెంబరు ముద్రించబడలేదు
26. లల్లేశ్వరీ వాక్యాని
27. ముద్రించలేదు
28. తంత్రాలోకం - 2 - 1921
29. తంత్రాలోకం - 6 - 1921
30. తంత్రాలోకం - 3 - 1921
31. స్వచ్ఛంద తంత్రం - I - 1921
32. మాలినీ విజయోత్తర వార్తికం - 1921
33. ఈశ్వర ప్రత్యభిజ్ఞా విమర్శిని - 2 - 1921
34. సిద్ధిత్రయి - 1921
35. తంత్రాలోకం - 4 - 1922
37. మాలినీ విజయ తంత్రం - 1922
38. స్వచ్ఛంద తంత్రం - 2 - 1922
39. వాతూల నాథ సూత్రాణి - 1923
40. దేశోపదేశం - నర్మమాల By క్షేమేంద్రుడు
41. తంత్రాలోకం - 7 - 1924
42. స్పందనిర్ణయం - 1925 By క్షేమరాజు
43. శివసూత్రవార్తికం - 1925 By వరదరాజు

44. స్వచ్ఛంద తంత్రం - 3 - 1926
45. నరేశ్వర పరీక్ష - 1926
46. నేత్రతంత్రం - 1 - 1926
47. తంత్రాలోకం - 8 - 1926
48. స్వచ్ఛంద తంత్రం - 4 - 1927
49. లౌగాక్షి గృహ్యాసూత్రం - 1928
50. శ్రీమృగేంద్ర తంత్రం - 1930
51. స్వచ్ఛందతంత్రం - 5 - 1930
52. తంత్రాలోకం - 10 - 1933
53. స్వచ్ఛంద తంత్రం - 5 (బి) - 1933
54. శివదృష్టి - 1934
55. లౌగాక్షి గృహ్యాసూత్ర భాష్యం - 1934 దేవపాల విరచితం
56. స్వచ్ఛంద తంత్రం - 6 - 1935
57. తంత్రాలోకం - 11 - 1936
58. తంత్రాలోకం - 12 - 1938
59. తంత్రాలోకం - 9 - 1938
60. ఈశ్వర ప్రత్యభిజ్ఞా వివృతి విమర్శిని - 1 - 1938
61. నేత్ర తంత్రం - 2 - 1939
62. ఈశ్వర ప్రత్యభిజ్ఞా వివృతి విమర్శిని - 2 - 1941
63. దేవీనామ విలాసం
64. భగవద్గీత ! రామకంఠ వ్యాఖ్య
65. ఈశ్వర ప్రత్యభిజ్ఞా వివృతి విమర్శిని - 3 - 1943
66. వామకేశ్వర తంత్రం - 1945
67. ఘటకర్పరం - అభినవగుప్త వ్యాఖ్య
68. పరాత్రింశికాలఘువృత్తి - 1947

69. పరాత్రింశికా వివృతి - 1947

70. ఉడ్డామరేశ్వర తంత్రం - 1947

71. ప్రచురించలేదు

72. ప్రాసాదమండనం - 1947

73. కర్మకాండక్రమావళి - 1947

74. పరాత్రింశికాతాత్పర్యం - 1947

75. లోకప్రకాశ - 1947

76. బోధపంచ దశిక

77. పరమార్థ చర్చ - 1947

78. దీవానే డైరీ

79. వల్లభదేవుని శిశుపాల వధ వ్యాఖ్యా, విమర్శ

80,81. ప్రచురించలేదు.

82. తారీఖే - హసన్ - 1 (×)

83. ప్రచురించలేదు

84. కలామిసాదికీ (×)

85. ప్రచురించలేదు.

86. తారీఖే హసన్ 2 (×)

87. పంచస్తవిమాల - 3 సకలజననీస్తవం

88. ది ఆఫ్ కాశ్మీర్ (×)

89. హరిహరస్తోత్రం - వాసుదేవ

90. పంచస్తవిమాల 1 - 2 లఘుస్తవం, చర్చాస్తవం 1963

❖❖❖

శివార్పణమస్తు